# తెలుగు పొడుపుకథలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి
పిహెచ్. డి. పట్టం పొందిన సిద్ధాంత గ్రంథం

డా॥ కసిరెడ్డి




ప్రచురణ
జాతీయ సాహిత్య పరిషత్
భాగ్యనగర్‌శాఖ - ఆంధ్రప్రదేశ్.

**TELUGU PODUPU KATHALU**
(Riddles in Telugu)
DOCTORAL THESIS BY **Dr. KASI REDDY,**
Dept of Telugu, Osmania University, Hyderabad-7.



ప్రథమ ముద్రణ : ఆగష్టు 1990
ముఖపత్రాలంకరణ : మదన్ & రేవంత్

ప్రచురణ :

జాతీయ సాహిత్య పరిషత్
భాగ్యనగర్ శాఖ,
3-4-705/4, నారాయణగూడ,
హైదరాబాదు - 500029.

**ప్రచురణ సంఖ్య : 7**

ప్రతులకు :

* కసిరెడ్డి శ్రీనాథ్
  17-1-481/5, కృష్ణనగర్,
  హైదరాబాదు-500659.

* సాహిత్యనికేతన్
  3-4-852, బర్కత్‌పుర,
  హైదరాబాదు-500027.

**మూల్యం : 150/-**

తెలుగు విశ్వవిద్యాలయంవారు ఈ గ్రంథ ప్రచురణకు రూ॥ 7,500/-
(ఏడు వేల అయిదు వందలు) ఆర్థిక సహాయం అందజేశారు.

# అంకితం

## శ్రీ పి. సుదర్శన్ గారికి

ఒకనాడు దివిసీమ నావార్ధి ముంచెత్త
ఒకఏడు శ్రమియించి దీవి హంసల దీవి
నిర్మాణ ధర్మ కార్యమ్ములో లీనమై
నిఖిలమ్ము కీర్తించ, హిందువుల పరిషత్తు
సద్భావనమ్ములను సాకారమొనరించి
సత్కార్య సాధనా పథమందు నడవంగ
మాబోంట్లకే మార్గదర్శనమ్మయినావు
అందుకే ఈ గ్రంథ మర్పణం అంకితం.

తాడ్వాయిలో వెలసి తత్త్వాల వెదజల్లి
జీవాత్మ గమ్యమ్ము పరమాత్మయని తెలిపి
తల్లి శబరిమాత మిమ్ము మేల్కొల్పింది
మిమ్మంటి ఉన్నట్టి నన్ను మేల్కొల్పింది
ఆ తల్లి నీడలో వెలుగుల్ల జాడలో
మతి నిరూపిత దివ్య వేదాంత కాంతిలో
ముందుకే పయనిస్తు దారి చూపించావు
అందుకే ఈ గ్రంథ మర్పణం అంకితం.

ఈ గ్రామ జన జీవనమ్ములో సౌభాగ్య
మే ప్రొద్దు చిందంగ, ఉద్యోగ ధర్మమ్ము
నిత్యాను కర్మమ్ముగా నెంచి క్షణక్షణము
నిష్ఠతో సేవభావమ్ముతో శ్రమియించి
మీలోనితత్త్వ సౌందర్య సిద్ధాంతమ్ము
మన నేల భౌతికోన్నతి కొరకు అర్పించి
శ్రమతత్త్వ సారమ్మునే పంచి పెట్టావు
అందుకే ఈ గ్రంథ మర్పణం అంకితం.

సంగీత సాహిత్య శిల్పమ్ము ఎదియైన
అంగాంగమందు చైతన్యమ్ము నింపాలి
అమ్మ భారతి భాగ్యరేఖలను దిద్దాలి.
ఆత్మోద్ధరణ కొరకు అది ప్రాణమవ్వాలి
అందరిని ఒక త్రాటిపై నడపగలగాలి
అటువంటి కళలకాహ్వానమ్ము పలకాలి
మీ అంతరంగమ్ము ప్రవచించగా వింటి
అందుకే ఈ గ్రంథ మర్పణం అంకితం.

ఎన్ని వేలేండ్లుగా ఈ జాతి ప్రస్థాన
మెన్ని ఒడుదొడుకులను తట్టుకొని సాగెనో
అనుచు చింతించి, మన భక్తి తత్త్వమ్ములో
ఆంతరికముగ సాగు చైతన్య శ్రీ శక్తి
మూల బలముగ నిలుపుకోవడం ముఖ్యమని
నేల సంరక్షణకు నీటిధీరక్షణకు
ఆ బలమె శ్రీరామ రక్ష మనకన వింటి
అందుకే ఈ గ్రంథ మర్పణం అంకితం.

# ఇది పొడుపుకథాసర్వస్వం

ఇది పొడుపుకథా సర్వస్వం. డా॥ కసిరెడ్డి సర్వస్వంగా దీన్ని తీర్చి దిద్దారు. ఈ తీర్చిదిద్దడంలో పరిశోధన దృష్టేగాక, పరితలసు లాక్కొని వెళ్ళే శైలి నిర్మాణ దృష్టి కూడా ఆయనకు ఉంది. విషయ వివరణలో జానపదుల హృదయ మర్మాల్ని విప్పి చెప్పడంలో ఈ గ్రంథం అపూర్వ ప్రయోజనాల్ని సాధించి పెట్టింది.

7వ తరగతి వరకే చదువుకొన్న వారైనా, బి. ఎ, ఎం. ఎ., పిహెచ్. డి లు పూర్తి చేసిన వారైనా ఈ గ్రంథాన్ని ఆసక్తితో అధ్యయనం చేస్తారు. తెలుగు సాహిత్యంలోని మౌఖిక, లిఖిత, సంప్రదాయ, జానపదాది సాహిత్య విశేషాల్ని-వికాసాల్ని కొంతైనా ఈ గ్రంథం ద్వారా గ్రహించే అవకాశం ఉంది. పొడుపు కథల ఉత్పత్తి వికాసాల్ని తెలియజేసే సందర్భంలో ప్రాచ్య పాశ్చాత్య జానపద విజ్ఞాన శాస్త్రవేత్తల అభిప్రాయాల్ని డా॥ రెడ్డి సంక్షిప్తంగానే చెప్పినా ఆ రంగంలో కృషిచేసే సాహితీగవేషకునికి ఎన్నో వినూత్నాంశాల్ని అందించారనే భావించాలి.

ఈ గ్రంథంలోని రెండో ప్రకరణం జానపద సాహిత్యం. అందులో పొడుపుకథ విరాట్ స్వరూపాన్ని వివరించే అనేక సందర్భాల్లో తెలంగాణ మాండలికశైలి బహుళంగానే కనిపిస్తుంది. దీనికి కారణం రచయిత పుట్టి పెరిగిన పరిసరాల ప్రభావంతో పాటు ఆయన అలవరుచుకొన్న శైలి కూడా ఇదే అనాలి. ఆ శైలిని వదలి వేస్తే కథనంలోని జీవలక్షణం చచ్చిపోయేది. అందుకే ఈ ప్రకరణమంతా హృద్యంగా నడిచింది. కథాత్మకాలు-గుప్తకథలు అనే తృతీయ ప్రకరణం ద్వారా సృష్టిలో అక్షరాకృతి ధరించిన ప్రత్యంశం వెనుక ఏదో ఒక సంఘటన-ఏదో ఒక కథ దాగి ఉందని ఆలోచించడానికి ఆస్కారమేర్పడింది. అవే విధంగా ఆ తర్వాతి ప్రకరణంలో సామెత అంతరంగం, పొడుపు కథకూ సామెతకూ ఉన్న అనుబంధం అభివ్యక్తమయింది.

పొడుపుకథ కూడా ప్రజాజీవనాన్ని ఏ విధంగా ప్రతిబింబించిందో అయిదో ప్రకరణం వివరించింది. ఆరో ప్రకరణంలో వివిధ సాహిత్య ప్రక్రియల్లో పొడుపు కథల ఛాయలు ఉండడం ఎలా సాధ్యమైందో విశ్లేషించారు రచయిత.

ఆ తర్వాతి ప్రకరణాల్లో వరుసగా చిత్రకవిత్వం, అలంకారాలు-ప్రతీకలు, రసం—ధ్వని, ఛందస్సు, భాష తదితరాంశాల్ని పొడుపు కథల మాధ్యమంగా ఎవరు అధ్యయనం చేసినా సరే వారా అంశాల్ని మరచిపోని రీతిలో డా॥ రెడ్డి విశ్లేషించారు ఈ విశ్లేషణ పఠితలో సాహిత్యాభిరుచితో పాటు, సామాజిక చైతన్యాన్ని ప్రతిష్ఠాపించే ప్రయత్నం చేసిందని అధ్యయనశీలురకు అర్థమవుతుంది. చివరి ప్రకరణం వివిధ భాషల్లోని పొడుపు కథల్ని తులనాత్మకంగా పరిశీలించింది. ఈ ప్రకరణం కూడా పఠితను పట్టినిలిపి చదివిస్తుంది.

ఇవన్నీ పఠితకు కలిగే ప్రయోజనాలు. ఇది ప్రయోజనాత్మక పరిశోధన. ఆ దృష్టితో విశ్లేషించి ఒక్కమాట చెప్పొచ్చు "డా॥ కసిరెడ్డి పొడుపు కథల ధాన్యాల్ని కుప్పవోసి, తెలుగు ప్రజలారా! ఇవి మీరు తీసుకోండి! తినండి! మానసికంగా ఎదగండి" అంటూ అందరికీ పంచిపెట్టారు అంతే! ఈ గ్రంథాన్ని గూర్చి ఇంకేం చెప్పాలి. అయితే ఈ కృషికి వన్నె తెచ్చే విధంగా రచయిత మున్ముందు పొడుపుకథాకోశాన్ని కూడా సమగ్రంగా నిర్మించి అందిస్తారని ఆశించవచ్చు. ఆ ఆశ నెరవేరినప్పుడు పొడుపు కథా విజ్ఞాన సర్వస్వం మరొకటి వచ్చిందని భావించవచ్చు.

కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్,
ఆంధ్రప్రదేశ్.

తేది : 1-8-1990

# కృతజ్ఞతలు

నా ఈ పరిశోధనకు పర్యవేక్షకులుగా ఉండి కంటకావృతమైన మార్గాన్ని నిష్కంటకం చేసిన ఆచార్య సి. నారాయణ రెడ్డి గారికి,

1976 జూలై మాసంలో పరిశోధన కవకాశం కల్పించిన ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య బిరుదురాజు రామరాజు గారికి,

1981 జూలైలో ఈ సిద్ధాంత గ్రంథాన్ని పిహెచ్. డి. పట్టం నిమిత్తం సమర్పించగా 1982 జూన్‌లో నాకు డిగ్రీ ప్రదానం చేసిన ఉస్మానియా విశ్వ విద్యాలయం వారికి,

ఈ గ్రంథాన్ని పరీక్షించి గ్రాంథికాన్ని వ్యావహారికంలోకి మార్చి ప్రచురిస్తే బాగుంటుందని సలహాలనిచ్చి, నా పరిశోధనాసక్తిని ఇంకా పెంచుకొనే విధంగా మార్గోపదేశం చేసిన ఆచార్య తూమాటి దొణప్పగారికి, ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి,

పరిశోధనా పథంలో చేయూతనిచ్చిన సర్వశ్రీ ఎం. రామస్వామి, టి. సాయిబాబా, కే. రుక్నుద్దీన్, అవధానం రంగనాథ వాచస్పతి, అయాచితం నటేశ్వర శర్మ, జి. శ్రీనివాస శాస్త్రి, ఎం. అనంత కుమార శర్మ, గుండి వెంకటార్యులు, కె. ఎల్. వ్యాస్, ఎ. ఎస్. గురురాజు, పి. డి. రామచంద్రన్, నారాయణన్ గారలకు,

ఈ గ్రంథాన్ని అందంగా తీర్చిదిద్దడంలో పరిశ్రమించిన కర్షక్ ప్రింటర్స్ అధినేత శ్రీ ఎ. జగన్మోహన్‌రెడ్డి గారికి, శ్రీ వెంకటనర్సింహారెడ్డి గారికి శ్రీ జగదీశ్వర్ రెడ్డి గారికి, ప్రెస్సులో పరిశ్రమించిన శ్రీ కయువల రవీందర్ రావు తదితర బంధు మిత్రు లందరికీ, ముఖ పత్రాన్ని భావస్ఫోరకంగా తీర్చిదిద్దిన మిత్రులు శ్రీ మదన్ శ్రీ రేవంత్ గారలకు, రంగుల్ని కలబోసి అందంగా ప్రచురించి ఇచ్చిన ఓం సాయి గ్రాఫిక్స్ ఆత్మీయులు శ్రీరాం రెడ్డి గారికి,

తమ పరిధిమేరకు ఆర్థిక సహాయ మందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, గ్రంథ ప్రచురణకు పగి తొక్కిసలాడుతున్నప్పుడు ఆర్థికంగా ఆదుకొన్న ఆత్మీయులందరికీ, ముఖ్యంగా శ్రీ పి. సుదర్శన్ గారికి, శ్రీ పి.ఎస్. రెడ్డి గారికి, శ్రీ పి. దామోదర రావు గారికి కృతజ్ఞతలు.

చిరంజీవులు కె. మధుసూదన్ రావు, శ్రీనివాసమూర్తి, వేణు, గోపి, కె. వినాయక్ తదితరులందరికీ ఆశీస్సులు - అభినందనలు. వ్రాత ప్రతులు సంసిద్ధం చేసిన మా అమ్మాయిలు మధుకు, ఇందుకూ ఆశీస్సులు. నా ధర్మపత్ని కస్తూరికి ఏం చెప్పుకొన్నా నాకు నేను చెప్పుకొన్నట్లే ! మొదట చెప్పవలసిన మాట చివర చెబుతున్నా ! ప్రస్తుతం నేను చేస్తున్న ఉద్యోగం "పొడుపుకథ" కాగా దాని ముడివిప్పిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయదేవతకు, - ఇంకెందరో అందరికీ వందనాలు.

# గ్రంథ ప్రచురణ పవిత్ర కార్యానికి ఆర్థికంగా అండదండ లందించిన

## ఆత్మీయులూ - దాతలూ - వదాన్యులూ

రూ॥ 2000-00 శ్రీ పి. లక్ష్మినారాయణ రెడ్డి,
విజయనగర్, భాగ్యనగర్.

1116-00 అధ్యక్షులు, శ్రీరామకోటి జపయజ్ఞం, గీతాజ్ఞానయజ్ఞం,
భాగ్యనగర్.

1116-00 శ్రీ మామిడి విశ్వామిత్ర, హస్తినాపురం,
భాగ్యనగర్.

1116-00 హిందూ యూత్ క్లబ్, అష్టూరు ఎల్లారెడ్డి,
ఇందూరు జిల్లా

1016-00 వివేకానంద యువకేంద్ర, సైదాబాద్, భాగ్యనగర్.

1000-00 అధ్యక్షులు, శ్రీ గీతాపారాయణ గ్రామిక సహకార సంఘం,
కామారెడ్డి, ఇందూరు జిల్లా.

1000-00 డా॥ పొద్దుటూరి ఎల్లారెడ్డి, లెక్చరర్, పాలమూరు.

516-00 శ్రీ పి. సుదర్శన్, AE. కామారెడ్డి, ఇందూరు జిల్లా.

501-00 శ్రీ లాల్‌చంద్, బాంబే క్లాత్ హవుజ్,
కామారెడ్డి, ఇందూరు జిల్లా.

501-00 శ్రీ నేతాజి యువజన సంఘం,
కుపిర్యాల, ఇందూరు జిల్లా.

501-00 శ్రీ ఎస్. జైపాల్ రెడ్డి, మాడ్గుల (సంతోష్‌నగర్),
భాగ్యనగర్.

501-00 శ్రీ పి. భగవంత్ రెడ్డి, సదాశివనగర్,
ఇందూరుజిల్లా

500-00 శ్రీ పి ఎస్. రెడ్డి, సంచాలకులు, సెంట్ డామ్నిక్
విద్యా సంస్థలు, భాగ్యనగర్.

500-00 శ్రీ గంగుల గోవర్ధన్ రెడ్డి, మురళీకృష్ణ ఎంటర్
ప్రైజెస్, చైతన్యపురి భాగ్యనగర్.

500-00 శ్రీ పెద్దిరెడ్డి చంద్రశేఖర్ రెడ్డి,
మధురా స్వీట్స్, దిల్‌సుఖ్‌నగర్, భాగ్యనగర్.

| | |
|---|---|
| 316-00 | ఆర్యవైశ్య సంఘం, కుపిర్యాల, ఇందూరు జిల్లా |
| 250-00 | శ్రీ బి. బాల లక్ష్మయ్య, DYEE, ఇందూరు జిల్లా కామారెడ్డి, " " |
| 250-00 | శ్రీ కె గంగాగౌడ్, " " " |
| 260-00 | మంజీర ప్రింటర్స్, " " " |
| 200-00 | శ్రీ. కె ఎల్లయ్య, ఎం.ఏ, నల్లగొండ |
| 200-00 | శ్రీ జి. రాజిరెడ్డి. ADE, కామారెడ్డి, ఇందూరు జిల్లా |
| 200-00 | శ్రీ డి. రాజిరెడ్డి AE. " " " |
| 200-00 | శ్రీ పి. దామోదరరావు, లెక్చరర్, " " |
| 200-00 | శ్రీ కె. మల్లయ్య Rt. RDO. " " |
| 200-00 | శ్రీ ఎ. భాస్కర్, AE, " " |
| 200-00 | శ్రీ జి. రామచంద్రారెడ్డి, అడ్వకేట్, " " |
| 200-00 | శ్రీ పి. విఠల్, కాంట్రాక్టరు, " " |
| 150-00 | శ్రీ పుప్పాల రాజేంద్ర, DO. యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్సు కం. కామారెడ్డి |
| 150-00 | శ్రీ కె. నర్సింహస్వామి, LIC, కామారెడ్డి, ఇందూరు జిల్లా |
| 150-00 | శ్రీ కె! మధుసూదనరావు, చైతన్య ప్రింటర్స్, కామారెడ్డి, ఇందూరు జిల్లా |
| 150-00 | శ్రీ టి. శ్రీనివాసమూర్తి, LIC, కామారెడ్డి, ఇందూరు జిల్లా |
| 150-00 | శ్రీ పన్యాల ప్రతాపరెడ్డి, దోమకొండ " " |
| 150-00 | శ్రీ ఎ మల్లేశ్, DO, యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్సు కం. కామారెడ్డి. |
| 116-00 | శ్రీ బచ్చు లక్ష్మీపతి, కామారెడ్డి, ఇందూరు జిల్లా |
| 116-00 | శ్రీ మొగ్గు శంకర గుప్త " " " |
| 116-00 | డా॥ జి. సురేంద్రరెడ్డి, సరూర్‌నగర్, భాగ్యనగర్. |
| 116-00 | శ్రీ నరేంద్రరెడ్డి, కాంట్రాక్టర్, హయత్‌నగర్. |
| 116-00 | శ్రీ సూరం శ్యాంరెడ్డి, సరూర్‌నగర్, భాగ్యనగర్. |
| 111-00 | డా॥ బి ఈశ్వర దాసు, కామారెడ్డి ఇందూరు జిల్లా |
| 101-00 | శ్రీ ఎ. నిత్యానందం, " " " |
| 100-00 | శ్రీ T.A. రామయ్య, లెక్చరర్, " " " |
| 100-00 | బాలాజీ సర్వీసు స్టేషన్, " " " |
| 100-00 | శ్రీ డి కృష్ణమూర్తి చిష్టి, " " |

# ముందు ముచ్చట

తెలుగునాట జానపదగేయాలు పల్లె పల్లెలో లభిస్తాయి; పొడుపు కథల విషయంలో కూడా అంతే. ఆచార్య బి. రామరాజు గారు గేయాల సేకరణలో పడ్డపాట్లు జానపద విజ్ఞాన పరిశోధకులందరికీ కలిగేవే అయినా వాటికి తెలుగులో అక్షరాకృతినిచ్చిన ప్రథమ పరిశోధకులు వారే.

నేను పాలమూరు జిల్లా మాడ్గుల్లోని ఉన్నత పాఠశాల్లో తెలుగు పండిట్‌గా 1968 నుండి 1973 వరకు పనిచేశాను. ఆ మధ్య కాలంలోనే మా ఊరు పోలెపల్లిలో, మాడ్గుల్లో, ఆ పరిసరాల్లో దాదాపు వేయి తట్లు (పొడుపు కథలు) సేకరించాను. ఆ తర్వాత 1973 నుండి 1985 వరకు ఇందూరు జిల్లాలోని కామారెడ్డి డిగ్రీ కళాశాలలో ఉపన్యాసకునిగా పనిచేశాను. ఆ మధ్య కాలంలోనే అంటే 1976లో పరిశోధనకు అవకాశం లభించింది.

అప్పుడు క్షేత్ర కార్యంలో నాకు కలిగిన అనుభవాలే ఇవన్నీ. ఫీల్డ్ వర్కర్సందరికీ ఇవి తెలిసినవే కాబట్టి అన్నీ ఏకరువు పెట్టడంలేదు. సామాజిక పరిస్థితుల్ని, పరిశోధన పరిమితుల్ని దృష్టిలో పెట్టుకొని వ్యవహరించాల్సి ఉంది కాబట్టి ఇక్కడ ఊళ్ళ పేర్లు వ్యక్తుల పేర్లు ప్రస్తావించడం లేదు.

అది ఇప్పుడు మండల కేంద్రం! అక్కడ బస్సు దిగాను. నేను వెళ్ళాలనుకొన్న గ్రామం 8 కి మీ దూరంలో ఉంది. ఆ ఊళ్ళోని మా మిత్రుని ఆధారంగా పొడుపు కథలు సేకరించాలి. నేను దిగిన బస్సులోనే నలుగురైదుగురు గృహిణులూ పిల్లలూ దిగారు. వారు నేను వెళ్ళే గ్రామానికే వెళ్ళాలి. వారికి ఇంటి నుండి బండిరాలేదు. తమ ఇంటి వారికి తాము వచ్చినట్లు చెప్పాల్సిందని ఆ ఊరికే బాట పట్టిన నాతో వారు చెప్పారు నేనలాగేచేశాను. ఆ ఊర్లో నేననుకొన్న మిత్రుడు లేడు. ఊరి కొలిమిదాటి దగ్గర కూచొని

'ముచ్చట్లకు' దిగాను. పిల్లలూ పెద్దలూ చేరారు. ఆ ఊర్లో దాదాపు డెబ్బయి పొడుపు కథలు సేకరించాను. ఈలోగా బండి వెళ్లిందీ-వచ్చింది. ఆ యింటి వారు నన్ను పిలచి ఆతిథ్యమిచ్చారు.

మరో గ్రామం; నేననుకొన్న వ్యక్తి లేడు. పోస్టాఫీసుకు వెళ్ళి కార్డులు కొనే మిషతో పోస్టు మాస్టర్ను మాటల్లోకి దింపాను. ఆయన కథా కమామిషు తెలుసుకొని అయిదార్గురి దగ్గరకి తీసుకొని వెళ్ళాడు. ఆ ఊళ్లో ఏబయి పొడుపు కథలు సేకరించాను.

ఓ గ్రామంలోని మిత్రుడు అధ్యాపకుడు, ఆయన భార్యకు పొడుపు కథలు తెలుసు. ఆమె తలుపు చాటుగా ఉండి చెప్పేది. శబ్దం స్పష్టంగా నాకు వినిపించకపోతే ఆయన మధ్య వర్తిత్వం నెరపేవాడు. ఒకటి రెండు అశ్లీలాంశాలు ? వచ్చాయి. ఆమె ఆయన చెవిలో ఊదింది. ఆయన నవ్వుతూ వచ్చి కాగితం మీద వ్రాసి చూపించేవాడు.

అదో పల్లె; ఆ పల్లెలో కొందరు తెలుసు. వాళ్ల పిల్లల్ని పిలిచారు. ఆ పిల్లలంతా పశువుల కాపర్లే అందరికీ గోళీలు-బీడీలు పంచి పెట్టాను. వారు పొడవడమే కాదు-వారి ఇళ్లలోని తల్లి దండ్రుల్ని - అన్నాదమ్ముల్ని - అక్కా-చెల్లెండ్రను అడిగివచ్చి మరీ పొడిచారు.

అదో గ్రామం ; ఆ ఊళ్లో మా బంధువు ఉన్నాడు. ఆయనగారింటి దగ్గర లేరు. వారి శ్రీమతి మిరపతోట ఏరిస్తున్నది. నేనక్కడి వెళ్లాను. దాదాపు ఇరవై మంది మహిళాకూలీలున్నారు. వాళ్ల నన్ను సవాల్ చేస్తూ ఎన్ని పొడుపులు గుప్పించారో! కొన్ని విడుపులు తెలుస్తూనే ఉన్నా వారి నోటనే మళ్ళీ పలికించాను అందువల్ల నేనూ కొన్ని పొడుపు కథలు ఎదురు పొడవాల్సి వచ్చింది.

అది పెద్ద ఊరే. ఇప్పుడైతే మండల కేంద్రం. అక్కడ బీడీల కార్ఖానాలున్నాయి. ప్రతి కార్ఖానాలో స్త్రీ పురుషులు బీడీలు చుడుతున్నారు. అయితే స్త్రీల సంఖ్యే అధికం. వాళ్లలో కొందరు "సర్కారోల్లు నీకేమైనా పైసలిస్తారా" అని అడిగారు ఒకరిద్దరు ఒకటి రెండు పొడుపు కథా గేయాలు పాడి

"ఇవి రేడియోలో వినిపిస్తే నీకు పైసలు వస్తవి-మరి మాకేం వస్తవి" అన్నారు. అయితే వారాశించే పైసలెన్ని! ఓ సీసా కల్లు పైసలు! ఓ పొగాకు చుట్ట పైసలు! ఓ చాయ పైసలు! ఇంకా బీరు సీసాల దగ్గరికి రాలేదు, వస్తే క్షేత్ర కార్యజ్ఞుడు నెత్తిన బట్ట వేసుకోవాల్సిందే?

మరో పల్లె ; మా చుట్టాల కుఱ్ఱాడు ఓ వ్యక్తిని పిలుచుకొని వచ్చాడు అతని కడుపు నిండా కల్లు నింపాడు. ఇంకేం? బూతుల బుంగలు కక్కేశా డాయన. ఇవి తట్లా-లిట్లా అనుకొన్నాను నేను. అయితే అందులోని కొన్నిట్లో పొడుపు కథల ఛాయలున్నాయి.

కొందరు స్త్రీలు భర్తలూ- బంధువులు ఉన్నప్పుడు మాత్రమే చెప్పే వారు అయితే కొన్ని విప్పి చెప్పడంలో వారూ ఇబ్బంది పడేవారు. ఇక క్షేత్ర కార్యజ్ఞుని ఇబ్బంది చెప్పక్కరలేదు. ఓ పొడుపు కథ సగం వస్తుంది; మిగతా సగం ఆమె చెప్పదు పైగా ఆ 'సగం నేను చెప్పను' అని ఆమె కుండ బద్దలు కొట్టేది. ఇక ఆ పొడుపు కథ అసమగ్ర కావ్యంగా మిగిలి పోయేది. అయితే అలాంటివి మరెక్కడో పూరింపబడుతుండేవి.

కవికి కృత్యాద్యవస్థ తప్పనట్లే జానపద విజ్ఞాన క్షేత్ర కార్యజ్ఞునికీ తప్పదు. యోగ సాధకుడు భ్రష్టుడైతే అధోగతి సిద్ధించదు. సాధించినంత వరకు ఫలితం సిద్ధిస్తుంది. పరిశోధకుని విషయం కూడా అంతే. కొన్ని అలా అర్ధాంతరంగా ఆగిపోయినప్పుడు ఈ పై వాక్యాలతో సంతృప్తిపడవలసి వచ్చేది.

నా సేకరణలో స్త్రీలు, పిల్లలు, వృద్ధులూ అందరూ సహకరించారు. అయితే సేకరణ సమగ్రంగా చేయలేదనే చెప్పాలి తెలంగాణా జిల్లాల్లో సేక రించినన్ని పొడుపు కథలు, రాయలసీమా, కోస్తా జిల్లాలో సేకరించలేకపోయాను. అందువల్ల ఇది పొడుపు కథల సమగ్ర దర్శనమని నేను భావించడం లేదు. సేక రించిన సామగ్రి విషయం అనుబంధాల్లోని "పొడుపు కథలు - సంకలనాలు, కర్తలు-వ్యవహర్తలు" అనే అంశాల్లో చెప్పాను.

ఈ సిద్ధాంత గ్రంథం 1981లో పూర్తయింది. అప్పుడది గ్రాంథి కంలో వ్రాశాను. వీలున్నప్పుడల్లా వ్యావహారికం చేస్తూ వచ్చాను. ప్రథమ, ద్వితీయ, చతుర్థ, దశమ ప్రకరణాలు 1984లో మార్చాను. వాటిలోని భాషను

ఆధునిక శైలికి దగ్గరగా తీసుకొనిరావాల్సి ఉంది. మిగతా ప్రకరణాలన్నీ ప్రచురణ కాలంలోనే (సెప్టెంబర్ 1989 నుండి ఆగష్టు 1990 వరకు) వ్యావహారిక శైలికి మార్చాను. ప్రథమ ప్రకరణంలో కొన్ని 'వాదాలు' కొత్తగా చేర్చాను. నా పరిశోధనంతా వర్ణనాత్మకంగా సాగింది. పొడుపు కథ ప్రతీక; ఆ ప్రతీకల్ని వివరించేప్పుడు వర్ణనాత్మక పద్ధతి అనుసరించక తప్పలేదు. ఇది ఇంత బృహద్గ్రంథంగా రాకా తప్పలేదు మరి.

ఇదీ శోధన-సాధన; ఈ తెలుగు పొడుపుకథల పరిశోధన గ్రంథానికి ముందు ముచ్చట; ఇక ముందుకు సాగండి. ఈ గ్రంథాన్ని పరిశీలనాత్మకంగా-ప్రయోజనాత్మకంగా సంసిద్ధం చేయడంలో నా తప్పటడుగులేవైనా ఉంటే తెలియజేయండి! నన్ను నేను దిద్దుకొంటాను! మరోసారి ముద్రణకీ గ్రంథం వస్తే అప్పుడు సవరించుకొంటాను.

తేది : 1990 ఆగష్టు 3. రచయిత.

# తెలుగు పొడుపుకథలు

## అనుక్రమణిక

## 1. ఉత్పత్తి - వికాసం (ప్రథమ ప్రకరణం)

పుట

# ఉత్పత్తి - వికాసం

## 1-0 : ప్రవేశం :

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పళం స్వాద్వ
త్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥ [1]

సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః ।
జుష్టం యదాపశ్యత్యన్య మీశ
మస్య మహిమాన మితి వీత శోకః॥ [2]

ఆ రెండు పక్షులు జంటగా ఉన్నాయి; ఒకే వృక్షాన్ని ఆశ్రయించి నివసిస్తున్నాయి. ఆ రెంటిలో ఒక పక్షి తియ్యని పళ్లు తింటోంది. మరోపక్షి దేనినీ అంటీ ముట్టక సర్వే సర్వత్ర ప్రకాశిస్తోంది.

---

1. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత, I-164-20, పు: 525.

   సII అతులిత పర్ణముల్ గలిగి యంచిత మైత్రి సమానయోగసు
   స్థితి భరియించి యేకమగు చెట్టున నున్నవి రెండు పక్షులు
   ద్ధతమగు రెంటిలో నొకటి తత్ఫలమున్ భుజియించు చుండ సం
   తతము సు జూచుచుండుగద! తక్కిన పక్షి ఫలార్థ కాకయే!

   కII కలవొక తరువున పలురెక్కలవి పులువులొక్కరూపు కలవు చెలిమితో
   కలియుచు రెండొకడింపౌ-ఫలముదినుం, దినక యొండు భాసిలు నెలమిన్.
   (పు: 538)

1. 2. శ్వేతాశ్వతరోపనిషత్తు, 4-6, 4-7.

ఆ వృక్షానికి జీవుడు తగుల్కొంటాడు; అజ్ఞానంలోపడి శోకిస్తుంటాడు. ఆ జీవుడు తన కంటే భిన్నుడూ, సేవింపబడే వాడూ అయిన ఆపరమేశ్వరుని మహిమను ఎప్పుడు తెలుసు కొంటాడో అప్పుడు దుఃఖాలకు దూరమవుతాడు.

విశ్వ ప్రకృతిలో వింతలూ - విడ్డూరాలు, వినోదాలు - విజ్ఞాన సాధనాలు కోకొల్లలు. జిజ్ఞాసువు ఇవన్నీ పరిశీలిస్తాడు; భౌతికంగా అనుభవిస్తాడు, మానసికంగా భావిస్తాడు; తన అన్వేషణానుభవ సారాల్ని లోకాని కందిస్తాడు.

పై వేద మంత్రాల్లో అదే జరిగింది. చెప్పింది నిత్య సత్యం; కాని ఉపమానం వాచ్యమయింది; ఉపమేయం సూచ్యమయింది. వాచ్యమైన ఉపమానం ద్వారా సూచ్యమైన ఉపమేయాన్ని అన్వేషించాలి.

ఈ అన్వేషణానికి మంత్రోత్తరభాగం మార్గ దర్శనం చేసింది. తద్వార వృక్షం సంసారమనీ, మధుర ఫలాల్ని తింటున్న పక్షి జీవుడనీ, ఏమీ అంటక దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న పక్షి ఈశ్వరుడని అవగతమవుతోంది. మొత్తం మీద జీవుడు ఈ ప్రపంచ (సంసార) రూప వృక్షంలో ఉండి శుభాశుభ కర్మల్ని చేస్తూ తత్ఫలంగా లభించే సుఖదుఃఖాలను అనుభవిస్తుంటాడనీ, ఈశ్వరుడు జీవుడు చేసే కర్మల్ని తెలుసుకొంటూ అతనికి తగిన ఫలాల్ని సమకూరుస్తూ సాక్షిమాత్రుడుగా ఉంటాడని తెలుస్తోంది. అంతేగాక ఈశ్వరుడెలాంటి వాడో ఆయన మహిమలెలాంటివో తెలుసుకొన్న జీవుడు దుఃఖరహితుడవుతాడని అర్థమవుతోంది.

చెప్పిందేదో సూటిగా చెప్పాలి; కాని చెప్ప లేదు. పక్షుల ప్రస్తావన వచ్చింది. వృక్షం విషయం కూడా చేరింది. ఏందుకు! ఆ విధంగా చెప్పడం; మానవ ప్రకృతి అని ఒక్కమాటతో సరిపెట్టవచ్చు. కాని మానవాంతః కరణ పరిశోధకులు, సాహిత్య శాస్త్ర మర్మజ్ఞులు, భాషాశాస్త్రవేత్తలు వీటికి ఈకలు తోకలు పీకి మానవ మేధా వికసనార్థం ఈ పద్ధతి ఆవిర్భవించిందనీ' ఇదొక ఆలంకారిక ధర్మమనీ, ఇందులో ప్రతీకాత్మక విజ్ఞానం నిక్షిప్తమై ఉందని అంటారు.

చెట్టు!
చెట్టు మీద రెండు పిట్టలు
ఒక పిట్ట ఫలాల్ని తింటుంది,
సుఖ దుఃఖానుభూతుల్ని పొందుతుంది.
మరొక పిట్టకవి యేమీ అక్కరలేదు,
అది నిశ్చింతగా నిలిచి ఉంది,
చెట్టేంటి?
పిట్టల మర్మమేంటి?
—అని అడిగితే ఇది పొడుపు కథ అవుతుంది.
చెట్టు సంసారం
ఫలాల్ని తినే పిట్ట జీవుడు
తినని పిట్ట ఈశ్వరుడు
—అని సమాధానమిస్తే విడుపు అవుతుంది.

ప్రపంచంలో 'నభూతో నభవిష్యతి' అని పిలువబడుతున్న వేద వాఙ్మయంలో ఇట్టి గుణాలుండడం వల్లనే అది విశ్వంలో ఆవిర్భవించిన ఆవిర్భవిస్తున్న సమస్త విజ్ఞానానికి మూలమయింది. మూలమొక బిందువు. తదాలంబనంతో బిందువు దినదినాభివృద్ధిచెంది సింధువై శిఖరాగ్రాలకెక్కింది; పాతాళాల తొక్కింది. ఈ ఒక్క మంత్రమే కాదు, వేద వాఙ్మయంలోని, ఉపనిషన్ సాహిత్యంలోని శత సహస్రాధిక మంత్రాలు ఇట్టి గుణాల్నే పుణికి పుచ్చుకొన్నాయి. ఆకారణాన్నే పురాణ ప్రబంధాది సర్వ సాహిత్యాల్లో అక్కడక్కడ పొడుపుకథలూ తచ్ఛాయలు దృగ్గోచరమవుతున్నాయి.

జానపద సాహిత్యంలో పొడుపుకథలు గంపల కొద్ది పుట్టాయి; గాదెలు నింపాయి. అందులోని విషయం శ్రుతి స్మృతి పురాణేతిహాస శాస్త్ర ప్రబంధాదుల్ని స్పృశించడమేగాక, జానపదుల జీవన సంస్కృతుల్ని, మనస్తత్వాల్ని, ఆచార వ్యవహారాల్ని తలస్పర్శిగా తాకింది. కనుకనే పొడుపు కథ ఒక విరాణ్మూర్తిగ దర్శనమిస్తోంది.

## 1 - 1 : ఉత్పత్తి

విరాట్మూర్తియైన అటువంటి పొడుపు కథ ఎప్పుడు పుట్టింది? ఎవరు సృష్టించారు! ఎందుకు సృష్టించారు, పొడుపుల మీద పొడుపులు పుడతాయి. వీటికి విడుపులు సాధించాలి; వివరాలు అన్వేషించాలి-విశ్లేషించాలి.

ప్రపంచంలో సుప్రసిద్ధ భాషా సారస్వతాలన్నిట్లోనూ పొడుపు కథలున్నాయి. ఆయా భాషల్లో ఆవిర్భవించిన ప్రప్రథమ గ్రంథరచనా కాలాల విషయంలో విభిన్నాభిప్రాయాలున్నాయి. ఆ గ్రంథాల్లో ప్రహేళికా లక్షణాలున్న వాక్యాలున్నాయి. అ గ్రంథాలెప్పుడు పుట్టాయో ఇవి కూడా అప్పుడే పుట్టాయని నిర్ణయించడానికవకాశముంది. అయితే గ్రంథాలకెక్కడానికి జన వ్యవహారముండాల్సిన అవసరముంది. ఆ వ్యవహారమెప్పటినుండి అనే దానికి మానవుడున్నప్పటి నుండి, భాషనుపయోగిస్తున్నప్పటి నుండి అనే సమాధానం తప్ప గత్యంతరంలేదు. వేదాల్లో, గ్రీకు పురాణాల్లో, అరబిక్ పర్షియా భాషల అతి ప్రాచీన గ్రంథాల్లో, బైబిల్లో, ఖురాన్‌లో, బౌద్ధ జైనాది ధర్మ గ్రంథాల్లో ప్రహేళిక లక్షణాలున్నాయి. ఇవి మూలాలుగా పొడుపుకథా సాహిత్యం వికసించింది.

మానవ సంస్కృతి చరిత్రలోని విభిన్న దశల్లోవాగ్రూపకళల కంటే పూర్వమే పొడుపు కథలు పుట్టాయని సి. ఎఫ్. పోటెర్ (C.F. Potter) వెలిబుచ్చిన అభిప్రాయాలందరంగీకరించలేరు.[1] ప్రథమ దశలో కేవలం గేయాలు మాత్రమే ఆవిర్భవించడానికవకాశముంది. ఈ కథలు-కాకరకాయలేమీ వినని జానపదుని ఇందుకుదాహరణంగా తీసుకోవచ్చు, నేటికీ వాగ్రూప భాషలుగానే మిగిలి ఉన్న తెలుగుదేశంలోని గోండుల భాష, లంబాడీల బాష పరిశీలిస్తే గేయాలు ప్రథమ దశలో ఆవిర్భవించేవే అని అంగీకరిస్తాం. కేవలం గేయాలే కాక కథా గేయాలు కూడ ప్రథమదశకు చెందినవే. గద్యకథనాలు రెండవ దశకు చెందినవి. గేయాల్లోని విషయాన్ని స్పష్టంగా వ్యాఖ్యానించే గద్యకథన మవసరం. గేయంలోని రాగ లయ తాళాల వల్ల అర్థం అడవి దాటి పట్టిందనుకున్నప్పుడు గద్యాన్ని

1. Standard Dictionary of Folk lore. P : 938

ఆశ్రయించక తప్పదు, అందువల్ల గద్యకథనాలు మానవ సంస్కృతి చరిత్రలో రెండవ దశకు చెందిన వని అంగీకరించ వచ్చు. ఇక పొడుపు కథలు తృతీయ ఘట్టంలో (చివరి దశలో) ఆవిర్భవించినవనే అభిప్రాయం ఆలోచించాల్సి ఉంది.

'ప్రధానతమాలైన నేటి పొడుపు కథలు వ్రాత మూలకంగాని జానపద విజ్ఞానంలో చివరి విభాగాలుగా చెప్పవచ్చు.'[1]

ఇంత మాత్రం చేత గేయాలు, కథా గేయాలు, గద్య కథనాలు అతి ప్రాచీనాలని, పొడుపుకథలు ఇటీవలి కాలానికి చెందినవని నిర్ణయించినట్లు గాదు. భాష, లిపి రూపాన్ని సంతరించుకొనని ఒకానొక ప్రాథమిక దశలోనే పొడుపు కథలు ఆవిర్భవించాయి, మానవ జాతి గణాలుగ విభజింపబడుతున్న తొలి దశ లోనే తమ తమ సంస్కృతి - సంప్రదాయాలను పొడుపు కథా నిర్మాణం ద్వారా పరిరక్షించారని భావించడం సత్యదూరంగాదు. అంతేగాక "సంస్కృతి వికాసపు తొలిదశలోనే వివిధ ప్రాంతాలందలి మానవులందరు పొడుపుకథా ప్రియులే"[2] అనే అభిప్రాయం గూడ యదార్థమైంతే "ఈ నాటికీ లోకంలో నిలిచి పోయిన అతిప్రాచీనాలైన చమత్కృతి స్వరూపాలే పొడుపుకథ"[3] లనవచ్చు.

అతి ప్రాచీనమైన వేద సాహిత్యాన్ని మహర్షులూ వారి శిష్యులూ పుక్కిట బట్టి పరిరక్షించారు. అదే విధంగా జానపద సాహిత్యంలో కేవలం మౌఖిక ప్రచారం ద్వారనే నాటి నుండి నేటి వరకు నిలిచి ఉన్న భాగ్యానికి నోచుకొన్న ప్రక్రియల్లో పొడుపు కథ ప్రాతః స్మరణీయమైంది. కేవలం నిలచి ఉండడం వల్లనే కాదు, జానపద విజ్ఞానంలో దిన దినాభివృద్ధి చెందే సుగుణమున్న వాటల్లో పొడుపు కథకే మొదటి పీట వేయాల్సిఉంది. మౌఖిక ప్రచారంలో స్థిరంగా

---

1 A last department of oral Folk lore is tho socalled populer riddles. The Science of Folk lore P : 201,

2. All peoples in the first stages of culture wera lovers of riddles Encyclopaedis of Religion and Ethics P : 768.

3. Riddles are probably the oldest extent fo ms of humer. Encyclopaedia Britannica-20- P : 549.

నిలచి ఉండడానికి దినదినం వికసించడానికి ప్రధాన కారణ మది రూపకం కావడం. ఈరూపకాలంకారాలు కూడ మానవుని ప్రాథమికమైన మానసిక ప్రవృత్తి వలన ఉత్పన్నాలయినవే అనడం గమనార్హం. ఈ అభిప్రాయం కూడా పొడుపుకథ పౌరాతన్యాన్ని బలపరుస్తుంది.

"సాహితీ ప్రక్రియ లన్నింటిలోనే కాకుండా, మౌళికంగా నిలిచి పోయిన విజ్ఞాన దాయకాలైనట్టి విషయాల్లో కూడ దీనికి ప్రముఖ స్థానాన్ని ఆపాదించడంలో బలీయమైన కారణం చూపడానికి అవకాశంఉంది. ఎందుకంటే ముఖ్యంగా పొడుపు కథలు రూపకాలంకార యుక్తాలు· వస్తువుల్లోని సామ్య భేదాల్ని చక్కగా అవగాహన చేసుకొని వాటిని ఒక చోట చేర్చి పోల్చడమనే ప్రాథమికమైన మానసిక ప్రవృత్తి వలన ఉత్పన్నాలైనవే ఈ రూపకాలు"[1]

జీవునికి ప్రకృతికి పరిణామ వాదం జోడించడానికి ప్రయత్నాలెన్ని విధాలుగా జరుగుతున్నా అవి అనాది విషయాలనేది మాత్రం సత్యం. ఆ సత్యాల్నే తనలో రంగరించుకొన్న పొడుపు కథ కూడా అతి ప్రాచీన కాలంలోనే ఆవిర్భవించిందనక దప్పదు. ఈ అభిప్రాయాన్నే బలపరిచే ఈ క్రింది వాక్యాలు గమనార్హాలు

"చర్చలోని విషయాలు వాటి సాధారణ నామాలచే గాని, జన సామాన్యం లోని పేర్లతోగాని చెప్ప బడక, ప్రతీకలతో వ్యక్తం చేయబడడంగాని లేదా మార్మికమైన సూచనలచేత చెప్పబడడంగాని జరుగుతుంది. ఇందులో సంఖ్యలు ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఇవన్నీ ప్రకృతినుండి గాని ఆధ్యాత్మిక జీవనం నుండి గాని గ్రహింప బడతాయి"[2]

---

1. A good case could probably be made for their priority to all other forms of Literature or even to all other oral lore, for riddles are essentialiy metaphors and metaphors are the result of the primary mental process of essciation, coparison and the perception of likenesses and differences.
   Standard Dictionary-P : 938-939.
2. The matters in discussion were useally not called by their ordinary, commonly understood names, but were indicated by symbolical expressioes or even by mystical references, in

ప్రకృతి, మానవుని ఆధ్యాత్మిక జీవనం అనాది కాలం నుండి ఉన్నట్టివే. కాబట్టి ఆ అనాది నుండే ఈ పొడుపు కథలున్నాయని చెప్పడానికి వీలుంది. ఇక తెలుగు పొడుపుకథలెప్పుడు పుట్టినవనే దానికి ఆ భాష పుట్టినప్పటినుండే అని సమాధానం.

క్రీ. శ. మూడు నాల్గు శతాబ్దాలనుండి తెలుగు శాసనాలు కనిపిస్తున్నాయి. అప్పుడు తెలుగులో పొడుపుకథలెట్లుండేవో మచ్చున కొకటికూడ ఇప్పుడు చూపలేము. నన్నయ కాలం నాటికి అంటే క్రీ. శ. 11వ శతాబ్దానికికూడా తెలుగు పొడుపు కథం పొడయేమిటో అంతూ పొంతూ చిక్కదు. ఇరవైయవ శతాబ్దపు ప్రథమ పాదంలో క్రీ. శే నంది రాజు చలపతి రావు గారు సేకరించి ప్రచురించినవే (క్రీ. శ. 1900-1903) గ్రంథ రూపంలో మనకు లభ్యమవుతున్న మొదటి పొడుపుకథలనాలి. పండితులు రచించిన తెలుగు పొడుపు పద్యాలెన్నో గత రెండు శతాబ్దాల్లోనివే. ఆ పద్యాల్లో కనిపించే భాషా శైలి విధానాన్ని బట్టి ఈ నిర్ణయానికి వచ్చే అవకాశం ఏర్పడింది. ఇక ఆయా కాలాల్లో విరచింప బడ్డ గ్రంథాల్లో పొడుపు కథల ఛాయబున్న పద్యాలు లభిస్తున్నాయి. అవి పొడుపు కథా లక్షణాల్ని దృష్టిలో పెట్టుకొని కావాలని వ్రాసిన పద్యాలేంకావు. కథా గమనంలో యాదృచ్ఛికంగా తల్లక్షణ లక్షితాలైన కొన్ని పద్యాలు చోటు చేసుకొన్నాయి; అంతే! అవి ఆయా సందర్భాల్లో ప్రస్తావించుకుందాం.

జానపద సాహిత్యానికి పట్టిన దౌర్భాగ్యం అందులో అంతర్భాగమైన పొడుపు కథకు కూడా పట్టింది. మహా కవుల విరచితాలైన కొన్ని కావ్యాలే అసూర్యంపశ్యలైనప్పుడు, జానపద సాహిత్యాన్ని అడిగిన నాథుడెవడు? ఆ సాహిత్యంలోనూ శిష్టసాహిత్యంలోనూ ఒక అంశమైన పొడుపు కథను స్మరించిన సామాన్యుడెవడు? అందువల్లనే అవి పుక్కిట నిలచి పోయింది. కర్తలెవ్వరో కనుగోడమే కష్టమైంది. అయినా వ్యవహర్తలనేకులున్నారు;

---

which numbers played an Important part. They were taken from the nature, as well as from the spiritual Life.
Indian Riddles P : 18.

అవ్యవహర్తల్లోనూ కొందరు కర్తలుంటారు; కాని వారు తాము కర్తలమని చెప్పుకోరు. కొందరు విశ్వామిత్రులుంటారు. తమది విశ్వామిత్ర సృష్టి అని వారుకూడాచెప్పుకోరు. అందుకే యత్కార్తృకమో లనూహ్యం. కాని కర్తలేక కలిగేదేదిలేదు. అందువల్లనే అజ్ఞాత జనతా సంసృష్టియే పొడుపు కథ అనడం, అజ్ఞాత జానపద సంసృష్టి పొడుపుకథ అనడం మరీ సముచితం. అట్టిజానపదుల పొడుపుకథకు రంగులు హంగులుదిద్ది పొడుపు పద్యాలు తెలుగు కవులు రచించారు. "జనవాణి వేరు కవివాణి పువ్వు" అనుకన్నడ సూక్తి ఈ విషయాన్నే బలపరుస్తుంది.[1]

వంగ ప్రాంత ప్రజల్లో సర్వజానపద ప్రహేళికలకు కర్త కాళిదాసే అను నమ్మకముంది. మహాకవి కాళిదాసు వారి దృష్టిలో మహామేధావి. విజ్ఞానానికి ప్రతీక. కాళిదాస ప్రహేళికలనే మాట అక్కడ వ్యవహారంలో ఉండడం గమనార్హం.[2]

కర్తలు వ్యవహర్తలు ప్రజలే అయినా, అనాదిగా ఉన్న భాషల్లోను ఇటీవలనే అభివృద్ధి చెందిన భాషల్లోనూ పొడుపు కథలుండడం గమనార్హం. ఈ ఉండడంలో కూడా సమానతలు గమనించినప్పుడు ఆశ్చర్యం కలుగకపోదు. సంస్కృతంలో, ప్రాచీన హిబ్రూ భాషల్లో, గ్రీక్ సెమెటిక్ బాబిలోనియా సంస్కృతులకు చెందిన కావ్యాల్లో సమానభావాలుగల పొడుపు కథలుండడం వల్ల మానవుల మనస్సు లల్లోనే ఉండే సమాన గుణం వీటికి మూలం కావచ్చని భావించడానికవకాశముంది.

---

1. కన్నడ ఒగటు గళ-పు : 57

2. In Bengal there is a belife that the author of all the folk riddles is one and the same person and he is the great Indian poet kalidasa. Therefore the riddles are also known in general as the riddles of kalidasa Sometimes the name of kalidasa, describing him as the author, is also added to reach riddle itself, kalidasa symbolizes here an intelligentman. In the openion of the rural folk, it is only the intelligent who can ask and solve riddles.
Folk lore of Bengal. P : 127,

సుమారు వేయి సంవత్సరాలనుండి అభివృద్ధి పొందుతోన్న ద్రావిడ భాషలైన తెలుగు తమిళం కన్నడం మలయాళాల్లో సమాన భావాలున్న, సమాన పదాలున్న, సమాన గుణాలున్న పొడుపు కథలు కనిపిస్తున్నాయి.

రెండిండ్లకు - ఒకటే దూలం (ముక్కు)
రెండట్టులకు - ఒకటే దూలం (ముక్కు)
కన్నడంలో వీటికి సాదృశ్యాలు గమనిద్దాం.
ఎరడు మనెగే - ఒందేగూడు [ఎరడు మనిగె - ఒందుతొలె]
అక్కతంగీర మనెగే - ఒందేగోడె
(అక్క చెల్లెళ్ల ఇంటికి ఒకటే గోడ)
మళయాళంలో ఇట్టివే ఉన్నాయి.
రెంటు కిణరిన్ ఒరుపాలెం
(రెండు బావులకొకటే మోట దూలం)

ఈ సిద్ధాంత గ్రంథంలో పొడుపుకథలు వివిధ భాషలనే ప్రకరణంలో వాటి వాటికున్న సామ్యాలు సారూప్యాలు సాదృశ్యాలు నిరూపించడం జరిగింది. ప్రపంచమందలి వివిధ ప్రదేశాల్లోని మానవుడేకకాలంలో ఒకే విధంగ ఊహించడం వల్లనే ఇట్టివి ఆవిర్భవించడానికవకాశముంది. దీనినే మానసిక సమగ్ర సమతా సాదృశ్యమనవచ్చు. పొడుపుకథల్లో ఇటువంటి సమానతల్ని సాదృశ్యాల్ని గమనించడం వల్లనే మూడు రకాల ఊహా సిద్ధాంతాలు పుట్టాయి.[1]

★ సామాన్యమూలం కలిగి ఉండడం.
★ తరం నుండి తరానికి సాంప్రదాయకంగా వ్యాపించడం.
★ మానవుని మనస్సులోని సమతా సాదృశ్యం.

ఈ చివరిది బహుమూల సిద్ధాంతం. మనుష్యుల మనస్సులో ఉండే సమాన గుణధర్మమే దీనికి ఆధారం. ఇది బహుజనాదరణీయమైన సిద్ధాంతం. అట్లే రెండవది కూడా ఆదరణీయమయిందే; ప్రశస్తికెక్కిందే. దీనికి సాంప్రదాయక బలం పునాది ఒక తరం వారొకటి అనుసరిస్తారు. అవి ఆదరణీయమై ఉంటుంది.

---

1. Encyclopaedia of Religion and ethics p. 768

అది సమాజ సంక్షేమకారకమవుతుంది. మరియొకతరం దాన్ని ఆదరిస్తుంది; ప్రచుర ప్రచారం గావిస్తుంది. ఇక మొదటిది సామాన్యమూలం కలిగి ఉండడం- దీనినే ఏక మూల సిద్ధాంతమంటారు. కొన్నిటికి ఒకే మూలముండవచ్చు గాని అన్నిటికి అదే మూల మనడం కుదురక పోవచ్చు. కాకపోతే దానిపై ఆధారపడి అట్టిదే మరొకటి నిర్మింపబడవచ్చు.

ఈ మూడు సిద్ధాంతాల్లో ఏ ఒక్కటీ పూర్ణ సత్యం గాదు. మూడు కలిసినా పూర్ణసత్యం గాకపోవచ్చు; కాని ప్రస్తుతం ఆ మూడు కలిసినపుడే పూర్ణసత్యం అనడంకన్న గత్యంతరంలేదు. అందువల్ల ఈ మూడు సిద్ధాంతాల్లో మొదటిది పొడుపుకథా ప్రాదుర్భావానికి హేతువైందని, రెండవది పొడుపుకథా వ్యాప నానికి కారణ భూతమయిందని, మూడవది పొడుపు కథా విస్తృతికి ఆధార మయిందని భావించవచ్చు.

సిద్ధాంతాలేవైనా మొదటి నుండి మానవునికున్న ధార్మికచింతన, ప్రకృతి పరిశీలన, మానవాతీత శక్తులపై ప్రగాఢ ప్రత్యయం, సాంఘిక జీవనాంతర్గత విషయ వివేచనం, చమత్కార ప్రీతి తదితర విషయాలెన్నో పొడుపుకథా ప్రాదుర్భావానికి దోహదం చేశాయి. జానపద విజ్ఞానంలోని అనే కాంశాలు ఇదేవిధంగా పుట్టాయి. వీటి పుట్టుకనూ వికాసాన్నీ పరిశీలించిన మేధావులు, జిజ్ఞాసువులో ఆలోచనలు రేకెత్తించే కొన్ని వాదాల్ని ప్రపంచం ముందుంచారు. ఆ వాదాల్లో కొన్నిటిని పొడుపు కథానుశీలనానికి, అధ్యయనానికి ఊతంగా తీసుకొని సమన్వయించుకొనే అవకాశముంది.

## 1-2 : పొడుపు కథలు-

### వివిధ వాదాల పరిశీలనం :

జానపద విజ్ఞానంమీద ప్రపంచమంతటా పరిశోధనలు జరుగుతున్నాయి. ఆ పరిశోధనలు అనేక వినూత్న విషయాల్ని బహిర్గతంచేస్తున్నాయి. కథలు, పురాగాథలు, గేయాలు, చమత్కారాలు, కళలు, రకరకాల పరికరాలు వాటి పుట్టుక వెనుక, నిలకడ వెనుక ఏ శక్తి ఉందని శాస్త్రీయంగా పరిశీలనలు పరిశోధనలు ప్రారంభమయ్యాయి. ఏ శక్తి ఉన్నా అన్నీ మానవ ప్రయోజ

నానికే అన్న విషయాన్ని బలపరుస్తూనే వివిధ దృక్కోణాలతో తమ తమ వాదాల్ని జానపద విజ్ఞాన శాస్త్రవేత్తలు ప్రపంచం ముందుంచారు. పరిశ్రమించి అధ్యయనం చేసి ప్రపంచం ముందుంచిన ఆవాదాల్ని పొడుపు కథలకు కూడా అన్వయించుకొని పరిశీలించే అవకాశముంది.

ఈ వాదాల్లో ప్రధానమైనవి ఆరు 1. పురాగాథావాదం (Mythological Theory) 1. వలస వాదం (Benfeys School & Migrational Theory), 3. నృ శాస్త్రజ్ఞవాదం (Anthropological Theory), 4. చారిత్రక భౌగోళికవాదం (Historical geographical or Finnish Theory) 5. మనోవిశ్లేషణా వాదం (Psychoanalytical Theory), 6. నిర్మాణ వాదం (Structural Theory).

## 1-2-1 : పురాగాథావాదం :

ఈ వాదాన్ని జర్మనీ విద్వాంసుడు జాకబ్ గ్రిమ్ (Jacob grimm) ప్రారంభించారు. ఆసియాయూరోపీయ జానపద విజ్ఞాన అధ్యయనానికి ఈ వాదం వినూత్న ద్వారాలు తెరచింది. జానపద విజ్ఞానానికి మూలం పురాగాథలే అని వీరివాదం. ఈ వాదాన్ని సంస్కృత జర్మనీ ఆంగ్లభాషాడల్లో విద్వాంసుడైన మాక్సుముల్లర్ పెంచి పోషించారు. ఆయన పురాగాథావాదాన్ని సమర్థిస్తూనే, ప్రాచీన కాలంలో హిందూ, పర్షియా, గ్రీసు' రోమన్, జర్మన్ జాతులన్నీ ఒకే ప్రదేశంలో నివసించాయనీ, కాలక్రమంలో ఈ జాతులన్నీ వేర్వేరు ప్రాంతాలకు వెళ్లిపోయి స్థిర పడ్డాయనీ, వీటిమూల భాషలోని పదాలే, ఆ తర్వాత వివిధ మాండలికాలుగా ఏర్పడ్డాయని వాదించారు. అన్నిటిమూలం పురాగాథల శబ్దాలే అని వారు నిరూపించడానికి ప్రయత్నించారు. వేదాల్లోని కథలకూ, గ్రీకు పురాగాథలకున్న సాదృశ్యాల్ని వారు సోదాహరణంగా వివరించారు.[1] అంతే గాక ఆయా భాషల్లోని తులనాత్మక పురాగాథల్ని, రక రకాల పదాల్ని భాషాశాస్త్ర దృష్టితో పరిశీలించారు. మానవ స్వభావాన్ని భాషనూ దృష్టిలో పెట్టుకొని ఆయన నాల్గు దశల్ని నిర్ధారించారు.[2]

---

1. "Chips from a german workshop" vol. IV Essays on Mythology and Folk lore 1907, By Max Muller.
2. Current Trends in Folklore, 1979, By J. Haneoo P : 3.

1. Thematic period (Period of the formation of roots and the grammatical forms of the Language)
2. Dialectic period (Formation of the basic families of the Language)
3. Mythological period (Formation of Miths)
4. Popular period (Formation of the National Languages)

ఈ నాల్గు దశలు వరుసగా పదనిర్మాణం, భాషా కుటుంబాల నిర్మాణం జాతీయభాషల నిర్మాణం అనిస్థూలంగా చెప్పుకోవచ్చు. క్రమం బాగానే ఉన్నా ఏదిముందు ఏది వెనుక అనే విషయంలో భిన్నాభి ప్రాయాలు వస్తాయి. బిందువు నుండె సింధువు ఏర్పడ్డ విధంగా క్రమ పరిణామం గ్రహించదగింది.

ఓంకారం నుండే సర్వాక్షరాలు పుట్టాయనీ, మాహేశ్వర సూత్రాలే అక్షర సమామ్నాయానికి మూలమనీ భారతీయుల విశ్వాసం. అదేవిధంగా పురాగాథలే సర్వసాహిత్యానికి మూలకందమనీ విశ్వసిస్తారు. మనిషిలో జిజ్ఞాసను పెంచే శక్తి పురాగాథలకుందని, అందులో యక్షప్రశ్నలు అంతర్భాగమనీ. ఆయక్ష ప్రశ్నలే పొడుపు కథలకు మూలమని జనంలో ఒక నమ్మకముంది. పొడుపు కథలు చెప్పేవారిని "అబ్బ వాడెన్ని యక్ష ప్రశ్నలు వేస్తాడో" అని ఇప్పటికీ అంటుంటారు.

"యక్ష ఉవాచ :

కిం స్విదేక పదం ధర్మ్యం
కిం స్విదేక పదం యశః ।
కిం స్విదేక పదం స్వర్గ్యం
కిం స్విదేక పదం సుఖమ్॥

యుధిష్ఠిర ఉవాచ :

దాక్ష్య మేక పదం ధర్మ్యం
దానమేక పదం యశః ।

సత్యమేక పదం స్వర్గ్యం
శీల మేక పదం సుఖమ్॥"[1]

ఎయ్యది ధర్మ్మువునకు కుదు?
రెయ్యది యాశ్రయముకీర్తి? కిమ్మగు మార్గం
బెయ్యది సురలోకమునకు?
నెయ్యది సుఖములకు నిక్కు? యేర్పడ చెపుమా?

వ: అనియడుగుటయు
"అమరగ దాక్షిణ్యము ధ
ర్మమునకు కుదురండ్రు : కీర్తి మహిమ నెలవు దా
నము; సత్యము సురపురి మా
ర్గము; శీలము సంశ్రయము సుఖంబులకెల్లన్"[2]

ధర్మానికి కుదురేది? దాక్షిణ్యం; కీర్తికి? దానం; స్వర్గానికి? సత్యం; సుఖానికి? శీలం.... ఈ విధంగా వచ్చిన వందలాది ప్రశ్నోత్తరాలు తెలుగు పొడుపు కథలకు మూలమని విశ్వసిస్తారు. పురాగాథావాదం పొడుపు కథల విషయంలో ఈ విధంగా సుసంపన్నమవుతుంది. పురాగాథల విషయాలే చేర్చి నిర్మించిన పొడుపు కథల వల్ల కూడా, ఆ గాథలు పొడుపుకథా ప్రక్రియ విస్తారానికి దోహదం చేశాయనే చెప్పాలి.

| | |
|---|---|
| "శ్రీరామునకు సీత చెలగి యెచ్చట నుండు | (డాకడా) |
| నా రాముడేటికి నడవికేగె | (కైకకై) |
| ఏగిన మారీచుడేది తాల్చుచు వచ్చె | (మెకమె) |
| నెసగి దైత్యుని రాముడెచట చంపె | (నేలనే) |
| సుగ్రీవుడారాము చూచి యేమని పల్కె | (సంతసం) |
| వాలి రామునిచేత నేల చచ్చె | (కనక) |
| లంక నేరీతిని పొంక మడంచెను | (కలంక) |
| ప్రజల నేటికతండు ప్రబలజేసె | (కేళికే) |

---

1. శ్రీ మహాభారతమ్, అరణ్యపర్వం, అ ; 313, శ్లో : 69, 70.
2. శ్రీమదాంధ్ర మహాభారతము, అరణ్య ఆ : 7, ప: 440, 441, 442.

అన్నిటికి జూడ మూడేసి యక్షరంబు
లీవలావల జూడంగ నేకవిధము
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్ని నగవు.[1]

పద్యాలు గేయాలు, వచనాలెన్నో ఈ విధంగా పురాగాథాంశాల్ని సంతరించుకొని తెలుగులో పొడుపుకథలుగా అవతరించాయి. వీటి ప్రాశస్త్యాన్ని, జన బాహుళ్యంలో ఉన్న ప్రచారాన్ని దృష్టిలో పెట్టుకొనే జానపదవిజ్ఞాన శాస్త్ర వేత్తలు పురాగాథావాదాన్ని సమర్థించారు.

## 1-2-2: వలసవాదం :

యుద్ధాల కారణంగా ప్రజలు వలస వెళ్లే పరిస్థితులేర్పడతాయి. బ్రతుకు తెరువు నన్వేషిస్తూ ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వెళ్ళడం సహజమే. అందువల్ల ఒక ప్రాంతంలోని విజ్ఞానం మరో ప్రాంతంలో స్థిరపడడం జరుగుతుంది. ఆచార వ్యవహారాలు కూడా ఒక దానిలో ఒకటి కలిసి పోతాయి. దీనివల్ల జానపద విజ్ఞానంలో చేర్పులూ మార్పులూ వచ్చే అవకాశముంది.

ఈ వాదాన్ని జర్మన్ ఇండాలజిస్టు థియోడర్ బెన్‌ఫే ప్రవేశ పెట్టారు. (Theodor Benfey)[2] ఇతను పంచతంత్రం అనువదించి యూరపులో ప్రచారం చేశారు. ఈ వలసవాదాన్ని భారతదేశమంతటా అన్వయించుకోవచ్చు. పైగా ఇక్కడి తీర్థయాత్రల వల్ల దేశమంతటా ఆచారవ్యవహారాలు సాహిత్ సంస్కృతులు కలిసి పోయే పరిస్థితులేర్పడ్డాయి. కాశీదగ్గరి గంగనీళ్లు తెచ్చి రామేశ్వరంలోని శివలింగాన్ని అభిషేకించడం, రామేశ్వరం దగ్గరి సముద్ర జలాలు తీసుకొని వెళ్లి కాశీవిశ్వేశ్వరుణ్ని అభిషేకించడం ఇక్కడి విశ్వాసం. అయితే ఈ విశ్వాసాల కారణంగా ఏర్పడ్డ తీర్థయాత్రలు, శాశ్వతంగా వలసవెళ్లి ఒకచోట స్థిరపడేట్టు చేయవు. ఆ వ్యక్తులు తిరిగి తిరిగి మళ్లీ తమ ప్రాంతానికి చేరుకుంటారు.

---

1. పొడుపు పద్యాలు పు. 43
2. **Current Trends in Folk lore 1978, Page-5,**

ఏక్ పకడ్ లియేతో
దోలటక్ తా [తరాజ్]

ఇది ఉర్దూ పొడుపుకథ; విడుపు త్రాసు (తక్కెడ) తెలుగులో సరిగ్గా ఇలాగే ఉంది.

ఒక్కటి పట్టుకుంటే
రెండూగులాడ్తాయి (తక్కెడ)

ఉర్దూ, తెలుగులో ఈ పొడుపు కథను ఏది మొదట నిర్మించుకుందో తెలుసుకోడం కష్టం. ఆ భాషా భాషీయులు కలిసి తిరగడం వల్లనే రెండు భాషల్లో ఒకే విధమైన పొడుపు కథ కనిపిస్తుంది.

వెళ్లై కారనుక్కు కరుప్పు తోప్పి
[తెల్ల దొరకు నల్లటోపి - అగ్గిపుల్ల]

ఇది తమిళం పొడుపు కథ; 'తెల్లదొరనల్లటోపి పెట్టుకున్నాడు' అని సర్వసాధారణంగా తెలుగులో అడగడం ఉంది. ఏ భాషలో మొదట పుట్టి, ఏ భాషలోకి తరువాత వలస వెళ్లిందో నిరూపించడం కష్టం.

కాళకి దక్కుం కయర్ ఓకుం [గుమ్మడికాయ-తీగ]
[ఎద్దు నిలబడేఉంది
[తాడు తిరుగుతోంది]

ఇది మలయాళం పొడుపు కథ; గుమ్మడికాయ ఎద్దు; తీగ త్రాడు. తెలుగులో జానపదుల ఈ క్రింది పొడుపు కథ అవి ఇదే, ఇది అవే అనేట్టు ఉంది,

ఎద్దు పండంగ
మోకు సాగంగ [గుమ్మడికాయ - తీగ]

భారతీయ భాషల్లోనే కాక ప్రపంచంలోని లన్ని భాషల్లో ఇలాంటి సామ్యాలు కనిపిస్తాయి. వలసల కారణంగానే ఈ ఆదాన ప్రదానం జరిగిందని చెప్పుకోవచ్చు.

## 1-2-3 : నృశాస్త్రజ్ఞవాదం :

దేశాలువేరు; ప్రాంతాలు వేరు; భాషలువేరు; కాని మానవులభావాలుఒకే విధంగా ఉంటాయి. అందరి మనోవికాసం ఒకే విధంగా ఉంటుంది. ప్రాచీన మానవుని మట్టి పాత్రలు, రాతిపనిముట్లు, ఆయుధాలు తదితర వస్తువుల నిర్మాణ పద్ధతి ఒకే విధంగా ఉంది.కథలూ పురాగాథలు కూడా ప్రాచీన మానవుని మనస్తత్వాన్ని ప్రదర్శించే కళాఖండాలే.[1]

ఇలా పరిశోధించి ఈ వాదాన్ని ప్రపంచం ముందు పెట్టిన వారు నృ శాస్త్రవేత్తలు. ఈ వాదాన్ని బ్రిటిషర్ ఎడ్వర్డ్ బి. టైలర్ (Edward B. Tylor) అతని అనుచరుడూ స్కాచ్ దేశస్థుడు అండ్రూలాంగ్ (Andrew Lang) బలపరిచారు.[2] భారతీయ భాషల్లో జానపద విజ్ఞానం మీద పరిశోధనలు చేసిన శ్రీ శరత్‌చంద్రమిత్ర, డా॥ నాయని కృష్ణకుమారి నృశాస్త్ర వాదాన్ని అనుసరించారు.

భారతీయ సంస్కృతిలోని 'సర్వభూతాత్మ ఏకతావాదం'[3] ఈ మధ్యనే పండిత దీనదయాళ్ ప్రవచించిన 'ఏకాత్మ మానవతావాదం[4] నృ శాస్త్రజ్ఞుల దృష్టికి వచ్చి ఉండాలి. సృష్టిపరంగా, సమాజ పరంగా భారతీయ మేధావి ఎంత లోతుకు వెళ్లి ఆలోచించాడో తెలిసి ఉండాలి. ఏదియేమైనా నృ శాస్త్రజ్ఞుల వాదం ప్రపంచ మేధావుల మన్ననల కెక్కింది. ప్రధానంగా జానపద విజ్ఞాన విషయంలో "ఏకత" సాధించే పయత్నం నృశాస్త్ర వాదం చేసింది.

పొడుపు కథల పరిశీలనవల్ల కూడా ఈ వాదానికి బలం చేకూరుతుంది. "స్త్రీముఖం, సింహశరీరం, రెక్కలూ ఉన్న గ్రీకు పురాణకథల్లోని రాక్షసి స్పింక్స్ (Sphinx) థేబే (Thebe) నగరవాసులకో సమస్య ఇచ్చేది. సమా

---

1. New standard Encpclopedia 1958. Vol. 11. Page 394.
2. Current Trends in Folklore 1978 By J. Handoo, Page-6
3. శ్రీభగవద్గీత, అ-6, శ్లో-29.
4. గాంధీ, లోహియా, దీనదయాళ్ పుట-109

ధానం చెప్పనివారిని చంపుతుండేది. చివరకు ఓడిపస్ [Oedipus] ఈ సమస్యను పరిష్కరిస్తాడు. ఆ రాక్షసి తాను కూచున్న బండ క్రింద పడే మరణిస్తుంది."[1] భారతంలోని యక్షునికీ ఈ రాక్షసికి పోలిక ఉంది.[2]

అమీర్‌ఖుస్రో రాసిన ఈ హిందీ ప్రహేళికకు తెలుగు జానపదుని పొడుపు కథకు సామ్యం కనిపిస్తుంది. ఒకరు భాష తెలిసిన మహా పండితుడుకాగా, మరొకరు భాష తెలియని కర్షకులు.

ఎక్ రాజాకీ అనోఖీరాణీ
నీ చేసే వహ్ పీవే పానీ 3 (దియాకీ బత్తి)

ఓ రాజు గారికి అమాయకపురాణి ఉంది. ఆమె క్రింది నుండి నీరు త్రాగుతోంది.

అడ్డుమర్ల ముద్దుమ పిట్ట
మూతికి బంగారం పెట్టుకొని
తోకతో నీళ్లు తాగుతది (దీపం-వత్తి)

ప్రాంతాలు వేరైనా, భాషలు వేరైనా, వృత్తులు వేరైనా, ఒకరు సాహిత్యాన్ని పారం ముట్టినా, మరొకరికి అక్షరం రాయడంకూడా తెలువకున్నా భావం ఒకే విధంగా ఉండడం గమనించ దగింది. మానవ మనస్తత్వం, మనో వికాసం ఒకే విధంగా ఉంటుందనే నృశాస్త్రజ్ఞుల వాదానికి అనుకూలంగా ఎన్నో పొడుపు కథలు లభిస్తాయి.

## 1-2-4 : చారిత్రక భౌగోళిక వాదం :

ఒక విధంగా Benfeys' ప్రతి పాదించిన వలస వాదాన్ని ఈ చారిత్రక భౌగోళిక వాదం విస్తరించింది. వర్తక వ్యాపారాలు. గ్రంథ ప్రచారం

---

1. English - Telug Dictionay-1978, Page : 1028.
2. శ్రీ మహాభారతమ్, అరణ్య పర్వం, అ : 313
3. అమీర్ ఖుస్రో, 1976, సం: సుదర్శన్ చోపడా, పు: 69

కారణంగా ఒక ప్రాంతంలోపుట్టిన కథ వివిధ ప్రాంతాలకు, వివిధదేశాలకు వ్యాపిస్తుంది.[1] ఫిన్నిష్ ప్రతి పాదించడం వల్ల, ఫిన్లాండులోని కథాగేయాల్ని ప్రప్రథమంగా ఈ వాదం క్రింద పరిశీలించడం వల్ల దీనికి ఫిన్నిష్ వాదం అనే పేరుకూడా వచ్చింది.

ఈ వాదాన్ని పరిపోషించిన వారిలో జూలియస్ క్రౌన్ (Julius Krohn) కార్లే క్రౌన్ (Karle Krohn), ఆటీ ఆర్నే (Atti Aarne), ఆగ్జిల్ ఆల్‌రిక్స్ (Axel Olrix) ముఖ్యులు.

ఒక కథను అధ్యయనం చేయడం వల్ల ఆ కథా మూలాన్ని కనుకో గలుగుతాం. అది వ్యాపించిన భౌగోళిక మార్గాల్ని తెలుసుకోగలుగుతాం. కథకున్న విభిన్న పాఠాంతరాల్ని సేకరిస్తాం. తదనుగుణంగా ఓ క్రమ పద్ధతిలో కూర్చుకుంటాం. మూలాంశాల వల్ల అవి ఏ ప్రాంతానివో తెలిసి పోతాయి. ఈ వాదం ఈ విధంగా శాస్త్రీయ పరిశీలనకు దోహదం చేస్తుంది. ప్రపంచంలోని వివిధ దేశాల విజ్ఞాన శాస్త్ర వేత్తలు ఫిన్నిష్ వాదాన్ని అనుసరించి జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేశారు.

ముఖ్యంగా భారత దేశంలోని భిన్న ప్రాంతాల్లో ఒకే కథకు భిన్న పాఠాంతరాలు ఏర్పడ్డానికి కారణ మేంటో శాస్త్రీయంగా తెలుసుకోడానికి ఈ వాదం బాగా ఉపకరిస్తుంది. గుప్పెడు పొడుపు కథలో గంపెడు విడుపులున్న కథాత్మక ప్రహేళికలు తెలుగులో లభిస్తున్నాయి. వ్యవహర్తల దగ్గర వాటిని విన్నప్పుడు పాఠాంతరాలున్నాయని గమనిస్తాం. పొడుపు కథలు కథాత్మకాలనే ప్రకరణంలో ఈ విషయం స్థూలంగా ప్రస్తావించడం జరిగింది. వారి వారి వృత్తుల వల్ల, పరిసరాల వాతావరణం వల్ల, గ్రామ, నగర, అరణ్య ప్రదేశాల ఆచార వ్యవహారాల్లో ఉండే మార్పుల వల్ల ఈ పాఠాంతరా లేర్పడతాయి.

---

1. Current Trends in Folklore 1978, Page-8.

స్తంభాలు
స్తంభాలమీద కుంభాలు
కుంభాలమీద కుడిత్తొట్టి
కుడిత్తొట్టి మీద గవ్వల గురిగి
గవ్వల గురిగి మీద గడ్డి పోచలు
గడ్డి పోచల్లో గాడిదలు పొర్లాడు తున్నయ్

తెలంగాణాలోని పాలమూరు నల్లగొండ జిల్లాలో ఈ గొలుసు పొడుపు కథ ప్రచారంలో ఉంది. ఒక్కొక్క పాదానికి వరుసగా కాళ్లు, పిరుదులు, కడుపు, తల, వెంట్రుకలు, పేలు అనే విడుపులు వస్తాయి. డా॥ వెలగా వెంకటప్పయ్య సేకరించి ప్రచురించిన ఈ క్రింది రెండు పొడుపు కథల్లో పాఠాంతరాలు కనిపిస్తాయి.

* అంభాల మీద కుంభాలు
కుంభాల మీద కుడిత్తొట్టి
కుడిత్తొట్టి మీద గుంట్రాయి
గుంట్రాయి మీద కోరింత
కోరింత మీద ఆరిక ఆవురూ
ఆరిక ఆవురు గడ్డిలో ఆవులువేయీ

* అంభాలు
అంభాల మీద కుంభాలు
కుంభాలు మీడ కుడిత్తొట్టి బాన
కుడితి మీద ఈరపలక
ఈరపలక మీద ఇనుపగుండు
ఇనుపగుండు మీద ఇద్దరు జవాన్లు
ఇద్దరు జవాన్లమీద సే (సీ) క్ పొద
సేక్ పొదలో పదిరేస్ కుక్కలు [1]

---

[1] పొడుపుకథలు, 1981 పు, 15.

నేను సేకరించిన పొడుపుకథా వ్యవహర్త తెలంగాణాలోని పల్లె ప్రాంతంలో నివసించే అక్షరాలు కూడారాని వ్యవసాయదారుని గృహిణి. వారు సేకరించిన ప్రాంతం, వ్యవహర్త విషయం తెలుసుకుంటే పాఠాంతరాలు రావ టానికి కారణాలేంటో తెలిసిపోతాయి. చారిత్రక భౌగోళికవాదం ఈ విధంగా ప్రయోజనాన్ని సాధిస్తుంది. ఒక ప్రాంతంలోని పాఠాంతరాలే కాక పూర్తిగా ఇలాగే ఉన్న కన్నడ పొడుపు కథకూడా పరిశీలనార్హ మవుతుంది.

"కంబ-కంభద మేలె
గుంభ-గుంభదమేలె
హుల్లు-హుల్లినలిహుళు"

కంబం, కంబం మీద కుంభం, కుంభంమీద గడ్డి, గడ్డిలో పురుగు. తెలుగు కన్నడాల్లో ఏది ముందో, ఏది వెనుకో నిర్ణయించి ఎటునుండి ఎటువైపు ఈగాలి మళ్లిందో, ఎన్ని మార్పులు పొందిందో ఈ చారిత్రక భౌగోళిక వాదం ద్వారా నిరూపించవచ్చు.

## 1-2-5 : మనోవిశ్లేషణావాదం :

వ్యక్తి, కుటుంబం, సమాజం సక్రమంగా నడవాలంటే కొన్ని కట్టు బాట్లుండాలని సామాజిక శాస్త్రవేత్తలైన దార్శనికులు కొందరాశించి నీతి నియ మాల్ని రూపొందించారు. ఇవి మనిషిని బంధించి లైంగిక వాంఛలు తీర్చుకో కుండా చేశాయని, అందువల్ల మనోవ్యథకు గురైన మనిషి ఆటలూ-పాటలూ కళలుగా రూపొందాయని సిగ్మండ్ ఫ్రాయిడ్ (Sigmund Freud) భావించాడు. తీరని కోరికల కారణంగానే జానపద విజ్ఞానం ఆవిర్భవించిందనీ, అలా ఆవిర్భవించిన వాటిలో లైంగిక గుర్తుల్ని (Sexual Symbols) ఆధారంగా తీసుకొని, ప్రతిమనిషిలో అచేతనంగా (unconcious) ఉన్న కోరిక సింబల్‌గా చేతన (concious) స్థితిని పొందుతుందనీ జానపద విజ్ఞాన శాస్త్రవేత్తలు పరి శోధనలు ప్రారంభించారు. ప్రయోగాత్మకంగా అనేకాంశాల్ని నిరూపించారు.

ప్రధానంగా పురాగాథల మీదనే ఈ పరిశోధనలు జరిగినా ఇందులో, వ్యక్తి (Individual) స్వప్నాలకు కూడా అధిక ప్రాధాన్యమిస్తూ వచ్చారు. అచేతనం నుండి చేతనానికి రావడానికి కోరికకు అడ్డంగా సంఘం నీతి నియ

మాలు నిలుస్తాయని, అప్పుడది లోననే అణచబడుతుందని, ఆ అణచివేతను అధిగమించడం చేతగాక మరోరకంగా ఈ సెక్సు సింబల్స్‌ను సృష్టించుకోవడం జరిగిందని జానపద విజ్ఞాన శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. ఈ అణచివేత స్థితినే ఉపచేతనం లేదా సుప్తచేతనం (Snb-Concious) అనిపిలిచారు.

అచేతనం, ఉప (సుప్త) చేతనం, చేతనం, స్వప్నం తదితర అంశాల్ని ప్రధానంగా తీసుకొని జర్మన్, ఆస్ట్రియన్ మనో విశ్లేషణ జానపద శాస్త్రవేత్తలు (Psychoanlytical Folk Lorists) ఈ వాదానికి బలం చేకూర్చారు. 1

ఈ వాదం భారతీయ సాహిత్యంలో గాని జానపద విజ్ఞానంలో గాని ఇంకా బలంగా పాతుకోకపోయినా, దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు! తదితర గ్రంథాల్లో నార్లవంటివారు భారతీయ సంస్కృతిని తిట్టడానికి దీన్ని ఆశ్రయించారు.

కథాత్మకాలైన పొడుపు కథల్లో సుదీర్ఘమైన కథ ఉండడంవల్ల లైంగిక సంబంధి శబ్దజాలం ఉంటుంది. చిన్న పొడుపు కథల్లో లింగ సంబంధి పదాలున్నవి వందలకొలది లభిస్తున్నాయి. పైకి లైంగికార్థం ధ్వనించినా విడుపులో ఆ అర్థం ఉండని ఒక పొడుపుకథ మాత్రం ఇక్కడ ఉదాహరిస్తా.

తీసి తీసి పెట్టేదొకటి
తియ్యక పెట్టే దొకటి
పాయవట్టి పెట్టే దొకటి
పట్టి పట్టి పెట్టేదొకటి
పండవెట్ట పెట్టేదొకటి
కుచ్చి కుచ్చి పెట్టేదొకటి

ఇవన్నీ పొడుపులు; కుపొడుపులకు ఈ క్రిందివి విడుపులు.

---

1. Current Trends in Floklore 1978; Page :9.

తీసి తీసి పెట్టేది కాటుక
తియ్యక పెట్టేవి బొట్టు
పాయవట్టి పెట్టేది జడ
పట్టి పట్టి పెట్టేవి గాజులు
పండ వెట్టి పెట్టేది పాపడ
కుచ్చి కుచ్చి పెట్టేవి పూలు

రెప్పలు తీసి తీసి కాటుక పెట్టడం, ఏం తీయకుండానే నొసట బొట్టు పెట్టడం, వెంట్రుకల్ని పాయవట్టి జడ వేయడం, చేతులు పట్టి పట్టి గాజులు పెట్టడం, పాపట పుల్లను పండ బెట్టి పాపడ తీయడం, పూలను కుచ్చి కుచ్చి పెట్టడం.... మొదలైన వన్నీ ఒంటికి చేసే సింగారాలే. పైకి లైంగికార్థాల్ని చ్చే ఆమాటల్ని పట్టుకొని అణచి వేయబడ్డ ఈ కోరికలు ఇలా బహిర్గత మైనాయని చేతనాచేతనాలకూ, ఉప చేతనాలకూ అన్వయించ వచ్చు. ఎనిమిదేళ్ల అబ్బాయో అమ్మాయో ఈ పొడుపు కథ ఎక్కడో విని పొడిచినా వారికి కూడా అచేతననూ సుప్తచేతననూ అంటగట్టవచ్చు. పొడుపు కథల్లోని "పొడుపు" శబ్దం తోనే ఈ మనో విశ్లేషణావాదం ప్రారంభించ వచ్చు. ఈ సిద్ధాంత గ్రంథం ఈ పరిశీలనకు కాదు; కాబట్టి ఈ వాదాన్ని ఇంత మాత్రమే పరిచయం చేసి భవిష్యత్తుకు వదిలివేస్తున్నా.

## 1-2-6 : నిర్మాణవాదం :

1928 ప్రాంతంలోనే Morphology of the Folktale అందించిన రష్యన్ విజ్ఞాన శాస్త్రవేత్త వి. జె ప్రాప్ (V. J. Propp) నిర్మాణ విశ్లేషణ ప్రపంచంలో ప్రచలితం కావడానికి ముప్పయి సం॥ లు పట్టింది. 1958లో ఆంగ్లంలోకి అనువాదమై వచ్చిన ఈ వాదం పలువురి ప్రశంసలు పొందింది. దీనిని పెంచి పరిపోషించిన ఫ్రెంచి నృ శాస్త్ర వేత్త లేవీ స్ట్రాస్ (Claude Levi-Strauss) రాగ్లన్ (Raglan), ఓల్రిక్ (Olrik) వాన్ సైడో (Von Sydow), ఆండ్రీ జోలెస్ (Andre Jolles) తదితరులు నిర్మాణ వాదాన్ని సమర్థించి ప్రచారంచేశారు.

ఒక కథలోని వివిధ భాగాల మధ్యన ఉన్న సంబంధ మేంటి అని ప్రాప్ పరిశీలన ప్రారంభమైంది. భాషను పదాలుగా వాక్యాలుగా విడదీసినట్టు,

కథను ప్రకార్యాలుగా (Functions) కథాంశాలుగా (Elements) విడదీయవచ్చు. వివిధ కథాంశాలు ముందుకు కొనసాగుతుండడం వల్ల కథ గమ్యం చేరుతుంది, ఆయా కథల్లో వచ్చే పాత్రల పేర్లు వేరువేరుగా ఉన్న ప్రకార్యాలు మాత్రం ఒకే విధంగా ఉంటాయి ప్రపంచంలోని కథల పరిశీలన వల్ల మొత్తం 31 ప్రకార్యాలు మాత్రమే ఉంటాయని తేలింది. ఒక వంద రష్యన్ కథల పరిశీలన ద్వారా నిర్మాణ వాదం సార్వత్రిక మైందని రుజువైంది. పుట్టుకను గురించి ఎవరూ చెప్పలేరని, నిర్మాణాన్ని గురించి మాత్రమే చెప్పగలుగు తారని ప్రాప్ వాదన.[1]

అయితే నిర్మాణం ద్వారా అర్థంవైపు పయనించాలని, భాషాశాస్త్రం జన్య శాస్త్రం ఆధారంగా సమగ్రతను సాధించాలని, లెవీస్ట్రాస్ మరికొన్ని అంశాలు ఈవాదానికి జోడించారు. పురాగాథా నిర్మాణాన్ని గూర్చి చెబుతూ "మిత్" అనేది ఓ కోడ్ అనీ ఆకోడ్‌ను డీకోడ్ చేసుకోవడమే నిర్మాణమన్నారు. ఈ దృష్టితో ఆయన ఈడిపస్ కథను విశ్లేషించారు. సాంస్కృతిక విశ్వాసాల్లోని వైరుధ్యాల్ని కూడా నిర్మాణవాదం చూపిస్తుందన్నారు, స్త్రీ–పురుషుడు, ఆకాశం-భూమి, నాగరిక - అనాగరిక, మంచి - చెడు తదితర వైరుధ్యాలు అన్ని పురాగాథల్లో కనిపిస్తాయి అన్నారు. కథను విడిగా చూడకుండా సమగ్ర క్షేత్రాన్ని పరిశీలించాలని స్ట్రాస్ వాదన. సమాజం, ప్రవేశం, ఆహారం, వస్త్రాలు, బంధుత్వ సంబంధాలు ఇవన్నీ నిర్మాణ వాదం చూపిస్తుందన్నారు.[2]

భాషాశాస్త్ర సూత్రాలతో ఈ నిర్మాణాన్ని ఇలా విశ్లేషించవచ్చు. ప్రాప్ తదితరు లీ పద్ధతిని ఆమోదించారు

రస రసాలు తిన్న
రాజు కడుపుల పేగుల్లేవు (తలె లేదా పళ్ళెం)

ఈ పొడుపు కథలో నాల్గు అంశాలున్నాయి, 1. ఇచ్చిన అంశం: రస రసాలు తిన్న రాజు, 2. సమాన ధర్మం : తినడం, 3. కనుక్కోవాల్సిన అంశం: పళ్ళెం, 4. భిన్న లక్షణాలు : పేగులుండడం-లేక పోవడం.

---

1. Current Trends in Folklore, 1978, Page : 11
2. Current Trends in Forklore, 1978, Page , 12

భిన్న లక్షణాలు రెండున్న విధంగానే ప్రత్యంశంలోనూ రెండు కనిపిస్తాయి. వీటినే భారతీయాలంకారిక మతాన్ననుసరించి ఉపమానోప మేయాలంటాం.

ఇక్కడ ఉపమానం రాజు, ఉపమేయంపళ్లెం; ఉపమానం వాచ్యమైంది: ఉప మేయం సూచ్యమైంది. వాచ్యమైన వస్తువు ఆధారంగా సూచ్యమైన దేదో కనుగోవాలి. ఆకనుగోడానికి ప్రతి పొడుపుకధకు ఓ కీలకం (క్లూ) ఉంటుంది. పేగుల్లే వనడమే ఆ కీలకం. కధాత్మక ప్రహేళికల్లో ఈ నిర్మాణం సమగ్రంగా పరిశీలించే అవకాశముంది.

## 1-2-7 : మరికొన్ని వాదాలు :

ఇన్నిరకాల వాదాలతో పొడుపు కధల్ని పరిశీలించ వచ్చునని తేలింది. కొన్ని వాదాలు ఒకదానిలో ఒకటి కలిసి పోయే అవకాశమున్నా విస్తృత విషయ పరిశీలనకివన్నీ దోహదం చేస్తాయి. ఇవేకాక ప్రతిదీ యాదృచ్ఛికంగా ఆవిర్భ విస్తుందనే Accidental Theory ని, వీరుల త్యాగాలే కధలుగా పుట్టాయనే Euhemeristic Tneory ని, ప్రకృతి శక్తులకూ దేవతలకు మనుష్యరూపాలుగా ఆరోపింపబడ్డానికి కారణం మానవుల్ని ఆదర్శమూర్తులుగా తీర్చిదిద్దాలని తపనే అని ప్రతిపాదిస్తున్న Anthropomorphism ను, ప్రతిగాథకో నీతి ఆరోపితమై ఉంటుందనే Allegrical Theoryని, ప్రాజ్ఞానవుల క్షీణించిన జ్ఞాపక శక్తే పురా గాథల పుట్టుకకు కారణమైందన్న Spencer's Theory ని, ఈ గాథల ప్రాదు ర్భావానికి మూలకారణం భాషా వికృతే అని నిరూపించే Melady of Langn-age or Solar Theory ని. పురాగాథల పుట్టుకకు మూలం ఆచారాలే అని నిర్ధా రించే Rituelistic Theory ని .... ...ఇంకా ఎన్ని వచ్చాయో అన్ని స్వీకరించి పొడుపు కధలను పరిశీలించవచ్చు.

ఇవే కాక సేకరించిన వస్తువుతో పరిశోధకుడు తనంతట తాను కొత్త పుంతలు తొక్కవచ్చు; లేదా అదివరకు వేసి ఉన్న బాటమీదనే నడవ వచ్చు. ఇది కేవలం తెలుగు పొడుపు కధల విషయంలోనేగాక ప్రపంచంలోని అన్ని భాషల ప్రహేళికలకు వర్తిస్తుంది. ఆ దృష్టితోనే తెలుగు పొడుపుకధకున్న పర్యాయ పదాల్ని పరిశీలిస్తూ ముందుకు సాగుదాం.

## 1-3 : పొడుపు కథ పర్యాయ పదాలు :

తెలుగు దేశంలో అనేక మండలాలున్నాయి. ఈ మండలాల్లో పొడుపు కథను అనేక నామాలతో పిలుస్తున్నారు. ఏ పేరు సముచిత మయింది, ఏది కాదనేది చర్చనీయాంశం గాదు. ఏ పేరుతో పిలిచినా పొడుపుకథ అంటే గూఢ భావాలున్న చిక్కు ప్రశ్న అనే అందరి అభిప్రాయం. పొడుపు - విడుపు అనే పదాలు అందరికి తెలిసినవే; అయినా ఆయా మండలాల్లో వీటికి వేర్వేరు పేర్లున్నాయి. అవన్నీ సమానార్థకాలే. విశేష ప్రచారంలో ఉన్నది మాత్రం పొడుపుకథ అనే పదం. ఈ పదానికున్న విభిన్నార్థాల్ని డా॥ పి. యశోదారెడ్డి ఇలా విశ్లేషించారు.

"పొడుపు కథ : పొడ్పుకథ - (పొడపు + కథ) - పొడుపు + కథ)

1. "పొడ + చూపు పొడచు పొడపు - పొడ్పు - ఉదయము, రూపించుట,

2. పొడర్పు - పొడపు - ప్రకాశము, వెలుగు,

3, పొడుచు - పొడుపు - తగులుట, తాకుట, బాధించుట, చీకాకు పరచుట, చిక్కులో వేయుట,

ఇన్ని విభిన్నార్థాల్లో గ్రహించ దగింది ఈ పదం, ...ము దాయకంగా పొడుపు కథ, అంటే జ్ఞానోదయాన్ని కలిగించేది, నిగూఢమైన అర్థాన్ని ప్రకాశింప చేసేది, మనస్సుకు సూటిగా తగిలేది, ఎదలో నాటేది, లేదా వెంటనే అర్థంతోచక చిక్కుల పెట్టేది అని మనం గ్రహింపవచ్చు. ఈ పదానికి ఏ అర్థం గ్రహించి నప్పటికి పొడుపు కథకు సరిగా అన్వకినట్లు వ్యుత్పత్తిని కల్పించి చెప్పవచ్చు""[1]

## 1-3-1 : పొడుపుకథ :

ఇది కోస్తాలో పుట్టిన పదమైనా ఈ రోజు పలానాచోట పుట్టిందనడానికి వీలు లేనంతగా ఆంధ్ర దేశమంతటా వ్యాపించి పోయింది. పొడుపు అనే పదం కూడా ఇదే అర్థంలో ప్రయోక్తం. పొడుపుడు కథ అనే రూపాంతరం కూడా ఉంది. పొడుపు అనే పదం పొడుపు కథలో కనిపించడం లేదు. కాని చలన చిత్ర సాహిత్యంలో కనిపిస్తుంది.

---

1, గోడమీద బొమ్మ - పొడుపు కథా పరిచయం-పు, 4

"వేస్తాను పొడుపు కథ వేస్తాను
సూస్తాను విప్పుకో సూస్తాను
.... .... ....
మనం వేసుకున్న పొడుపు కథ ఈ రాత్రి
అది విప్పుకొని తప్పుకుంటే శివరాత్రి"

ఇది అండమాన్ అమ్మాయిలోనిది. మరొక సినిమాలో "పొడుపు కథ పొడవాలి" అనే పదం కూడా ప్రయోగింపబడింది.

"చుక్కలు పొడిచే వేళ - అహ
మక్కువ తీరే వేళ
ఆడపిల్లే పొడుపు కథ పొడవాలి
అందగాడే తెలుసుకొని విప్పాలి"[1]

పూర్వకాలంలో పచ్చబొట్టు పొడిచేప్పుడు పొడుపు వల్ల కలిగే బాధ తెలియకుండడానికి గానూ పొడుపు కథలు కూడా పొడిచేవారు.

## 1-3-2: విడుపు :

వేసిన పొడుపు కథకు చెప్పే అర్థం విడుపు. పొడుపొక ముడి: విడుపు ఆముడిని విప్పడం. ఇది కూడా ఆదిలో కోస్తా ప్రాంత వ్యవహారమే అయినా ఇప్పుడంతటా ప్రయోగింప బడుతుంది. కొన్ని పత్రికలు బాల బాలికల నిమిత్తం పొడుపు - విడుపు అనే శీర్షికలు పెట్టాయి. విప్పు కథ, విచ్చు కథ, ఇచ్చు కదఅనే పదాలు ఉన్నాయి. తమిళంలో పొడుపుకథలనే 'విడికతై' అనీ, మలయాళంలో విడికద అని అంటారు. తెలుగులోని 'విచ్చుకత' కవి సరి పోయాయి. "విప్పుకో" "విప్పాలి" అని అనడం విడుపు చెప్పమనే అడగడం. పొడుపొక బింబం; విడుపు ఆ బింబం వెలుగు.

ఆంధ్రసాహిత్యంలో పొడుపు ఉదయించు, ఉదయం అనే అర్థాల్లో ప్రయోగింప బడింది "ప్రొద్దుపొడుపకు మున్న వెడలించె పురము సకల

1. జమీందార్ సినిమా.

జనములను జీవధనముల సరకునతడు" అని భారతంలో ప్రయోగింప బడింది[1] "విధు పొడుపు గాదు పనిగాదు వేబ్బ ప్రమాను - కాదు రవిబింబ మోబ భూ కాంతు నరస"[2] అని కావ్యాలంకార సంగ్రహంలో ఉంది.

'నీవు పొడిచావా (పొడుస్తావా) నేను పొడుస్తాను విప్పుకో' అనే వ్యవహార ముంది. పొడుచు పదానికి "పోట్లాడు, ఉదయించు, క్రుమ్ము, క్రుచ్చు, వ్రేయు కుట్టు." అనే అర్థాల్ని శబ్ద రత్నాకరం చెబుతున్నా వ్యవహారంలో పొడుపు కథకు ప్రయోగించు అనే అర్థం కూడా ఉంది. 'విప్పుకో' అనే రూపం విడుచుకో విడుపుకో నుండే యేర్పడింది. అట్లే 'విడుపు' కు విచ్చు, అనే రూపాలేర్పడి విచ్చుకత-ఇచ్చుకత అనే వ్యవహారాలు స్థిరపడ్డాయి. పొడుచు-పొడుపు, విడుచు-విడుపు నడుచు-నడుపు, మఱుచు-మఱుపు, మొదలైనవన్నీ తెలుగులో కృద్రూపాలుగానే భావింపబడతాయి, అందువలన పొడుపు-పొడుచు, విడుచు-విడుచు (విచ్చు) రూపాలు వినిపిస్తున్నాయి.

బ్రౌణ్య ఇంగ్లీషు తెలుగు నిఘంటువులో రిడిల్ (Riddle) అనే ఆంగ్ల పదానికి విడికథ, విచ్చుట, విడికథను విచ్చుట, అనే అర్థాలే ఇచ్చారు.[3] పొడుపుకథ అనే పదం ఇప్పుడే అర్థంలో వ్యవహృతమవుతుందో విడికథనదే అర్థంలో బ్రౌన్ భావించాడు. తమిళ మలయాళాల్లో విడికతై విడికథ అనే పదాలు పొడుపుకథార్థాలైనట్లు తెలుగులో కూడ విడికథ అనేది కొన్ని మండలాల్లోని మారుమూలల్లో ఒకప్పుడు వ్యవహృతమై ఉంది.

## 1-3-3 : తట్టు :

తెలంగాణాలోని పాలమూరు జిల్లాలోనూ నల్లగొండ జిల్లా పడమటి ప్రాంతంలోనూ పొడుపుకథలను తట్లు అంటారు. 'నువ్వో తట్టెయ్-నేనోతట్టేస్త. ఎవరోడిపోతరో చూద్దాం, ఆ ప్రాంతాల్లో ఇట్లనుకోడం ఉంది. 'మనం తట్లేసుకొందమబ్బ' అని పిల్లలు సర్వసాధారణంగా అనుకొంటుంటారు.

1. మహాభారతము మౌసల - ప : 174
2. కావ్యాలంకార సంగ్రహము,-ఆ-౬, ప
3. బ్రౌణ్య ఇంగ్లీషు-తెలుగు నిఘంటు, పు-967

* తట్టుకు మారుతట్టు
నీ పక్కలున్న దేంది? (నీడ)

తట్టులు తట్టు (తాకు) కొనేప్పుడు అకస్మాత్తుగా ఇలాంటివి ప్రయోగిస్తుంటారు. తట్టు పదానికి తాకడం, ముట్టుకొనడం, చిన్నగ దెబ్బకొట్టడం, నెట్టడం (త్రోసివేయడం), చిరిగిన గోనెబొంత, జనుపనార వస్త్రం, కుర్చీకి కట్టిన జనుపనారబట్ట మొదలైన అర్థాలున్నాయి, కలుగు, తోచు, చరచు, దద్దురు, స్ఫోటకం వంటి ఒక జాడ్యం, దెబ్బవల్ల చర్మం పొంగడం, నీచజాతి గుఱ్ఱం, శబ్దదోషం, దరి, పార్శ్వం ప్రదేశం మొదలైనవి నైఘంటికార్థాలు.

గూఢ ప్రశ్నని తాకడమే తట్టడం. తట్టడం మనస్సుకు పనికల్పించడం, తద్వారా మనస్సుకు తోస్తుంది (తట్టుతుంది) అలాతోచి స్థిరీకరింపబడ్డ విషయం బుద్ధిని తట్టుతుంది, అనగా జ్ఞానం కలుగుతుంది, తట్టు అంటే ప్రశ్న, తట్టు అంటె జ్ఞానోదయం, పొడుపు విడుపుల రెండర్థాల్ని పొదిగికొన్న శబ్దం తట్టు.

## 1-2-4 : మారుతట్టు :

మొదట ప్రయోగించినది తట్టుకాగా ఆ అర్థం విప్పిచెప్పకుండా మరొకటింకొక తట్టు వేసినట్లయితే అది మారు తట్టవుతుంది. తట్టు ఎక్కడెక్కడ ఉంటుందో మారుతట్టు అక్కడక్కడా ఉంటుంది. తన్ను తాకిన వానిని తాను తాకడం, దెబ్బకు దెబ్బ దీని అర్థం.

* మారుతట్టు మల్లయ్యా
ముడ్డి దేకయ్యా (పార)

* మారుతట్టు మల్లప్ప
నీ ముడ్డి గిల్లప్ప (గోకరి, గోరుచిక్కుడుకాయ)

ఇటువంటి తట్లు కొన్ని కనిపిస్తున్నాయి. తట్టినప్పుడు జ్ఞానోదయం కలుగక పోవడమే గాక విసుగు, క్రోధం ఈ మారు తట్టుల్లో ప్రదర్శితంకావడం గమనార్హం, తట్టు తట్టుగా ఉండదు, అది మారుతుంది, అనగా వేరొక రూపు ధరిస్తుంది. ఆ సంగతి విడుపు వలన తెలుస్తుంది,

కొండకు కొడవండ్లు (చింత కాయలు)

ఇచ్చట కొండకొండకాదు, కొడవండ్లు కొడవండ్లుకావు: కొండ చింత చెట్టు, కొడ వండ్లు చింతకాయలు. కొండ, కొడవండ్లు రెండు కూడా - ఉపమానాలు; అవి వాచ్యాలు వాటి ఆధారంతో ఉపమేయాల్ని దర్శించాలి, ఆ దర్శనమే ఆ జ్ఞానమే చింత చెట్టు కాయలు, తట్టు తట్టుగా ఉండక అర్థవివరణం వల్ల మారింది, మారిన తట్టు మారుతట్టయింది, తట్టు పొడుపు విడుపులనే రెండర్థాల్ని పొదిగి కొనగా మారుతట్టు మూడర్థాల ముప్పురితాడుతో పెనవేసుకొని పోయింది.

## 1-3-5 : మారుకత :

రాయలసీమ పరిభాషలో పొడుపు కథల్ని మారుకతలంటారు. "ఒకరు ఒక కతను పొడిచినప్పుడు సమాధానము చెప్పలేని వ్యక్తి మారుగా మరొక విషయమును (కథను) పొడుచుట పరిపాటి కనుక దీనికి మారుకత అను పేరు వచ్చి యుండవచ్చును"1 మారేదైనందువల్ల దీనికీ పేరు వచ్చిందనడానికి అవకాశముంది.

* మారుకత మారుకత మంకన్నా
మామ కొంకెన్నా
మళ్లా వస్తే కంచన్నా
నీకూనా కూ లంకెన్నా 2 (తలుపు గొళ్లెం)

* మారుకత మల్లెప్పా
నేల గీరప్పా (చీపురు-పొరకట్ట)

1 జానపద విజ్ఞాన వ్యాసావళి - పు : 79

2 మారూ కథా మంకెన్నా
మామామా కొంకెన్నా
మళ్లావస్తే కుంకెన్నా
నీకూ నాకూ లంకెన్నా (గొళ్లెం)

* కథ కథ కంగు
తోలు తీసి మింగు (అరటి పండు)

మారుకత అనే పదం మాత్రమే గాక కేవల కథా శబ్దం కూడా పొడుపు కథ విషయంలో ప్రయోగింపబడింది

ఓ యువతి భర్త చాటుగా తిన్నది. పడుకొన్న భర్త పక్కకు చేరింది. కథ చెప్పుమని మోచేతితో పొడిచింది, ఆమెచేసిన చేష్టలే కథలయినవి. తెలిసిన భర్త కథతో ఎత్తి పొడిచాడు.

* కత కత కానసులు
పీటెడు పాశం జుబ్బసులు
వత్తుల సెయ్యద్దసులు
దీపం సిటుకు
తలుపు పొటుకు
వచ్చినా ఎనుక వరుగసులు (తిండిపోతు భార్య చేష్టలు)

"కథవేస్తా" అనే పదం చలన చిత్ర సాహిత్యంలోనూ కనిపిస్తుంది.

"తందానా నందానా-అందాలా కథ వేస్తా
దమ్ముంటే విప్పాలోయ్-అవునో కాదో చెప్పాలోయ్
.... .... ...
తందానా నందానా-అందాలా కథ వేస్తే
సైయ్యంటూ విప్పేస్తా-దమ్మేంటో చూపిస్తా"

ఈ విధంగా కథ, మారుకథ అనే పదాలు పొడుపు కథార్థంలో ప్రయుక్తమయ్యాయి. ప్రహేళికా సాహిత్యంలోనూ జన వ్యవహారంలోనూ ప్రచలితమయ్యాయి,

## 1-3-6 : శాస్త్రాలు :

పొడుపు కథల్ని శాస్త్రాలని వరంగల్లు, కరినగర్, ఇందూరు జిల్లాల్లోని కొన్ని ప్రాంతాల్లో పిలుస్తున్నారు. "శాస్త్రార్థమెంత కఠినమో వీనిని విడదీయుట

యంత కష్టమని కాబోలు పొడుపు కథలకు శాస్త్రములని పేరు వచ్చినది.[1] శాస్త్రంలో ఒక విస్తృత విషయం కొన్ని నియమాలకు లోబడి సూత్ర బద్ధమవడం సర్వ సాధారణం. సూత్ర ప్రాయమైన ఆరంభాంశం (An opening formula), సూత్ర ప్రాయమైన ముగింపు (A Closing formula) కలిగి ఉండడం పొడుపు కథకున్న ఒకానొక లక్షణం. ఈ గుణాల్ని బట్టికూడా వీటిని శాస్త్రాలని పిలిచారనిపిస్తుంది. అంతేగాక శాస్త్ర శబ్దం పొడుపు కథల్లోనూ కనిపిస్తుంది.

* శాస్త్రం సెన్నప్ప
నేల గిరప్ప (పార)

* ఆలేటి సెర్లకూరేరే పిల్ల
నీ వొల్ల కూరేమి! (గర్భవలి)

సదూ శాస్త్రం సేర్సిన సాకలివాడా
రెక్కలు మడవని పక్షి పేరేమి! (జున్నకోల)[2]

వైద్యశాస్త్ర విషయాలు, జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించిన సంగతులు గణితశాస్త్ర విశేషాలు లెక్కకుమిక్కిలి తెలుగు పొడుపు కథల్లో ఉన్నాయి. అందువల్ల కూడా వీటిని శాస్త్రాలని పిలిచారు. కొన్ని ప్రాంతాల్లో సామెతల్ని శాస్త్రాలని పిలుస్తున్నారు. "నువ్వొక శాస్త్రం వెయ్ - నేను విప్పుత" అనే మాటలు తెలంగాణంలో అక్కడక్కడ వ్యవహారంలోఉన్నాయి. అత్త చాటుగ బాగా మెక్కి వచ్చిన కోడలు అత్తగారి దగ్గరకు వచ్చి "ఓ శాస్త్రం చెప్పు ఓ శాస్త్రం చెప్పు" అని అడిగింది, అత్త గమనించి ఆమె చేష్టల్నే శాస్త్రంగా మార్చింది.

---

1. జానపద గేయ సాహిత్యము - పు : 519
2. పుల్లంగొయ్య — తూనీగ

* శాస్త్రం శాస్త్రం శర్నాటకం
పిడికిటి నోట్లో మింగాట్కం
వత్తులొటుకు
దీపం చిటుకు (బూకటి కోడల్ని ఎత్తి పొడవడం)

ఈ విధంగా శాస్త్రమనే పదం కూడా కొన్ని ప్రదేశాల్లో పొడుపు కథకు పర్యాయ పదంగా వ్యవహృతమవుతోంది.

## 1-3-7 : సమస్యలు సమిచ్చలు

త్వరగ పరిష్కరించ డానికి సాధ్యం కానట్లు సాక్షాత్కరించడం సమస్య కున్న గుణం. ఈ లక్షణం పొడుపు కథకుంది. ఇందూరు జిల్లాలోని కొన్ని గ్రామాల్లో[1] పొడుపు కథల్ని సమస్యలు - సమిచ్చలు అంటున్నారు. సమస్యలకు వికృతి సమిచ్చ. సమీక్ష పదమిలా మారిందనిపించినా వారు మాత్రం పొడుపుకథల్ని సమస్యలు - సమిచ్చలు అనే పలుకుతున్నారు.

* భోగపుదాన! బొచ్చులదాన
కొన విచ్చని పువ్వేది (అరటి పువ్వు)

ఇటువంటి వాటినే వారు సమస్యలు (సమిచ్చలు) అంటున్నారు. కాని తెలుగు సాహిత్యంలో సమస్య అనేది "సారస్వత రసికుల హృదయములను చూరగొనిన స్వతంత్ర ప్రతిపత్తిగల కవితా వినోదము,"[2] 'గుడ్డానికి నైదుకాళ్ల కోడికి వలెనే' అనేది సమస్య.

* మట్టాకు పాన్పుగా గొని
బొజ్జను బ్రహ్మాండ పంక్తి బూనిన ముద్దుం
గుజ్జడ; విను, వన్నెలు బహు
గుడ్డానికి నైదు కాళ్లు కోడికి వలెనే![3]

1. లింగంపేట, ఎల్లారెడ్డి తదితర గ్రామాలు
2. సమస్యా పూరణములు-పీఠిక - పు. 11
1. మౌఖిక ప్రచారంలో ఉన్న పద్యం.

అనేది పూరణం. విడుపు విననంత వరకు పొడుపు కథపై ఉత్కంఠ ఎట్లుంటుందో పూరణం తెలిసికోనంత వరకు సమస్య విషయంలో అట్టి ఉత్సుకతే ఉంటుంది. ఆ కారణాన్నే కథల్ని సమస్యలని (సమిచ్చలని) కొందరు పిలుస్తున్నట్లుగా భావించాలి. అంతేగాక సంస్కృతంలో ప్రహేళికకు 'సమస్యా గూఢము' అనే పర్యాయం పదం కూడా ఉంది. అందులోని గూఢ శబ్దంలుప్తమై కేవలం సమస్య మిగిలిందని కూడా భావించడానికి అవకాశముంది.

## 1-3-8 : చిటుకులు

చిటిక వేసి చెప్పేవి చిటుకులు. చిటిక ఏకమాత్రాకాలికం. సమాధానంకూడా అంత కాలంలోనే రావాలి. ఆలోచించ డానికి లవకాశమివ్వరన్నమాట. పొడుపు కథల్ని కొందరు జానపదులు సిటుకులంటున్నారు. పాలమూరు జిల్లా లోని కొన్ని గ్రామాల్లో "ఆ యెంకడు బలె పడిదేలోడు, బలె సిటుకుఌ సెప్తడు" అనే మాటలు వినిపిస్తాయి. ఎంకడో, ముత్తడో, బాలడో, లాలడో పేరేదైతేనేంటి గాని ఎవరో ఒకరు. ఈ శబ్దం పొడుపు కథల్లో ఉన్నా ఈ అర్థంలో ప్రయోగింపబడ్లేదు.

సిటుకు సిటుకు మట్టెలు పెట్టుక
మంచి నీళ్ల బాయికోతె
కొంటె ముండా కొడుకొచ్చి
కొంగువట్టి గుంజె (రేగుకంప)

సిటుకు పొటుకు లాడి
గోడదుంకు లాడి (విస్తరాకు)

## 1-3-9 : చిట్కాలు

కొందరు జానపదులు పొడుపు కథల్ని చిట్కాలంటున్నారు చిట్కా వైద్యానికి సంబంధించిన కొన్ని పొడుపు కథలున్నందువల్ల ఈ పేరుతో పిలిచారనిపిస్తుంది.

కాసకు గుణమీయ గలుగునేది (ములక)

ఇది పొడుపు పద్యంలోని అర్ధ పాదం. కాస అంటే దగ్గు. ఆ దగ్గును మూలకాయ మాన్పుతుంది. చిట్కావైద్యం దాదాపుగా గుళికల వైద్యమే. ఒక్కొక్క గుళిక ఒక పొడుపు కథ అని భావించి కూడా వీటిని చిట్కాలన్నారేమో!

## 1-3-10 : చిక్కుముళ్ళు

త్వరగా విడదీయడానికి వీలు కానిది చిక్కుముడి. కోలాటంలో జడకొప్పు లేదా కొప్పు అనే ఆట ఆడుతుంటారు. ఆటలో వేసిన ముడి ఆటలోనే విడిపోతుంది. ప్రహేళిక కూడా ఒక విధమైన క్రీడ. విడుపు ద్వారనే ఈ క్రీడకు ముగింపుంది. పొడుపొక ముడి అని, విడుపు విప్పేదని భావించి కొందరు వీటిని చిక్కు ముళ్లని పిలుస్తున్నారు. ఇది ఆధునికుల ప్రయోగమే. చిక్కులెక్కలు, చిక్కుప్రశ్నలు, తమాషా లెక్కలను పేర కొన్ని పత్రికలు వీటిని ప్రచురిస్తున్నాయి.

5 గజముల పొడవు
5 గజముల లోతు ఉన్న గొయ్యిలోంచి
ఎంత మట్టి తియ్యగలరు?
[అసలు మట్టిని తియ్యలేము. ఎందుకంటే అంతకు ముందే మట్టిని తీసివేయడం వల్లనే కదా గొయ్యి యేర్పడింది]

చిక్కులో ముంచే గుణం పొడుపులకున్నందువల్ల చిక్కుముళ్లని చిక్కు లెక్కలని, చిక్కు ప్రశ్నలని, తమాషా లెక్కలని ఎన్నో పేర్లతో వీటిని పిలుస్తున్నారని తలంచడానికి అవకాశముంది.

## 1-3-11 : యక్షప్రశ్నలు

త్వరగా సమాధానం చెప్పడానికి వీలుకానివి, ప్రశ్న ద్వారా చమత్కారం భాసింప జేసేవి, ఆశ్చర్యాంబుధిలో ముంచి వేసేవి యక్ష ప్రశ్నలు. పొడుపు కథలు పొడుపు కథా ఛాయలున్న వానిని 'అవి యక్షప్రశ్నలురా' అంటారు. యక్షప్రశ్నలు నిన్నటివా మొన్నటివా! ధర్మరాజు కాలం నాటివి. ధర్మరాజు కాలమంటే పాండవుల కాలం. పాండవుల కాలం అతి ప్రాచీన మయిందని లోక

ప్రతీతి. యక్ష ప్రశ్నల్లో పొడుపు కథల గుణాలు సంపూర్ణంగా ఉన్నాయి. ఆ కారణాన్నే వీటిని యక్షప్రశ్నలంటారని భావించ వచ్చు. యుక్తిప్రశ్నలు చిత్ర ప్రశ్నలుఅనే మాటలు కూడా యక్ష ప్రశ్నలకే లేదా అటువంటి వాటికే పర్యాయంగా ప్రయోగిస్తున్నారు. మహా భారతంలో యక్షుడు ధర్మరాజును ఈ ప్రశ్నలడిగినందువల్ల వీటికి ఈ పేరు వచ్చింది.

(అ) సూర్యుని యేది నడుపుతుంది?
(ఆ) ఆ సూర్యుని ఎవరు కొలిచి తిరుగుతారు?
(ఇ) దేనివల్ల అతడు అస్తమిస్తాడు?
(ఈ) అతనికి ఆధార భూతమైంది యేది?
(అ) సూర్యుని బ్రహ్మం నడుపుతుంది.
(ఆ) సూర్యుని కొలిచి సురకోటి తిరుగుతుంది.
(ఇ) సూర్యుడు ధర్మముచే అస్తమిస్తాడు
(ఈ) అతనికి ఆధారం సత్యం[1]

ఈ ప్రశ్నలు ఈ సమాధానాలు విపుల వ్యాఖ్యానాన్ని అపేక్షిస్తాయి. వైజ్ఞానిక శాస్త్ర దృక్పథానికివి సరిపోవని కొందరనవచ్చు. కాని భారతీయ సంస్కృతిని నాటిదేశ కాల పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొని వీటిని పరిశీలించాల్సిన అవసరముంది అడుగడుగున పొడుపు కథా లక్షణాలున్న యక్ష ప్రశ్నలన్నీ పరిశీలనార్హాలే.

---

1. శ్రీ మహాభారతమ్. అరణ్య పర్వ
శ్లో॥ కిం స్విదాదిత్య మున్నయతి కేచత స్యాభితశ్చరాః।
కశ్చైన మస్తం నయతి కస్మింశ్చ ప్రతి తిష్ఠతి॥45॥

శ్లో॥ బ్రహ్మాదిత్య మున్నయతి దేవాస్తస్యాభితశ్చరాః।
ధర్మశ్చాస్తం నయతిచ సత్యేచ ప్రతి తిష్ఠతి॥ 46 ॥

భూమి కన్న బరువయింది-తల్లి
ఆకసంకన్న ఉన్నతుడు-తండ్రి
గాలికన్న వేగమున్నది-మనస్సు
గడ్డికన్న దట్టమయింది-చింత
నిద్రలో కన్నులు ముయ్యనివి-చేపలు
పుట్టి చేతనత్వం లేనిది-గ్రుడ్డు
రూపముండి హృదయంలేనిది-రాయి
వ్యవసాయదారునికి ముఖ్యం-వర్షం
సుఖాల్లో గొప్పది-సంతోషం
ధర్మాల్లో గొప్పది-అహింస
దేనిని నిగ్రహిస్తే సంతోషం-మనస్సును
లోకాన్ని కప్పిఉంది-అజ్ఞానం
ఎవడు చచ్చిన వానితో సమానం-దరిద్రుడు
చచ్చిన రాజ్యం-రాజులేనిది
లోకానికి ఆధారం-సత్పురుషులు
నీటికి ఆధారం-ఆకాశం
గెలవరాని శత్రువు-క్రోధం
నశించనిరోగం-లోభం
ఏది శోకం—అజ్ఞానం
ఏది ధైర్యం-ఇంద్రియనిగ్రహం
స్నానమనగా ఏమి-మనోమాలిన్యం వదలడం
దానమనగా ఏమి-సర్వప్రాణి రక్షణ
ఎవడు పండితుడు-ధర్మంతెలిసినవాడు
వేగం వల్ల పెరిగేది-ఏరు
పరదేశంలో స్నేహితుడు-విద్య
ఇంటిలో స్నేహితుడు-భార్య
మనుష్యుని ఆత్మ-కొడుకు
దైవికమయిన చుట్టం—భార్య
ధనాల్లో గొప్పది-శాస్త్రజ్ఞానం

లాభాల్లో గొప్పది-ఆరోగ్యం
పెద్ద విత్తనాల పాత్ర-భూమి
సర్వభూతాలకు అతిథి-అగ్ని
సనాతన ధర్మం-హోమం
ఏది అమృతం-చంద్రుడు
ప్రపంచమంత ఉండేది-గాలి
ఎవడు నాస్తికుడు-మూర్ఖుడు
ఎవడు మూర్ఖుడు-నాస్తికుడు
ఏది కామం-సంసార హేతువైంది
ఏది అహంకారం-అజ్ఞానం
ధర్మార్థకామాల కలయిక-భార్యలో

మంచిగా మాట్లాడేవానికి దొరికేవారు-స్నేహితులు
ఏది ఆశ్చర్యం-చావులు చూసికూడా స్థిరమనుకోవడం
ఏది మార్గం-పెద్దలు నడిచింది

కులమా! ప్రవర్తనా! వేదాలు చదువడమా!
శాస్త్రజ్ఞానమా! ఏది బ్రాహ్మణత్వమిస్తుంది?

[కులంకాదు, వేదాలు చదవడంకాదు, శాస్త్రజ్ఞానంకాదు, ప్రవర్తనే బ్రాహ్మణత్వమిస్తుంది. నాలుగు వేదాలు చదివినా మంచి ప్రవర్తనలేని బ్రాహ్మణుడు నీచుడే]

ఏది వార్త !

[భూమి పాత్ర, ఆకాశము మూత, పగలురాత్రి కట్టెలు, సూర్యుడు అగ్ని, మాసాలు ఋతువులుతెడ్లు వీటితో కాలం ప్రాణికోటిని వండుతున్నది; ఇదేవార్త]

వందలాదిగా ఇటువంటి ప్రశ్నోత్తరాల్ని మాసిన పిదప సర్వప్రపంచిక వాఙ్మయానికి బీజభూతాలివే అనిపిస్తాయి. నాటి ధర్మజుని ప్రజ్ఞా ప్రాభవానికివి లద్దంపట్టాయి. కనుకనే ధార్మిక చింతనాలంబితాలైన పౌరుషపు కథల్ని, అన్య

ప్రహేళికల్ని, యక్షప్రశ్నలనీ, యుక్తి ప్రశ్నలనీ, చిత్ర ప్రశ్నలనీ, పిలవడం సమంజసం, సముచితం అనక తప్పదు.

## 1-3-12 : వేసే కథలు-విప్పే కథలు

పొడుపులు వేసే కథలు, విడుపులు విప్పే కథలు. ఈ పదాలెక్కువగా వ్యవహారంలో లేకున్నా వేసేకథ-విప్పేకథ అనేమాటలు పాటల్లో కనిపిస్తున్నాయి.

## 1-3-13 : అడ్డుకత

అనంతపురం జిల్లాలోని కొన్ని ప్రాంతాల్లో ఈ పదంవ్యవహారంలో ఉంది. అయితే ఇది 'ఒడ్డుకత' అనేపదమే. ఉచ్చారణలో ఆ విధంగా వినిపిస్తుంది గాని అడ్డుకత అనేది ప్రత్యేకంగా లేనట్లే చెప్పాలి. అడ్డుకత అడ్డకత అనే రూపా లున్నాయని, తర్కించుకోడంలో అడ్డుతగిలే కారణాన దీనికీపేరు వచ్చి ఉంటుందని శ్రీ జి. ఎస్. మోహన్ అంటున్నారు. "పైకి కనిపించు సమాధానమునకు అడ్డుగా భిన్నముగా మఱియొక సమాధానము వచ్చుటవలన గాని సమాధానమును తర్కించు కొనుటలో అడ్డుతగులుచుండుట వలన గాని ఇది అడ్డకత, అడ్డుకత అయియుండ వచ్చును."[1]

అడ్డం దిడ్డం ఆరుకాళ్లది-(ఈగ)

అడ్డం దిడ్డం కాళ్ళువేసేది, పనికి ఆటంకం కలిగించేది అయినా ఆలోచింప జేసేదే. అడ్డుకత కూడా ఆలోచింప జేసేదే అయినందువల్ల కొందరు దీనిని వ్యవ హరిస్తున్నారని భావించడానికి ఆస్కారముంది.

## 1-3-14 : ఒడ్డుకథ

కర్ణాటకలోని కోలారు మండలంలో ఒడ్డుకత అని వ్యవహరిస్తుంటారు. కన్నడ మందలి 'ఒడ్డుకతె' (ఒడ్డునట్టికత) నుండి ఇది వచ్చి ఉంటుంది.[1] ఒడ్డు పదానికున్న అర్థాల్లో "ఏయు వ్యూహము, పందెము" అనే పదాలు గుర్తించ దగ్గవి

1. జానపద విజ్ఞాన వ్యాసావళి-పుట : 79.

పొడుపు కథ వేయబడేది. పొడుపు కథలో వ్యూహానికున్న గుణాలున్నాయి. పందేలు గట్టి పొడుపు కథలు ప్రయోగించుకొన్న కాలముంది. అందువల్ల పొడుపు కథకు సమానార్థకంగా కొందరు 'ఒడ్డుకత' అని వ్యవహరించడం సముచితమే.

ఇంత వరకు తెలుగు పొడుపు కథకు పర్యాయ పదాలుగా వ్యవహారంలో ఉన్న, వ్యవహారంలో ఉంటున్న పొడుపుకథ, విడుపు, తట్టు, మారుతట్టు. మారు కథ, శాస్త్రాలు, సమస్యలు (సమిచ్చలు), చిటుకులు, చిట్కాలు, చిక్కుముళ్ళు, యక్షప్రశ్నలు, వేసే కథలు-విప్పేకధలు, అడ్డుకథ, ఒడ్డుకథ, మొదలైన పదాలు పరిశీలించడం జరిగింది. ఇక అన్య భారతీయ భాషల్లో పొడుపు కధకు సమానార్థకాలైన కొన్ని పదాల్ని గమనిద్దాం.

సంస్కృతం : ప్రహేళిక, ప్రవల్హిక, ప్రశ్న, ప్రత్యుత్తర కూట, బ్రహ్మోదయ, వివాద, సమస్యా గూఢ, హృదయాలిక.

ప్రాకృతం ; పహేలి, హియాలియా,

కన్నడం : ఒగటుసేక వగటు, ఒంటు, ఒడగతె, ఒడకతె ఒడ్డకతె, ఒగణు.

తమిళం : విడికతై, విడుకతై, పుడుర్,

మలయాళం : విడికద, కటకద, కటం కథ.

హింది : పహెలీ, బుజోవల్, ఖుర్ ఖులైయా, ముకరియా.

మరాఠి : ఉఖాణా, ఆహణా, ఉమణా, కోహడా, కులంగాదె, కోడే, బయాణా.

బెంగాలి : పహేలీ, దాంథా, పెయ్.

గుజరాతి : ఉఖాణో, ఉఖాతచా, కొహ్యడో, అబియాణు, కోడు

సింధి : ఉఖాణీ

పంజాబి : పహేలి, భుజాత్.

బీహారి ; బాహా, పహేలీ.

ఉర్దు : పహేలీ, చుట్ కులే.

ఈ పై భాషలన్నింటిలోనూ చిన్నవో పెద్దవో పొడుపు కథా సంకలన గ్రంథాలు వెల్వడ్డాయి. కన్నడం తదితర భాషల్లో పొడుపు కథలపై ప్రత్యేక కృషి జరిగింది. పొడుపు కథా లక్షణాల్ని నిర్వచించడంలో అనేకులనేక రకాలైన అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. అవన్నీ సమీకరించే ప్రయత్నం చేస్తాను.

## 1-4 : పొడుపుకథా లక్షణాలు

నాలుగుకాళ్లు, రెండు కళ్లు, రెండు చెవులు, రెండు కొమ్ములు, ఒకతోక, ఒక మూతి, గంగడోలు, దీర్ఘదేహం, సాధు స్వభావం గలది ఆవు అని చెప్పడం ఒక లక్షణం ఇందులో. గంగడోలు అనే పదం లేదను కొందాం. అది ఆవు కాదు, బఱ్ఱెకావచ్చు, ఎద్దు కావచ్చు, ఏ పశువైన కానచ్చు. కాళ్లలో, కళ్లలో, చెవులలో, కొమ్ములలో ఒకటో రెండో లేవను కొందాం. అయినా అది ఆవే అవుతుంది. ఒకటి లేకున్నా ఆవు కాకపోవడం, కొన్ని లేకున్నా ఆవే అవడంలోని అంతరార్థ మేంటి? అదే లక్షణంలోని రహస్యం. ఆ లక్షణంలో అన్నిటితో పాటు జీవభూత మైన ఒకానొక విషయముంటుంది. అది లోపించకుండ చెప్పడం లక్షణకర్త ధర్మం. అది లోపిస్తే ఆ వెలితి కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది.

అయితే ఒక వస్తువుపై, ఒక విషయంపై వారి వారి దృక్పథాల ననుసరించి వారి వారికి లభించిన సమాచారాన్ని బట్టి దేశ కాలపరిస్థితుల్ని బట్టి లక్షణాలు నిర్మితమవుతాయి. ఆయా లక్షణాల్ని పరిశీలించేప్పుడు విమర్శకునికి ఈ దృష్టి ఉండాలి,

తెలుగు పొడుపు కథలపై జరిగిన కృషి తక్కువదే అయినా లక్షణ నిర్మాణం జరుగకపోలేదు మొదట సంస్కృతాలంకారికుల లక్షణాలనిచ్చి, ఆ పిదప పాశ్చాత్యుల నిర్వచనాలనిచ్చి ఆంధ్రేతరుల అభిప్రాయాల్ని కూడా వెలి బుచ్చి, తెలుగు పొడుపుకథా లక్షణ కర్తల ఉద్దేశ్యాల్ని తెలిపి సమన్వయం సాధించడానికి ప్రయత్నం చేస్తాను.

### 1-4-1 : సంస్కృతాలంకారికులు

ప్రాచీనాలంకారికుల్లో ప్రాతఃస్మరణీయుడు భామహుడు; యమకంలో గూఢార్థ పదసంయోజనముంటే అది ప్రహేళిక అవుతుందన్నాడు.

శ్లో॥ నానాధాత్వర్థ గంభీరా యమక వ్యపదేశినీ ।
ప్రహేలికా సాపహ్యుదితా రామశర్మాచ్యుతోదయే॥

శ్లో॥ కావ్యాన్యపి యదీమాని వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్
ఉత్సవః సుధీయామేవ హన్తదుర్మేధ సోహతాః॥[1]

అనేక విధాల (అప్రసిద్ధ) ధాతువుల ప్రయోగం వల్ల గూఢార్థ మేర్పడి కేవలం యమకనే పేరున్నది ప్రహేళిక. ఇటువంటివి రామశర్మ రచించిన అచ్యుతోత్తరంలో ఉన్నాయి. అప్రసిద్ధ ధాత్వాదుల్ని ప్రయోగించి రచించిన వర్ణాద్యావృత్తి యుక్త రచనలు పేరుకే యమకాలు గాని ప్రహేళికలనే అర్థం. ఈ కావ్యాలు కూడా శాస్త్రాలవలెనే వ్యాఖ్యా సహాయం చేత అర్థం చేసుకోదగినవైనట్లయితే పండితుల కానందం కలుగుతుందిగాని సామాన్యులు హతాశులు కావలసిందే కదా అని భామహుని అభిప్రాయం. అందరికి అర్థమయ్యేట్లు కావ్యాలు వ్రాయాలని చెబుతున్నా "అప్రసిద్ధ ధాత్వాదుల్ని ప్రయోగించి గూఢార్థాన్ని నిక్షేపించినట్లయితే అవి ప్రహేళిక" అని చెప్పినట్లయింది.

భావాది నిగూఢత ఉన్నది ప్రహేళిక అనిఅజ్ఞాత లక్షణ కర్తల అభిప్రాయం.

శ్లో॥ వ్యక్తీకృత్య కమప్యర్థం స్వరూపార్థస్య గోపనాత్।
యత్ర బాహ్యాభ్యంత రావర్థౌ కధ్యేతే సాప్రహేలికా॥[2]
'ప్రహేలికా సాస్యాత్ వచస్సంవృతికారియత్'[3]

వీటిని పలువురు వ్యాఖ్యాతలు పేర్కొన్నందు వల్ల ఇవి ఎవరి నిర్వచనాలో స్పష్టంగా తెలియదు. ఏదో ఒక అర్థాన్ని వ్యక్తీకరించి స్వరూపార్థాన్ని (సంకేతితార్థాన్ని) దాచి యెక్కడ బాహ్యాభ్యంతరార్థాలు చప్పబడుతాయో అవి ప్రహేళిక. చెప్పదగిన విషయం కప్పబడి ఉండడమే ప్రహేళిక అని చెప్పవచ్చు.

'ప్రహేళయతి అభిప్రాయం సూచయతీతి ప్రహేళికా[4] అని గురుబాల ప్రబోధికాకారుని వ్యుత్పత్తి. అభిప్రాయాన్ని సూచించేదే ప్రహేళిక.

---

1. కావ్యాలంకారః-ద్వి. ప: 19, 20.
2, 3, 4. ప్రహేళికలు, ప్ర. అనుసంహిత. పు : 7.

ప్రపల్హికా ప్రశ్నదూతీ'[1] అని శబ్ద రత్నావళికారుని అభిప్రాయం, ప్రపల్హికా అంటే ప్రశ్న సందేశాన్ని తీసుకొనివెళ్ళే దూతిక.

'ప్రహిలతి అభిప్రాయం సూచయతీతి ప్రహేలికా'[2] అని శబ్దకల్పద్రుమ కారుడన్నాడు. అభిప్రాయాన్ని సూచించేది ప్రహేళికా'[3] 'హిలభావకరణే' అను ధాతువు నుండి 'హిలతి' రూపం సిద్ధిస్తుంది. ఇటువంటిదే మరో నిర్వచనం ఉన్నా కొంత స్పష్టంగా ఉంది.

'ప్రహేళయతి సూచయతి భావం నతుస్వరూపార్థమ్ ఇతి ప్రహేళికా"[4] అర్థ స్వరూపాన్ని తెలుపక భావాన్ని మాత్రమే సూచించేది ప్రహేళిక.

శ్లో॥ రసస్య పరిపంథిత్వాత్ నాలంకారః ప్రహేళికా ।
ఉక్తి వైచిత్ర్య మాత్రం సాచ్యుత దత్తాక్షరాదికా ॥[5]

రసవిరోధిని అయినందువల్ల ప్రహేళిక అలంకారంకాదు ఉక్తి వైచిత్ర్య మాత్రం ప్రహేళిక అనబడుతుంది. ఇది చ్యుతదత్తాక్షరాది రూపంలో ఉంటుంది. ఇక కావ్యానుశాసనకర్తయో ప్రహేళికను చిత్రకవిత్వం సరసన చేర్చాడు.

'స్వరవ్యంజన స్థానగతాకార నియమచ్యుత గూఢాది చిత్రం'.... గూఢాది త్యాది పదేన ప్రశ్నోత్తర ప్రహేళికా దుర్వాచకాది పరిగ్రహః[6] - ఏకద్వ్యాది స్వరచిత్రం, ఏకద్వ్యాది వ్యంజన చిత్రం, ఏకవ్యదిస్థాన చిత్రం, గతి చిత్రం, ఆకారనియమ చిత్రం, మాత్రాదిచ్యుత చిత్రం, క్రియాది గూఢం, ప్రశ్నోత్తరం ప్రహేళిక, దుర్వాచకం మొదలైనవి గ్రహించాలి హేమచంద్రుని ఈ అభిప్రాయం వల్ల ప్రహేళికకు చిత్రకవిత్వానికి భేదంలేదని తెలుస్తుంది.

---

1, 2. ప్రహేళికలు-ప్ర. అనుసంహిత పు : 7.
3. సిద్ధాంతకౌముది-తు. ప్రపు : 360
4. పొడుపు కధలు-పు : 62
5. సాహిత్య దర్పణమ్-పు : 471
6. కావ్యానుశాసనమ్ పు : 257 పు : 372

సాహిత్య దర్పణ వ్యాఖ్యానంలోని ఉదాహృత చతుష్షష్టి కళల్లో ప్రహేళిక కూడా ఉంది.[1] ప్రహేళిక ఒక కళగా గుర్తించడం గమనించదగింది.

దండి లక్షణాల్ని తెలుపక కేవలం ఉపయోగాల్ని మాత్రమే తెలుపడంవల్ల నాటి కాలానికే ప్రహేళిక బహుళ ప్రచారాన్ని పొందినట్లు తెలుస్తుంది. మొత్తం మీద సంస్కృతాలంకారికుల మతం ప్రకారంగా గూఢార్థం కలది, భావాది నిగూఢత ఉన్నది, అభిప్రాయం సూచించేది, అర్థ స్వరూపం తెలుపక భావాన్ని మాత్రమే సూచించేది, రసానికి శత్రువయింది, ఉక్తివైచిత్రి గలది, చిత్ర కవిత్వాంశ ఉన్నది, కళాత్మకమయింది ప్రహేళిక అని తెలుస్తోంది. ఇక పాశ్చాత్యుల నిర్వచనాల్ని గమనిద్దాం.

## 1-4-2 : పాశ్చాత్యులు

పొడుపుకథను ఆంగ్లంలో రిడిల్ (Riddle) అంటారు. "రిడిల్ అనేది ఒక రకంగా ప్రశ్నే; కాని మామూలు ప్రశ్నకాదు, జటిలమైన ప్రశ్న; ఉద్దేశ పూర్వకంగా సంక్లిష్టం చేయబడ్డ ప్రశ్నావిశేషం."[2] మరొక నిర్వచనమిలా ఉంది.

"పొడుపుకథ ఉద్దేశపూరితమైన ద్వంద్వార్థం లేక గుప్తార్థాన్ని కలిగిందై మరొకరిచేత అట్టి అర్థం కనుగోవడానికై నిర్మితమైన ఒక వాక్యం లేక వాక్య సంపుటి అనవచ్చు. ఉద్దేశింపబడ్డ అర్థాన్ని గోప్యంగా ఉంచే బాహ్యార్థాన్ని సూచించునట్టి వాక్యంగానైనా, లేదా దానికి సరియైనట్టి ఆశించిన సమాధానానికి నేరుగా సూచనం చేయని పదజాలంతో నిండిన ప్రశ్నారూపకంగానైనా ఈ పొడుపు కథ ఉండవచ్చు"[3]

---

1. సాహిత్య దర్పణమ్-3. ప-పు : 111.
2. Encyclopaedia Britannica - Vol. 19

A word used to describe many kinds of enigmatic questions and intentionally ambiguous statemente requiring an answer.

3. Encyclopaedia Americana-Vol. 23, P : 510

ఒక ఆంగ్ల నిఘంటువిలా నిర్వచిస్తుంది. "సమాధానం, అర్థం లేదా సందర్భం కనుగోడానికి విప్పేవారి తెలివితేటల్ని పరీక్షించడానికై నిర్మించబడ్డ ప్రశ్న లేదా ప్రకటనం లేదా వర్ణనం పొడుపుకథ అనబడుతుంది."[1]

రిడిల్ (Riddle) పజిల్ (Puzzle) ఎనిగ్మా (Enigma) కనన్డ్రమ్ (Conundrum) అనేవి ఆంగ్లంలో పొడుపు కథకు పర్యాయపదాలుగా వాడుతున్నారు. ఇవి తికమక కల్పించేవే అయినా పరిష్కార సాధ్యాలయిన విషయాలనే ప్రకటిస్తాయి.

ఉద్దేశ పూర్వకంగానే అస్పష్టంగా కల్పితమయింది, ఊహ వల్ల మాత్రమే సరియైన సమాధానం గుర్తించడానికి వీలయింది 'రిడిల్'. మేధను సందేహంలో పెట్టేట్టి చిక్కు ప్రశ్న పజిల్‌గా పరిగణింపబడుతుంది. ధ్వన్యాత్మకమై గుప్తార్థం కలిగిన చిక్కు సమస్య 'ఎనిగ్మా'గా వాడబడుతుంది. పదాల గారడి ద్వారా చమత్కారం సాధింపబడ్డట్లయితే అది 'కనన్డ్రం' అని పిలువబడుతుంది. ఎనిగ్మా ప్రాచీనమయింది; సహజమయింది, రసవంతమైందికాగా కనన్డ్రం అర్వాచీనమయింది, కృత్రిమ మయింది, పదవైచిత్రీ ప్రదర్శకమయింది.

ప్రక్రియ పెరిగినకొద్దీ పేర్లు పెరగడం సూక్ష్మాతి సూక్ష్మపరిశీలన జరగడం అన్ని భాషల్లోనూ సహజమే. ఎన్ని పేర్లున్నా ఇంగ్లీషులోని రిడిల్, పొడుపుకథకు సమానార్థకమైన పదం. రిడిల్‌కు మూలం Raedam అనేఆంగ్లోశాగ్జన్ పద ధాతువు. దీనికి సలహా ఇచ్చు-వ్యాఖ్యానంచేయు (to give advice-to interpret) అనే అర్థాలున్నాయి.

---

Riddle any sentence or composition with an internally double or veiled meaning, which is propounded for another to discover the meaning. A riddle may either have an apparent sense which serves as a disguise to the real one, or it may be in the form of a question, the terms of which do not directly indicate the nature of the answer required.

1. The concise oxford Dictionary-P : 1072.

నేరుగా సమాధానం తెలియని వాని తెలివితేటలు పరీక్షించడానికిగాని, లేక వానిని తికమక పెట్టడానికిగాని కల్పింపబడే ప్రశ్నలు పొడుపుకథలు"[1] రోజర్ డి. అబ్రహమ్స్, అలెన్ డండస్ (Roger D. Abrahams, Alan Dundes) నిర్వచనమిది. "నేరుగా సమాధానం తెలియనివాని తెలివితేటలు" అనే పదాలు గమనించదగ్గవి'. అసలు సిసలైన సమాధానానికి ముసుగు వేయడమే పొడుపుకథ అనే అభిప్రాయం కూడా ఉంది.

"పొడుపుకథ నిజమైన సమాధానానికి మారుముసుగు వేసే బాహ్యార్థాన్ని కలిగి ఉంటుంది; లేకపోతే తగిన సమాధానం నైజాన్ని వక్రోక్తిగ సూచించే పదజాలంతో నిర్మితమైన ప్రశ్నా రూపంగానైనా ఉండవచ్చు"[2]

అరిస్టాటిల్ పొడుపుకథను రూపకాల మాలగా పేర్కొన్నాడు. రూపకాలంకారయుతాలైనందు వల్లనే అని ప్రముఖ స్థానాన్ని పొందగలిగాయనే అభిప్రాయం గమనార్హం.[3] అమెరికా జానపద విజ్ఞానమనే గ్రంథంలో పొడుపు కథకు చెప్పిన ఈ పంచ లక్షణాలు పరిశీలనార్హాలు.

---

1. Folk lore and folk life - p : 130

Riddles are questions that are framed with the purpose of confnsing or testing the wits of those who donot know the answer.

2. The new Populer encyclopaedi a p : 112

A Riddle may either have an apparent sense weich serves as a disguise to the real one, or it may be in the forme of a question, the terms of which donot directly indicate the nature of the answer reqnired.

3. Standard Dictionary-pp : 938-939.

"సూత్రప్రాయమైన ఆరంభాంశం
వర్ణింప వలసిన విషయాన్ని నామకరణ మొనర్చడం
ఆ విషయాన్ని గూర్చిన వర్ణనాత్మక కథనం
అదే విషయాన్ని గూర్చి తప్పుత్రోవ పట్టించే కథనం
సూత్ర ప్రాయమైన ముగింపు

నిజమైన పొడుపుకథ పై అంశాల్లో అన్నింటిని కలిగిందైనా, కొన్ని లోపించిందైనా తన సహజ లక్షణాన్ని మాత్రం కోల్పోదు."[1]

జానపద విజ్ఞాన వ్యాసావళిలో డా॥ జి. యస్. మోహన్ ఉదహరించిన పాశ్చాత్యుల నిర్వచనాల్లోని కొన్నింటిని గమనిద్దాం.

"పొడుపుకథ ప్రశ్నరూపమున ప్రత్యక్షముగనో పరోక్షముగనో సంపూర్తిగనో అసంపూర్తిగనో సంప్రదాయబద్ధముగ నుండును. ఇది సాధారణముగ అసంభవముగను, పరస్పర విరుద్ధముగను కన్పించును. కాని, ఒక విశిష్టమైన దృష్టితో చూచినప్పుడు అది కేవలం సత్యమునే వెల్లడించును. పొడుపుకథాకారుడు శ్రోతను పొడుపు కథలోని యాథార్థ్యమును, ఐక్యమును సత్యమును గుర్తించుమని సవాలు చేయును."[2] "పొడుపుకథ ఊహచే పరిష్కరింపబడెడు, లిక మక పట్టించెడు లేక సందిగ్ధమైన ఒక ప్రశ్నకు అన్వయించెడి ఒక సమస్యాత్మక వాక్యము."[3] "ఆలంకారికముగా పొడుపుకథ రూపమునకు సన్నిహితముగా

---

1. An opening formula, Naming of the subject tobe described, A descriptive statement about the subject, A misleading statement about the same subject, A closing formula.

A true riddle is a true riddle whether it does or doesnot contain all the five elements.

American Folk lore - p : 232.

2. "Ridder : Do it-yourself" willian Jansen, American Folk lore Ed : Tristran coffin.

3. Encyclopaedia of Religion and Ethics - p : 765.

నుండును. నిజమునకు దానిని రూపకాలంకారముగా గాని, రూపకాలంకారముల సమూహముగా గాని నిర్వచింపవచ్చును. అవి సామాన్య వ్యవహారముననుండును. అంతేగాక వాని ప్రాధాన్యము స్పష్టముగాదు."[1]

కొద్ది మార్పులతో ఉన్న ఇటువంటి నిర్వచనాలు మరెన్ని కనిపిస్తున్నాయి. అవన్నీ ఉదాహరించడం వల్ల గ్రంథం పెరగడం తప్ప ప్రయోజనం శూన్యం. మొత్తంమీద పాశ్చాత్యుల నిర్వచనాల సారాంశం ఇది. పొడుపుకథ జటిలప్రశ్న. ఉద్దేశ్య పూర్వకంగా కల్పింపబడింది. ఉద్దిష్టార్థం దాని బాహ్యార్థం సూచిస్తుంది. ఎదుటివాణ్ని పరీక్షింపదలచి, తికమక పెట్టదలచి, సృష్టింపబడేది. నిజాన్ని మరుగుపుచ్చు వక్రోక్తి గలిగిఉండేది సూత్రప్రాయమైన ఆరంభం ముగింపు ఉన్నది. తప్పుత్రోవ పట్టించే కథనమున్నది. సంప్రదాయబద్ధమై ఉంటుంది. రూపకానికి సన్నిహితంగా ఉంటుంది.

## 1-4-3 : ఆంధ్రేతరులు

తెలుగువారి నిర్వచనాల్ని తెలుసుకోడానికి పూర్వం కొంత మంది ఆంధ్రేతరులేమన్నారో గమనిద్దాం. "వ్యాఖ్యాన సాపేక్షమైన గూఢోక్తి పొడుపు కథ"[2] అని కన్నడ జానపద సాహిత్య వేత్త శ్రీ జీ. శం. పరమ శివయ్య అభిప్రాయం. "సాంకేతిక ప్రధాన లక్షణమర్థగోపనం"[3] అని నమ్మ ఒగటుగళు ప్రస్తావనలో కన్నడ సాహిత్యవేత్త శ్రీ రాగౌ తెలిపారు. వారే మరికొన్ని నిర్వచనాలు చెప్పారు.

"పొడుపు కథ ప్రయత్న పూర్వకమైన సృష్టి, ప్రజ్ఞా పూర్వకమైన సాహిత్య ప్రక్రియ . వాస్తవమైన అర్థాన్ని దాచి పేట్టే వ్యాఖ్య అనుమానం చేత అర్థాన్వేషణానికి బయలు దేరడానికై ప్రేరేపించే సందిగ్ధ ప్రాసబద్ధ రచన, వెనువెంటనే కారణం ఈయలేని సమస్య.[4]" ఉత్తర కర్ణాటక ఒగటు గళు

1. Encycloyaedia of Religion and ethics - p : 765.
2. కన్నడ ఒగటుగళు మున్నుడి పు : 60
3. తెలుగు కన్నడ జానపద గేయాలు పు : 141
4. నమ్మ ఒగటుగళు పు : 9.

మున్నుడిలో ఈ నిర్వచనముంది. "ఉక్తి చమత్కారము కలిగిన పొడుపు కథలలో ప్రస్తుత అప్రస్తుతాంశములు రెండును స్థానమాత్రమించును కాని అప్రస్తుతమైన ఆధారముచే ప్రస్తుతాంశమును గుర్తింప వలసి యుండును"[1] హిందీ సాహిత్యవేత్త శ్రీ దయాశంకర్ శుక్ల "పొడుపుకథ ఒక వస్తువర్ణనమనీ, అప్రకృతం ద్వారా ప్రకృత వస్తు సంకేతం చేయబడుతుందని"[2] అంటున్నారు. హిందీ శబ్ద సాగరం కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేసింది.[3]

ఇక పొడుపు కథలపై, జానపద సాహిత్యం పై కృషి చేసిన ఆంధ్ర పరిశోధకుల అభిప్రాయాల్ని గమనిద్దాం.

## 1-4-4 : ఆంధ్రులు

సంస్కృతాలంకారికులు. పాశ్చాత్యులు, ఆంధ్రేతరులు మొదలైన వారి అభిప్రాయాల్ని గుర్తించి, లేదా పొడుపు కథా ధర్మాన్నెరిగి లక్షణాలు చెప్పిన ఆంధ్ర రచయితలు కొద్ది మందే అయినా వారి వారి రచనల పరిధుల్ని బట్టి సముచిత-సమగ్ర నిర్వచనాలందించారు.

"పొడుచుట విప్పుటలో ఆనందమును వెల్లి విరియించునవి పొడుపు కథలు"[4] అని శ్రీ నేదునూరి గంగాధరం అభిప్రాయం. "పొడుపు కథ అంటే నా ఉద్దేశంలో ప్రశ్నాత్మకమైన కవిత్వం, లేదా కవిత్వ రూపంలో ఉన్న నోటి లెక్క ... పొడుపు కథలు చిక్కని కవిత్వంతో తొణికిస లాడుతుంటాయి"[5] అని డా॥ శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు తెలిపారు. డా॥ శ్రీ ఆర్వీయస్ సుందరం ఇచ్చిన నిర్వచనాలు గమనించదగ్గవి "గంభీరంగా

---

1. జానపద విజ్ఞాన వ్యాసావళి పు : 82
2. చత్తీస్ గడీలోక్ సాహిత్యకా అధ్యయన్ పు : 326.
3. హిందీ శబ్దసాగర్ పు: 591
4. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి-పు : 243
5. రాయలసీమ మాటు కథలు, వ్యాసము, భారతి, జనవరి-1968

ఉండడం పొడుపు కథల ప్రధాన లక్షణాలలో ఒకటిగా పేర్కొనవచ్చు........ జీవితమే ఆకరంగా, జీవితంలో సమస్యల్ని విడగొట్టడానికి మనిషి చేసే ప్రయత్నమే ప్రేరణగా, ఎదుటి వాడి బుద్ధి కుశలతకు ఒక పరీక్షగా అవతరించినవే పొడుపు కథలు... రూపకమై ఉండడం పొడుపుకథ ప్రధాన లక్షణాలలో ఒకటి. కేవలం వాగాడంబరమై ఉండకుండా పొడుపుకథ ఏదో ఒక వస్తువుకు గాని, వ్యక్తికిగాని సంకేతంగా ఉంటుంది..... చాతుర్యంతో కూడిన, కళాత్మకమైన లయాత్మకమైన సంక్షిప్త గూఢోక్తి పొడుపుకథ. ఇది బుద్ధికి కసరత్తు కలిగిస్తుంది. ప్రాక్తన మానవుని బౌద్ధిక సృష్టి పొడుపు కథ"[1]

"చిత్ర కవితా ప్రక్రియను చెందినదే ప్రహేళిక"[2] అని శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి అంటున్నారు. "పొడుపు కథ అనేది ఒక సమస్య లేక ప్రశ్న మాదిరి వుంటుంది."[3] అని శ్రీ కంభం సిద్ధారెడ్డి అభిప్రాయం. "సామాన్యంగా పొడుపు కథలు కేవలం శబ్ద చమత్కార సమస్యలుగా భావించబడటం వుంది.... లక్ష్యార్థ (మెటాఫరికల్ మీనింగ్) ప్రాధాన్యం కల్గి వ్యంగ్య రామణీయకంగా వుంటాయి . ఆలంకారికత చాలా ప్రధానం .."[4] అని డా॥ శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద శ్రీ బి. నారాయణ గారలు వ్యాఖ్యానించారు. డా॥ శ్రీ జి. యస్. మోహన్ అభిప్రాయాలిట్లున్నాయి. "పొడుపు కథలు జానపద విజ్ఞానానికి సంబంధించిన ఒక వినోదాత్మక ప్రక్రియ .. ఊహచే సమాధానమును వెదకి వినోద ఆశ్చర్యములతో పాటు గూఢార్థమును వెలువరించెడి, సవాలు చేసెడి ప్రశ్నార్థక రూపకాతిశయోక్తి ప్రక్రియ పొడుపుకథ"[5] "పొడుపుకథలలోని కవిత్వమును భావబంధకవిత్వముగా చెప్పుకొనవచ్చును. అర్థమునే మాత్రము చెప్పక దాని భావమును గుప్తముగా సూచించుట యన్నది తద్విధము లక్షణము"[6] అని

---

1. జానపద సాహిత్య స్వరూపం పుటలు : 77, 79 80, 82.
2. మెదడుకు పదునుబెట్టే ప్రహేళికా క్రీడ-వ్యాసము ఆంధ్రప్రభ దినపత్రిక 20-9-1978.
3. తెలుగులో పొడుపుకథలు-వ్యాసము-స్రవంతి, ఏప్రిల్ - 1979.
4. పొడుపుకథ-భాషాసాహిత్యదృష్టి. వ్యాసము, స్రవంతి, జనవరి - 1980.
5. జానపద విజ్ఞాన వ్యాసావళి-పుటలు : 78, 82.
6. పల్లె పదాలలో ప్రజాజీవనము-పు : 444.

డా॥ యెల్దండ రఘుమారెడ్డి అభిప్రాయం. శ్రీ జి. శంకరరావు తమ పొడుపు కథలు గ్రంథంలో సప్త లక్షణ సంభృతం పొడుపుకథ అన్నారు.

"1. సంక్షిప్తత : కొండంత భావాన్ని కొద్ది మాటలలో అందించడం దీని ముఖ్య లక్షణం.

2. నిగూఢత్వం : స్వరూప నిగూఢత్వం ఉంటుంది. అది అర్థ స్వరూపం భావస్వరూపం, విషయ స్వరూపం కావచ్చు. ఏదైనా స్వరూప నిగూఢత్వం ముఖ్యం.

3. అపార్థకల్పన : వేరొకటి అయి ఉంటుందేమో అని భ్రమ కల్పించే అపార్థకల్పన తప్పక ఉంటుంది.

4. వినోదాత్మకమైన క్రీడారూపంగా ఉంటుంది.
5. రేఖామాత్రమైన భావ స్ఫురణ ఉంటుంది.
6. రసస్ఫూర్తి కూడా ఉంటుంది.
7. సమస్యగా భాసించి పరిష్కారాన్ని కోరుతుంది"[2]

ఆంధ్ర పరిశోధకుల లక్షణాల్ని పరిశీలిస్తే తేలేపిండితార్థమిది. పొడుపు కథలకు ఆనందం కలిగించే గుణముంటుంది. కవిత్వ లక్షణాలుంటాయి. గంభీరంగా ఉంటుంది. బుద్ధి కుశలతను పెంచే గుణముంటుంది. రూపకాలంకార లక్షణాలుంటాయి. కళాత్మకమైన విలువలుంటాయి. లయాత్మకత ఉంటుంది. సంక్షిప్తత ఉంటుంది, నిగూఢత్వముంటుంది. చిత్రకవిత గుణాలుంటాయి. సమస్యాత్మకమై ఉండి పరిష్కారాన్ని ఆశిస్తుంది. శబ్ద చమత్కారముంటుంది. వ్యంగ్య రామణీయకముంటుంది. ఆలంకారిక ధర్మాలుంటాయి. విజ్ఞాన వినోదాత్మకమైన క్రీడా లక్షణాలుంటాయి. అతిశయోక్తులుంటాయి. అపార్ధ కల్పనలుంటాయి. భావస్ఫోరక గుణాలుంటాయి. రసాత్మకమైన శక్తి ఉంటుంది. ఇందులో ఒకటి రెండు ఒక దానిలో ఒకటి అంతర్భవించ వచ్చు, లేదా మరిన్ని ఇందులో చేర వచ్చు.

2. పొడుపుకథలు-పు : 8.

సంస్కృతాలంకారికులు చెప్పిన లక్షణాలను, పాశ్చాత్యుల నిర్వచనాలను, ఆంధ్రేతరుల అభిప్రాయాలను తెలుగువారి నిర్వచనాలను, తెలుగు పొడుపుకథా హృదయ ధర్మాన్ని అనుశీలించగా మొత్తంమీద ఈక్రింది లక్షణాలుండడం సముచితమనిపిస్తుంది.

## 1_5 : లక్షణనిర్దేశం

### 1-5-1 : సంక్షిప్తత

కొండ అద్దమందు కొంచెమై ఉంటుంది. మర్రి చెట్టంత మహాభావం మర్రి విత్తనమంత అక్షరంలో ఇమిడిపోతుంది. అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని నిక్షేపించే మహాకవులున్నారు. పొడుపు కథాకారుడు విశ్వవిశాల భావాన్ని కొసరి కొసరి కొంగుముడి గట్టాడు. సంక్షిప్తతలో సంపూర్ణత్వాన్ని దర్శింపజేసి మహాకవుల సరసన కూర్చొన్నాడు.

* కంచెల కత్తెద్దు (పేను)
* గుంతల గుండ్రాయి (కనుగ్రుడ్డు)
* సంకజాడిస్తే-సారెకుపిల్లలు (నుగుకట్టె)
* సిప్పెకు నీల్లల్ల-సీతమ్మ నీల్లాడె (వరివెన్ను)

ఈ పొడుపుకథల్లో వ్యర్థాక్షరమొక్కటి కూడా కనిపించదు. ఉన్న వాటిలో ఏ ఒక్క అక్షరం లోపించినా అర్థం చెడిపోతుంది సమగ్ర విషయాన్ని స్వల్పాక్షరాల్లో సంయోజించడం సంక్షిప్తత పదివేలకు పైె చిలుకున్న తెలుగు పొడుపు కథల్లో సగం కన్నమిన్నగా సంక్షిప్తతా లక్షణ లక్షితాలు.

### 1-5-2 : నిగూఢత

ఆకాశం నగ్నం; అయినా మేఘావరణం తప్పదు. భూమి నగ్నం; అయినా సేదలూ-వాదలూ, చెట్లు-చేమలు కప్పి ఉండడం తప్పదు ఇవి

తాత్కాలికంగా కనిపించే ముసుగులు. ప్రకృతి యేవిధంగా తనను తాను కప్పుకొంటుందో మనిషి అట్లే తన ఊహలకు తొడుగులు వేస్తున్నాడు. ఆ ఊహాలక్షరాలై, పదాలై, వాక్యాలై, పొడుపుకథలై సాక్షాత్కరించినప్పుడు అవే గూఢపదమైంది: గూఢార్థమయింది, గూఢ పదార్థమయింది.

* ఏదో మనవాడని ఊరకున్నాను. (దోమ)
ఈ వాక్యంలో పదం దాగి ఉంది
* గుట్టంత సెట్టు
గుమ్మంత పూత
సాపంత ఆకు (చెట్టు-పూత-ఆకు)

ఈ పొడుపుకథ ప్రతి పాదంలో అర్థం దాగి ఉంచి. గుట్టనిండ చెట్టనీ, గుమ్మినిండ పూతనీ, చాపకంతా ఆకనీ అర్థాలు.

* చన్నులేని ఆవుపాలు
చెయ్యిలేని వాడుపిండె
అగ్నిలేని పాలు కాగె
నోరులేని బాలతాగె (వాన)

ఇందులోని ప్రతి పాదంలో వరుసగా ఆకాశం, దేవుడు, ఎండ, భూమాత దాగి ఉన్నాయి. నిగూఢతలో కొంత అస్పష్టత ఉండకతప్పదు. పొడుపుకథలో చెప్పబడే విషయ స్వరూపం కొంత కప్పబడి ఉండడమే నిగూఢత. సర్వ ప్రహేళికా ప్రపంచంలో ఏదో ఒక రూపంలో నిగూడత ఉంది.

## 1-5-3 : అపార్థద్యోతకత

కొద్ది దూరంలో తుమ్మమొద్దుంది. అది ఎలుగ్గొడ్డని ఒకడు భ్రాంతి చెందాడు. అది ఒకటే కాగా ఇంకొకటిగా భావించే భ్రాంతి లోకంలో ఉంది. పొడుపుకథలట్లే శ్రోతలకు భ్రాంతి కలిగిస్తాయి. అవే అపార్థద్యోతకత. ఆ అపార్థద్యోతకత ద్వారా అపమార్గం పట్టించినా బుద్ధి సవ్యమార్గాన్ని తొక్కి అపమార్గాని కాటంకం కలిగిస్తుంది.

* అరలోపల తెరగట్టు కొని
తెరలోపల మంచ మేసుకొని
పరాయి దాని మొగుణ్ని పక్కలో వేసుకొని
తన మొగుడికి తాంబూలమిచ్చు (మగబిడ్డ గల బాలెంతరాలు)

ఇదేరా సాధ్యం. ఆమె ఎంత జాణ. ఛీ .... ఛీ అని పిస్తుంది ఆమె బాలెంత. అందువల్ల ప్రత్యేకంగా ఉండే యేర్పాటు చేస్తారు అరలో తెర చాటుగ కట్టారు. ఆ తెరలో మంచంపైన ఆమె ఉంది. పక్కలో పసివాడున్నాడు. వాడు మరోస్త్రీకి భర్త అయ్యే వాడే గద! పరాయి దాని మగడంటే ఆ పసి వాడే. పొడుపనే అపార్థమేఘం విడుపనే గాలి వల్ల ఎగిరి పోయింది.

* వస్తాడు-పరుస్తాడు
పిసుకుతాడు-పెడ్తాడు (గాజులు తొడగడం)

విడుపు తెలిసిన పిదపనే శృంగార పరమైన అపార్థం తొలగిపోతుంది. గాజులవాడు వచ్చి, చాపపరచి, చేతులు మెత్తగ చేసి గాజులు తొడుగుతాడు

* గుడి సుట్టు తిరిగి
గుళ్ళొచ్చవోసె (కొబ్బరికాయ)

హరి హరీ అని చెవులు మూసుకోడం తప్పదు. కొబ్బరికాయ గుడికి వస్తుంది. గుడిచుట్టు తిరుగుతుంది. దేవుని పాదాల దగ్గర పగులుతుంది వాస్తవ మొకటై ఉంటే మరొకటిగా భ్రమింప జేయడమే అపార్థ ద్యోతకత తెలుగు పొడుపుకథా సాహిత్యంలో ఇలా ఉద్దేశపూర్వకంగా నిర్మింపబడ్డవి కోకొల్లలు.

## 1-5-4 : కథాత్మకత

ఈ శీర్షికపై ఈ సిద్ధాంత గ్రంథంలో ఒక ప్రకరణమే ఉంది నాలుగైదు గీతల పొడుపుకథ వెనుక నయిబదిగీతలగాథ ఒకటుంటుంది. మొదట గాథ జరుగుతుంది. ఆ గాథకు కీలకమైన కేంద్ర బిందువొకటి యేర్పడుతుంది.

ఆ బిందువు గుర్తుచేసిన చాలు కథ మొత్తం గుర్తువస్తుంది.ఆ బిందువే పొడుపుకథ.

* మూడింటితో ముగిసె కథ (కట్టె-కొట్టె-తెచ్చె)

రామాయణ గాథను తెలిపే పొడుపుకథ ఇది. ఇటువంటివి పౌరాణికాలున్నాయి. చారిత్రకాలున్నాయి. అయినా సాంఘికాలు- కాల్పనికాల సంఖ్య అధికం. కేవల మొక్కటి మాత్రంచూద్దాం.

* ఒక ఇంటికి నాలుగు గనుమలు
నాలుగు గనుమల దగ్గర
అత్త, మామ, కొడుకు, కుక్క కావలి ఉన్నారు.
లోన కోడలున్నది
కోడలు కొకడలవాటు
వాడులోనికి వెళ్లాలి
తిరిగి వెళ్లి పోవాలి- ఎట్లా !

ఆ కోడలు కడు జాణ. తన ప్రియుని రాక గమనించింది. 'పుస్తె పోయిం' దని యేడ్చింది. 'అయ్యోచ్చుచ్చుచ్చు' అనీచింతించింది అత్త. ఆ శబ్దంవిన్న కుక్క తన స్థానాన్ని వీడి అత్త దగ్గరికి వెళ్లింది. ఆ ద్వారం గుండా ఆమె విటుడులోనికి వెళ్లాడు. ఆ కోడలతనితో సుఖించింది. అతడిక వెళ్లాలి. 'పుస్తె దొరికింది' అని [illegible]. 'సెబ్బాష్' అని సంతోషాన్ని వెలిబుచ్చింది అత్త. ఆమె కొడుకు పేరు సెబ్బాసు. తనను తల్లి పిలిచిందని అతడామె దగ్గరకు వెళ్లాడు. వెంటనే ఆ ద్వారం గుండా ఇంటికోడలి ప్రియుడు వెళ్లిపోయాడు.

ఇటువంటి పొడుపు కథలపై శుకసప్తతి, హంస వింశతి మొదలైన గ్రంథాల ప్రభావమున్నదనక తప్పదు. పల్లెల్లో ఇరవై సంవత్సరాల యువతీ యువకులు కూడా వీటిని పొడుచుకుంటున్నారు. ఇట్టి కథాత్మకాంధ్ర ప్రహేళికల్లో రస నిధులున్నాయి; ధ్వన్యాత్మకాలున్నాయి.

## 1-5-5 : కథారహితాత్మత

పొడుపుకథ అనేపేరు కథాత్మకాలైన వాటికే సరిగా వర్తిస్తుంది. లభించిన పొడుపు కథా సాహిత్యంలో కథారహితాలైన పొడుపులే అధికంగా ఉన్నాయి. పొడుపుకథలన్నీ కథారహితాలనే భావించడం ఇందు వల్లనే, ఒక ప్రాణిని గూర్చి గానీ, వస్తువును గూర్చిగానీ, లేదా ప్రకృతిలోని ఏదో ఒక విశేషాన్ని గూర్చిగానీ పొడుపుకథ ఉపమానం ద్వారా వాచ్యం చేస్తుంది. తదాధారంతో ఉపమేయమైన విడుపును సూచించాలి.

* పొద్దున లేస్తే
కర్రెపెట్టె బాయిలవడె (బొక్కెన)

* తెల్లటి భూమిల
నల్లటి ఇత్తనం
సేతేస్తరు-నోటేర్తరు (కాగితం-వ్రాత)

* కిటకిట తలుపులు
కిటారు తలుపులు
ఎప్పుడు తీసిన
చప్పుడు గావు (కన్నులు)

పొడుపులో విషయవర్ణనం, విడుపులో అర్థసూచనం కనిపిస్తుంది. పొడుపులోనూ విడుపులోనూ కథలేదు. కనుకనే కథా రహితాత్మత అనేది పొడుపుకథల్లో ఉన్నదనడం. పొడుపుకథల్లో కథలేక పోవడమే కథారహితాత్మత.

## 1-5-6 : ప్రతీకాత్మకత

ఒక వస్తువుకున్న రూపగుణ ధర్మాలు మరొక వస్తువులో ఉండడం ప్రకృతి నైజం. అప్పుడు ఒక వస్తువును మాత్రమే చెప్పడం జరుగుతుంది. తద్వారా రెండవ వస్తువు జ్ఞానం కలుగుతుంది. ఒక దానికి ప్రతిగా మరొకటి చెప్పడమే సంకేతించడం. ఆ సంకేతమే ప్రతీక. రూపకాలంకారం, రూపకాతిశయోక్తి ఇటువంటివే. పొడుపుకథా నిర్మాణానికి మూలం ప్రతీక.

* ఐక్కకుక్కకు-ఐండెడు పేగులు (మంచం)
* పుట్టెడు సెనిగల్లో
ఒకటే ఉసికరాయి (నక్షత్రాలు-చంద్రుడు)

ఐక్కకుక్క మంచానికి ప్రతీక. మంచం నవారుకు పేగులు ప్రతీక. నక్షత్రాలకు సెనిగలు ప్రతీక. చంద్రునికి రాయి ప్రతీక. ఇవే ఉపమానాలని పిలువబడుతున్నాయి. అలంకార ప్రకరణం చివర ప్రతీకల విషయం ముచ్చటించడం జరిగింది. పొడుపుకథా వాఙ్మయంలో ఉపమానాలన్నీ ప్రతీకలే అనాలి.

## 1-5-7 : ఘటనా విశిష్టత

చెరువుల్లో, సముద్రాల్లో అలలు పుడతాయి; చస్తాయి. మానవ జీవితంలో అనేక ఘటనలు జరుగుతాయి. కొన్ని గుర్తుంటాయి; కొన్ని గుర్తుండవు, గుర్తున్న వాటిలో కొన్ని అక్షర రూపం ధరిస్తాయి. అట్టి వాటిలో కొన్నిటికి పొడుపు కథా లక్షణాలుంటాయి. వాటిని జనం చెప్పుకొంటుంది.

* తల్లి కొడుకు ఓ ఊరికి పోతున్నారు,
దారిమధ్యలో నీళ్లు తాగబోయి తల్లి బావిలో పడ్డని
కొడుకు తీయవస్తే-
మీ నాయన పట్టని తాన పట్టి తీయమంది,
వాళ్ల నాయన
వాళ్ల అమ్మను పట్టని తావేది? (వెండిగోట్లు)

దారివెంబడి పోతున్నప్పుడు జరిగిన ఒకానొక ఘటన పొడుపుకథా రూపం ధరించింది. ప్రాచీన పౌరాణిక గాధల్లోని ఘట్టాలు కూడ ఇలాంటి పొడుపుకథల అవతారాలెత్తాయి.

* కోడి దొంగ పొద్దు పొడిచి
నేనే ఇంటాయనను అన్నాడు (ఇంద్రుడు)

ఇంద్రుని అహల్యా జారత్వం ఘటన 'ఇంటాయనను' లనడంగా మారడం తెలుగు జీవనాడికి లొంగడం. ఇది ఇంద్రుని జీవితంలో శాపంగా పరిణమించింది. ఇలాంటి సంఘటనలు జరగకూడదనే జానపద గృహిణి భావన.

* మొగులులేదు మోడంలేదు
వానవచ్చెగద పిలగా ఒన్నది (ఉమ్మి)

* ఉరుములేదు మెరుపులేదు
పిసుగువడెగదా పిల్ల (గడ్డు)

వీరిద్దరు బావామరదళ్లు. బావ ఎక్కడికో వెళ్లివచ్చాడు. మరదలు మొరటు సరసమాడింది. బావకూడ ఘాటైన సరసమే ఆడాడు మానవ జీవితంలో ఈ ఘటనలు మెరపుల్లాంటవి. జీవితంలోని ఒకానొక సన్నివేశాన్ని పురస్కరించుకొని యేర్పడిందే ఘటనా విశిష్టత.

## 1-5-8 : శబ్దతీక్ష్ణత

పొడుపు కథకున్న విధి నిషేధాత్మక గుణం వల్ల వాక్య నిర్మాణంలో శబ్దతీక్ష్ణత కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. మనిషిలో కలిగే ఉద్రిక్తతా వేశాల వల్ల పలుకులో వాడి-వేడి ప్రదర్శితమవుతుంది. ఆగుణం పొడుపు కథల్లో విధి నిషేధాత్మక రూపంలో ఉంది.

* గవాసిల గడ్డపార. (ముక్కుపుల్ల)
నూర్గురన్నదమ్ములకొకటే మొలతాడు. (చీపురుతాడు)

* పందుం బుక్కుతవి-పరపర ఇడుస్తది (గిర్ని)

సెరువంత గొంగడి
నీయబ్బ గప్పలేడు
నాయబ్బగప్పలేడు (ఆకాశం)

* మూడుకాళ్ల ముద్దప్ప
ముంద లేసి రుద్దప్ప (సానరాయి)

ఈ పై పొడుపు కథల్లో పదాల్ని ప్రయోగించిన తీరులో ఒక వేగం, ఒక ఆజ్ఞాపనం స్పష్టంగా ద్యోతకమవుతుంది. నిజానికి కొన్ని పొడుపు కథలు పొడిచినట్లే ఉంటాయి, అందువల్లనే వీటికి శబ్ద తీక్ష్ణత కూడా ఒకానొక లక్షణమనడం

## 1-5-9 : లోకోక్తి రామణీయకత

లోకుల ఉక్తులన్నీ లోకోక్తులు కావు. జీవితాన్ని పిండివడ బోసిన మాటలు కొన్ని ఉంటాయి. అవి తత్కాలీన సత్యాలు గావచ్చు లేక సార్వకాలీన సత్యాలు గావచ్చు. అవి సమాజం నుండి సాహిత్యంలోకి సాహిత్యం నుండి సమాజంలోకి నిరంతరం పయనిస్తుంటాయి ఆ పయనంలో పరిసరాలు సొగసుల నిలయాలవు తాయి. పరిమళ భరిత సువర్ణవనాలవుతాయి. ఈ [illegible] ఆనందం లోకులది. పొడుపుకథల్లో లోకోక్తులుండడం వల్లనే అవి కమనీయాలైనాయి; పరమరమణీయాలైనాయి.

* ఆకారపుష్టి నైవేద్య నష్టి (పుచ్చకాయ)
ముక్కు మూరెడు సిగబారెడు (తోక వరి గింజ)

* సంపాదన ఒకరిది
అనుభవం ఇంకొకరిది (చేతులు-కడుపు)

* వినేవాటికి కనే వాటికి
బెత్తెడు దూరం (చెవులు-కన్నులు)

* పొట్టు మీది వాడు
జుట్టు మీది కెక్కె (కల్లు)

'అన్నేసి చూడు - నన్నేసి చూడు' అనేవి ఒకనాటి పొడుపు కథ, నేడది సామెత. పొడుపు కథ వ్యవహారంలో నానీ నానీ రూపురేఖలు దిద్దుకొని సామెత రూపు సంతరించుకొంటుందని నిరూపిస్తూ ఈ సిద్ధాంత గ్రంథంలో పొడుపు కథల్ని సామెతల్ని తులనాత్మకంగా పరిశీలించడం జరిగింది. ఈ పై పొడుపు కథలన్నీ సామెతలుగా ఈనాడు బహుళ ప్రచారంలో ఉన్నాయి. ఒకనాటి పొడుపు కథ సామెతగా (లోకోక్తిగా) పరిణమించింది ఇటువంటి వాటిని పొడుపు సామెతలనవచ్చు. వీటివల్ల పొడుపు కథకు రామణీయకత్వం పెరిగింది పొడుపు కథ జానపద సాహిత్య సుందరి ముఖాన సింగారమయింది; ముంగొంగు బంగారమయింది.

## 1-5-10 : లయాత్మకత

ప్రాణి గుండెకు లయఉంది. ప్రకృతికి లయ ఉంది. సృష్టి పరిభ్రమణంలో లయఉంది. మనిషి మాటలో పాటలో చేష్టలలో లయ ఉంది. ఒక క్రమబద్ధత వల్ల ఈ లయ యేర్పడుతుంది. క్రమబద్ధత ఉన్న సాహిత్యంలోనూ ఈ లయగమనిస్తాం. తాలం కుదిరితే లయ కుదురుతుంది. పొడుపు కథల్లో పద్యాలు, గేయాలు, వచన గేయాలు, వచనాలు ఉన్నాయి. ఛందో బద్ధమైన పద్య గేయాల్లోనే గాక కేవల వచన ప్రహేళికల్లోనూ ఈ లయ కనిపిస్తుంది.

* డిబ డిబ్బలాడేవి రెండు
డిబ్బెక్కి చూసేవి రెండు
ఆలకించేవి రెండు
అందుకొనేవి రెండు (కాళ్లు-కన్నులు-చెవులు-చేతులు)

ఈ పొడుపు కథలో మొదటి రెండు పదాలకు 13 మాత్రలు, మూడవ పాదానికి 11 మాత్రలు. నాల్గవ పాదానికి 10 మాత్రలు ఉన్నాయి. కొద్ది మాత్ర భేదం ఉన్నా లయతప్పనిగతి కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది దానికి ఖండగతి నడకే కారణం. ఈ క్రింది ప్రహేళికల పాదాల్లోనూ మాత్రల వైవిధ్యం ఉన్నా లయ ఒకే విధంగా ఉంది.

: వానిపేరే జిల్జిల్ గాడు
వానిముడ్డికి మూరెడు తాడు
వాడు లేకుంటె ఊరంత పాడు (చీపురుకట్ట)

ఛందోబందోబస్తులేవీ తెలియని సాధారణ జానపదుని నోటగూడ పొడుపు కథ లయాత్మకంగా దూకడం గమనార్హం.

* పచ్చని రవికది
పదహారు పండ్లది
నవ్వితే తెస్తాం
నవ్వకుంటే తేం. (సీతాఫలం)

పొడుపు కథల్లోని ఈ లయాత్మకత కారణాన పొడుపు కథలు ఛంద శ్శిల్పం అనే అంశం ప్రత్యేకంగా ప్రస్తావించడం జరిగింది. పొడుపు కథల్లో ముప్పాతిక మువ్వీసాలు లయదప్పనివి. అందువల్లనే లయాత్మకత కూడా పొడుపు కథా లక్షణ మనడం.

## 1-5-11 : చమత్కార చారుత

"నూతన చమత్కార పొడుపు కథలు"[1]. 'చమత్కార పొడుపు కథలు"[2] "చమత్కార పొడుపు కథలు ఎనుతెలుగు సామెతలు"[3] లనే ఏడెనిమిది పుటల సంకలన గ్రంథాలు వీధుల్లో లభిస్తున్నాయి. 'ఈచమత్కారం వినండి అక్కగారూ! బావగారూ' అంటూ కొన్ని పొడుపుకథల్ని చదువుతూ బస్సుల్లో బస్సు స్టాండుల్లో కొందరు వీటిని అమ్ముతున్నారు.

పొడుపు కథల్లోనే చమత్కారాలుండంగా అట్టిపైన 'చమత్కార, నూతన చమత్కార' అనే మాటల్ని ప్రచురించడంకూడా చమత్కారమే. పొడుపు కథల్లోని ఉక్తి వైచిత్ర్యం వల్లనే ఈ చమత్కారం భాసిస్తుంది.

* కొండనుండు నెమలి కోరిన పాలిచ్చు
పశువు శిశువుతోడ పలుక నేర్చు
వనిత వేదములను వల్లించు చుండును
బ్రాహ్మణుండు కాకి పలలము దిను.

ఈ పద్యంలో ఒక్కొక్క పాదం ఒక్కొక్క వాక్యమని భ్రాంతి చెందేట్టు వ్రాయడంలోనే చమత్కారమంతా ఇమిడి ఉంది. పాద పాదానికి గాక అర్థయుక్తంగా విడదీసు కొన్నప్పుడు విడుపు వస్తుంది; చమత్కారం తొలగి పోతుంద

---

1. శ్రీవెంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్-కామారెడ్డి
2. వెస్టు వార్డు అండ్ కంపెని-మద్రాసు-21
3. ఎస్. వి. గోపాల్ అండ్‌కో మదరాసు-1968

* కొండనుండు నెమలి,
కోరిన పాలిచ్చు పశువు,
శిశువు తోడ పలుకు నేర్చువనిత,
వేదములను వల్లించు చుండును బ్రాహ్మణుండు.
కాకి పలలముదిను.

ఇప్పటికీ వ్యవహారంలో ఉన్న ఇలాంటి పొడుపు పద్యాలనేకాలు చమత్కార చారుతకు పట్టుగొమ్మలు. పద్యాలే కాక సాధారణ వచన ప్రహేళికల్లోనూ ఇటువంటి చమత్కృతి ఉంది.

* కొనేటప్పుడు నల్లగ
తినేటప్పుడు ఎఱ్ఱగ
పారేసేటప్పుడు తెల్లగ (అల్లనేరెడు పండు)

అక్షరాల్లోనూ, పద్యాల్లోనూ, వాక్యాల్లోను, పదాల్లోను అర్థంలోనూ, భావం లోనూ ఇటువంటి చమత్కారాలున్నాయి. ఇవి చాలా వరకు చిత్ర కవిత్వం కిందికే వస్తాయి. చిత్ర కవిత్వంలో పదాల గారడి ఉంటుంది. ఆగారడి వల్లనే చమత్కారం భాసిస్తుంది. పొడుపు కథ అలాంటి గారడికి నిలయం. అందువల్లనే పొడుపు కథకు చమత్కార చారుత లక్షణ మయింది.

## 1-5-12 : దృశ్యాత్మకత

ఒక భావం చదవగానే ఒక దృశ్యం బొమ్మగట్టితే ఆ భావం కూర్చిన తీరు సర్వోత్తమంగా ఉందని భావిస్తాం. ఒక బొమ్మను చూడగానే ఒక భావం మనస్సులో నిలిస్తే ఆ బొమ్మ అర్థయుక్తంగా ఉందని అనుకుంటాం. మనస్సులో దృశ్యం, ఎదుట దృశ్యం. ఉత్తమ సాహిత్య చిత్రలేఖ నాలిటువంటివే. పొడుపు కథల్లోని నాటకీయత వల్ల బొమ్మలు రూపు గట్టడం దృశ్యాత్మకతే అయినా నేత్రా ద్యవయవ చాలనాల ద్వారా ఒక దృశ్యాన్ని ముందుంచడం పొడుపుకథకున్న ప్రత్యేకత. సాహిత్యంలో ఇటువంటిది సూక్ష్మాలంకారం క్రిందికి వస్తుంది. ముఖ్యంగా సూక్ష్మాలాంకారలక్షితాలైన పొడుపు కథలు దృశ్యాత్మకత క్రిందికే వస్తాయి.

* నారీలలామ! నీ పేరేమి చెపుమన్న
తమి మీఱ నెడమ నేత్ర మునుజూపె
మత్తేభయాన! నీ మగని పేరేమన్న
తన చేత జీర్ణవస్త్రమును జూపె
వెలది! నీకేమైన బిడ్డలా చెపుమన్న
కరమొప్పమింటి చుక్కలను జూపె
కుటిల కుంతలి! నీదు కులమునామంబన్న
పంజరంబున నున్న పక్షి చూపె
ప్రభువు మీకెవ్వరన్న గోపకుని చూపె
ధవుని వ్యాపారమేమన్న దండమిడియె
చతుర మతులార! ఈ ప్రౌఢ జాణతనము
తెలిసి కొనరయ్య బుద్ధి కౌశలము మెఱయ.[1]

వామాక్షి, కుచేలుడు, ఇదువదియేడు, ద్విజ, శ్రీకృష్ణుడు, తపస్సు మొద లైనవి వరుసగా విడుపులు. ఇందులో పేరేంటో చెప్పాల్సిందని ఒకరడుగగా ఆమె సైగలతో అర్థం చెప్పింది. అడిగిన వాళ్ళు కూడా బహుశా సంజ్ఞలతోనే అడిగి ఉంటారు. ఇది నాటకీయత; మాటలులేవు; భావ ప్రదర్శన జరిగింది. ఆ జరగడంలో కొన్ని దృశ్యాలు పొడగట్టాయి. అందుకే పొడుపు కథల్లో దృశ్యాత్మకతఉందనడం.

## 1-5-13 . ఆలంకారికత

చెట్టు ఎదిగి తీగపారినప్పటికన్నా మొగ్గ దొడిగి పూలుపూచినప్పుడు చూడ ముచ్చటగా ఉంటుంది ముచ్చటమూణ్నాళ్లదే అయినా అప్పటిశోభ మళ్ళీ మొగ్గదొడిగి పూలుపూసేంత వరకు గుర్తుంటుంది. ఆ శోభను అందమంటారు; అలంకార మంటారు సాహిత్యంలో ఇటువంటి అందాలూ అలంకారాలు అధిక సంఖ్యలో పెరిగి పోయాయి. అనేక అలంకార శాస్త్రాలు ఆవిర్భవించాయి తెలుగు పొడుపు కథ ల్లోనూ అనేక రకాల అలంకారాలున్నాయి. వీటికై ఈ గ్రంథంలో ప్రత్యేకంగా ఓ ప్రకరణమే కేటాయించడం జరిగింది.

---

1. చమత్కార చంద్రిక. పు : 17

* ఎలక్కాయంత సద్ది
ఎంతమంది తిన్నా దణగదు. (తల్లిపాలు)

తన సంతానంలో ఎంతమందికిచ్చినా తల్లిపాలు తగ్గవు. ఆక్షీరాల్ని ఎలక్కాయంత చద్ది అని చెప్పడం జరిగింది. ఈ అంత అనే శబ్దం 'వలె' అనే ఉపమావాచకానికి పర్యాయ పదంగా పొడుపుకథల్లో వాడబడుతుంది. చల్ది 'ఎలక్కాయంత' ఉన్నది. అది చల్ది గాదు, చల్ది వెనుకదాగిన పాలు. చద్ది ఎలక్కాయతో ఉపమించడం ఉపమాలంకారం. పాలను మరుగున ఉంచి కేవలముపమానమే చెప్పడం రూపకాతిశయోక్తి. ఈ విధంగా ఆలంకారిక లక్షణాలు అడుగడుగునా కనిపిస్తాయి. అర్థాలంకారాలే గాక శబ్దాలంకారాలకు కూడా పొడుపు కథ పుట్టినిల్లు.

* రెండు స్తంభాలు (కాళ్లు)
స్తంభాల నడుమ కుంభాలు (పిరుదులు)
కుంభాల మీద కుడితొట్టె (కడుపు)
కుడితి తొట్టెమీద గవ్వలగురిగి (నోరు)
గవ్వల గురిగిమీద అద్దాలమాలు (కండ్లు)
అద్దాల మాలుమీద గరికపోసలు (వెంట్రుకలు)
గరిక పోసల మీద గాడిదలు పొర్లాడుతవి (పేలు)

పూల గుత్తుల్లాగా ముక్త పద గ్రస్తాలు, ఒక పాదం చివర గాని, వాక్యం చివరగాని, ఉచ్చరించి విడిచిన పదాన్నే అవ్యవధానంగా రెండవపాదం లేదా వాక్యం మొదట ప్రయోగించినట్లయితే ముక్తపదగ్రస్త మవుతుంది. పొడుపు కథల్లో కేవలమిటువంటివే గాక విడుపుల్ని కూడా ముక్తపదగ్రస్తాలుగా గ్రహించి గుత్తులు గుత్తులుగా అల్లిన పొడుపు కథలు కనిపిస్తున్నాయి.

* వాకిట్లో పడింది. (ముగ్గబ్బి)
ముగ్గబ్బి వచ్చి నీ మూతిమీద పడింది (ఎంగిలి)
ఎంగిలి వచ్చి నీ వెన్నుమీద పడింది. (చాకలిమూట)
చాకలిమూట వచ్చి నీ చంకలో పడింది (మంగలిపొది)

పొడుపు కథల్లో అలంకారాలు సహజంగా కుదురు కొంటాయి. ఏదో ఒక అలంకారంలేని పొడుపు కథలు చాలా తక్కువే. అందువల్లనే ఆలంకారికత పొడుపు కథకు ఒకానొక లక్షణ మనడం.

## 1-5-14 : సమస్యాత్మకత

పొడుపు కథను సమస్యా గూఢమని సంస్కృతంలో, సమస్య అని తెలుగులో పిలుస్తుండడం గమనార్హం. సమస్య పరిష్కారాన్ని ఆపేక్షిస్తుంది. పరిష్కారాన్ని ఆపేక్షించని పొడుపు కథే లేదు. అయినా ప్రశ్నను సూటిగా అడిగేవాటిలోనే సమస్యాత్మకత అధికంగా భాసిస్తుంది.

* కట్టెగాని కట్టె
కాయగాని కాయ
పూవుగానిపూవు
(నీరుకట్టె-ఎండ్రకాయ-మిణుగురుపూవు)

* కల్లులో ఏ కల్లెక్కువ. (ఉప్పుగల్లు)
నీటికోడి నిప్పుకోడి
కోడిగాని కోడి (పకోడి)

వందల కొద్ది మాటగాని మాట (టమాట)లు పొడుపు కథల్లోని ఒక అంశంగా పరిగణింప బడుతున్నాయి. బాలబాలికల వినోదార్థమే ఇవి సృష్టింప బడ్డా పొడిచిన వెంటనే సమాధానాన్ని ఆశించే గుణం వీటిలో ఉంది. ఇటువంటి పొడుపు కథల మూలాన్నే సాహిత్యంలో సమస్యా పూరణాలనే ఒక ప్రక్రియ చోటుచేసుకున్నదన్నా, లేదా సమస్యా పూరణాల గుణాలేకొన్ని పొడుపు కథల్లో భాసించాయన్నా పొరపాటేంకాదు.

## 1-5-15 : రసాత్మకత

కథా రహితాలైన పొడుపు కథలే లెక్కలేనన్ని ఉన్నందువల్ల పొడుపు కథలు రసవిరోధులని ప్రాచీనాలంకారికోక్తి[1]. కాని కథా సహితాలైన పొడుపు కథల్లోని విడుపుల్ని విన్నప్పుడు, గేయ ప్రహేళికల్లోని హాస్య శృంగార చమత్కారాల్ని గమనించినప్పుడు పై అభిప్రాయం దూరమవుతుంది. పొడుపు

1. సాహిత్యదర్పణమ్ పు : 471.

కథలు వివిధ రసాలు-ధ్వని అనే ప్రకరణంలో ఈ విషయం ప్రస్తావించడం జరిగింది. చిటుకలో పొడువబడి త్రుటిలో విడువబడే పొడుపు కథలు రసదృష్టి కందవు. రతి, హాసం మొదలైన స్థాయీ భావాలు స్థాయికెక్కాలంటే కొంత కథనం జరగాలి.

* ముట్టకు ముట్టకు ఓ సెల్లె
ముట్టిన సేతుల ముచ్చాలు
పట్టిన సేతుల పగుడాలు
పాపకారి మాయత్త
పామొండి పెట్టె

ఇది యే జానపద గేయ కథాంశ భాగమో కాని పల్లెల్లో పొడుపుకథగా వినిపిస్తుంది. గయ్యాళి అత్త కోడల్ని హింసించేది. తల్లి గారింటి నుండి అది తేలేదని ఇది తేలేదని ఎప్పుడూ బాధిస్తుండేది. కోడలేమో అమాయకురాలు, మారు మాటాడక ఈ బాధలన్నీ సహిస్తుండేది. అత్తగారు ఓ రోజు పామును పట్టింది, చంపింది, వండింది, కోడలుకు పెట్టింది. కోడలు చచ్చిపోయింది. అత్త ఆమెను బొంద పెట్టించింది. ఈ సంగతి ఆమె తల్లి దండ్రులకు గానీ, అన్నా చెల్లెండ్రకుగానీ, వదినలకు గానీ తెలువదు. తమ ఇంటి ఆడపిల్ల గర్భవతి అయిందనీ, చూడాలనీ పండ్లు ఫలాహారాలు తీసుకొని బండి కట్టుకొని వారు వస్తు న్నారు. ఆ ఊరుదగ్గరికి వచ్చారు. బాట పక్కనే శ్మశానం, అందులో కొత్త బొంద, బొందమీద మంచి మల్లె చెట్టు. మల్లె చెట్టు నిండా పూలు. ఆ పూలకై చెల్లెలు పరుగెత్తింది. ఓ పూవు త్రెంచడానికి చేయి చాచింది. అంతే పరమ దుఃఖావేశంతో గద్గద కంఠంతో పై పాట వినిపించింది. చెల్లెలాశ్చర్యపోయింది. అందరికి ఈ సంగతి చెప్పింది. ఒక్కొక్కరే వచ్చి పువ్వు ముట్టుకోడానికి చేయి చాచారు. అమ్మ, నాన్న, చిన్నన్న, పెద్దన్న, చిన్నొదిన పెద్దొదిన అందరిని ఒట్టు వరుసపెట్టి సంబోధించింది. తన చావును పరమకారుణికంగా వినిపించింది. ఇదే సమయంలో వీరంతా వస్తున్నారని అత్తకు తెలిసింది. మీకూతురెక్కడో లేచి పోయిందని చెప్పడానికి ఆదరాబాదరాగా అక్కడికి వచ్చింది. ఆమెనోట మాట రాలేదు. తాను కూడా పూవును ముట్టుకోపోయింది; అంతే పూర్వం పాటను కొద్ది మార్పుతో మల్లె పలికింది.

* ముట్టకు ముట్టకు ఓ లంజె
ముట్టిన సేతుల ముచ్చాలు
పట్టిన సేతులు పగుడాలు
పాపకారి మాలంజె
పామొండి పెట్టె

ఇదీ కథ. ఆ పొడుపు పాట వెనుక ఇంత కథ ఉంది. ఈ కథలో మరణించిన కోడలే ఆలంబనం. మంచి మల్లెపెట్టు ఉద్దీపనం. దుఃఖం, ఆవేదన అనుభావాలు. దైన్యాదులు సంచారిభావాలు. శోకస్థాయే కరుణ రసాన్ని అభివ్యక్తీకరించడం.

కథాత్మకాలైన పొడుపుకథల్లో, పౌరాణికైతిహాసిక సాంఘిక కాల్పనికాది భేదాలతో కనిపిస్తున్న [illegible] సర్వరసాలకు ఆకారాలై ఉన్నందువల్ల కథారహితాలైన కొన్ని పొడుపు కథల్లో హాస్య శృంగార చమత్కారాలున్నందు వల్ల రసాత్మకత కూడా పొడుపుకథా లక్షణాల్లో ఒకటి అని గుర్తించవలసి వస్తుంది.

## 1-5-16 : ధ్వన్యాత్మకత

ప్రాణికాత్మ యెటువంటిదో కావ్యానికి ధ్వని అటువంటిది. కావ్యాత్మ ధ్వని అని ఆనంద వర్ధనులు సిద్ధాంతీకరించారు.[1] పొడుపు కథా వస్తువులోనూ, రసంలోనూ, అలంకారంలోనూ ధ్వని అంతర్భూతంగా ఉంది. ఈ విషయం ప్రత్యేకంగా ప్రస్తావించడం జరిగింది. మానవుడు జరిపే నిత్యనైమిత్తిక కార్యకలాపాల్లోనూ సాధారణ ప్రసంగాల్లోనూ ధ్వని సంకేతితమై ఉండగా విశిష్ట సాహిత్య ప్రక్రియయైన పొడుపు కథ ధ్వని లక్షణ లక్షితమై ఉండడం అపూర్వమేమికాదు.

* ఆడంగ ఓ స్త్రీ పోతుంటే
అమ్మా ! నీ వొళ్లదేందంటే
"నీకు గుర్తులేదు
నాకు గుర్తులేదు
తోటమాలికి గుర్తు,
అంగడి సాగిన్నాడు
అందరికి గుర్తు"

---

1. ధ్వన్యాలోకమ్ ప్ర. శ్లో : 1.

కడుపుతో ఉన్న ఓ కన్య కనలుతూ-కుములుతూ కాలుగాలిన పిల్లిలా పోతుంది. ఆమె అవతారాన్ని పసిగట్టిన పూర్వాపరాలెరిగిన ఓ తుంటరి 'అమ్మా' అని సంబోధించాడు. ఆ సంబోధనలోనే అమ్మవు గాబోతున్నావు అనే పరిహాస ముంది. 'నీ ఒడిలోని దేమి'టన్నాడు. ఒడిలో బచ్చలికూర కూడ ఉంది. కడుపులో శిశువుంది. పూర్వకథ తెలిసిన వారికే గర్భం సంగతి తెలుస్తుంది. తెలిసినా ఆ శిశువు 'ఆడో-మగో' ఎవరూ చెప్పలేరు. అందువల్లనే లది తోట మాలికి గుర్తన్నది. అంతేకాదు తనగర్భం సంగతి తన ప్రియునికే తెలుసునని అర్థం. ఇక అంగడి సాగిన్నాడు అందరికి గుర్తంటే ఇంటిలోకి వెళ్లి ఒళ్లోని కూర అందరి ముందు జల్లెడలోనో, చాపమీదనో వేసినప్పుడు ఇంటిల్లిపాదికీ అది యేమికూరనో తెలిసి పోతుందిగదా అని అర్థం. ఇక గర్భం సంగతి; ప్రసవించిన నాడు అంగడే సాగుతుంది. రహస్యం రచ్చకెక్కుతుంది.

పొడుపుకథ అర్థంతరంగా ముగిసినట్టనిపిస్తుంది. ఒళ్ళోని కూర విషయం వాచ్యమై, గర్భం విషయం వ్యంగ్యంకాగా ఇంత కథ నడిచింది. ఇక్కడ తోట మాలి భర్త కావచ్చు-భగవంతుడుగావచ్చు. ఈ ఇద్దరే ఆమె నాదుకొనే వారు, అంగడిసాగడం ప్రసవించడమనే అంతరార్థంతో బాటు "ఊరేగడం" అనే ధ్వన్యర్థం కూడా వస్తుంది. ఆమె జీవితంలో పెళ్లిఊరేగింపుందో లేదో! ఉంటే ఇంత దూరం వచ్చేది కాదు. ఇక అది చివరి ఊరేగింపే. ఇంత ధ్వని పొడుపుకథలో ఉంది. ఇది తెలుసుకొన్న ఎవరి మనస్సు, ముఖ్యంగా ఆ ప్రియుని మనస్సు ద్రవీభూతం కాకుండా ఉంటుందా! కావాలనే ఈ ధ్వని.

కేవలం ఇటువంటి వానిలోనే గాక సాధారణ ప్రశ్నా ప్రహేళికల్లోనూ ధ్వని దృగ్గోచర మవుతోంది.

* పురుషుని ప్రశ్న -
అలుముకొనెటోడి ఇల్లు ఎక్కడుంటది ?
స్త్రీ జవాబు —
ముడ్డి కోసెటోడి ఇంటి దగ్గరుంటది !

అలుముకొనెటోడి ఇలు అంటే శరీరాని కలుముకొనే వస్త్రాన్ని చేసేవాడైన పద్మశాలి ఇల్లు అని అర్థం. ముడ్డి కోసెటోడి ఇల్లు అంటే కుండలు చేసేప్పుడు ఒక్కొక్క కుండకు అడుగు కోసి సారెపై నుండి దీసే వాడైన కుమ్మరి ఇల్లు

అని అర్థం. పద్మశాలి ఇల్లు ఎక్కడ అంటే కుమ్మరి ఇంటిదగ్గర అని సమాధానం. కాని ఈ ప్రశ్నలోనూ సమాధానంలోనూ ధ్వని ఉంది. అలుముకొనడం అంటే కౌగిలించుకోవడం అనీ, ముద్దికోయడం అంటే తన్నడం అనీ వ్యావహారికార్థాలు. నిన్ను కౌగిలించుకొంటాను ఇంటికిపద అని అతడంటే తన్నులు తింటావంటోంది ఆమె. ఇది జానపదులు చెప్పే ధ్వన్యర్థం. కాని తన ఇంటిని సూచించడం వల్ల ఆమెకు కూడ ఇష్టముందనీ, కలుగబోయే కష్టాల్ని గుర్తించమంటోందని భావించడానికి అవకాశముంది. విడుపులు పద్మశాలి, కుమ్మరి అయినా ఇంత ధ్వన్యర్థాన్ని ఈ పొడుపు కథ పొదిగి కొంది. ఇటు వంటి ధ్వన్యాత్మకాలైన గుణాలు పొడుపు కథలకున్నందు వల్లనే పొడుపు కథకు ధ్వన్యాత్మకత కూడా ఒక లక్షణమని భావించడంజరిగింది.

## 1-5-17 : సాంప్రదాయకత

సంప్రదాయ బలం పునాదిగా ఒక జాతి జీవన సంస్కృతులు వికసిస్తుంటాయి. వైదిక సంప్రదాయాలు భారతీయ భావల్లోని ప్రహేళికల్లో అక్కడక్కడ కనిపించడమే గాక ఆయామండలాల్లో స్థిరపడ్డ ఆచార వ్యవహారాలు కూడా కనిపిస్తూనే ఉన్నాయి. వాటిని కూడా సంప్రదాయాలు గానే పరిగణిస్తున్నారు.

* మూడు మూరల తోటలోన
ఆరు మూరల కాయగాసె
అడుగులేని దొంగ వచ్చె
తొడిమ లేని తెంపు దెంపె

[యముడు ప్రాణందీయడం]

యముడు ప్రాణాలు తీసుకొని పోతాడనే విశ్వాసం సంప్రదాయమే. అట్లే బంతిపువ్వుల్ని భగవంతునికి సమర్పించడం సన్యాసి విభూతి పూసుకొని రుద్రాక్షలు ధరించడం భారతీయ సంప్రదాయమే.

పచ్చ పచ్చని దదే
పసుపూసుకునే దదే
దేశం తిరిగే దదే
దేవుని పక్కల పండేదదే (బంతిపువ్వు)

* ఓహో సన్నాసి
నీపై నిండ విభూతి
నీ సేతులకు శంఖ చక్రాలు
నీ నెత్తిన రుద్రాక్షలు (ఆముదపు చెట్టు)

ఇవే కాక మరికొన్ని ఆచారాలు సంప్రదాయాల పేరిట చలామణి అవుతున్నాయి.

* వేసింది యేమిరా తీసింది యేమిరా
వేలుబెట్టి వాసన చూసింది యేమిరా
వేసింది సానరా తీసింది చెక్కరా
వేలుబెట్టి వాసన చూసింది శ్రీగంధం.

పెండ్లి పేరంటాల సందర్భాల్లో గంధం తీసి స్త్రీల మెడలకు పూసుకునే సంప్రదాయముంది. అంతేగాక వచ్చిన వారికందరికి పసుపు కుంకుమలు పెట్టే సదాచార ముంది.

* కీసు గిద్దెడు బియ్యం వండి
కీసు కెట్టంగ కీసు పిల్లలకెట్టంగ
ఆమసగంటోల్ల కరవై మందికి పెట్టంగ
దేవర కొండోల్లకు డెబ్బయి మందికెట్టంగ
ఇంకా ఇసుట్టాయంత పెల్ల ఉండె (కుంకుమ)

అనూచానంగా తరం నుండి తరానికి సంక్రమించే విజ్ఞానం విశ్వాసాలు సంప్రదాయాలు. అవి పొడుపుకథా సాహిత్యంలో అత్యావశ్యక విషయాలైనందు వల్ల సాంప్రదాయకత పొడుపుకథ ప్రధాన లక్షణమయింది.

## 1-5-18 : కవితాత్మకత

కవిత్వానికున్న సర్వలక్షణాలు పొడుపు కథకు సంపడస్తున్నాయి. ప్రాచీన ముక్తక కవితారీతికి, ఈ కాలంలో వస్తోన్న లఘు కవితా పద్ధతికి పొడుపుకథ తీసిపోయేదేంకాదు. ఆ కవిత్వగుణాలు పొడుపు కథల్లో సర్వే సర్వత్ర కనిపిస్తున్నాయి.

* సూర్యుడు చూడని మడుగు
చాకలి తాకని గంగ (కొబ్బరికాయ నీళ్ల)

* ఏడాకుల మాను
ఎక్కరాదు-దిగరాదు (జొన్న గడె)

* తల్లి దయ్యం
పిల్ల పగడం (రేగుచెట్టు-పండు)

* భూమి రెడ్డోల్ల ఆడబిడ్డ
భూమికన్న చెంచురాలు
జడనిండ పూలు పెట్టి
జడ యాలేసు (నల్లరేగడిలోని జొన్నమొక్క)

ఇవన్నీ గుప్పెడు పొడుపులు, వ్యాఖ్యానించి గంపలకెత్తవచ్చు, గుమ్మలు నింపవచ్చు. ఈ కైతలు ఒక మహాకవి కైసేతలనిపిస్తాయి. ఆకారణాన్నే కవితాత్మకత కూడా పొడుపుకథకున్న ఒకానొక లక్షణమని భావించడం జరిగింది.

ఈ విధంగా తెలుగు పొడుపు కథ సంక్షిప్తతాది అష్టాదశ లక్షణ సంశోభితమై చతుష్షష్ఠి కళల్లో ప్రహేళిక ఒక టనుమాట సార్థకం చేసుకొన్నదై, అటు మార్గకు ఇటు దేశికి పుట్టిన బిడ్డయై, సనాతనమై నిత్యనూతనమై అలరారుతుంది. మరి ఇటువంటి పొడుపు కథను ఎన్ని రీతులుగా వర్గీకరించడానికి వీలుందో గమనిద్దాం.

## 1-6 : వర్గీకరణం

జానపద సాహిత్యాన్ని విశ్లేషిస్తూ పొడుపు కథల్ని అనేకులు అనేక రకాలుగా వర్గీకరించారు. ఆయా భాషల్లోని వర్గీకరణాల్ని దృష్టిలో ఉంచుకొని తెలుగు పొడుపుకథల్ని విభజించాల్సిన అవసరముంది. పొడుపు కథల్ని జానపద సాహిత్యంలోని ఒకానొక విభాగంగానే పరిశోధకులు నిర్ధారించారు. కాని తెలుగు పొడుపు కథలు మార్గకు, దేశికి, జానపద సాహిత్యానికి చెందినవిగా కనిపిస్తాయి. అందువల్లనే పొడుపు కథలు కేవలం జానపద సంసృష్టి కాదని తెలుస్తోంది.

## 1-6-1 : పొడుపుకథ మార్గ

సంస్కృత సాహిత్యంలోని ఛందస్సుల్ని అనుసరించిన తెలుగు పొడుపు పద్యాలు, సంస్కృతాన్ని అనుసరించి తెలుగులో నిర్మాణమైన వృత్తఛందస్సును అనుసరించిన పద్యాలు ఈ కోవలోకి వస్తాయి. తెలుగు పొడుపు పద్యం సంస్కృతాన్ని అనుసరించినా తెలుగు వృత్త ఛందస్సును అనుసరించినా మార్గయే అవుతుంది.

* మనసిజు మామ మామ యభి
  మానమడంచిన వాని మామ నం
దనుని విరోధి నందనుని
  నందను సుందరి మేనమామ జం
పిన జగజెట్టి పట్టి పొడి
  జేసిన సూరుని తండ్రి గన్నగన్
గొనిన సురాధి నాదుని త
  నూభవు నాయువు మీకు నయ్యెడున్[1]

మనసిజుడు మన్మధుడు. మన్మధుని మామ చంద్రుడు. చంద్రునిమామ దక్షుడు. దక్షుని అభిమానాన్ని అణచినవాడు ఈశ్వరుడు. ఈశ్వరుని మామ హిమవంతుడు. హిమమవంతుని కొడుకు మైనాకుడు. మైనాకుని విరోధి ఇంద్రుడు. ఇంద్రుని కొడుకు అర్జునుడు. అర్జునుని కొడుకు అభిమన్యుడు. అభిమన్యుని భార్య ఉత్తర. ఉత్తర మేనమామ కీచకుడు. కీచకుని చంపినవాడు భీముడు భీముని కొడుకు ఘటోత్కచుడు. ఘటోత్కచుని చంపినవాడు కర్ణుడు. కర్ణుని తండ్రి సూర్యుడు. సూర్యుని కన్నుగొన్నవాడు విష్ణువు. విష్ణువు కొడుకు బ్రహ్మ. ఆ బ్రహ్మ ఆయుస్సు మీకూ కలుగాలని ఆశీర్వాదం.

ఈ పద్యం చంపకమాల వృత్తం. సంస్కృతాన్ని అనుసరించిన తెలుగు పద్యం. యతిప్రాసలతో తెలుగుదనాన్ని నింపుకొన్న పద్యం. కాబట్టి పొడుపు కథ మార్గసాహిత్యాన్ని కూడా అనుసరించిందని చెప్పాలి.

---

1. పెద్ద బాలశిక్ష-పు : 8౬

## 1-6-2 : పొడుపు కథ దేశి

తెలుగులోని జాత్యుపజాతి పద్యాలైన కందం, ద్విపద, తరువోజ, అక్కర ఉత్సాహ, తేటగీతి, ఆటవెలది, సీసం తదితరాలు, గేయ రచనల్లోని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాది భేదాలు దేశి క్రిందికే వస్తాయి ఈ విషయం ఛందశ్శిల్పమనే ప్రకరణంలో సోదాహరణంగా ప్రస్తావించడం జరిగింది. జాతుల నుండి ఒకటి, ఉపజాతులనుండి ఒకటి గమనిద్దాం.

* ముక్కున పైనము నడచును
ప్రక్కన నోరుండు గాలి పారణ సేయున్
గ్రక్కున వేసిన కూయున్
మక్కువతో దీని దెలియు మనుజులుగలరే?[1]

(బొంగరం)

* కృష్ణుడే కాంతతో క్రీడించె పసినాడు - రాధను
రావణానుజుడేది రామునికిచ్చె - మర్మము

కాకుత్స్థుడెవరిని గలసి వారధి గట్టె - కపుల
జనకజగోరిన జంతువేది - హరిణం

వానపామున కుండు వనరైన పేరేమి - భూనాగం
ఆట తీరుపు వేళ పాటయేమి - హారతి

దాతల గనియర్థి దాపుజేరుటయేల - ఆశించి
దండినరకప్రాప్తి దనరునెటుల - ద్రోహాన

అన్నిటికి జాడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
ధర్మపురి నారసింహుండు నిర్మలముగ
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.[2]

---

1. వయోజన విద్య-మూడవ వాచకము పు : 25.
2. పాపిసెట్టి సీతారామ కవిది. (వ్రాతప్రతి)

జాత్యప జాతుల్లో ఇలాంటి పొడుపు పద్యాలెన్నో కనిపిస్తున్నాయి. ఒకటి రెండు శతకాలుకూడా అవతరించాయి. అందు వల్ల తెలుగు పొడుపు కథ 'దేశి' అనికూడా చెప్పవచ్చు.

## 1-6-3 : పొడుపుకథ జానపద సంసృష్టి

జానపదులు సృష్టించిన పొడుపుకథలన్నీ దేశి క్రిందికే వచ్చేవైనా వృత్త పద్యాలు జాత్యప జాతి పద్యాలు మాత్రం కవి పండితుల చేతనే విరచింపబడ్డాయి. ఛందస్సంటే ఏంటో తెలియని కొందరినోట అవి వినిపించినంత మాత్రంలో వారి సృష్టే అనడానికి అవకాశంలేదు. వ్యవహారంలో అవి వారి నోట పట్టాయి-అంతే.

* పోతుంటిరా నేను పోతుంటిరా
చార్ కమాను పట్టమీన పోతుంటిరా ॥పో॥

ఒగన్ని కాలిచ్చి ఒగన్ని చెయ్యిచ్చి
ఒగనీ కోసరం నేను పోతుంటిరా
కంచరోన్ని కాలిచ్చి-గాజులోన్ని సెయ్యిచ్చి
పైసల కోసరం నేను పోతుంటిరా ॥పో॥

ఒగన్ని మీద పెట్టి - ఒగన్ని కిందపెట్టి
ఒగని కోసరం నేను పోతుంటిరా
నొసటి మీన బొట్టు పెట్టి - పండ్లాకుదాశనపెట్టి
అద్దం కోసరం నేను పోతుంటిరా ॥పో॥

ఒగన్ని మూసి పెట్టి ఒగన్ని కప్పిపెట్టి
ఒకన్ని కొంగుతోటి ఇసిరిస్తిరా
కుండాను మూసి పెట్టి కుంపాటి కప్పిపెట్టి
దీపాన్ని కొంగుతోటి ఇసిరుంటిరో ॥పో॥

ఇటువంటి గేయాలన్నీ జానపదుల ఆశురచనలే. ఈ క్రింది వచన గేయాలన్నీ జానపదుల నోట వెల్వడ్డవే.

* మిద్దె మీద మిద్దెలు
కట్టా కడపటి మిద్దె మీద
కనబడుచున్నా దొక్క
పెద్ద పచ్చని జెండా! (చెరకుగడ)

* వేయి గోవుల మంద
ఒకటిగా చేరింది
వేసిందొక పెద్ద
తియ్యాని ముద్ద. (తేనెపట్టు)

వచన గేయాలేగాక కేవలవచనాల్లో లెక్కలేనన్ని జానపదుల ముఖనిర్గతాలే.

* మాతాత యేటవతలకోయి రెండెడ్లను దెస్తే
బాయిదగ్గరికి రాంగనే రెండయ్యే (పండ్లపుల్ల)

తునికి పండు తుస్సుమంటే
పసుల కాడి పిల్లలు పయన మయిరి. (ప్రొద్దు)

ఈ విధంగా పొడుపు కథ మార్గకు చెందిందై, దేశిలో ఉన్నదై, జానపదుల సంసృష్టియై అలరారుతుంది. మార్గదేశికి చెందిన పొడుపు పద్యాలు శిష్టుల మన్నన లందాయి; శిష్ట సాహిత్యాని కెక్కాయి. అంతే గాక జానపదుల తలలూపించాయి. ఇటువంటి పొడుపు కథలన్నీ శిష్ట సాహిత్యాంతర్భాగాలే అనాలి; అట్లే కేవలం జానపద లోకంలో ప్రాదుర్భవించి అటు పామరుల్ని ఇటు పండితుల్ని ఆనందింప జేస్తున్న, ఆలోచింప జేస్తున్న పొడుపు కథలన్నీ జానపద సాహిత్యంలోని ఒకానొక విభాగమే అనాలి. ఆ కారణాన్నే పొడుపుకథ ఇరువురికి చెందింది. శిష్టసాహిత్య సుందరి కరకంకణం పొడుపు కథ. జానపద సాహిత్య సుందరి ఫాలతలంపై తిలకం పొడుపు కథ.

మార్గదేశికి చెందిన తెలుగు సాహిత్యంలో పొడుపు కథలు కేవలం దేశికి చెందినవే అని డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు అభిప్రాయం.[1] వారు పొడుపు పద్యాల్ని, సమస్యల్ని నిబద్ధ దేశి అంటున్నారు. కాని శిష్టులైన వృద్ధులకు సంబంధించింది, నిబద్ధదేశి అనడం, నాగరిక వర్ణాల్లోని పిల్లలకూ స్త్రీలకూ

1. భారతి, జనవరి, 1968.

సంబంధించింది జాతి దేశి అనడం సర్వజనాంగీకారం గాదు. నిబద్ధ దేశిలోని పొడుపు పద్యాల్ని స్త్రీలు, స్త్రీలు చెప్పేపొడుపు కథల్ని పురుషులు ప్రయోగించడం తెలుగు దేశమంతటా కనిపిస్తుంది. పొడుపు కథల్ని వారు ఈ విధంగా విభజించారు.

## పొడుపు కథలు

(మారు కతలు లేక విచ్చుకతలు)

- జాతిదేశి (స్త్రీలు-బాలికలు)
  - ముక్తపదగ్రస్తములు. (గొలుసుకట్టుకథలు)
  - ముక్తకములు (విడికథలు)
    - పొట్టిపొడుపు
    - పొడుగుపొడుపు గేయాత్మకత
    - ఒక పొడుపు ఒకవిడుపు
    - ఒక పొడుపు పెక్కువిడుపులు
- పామరదేశి (జానపదులు)
  - లయాత్మక వచనములు
  - గేయాత్మకములు లేక ఏలకతలు
- నిబద్ధ దేశి (శిష్టులు-కవులు)
  - పొడుపు పద్యములు
  - సమస్యలు

జాతి దేశి పామరదేశి రెండింట్లోను ఒకదానికి వచనాలు, వచన గేయాలు, గేయాలు అనే మూడు విభాగాలలో దీర్ఘ హ్రస్వాది భేదాలతో ఆరువిధాలవుతాయి ఆ ఆరింటిలో ఒక్కొక్క దానిలో ఒక్క పొడుపు, పెక్కు పొడుపులనే రెండు భేదాలతో మొత్తం పన్నెండు రకాలవుతాయి. రెంటికి కలిపి మొత్తం ఇరువది నాల్గు విధాలవుతాయి. రెంటిని వేర్వేరుగా గాక ఒకదాని క్రిందనే విభజించి జానపద సాహిత్యమనే ప్రకరణంలో ఈ విషయం చర్చించడం జరిగింది.

శ్రీ జి. శంకరరావు తమ పొడుపు కథలు గ్రంథంలో వీటిని "వచన రూపంలో ఉన్న పొడుపు కథలు, గేయ రూపంలోని పొడుపుకథలు, పద్యరూపంలోని పొడుపు కథలు" అని మూడు విధాలుగా స్థూల విభజనచేశారు.[1]

---

1. పొడుపుకథలు - పుటలు : 8, 10, 16.

డా॥ ఆర్వీ యస్. సుందరం జానపదుల పొడుపు కథలు, సాహిత్యపర మైన పొడుపుకథలు అనే రెండు విభాగాలుచేసి, జానపదుల పొడుపుకథలు వినోదార్థమే యేర్పడ్డాయని, సాహిత్య ప్రహేళికలు తాత్త్వికమైనవిగా ధార్మికమైనవిగా ఉంటాయని సూచించారు. భాషా శాస్త్రపరంగా వీటిని గొలుసుకట్టు పదాలు, సామాన్య వాక్యాలు, సంకీర్ణ వాక్యాలు, వ్యతిరేక సూచక వాక్యాలు, పద్యరూపపు పొడుపుకథలు, మొదలైన విధంగా విభజించవచ్చని వారి అభిప్రాయం.[1]

డా॥ జి. యస్. మోహన్ పొడుపు కథల్లోని విషయాన్ని బట్టి వర్గీకరించడమే అనుకూల మయిందని ఎనిమిది రకాలుగా విభజించారు. 1. ప్రశ్నార్థకములు. 2. వినోదాత్మకములు. 3. కథాత్మకములు. 4. గొలుసు కట్టుకథలు 5. వృత్తి సంబంధులు, 6. సంఘజీవనసంబంధులు, 7. చిత్ర శబ్దాత్మకములు 8. అశ్లీలార్థకములు.[2]

ఇందులో కొన్ని విషయ విభజనం పరిధిలోకి రావు. ఓ కన్నడ గ్రంథంలో భాషా శాస్త్రాధ్యయనాను గుణంగా రూపప్రధానాలు, క్రియా ప్రధానాలు, అర్థ ప్రధానాలనే పేర వర్గీకరణం జరిగింది.[3]

ఆంగ్లంలో పొడుపు కథను (Riddle) రెండు విధాలుగా వర్గీకరించారు. ఎనిగ్మా (Enigma) "నిగూఢ మైన అర్థం కలిగిఉన్న ప్రకటనం లేక ప్రశ్న లేక బొమ్మ" అనీ, కనన్డ్రం (conundrum) "పలురకాలైన అర్థాల్ని లేక ప్రయోజనాల్ని స్ఫురించేట్లుగ చమత్కారంగా ప్రయోగించిన పదంలేక పదాల కలయిక అనీ, లేక ఉచ్చారణలో ఒకే శబ్దాన్ని లేక దాదాపు ఒకే విధమైన శబ్దాన్ని కలిగి ఉన్న పదం యొక్క లేక పద బంధాల యొక్క చమత్కారవంతమైన ప్రయోగం మరియు పదాల గారడి" అనీ నిర్వచించారు[4] 'ఎనిగ్మాస్' వర్గానికి చెందినవి తెలుగులోని జాతిదేశికి చెందిన వాటితో, 'కనన్డ్రంస్' వర్గానికి చెందినవి నిబద్ధ దేశికి చెందిన వాటితో సంవదిస్తాయని డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు అభిప్రాయం,[5]

1. జానపద సాహిత్య స్వరూపం - పుటలు : 85,86. 87.
2. జానపద విజ్ఞాన వ్యాసావళి - పుటలు : 89, 90, 91.
3. కన్నడ సావిరద ఒగటు గళు. పు : 32.
4. **Random House Dictionary.**
5. భారతి-జనవరి-1968.

రూపాన్ని దృష్టిలో ఉంచుకొని చేసిన ఈ విభజనం కూడా గమనార్హం. "1. మనుష్యులు జంతువులు అని గుర్తింపరాని జీవాలతో పోలిక. 2. జంతువులతో పోలిక. 3. మనుష్యులతో పోలిక. 4. వృక్షాదులతో పోలిక. 5. వస్తువులతో పోలిక.[1].

Folk lore and Folklife లో వర్గీకరణ ఇలా ఉంది, 1. వివరణాత్మకాలు. (Descriptivc Riddles), 2. పరిహాసపు ప్రశ్నలు (Joking Questions లేదా Reverse Riddles), 3. వివేకపు ప్రశ్నలు (Wisdom Questoins) 4, విడికథలు (puzzles) 5. అనుకరణ కథలు (Parody Riddles)

ఇక సంస్కృతాలంకారికులు చెప్పిన వివిధ రకాల ప్రహేళికలు దాదాపుగా అర్థ దృష్టితో చేసిన వర్గీకరణం వల్ల ఏర్పడినట్టివే. దండి కావ్యాదర్శంలో సమాహిత, వంచిత, వ్యుత్క్రాంత, ప్రముషిత, సమానరూప, పరుష, సంఖ్యాత, ప్రకల్పిత, నామాంతరిత, నిభృత, సమాన శబ్ద, సంమూఢ, పరిహారిక, ఏకచ్ఛన్న ఉభయచ్ఛన్న, సంకీర్ణ మొదలైన పదహారు రకాల బేదాలు చెప్పాడు. విశ్వనాథుడు సాహిత్య దర్పణంలో చెప్పిన ఆరు భేదాలు, భోజరాజు సరస్వతీ కంఠాభరణం లోని ఆరుభేదాలు ఒకే విధంగా ఉన్నాయి. చ్యుతాక్షర, దత్తాక్షర, చ్యుతదత్తాక్షర, అక్షర ముష్టి, బిందుమతి, అర్థమతి.

వర్గీకరణాలెన్నో ఉండవచ్చు. విభజనకై తొక్కిన మార్గాలు భిన్నం గా వచ్చు. అవి ఆయా భాషలకు నప్పవచ్చు; నప్పక పోవచ్చు. అయినా అందరి కృషి ప్రశంసనీయమయింది. వేలకొలది తెలుగు పొడుపు కథల్ని పరిశీలించి నప్పుడు విషయాన్ని దృష్టిలో ఉంచుకొని విభజనం చేయడమే సరైందనిపించింది. అందుకే ఈ గ్రంథంలోని జానపద సాహిత్యమనే ప్రకరణంలో నవవిధ ప్రహేళికలుగా వర్గీకరించి వివరించడం జరిగింది. 1. గృహజీవన ప్రహేళికలు, 2. శ్రామికజన ప్రహేళికలు' 3. ప్రకృతి సంబంధి ప్రహేళికలు, 4. తిర్యక్ సంబంధి ప్రహేళికలు, 5. క్రీడా వినోద ప్రహేళికలు. 6. బాల బాలికా ప్రహేళికలు, 7. తాత్త్విక ప్రహేళికలు 8. అస్పష్ట ప్రహేళికలు, 9. ఆత్మాశ్రయ ప్రహేళికలు.

1. Introducing Folk lore-p : 120.

విషయం ఎన్ని విధాలుగా ఉన్నా మొత్తం మీద తెలుగు పొడుపు కథ మాత్రం మార్గ సాహిత్యాన్ని అనుసరించింది, దేశి సాహిత్యపు పుంతలు, త్రొక్కింది. దేశి సాహిత్యంలోనే అంతర్భాగంగా అధిక సంఖ్యలో జానపద ప్రహేళికల్ని ప్రసవించింది. జానపద సాహితీ ప్రియంభావుకుల మనసుల కెక్కింది; మన్ననలను అందింది. ఇలా అతివేలంగా గౌరవాదరాల్ని పొందిన పొడుపు కథ ప్రయోజనాలేంటో పరిశీలిద్దాం.

## 1-7 : ప్రయోజనం

మానవజాతి యెంత ప్రాచీనమయిందో పొడుపు కథలంత ప్రాచీనమైనవి. ఈ జాతి యెంత కాలముంటుందో పొడుపు కథలంత కాలముంటాయి. మానవ జీవితంలో ఇంతగా పెనవే[illegible] సమాజంలో పొడుపుకథ సాధిస్తున్న ప్రయోజనమే ప్రథమ కారణమనాలి. ప్రకృతిలోని సాదృశ్య సారూప్యాలు, మానవాంతరంగంలోని భావాలు, ఈ రెండింటి సమైక్య స్వరూపంగా ఆవిర్భవించిన పొడుపుకథ విజ్ఞానాన్ని వినోదాన్ని నిత్యం అందిస్తూనేఉంది.

పొడుపు కథలపై విస్తృతాధ్యయనం జరిగినప్పుడు ఇంకా అనేక విషయాలు వెలికివచ్చే అవకాశముంది. చరిత్రకందని అతిప్రాచీనకాలం విషయం తెలియదు గాని మధ్యయుగంలో పొడుపుకథలు విస్తృత ప్రచారంలోకి వచ్చాయి. పాశ్చాత్య దేశాలలో పదహారవ శతాబ్దంలోనే పొడుపు కథలపై పరిశోధనలు జరిగాయి. భారతీయ భాషల్లో ఈ మధ్యకాలంలోనే పరిశోధనలు జరుగుతున్నాయి. పొడుపుకథా ప్రయోజనాలు బహిర్గతమవుతున్నాయి.

## 1-7-1 : లోకజ్ఞానం

ప్రతి వ్యక్తి ఈ లోకాన్ని తెలుసుకోడానికి ప్రకృతినీ, గ్రంథాల్నీ, సమాజాన్నీ అధ్యయనం చేయాలి. అప్పుడు లోకజ్ఞాన మబ్బుతుంది. గ్రంథగతమై మౌఖిక ప్రచారం పొందుతున్న పొడుపు కథల్ని చదవడంవల్ల వినడం వల్ల లోకజ్ఞానం కలుగుతుంది. సామాజిక విషయ సంబంధులైన ప్రహేళికల వల్ల కవులు సృష్టించిన పొడుపు పద్యాల వల్ల వర్తమాన భూతకాలాలకు సంబంధించిన అనేక విషయాలు తెలుస్తాయి.

## 1-7-2 : శాస్త్ర విషయ పరిజ్ఞానం

పొడుపు కథల్లో తత్వాలున్నాయి జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించిన సూచనలున్నాయి. ఆరోగ్య వైద్యశాస్త్ర సంబంధమైన విషయాలున్నాయి. నిత్య జీవితానికుపకరించే గణితశాస్త్ర విషయాలున్నాయి. ఓ క్రమ పద్ధతిలో నేర్చుకోవడంలో విసుగు కలుగవచ్చు. కాని శాస్త్రీయ విషయాల్ని మానసికోల్లాసం కలిగించేట్లుందించే శక్తి పొడుపు కథకుంది.

## 1-7-3 : క్రీడాసక్తి

మనిషికి క్రీడల విషయంలో సహజాసక్తి ఉంటుంది. బాల బాలికలు వృద్ధులు శరీరానికాయాసం కలిగించే పెద్ద ఆటలను ఆడలేక పోవచ్చు. అటు వంటివారి మానసిక వ్యాయామానికి ఈ పొడుపు కథలు దోహదం చేస్తాయి. హాస్యోద్భారాల్లో ముంచివేసే గుణం కలిగి పొడుపుకథలు క్రీడాసక్తిని మరీ పెంచు తాయి. పొడుపు విడుపులతో కొనసాగే ఈ క్రీడ కూర్చొని ఆడే ఆటే.

## 1-7-4 : ఆలోచనాశక్తి

పొడుపుకథ ఓ జటిల ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానం రావాలంటె కొంత ఆలోచన కావాలి. ఒక సమస్యను పరిష్కరించడానికి చేసిన ఆలోచన వల్ల కలిగిన స్ఫురణ, మరొక సమస్యను పరిష్కరించడానికి తోడ్పడుతుంది. వ్యక్తిలో దిన దినం ఆలోచనాశక్తి ఎదగడం పొడుపుకథ సాధిస్తున్న ప్రయోజనాల్లో ఒకటి అనాలి.

## 1-7-5 : జ్ఞాపకశక్తి

పొడుపుకథలు జ్ఞాపక శక్తిని పెంచుతాయి. పొడుపు కథ అడిగే వ్యక్తికి అది తెలిసి ఉండాలి. ఈ తెలిసి ఉండడానికతడు ధారణ చేసి ఉండాలి. ఒక విషయాన్ని మాటి మాటికి ఆవృత్తి చేయడంవల్ల ధారణ జరుగుతుంది. ధారణ వల్ల విషయం మనస్సులో నాటుకొంటుంది. అలా నాటుకొన్న అనేక విషయాల వల్ల జ్ఞాపకశక్తి పెరుగుతుంది.

## 1-7-6 : వాచకశక్తి

స్పష్టమైన ఉచ్చారణకు, అర్థవంతమైన భాషణానికి బాలబాలికల్ని వల్లె వేయించే పద్ధతి శ్రేష్ఠమయిందని కొందరు మనోవైజ్ఞానికులంటారు. పొడుపుకథల్లోని చమత్కార చారుత కారణాన పిల్లలు వల్లె వేస్తారు. అందువల్ల వాచకశక్తి పెరుగుతుంది. పూర్వం గ్రామాల్లోని రచ్చబండల మీద పిల్లలచేత తోక పద్యాల్ని చదివించేవారు. వీటిని సంస్కృతంలో ప్రతిమాల అంటారు. పొడుపు కథల్లోని విడుపును ముక్తపద గ్రస్తంగా అందుకొనే పద్ధతి యెటువంటిదో ఈ తోక పద్యాల పఠనం కూడా అటువంటిదే. అంత్యాక్షరిని గ్రహించి మాట అనడం, పాట పాడడం మొదలైన పోటీలు ఇప్పుడు కూడా జరుగుతున్నాయి. వీటివల్ల పిల్లల్లో వాచక శక్తి పెంపొందుతుంది.

## 1-7-7 : సమన్వయశక్తి

సమన్వయ జ్ఞానమున్నప్పుడు మాత్రమే సగానికి సగం పొడుపు కథలర్థమవుతాయి. పదాన్వయం, వాక్యాన్వయం తెలుసుకోవాలనుకుంటే క్లిష్టపద్యాలు మెదడే అదరగొడతాయి. పొడుపు కథల్లోని అలతి పదాలు చిన్నతనం నుండే బాలబాలికల్లో సమన్వయ జ్ఞానశక్తిని పెంచుతాయి. ఈ సమన్వయశక్తి అక్షర పదవాక్యాల వరకే పరిమితం గాక ఆ వ్యక్తుల జీవితాల్ని సరియైన మార్గానికి త్రిప్పుతుంది. అప్పుడా సమన్వయం అర్థవంతమై జీవితానికి ఒక సాఫల్యాన్ని సమకూర్చిపెడుతుంది.

## 1-7-8 జిజ్ఞాస

విజ్ఞానం ఆకాశంలాగా అంతూ పొంతూ లేనిది. అది అందుకోడానికి ఒక జీవితం సరిపోదు. కొంత తెలిసిన పిదప ఇక చాలును అనుకోడం సహజముకాదు. కొన్ని రకాల శాస్త్ర విషయాల్లో ఇక తెలుసుకోడం చాలు అని మనిషికి అనిపించవచ్చు. కాని పొడుపు కథల విషయంలో అలాకాదు. అవి నిరంతరం మనిషిని జిజ్ఞాస పథంలో పురోగమింప జేస్తాయి.

## 1-7-9 : ఏకాగ్రత

బండమీద పడ్డ గాజు పెంకువంటి భావాలు గల మనస్సుతో మనిషి అనైకాగ్రత పొందడానికి ఈ ప్రపంచంలో అనేక రకాల కారణాలున్నాయి. చూపు నిలుపడానికి మనస్సు స్థిర పడడానికున్న సాధనాలు స్వల్పం. పొడుపు కథా శ్రవణం వల్ల, పఠన పాఠనాదుల వల్ల అనైకాగ్రత తొలగి ఏకాగ్రత ఏర్పడే అవకాశముంది. ఆ ఏకాగ్రతవల్ల బుద్ధికుశలత పెరిగి మనిషి మేధావిగా తయారవుతాడు.

## 1-7-10 : విచిత్రవాగ్వ్యవహారం

పొడుపు కథాధ్యయనం వల్ల ప్రాసంగికుని మాటల్లో అడుగడుగున చమత్కారం ఉద్భవిస్తుంది, అది మాటల గారడి అనిపించినా అర్థవంతమైన పలుకుకు ఆదరణ ఉండకపోదు. ఎదుటి వానిలో కలగే ఆవేశోద్రిక్తలనుకూడ ముచ్చటగొలిపే ముచ్చటలు మురిపిస్తాయి. విచిత్ర వాగ్వ్యవహారం ఆలోచనల్ని రెకెత్తింప జేయడమేగాక హాస్యరసోత్పత్తికి కారణ భూతమవుతుంది; విన్నవారి లోను చమత్కారోదయ మవుతుంది.

## 1-7-11 : మానసిక వికాసం

ఉన్నచోటనే మనిషి-మనస్సు ఉండడం అభ్యుదయంగాదు. ఉన్నత పథాన విహరించాలి. విహరించాలంటే మనస్సు వికసించాలి. మనః పరిణతికి, వికాసానికి తద్విషయగత చింతన అవసరం. అటువంటి చింతనకు దోహదం చేసే శక్తి పొడుపు కథకుంది. పొడుపు కథల్ని గూర్చి చింతన చేయడం వల్ల సమాజంలోని, సాహిత్యంలోని, సృష్టిలోని అనేక విషయాలు తెలిసి మనస్సు వికసించడానికి అవకాశముంది. మనోవికాసం వల్ల ఇరుకైన మనస్సు విశాలమైనదిగా, విశాలమైన ప్రపంచం చిన్నదిగా కనిపించి వ్యక్తి తన కార్యక్షేత్రంలో నిర్భయంగా సంచరించడానికి వీలుంది.

## 1-7-12 : రహస్యగోపనం

పూర్వకాలంలో గూఢచారులు ఒక రహస్యం అన్యులకు తెలియకుండా తమ వారికే తెలిసేట్లు చేయడంలో ప్రహేళికల నుపయోగించేవారు. దండికావ్యా

దర్శంలో ఈ విషయం తెలిపాపాడు.[1] బిందుమతి ప్రహేళికలో అక్షరాలు సున్నలుగా సంకేతించడం ఇటువంటిదే. ఇంగ్లీషు భాషలో 'మోర్సుకోడ్' పద్ధతిని కట్టకడలతో తంతులు పంపడం కూడా ఈ కోవకు చెందిందే 'మనం ఈ రోజు లెక్కలు చేయలేదు, పంతులు రాకముందే పారిపోదాం' అని ఒక బాలిక ఇంకో బాలికతో ఎవరికర్థంగాని విధంగా అనాలంటే ప్రతి అక్షరానికి ముందు 'క' చేర్చి పలుకాలి. అదే 'కభాష' అనబడుతుంది. గుప్తంగా సంభాషించడంలో ప్రహేళిక తోడ్పడడం వల్ల దేశద్రోహకరాలైన కార్యాల్ని అరికట్టడానికి వీలవుతుంది.

ఇంతేగాక ప్రాచీన కాలంలో యుద్ధాలు నిరోధించి ప్రజల మానప్రాణ రక్షణలకు కూడా ప్రహేళికలను ఉపయోగించే వారని తెలుస్తోంది. ఇద్దరు రాజులకు యుద్ధం సంభవించినప్పుడు ఆ ఇద్దరొక నిర్ణయానికి వచ్చేవారు. ఆ నిర్ణయం ప్రకారం ఇద్దరి ఆస్థానాల్లోని పండితులకు ప్రహేళికలపై వాదోప వాదాలు జరిగేవి'. ఎవరు సమాధానం చెప్పకపోతే వారి రాజు ఓడి పోయినట్లుగా పరిగణించేవారు. అటువంటి పద్ధతీ ఈనాడు లేకపోవడం దురదృష్టం.

రాజకుమార్తెలు అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పినవాణ్ని వివాహ మాడే ఆచార ముండేది. ఆ ప్రశ్నలన్నీ ప్రహేళికా లక్షణాలకు సంవదిస్తాయి, విజ్ఞాన విషయికమైన పరీక్ష చేత వివాహ బంధం, ఇది ఆ దంపతుల మానసిక స్థాయికి కొలమానం. ప్రశ్నలకు సమాధానాలు చెప్పని వారిని చంపడం అనేది మాత్రం క్రూరనియమమే. అనాలి.

వేశ్యలుకూడా కొన్ని ప్రశ్నలు వేసేవారు. ఆమె పొందుకై తపించే విజ్ఞానులు ఆ చిక్కుముళ్లను విప్పడానికి యత్నించే వారు. సమాధానాలు చెప్పని వారి నెత్తి గొరిగించి గాడిదపై త్రిప్పి అపహసించే నిబంధనలు కూడా అక్కడక్కడ ఉండేవి.

రాజులు పండిత సభలు - గోష్ఠులు నిర్వహించేవారు. ఇవి వినోదార్థం ఏర్పరిచి నట్టివే. ఈ సభల్లో గోష్ఠుల్లో గెలిచిన పండితునికి సన్మానం జరిగేది, ఓడిపోయిన వారు ఒప్పందాలకనుగుణంగా నడుచుకునేవారు. ద్రవ్య మివ్వడం, దాస్యం చేయడం. దూరదేశం వెళ్లిపోవడం మొదలైన ఒప్పందాలుండేవి.

1. కావ్యాదర్శమ్ పు : 362

దండి చెప్పిన ప్రహేళికా ప్రయోజనాలను, వ్యాఖ్యాత అభిప్రాయాల్ని శ్రీ భాష్యం విజయ సారథి ఉట్టంకించారు. జనవ్యవహారంలో ఉన్న పై అభిప్రాయాల్ని అవి బలపరుస్తున్నాయి.

"క్రీడా గోష్ఠీ వినోదేషు తజ్ఞైరాకీర్ణ మంత్రణే।
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః॥

"క్రీడార్థం యాగోష్ఠీ సభా, తత్రయే వినోదాః విచిత్ర వాగ్వ్యవహారైః ప్రమోదాః తేషు, తథా తజ్ఞైః ప్రహేళికాభిజ్ఞైః ఆకీర్ణే వ్యాప్త సమాజే యన్మంత్రణం గుప్తభాషణం తస్మిన్. తథా పరస్య బోద్ధవ్య పురుష భిన్నస్య వ్యామోహనే అభిప్రేతార్థానవ గమనేచ, ప్రహేలికాః సోపయోగాః ఉపయుక్తాస్సంతీతి భావఃయద్యపి శబ్దాలంకారాది రూపేణేయం న తవ్యోపయుక్తా తథాపి విదుషాం క్రీడాగోష్ఠీ వినోదాదిషు ఉపయుక్తేలి భావరి" అని వ్యాఖ్యాత విద్యాభూషణ శ్రీరంగాచార్య శాస్త్రి వివరించెను. (కావ్యాదర్శము 362 పుట, భండార్కార్ పరిశోధన)

ప్రహేళికలు అంటే యేంటో నాటి కాలంలో బాగా తెలిసి ఉండడం వల్ల లక్షణం చెప్పక వాటి ఉపయోగాల్ని మాత్రమే దండి తెలిపాడు. క్రీడా ప్రాయాలైన వినోద గోష్ఠుల్లోనూ సమాజంలో గుప్తంగా సంభాషించడంలోనూ తెల్పదగిన వ్యక్తికి తప్ప మిగతా వ్యక్తులకు బోధపడనట్లు మాటలాడడంలోనూ వీటి ఉపయోగిముంటుందని దండి ఉట్టంకించడం వల్ల ప్రహేళికా స్వరూప స్వభావోద్దేశ్యాలు ఎటువంటివో మనకు వ్యక్తమవుతాయి"[1]

"గురుశిష్యులు దూరప్రాంతమున కేగునప్పుడు శిష్యులకు మార్గాయాస భావన కలుగకుండుటకై వారు చదివినది ఎంతవరకు గ్రహించిరను విషయము తెలిసికొనుటకును ధారణాశక్తి పెంపొందించుటకును గురువులు ప్రహేళికల నుపయోగించెడివారు"[2] "వానను రప్పించడం కోసం పెళ్లిళ్లలో వినోదం కోసం,

1. ప్రహేళికలు, ప్ర. అనుసంహిత. పు : 8.
2. ప్రహేళికలు. ద్వి. అనుసంహిత పు : 11.

పంటల సమృద్ధికోసం ప్రహేళికలను వాడుతారు"[1] ఈనాడు జానపదులు కప్పను ఓ కట్టెకు వ్రేలాడవేసి వర్షం కొరకై ప్రార్థనలు చేస్తూ పాడేపాట ఒకటుంది. అందులో ప్రహేళికా లక్షణాలేంలేవు. పూర్వ కాలంలో గేయ ప్రహేళికలు పాడే వారేమో!

## 1-7-13 : దివ్యయోగం

ప్రహేళికలు సాహిత్యయోగంలో యమనియామాదుల్లాంటివని శ్రీ భాష్యం విజయసారథి అభిప్రాయం. వారు వివరించిన ప్రహేళిక ప్రయోజనాల్లోని ఆ యోగాంశం ఇక్కడ ఉదాహరిస్తున్నా.

"సాహిత్యమున వెలువడిన ప్రతిప్రక్రియకొక ప్రయోజనము మరియు ఉద్దేశముండును. ప్రహేళికా జాతీయములైన ప్రశ్నోత్తరములు సైతము విశిష్ట ప్రయోజనమునకేర్పడినవియే. ఇందుకలది శబ్దముల గారడియే కదాయని తృణీకరించుట విజ్ఞత కానేరదు. సాహిత్యమొక దివ్యయోగము. పరమాత్మ సాక్షాత్కారమునకు యోగమెట్లు పరమావలంబమో ఆనందానుభూతికి సాహిత్యమట్లు పరమావలంబమగును. ప్రహేళికలు సాహిత్యయోగమందు యమనియమాదుల వంటివనవచ్చును. మానవుని యందలి ఆసుర ప్రవృత్తిని నిర్మూలించి సౌర ప్రవృత్తిని పెంపొందించ నవతరించినదీ సాహిత్యయోగ విద్య. అట్టి సాహిత్య యోగవిద్యానందము ననుభవించదలచు సాధకునకు ప్రహేళికలు ప్రాథమిక నియమ సూత్రములగును. ప్రహేళికా ప్రక్రియకు జెందిన ప్రశ్నోత్తర జాతి విద్యార్థులలో చక్కని జిజ్ఞాసనే గాక బుద్ధి సూక్ష్మతను ప్రజ్ఞా ప్రాభవమును పెంపొందించును. వివిధ విషయ పరిజ్ఞానము ఆలోచనా శక్తి ధారణ ఏర్పడును. లోక శాస్త్రములలో నెన్నియున్నవో అన్ని ప్రశ్నోత్తర ప్రహేళికలయందు గోచరించును. చమత్కార రూపమున వివిధ విషయ పరిజ్ఞానము కలిగించుటయే ప్రహేళికల పరమోద్దేశ్యము"[2]

ఈ విధంగా లోకజ్ఞానాన్ని కలిగించి, శాస్త్ర విషయ పరిజ్ఞానాన్ని పెంచి, క్రీడాసక్తిని, ఆలోచనా శక్తిని జ్ఞాపకశక్తిని, వాచకశక్తిని, సమన్వయశక్తిని,

1. జానపద సాహిత్య స్వరూపం-పు : 88.
2. ప్రహేళికలు. ద్వి. అనుసంహిత-పు : 9.

జిజ్ఞాసను, ఏకాగ్రతను, విచిత్ర వాగ్వ్యవహారాన్ని, మానసికవికాసాన్ని కలిగించి, రహస్య గోపనానికి తోడ్పడే దివ్యయోగమైన ప్రహేళికల వికాసాన్ని గూర్చి సంగ్రహంగా తెలుసుకొందాం.

## 1-8 : వికాసం

## 1-8-1 : ప్రహేళికప్రభావం

భారతీయ భాషల్లో అతి ప్రాచీనమయింది సంస్కృతం. పొడుపుకథలు ఆ భాషలోనే మొదట పుట్టాయి. ప్రహేళిక అనే మాట ఎంత పురాతనమయిందో ఇంకా తేలాల్సి ఉంది. కాని ప్రహేళికల గుణాలు ప్రప్రథమంగా వేద గ్రంథాల్లోనే కనిపిస్తున్నాయి. అప్పటి నుండి ప్రహేళిక ప్రక్రియ స్థిరపడ్డానికి కొంత కాలం పట్టిందనవచ్చు. సంస్కృత ప్రభావం సర్వ భారతీయ భాషలపైన పడడం వల్ల ఆ భాషలో ప్రహేళిక ఎలా వికసించిందో క్లుప్తంగా తెలుసుకొందాం.

ప్రహేళికల్లో ప్రశ్నోత్తర పద్ధతి కూడా ఉంది. ఋగ్వేదంలో బ్రహ్మకు ఇంద్రునికి జరిగిన సంవాదం ఉంది ఆ సంవాదంలోని చమత్కారం గమనార్హం.

* "కోహగ్ం సొంమిత్యబ్రవీత్ ఏతత్ప్రదాయేతి
ఏతత్స్యా ఇత్యబ్రవీత్ యదేతత్ బ్రవీషీతి"[1]

తనకు సర్వాధికారాలివ్వాలని ఇంద్రుడు బ్రహ్మను కోరాడు. "ఇది నీకిచ్చి నేనేమి కావా'లని (కోహగ్ం స్యామిత్యబ్రవీత్ ఏతత్ ప్రదాయేతి) బ్రహ్మ లన్నాడు నీవేది పలికావో అదే కావాలని ఇంద్రుడన్నాడు. ఇంతలో బ్రహ్మ 'కః' అనే శబ్దాన్ని పలికాడు దానికి 'ఎవరు బ్రహ్మ' అని అర్థం. నీవు బ్రహ్మపద వాచ్యుడవు కావాలన్న ఇంద్రునికి, ఎవరు బ్రహ్మ అన్న బ్రహ్మకు "కః" లనేది సమాధానమయింది; ప్రశ్నకూడా అయింది.

వేద సాహిత్యానంతర గ్రంథాలు ఉపనిషత్తులు వాటిలోనూ ప్రహేళికల గుణాలు కనిపిస్తున్నాయి.[2] దేవతలు, మానవులు, దానవులు, ప్రజాపతిని తమ కుపదేశం చేయాలని అడిగారు. ఆయన ఆ ముప్వురకు 'ద' (దదద) అనే అక్షర ముపదేశించి అర్థం తెలుసా అని అడిగాడు. దేవతలు దమనం (ఇంద్రియ నిగ్ర

1. ఋగ్వేదం
2. బృహదారణ్యకం, ప్వ-బ్రా-ద్వి. ౮ : 1. 2. 3.

హం) అవలంబించాలనే అర్థంగై కొన్నామన్నారు. మనుష్యులు దానం చేయాలనే అర్థం గ్రహించామన్నారు. దానవులు దయనవలంబించాలనే అర్థం స్వీకరించామన్నారు దమం దానం దయ వారివారి గుణాల కనుగుణంగా స్వీకరించాలని ప్రజాపతి తలంచాడు. ఇందులో ప్రశ్నోత్తరాల పద్ధతే గాక ప్రహేళికల్లోని నిగూఢత్వం కూడా ఉంది. వ్యాసకృత బ్రహ్మసూత్రాల్లోను ఇలాంటి నిగూఢత ఉంది.

మహాభారతంలోని సర్పయుధిష్ఠిర సంవాదం, యక్ష ప్రశ్నలు సంపూర్ణంగా ప్రహేళికా లక్షణ లక్షితాలనిపిస్తాయి.

"బ్రాహ్మణుడనగ నెటువంటి వాడు? తెలుసుకొన దగ్గది యేది అని సర్ప రూప నహుషుడు ప్రశ్నించగా, సత్యదాన శీలాదులు గలవాడే బ్రాహ్మణుడని, సుఖదుఃఖాది వికారాల కతీతమైన బ్రహ్మ పదార్థమే తెలుసుకొనదగిం"దని ధర్మ రాజు సమాధానమిచ్చాడు.[1] మహాభారతాంతర్గతమైన అరణ్యపర్వమందున్న శతాధిక యక్ష ప్రశ్నల్లో కొన్ని ఇదివరకే ఉదాహరించడం జరిగింది.

యోగవాసిష్ఠంలో కిరాత రాజమంత్రులకు రాక్షసికి జరిగిన సంవాదంలో ప్రహేళికా గుణాలున్నాయి.

* "ఏకస్యానేక సంఖ్యస్య కస్యాబ్ధేరంబు ధేరివ
అంతర్బ్రహ్మాండలక్షోణి లీయంతే బుద్బుదా ఇవ॥
కిమాకాశ మనాకాశం నకించిత్కించి దేవకిమ్
కో అహమేవాస్మి సంపన్నః కోభవానప్యహంస్థితః॥
భవల్యాత్మా పరాత్మైష కథితః కమలేక్షణే
అనయైవ వచో భంగ్యా ప్రశ్నవిదోఽథ యోగ్యయా॥"

'యథార్థంగా ఒకటే అయినా ఉపాధి భేదం వల్ల అనేకంగా కన్పట్టేదేది? శూన్యంగాని ఆకాశమేది? లేనిదైనా ఉనికి గలదేది? నేనెవర్ని? మీలో అహంభావం కలిగివున్నదేది?" అని అడిగిన రాక్షసితో 'ఓ అరవిందలోచనా! యుక్తవాక్యాలచే నీవు పరమాత్మను గూర్చి తెలిపా"వని మంత్రి సమాధానాలిచ్చాడు.

---

1. మహాభారతమ్-అరణ్యపర్వము - సర్గ : 180.

వేదోపనిషదాది వేదాంత గ్రంథాల్లోనే గాక భారతాది గ్రంథాల్లోనూ, రామాయణాది కావ్య నాటకాల్లోనూ ప్రహేళికల ఛాయలున్నాయి. రామాయణంలో శ్రీరామచంద్రుడు సీతాన్వేషణా సందర్భంలో సీతను గూర్చి కొండను కోనను అడిగాడు.

* "సర్వక్షితి భృతాం నాథ దృష్టా సర్వాంగ సుందరీ
రామా రమ్యేవనాంతే అస్మిన్ మయావిరహితాత్వయా"[1]

ఈ శ్లోకమే ప్రశ్న, ఇదే సమాధానం. ఓ పర్వత రాజమా! నన్నెడబాసిన సర్వాంగ సుందరియైన నా ప్రేయసిని నీ వనమున చూచావా"! అని రాముని ప్రశ్న. "సకల రాజాధిరాజా! నిన్నెడబాసిన నీ ప్రేయసిని నే చూచాను సుమా" అని గిరిసమాధానం. కో అంటే కొండ కో అంటుంది. ప్రశ్న సమాధానంగా భాసించడం ప్రహేళికే.

సాహిత్య దర్పణం, కావ్యాదర్శం, కువలయానందాది అలంకారశాస్త్ర గ్రంథాలలో ఉదాహరింపబడ్డ చిత్రోత్తరాది లక్ష్యాల్లో చాలా వరకు ప్రహేళికల ఛాయలున్నాయి. నాటకాల్లోనూ ఇటువంటివి ఉండడం గమనార్హం. వికృత శ్లేష వక్రోక్తి ఉన్న హనుమన్నాటకంలోని ఈ క్రింది శ్లోకం ఒక ప్రహేళికే అనాలి.

* "భవిత్రీ రంభోరు త్రిదశ వదనగ్లాని రధునా
సతే రామ స్థాతా నయుధి పురతో లక్ష్మణసఖః
ఇయం యాస్యత్యుచ్చైర్విపద మధునా వానరచమూః
లఘిష్ఠేదం షష్ఠాక్షర పరవిలోపాత్ పఠపునః"[2]

ఓ జానకీ! ఎందుకు పొంగుతావు నీ రాముడు యుద్ధంలో నాముందు నిలువ లేడు. వానర సైన్యం నాశనమవుతుంది. దేవతలకు ముఖభంగం సంభవిస్తుం దని పలుకుతుండగా సీతాదేవి 'రావణా! నీవన్న మాటల్లో ఏడవ అక్షరాన్ని విసర్జించి

1. రామాయణమ్-అరణ్యకాండ-స : 64-శ్లో : 29-30.
(పాఠాంతరం....కచ్చిక్షితి భృతాం....)

2. హనుమన్నాటకమ్-దశమాంకము. శ్లో : 12.

పరిశీలించు జరిగేదేంటో నీకే తెలుస్తుందన్నది. మొదటిపాదంలో "త్రి", రెండవ పాదంలో 'న', మూడవపాదంలో "వి" అనే అక్షరాల్ని తీసివేస్తే రావణునకు హాని, రామునికి విజయం, వానరులకు ఔన్నత్యం సంభవిస్తుందని అర్థం వస్తుంది. ఇందులో అక్షరహీనం వల్ల అర్థాంతరమేర్పడింది.

ఈ విధంగా ఆయా గ్రంథాల్లో బిందురూపంగా ఉన్న సంస్కృత ప్రహేళికలు ధర్మదాససూరి, విశ్వేశ్వర పండితుల కాలం నాటికి ప్రహేళికల పేరిట ప్రత్యేక గ్రంథాలే ఆవిర్భవించడానికి అవకాశమేర్పడింది. విదగ్ధమండన కర్త అయిన ధర్మదాస సూరి ప్రహేళికకు పరమాచార్యుడు. కవీంద్రకర్ణాభరణ కర్త అయిన విశ్వేశ్వర చంద్రుడు ప్రహేళికా ప్రక్రియకు ప్రాణప్రతిష్ఠ చేశాడు. ఆ కారణాన్నే కొన్ని లక్షల ప్రహేళికలు సంస్కృతంలో పుట్టాయని అంటారు. అయితే అవన్నీ ఇప్పుడు లభ్యంకావడంలేదు.

శూద్రక కవి విరచిత మృచ్ఛకటికంలో పొడుపుకథ మీద సాగిన కొంత సంభాషణముంది. వసంతసేన వచ్చిందనే విషయం చెప్పడానికి కుంభీలకుడు చారుదత్తుని దగ్గరకు వస్తాడు. అప్పుడు చారుదత్తుని మిత్రుడు విదూషకుడైన మైత్రేయుడు వచ్చిందెవరో చెప్పాల్సిందని అడుగుతాడు. మైత్రేయుణ్ని ఆట పట్టించడానికి కుంభీలకుడు నిశ్చయించుకొంటాడు. వాళ్ల ఇద్దరి మధ్య ఇలా సంభాషణ జరుగుతుంది.

* "మైత్రే : తొత్తుకొడుక! కసాయి యంగడిలో ముసలిమేకవలె మెమెమే యనెదవెవరామె !

కుంభీ : తొలకరిలో కప్పవలె నెవరని అట్లుఅరచెదవేల నీవు?

మైత్రే : నాకు తెలియలేదు చెప్పుము !

కుంభీ : (తనలో) ఇట్లాడించెదను. (ప్రకాశముగ) నేనొక పొడుపుకథ యడిగెదను జెప్పెదవా !

మైత్రే : నేను నీ నెత్తిమీద రాళ్లుపెట్టెదను, ఆగెదవా?

కుంభీ : సరియే కాని మామిడి చెట్లేకాలమున పుష్పించును?

మైత్రే : తొత్తుకొడుక! గ్రీష్మ ఋతువులో కాదటరా!

కుంభీ : (నవ్వుచు) కాదయ్యా కాదు.

మైత్రే : (తనలో) గ్రీష్మఋతువుకాక యే ఋతువో! పోనీ చారుదత్తు నడిగెదను. (ప్రకాశము) కుంభీలక! ముహూర్తమోపిక చేయుము. (చారుదత్తునొద్దికింబోయి) మిత్రమా! మామిడిచెట్లే ఋతువులో పుష్పించును.

చారు : మూర్ఖుఁడ! వసంతఋతువులో

మైత్రే : మూర్ఖుఁడ! వసంత ఋతువులో

కుంభీ : ఇంకొకటి యడిగెదను. సమృద్ధములగు గ్రామములను రక్షించునది యెవరు?

మైత్రే : విధి.

కుంభీ : (నవ్వుచు) కాదయ్యా కాదు.

మైత్రే : (తనలో) అవును. నాకును సంశయముగానే యున్నది. చారుదత్తు నడిగి తెలిసి కొనెదను. (అని చారుదత్తు నొద్దికింబోయి యడుగును)

చారు : మిత్రమా! సేన

మైత్రే : (చేటునితో) తొత్తుకొడుక! సేన.

కుంభీ : ఈ రెండును గలిపి చదువుము.

మైత్రే ; సేనా వసంత.

కుంభీ : తలక్రిందుగా జెప్పుము.

మైత్రే : (తలక్రిందుగా జేసి) సేనావసంత.

కుంభీ : ఓ మూర్ఖ బ్రాహ్మణ! పదములు తలక్రిందుగా జేయుము.

మైత్రే : (కాళ్లు పైకెత్తి) సేనావసంత.

కుంభీ : ఓ మూర్ఖ బ్రహ్మచారి! నీ పదములుగాదు. ఆ మాటలలో నున్న పదములు తలక్రిందులుగా జేయుము.

మైత్రే : (ఆలోచించి) వసంతసేన.

కుంభీ : ఆమెయే వచ్చినది.[1]

1. మృచ్ఛకటికము-V పు : 90-91

ఇది తిరుపతి కవులఅనువాదం. మామిడి చెట్లు ఏకాలంలో పుష్పిస్తాయి? గ్రామాల్ని రక్షించేది యెవరు? ఇవి పొడుపులు కాగా "వసంతసేన" విడుపయ్యింది. సంస్కృత నాటకాల్లో సాధారణ సంభాషణల సందర్భాల్లో కూడ ప్రేక్షకుల్లో చమత్కారోదయానికై ఇటువంటి పద్ధతి అవలంబించారంటే ప్రహేళిక జన వ్యవహారంలో ఎంతగా చొచ్చుకొని పోయిందో తెలుస్తుంది. ఈ విధంగా పల్లవించి పుష్పించిన సంస్కృత ప్రహేళిక తెలుగు పొడుపు కథలకు మార్గదర్శనం చేసింది. తెలుగు పొడుపు కథ సంస్కృత ప్రహేళికను అనుసరించడమే గాక తన సొంత గొంతుక కూడా విప్పింది.

## 1-8-2 : తెలుగు సొంతగొంతుక

ఇంతవరకు స్థాలీ పులాక న్యాయంతో సంస్కృత ప్రహేళిక వికాసాన్ని పరిశీలించాం. సంస్కృత గ్రంథాలందేవిధంగా ప్రహేళికల ఛాయలున్న శ్లోకాలున్నాయో, వచనాలున్నాయో, ఆంధ్ర సాహిత్యావిర్భావ కాలం నుండి లోకం మూలాచిన తెలుగు గ్రంథాల్లో కూడా అక్కడక్కడ పొడుపుకథ ఛాయలున్న పద్యాలున్నాయి; వచనాలున్నాయి.

* ఏయది హృద్యము పూర్వం
బేయది, యెద్దాని వినిన యెఱుక సమగ్రం
బై యుండు, నఘనిబర్హణ
మేయది, యక్కథయ వినగ నిష్టము మాకున్[1]

తమకిట్టి కథ కావాలని శౌనకాది మహామునులు ఏనాడో నైమిశారణ్యంలో సూతునితో అన్నారు. అటువంటి కథ భారత కథ కావడం ముదావహం. భారతీయ సంస్కృతి సంబంధులైన కథలన్నీ ప్రశ్నోత్తరాలతో కొనసాగడం గమనార్హం. ఆ పద్ధతినే ఆదికవి నన్నయ్య భట్టు అవలంబించాడు. మరి ఆ పద్ధతి ప్రహేళికా సాహిత్య ప్రక్రియది.

---

1. భారతము - ఆది-ప్ర-ప : 30

ప్రాఙ్నన్నయ యుగంలో ప్రహేళికల రూపురేఖ లెటువంటివో తెలియవు. కాని ప్రాకృతాది భాషా గ్రంథాల్ని పరిశీలించినప్పుడు ప్రశ్నోత్తర రూప సాహిత్యం కనిపిస్తుంది. ఒక ప్రాకృత గాథ అనువాదం గమనిస్తే ఈ విషయం తేట తెల్లమవుతుంది·

* అలుకమాను చెలియ, అలిగినదెవ్వతె
మెలత నీవు, ఒరుల మీద నాకు
నేటి యలుక, యిట నెవ్వరోరులు, నాకు
నీవె, యెట్లు, నాయదృష్ట మహిమ![1]

ప్రేయసీ ప్రియుల మధ్యన కొనసాగిన ఈ సంభాషణల్లోని చమత్కారం కొంతవరకు పొడుపు కథల ఛాయల్ని తలపిస్తోంది.

పావులూరి మల్లన్న గణితం గణిత సంబంధులైన ఎన్నో పొడుపు కథలకు మూలమయింది. ఆ గణితం జైనుల గణిత శాస్త్రాన్ని అనుసరించిందైనా మల్లన ప్రతిభకది దర్పణం పట్టింది

* ఆరునొక్కట్ల నొడ్డుగా నమరబెట్టి
యంత గుణకంబు చేతను నమరబెంచి
సొరిది వర్ణించి జనులకు చోద్యముగను
హిమకరోపమ లబ్ధంబు నెనయవచ్చు.[2]

ఆరుఒక్కట్లను (111111) ఆరు ఒక్కట్లతో (111111) గుణించాలి. అప్పుడు 12345654321 సమాధానం వస్తుంది. చిత్ర కవిత్వంలోని పాదభ్రమ కాల లాగా పొడుపు కథల్లో పదభ్రమకాలుంటాయి. కట్టకట్టక, కెళకాళికే, కిటకోటకి వికటకవి మొదలైనవి. పై పద్యానికి వచ్చిన ఒకే సమాధానంలో అఖండంగా ఒక భ్రమకం, ఖండంగా రెండు భ్రమకాలు (123456, 654321) వస్తాయి గణిత శాస్త్రానికి సంబంధించిన పొడుపు కథల్లో ఇటువంటి చిత్ర విచిత్రాలనేకాలు గమనించగలం. ఏవిచిత్రాలు లేని అతి సాధారణ పద్యాలు కూడా మల్లన గణితంలో ఉన్నాయి.

---

1. గాథాసప్తశతి సారము. ప ; 304.
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యం-పు : 152.

* మేలుగ నెనిమిది యొక్కొకి
వాలయమున కంబుజంబు లర్పించినచో
నీ లెక్క నూట నలుబది
నాలుగు భవనములకెన్ని నళినములయ్యేన్.[1]

ఇది సాధారణమైన లెక్కే. మొత్తం 1152 అరవిందాలు సమర్పించవలసి ఉంటాయి. ఇటువంటి పద్యాలు ఎంతోకొంత చమత్కారాన్ని రంగరించుకొని గణిత సంబంధి పొడుపు కథలకు మార్గదర్శనం చేసాయి.

ఇంచుమించు చాళుక్య యుగానికే చెందిన వేములవాడ భీమకవిచాటు ధారల్లో అర్థకాఠిన్యం ఉన్న పద్యాలు కొన్ని లభిస్తున్నాయి. అవన్నీ మైలమ భీముడు మరణించిన సమయంలో కవి చెప్పాడని అంటారు. అందొకటి మాత్రం ఉదాహరిస్తాను.

* వీరగుణప్రతాప గుణ విశ్రుత! మైలమభీమ! నీయశం
బారభమాన తారకర హారవిలాసము నీ నికేతనం
బారభమాన తారకర హారవిలాసము నీ భుజార్గళం
బారభమాన తారకరహారవిలాసము చిత్రమిద్ధరన్.[2]

దుర్బోధార్థ పదావళి ఉంటే అది ప్రముషితా ప్రహేళిక అవుతుంది. ఈ పద్యంలో వచ్చిన పదాలే మాటి మాటికి ప్రయోగించి అర్థవైవిధ్యం సాధించడం జరిగింది. నన్నయ భారత రచన కాలానికి అటో ఇటో అయిన ఇటువంటి పద్యాలు సంస్కృత ప్రహేళికలను అనుసరించినవే అయినా ఇవిలెలుగు పొడుపు పద్యాలు నాడున్నవనడానికి ఆధారాలయ్యాయి.

కాకతీయ యుగంలో ప్రాదుర్భవించిన ఆంధ్ర భారతంలో గల యక్ష ప్రశ్నల పద్యాలు పొడుపుకథల ఛాయలున్నట్టివే. సంస్కృత భారతంలోని యక్షప్రశ్నల్లో ఎట్టిన్న కొన్నే స్వీకరించారు. ప్రశ్నోత్తరాలుగల ఆరు పద్యాలు మాత్రం ఇక్కడ ఉదాహరిస్తాను.

---

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం పు : 146.
2. చాటు పద్యమణిమంజరి-ద్వి-పు: 180

* దినకరునెయ్యేడ నడపును?
దినకరునెవ్వారు గొలిచితిరుగుదు! రద్దే
పునియస్తమించు చేమిట?
ననఘ! తదాధార భూతమది యెయ్యదియో.

* అనిన ధర్మజుడిట్లను నజ్జహితుని
నడపు బ్రహ్మంబు, సురకోటి నడచు గొలిచి
ధర్మ చేనస్తమితు డగుదపను, డమ్మ
హాత్మునకు సత్యమాధార మంద్రుబుధులు.[1]

* మొనసి నిద్రించియును గన్నుమూయదేద్ది?
పుట్టియును జేతనత్వంబు బొరయదెద్ది?
యరయరూపు గల్గియు హృదయంబులేని
దెద్ది? వేగంబుకతన నెద్దివొదలు.

* అనిన గన్నుమూయదు సుప్తమయ్యుమీను;
పుట్టియును గ్రుడ్డు చేతనంబొరయకుండు;
హృదయ రహితంబు రారూప, మేఱురయము
కతన వర్ధిల్లునని చెప్పె గౌరవుండు.[2]

* నరునకునాత్మయెవ్వడు? ఘనంబుగ దైవికమైనచుట్టమే
వ్వరతనికిం? దదీయమగు వర్తన మేమిట నిర్వహించు? భూ
వర! యతడేమి పూని యనవద్యత బొందు? నెఱుంగజెప్పుమీ
వరుదుగ నన్న నక్కురు కులాగ్రణి యాతనితోడ నిట్లనున్.

---

1. భారతము. అరణ్య. అ : 7. ప : 423, 424.

2. భారతము. అరణ్య. అ : ప : 437. 438.

* ఆత్మజుఁడు సుమ్మో పురుషునకాత్మయయ్యె
నాతనికి భార్య దైవికమైన చుట్ట
మతని జీవిక పర్జన్యు కతన జెల్లు
నతడు దానము గొనియాది యతిశయిల్లు.[1]

సంస్కృత యక్ష ప్రశ్నలేనాడో భారతీయ హృదయ కుహరాల్లో ప్రవేశించాయి. భారతానువాదం వల్ల అవి సర్వదేశభాషల్లోచొరబడి స్థిరపడ్డాయి. అవి యెన్నెన్ని పొడుపుకథలకు మూలాలయ్యాయో చెప్పడం సాధ్యంగాదు.

తాత్త్విక ప్రహేళికల ఛాయయున్న పద్యాలు కొన్ని ప్రాచీన గ్రంథాల్లో కనిపిస్తున్నాయి. రంగనాథ రామాయణంలోని ఈ పాదాలటువంటివే.

* మొగిరెంట బెరయక మూటనేర్పడక
తగ నాలుగింటను దాపుగైకొనక
(తగిలి నాల్గవ త్రోవ తత్వమైయుండి)
ఐదింటికాదియై ఆఱిటి గడచి
యేదికి నాదియై అమరిన దేవు....

రెండు: సుఖ దుఃఖాది ద్వంద్వం, మూడు : త్రిగుణాలు (ప్రకృతి), నాలుగు : ధర్మార్థ కామమోక్షాలు (సౌమ్య, గర్భ, ధూమ, అర్చిరాది మార్గాలు), ఐదు : పంచభూతాలు, ఆఱు : అరిషడ్వర్గాలు, ద్వంద్వాలకు చిక్కు బడక, త్రిగుణాత్మకం అయిన ప్రకృతిలో తెలియలేక, ధర్మార్థ కామమోక్షాల్లో బుద్ధిని జొనుపక, అరిషడ్వర్గాలను అతిక్రమించి పంచభూతాలకు సమస్తానికి కారణభూతుడై ఆదియైనవాడు భగవంతుడు. రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు సంఖ్యల్లో సంకేతింపబడ్డ అర్థాల వల్ల ఇటువంటివానిలో తాత్త్విక ప్రహేళికల ఛాయ ఉన్నాయని భావించడానికి అవకాశమేర్పడింది. సాహిత్యం సంకేత ప్రధానమై ఉండడం వల్ల క్లప్తతకు గుప్తతకు అది నిలయ మవుతుంది. పొడుపు కథా లక్షణాల్లో ప్రధానమైనవి క్లప్తత-గుప్తతలు.

---

1. భారతము. అరణ్య. ఆ : 7. ప : 444, 445.

ఇక రెడ్డిరాజుల యుగంలో అవిర్భవించిన అనేక కావ్యాల్లోనూ, చాటు పద్యాల్లోనూ పొడుపు కథల ఛాయలున్నాయి. కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, మంచనకేయూర బాహుచరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయం పరిశీలించినప్పుడు కథాకథనంలో కథాత్మకాలైన పొడుపుకథల ఛాయలు కొంత వరకు కనిపిస్తున్నాయి. వాటిది కావ్యదృష్టి అయినందువల్ల చమత్కారంపాలు తగ్గింది. కాని నాటి చాటు పద్యాలు కొన్ని పొడుపుకథా లక్షణాల్ని సంపూర్ణంగా పుణికి పుచ్చుకున్నాయి.

* మానుష దానమాన బలమానిత ధర్మరమా మనోజ్ఞరే
ఖానుత భూతి విత్తముల గాటయ వేమన బోల్తు వాసవిన్,
వానివిరోధి, వాని విభు, వానివిపక్షుని, వానియగ్రజున్
వాని మరంది, వాని సుతు, వానియమిత్రుని, వానిమిత్రునిన్[1]

పెదకోమటి వేముని శ్రీనాథుడు మనుతుల్యుడని ప్రశంసించిన పద్యంగా దీనిని పేర్కొంటున్నారు. ఇందరితో సమానమైనవాడు మనుతుల్యుడే గావచ్చు; అంతకుమించిగావచ్చు.

వాసవి అర్జునుడు, అర్జునుని విరోధి కర్ణుడు, కర్ణుని విభుడు దుర్యోధనుడు, దుర్యోధనుని విపక్షి భీముడు, భీముని అగ్రజుడు ధర్మరాజు, ధర్మరాజు మరది శ్రీ కృష్ణుడు, శ్రీ కృష్ణుని సుతుడు మన్మధుడు, మన్మధుని అమిత్రుడు శంకరుడు, శంకరుని మిత్రుడు కుబేరుడు. మానుషదానమాన బలమానిత ధర్మ రమామనోజ్ఞ రేఖానుత భూతి విత్తములలో కాటయ వేమన్నను పై వారితో పోలుస్తానన్నాడు శ్రీనాథుడు. పొడుపు కథతో పాటు క్రమాలంకారం. విడుపులు శృంఖలాల లాగా వచ్చాయి. దాంతో యోగరూఢ శబ్దాల మాలిక నుండి పరిహారం సిద్ధించింది. ఇటువంటివి పరిహారికా ప్రహేళికలనవచ్చు. ఆ కాలంలో ప్రహేళికాక్రీడను జనత సమ్మానించిందనడానికి శివరాత్రి మాహాత్మ్యంలోని ఈ పద్యమే తార్కాణం.

* ఒక కొంత ప్రొద్దు కందుక కేళి యొనరించు
కంకణంబుల ఝణత్కార మెసగ

1. చాటుపద్యమణిమంజరి-ద్వి. భా పు : 194.

నొకకొంత ప్రొద్దు వల్లకినఖాగ్రంబుల
బహురాగముల నేర్పు ప్రస్తరించు
నొకకొంత ప్రొద్దు కొండిక జనంబు లొనర్చు
పరిహాస గోష్ఠికి బల్లవించు
నొకకొంత ప్రొద్దు లోకకథా ప్రహేళికా
బిందుమత్యాదుల బిచ్చలించు
కొంత ప్రొద్దు వినోదించు గొఱతలయిన
తోడివేడుక కాండ్రతో మేడమీద
విమల చంద్రోదయారంభ వేళయందు
బిల్ల దీవాటలను మల్లుపెనగుటలను.[1]

ఇందున్న లోకకథ, ప్రహేళిక, బిందుమతి ఈ మూడు కూడా పొడుపు కథల్ని సూచించేవే. "బిందుమతి యనునది 'విప్రవినోద' మను ఇంద్రజాల విద్య వంటిది. విప్రవినోదమను విద్యను ఒక విధమగు బ్రాహ్మణజాతి వారే, వారును తెనుగు దేశమందే, ఒక గారడి విద్యగా ప్రదర్శించెడివారు' అని ఆంధ్రుల సాంఘిక చరిత్ర తెలుపుతోంది.[2] బిందువుల్ని సంకేతంగా గ్రహించి వ్రాసే పద్ధతి బిందుమతి. ఇది ప్రహేళికా వినోదమే. అయినా సాధారణ పాండిత్యమున్న వారికి తెలియని విధంగా వ్రాయడానికి, రహస్యాన్ని దాచడానికి ఈ పద్ధతిని ఉపయోగించేవారని చెప్పవచ్చు. సుకుమారుడనే స్వేచ్ఛావిహారి ప్రహేళిక, బిందుమతి తదితరాలైన విద్యల్లో ఆరితేరిన వాడని వర్ణించే ఘట్టంలో ఈ పద్య ముంది. కథలో సందర్భాను గుణంగా ఈ విషయం చెప్పినా నాటి సామాజిక జీవనానికి ఇది దర్పణం పడుతుంది.

విజయనగర రాజుల కాలంలో ఆవిర్భవించిన ఆంధ్రసాహిత్యంలో కూడా పొడుపుకథల ఛాయలున్న పద్యాలున్నాయి. శ్రీ కృష్ణదేవరాయల కూతురైన మోహనాంగి తనభర్త పేరు తెలుపడానికుపయోగించిన పద్ధతి పొడుపు కథను స్మరింప జేస్తుంది.

---

1. శివరాత్రి మాహాత్మ్యము ఆ. 2-ప : 87.
2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర-పు : 179.

* రాఘువా! మహీపుత్రికా రమణ! రావ
ణారి! జూపలరాణవ, సుతావనా! యన, ప్రథ
మాక్షరావళి, యేఘను నాఖ్యయౌనొ
అట్టి మత్పతి దైవంబె యగును నాకు.[1]

రామరాజు అనే తనభర్త పేరును తెలుపడానికి మోహనాంగి అనుసరించిన పై పద్ధతి వల్ల నాడు పొడుపు పద్యం ఒక వినోద ప్రక్రియగా ఉండిందని తెలుస్తోంది. ప్రశ్నోత్తర పద్ధతిని అనుసరించిన కళాపూర్ణోదయంలోని ఈ పద్యం కూడా పొడుపు కథల ఛాయఉన్నట్టిదే.

* అపరిమితానురాగ సుమ
  నోలసయై చిగురాకు చేతులం
దపసిని గౌగిలించె వని
  తాయిదె రంభ దలంప రంభలా
నపరిమితాను రాగ సుమ
  నోలసయై చిగురాకు చేతులం
దపసిని గౌగిలించుటచి
  తంబె గదాయని నవ్వరంభయున్.

మనుచరిత్రలోని ఈ క్రిందిపద్యం కూడా పొడుపు కథా లక్షణ లక్షిత మయిందే.

* శ్రీరుచిరత్వ భూతి మతి
  జిత్వరతాకృతి శక్తి కాంతులన్
ధీరత సారభోగముల
  ధీనిధి యీశ్వర నారసింహభూ

1. మారీచీ పరిణయము-అవతారికలోని పద్యం.

వారిజనాభ శంకరుల
వారి కుమారుల వారి తమ్ములన్
వారి యనుంగు మామలను
వారి విరోధుల బోలు నిమ్మహిన్.[1]

అతడీశ్వర నారసింహుడు. (ఈశ్వర రాజు కుమారుడైన నరసరాజు) మాధవ శంకరులతోనూ, వారి కుమారులు బ్రహ్మ కుమార స్వాములతోనూ, వారి తమ్ములు మన్మథ వీరభద్రులతోనూ, వారి మామలు చంద్రమైనాకులతోనూ వారి విరోధులు రాహువు దేవేంద్రులతోను పోలియుంటాడు. శ్రీ రుచిరత్వంనుండి భోగాలవరకు యథాసంఖ్యగా ఈ పోలికల్ని స్వీకరించాలి. ఆలంకారికమైన పొడుపు కథ ఆంధ్రకవితా పితామహుని అపూర్వసృష్టి.

ఇకనాటికవుల్లో తేనాలి రామ కృష్ణుడు తదితరుల పేరిట బహుళ ప్రచారం పొందిన అనేక చాటు పద్యాల వెనుక కావలసినంత కథ ఉంది. ఆ కథకు కేంద్ర బిందు భూతమయింది చాటుపద్యం. అటువంటి పద్యాలు కథాత్మక ప్రహేళికల ఛాయల్ని రంగరించుకొన్నాయి. పద్యాలేగాక పద్యాంశాలు కూడ కథాత్మకాలు కావడం గమనార్హం.

"కన్నొక్కటి లేదుగాని కంతుడవె కదా!..... తృవ్వట..., వాయెత్తదు రామరాయ వసుధేశునకున్..... మంగలి కొండోజి మేలు మంత్రులకన్నన్ ..., స్తుతమతియైన యాంధ్రకవి..., నాకీ పచ్చడమెచాలు నయముగ నిమ్మా ..., ముట్టుడిగిన సతికినొక్క మొగశిశు పుట్టెన్...., అమవసనిశియన్న మాట...., పయ్యెదలేనట్టులన్న...., గాడిద యేడ్చెన్ గదన్న...., రసికత్వము ఏమిగుర్తు రాయల రాయా...., తక్కిడి నాలంజకొడుకు తప్పులు వెదకున్...., రవిగాంచ నిచో కవిగాంచునెయ్యెడన్,...., సికమొదలంటగోతుమరి చెప్పున గొట్టుదు మోముదన్నుదున్,..., ప్రగడ రాణ్ణరసా నిరసా తుసాభుసా!.., కుంజరయూధంబు దోమ కుత్తుక జొచ్చెన్,.., ధృతి మంతుడు బొడ్డుచర్ల తిమ్మన బళిరే...., వక్త్రంబుల్ పది కన్నులైదు కరముల్ వర్ణింపగా వేయగున్...., నరసింహక్షితి

2. మనుచరిత్రము. పీఠిక-ప : 29

మాండలేశ్వరుల కృష్ణారాజ కంఠీరవా! ..., తియ్యని విలుకాడవయ్య తిమ్మరుసయ్యా!;..., ముద్దుగ గండపెండియరమున్ గొనుడు; .., ఊరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే ..," వందలకొద్దీ ఇటువంటి పద్యాంశాల వెనుక కథలున్నాయి; గాథలున్నాయి. వాటిలో హొదుపు కథల ఛాయలున్నాయి.

విక్రమార్కచరిత్ర కవి వంశ ప్రశంస సందర్భంలో విరచితమైన సీసమాలికలో కవితా రీతులు చెప్పబడ్డాయి. అందులో కొన్ని ప్రహేళికా భేదాలకు చెందినట్టివే.

* ..."ఎవ్వడేయవధాన మెఱుగ నయ్యవధాన
మునవానికించుక మ్రొల్లసూప
వృత్త కందము గంధవృత్తంబులును జతు
ష్కందంబు మొదలుగా గలుగు గర్భ
కావ్యవర్గము జెప్పగా ప్రబంధంబులు
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప
గా నక్షర చ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బంధ చ్యుతకంబు నామ
గోప్యంబులుం గ్రియా గోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప, గోష్ఠియందు
బద్యంబు గీతి కార్బటి నొగి జమపంగ
నెల్లవిద్యల సంచు చెఱుగనేర్తు
ననుచు, నెల్లూరి తిరుకాళ మనుజవిభుని,
సమ్ముఖమ్మున సాహిత్య సరణి మెఱసి
మహిమ గాంచిన పెద్దయామాత్య సుకవి
మనుమడవు నీవు నీవంశ మహిమ యొప్ప"[1]

జక్కన తాతగారు పెద్దయామాత్యుడు. చిత్రకవితారీతులతో అనేక రచనల్ని చేశాడు. ఇందులో చెప్పబడ్డ 'అక్షర చ్యుతకం మాత్రాచ్యుతకం, బంధ చ్యుతకం, నామగోప్యం, క్రియాగోప్యం, భావగోప్యం,' అనేవి ప్రహేళికా భేదాలే.

1. విక్రమార్కచరిత్రము-ప్ర : ప ; 20.

విజయనగర రాజుల కాలంలో ప్రహేళికలకున్న ప్రాచుర్యం గణనీయమైంది. కందుకూరి రుద్రకవిదిగా ప్రచారంలో ఉన్న ఈ క్రిందిపద్యం పూర్తిగ పొడుపు కథాలక్షణాలకు కుదురుకొంది.

* పొలుపుగ నంతరాళమున
బూచిన పువ్వు సు, పువ్వులోన పెం
పలరిన చెట్టు, చెట్టు చిగు
రాకున పండినపండు, పండునన్
* కొలకొల పిందె, పిందె గల
కొమ్మయి, నీకు కళావిభూతి, ని
శ్చల మహిమాయువున్ మతినొ
సంగుత మల్కిభరామ భూవరా![1]

అంతరాళంలో పూచినపూవు చంద్రుడు కళా కాంతులనిస్తాడు. పువ్వులో పెంపలరినచెట్టు లక్ష్మివిభూతి నిస్తుంది. చెట్టు చిగురాకున పండిన పండు విష్ణువు నిశ్చలమహిమ నిస్తాడు. పండున కొలకొలపిందె బ్రహ్మ ఆయుష్షు నిస్తుంది. పిందె ఉన్న కొమ్మ సరస్వతి మతినిస్తుంది.

విజయనగర రాజుల కాలంలోనే గాక పొడుపు కథల ఛాయలున్న పద్యాలు నవాబుల యుగంలో కూడ కనిపిస్తాయి. విజయ నగర రాజులకు నవాబులకు నడిమి కాలంగా తంజపూరు ఆంధ్రరాజుల్ని గ్రహించవచ్చు. అదే కాలంలో వచ్చిన పాలవేకరి కదిరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి కథలకు నిలయాలు. ఒకటి రెండు తప్ప అన్నికథల్లో భార్యవ్యభిచరించడం ఆ సమయానికి భర్త రావడం ఏదోఒక ఉపాయంతో భార్య తప్పించుకోడం అనేది మాత్రమే ఇతివృత్తం. ఈ వ్యభిచరించడం చిక్కుముడిలాగా భాసించి తప్పించుకొనే ఉపాయం విడుపువలె అనిపిస్తుంది. ఆ విధంగా భాసించే గుణందప్ప ఇందులో పొడుపుకథాలక్షణాలింకేమీ లేవు.

---

1. చాటుపద్య మణి మంజరి-ప్ర-పు : 118

* కొలదలి (పాఠాంతరం)

సుప్రసిద్ధమైన వేమన పద్యాలు ఈ కాలానికి చెందినవే. వేమన పద్యాల్లో ఆయనవెన్నో ఇతరులవెన్నో గుర్తించడం కష్టం ఆయన పద్యాల్లో కొన్ని అచ్చం పొడుపు పద్యాల్లాగానే ఉన్నాయి.

* పడతి మోసెనొకడు, పడతి మేసె నొకడు
పడతి నెదను బెట్టి బ్రతికె నొకడు
పడతికొరకు నిట్లు పడుపాట్లు పడెరయా
విశ్వదాభిరామ వినురవేమ!

ఈ పద్యం పొడుపుకాగా వేమన్నదే ఈక్రింది పద్యం విడుపయ్యింది.

* స్త్రీనెత్తిన రుద్రునకును
స్త్రీనోటను బ్రహ్మకెపుడు సిరిగుల్కంగా
స్త్రీనెదను రొమ్మునహరికి
స్త్రీనెడపగ నెరుగ నీవు దేవర వేమా![1]

* చరణంబులు పది తోకలు
పరగంగా మూడు తలలు బైటనె తిరుగున్
వరభూమి తల్లడిల్లగ
నిరహొందగ దీనితెలియ నెవడు వేమా![2]
(నాగలితో పొలందున్నడం)

* ప్రజలెఱుంగ బ్రదుక పట్టభద్రుడుగాడు
పై గిరీటముండు బ్రహ్మగాడు
ఓను దెలిసి పలుకు యోగీశ్వరుడుగాడు
అట్టివాని దెలియనగును వేమ![3]
(బల్లి- రాచపాము)

ఏస్. వి. గోపాల్ అండ్కో ప్రచురించిన మూడువేల పైచిలుకుగా గల వేమన పద్యాల్లో ఈ విధంగా పొడుపు కథల ఛాయయున్నవి మరికొన్ని ఉన్నాయి. నాడువ్యవహారంలో పొడుపు పద్యమెంత ప్రాచుర్యాన్ని పొందిందో ఇవన్నీ తెలియజేస్తున్నాయి,

---

1. వేమన పద్యములు-పు : 92, ప ; 680
2, 3. వేమన పద్యములు పు : 94, ప· 690, 691

కొద్ది లటుఇటుగా ఇదే కాలానికి చెందిన దొమకొండ రాజకవి కామినేని మల్లారెడ్డి కృత శివధర్మోత్తరంలోనూ, షట్చక్రవర్తి చరిత్రంలోనూ పొడుపు కథల ఛాయలున్న పద్యాలు కొన్ని కనిపిస్తున్నాయి.

* డాసుగ గాచ భూవిభుని
జంగమరెడ్డి ప్రదీప్తి దాన స
ద్ధ్యానబల ప్రతాప కరు
ణారస రూప విభూతులన్ రవిన్
వాని తనూజు వాని పతి
వాని సుపుత్రుని వాని సోదరున్
వాని మఱంది వాని సుతు
వాని విరోధిని బోలు నెప్పుడున్[1]

మను చరిత్రాది పద్యాల్లో ఉన్న విధంగానే ఇందులో కూడా రాజును సూర్య కర్ణ దుర్యోధనాదులతో పోల్చడం జరిగింది. ఇదిమొక పద్ధతిగా పెక్కు కావ్యాల్లో కనిపించడం గమనార్హం.

తెలుగుదేశంలో సంస్థానాధీశుల పాలన వెల్లి విరుస్తున్న కాలంలోనూ తెలుగు పొడుపు పద్యాలు పుట్టాయి. పెద్దాపుర సంస్థానంలో ఉండి వెలుగులోకి రాని అజ్ఞాతకవి షణ్ముఖ వీరరాఘవకవి. ఆయన చెప్పిందే ఈ క్రింది పొడుపు పద్యం

* మమతను నీవు నన్నడుగ
మానిని నా విభు నామమేమనన్
కమల దళాయతాక్షి!కరి
కంధి ప్రజాపతి చంద్రకాంత ప
త్రమును త్రివర్ణ యుక్తముగ
వ్రాసియునందున మధ్యవర్ణమీ
క్రమమున నెంచి జూడగజ
గామిని నావిభునామ మయ్యెడున్.[2]

1. శివధర్మోత్తరము - 1 ఆ, ప: 79
2. మరుగుపడిన షణ్ముఖ వీరరాఘవకవి చాటువులు
వ్యా - ఆంధ్రభూమి-దినపత్రిక 6-8-1978

మానినిని స్నేహితురాలు విభుని నామ మడిగింది. చెప్పను అనక చెప్పిన ఈ సమాధానంతో 'కుస్తీ' పట్టాలి. చంద్ర కాంత పత్రానికి మారుగా చంద్రికాత పత్రం అని సవరించుకొన్న సరియైన సమాధానం వస్తుంది. కరి-సారంగం, కంధి-సాగరం. ప్రజాపతి-విధాత, చంద్రిక-కౌముది, ఆత పత్రం-గొడుగు, మధ్యాక్షరాల్ని కలిపితే ఆ మానిని భర్త పేరు రంగధాముడనితేలింది.

ఇక ఈమధ్య కాలంలోనే బహుళ ప్రచారం పొంది పండితుల్ని పామరుల్ని పిల్లల్ని అలరింపజేసిన మ॥ సుబ్బారాయలు నాయని వ్రాసిన భట్టి విక్రమాదిత్యుని కథల్లో, కొవ్వలి వ్రాసిన వేయి శిరస్సులు ఖండించిన అపూర్వ చింతామణి కథల్లో, పురాణం పిచ్చయ్య శాస్త్రి రచించిన సహస్ర శిరశ్చేద అపూర్వ చింతామణి కథల్లో, మధిర సుబ్బన్న దీక్షితకవి ప్రణీత కాశీమజిలీ కథల్లో, బాలలకొరకు ప్రత్యేకంగా వ్రాసి ప్రచురించిన భేతాళ పంచ వింశతి కథల్లో అక్కడక్కడ పొడుపు కథల ఛాయలు కనిపిస్తున్నాయి.

భట్టి విక్రమానిత్యుని కథల్లో ఎటు చూచినా శారీరక బౌద్ధిక విజయాలు విక్రమార్కునికి సంప్రాప్తిస్తాయి. భేతాళుడు వశం కావడానికి కొంత కథ జరిగింది. ఇరువయినాలుగు కథలు భేతాళుడు చెప్పాడు. ప్రతికథ చివర కొన్ని ప్రశ్నలడిగాడు. ఈ ప్రశ్నలు పొడుపులు, విక్రమార్కుని సమాధానాలు విడుపులు. ఇందుకు ఉపబలకంగా రచయితే భేతాళుని నోట కథల ప్రారంభంలో ఇట్లా అనిపించాడు.

* "ఓ రాజా! నన్నేల యూరక కొనిపోయెదవు. నేను సామాన్యముగా వచ్చువాడనుగాను, నేనొక కథను విడిగా జెప్పెదను, దానిని నీవు విడియిప్పవలెను. తెలిసి యుండియు విడి యిప్పని యెడల నీ శిరసు వేయి వ్రక్కలగును, నీవు నోరుతెరచి మాటలాడితివేని నీకడ నిలువననియె."[1]

ఇందులో కథను "పిడిగ చెప్పుట విడి విప్పుట" అనే మాటలు పొడుపు విడుపులే. ఇరువయి మూడు కథలకు విడి విప్పిన విక్రమార్కుడు ఇరువయి నాల్గవ కథకు విప్పలేక పోయాడు. ఆ ముడి ఈనాటికీ ఎవ్వరూ విప్పలేదు. ముడి విప్పిన వాటిలోంచి ఒక చిన్న కథ, విప్పని చివరికథ మాత్రం పరిశీలిద్దాం.

1. భట్టి విక్రమాదిత్యుని కథ, పు : 59

* "రాజేంద్రా! యాలింపుము. ప్రాలిశాలమను నగ్రగహారమున శిరోజ కుండను బ్రాహ్మణుఁడు వసించుచుండెను. అతనికిని ధర్మశర్ముండను కుమారుడొకడు గలడు. అతని పదునాఱవ యేట నతడు అపమృత్యువాతఁబడెను తల్లిదండ్రులు హోరుమని యంగలార్చి శ్మశానమునకు శవంబును గొంపోయిరి. కొడుకును చితిపై నుంచి అగ్ని సంస్కారము చేయుటకు చేతులాడక ఘోరుమని దుఃఖించుచుండిరి. అట్టిసమయమున అదృష్టవశాత్తు పరకాయప్రవేశ విద్య దెలిసిన యొక యోగి పుంగవుడు నచ్చోట కరుదెంచెను. తల్లిదండ్రులంగలార్చుటసుగాంచి యోగీశ్వరుడు విషయమెరింగి ఆ దంపతులపై కనికరించి చాటున తన దేహమును వదిలి యాప్రేతమున పరకాయ ప్రవేశమును జేసెను. తోడనే మృత బాలకుడు నిద్రనుండి లేచిన వానివలె లేచి కూర్చుండెను. తల్లిదండ్రులు పట్టరాని సంతసమున నోలలాడిరి. తనయుని ఇంటికి బిలుచుకొని వచ్చిరి. వారి వెంట వచ్చుచు నాయువకుడు మొదట నేడ్చెను, ఆవల నవ్వెను. విక్రమాదిత్యా! ఆ బాలుడా విధమున నవ్వుటకును యేడ్చుటకును గారణంబేమియని యడిగెను. ఆహోవిధి వశంబెట్టిది? గారవంబున మన తల్లి దండ్రులు పెంచి పెద్దచేసిన దేహమును వదలితిమిగదా యని యేడ్చెను, ఆ శరీరము పురాణమైనది, పసిదేహము దగిలితి మేయని నవ్వెనని విక్రమార్కుడు చెప్పెను-" బేతాళ కథలందు-నిరువది రెండవది ధర్మశర్మ కథ-సమాప్తము. [1]

కథ సొంతం చెప్పి ఎందుకు ఏడ్చాడు ఎందుకు నవ్వాడు అని అడగడం పొడుపు. సమాధానం విడుపు. ఇక విడుపు దొరకని ఆ కథ యేంటో చూద్దాం.

* ఓ రాజేంద్రా! వినుము. సేనాపతియను నొక రాజన్యుడు భూప్రదక్షిణము చేయవలయునను తలంపున తన భార్యను కుమార్తెను రాజ్యమును వదిలి తానొంటరియై బయలుదేరెను. లపుడు చాలదినములు రాకుండుటచే నతని భార్యయు కుమార్తెయు నాతని వెదకుచు రాజును గూర్చి యటనట విచారించుచు పోవుచుండిరి. వారి వెనుక విప్రులిరువురు తండ్రియు కొడుకును వచ్చుచుండిరి. అపుడు తండ్రి కొడుకుంగని యిట్లనియె. మనకంటె ముందుగ నిరువురు స్త్రీలు పోవుచున్నట్లు కాలిజాడలచే దెలియుచున్నది. ఇందు పెద్ద యడుగులు గలదానిని నేనువివాహము చేసుకొనెదను. చిన్నయడుగుల దానిని నీవు పరిణయ మాడుమని

1. భట్టి విక్రమాదిత్యుని కథ-పుటలు 110, 111.

సంకేత మేర్పరచుకొని పఱటాపఱటి నడకలచే వారిని సమీపించి. వచ్చిచూడ పెద్దయడుగు గలది కూతురుగను చిన్నయడుగులది తల్లిగ నుండెను. వారి శపథ ముల మేరకు కూతురిని తండ్రియు, తల్లిని కుమారుడు పెండ్లియాడిరి. కొన్ని దినముల కిరువురకు ఇరువురు బిడ్డలు పుట్టిరి. ఆ బిడ్డలకెట్టి వావి వరుస గలదో యెఱిగింపుమని బేతాళుండడుగ విక్రమార్కుని కేమియు దోచక మిన్నకుండెను."[1]

అద్భుత కల్పనా ప్రపంచంలో అల్లిన కథయైనా, ఈ కథకేది మూలమైనా సృష్ట్యాదిగా ఇట్టి ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది. కథాత్మకాలైన పొడుపు కథల్లో కనిపించే కల్పనా చాతుర్యాలు, భట్టివిక్రమాదిత్యునికథ లాంటి గ్రంథాల నుండి ఊడి పడ్డవే.

కొవ్వలి వ్రాసిన అపూర్వ చింతామణిలో అయిదు ప్రశ్నలున్నాయి. బాలమహర్షి అయిదు నగరాల్లో జరిపిన అవినీతి కార్యక్రమాలు ప్రశ్నారూపం ధరించాయి. ఆ ఐదు ప్రశ్నలు పొడుపు కథల్లాగానే ఉంటాయి.

* (1) "ప్రతిజ్ఞ నెరవేరితే గాని పెళ్లి చేసుకోనని భీష్మించుకున్న ఆ రాజకుమారుడెవరు? అతని ప్రతిజ్ఞయేమి? అతనింకా జీవించి ఉన్నాడా?

(2) పురుషుడై వుండికూడ స్త్రీ రూపంతో మహర్షిని మోసం చేసి అతని దగ్గరుండే మంత్రజాలము నపహరించి, అతనిని కొట్టి తరిమి వేసిన ఆ యువకు డెవరు? అతనింకా బ్రతికి ఉన్నాడా? మృతుడైనాడా?

(3) తపోధన మహారాజు ద్వితీయ భార్య అయిన రూప సుందరి గతి యేమయినది? ఆ తపోధన మహారాజింకా బ్రతికి ఉన్నాడా?

(4) ప్రేమించిన వాని యందుండే అనురాగంవల్ల అడవుల్లో తిరుగుతూ స్త్రీ అయివుండికూడ పురుష వేషమును ధరించి, మహర్షిచే కామించ బడిన ఆ యిరువురు కాంతలనూ అపహరించి మహర్షిని ఖండింప బూనిన ఆ ధీరురాలెవరు? ఇప్పుడామె జీవించి ఉన్నదా? మృతి నొందినదా!

---

1. భట్టివిక్రమాదిత్యుని కథ-పుటలు : 113, 114.

(ర) శ్రీరామ పట్టాభిషేకమున శివతాండవం చేసిన భక్తురాలిని మహర్షి కామించిన కారణంవల్ల, ఆ యిరువురనూ కారా గృహమున బంధించి, వ్యభిచార నిర్మూలనకు పాటుపడే దత్తాత్రేయ మహారాజింకా బ్రతికి వున్నాడా? భక్తురా లెట్లున్నది?"[1]

ఈ ప్రశ్నలకు సమాధానాల్ని చెప్పినవాణ్ని చింతామణి వివాహమాడ నిశ్చయించింది. సమాధానాలు చెప్పలేక వేలుమంది రాకుమారులు మరణించారు. "నమశ్శివాయ" అనే పంచాక్షరీ మంత్రం క్రింద బాలమహర్షి పేసను తలక్రిందుగ చేసి వ్రాయాలి. అప్పుడు నర్షి, మహా, శ్శివ, వాల, యబా నగరాలవుతాయి. ఈ నగరాలకు విజయకుమారుడనే రాకుమారుడు వెళ్లి సమాధానాల్ని తెలుసు కొంటాడు. ఇది మొత్తం 547 పుటల కథ. ప్రశ్నలకు సమాధానాలిలా ఉంటాయి.

(1) "సుందరీ! విను ఆ ప్రతిజ్ఞ పూనినవాడు, నర్షి నగరాధిపతి విక్రమ దేవుడు. ఆరాజ్యములో ఆతనిని మోసము చేసి ప్రాణాలు దక్కించుకుని పరారియై వచ్చిన ఒక దొంగ బైరాగి శిరస్సు ఖండించినగాని, తాను వివాహ మాడకూడదని అతని ప్రతిజ్ఞ, ఆ మహారాజింకా బ్రతికి వున్నాడు. తన ప్రతిజ్ఞ. నెరవేర్చుకొని తీరతాడు.

(2) రాజకుమారీ! పురుషుడై వుండిన్నీ స్త్రీ రూపముతో మహర్షి మంత్ర శూలము నపహరించి, అతన్ని కొట్టి తరిమి వేసిన ఆ ధీరుడు- మహానగరా ధీశ్వరుడైన చంద్రసేన మహారాజు. అతను జీవించి సుఖుడై వున్నారు. బాల మహర్షి తిరిగి ఆతని రాజ్యములో అడుగు పెట్టడం సర్వకల్ల.

(3) ఓ గురుభక్తురాలా! బైరాగిని ప్రేమించిన ఆ ఇల్లాలు రూపసుందరి కారా గృహములో ఉప్పులేనీ గంజితాగుతూ, కఠిన శిక్షననుభవిస్తూ వుంది. ఆమెభర్త తపోధన మహారాజు, శ్శివనగర పరిపాలన చేస్తూ, లక్షణముగా బ్రతికివున్నారు, మీగురువుగారిక ఆమెపై ఆశవొదులుకోవచ్చు

1. వేయిశిరస్సులు ఖండించిన అపూర్వ చింతామణి-పుటలు : 40, 41.

(4) చింతామణీ! అధీరురాలు, వాలనగర ప్రభ్వి రాణి ప్రమీలాదేవి, తన ప్రాణసఖులైన వకుళా సరళలను మహర్షి అపహరించి నందువల్ల, ఆ రాణి, పురుష వేషములో వుండి తనకాంతలను రక్షించుకుని, వంచకుడైన మహర్షి శిరస్సు ఖండింపబూనింది ఇప్పుడా వీరవనిత బ్రతికి వుంది. వకుళా సరళలు బాలమహర్షి పేరుతో వున్న ఆ దొంగ బైరాగి శిరస్సు ఖండించడానికి తయారుగా వున్నారు.

(5) భామామణీ! చింతామణీ! మోసగాడయిన మహరిషి, కారాగృహము నుంచి తప్పించుకు పారిపోయి, కుండిన నగరములో చింతామణి దగ్గర చేరినా, అతనివల్ల గర్భమును ధరించిన ఆ భక్తురాలు త్రిపురాంబ ఒక స్త్రీ శిశువును ప్రసవించి ఆ శిశువును సయితం పోగొట్టుకుని, యబానగర కారాగృహములో జన్మాంతర శిక్షననుభవిస్తూనే వుంది. ఆ ప్రకారం వ్యభిచార నిర్మూలనకు పాటుపడ్డ దత్తాత్రేయ మహారాజు కాలధర్మం పొందినా, అతని కొడుకు అశ్వనీ కుమారుడు ఆ దొంగ బైరాగి శిరస్సు ఖండించడానికి కత్తి నెత్తి సిద్ధముగా వున్నాడు.

కనుక బాలమహర్షిగా మారిన ఓ దొంగ బైరాగి గారూ- మీరడిగించిన ప్రశ్నలకు నా జవాబులు సరియైనవవునోకాదో శెలవియ్యండి!"[1]

అద్భుత కల్పనా ప్రపంచంలో ఓలలాడించాడు కొవ్వలి. పొడుపు కథల్లో పౌరాణిక గాథల్ని పొడుపులుగా కూర్చే పద్ధతి యెటువంటిదో ఈ కాల్పనిక ప్రశ్నలు కూడా అటువంటివే. పురాణం పిచ్చయ్యశాస్త్రి మూడు ప్రశ్నలు కూడా కొద్ది భేదంతో ఈ పద్ధతే అనుసరించాయి. ఈ గ్రంథాల్లో కాల్పనిక ప్రహేళికల ఛాయలు ఉండడమేగాక కాల్పనికాలైన కొన్ని పొడుపు కథలకు ఇవి మార్గదర్శనం చేశాయి.

మధిర సుబ్బన్న దీక్షిత కవి ప్రణీతం అయిన కాశీ మజిలీ కథలు పండిత పామరజన హృద్యాలు. ఈ కథల్లో పతివ్రతల ప్రభావాలు, దుష్టస్త్రీల దుర్మార్గాలు, సత్పురుష సాంగత్యం వల్ల కలిగే లాభాలు, దుష్టసహవాసం వల్ల కలిగే అనర్థాలు, దేశాటనం ద్వారా పండిత సంపర్కం వల్ల కలిగే జ్ఞానం, రాజనీతి, వ్యవహార వివేకం, వదాన్య లక్షణం, లోభి ప్రవృత్తి మొదలైన అనేక విషయాల వర్ణనే

1. వేయి శిరస్సులుఖండించిన అపూర్వచింతామణి-పుటలు : 524, 525.

గాకుండా పౌరాణిక చారిత్రక మహాపురుషుల చరిత్రలు కూడాకమనీయంగా రచింప బడ్డాయి. అద్భుతావహాలైన అనేక ఘట్టాలవల్ల అడుగడుగునా చమత్కారం ఉదయిస్తుంది.

"భూపతి జంపితిన్ మగడు భూరి భుజంగము చేత జచ్చె .." అనే పద్యం పొడుపు పద్యమే. గొల్లభామ కథ పూర్తిగా ఈ పద్యం మీదే ఆధార పడింది. సుదీర్ఘమైన ఈ కథ కొన్ని రంగులూ హంగులూ దిద్దుకొని చలన చిత్రంగా తయారయింది. విస్తృత పరివ్యాప్తాలైన ఇటువంటి కథల మధ్యలో చమత్కార సంజనితాద్భుత ప్రశ్నలూ సమాధానాలు కోకొల్లలు.

ఓముని ప్రియంవదకు ప్రశ్నలు చెప్పాడు. వాటి సమాధానాలు చెప్పిన వాణ్ణే ఆమె పెళ్లాడుతుంది. సమాధానాలు చెప్పని వాని తల తీసివేస్తారు. అతనికి మారుగా మరొకరెవరైన సమాధానాలు చెప్పదలిస్తే అతణ్ని వదలివేస్తారు. హరిదత్తుడు చావాలని వస్తాడు. అదృష్టదీపుడు అతణ్ని రక్షించాలనుకున్నాడు. అదృశౌషధి వల్ల ఆమె ప్రశ్నలకు సమాధానాలు కనుగొంటాడు. హరిదత్తుడు అదృష్ట దీపునకు తమ్ముడవుతాడు. ప్రియంవద హరిదత్తుల వివాహమవుతుంది ఆమె అడిగిన ప్రశ్నలు పొడుపు కథల్లాగా ఉన్నాయి.

* ఎన్న భువనేశ్వరీదేవి కెన్ని మొగము?
లవియు నేయేరుచుల చేత నమఱు! మఱిత
దాలయంబెట? నటదగు నట్టి లిపియ
దేమి! యని చెప్పుడివి మరియేచ్ఛపగిది.[1]

ఈ ప్రశ్నలకు సమాధానాల్ని అదృష్టదీపుడు చిత్రంలో లిఖించి పంపిస్తాడు. భువనేశ్వరీదేవి వెనుక వున్న లిపి ఇది.

* ఇలనదృశౌషధీలత యెవని చేత
జిక్కువాడె యిందు రక్షింప బడుచు
తనరు నిధులకు నధికారి తత్ప్రియం వ
దాప్రియుండు నతండెపో తథ్యముగను.[2]

---

1. కాశీమజిలీ కథలు-రెం. భా-పు : 299.
2. కాశీమజిలీ కథలు- రెం. భా. పు : 315

అదృశాపఫలిత చివరకు హరిదత్తునికి చిక్కేవిధంగా కల్పించడం కథ సుఖాంతం కావడం జరుగుతుంది. మొత్తం పంద్రెండు భాగాలు గల ఈ కథలన్నీ మజిలీల్లోనే చెప్పబడ్డాయి. ఒక్కొక్క మజిలీలో లెక్కలేనన్ని గొలుసు కట్టు కథలు, ఇంద్రజాల మహేంద్రజాల విద్యల్ని ప్రదర్శించి మనస్సును ఆకట్టుకొని కనుల్ని కదలనివ్వక నిలిపి వేస్తాయి. కథాత్మకాలైన కొన్ని పొడుపు కథలకు కాశీమజిలీ కథలు మార్గదర్శనం చేశాయి.

ఈ కాశీమజిలీ కథలు ఆవిర్భవించిన కాలంలోనే శ్రీమంగిపూడి వెంకటశర్మ చమత్కార చంద్రిక వెల్వడింది. (1920) ఇందులో తెలుగు పొడుపు పద్యాలున్నాయి. ఒక పద్యాన్ని పరిశీలిద్దాం,

ఆద్యంత మధ్యమాంతాది మధ్యములలో
కథ, తీగె, స్వప్నంబు గలుగ వలయు
ఆద్యంత మధ్య మాంతాది వర్ణములలో
ఏనుగు, నన, శుక్రుడెసగ వలయు
ఆద్యంత మధ్య మాంతాది వర్ణములలో
దారి, మోసము, వాణి దనర వలయు
ఆద్యంత మధ్య మాంతాది వర్ణములలో
చెలి, పోరు, బందిగం బలర వలయు

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
మరియు నా యత్తరంబులే వరుసగాను
క్షోభ ఖాదిర సాహాయ్య క్షుత్తులకును
నామధేయంబు లగుచు జెన్నార వలయు.[1]

ఈ ప్రశ్నలకు క్రమంగా కలత, కవిరి, బాసట, ఆకలి అనేవి సమాధానాలు. 1-2-3 అక్షరాలు, ఆద్యంతాలు 1-3, మధ్యమాంతాలు 2-3, ఆదిమధ్యాలు 1-2. పైనాలుగు పదాల్ని ఇదే విధంగా విభజిస్తే మొదటి పాదంలోని కథ, తీగ, స్వప్నానికి కత. లత, కల అనీ; రెండవపాదంలోని ఏనుగునన

1. చమత్కార చంద్రిక, పు : 38, ప : 180.

శుక్రునికి కరి, విరి, కవి అనీ, మూడవపాదంలోని దారిమోసము వాణికి బాట, సట, బాగ అనీ; నాల్గవపాదంలోని చెలివోరు బందిగాలకు ఆలి, కలి, ఆక లనీ సమాధానాలు వస్తాయి.

1920 నాటికే రెండవకూర్పుతో వెలువడిన శ్రీ మంగిపూడివారి చమత్కార చంద్రిక పొడుపుకథా పద్యవికాసానికి ఎంతో దోహదం చేసింది. వివిధ వార పక్ష, మాసపత్రికల్లో ఆ తర్వాత ఇలాంటి చమత్కార పద్యాలు వ్రాసే రచయితలకు ఈ గ్రంథం మార్గ దర్శనం చేసింది.

"పదమునకైదక్షరములు
మొదలు తుదలనుండి వరుస మూడక్షరముల్
వదలిన నర్థము, చెడదా
పదమేదో తెలుపరయ్య! పండితులారా!
పక్షివర్యంబు వరగు పంచాక్షరముల
వాని తలదీయ క్షుద్రదేవత జనించు
వాని తలదీయ తక్కెడ వరలుచుండు
దాని ప్రథమాక్షరము దీయ తనరు నృపతి."[1]

మొదటి పద్యానికి "రసూకుమార" అని, రెండో పద్యానికి వరుసగా కపోతరాజు, పోతరాజు, తరాజు, అనీ విడుపులు వస్తాయి. విడుపు ఊహకు కూడా అందనంత దూరంలో ఉండే పద్యాలు కూడా ఈ గ్రంథంలో ఉన్నాయి.

"సార్వభౌమునినైన సన్యాసిగా జేసి
జోగినైనను మహా భోగిజేసి
తలక్రిందుగనె పర్వతము లెక్కగాజేసి
వారాశి మోకాలి బంటి జేసి
వినువీధి నవలీల విహరింపగాజేసి
సింగంబుపై స్వారి జేయ జేసి
భగ భగ మనునగ్ని దిగమ్రింగగా జేసి
అలచందమామ ముద్దాడజేసి

1. చమత్కార చంద్రిక, పుట : 3, ప : 8, 9.

బొంది తోడనె స్వర్గంబు దొందజేసి
నవ్వులో నేత్పు నేత్పులో నవ్వు జేసి
యైంద్రజాలిక శక్తి నానలరయనట్టి
భవ్యమగు దాని దెలియుడీ భావ విదులు (పుట : 5)

ఏ పద చమత్కారం ఈ విడుపు సాధించడానికి ఉపయోగపడదు; ఊహ ఎదిగి "స్వప్నం "అంటూ నిర్ధారించాల్సిందే. శర్మగారు తమ పొడుపు పద్యాలకు విడుపుల పేరిట సుదీర్ఘ వివరణలు కూడా ఇచ్చారు.

"జలము మోయుచునుండు జలవాహకుడు గాడు
బిచ్చమెత్తుచునుండు బీదవాడు
కొండలందు వసించు గోయవాడును గాడు
నాట్యమాడుచునుండు నటుడుగాడు
ఎంగిళ్లు భుజియించు వెంగలియునుగాడు
భూతాలతో నుండు బూచిగాడు
వడుగురూపు వహించు వామనుండునుగాడు
పుఱ్ఱె చేత ధరించు వెఱ్ఱిగాడు
కుండలుల బెంచు నహితుండి కుండుగాడు
బోయదేగాని మృగమాంస భుజుడుగాడు
అంబరము దాల్పడవధూత యతడుగాడు
అట్టి వానిని దెల్పుడీ యార్యులార! (పుట : 8)

చమత్కార చంద్రికలో ఇది 27వ పద్యం. ఈ పద్యానికివారు "ఉత్తరములు" పేరిట ఇచ్చిన గ్రంథాంతంలోని విడుపుల్లో ఈ క్రింది వివరణ కనిపిస్తుంది.

"27 శివుడు. 1 గంగాధరుడు అనగా గంగను శిరమున ధరించి యుండును. 2 జంగము రూపము దాల్చిన వాడు. 3. కైలాస పర్వతమున కాపురమున్న వాడు 4. నటరాజు, తాండవ ప్రియుడు శివుడు నిత్యమును ప్రదోషసమయమున నాట్యము చేయునని పురాణ ప్రసిద్ధము. 5 శివుడు బోయవాని యెంగిలి భక్షించుట శివపురాణ ప్రసిద్ధము 6. భూతనాథుడు. 7. పార్వతిని పెండ్లియాడుటకై

ఆమె మనసును కనుగొన నెంచి వటుగు వేషము అనగా బ్రహ్మచారి వేషము వేసుకొని యామె కడకేగి పరీక్షించెను. 8. శివుడు బ్రహ్మకపాలమును ధరించును. 9. కుండలి యనగా పాము, అహితుండిగుడు అనగా పాములవాడు, శివుడు సర్పములను భూషణములుగా ధరించును. 10. బోయడు అనగా కిరాతరూపుడు శివుడు. అర్జునునికడకు మాయా కిరాత రూపమున నరిగి సూకరము నెపమున నతనితో పోరి యాతని సమర్థతకు మెచ్చి పాశుపతాస్త్రము నిచ్చుట పురాణ ప్రసిద్ధము. 11. అవధూత స్వాములు వస్త్రము ధరింపరు. ఈశ్వరుడు దిగంబర స్వరూపుడు" (పుట : 67)

ఎన్నో చమత్కారాల్ని సృష్టించి పద్యాల్లో పద వాక్యాలయ విన్యాసాల్ని ప్రదర్శించిన మంగిపూడి వారి చమత్కార చంద్రిక పొడుపు పద్య వికాసానికి మూలకందంగా నిలిచింది లఘు చమత్కార చంద్రికల సృష్టికర్తల్ని వెన్ను తట్టి లేపింది పొడుపు పద్యమనగానే ఆ గ్రంథ రచయిత, ఆ గ్రంథం గుర్తు వచ్చేలా తన స్థానాన్ని పదిల పరచుకుంది.

ఆ గ్రంథం వెల్వడ్డానికి కొద్ది పూర్వమే (1903) కీ॥ శే. నంది రాజు చలపతిరావు ప్రకటించిన స్త్రీల పాటల్లో కొన్ని పొడుపు కధలున్నాయి. జానపద గేయవాఙ్మయ వ్యాసావళి అనే గ్రంథంలో కీ॥ శే॥ నేదునూరి గంగాధరం "జానపదగేయాల్లో పొడుపు కథలు" అనే శీర్షిక క్రింద కొన్ని పొడుపు కథల్ని ప్రకటించారు. వెస్టువార్డుఅండ్‌కంపనీ మద్రాసువారు "చమత్కార పొడుపు కథలు" ఎన్. వి. గోపాల్ అండ్‌కో మద్రాసువారు "చమత్కార పొడుపు కథలు అను తెలుగుసామెతలు", శ్రీ వెంకటేశ్వర ప్రింటింగ్‌ప్రెస్ కామారెడ్డివారు "నూతన చమత్కార పొడుపుకథలు" ప్రచురించారు వీటి ప్రచురణ ఏనాడు మొదలైందో గాని ఇప్పటికీ ఇంకా వెల్వడుతూనే ఉన్నాయి. ఈ మూడింట ఉన్న పొడుపుకథలు ఇంచు మించుగా ఒక్కటే. కొద్ది భేదాలు కావాలని చేసి ఉంటారు. వీటిలోని పొడుపు కధల సంఖ్య రెండు వందలలోపే.

శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి విరచితమైన "ధీనిభావమేమి తిరుమలేశ" మకుటంతో ఉన్న తిరుమలేశ శతకం ఇటీవలికాలంలో వెల్వడిందే. ఈ మకుటంతో కొన్ని ప్రాచీన పద్యాలు కూడా లభిస్తున్నాయి. నాగఫణిశా మకుటం ఉన్న కొన్ని పద్యాలు జానపదులనోట వినిపిస్తున్నాయి. వీటిని ఆయా ప్రకరణాల్లో సందర్భాన్ని బట్టి ఉదాహరించడం జరిగింది. ఇక్కడ కేవలం ఒక పద్యం ఉదాహరిస్తాను.

తలయు తోకనుండు పలుక నాలుక లేదు
పండ్లు గలవుగాని కానరావు
పట్టిచూడనందు ప్రాణమే యుండదు
దీని భావమేమి! తిరుమలేశ![1] (పాముకుబుసము)

ఇటీవలే, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ప్రచురించిన శ్రీ వెలగా వెంకటప్పయ్య 'గోడమీదబొమ్మ' పొడుపుకథా సంకలన గ్రంథంలో 334 పొడుపుకథలున్నాయి. ఈ సిద్ధాంత గ్రంథం రచన పూర్తయ్యేనాటికి శ్రీ వెలగా వెంకటప్పయ్య దాదాపు రెండువేల అయిదు వందలున్న పొడుపుకథల సమగ్ర గ్రంథాన్ని ప్రచురణకిచ్చారు. ఇక ఈనాడు జానపదులనోట వినిపిస్తున్న పొడుపు కథల్ని వేలకొద్దిగ గంపలకెత్తవచ్చు అవన్నీ సేకరించి ప్రచురించాల్సిన ఆవశ్యకత ఉంది. జానపద విజ్ఞానంలో పొడుపుకథకున్న ప్రాధాన్యాన్ని పరిశోధకులు విపులీకరించాల్సిన అవసరముంది.

## 1-9 : ఉపసంహృతి

ఉపమానోపమేయాల చిత్ర విచిత్ర సమ్మేళనంతో ఆవిర్భవించిన పొడుపు కథ మానవజాతి ఉన్నప్పటినుండి ఉంది. అనాదికాలం నుండి అవనిలో అడుగు పెట్టిన సర్వసాహిత్య ప్రక్రియల్లోనూ పొడుపుకథా లక్షణాలు అసంపూర్ణంగానో సంపూర్ణంగానో కనిపిస్తున్నాయి. భరత ఖండంలో వైదిక యజ్ఞయాగాదుల్లో ప్రవచించబడ్డ వేద సాహిత్యంలోనే గాక లౌకిక సాహిత్యంలోనూ పొడుపు కథ చోటు చేసుకొంది.

జానపదుల పనిపాటలు తీరిన తర్వాత సాయం సమయాల్లో, నిద్రకు పూర్వం స్త్రీలు పిల్లలు ఒక చోట చేరి ఈ పొడుపు కథల్ని నాటినుండి నేటి వరకు చెప్పుకొంటూనే ఉన్నారు. కాబట్టే అవి ఇప్పటికీ బ్రతికే ఉన్నాయి. నాటికీ నేటికీ విజ్ఞాన ప్రతినిధులుగా నిలిచే ఉన్నాయి.

ఈ ప్రకరణ ప్రారంభంలో పొడుపు కథ వేదకాలంనుండి ఉన్నదని వక్కాణించడం జరిగింది. మానవ సంస్కృతిలోని చివరి దశలోనే పొడుపు కథలు

1. తిరుమలేశ శతకము - ప : 23.

• ఈ గ్రంథం నాపీఠికతో నవంబర్ 1981న ప్రచురించబడింది.

ఆవిర్భవించి ఉండాలి అని తెలుపడం జరిగింది. పొడుపు కథ సాంప్రదాయిక విజ్ఞానమే గాక, అది ఏకమూలం కావచ్చుననీ. బహుమూలం కూడా కావచ్చుననీ ఆలోచించడం జరిగింది. పొడుపుకథ ప్రాదుర్భావానికి కారణాలు వివరిస్తూ వివిధ వాదాల్ని సమీక్షించడం జరిగింది. తెలుగు పొడుపు కథకు పర్యాయ పదాలైన పొడుపుకథ, విడుపు, తట్టు, మారుతట్టు, మారుకత, శాస్త్రాలు, సమస్యలు (సమిచ్చలు), చిటుకులు, చిట్కాలు, చిక్కుముళ్లు, యక్షప్రశ్నలు, వేసేకథలు-విప్పేకథలు, అడ్డుకత. ఒడ్డుకత, మొదలైన పదాలకు వివరణలిచ్చాను. సమానార్థకాలైన అన్యభాషాపదాలు సూచించాను. పొడుపుకథాలక్షణాల్లో సంస్కృతాలంకారికులు, పాశ్చాత్యులు, ఆంధ్రేతరులు, ఆంధ్ర పరిశోధకులు చెప్పిన భావాలు సమీక్షించాను. లక్షణ నిర్దేశంలో సంక్షిప్తాది అష్టాదశ లక్షణాల్ని సోదాహరణంగా వివరించాను. వర్గీకరణంలో పొడుపుకథ మార్గ అనీ, దేశి అనీ, జానపదసంసృష్టి లని తెలిపి, పరిశోధకుల అభిప్రాయాల్ని సమీకరించి, తెలుగు పొడుపు కథకు విషయ విభజనమే సరియైందని తెలిపి, జానపద సాహిత్యమనే ప్రకరణంలో విపులంగా విశ్లేషించిన నవవిధ ప్రహేళికల్ని ఉదాహరించాను. లోకజ్ఞానాది, ప్రయోజనాల్ని వ్యాఖ్యానించడం జరిగింది. ఇక వికాసంలో సంస్కృత 'ప్రహేళికల్ని గూర్చి సంక్షిప్తంగా చెప్పి, అతి వేల మైన ఆంధ్రసాహిత్యంలో నాటి నుండి నేటి వరకున్న పొడుపు కథల్ని తచ్ఛాయల్ని స్థాలీపులాక న్యాయంతో సమీక్షించాను.

లభ్యసామగ్రితో ఎలా వివరించినా, ఏ విధంగా సమీక్షించినా ఉత్పత్తి వికాసాల కాద్యంతాలు లేవనేది సత్యం. పొడుపుకథ అప్పుడెప్పుడో పుట్టింది; ఇప్పుడు పుడుతుంది; ముమ్ముందు పుడుతూనే ఉంటుంది. అప్పుడెప్పుడో వికసించింది; ఇప్పుడు వికసిస్తుంది; ముమ్ముందు వికసిస్తూనే ఉంటుంది అని పరిశీలన ద్వారా తెలుస్తున్నది.



# జానపద సాహిత్యం

## 2-0 : ప్రకాశం

జానపదులెక్కడెక్కడ ఉంటారో జానపద విజ్ఞానం (Folk lore) అక్కడక్కడ ఉంటుంది. జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం (Folk Literature) ఒక భాగం. సంప్రదాయ విజ్ఞాన సంరక్షకులు జానపదులు. వారు జనపదాల్లో ఉంటారు; నగరాల్లో ఉంటారు. వృత్తి కళా కేంద్రాలుగా ఒకనాడు ఫలసిల్లిన పల్లెలు అందరికి ఉపాధిని లందించని స్థితికి చేరుకోడంతో జానపదుల్లో కొందరు నగరాలకు ఎగబ్రాకరు. తమవృత్తికి స్వస్తి చెప్పి కొత్త పనుల్ని చేపట్టారు. ఆ వృత్తిలోన నైపుణ్యమున్నవారు. ఆ వృత్తికి సంబంధించిన నగరాల్లోని పరిశ్రమల్లో కొలువు చేస్తున్నారు వృత్తులు విడిచి పెట్టన వారు మట్టమోస్తారు; రాళ్ళుకొడతారు; పండ్లను అమ్ముతారు.; రిక్షా తొక్కుతారు; ఆటో నడుపుతారు; వాహనాల్ని తుడుస్తారు; గిన్నెలు కడుగుతారు; సున్నంవేస్తారు; కిటికీలు గొడతారు: ఇటుకలు చేస్తారు; ఇండ్లు కడతారు; బావులు త్రవ్వుతారు; పశువులమేపుతారు పడి పైసలు సంపాదించడానికి పనేదైనా చేస్తారు.

నగరాల్లో ఇటువంటి పనులు చేసేవారు ముప్పాతిక మువ్వీసం మంది జానపదులే నవనాగరిక ప్రభావం పడని నూటికి తొంబదిమంది గ్రామీణులు జానపదులే గ్రామంలో ప్రతి గృహం ఒక వృత్తి కళా కేంద్రం ఇప్పటికీ బట్టలునేసేవారు, కుండలు చేసేవారు, కట్టెలు పక్కేవారు, బట్టలుచేసేవారు, సొమ్ములు చేసేవారు, చెప్పులు కుట్టేవారు, డప్పులూ మద్దెళ్లూ చేసేవారు, గోనెలనల్లేవారు గ్రామాల్లో ఉన్నారు వీళ్లే గాక బట్టలుతికే చాకళ్లు, నెత్తులు గొరిగే మంగళ్లు, రాయిదీసె వడ్డెరలు, వ్యవసాయంచేసే కాపులు, పండ్లనమ్మే తెనుగులు, చేపలు పట్టే బెస్తలు గ్రామాల్లో ఉన్నారు. ఇంకా చిన్న చిన్న వృత్తి పనులు చేసేవారెందరో

ఉన్నారు. వృత్తి ఉపాధిలేనివాళ్లు కూలీల లెక్కలోకి వస్తారు. వాళ్లు ఇతరులకు పనులుచేసిపెట్టి శ్రమ ఫలితాన్ని తీసుకొంటారు. ఇటువంటి వారే ఎక్కువగా నగరాలకు తరలిపోవడం జరుగుతుంది.

వాహన సౌకర్యాలధికమైనప్పటి నుండి పల్లె పట్టణాల మధ్య దూరం తగ్గిపోయింది. అందువల్ల జానపద విజ్ఞాన కోశాలనబడే గ్రామ ప్రజలు స్థిరంగా ఉండే గూటికొరకు, కడుపు కూటి కొరకు సర్వేసర్వత్ర పర్యటించడం జరుగుతుంది. అందుకే జానపద విజ్ఞాన నిలయాలు పల్లెలు మాత్రమే కావు పట్టణాలు కూడా అని చెప్పవలసి వస్తోంది. ఆ కారణాన్నే జానపదులెక్కడెక్కడ ఉంటారో జానపద విజ్ఞానం ఆక్కడక్కడ ఉంటుందని చెప్పడం జరిగింది.

## 2-1 : స్వరూపం

పరిశోధకులెందరో జానపద విజ్ఞాన ప్రవాహానికేతాలెత్తి, వెయ్యి పుట్లు పండించి గాదెలు నింపి గృహాల్ని కళకళ లాడించారు. అన్వేషకు లెందరో జానపదసాహిత్య స్వరూప స్వభావాల్ని గ్రంథాలకు ఎక్కించారు [1] ఆ స్వరూప

---

1. శ్రీవేదునూరి గంగాధరం, బి. రామరాజు, తూమాటి దొణప్ప, దేవులపల్లి కామేశ్వరరావు, హరి ఆదిశేషువు, తంగిరాల వెంకట సుబ్బారావు, నాయని కృష్ణ కుమారి, వేటూరి ప్రభాకర శాస్త్రి, సురవరం ప్రతాపరెడ్డి, ఉన్నవ లక్ష్మీనారాయణ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, గిడుగురామమూర్తి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, శ్రీపాదగోపాలకృష్ణమూర్తి, కృష్ణశ్రీ, యస్వీజోగారావు, చిలుకూరి సుబ్రహ్మణశాస్త్రి, ఆర్వీయస్, సుందరం, ఇల్లిందల సరస్వతీదేవి, గునుపూడి ఇందుమతి దేవి, చింతాదీక్షితులు, ఎల్లోరా, ప్రయాగ నరసింహశాస్త్రి, నందిరాజు చలపతిరావు, చొక్కపు నారాయణస్వామి, కోటసోదర కవులు, యెల్దండ రఘుమారెడ్డి, జి. లింగారెడ్డి, సుభద్ర, రావిప్రేమలత, దేవరాజుమహారాజు, యశోదారెడ్డి, లక్ష్మీకాంతమోహన్, ఋుక్నుద్దీన్, ఎం. నారాయణరెడ్డి, నాయని కోటీశ్వరి, బి. దామోదరరావు, ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, వింజమూరి సీతాదేవి, కనపర్తి, గూడూరి, నాగుల రాజేశంగౌడ్, జి. ఎస్. మోహన్, కె. సుమతి, పి. సరస్వతి, ఆర్. వసుంధర, జి. రాంరెడ్డి, పి. స్వామిరెడ్డి, పొద్దుటూరి ఎల్లారెడ్డి .. తదితరులింకా ఎందరో ఉన్నారు.

స్వభావాల్ని చర్విత చర్వణం చేయక జానపద సాహిత్యంలో పొడుపు కథలు అనే అంశం మాత్రమే ఈ ప్రకరణంలో పరిశీలించడం జరుగుతుంది. ఇదివరకే పరిశోధకులు జానపద సాహిత్యాన్ని ఈ క్రింది విధంగా విభజించి అందులో పొడుపు కథలకు ఒక స్థానాన్ని కల్పించారు.[1]




పరిశోధకులు తమ తమ గ్రంథాల్లో సందర్భోచితంగా పొడుపుకథల్ని స్పృశించారు. వారి వారి పరిధి మేరకు వారు విభజించి వివరణలిచ్చారు.

కేవలం జానపదుల పొడుపు కథల స్వరూపాల్ని బట్టే అనేక రకాలుగా విభజించడానికి అవకాశముంది. ఇందులో గేయ ప్రహేళికలు, వచన ప్రహేళికలు, ఉభయ ప్రహేళికలు ఉన్నాయి. అందులోనూ స్వల్ప భేదాలు కనిపిస్తున్నాయి. పొడుపు కథకున్న పాదాల్ని బట్టి దానికో పేరు తగిలించడానికి అవకాశముంది. అయితే ఆ విధంగానే భావించాలనిగానీ, అలాగే విభజించాలనిగాని నిర్ణయాలంటూ సూత్రాలంటూ ఏం లేవు. కేవలం దృష్టిలోకి రావడానికి మాత్రమే ఈ విధంగా విభజించడం.

ఏకపది, ద్విపది, త్రిపది, చతుష్పది, పంచపది, షట్పది, సప్తపది, అష్టపది అని ఈ విధంగా స్వరూపాన్ని బట్టి ఎన్ని పేర్లయినా పెట్టవచ్చు. ఇవి మాటల పొట్లాలు గావచ్చు; పాటల మూటలు గావచ్చు. మచ్చుకొకటి చూద్దాం. ఆ తర్వాత సూక్ష్మ పరిశీలన చేద్దాం

1. జానపద సాహిత్య స్వరూపం-పు : 10

2-1-1 : ఏకపది

* ఊరంతకీ ఒకే దుప్పటి (ఆకాశం)

1-2 : ద్విపద

* గూట్ల పిల్లా
గుంజితె వొల్లా (నాలుక)

1-3 : త్రిపది

* ఆకాశాన అరవై గదులు
గదికో సిపాయి
సిపాయికో తుపాకి (తేనెపట్టు)

1-4 ; చతుష్పది

* గోడమీద బొమ్మ
గొలుసుల బొమ్మ
వచ్చిపోయేవారికి
వడ్డించు బొమ్మ (తేలు)

1-5 : పంచపది

* ఇచ్చుతుంటె గంపెడైతున్నదీ
సెరుగుతుంటె సేదెడైతున్నదీ
వండుతుంటె కుండెడైతున్నదీ
తింటుంటె కీపి గొడ్తున్నదీ (బచ్చలికూర)

1-6 : షట్పది

* కీసు గిద్దెడు బియ్యం వండి
కీసుకెట్టంగ
కీసు పిల్లల కెట్టంగ
అమన గంటోల్లకరవై మందికెట్టంగ
దేవరకొండోల్లకు దెబ్బై మందికెట్టంగ
ఇంకా ఇసుర్రాయంత పెల్లవుండె (కుంకుమ)

1-7 : సప్తపది

* ఆకాశమంతా అల్లుకు రాగా
అడ్డెడు బియ్యం చల్లుకు రాగా
కడివెడు నీళ్లూ కారుకు రాగా
చాటెడు చెక్కులు చెక్కుక రాగా
అందులో ఒక రాజు ఉన్నాడు?
చెప్పితే నీ నోరు గప్పు మంటుందీ
తప్పితే నీ నోరు చప్పగుంటుందీ!• (గానుగ)

1-8 : అష్టపది

* వంకర టింకర మానూ
వయ్యారి మాను
రాజులెక్కే మాను
మావూరొచ్చే మాను
కాపులెక్కే మాను
కష్ట జీవుల మాను
ఎత్తుకు తిరిగే మాను
ఇంతుల పెండ్లికొను!• (పల్లకి)

ఛందస్సులో ఒదిగిన దేశి సాహిత్యంలో ద్విపదలు, త్రిపదలు, షట్పదులు కనిపిస్తున్నాయి. అనేక పదాలున్నా పొడుపు కథలకు ఇవి మూలాలేమి కావు గాని వాటివలెనే వీటిని విభజించుకోడానికి వీలవుతుంది. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో వస్తువును బట్టో, స్వభావాన్ని బట్టో, స్వరూపాన్ని బట్టో పిలువబడ్డ పదాలు కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. పరిశోధకు లెందరో వీటినిపరిగణనలోకి తీసుకున్నారు. పైన పొడుపు కథలకు చెప్పినట్లుగా ఇవి సంఖ్యను బట్టి గాకుండా శాస్త్రాన్ని బట్టే స్వభావాన్ని బట్టే పరిగణనలోకి తీసుకోడం గమనార్హం.

ప్రభాత పదాలు, పర్వత పదాలు, శంకర పదాలు, నివాళి పదాలు, వెన్నెల పదాలు, తుమ్మెద పదాలు, జక్కులరేకు పదాలు, ర్యాల పదాలు....

• • జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి-పు : 144.

**ఊయల పాటలు** గొబ్బిపాటలు, కోకిల పాటలు, ఏలపాటలు, మోటపాటలు (కపిల పాటలు), బండిపాటలు, వలపు పాటలు, గోవిందు పాటలు, రామాయణపు పాటలు, వెన్నెల గుడిపాటలు, లక్ష్మీనారాయణ పాటలు, జాజర పాటలు, లాలి పాటలు, పెండ్లిపాటలు, కట్నముల పాటలు, ఆరతి పాటలు, జోల పాటలు, గౌడు గీతాలు....

వర్ణనలు, అంక మాలికలు, సువ్వాలలు, శోభనాలు,ధవళాలు, దరువులు. చందమామ సద్దులు, అష్టకాలు, మంగళ హారతులు ... ఇటువంటి పేర్లతో లెక్క లేనన్ని పదాలు, పాటలు జానపద సాహిత్యంలోనూ ఉన్నాయి.

ఛందోబద్ధమైన మార్గదేశీ సాహిత్యాల్లోని పొడుపు కథల్ని వేర్వేరు చేసి కేవలం జానపద సాహిత్యంలోని సూక్ష్మ సూక్ష్మాంశ స్వరూపాల్ని పరిశీలించాలి. పై ఏకపది ద్విపదుల విభజనం స్థూల దృష్టితో చేసిందే.



జానపద ప్రహేళికల సూక్ష్మ పరిశీలనలో దీర్ఘ ప్రహేళిక గేయాలు, హ్రస్వ ప్రహేళిక గేయాలు, దీర్ఘ ప్రహేళిక వచనాలు, హ్రస్వ ప్రహేళిక వచనాలు, ఉభయాలు లెక్కలేనన్ని కనిపిస్తున్నాయి. అంతేగాక అందులోకూడా మరెన్నో భేదాలు పొడసూపుతున్నాయి. ఆ కారణాన్నే జానపదుల పొడుపు కథల్ని స్వరూపాన్ని బట్టి ఈ పైవిధంగా వింగడించడానికి వీలయ్యింది.

జానపద సారస్వతంలో గేయానికున్న ప్రాధాన్యం వచన గేయానికిగాని వచనానికి గానిలేదు. లయ ప్రధాన గీతం అక్షర రూపం దాల్చకున్నా మౌఖిక ప్రచారం ద్వారా చిరంజీవియై వెలిగింది. జానపద జీవన ప్రతిబింబితాలైన వచనాలకు మాత్రం అట్టి లదృష్టం లేక పోయింది. వచన గేయంలో వచనం గేయంగా మారిపోవడమో లేదా లుప్తమవడమో జరిగింది. అక్కడ క్కడ కొన్ని వచనాలు కనిపిస్తున్నా, అవి జానపద కథా సంవిధాన సూత్రాలుగా ఉపయోగ పడుతున్నాయి. కాని పొడుపు కథల్లో మాత్రం వచన ప్రహేళికలకు, గేయ ప్రహేళికలకు, వచన గేయ ప్రహేళికలకూ సమప్రాధాన్యముంది. వ్యవహారంలో మూడింటికి సమాన గౌరవ ప్రతిపత్తులున్నాయి. పొడుపు కథకున్న మౌలిక లక్షణాలే ఈ సమాన ప్రతి పత్తికి సాధనాలయినై.

## 2-2 : వచనాలు

వచనమంటే మాట. అదికూడా అర్థయుక్తమైన మాట. భావవేగంలో నోటి నుండి త్రోసుకొని వచ్చిన పలుకు. కృతకం కాని సహజవాక్యం పొడుపు కథల్లో ఈ వచనాలు కొన్ని దీర్ఘాలుగా కొన్ని హ్రస్వాలుగా ఉన్నాయి. ఇందులో మళ్లీ ఒక్క పొడుపున్న దీర్ఘవచనాలు, పెక్కు పొడుపులున్న దీర్ఘవచనాలు ఉన్నాయి; ఒక్క పొడుపున్న హ్రస్వవచనాలు, పెక్కుపొడుపులున్న హ్రస్వ వచనాలు ఉన్నాయి.

### 2-2-1 : ఒక్క పొడుపు పొడుగుమాట

* బంగారం కంటె
సింగారమైంది తెమ్మంది భార్య
అంగడి తిరిగి

గొంగడి సంకనేసుకొచ్చిండు భర్త
భార్య పక్కమంది
మర్మంవిప్పి చెప్పింది
ఏందది? (కుంకుమ)

ఇది దీర్ఘ వచనం. ఇంత పెద్ద దీనికి ఒకే ఒక్క విడుపుంది. అందువల్ల ఇది ఒక్క పొడుపున్న పొడుగుమాట.

## 2-2-2 : పెక్కు పొడుపుల పొడుగుమాటలు

* అదిగో పంపు అక్నోడు తెంపడు
అనకోడు తెంప్తడు
తెంపినోడు తినడు
తెంపనోడు తింటడు
తిన్నోన్ని కొట్టరు
తిననోన్ని కొడ్తరు
కొట్లు తిన్నోడు ఏడ్వడు
కొట్లు తిననోడు ఏడుస్తడు
ఏడ్చినోన్ని ఊకొంచరు
ఎడ్వనోన్ని ఊకొంచుతరు.[2]
(నోరు, చేతులు, నోరు, వీపు, కండ్లు, గదుమ)

ఇది సుదీర్ఘవచనం. ఇంతపెద్ద దీనికి ఎన్నో విడుపులున్నాయి అందువల్ల ఇది పెక్కు పొడుపులున్న పొడుగుమాట ఇక హ్రస్వ వచన ప్రహేళికలు చూద్దాం.

## 2-2-3 : ఒక్క పొడుపు పొట్టిమాట

* బుడ్డోడు బొడ్డాన పెట్టె (పల్లెరుగాయ)

ఇది ఒకే పొడుపున్న హ్రస్వ వచనం పొట్టి పొడుపు కథలు పొడుపు కథా సాహిత్యంలో కోకొల్లలుగా ఉన్నాయి.

## 2-2-4 : పెక్కు పొడుపుల పొట్టిమాటలు

* పంఢ్లులేని ఆడదాన్ని
కాళ్లులేని మగోడేసుక పోతుంటే
తలకాయ లేనోడు కావలిగాసె

(కప్ప, పాము, ఎండ్రకాయ)

సంబంధం చెడకుండ కొన్ని విడుపులు ఒకే పొడుపు కథలో వచ్చేట్లు పై ప్రహేళికలో చెప్పడం జరిగింది. ఈ విధంగా జానపదుల పొడుపు కథల్లోని దీర్ఘ హ్రస్వ వచన ప్రహేళికల్లో ఒక్కవిడుపున్న పొడుపులు, పెక్కువిడుపులున్న పొడుపులు పెక్కులున్నాయి.

## 2-3 : గేయాలు

జీవుడు భూమి మీద పడినప్పుడేడుస్తాడు. జీవుడు భూమినుండి పోయేప్పుడు ఏడుస్తారు ఈ యేడుపుల్లో లయ ఉంది. లయ గేయ ప్రధాన లక్షణం. కాబట్టి జీవుడు పుట్టినప్పుడే గేయం పుట్టిందనే భావం సాహితీ ప్రపంచంలో ఉంది. ఈ భావం గేయ ప్రాధాన్యాన్ని నొక్కి చెబుతోంది.

గేయమంటే పాట, అర్థసహితమైనా గాకున్నా లయ సహితమై ఉంటే అది గేయమవుతుంది. పొడుపుకథల్లో మాత్రం అర్థలయ సహితమై ఉంటేనే అదిగేయ ప్రహేళిక అవుతుంది. ఇందులో జానపదుడు సకృత్తుగా లయకొరకు వ్యర్థ పదప్రయోగం కూడా చేస్తాడు. పద్యంలో గణ పూరణానికి వ్యర్థపద ప్రయోగాలు జరుగుతున్నప్పుడు కవిత్వమర్యాదలు తెలియని జానపదుడు ఆప్రయోగాలు చేస్తే తప్పులు పట్టాల్సిన అవసరమేలేదు. పైగా జానపద సాహిత్యం వ్యర్థ పద ప్రయోగాలకు నిలయం.

వచనాల వలెనే గేయాల్లోనూ ఒక్క విడుపు, పెక్కు విడుపులున్న దీర్ఘ గేయాలు హ్రస్వ గేయాలు ఉన్నాయి.

## 2-3-1 : ఒక్క పొడుపు పొడుగుపాట

* అడవిలో పుట్టింది
అడవిలో పెరిగింది
పాడుపాము వచ్చి
పైనబడ్డాయి
రాజింపికొచ్చింది
రాజుపైకెక్కింది
కుంబులో నీళ్లన్ని
చెడతాగి పోయింది
చెప్పితే నీ నోరు
గప్పుమంటుంది
తప్పితే నీ నోరు
చప్పగుంటుంది.[1] (గంధపు చెక్క)

ఇది దీర్ఘ గేయ ప్రహేళిక. ఒకే ఒక్క విడుపున్న పొడుగుపాట. ఖండ గతిలో నడచిన పొడుగు పొడుపు పాట.

## 2-3-2 : పెక్కు పొడుపుల పొడుగుపాట

* సెట్టుగొక పండు
ఒకడు సూసిండు
సూసినోడు పోలేదు
ఇంకొగడు పోయిండు
పోయినోడు తేలేదు
ఇంకొగడు తెచ్చిండు
తెచ్చినోడు తినలేదు
ఇంకొగడు తినిండు
తిన్నోడ్ని దేర్గలేదు

1. జానపద గేయ వాఙ్మయ వాసావళి—పు : 149

ఇంకొకడు సేద్గిండు
ఏర్గినోడు కద్గలేదు
ఇంకొకడు కద్గిండు
కద్గినోడు సెక్కిండు
సెక్కింది యేందిరా?

(కండ్లు, కాళ్లు, చేతులు, నోరు, ముడ్డి, చేతులు, గోచి)

ఇది ఎన్నో విడుపులున్న దీర్ఘ ప్రహేళిక. ప్రహేళికా సాహిత్యంలో పొట్టి పొడుపుల కన్నా ఇవి తక్కువే అని చెప్పాలి. ఇక హ్రస్వ గేయ ప్రహేళికలు చూద్దాం.

## 2-3-3 : ఒక్క పొడుపు పొట్టిపాట

* దుడు దుడుక పండైన
దూలు రెండైన
తినరాని పండైన
తీపి ఘనమైన (శిశువు)

ఇది నాలుగు చిన్న పాదాలతో ఒకే విడుపున్న పొట్టి పొడుపుపాట.

## 2-3-4 : పెక్కు పొడుపుల పొట్టిపాట

* రాజునల్లన
పతాని పచ్చన
కనుగుడ్డు తెల్లన
కలి పుల్లన.

(తాటిచెట్టు, తాటి ఆకు, తాటిలుంజ, తాటికల్లు)

ఇది నాలుగు చిన్నపాదాల పెక్కు విడుపులున్న పొట్టి పొడుపు పాట. ఇటువంటివే మరెన్నింటినో పొడుపు కథా సాహిత్యంలో గేయ ప్రహేళికలని పిలువ వచ్చు. జానపద సాహిత్య సుందరికి గేయ ప్రహేళిక నొసటి బొట్టుమీధి పాపిడసరం.

## 2-4 : వచన గేయాలు

జానపద సాహిత్యంలో నిరంతరం పరిణామం చెందింది చెందుతున్నది వచనమనే చెప్పాలి. లయాత్మకం కాని వచనంలో మార్పులు సహజం. వచన గేయానికి వచన గుణాలు, గేయగుణాలు రెండూ ఉంటాయి. ఇది చంపూకావ్యం వంటిదే అనాలి.

వచనం కొన్ని అక్షరాల్ని దిగమింగో-కలుపుకొనో లయను సంతరించుకొని గేయానికి సన్నిహితమవుతుంది. గేయంకొన్ని అక్షరాల్ని దిగజార్చో లేదా కలుపుకొనో లయభ్రష్టమై వచనానికి సన్నిహితమవుతుంది. ఇది రెంటికి చెడ్డదే అయినా అర్థం దిగ్రమింగనందువల్ల భావాంశను దిగజార్చనందువల్ల, వచనగేయ ప్రహేళికాఖ్యను దాల్చింది. ఇందులో కూడా ఒక్క పొడుపు పెక్కుపొడుపులున్న దీర్ఘ వచనగేయాలు హ్రస్వవచన గేయాలూ ఉన్నాయి.

## 2-4-1 : ఒక్కపొడుపున్న దీర్ఘ వచన గేయం

* ఒక్క బోగంది
ఒక్క పైసకు
ఆకులు-కట్టెలు
గింజలు నూనే తేవాలి
పైస వాపసివ్వాలి
అలాంటోడితో
పొందిక చేస్తానంది
ఎలా!
ఏం తెస్తే కుదురుతుంది? (నుగుచెట్టు)

ఈ పై పొడుపు కథలో కొంత లయ ఉండడం కొంత లయ తప్పడం తెలుస్తూనే ఉంది. గేయం వచనానికి సన్నిహితంగా ఉన్నట్లు లేదా వచనం గేయానికి దగ్గరగా జరిగినట్లు కనిపిస్తోంది. కొద్ది దీర్ఘంగా కూడా ఉంది. అందువల్ల ఇది ఒక్క పొడుపున్న దీర్ఘ వచన గేయమయింది.

## 2-4-2. పెక్కు పొడుపులున్న దీర్ఘ వచనగేయం

* వదినా వదినా చాలాకి
మీ మగ వారెక్కడపోయారు
ఏమేం తీస్కవచ్చారు
జింక కట్టె సేతుల వట్టి
జీవిలేని గుఱ్ఱమెక్కి
ఆపలేని పొలం పోయి
తొడలులేని జంతువు తెచ్చె

(ముల్లుకట్టె, చెప్పులు, చెరువు, చేప)

ఈ పొడుపుకథ కూడా వచనానికో గేయానికో సన్నిహితంగా ఉంది. ఈ దీర్ఘ వచన గేయ ప్రహేళికలో నాలుగు విడుపులున్నాయి. ఇక హ్రస్వవచన గేయ ప్రహేళికలు.

## 2-4-3 : ఒక్క పొడుపున్న హ్రస్వ వచన గేయం

* మంట మండుతుంటె
బట్ట లెండేసె (రొట్టెలు)

ఇది వచనమా లేక గేయపాదమా అనే సంశయం రాకమానదు. అది వచనమే, గేయ పాదమే అని నిర్ధారిస్తే లక్ష్యానికి లక్షణం సరిపోలేదనవచ్చు. అందుకే ఇది వచనమా గేయమా అనే సంశయంతో ఊగిసలాడేకంటే అదీ ఇదీ అని భావించడమే ఉత్తమం.

## 2-4-4 : పెక్కు పొడుపులున్న హ్రస్వ వచన గేయం

* ఆమడ నడచి అల్లుడు వస్తే
మంచం కింద ఇద్దరు
గోడమూల ఒకడు దాగున్నాడు. (చెప్పులజత. చేతికఱ్ఱ)

ఇదికూడా గేయమా వచనమా అనే సందేహాన్ని కలిగిస్తుంది, కాబట్టి వచన గేయమనే అనాలి. దీనిలో ఒక్క పొడుపుకు రెండు విడుపులున్నాయి. అందువల్ల పెక్కు పొడుపులున్న హ్రస్వ వచన గేయానికి ఉదాహరణమయింది.

జానపద సాహిత్యంలో పొడుపు కథల నడక, ఉచ్చారణ, లయ మొదలైన బాహ్య స్వరూపాల్ని దృష్టిలో ఉంచుకొని పై విధంగా వింగడించడం జరిగింది. కోస్తా, రాయలసీమ, తెలంగాణాలకు భాషలో కించిద్భేదం తప్ప బాహ్య స్వరూపానికి ఈ వింగడింపు సరిపోతుంది.

## 2-5 : స్వభావం

జానపదుల పొడుపుకథల్లోని మర్మాలందరికీ అందేవికావు. అంతరార్థం అందాలంటే అంతలోతుకూ దిగిచూడాలి. సంప్రదాయ మర్మజ్ఞులు కావాలి. జానపదులతో జత కట్టాలి. కల్లు గోళాల దగ్గరవారు గుంపులుగా ఉన్నప్పుడు వారి సరసన కూర్చోవాలి. పంట కళ్లంలో పదుగురు కలిసి కుప్పలు గొట్టేప్పుడు, బంతులు తిప్పేప్పుడు వారిలో ఒకరై పోవాలి. జానపద గేయ మర్మాల్ని తెలుసుకోడానికి గాని, సేకరించడానికిగాని ఎన్ని పాట్లు పడాలో పొడుపు కథలకు కూడా అన్ని పాట్లు పడాలి. అప్పుడే స్వభావమవగతమవుతుంది; అర్థ సిద్ధి కలుగుతుంది.

ఈ భూమి, మట్టి చెట్టు గుట్టలు నదీనదాలతో కనిపిస్తుంది. భౌతిక స్వరూపాన్ని గుర్తించడం అతిసులభం. కానిమట్టినుండి పంట, ఇనుము, నూనె లభిస్తుందని తెలుసుకోడం స్వభావాన్ని తెలుసుకోడమవుతుంది. పెట్టుకు హృదయ ముందని గ్రహించడం స్వభావ గ్రహణం చేయడం; రాతిలో నీరుందనీ, కప్పలు కూడా ఉంటాయని ఎరగడం స్వభావాన్ని ఎరగడం; జలానికి ప్రవహించే తత్వమే కాదు విద్యుత్తును కూడా సృష్టించే శక్తి ఉందని దర్శించడం స్వభావ దార్శనికుడవడం; అదే విధంగా జానపదుల పొడుపు కథల అంతరంగాలరయడం స్వభావమరయడమే అవుతుంది.

అలా స్వభావాన్ని గ్రహించి, అర్థ గౌరవం ఎరిగి అంతరంగాన్ని మథించి విచారించినప్పుడు, జానపదుల పొడుపు కథల్ని ఇలా విభజించడం సబబు అని పిస్తుంది.

గృహజీవన ప్రహేళికలు (Riddles of Domestic life)
శ్రామిక జన ప్రహేళికలు (Riddles of Proletarians)
ప్రకృతి సంబంధి ప్రహేళికలు (Naturalistic Riddles)
తిర్యక్ సంబంధి ప్రహేళికలు (Riddles Pertaining to Animal Life)
క్రీడా వినోద ప్రహేళికలు (Riddles Pertaining to Sports and Amusements)
బాలబాలికా ప్రహేళికలు (Riddles Among Boys & Girls)
తాత్త్వక ప్రహేళికలు (Philosophical Riddles)
అస్పష్ట ప్రహేళికలు (Abstract Riddles)
ఆత్మాశ్రయ ప్రహేళికలు (SubJective Riddles)

## 2-5-1 : గృహజీవన ప్రహేళికలు

ప్రాక్తన మానవుడు గుహయే గృహంగా, వేటయే వృత్తిగా పంచభూతాలే దైవాలుగా భావించి జీవించాడు. కాలక్రమంలో గుహ గృహ మయింది, వృత్తుల్లో మార్పులు వచ్చాయి; పంచభూతాలకు రూపురేఖలు పుట్టాయి; గణ వ్యవస్థ యేర్పడింది; కుటుంబ జీవనానికి ప్రాధాన్యం వచ్చింది; జనం పెరిగింది; స్వేచ్ఛ హద్దులు దాటింది; స్మృతులావిర్భవించాయి; అవి వ్యక్తి ధర్మాన్ని, గృహధర్మాన్ని, సామాజిక ధర్మాన్ని శాసించాయి; వర్ణాశ్రమ ధర్మాలకు వివరణలిచ్చాయి; బ్రహ్మచర్యాది చతుర్విధాశ్రమాల్లో గార్హస్థ్యాశ్రమం ప్రాధాన్యం నొక్కి చెప్పాయి. గృహస్థ ధర్మాలు-తదాచరణ, తదితర విషయాలపై స్మృతి కర్తలు శాసన రక్షకులైన రాజులు చాలా వరకు ఏకాభిప్రాయంతో వ్యవహరించారు. గృహం మానవుల తీర్చిదిద్దే ప్రథమ చైతన్య కేంద్రంగా భావించి గృహజీవన సుస్థిరత్వానికి పాటు పడ్డారు.

శతసహస్రాబ్దాలుగా విదేశీ ఝంఝూ మారుతాల దాడికి తట్టుకొని భారతీయ గృహ జీవన వ్యవస్థ ఇంకా జీవించి ఉండడమే గ్రాక ప్రపంచంలోని సర్వజీవన పద్ధతుల్లో అత్యుత్తమమయిందని ప్రశంసలందుకుంటోంది. తల్లిని తండ్రిని,

ఆచార్యుణ్ణి, అతిథిని దైవాలుగా భావించే పద్ధతుల్ని ఈ గృహజీవనమే నేర్పింది. ఈ సర్వోత్కృష్ట గృహజీవనాన్నే నాటి నుండి నేటి వరకు జానపదులవలంబిస్తున్నారు. జానపదులే అనడమెందుకు సమస్త భారతీయులు అవలంబిస్తున్నారు.

## 2-5-1-1 : పెండ్లి పేరంటాలు

జానపదుల గృహజీవన వ్యవహారంలో పదిమంది ఎప్పుడెప్పుడెక్కడెక్కడ కలిస్తే అప్పుడప్పుడక్కడక్కడ ఏవో కొన్ని విషయాలపై చర్చలు జరుగుతాయి. రెండిండ్ల బాలబాలికలు, నాలుగిండ్ల స్త్రీ పురుషులు కొన్ని పర్వదినాల్లో ఒకచోట గుమిగూడుతారు. గుమి గూడడం అంటే ఊరక గుమిగూడడంగాదు. ఆ దినానికి సంబంధించిన కొంత కర్మకాండ ఉంటుంది. అది జరుపడానికి లేదా చూడ్డానికి గుమిగూడుతారు.

ఒక తల్లి సారెతెచ్చింది; ఊరంత పంచింది; పేరంటానికందరిని పిలిచింది. బాలబాలికలు వెడతారు; తల్లులు కూడా వెడతారు; కన్యలుకూడా వెడతారు; సన్నిహితులైన పురుషులు కూడా వెడతారు. అక్కడ ఇంత మంది చేసేపని ఉండదు. ఓ పదిమంది సతమతమవుతుంటారు. మిగిలిన అందరికీ తినడమేపని. వెళ్ళిన వెంటనే తినడం కుదురదు గదా! కొంత సమయముంటుంది. తినిన వెంటనే బయలు దేరడం సాధ్యం కాదుగదా; అక్కడ కూర్చుంటారు. కూర్చున్నాక చర్చలు చేస్తారు. కేవలం చర్చలేగాదు. కన్నులతో గెలుపుకుంటారు. చేతులతో గిల్లుకొంటారు. మాతులతో పొడుచు కొంటారు. ఇంకేం అక్కడ పొడుపు కథల వాన కురుస్తుంది. అందరు ముద్దుగ తడిసి ముప్పందుమై మురుస్తారు.

అందరిలో ఎక్కువగా మాటాడుతున్న చిన్నవాణ్ని చూసి తాతగారొక పొడుపుకథ పొడుస్తారు.

* బుడబుడవంకాయ
బుడ్డోనోంకాయ
మద్యాన్నం వచ్చేవరకు
మాయమైపాయె (చాప్పు)

తెలంగాణ జానపదులు చిన్నవాణ్ని బుడ్డోడని అంటారు. ఇతర ప్రాంతాల్లో బుల్లోడనీ, బుచ్చోడని అంటారు. మధ్యాహ్నం వచ్చేవరకు శిశువులు నిద్ర పోతుంటారు. ఆపొడుపు కథకుఅదే అర్థమనుకొని బుడ్డోడు అని ఒక బాలుడరుస్తాడు. అప్పుడు ఎవ్వరు కూడా అది చెప్పలేరని గ్రహించిన మరోతాత అంతరార్థాన్ని విడమరుస్తాడు. వంకాయలు తట్టలోకి కుమ్మరించేప్పుడు బుడబుడమనే ధ్వనివస్తుంది. ఇంటిముందు పేడనీళ్లు చల్లేప్పుడు కూడా అటువంటి ధ్వనే వస్తుంది. పేడనీళ్లు ఉదయమే చల్లుతారు. మధ్యాహ్నం వచ్చే వరకు పేడనీళ్లు అదృశ్యమవుతాయి. కాబట్టి దాని అర్థం చాన్పు లేదా చానిపి.

ఈ అర్థాలు మనకు తెలిసేవి కావని బాలురొక దగ్గర కూచుంటారు. అప్పుడు పెద్దలే రంగంలో ప్రవేశిస్తారు. ఒకరిపై ఒకరు పొడుచు పంటారు; విసుచుకుంటారు.

* వాగుల వన్నెకాడు
భూమిల బుడ్డెనుకాడు
చెట్టు మీద జానెకాడు (చేప, ఉల్లిగడ్డ, మిరపకాయ)

విప్పిచెప్పాల్సిందని ఆ తాతగారిని పడుచువాడు ప్రశ్నిస్తాడు. అనుభవాల మీసాలను దువ్వుకొంటూ ఆ తాత వాగులో వన్నె వన్నెలు గలవాడు చేప అనీ, భూమిలో బుడ్డగ (చిన్నగ) ఉన్నవాడు ఉల్లిగడ్డ అనీ, చెట్టుమీద జేనెడున్నవాడు మిరపకాయ అని నవ్వుతాడు.

ఆ తాతగారి నవ్వొక సవాలవుతుంది. అక్కడ ఇక శతాధిక ప్రహేళికలు ప్రాదుర్భవిస్తాయి. ఇక్కడ పురుషులు పొడుచుకుంటూ ఉండంగనే ఇంటివెనుక వసారాలో ఆడవారి అచ్చట్లు ముచ్చట్లు ఆకాశాన్ని అంటుకొని తట్ల వరకు వచ్చేస్తాయి.

ఓ తల్లి అందంగా ఉన్న తనకొడుకును ఎత్తుకొని కూచుంది. ఆ బాలుని అందం చూచిన మరో తల్లికి కన్నుకుట్టింది.

* అమ్మ నీ కొడుకు ఎంత చక్కని వాడు
పన్నీళ్ల పోసె వరదు వచ్చిపాయె. (అగ్గె)

ఆమె మనసులోని మర్మాన్ని దాచి తట్టు ద్వారా తన హృదయాన్నే తట్టినందుకు మనసులోనే మెచ్చుకొంది. కాని తనను తట్టిన ఆయువతి నొచ్చుకునేట్లు పొడవాలని ఆమెకూడా తలచింది.

* గుడిలో సున్నంపోసి
గుడినిండ నీరుపోసి
గుడికి తాళం వేసి
లంక తగులబెడితే
లంజ మొత్తుకుంటది (అన్నం ఉడకడం)

ఆ యువతి నిజంగానే నొచ్చుకుంది. పొడుపుకథ రూపాన తన హృదయ మర్మం బహిర్గతమైనందుకు సిగ్గిల్లింది. తలవంచుకొనే సమాధానించింది. గుడి అంటే కుండ, సున్నమంటే బియ్యం, కుండలో బియ్యం పోయాలి; దానినిండ నీరుపోయాలి; గుడికి తాళం వేయడం అంటే మూత పెట్టడం; లంక తగుల పెట్టడం అంటే కుండ కింద మంట పెట్టడం; లంజ మొత్తుకుంటుంది అంటే అన్నం కుతకుత ఉడకడం.

నీవు నా కొడుకను ఉద్దేశించి వేసిన ఈ పొడుపు కథ వల్ల నా హృదయం కూడా కుతకుత ఉడికిందే అనేధ్వని ఉంది. ఈ పొడుపులకు విడుపుల్ని జానపద స్త్రీలే చెప్పాలి; లేదా వారితో తాదాత్మ్యం చెందిన వారైనా చెప్పాలి; ఇటువంటి మహత్తరార్థాలు భాసించే పొడుపుకథల నెన్నిటినో ఇంటి ముందుపురుషులు, ఇంటి వెనుక స్త్రీలు రసిక జన మనోరంజకంగా పొడుచుకొంటుంటారు.

## 2-5-1-2 : కలతలు

గృహజీవన మెప్పుడూ పేరంటాలతో పెళ్లిళ్లతో శుభ కార్యాలతో నిత్య కళ్యాణం పచ్చతోరణం లాగా సాగిపోదుకాదా! అలా సాగిపోతే గృహసీమ స్వర్గ సీమ అవుతుంది భువిదివి అవుతుంది. వ్యక్తి సంబంధి సామాజిక సంబంధి అయిన అనేక కారణాలవల్ల గృహజీవనంలో కలతలు పుడతాయి. అటువంటి వీటిని గృహ సంబంధమైన కలతలే అనవచ్చు. ఈ కలతలకు అనుమానం మూలం. ఆలుమగల మధ్య అనుమానాల కారణాన కొన్ని పొడుపుకథా గేయాలు పుట్టి బహుళ ప్రచారం పొందాయి?

* భర్త : శారెడన్ని బియ్యంవోసి
శామకూర తొక్కు వండి
వొగవాలు బువ్వపెట్టి
వొగవాలు తొక్కువేసి
ఎవ్వాని కొరకు నీవు వోయుంటివే! భామ వోయుంటివే!

భార్య : ఒగాన్ని పండవెట్టి
ఒగాన్ని కూసో పెట్టి
ఒగాని కొరకు - నేను
వోయుంటిరో-నేను వోయుంటిరో!

భర్త : ఎవాన్ని పండ పెట్టి
ఎవాన్ని కూసోవెట్టి
ఎవాని కొరకు నీవు
వోయుంటివే-భామవోయుంటి వే!

భార్య : రాంబాని పండవెట్టె
గుంజాను కూసోవెట్టి
గుండ్రాయి కొరకు-నేను
వోయుంటిరో-నేను వోయుంటిరో!

*

భర్త : శారెడన్ని బియ్యం వోసి
శామకూర తొక్కువండి
వొగవాలు బువ్వపెట్టి
వొగవాలు తొక్కువేసి
ఎవ్వాని కొరకు నీవువోయుంటివే! భామ వోయుంటవే!

భార్య : ఒగాన్ని సేతవట్టి
ఒగాన్ని నోటవట్టి
ఒగాని కొరకు నేను
వోయుంటరో-నేనువోయుంటిరో!

భర్త : ఎవాన్ని సేతవట్టి
ఎవాన్ని నోటవట్టి
ఎవాని కొరకు-నీవు
వోయుంవే-భామ వోయుంవే!

భార్య : సంచీని సేతవట్టె
వాకూసు నోటవట్టి
సున్నాము కొరకు - నేను
వోయుంటిరో-నేనువోయుంటిరో!
పిడ్లాబియ్యాన్ని కోడె
వారుజిమ్ముల బొల్లికోడె
కోడెందోలురోరి మొగడ కోడెందోలురా!
నీవుదోలిన తోల్కానికి
ఎదుట జిమ్ములు జిమ్ముతాది
పిల్లను వట్టురోరి మొగడ-నేనుదోలుతా!

చేరెడు బియ్యంపోసి చేమకూర వండి అన్నంకూర ఒక పర్యాయం మాత్రమే భర్తకు వడ్డించి భార్య బయటకు వెళ్లింది. మారడుగక, మారువెట్టక, తాను తిన్నంత వరకుండక బయటకు వెళ్లిన భార్యమీద భర్తకు కోపం వచ్చింది. అందుకే యెవని కొరకు నీవుపోయావని అడిగాడు. భార్య భర్తనుడికించా లనుకుంది. ఒకణ్ని వండవెట్టి ఒకణ్ని కూర్చోబెట్టి, ఒకని కొరకు వెళ్లానంది. ఎవడు వాడని భర్త ఆగ్రహోదగ్రుడై అడిగాడు. భార్య పసుబ్బాయినివండవెట్టానంది; గుంజను కూచోబెట్టానంది; గుంబ్రాయికొరకు పోయానంది. భర్త శాంతించాడు. అతనికి మళ్లీ అన్నం వడ్డించింది; కూరవేసింది; మరోసారి బయల్వెడలింది. భార్య రాగానే భర్త మళ్లీ ప్రశ్నించాడు. ఆమె ఒకణ్ని చేతవట్టె, ఒకణ్ని నోట వట్టి, ఒకని కొరకు పోయానని అంది. భర్త వాడెవడని క్రోధంగా అడిగాడు. సంచిని చేత వట్టి, ఆకును నోటవట్టి, సున్నం కొరకు పోయానని భార్య సమాధానం చెప్పింది. అంతటితోఊరుకోక పడుసుకొమ్ముల బొల్లికోడె బియ్యం చిమ్మిందనీ దానిని తరుముమనీ కోరింది. భర్త తరిమాడు. అదిదూరం పోలేదు; పైగా ఎదురు తిరిగింది; తానే తరుముతానని సందుచేసుకొని, భర్త కదలకుండ పిల్లను చేతికిచ్చి మరొకమారు బయటకి వెళ్లింది.

ఇందులో భార్య స్వేచ్ఛాప్రియత్వం స్పష్టంగా పొడగట్టుతోంది. గూఢార్థ సంయోజకాలైన ప్రశ్నలందులో ఉన్నాయి. "గూఢార్థములగు మాటలూ పేర్చి ప్రశ్నోత్తరముల జరిపెడు పద్ధతిని 'ఉద్ఘాత్యక' మందురు"[1] ఇటువంటివి లయ ప్రాధాన్యమున్న ఉద్ఘాత్యకాలు కాబట్టి గేయప్రహేళికలనే చెప్పాలి. జానపద సాహిత్యాన్వేషకులు కొందరు ఇటువంటి గేయాల్ని ఇంతకు పూర్వమే గ్రంథస్థం చేశారు.

స్త్రీ : ఒకరికి చెయ్యినిచ్చి-ఒకరికి కాలునిచ్చి
ఒకరికి నడుమునిచ్చి-కూకున్నానోయ్ రాజా! కూకున్నానోయ్!

పు : ఎవరికి చేయినిచ్చి-ఎవరికి కాలునిచ్చి
ఎవరికి నడుమునిచ్చి-కూకున్నావోలెజాణ! కూకున్నావే!

స్త్రీ : గాజులక్కి చేయినిచ్చి-అందెలక్కి కాలునిచ్చి
వడ్డాణానికి నడుమునిచ్చి-కూకున్నానోయ్ రాజా! కూకున్నానోయ్!

స్త్రీ : ఒకణ్ణి లోపలబెట్టి-ఒకణ్ణి బయటబెట్టి
ఒకణ్ణి పట్టుకొని-కూర్చున్నానోయ్ రాజా! కూర్చున్నానోయ్

పు : ఎవ్వణ్ణి లోపలబెట్టి-ఎవ్వణ్ణి బయట పెట్టి
ఎవ్వణ్ణి పట్టుకోని-కూర్చున్నావోలెజాణా! కూర్చున్నావే!

స్త్రీ : కాటూక లోపలబెట్టి-బొట్టూను బయటపెట్టి
అద్దమునూ పట్టుకొని-కూర్చున్నానోయ్ బావా! కూర్చున్నానోయ్!

స్త్రీ : ఒక్కణ్ణి చేరవేసి-ఒక్కణ్ణి వాల్చేసి
ఒకనికి చెంగువిసిరి-పడుకున్నానోయ్ రాజా! పడుకున్నానోయ్!

పు : ఎవ్వణ్ణి చేరవేసి-ఎవ్వణ్ణి వాల్చేసి
ఎవనికి చెంగువిసిరి-పడుకున్నావోలెజాణా! పడుకున్నావే!

స్త్రీ : తలుపైన చేరవేసి-మంచమును వాల్చేసి
దీపానికి చెంగువిసిరి-పడుకున్నానోయ్ రాజా! పడుకున్నానోయ్!

---

1 భరత నాట్యశాస్త్రము-18-116

స్త్రీ : ఒక్కణ్ణి కట్టబెట్టి-ఒక్కణ్ణి విడిచి పెట్టి
ఒక్కణ్ణి పట్టుకొని కూర్చున్నానోయ్ రాజా! కూర్చున్నానోయ్!

పు : ఎవనిని కట్టబెట్టి-ఎవనిని విడిచిపెట్టి
ఎవనిని పట్టుకొని-కూర్చున్నావోలెజాణా! కూర్చున్నావో!

స్త్రీ : గేదెను కట్టబెట్టి-దూడను విడిచిపెట్టి
పాలముంత పట్టుకొని-కూర్చున్నానోయ్ రాజా! కూర్చున్నానోయ్

స్త్రీ : ఒకనిని నొక్కిపెట్టి-ఒకనిని చుట్టబెట్టి
ఒకనికోసం ఎదురు చూస్తున్నానోయ్‌బావా! చూస్తున్నానోయ్!

పు : ఎవనిని నొక్కి పెట్టి-ఎవనిని చుట్టబెట్టి
ఎవనికోసం ఎదురు-చూస్తున్నావే భామా! చూస్తున్నావే!

స్త్రీ ; వక్కైన నొక్కిపెట్టి-ఆకైన చుట్టబెట్టి
సున్నముకోసము ఎదురు-చూస్తున్నానోయ్‌బావా చూస్తున్నానోయ్![1]

శ్రామిక జనులు శ్రమాపనోదం కొరకు ఇటువంటి శృంగార చమత్కార సంభాషణలు చేశారని ప్రాజ్ఞులంటారు కావచ్చు..... కాని ఈ స్త్రీ పురుషులిద్దరు భార్యాభర్తలే. భార్యాభర్తలైనప్పుడు మాత్రమే ఈ సంభాషణ జరిగే అవకాశముంది శ్రమాపనోదానికి ఇవి పొడుచుకుంటారనవచ్చు. కాని తాంబూలరాగరంజితాధరయైన జానపద సుందరి పానుపెక్కి భర్తతోనే ఈ సంభావణ చేసిందనడంలో స్వారస్యముంది; సామంజస్యముంది. ఈ గూఢార్థ ప్రశ్నోత్తర గేయప్రహేళిక గృహజీవనానికి సంబంధించిందే ఇందులో వచ్చిన వివువు కథలైన గాజులు అందెలు, వడ్డాణం, కాటుక, బొట్టు, అద్దం, తలుపు, మంచం, దీపం, గెదె. దూడ, పాలముంత, వక్క. ఆకు, సున్నం మొదలైనవన్నీ గృహజీవన సంబంధులే. తలుపు చేర వేయడం, మంచాన్ని వాల్చడం. దీపానికి చెంగు విసరడం, వక్కను నొక్కిపట్టడం ఆకును చుట్టబెట్టడం మొదలైనవన్నీ గృహంలో జరిగినవయినందు వల్ల ఇటువంటి గూఢార్థ చమత్కార శృంగార రామణీయకత కూడా ధర్మబద్ధమై ఒప్పిందనడానికి బలం హెచ్చింది.

1. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి పు : 114, 115.

## 2-5-1-3 : వివాహాలు

గృహజీవనంలో వివాహానంతరం మధురోహల డోలికల్లో ఊగే కాలం ఒకటుంది. ఆ సందర్భంలో వధూవరులు తొలిరేయిని గూర్చే ఆలోచిస్తుంటారు. పెళ్లయి పోయింతర్వాత కళకళలాడే ముఖంతో ఇంటి వెనుక గన్నేరుల క్రింద వధువు కూచుంది. స్నేహితురాళ్లంతా ఆమెచుట్టు చేరారు. అందులో కొందరికి చంక బిడ్డలున్నారు; కొందరికి చంటి బిడ్డలున్నారు. కొందరికి వివాహమై కొన్ని నెలలే గడిచాయి; కొందరు వివాహానికి యెదురు చూస్తున్నారు; పెండ్లి వారివిందు భోజనం కడుపునిండాతిని పెళ్లికూతురును కవ్విస్తున్నారు. చక్కిలిగింతలు పెట్టి నవ్విస్తున్నారు. ఆ సందర్భంలో ఓ అన్నులమిన్న ఇట్లన్నది.

* గుండుమీద గుండు
పదహారు గుండ్లు
పదహారు గుండ్లమీద
పట్టుకుచ్చు (మక్కజొన్న కంకి)

"నువ్వెందుకంటున్నావో నాకు తెలుసు, వధువుకు మెడనిండ గుండ్లు దిగవేసిరనే కదా నీ అభిప్రాయం" ఆ యువతితో ఓకన్య అంది. "అది పొడుపు కథ, దాని అర్థం మక్కజొన్న కంకి" అంది వధువు. 'ఎట్టెట్టా' అడిగింది అర్థం తెలియని కన్య. "మక్కజొన్న కంకికి గుండ్లు గుండ్లుగా గింజలుంటాయి. అవి ఒకటి రెండు కాదు ఎన్నో ఒకదానిమీద ఒకటుంటాయి. అన్నిటికి పైన నార లేదా పీచు పట్టుకుచ్చు వలెఉంటుంది గద" మరొక యువతి అర్థ వివరణం చేసింది.

"ఓనెరజాణ పెళ్లికూతురా! ఈ పొడుపు కథలు విప్పుకో' అంది మొదటి యువతి. 'చెప్పుకో' అందరన్నారు.

తీసి తీసి పెట్టేదొకటి
తియ్యక పెట్టేదొకటి
పాయవట్టి పెట్టేదొకటి
పట్టి పట్టి పెట్టేదొకటి
పండవెట్టి పెట్టేదొకటి
కుచ్చి కుచ్చి పెట్టేదొకటి

'ఛీ....పో సిగ్గులేదు' ఓ కన్య అరచింది. "సిగ్గుపడడానికి ఇందులో చెప్పగూడదంది గానీ, విప్పగూడదంది గానీ లేనేలేదు. వధువుకన్నీ తెలుసు" అంది మొదటి యువతి. పెళ్లికూతురు తలవాల్చి మందహాసం చేసింది. పొడిచిన యువతే విడుపులన్నీ చెప్పింది.

తీసి తీసి పెట్టేది కాటుక (రెప్పలు తీసి పెడతారు)
తియ్యక పెట్టేది బొట్టు (ఏమితియ్యకనే బొట్టు పెడతారు)
పాయపట్టి పెట్టేది జడ (పాయదీసి జడనల్లుతారు)
పట్టి పట్టి పెట్టేవి గాజులు (చేతులు పట్టి గాజులు పెడతారు)
పండపెట్టి పెట్టేది పాపట (వెంట్రుకలను పండబెట్టి పాపట దీస్తారు) -లేదా పాపట పుల్లను పండపెట్టి పాపడదీస్తారు)
కుచ్చి కుచ్చి పెట్టేవి పూలు (ఒకదాని కొకటి దగ్గరగా కుచ్చడం వల్ల పూలు పెట్టుకోవచ్చు)

ఈ విడుపులు విన్న నవ్వని వారెవ్వరు! శోభనపు పెండ్లి కూతురుకు ఆ యువతి యేమో సందేశమందిస్తుందని గుర్తించనిదెవ్వరు! ఆ యువతి అంతటితో ఊరుకోలేదు. ఇది నా చివరి పొడుపు అని మరొకట పొడిచింది.

* ఏడు వ(వా)రాల సొమ్ము పెట్టుకొని
ఏడు వరాల రైక తొడుక్కొని
ఏడువరాల సీర గట్టుకొని
ఒక్కసొమ్ము దీసి
మగని పక్కలపండె!
ఏందా ఒక్క సొమ్ము? (సిగ్గు)

శోభనపు పెండ్లి కూతురు ముప్పది వంకరలు తిరిగి గదిలోకి పరుగెత్త బోయింది. ఆమెనెవ్వరు కదలనివ్వలేదు. చెంపల్లు కెంపులు కాగా రెండు చేతులతో ముఖందాచుకొంది. 'ఏమిసిగ్గే' అంది మొదటి యువతి. 'అదే అవే' అన్నారందరు.

గృహజీవన మాధురీ స్రవంతికలివి. ఇలాంటి పొడుపు కథల్లో జానపద స్త్రీలు ఓలలాడి అందరినీ ముంచి తేలుస్తారు. వివాహ సందర్భమనేది మనమేర్పరచు కొన్న సంకేతంగాని ఇవి యెక్కడ చెప్పకొంటే యేంటి! అందుకే గృహజీవనం లోని ఈయాసమయం సందర్భం అని లెక్కలుగట్టి గాక, అన్ని సందర్భాల్లోనూ కనిపించే ప్రకీర్ణ కాల్ని పరిశీలిద్దాం.

## 2-5-1-4 : ప్రకీర్ణకాలు

* అంతారంకాడ చెట్టుగొడ్తె
అంతకుదాకె-బాలెంతకు దాకె
చెర్లున్న చేపకు దాకె
గుంతులున్న కుందేలుకు దాకె
మళ్లొచ్చి మనకుదాకె (పసపు)

పసపు కొమ్మను చెట్టునుండి తేవాలి. చెట్టు కొట్టడం అంటే చెట్టునుండి విడదీయడం. ఆ పచ్చి పసుపును వాడుకొనే పసుపుగా మారుస్తారు. అలా చేసేప్పుడు దంచడంవల్లనో, గిర్నిలో(మరల్లో)వేసి తిప్పడంవల్లనో అదిఅంతకు దాకుతుంది. అంతకంటే పనిచేసే వారికంటడం, ఆ చుట్టు పక్కలవారి కంటడం, గాలిలో ధూళిలో కలిసి సమస్తాని కంటడం అని అర్థం. ఆ పిదప అవసరార్థం బాలెంతకు పూస్తారు. చెరువులోని చేప ఇంటికి వచ్చినప్పుడు, వంట కుండ కెక్కినప్పుడు దానికి కూడా పసపంటుతుంది. అడవిలోని రాళ్లమధ్య దాగివున్న గృహానికి చేరినప్పుడు దానికి కూడా పసపవసరం 'మళ్లొచ్చిమనకుదాకె' అనడంలో సంప్రదాయం ధ్వనిస్తుంది. దేవ పూజల్లో వివాహాల్లో, పేరంటాల్లో, వ్రతాల్లో పసపుకెంతో ప్రాధాన్యముంది. అంతెందుకు నిత్యం గృహాల కడపలపై నడచే వారందరికి అది తగులుతుంది, అందులో అంత విశిష్టార్థముందని చెప్పడం.

* కటకట రాముల కడుపుల పుడితి
ఎమైె పుడితి-ఏంసుఖ పడితి
ఆడదానితో దెబ్బలు తింటి
ఆగలేకపోయి అగ్గిలబడితి. (పిడక)

పిడక పేడతో తయారవుతుంది. పేడ పశువులిస్తాయి. పశువుల్లో గోవు శ్రేష్ఠం హిందువులకు గోవు దైవంతో సమానం. రాముడు పురుషోత్తముడై ధర్మస్వరూపమై దైవమయ్యాడు. అందువల్ల జానపద గృహిణులు ఇచ్చట గోవుకు రామునికి అభేదం పాటించారు. అంచేతనే పిడకతో రాముల కడుపున పుట్టానని పించారు. ఆ భగవంతునికి జన్మించినా నేనేం సుఖపడ్డానని పిడక అంటున్నది. చివరకు స్త్రీతో దెబ్బలు తిన్నానన్నది. పేడను పిడుకగా చేసేప్పుడు బాగా పిసికి, ముద్దగా తీర్చి, రెండుమూడు దెబ్బలు కొట్టి, అరచేయి వేడల్పుచేసి, గోడకేసి కొడతారు. అది యెండిన తర్వాత వంట చెరుకుగా ఉపయోగిస్తారు. అందుకే ఆగలేక పోయి అగ్నిలో పడ్డానని పిడకతో జానపదులనిపించారు పిడక అంటుందా! జానపదుల భావన ఇది; ఇక్కడ ఒక సంప్రదాయం తెలుసుకోవాల్సి ఉంది. గ్రామీణులు పూర్వకాలంనుండి పిడకలు చేస్తున్నారు. ఈ మధ్యన పిడకలు చేయడం వల్ల పెంట తగ్గిపొలానికి యెరువు సరిపోదని భావించి కొందరు మానివేశారు. కాని పిడుకలు చేస్తున్న వాళ్లు వంట చెరుకుగా ఉపయోగించడమే గాక కుంపట్లు గప్పుతున్నారు; పాలదాలిలో వేస్తున్నారు, పిడకను అంటించి బూడిద తొట్టిలో పెట్టి బూడిదను గప్పుతారు. ఆ పిడకకున్న నిప్పు మరుసటి రోజు వరకు అట్లే ఉంటుంది. అగ్గిపెట్టెలు లేని కాలంలో పుట్టిన ఈ ఆచారం అగ్గి పెట్టెలు పుట్టినా అట్లే ఉంది. ఇంత పరిశీలించిన తర్వాత జానపదుని నిత్యాగ్నిహోత్రి అనడంలో అతిశయోక్తిలేదుగదా! పాలదాలిలో పిడకలను వేయడంకూడా ఒక ప్రయోజనాన్ని ఆశించే జరుగుతోంది. దాలి అంటే పాలకడవపట్టే గుంత (గొయ్యి). అందులో పిడకలు వేసి నిప్పుపెట్టి పాలకుండనుంచుతారు. పాలు మెల్ల మెల్లగా వేడి అవుతాయి కట్టెపొయ్యిపై పాలకడవనుంచడం వల్ల ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా పొంగిపోవడానికి వీలుంది అందువల్లనే దాలి గుంతలో పిడకలు వేస్తారు. ఈ పొడుపుకథలో పిడక "ఆగలేక పోయి అగ్గిలబడితి" నని ఎంత ఆవేదన వ్యక్తీకరించినా అందువల్ల మానవ జాతికి మహత్తరమైన ప్రయోజనం సమకూరింది. ఏ పొడుపు కథను విప్పుకొన్నా గంపెడంత అర్థం ఈ విధంగానే భాసిస్తుంటుంది.

* అడవిలో పుట్టింది
అడవిలో పెరిగింది
మాయించకొచ్చింది
తైతక్కలాడింది... (చల్లకవ్వం)

పాలు కొద్దిగా చల్లార్చిన తర్వాత తోడు వేస్తారు. అది పెరుగవుతుంది ఆ పెరుగును చల్ల చేస్తారు; చల్ల చేయడానికి కవ్వం కావాలి; సాధారణంగా చేదుగుణం లేని కట్టెతో మాత్రమే కవ్వం చేస్తారు. అటువంటి చెట్లు అరణ్యంలో ఉంటాయి. అవి అడవిలోనే పుడతాయి; అడవిలోనే పెరుగుతాయి; చల్ల కవ్వంగా మారుతాయి. గృహిణులు చల్లలు చిలుకుతారు. ఆ చిలికేప్పుడు కవ్వం చిందు వేసినట్లుంటుంది. ఆ చిందులు గృహిణుల హస్త లాఘవాలే గాని చల్ల కవ్వానికి సహజాతాలుగావు. అందుకే తైతక్కలాడింది అంటోంది జానపద గృహిణి. గృహజీవనంలో చల్లలకున్న ప్రాధాన్యం ఇప్పటిదా, అప్పటిదా, కృష్ణుని నాటిది!

గృహజీవనానికి సంబంధించిన కొన్ని పొడుపు కథల్ని ఉదాహరిస్తాను,

* మా తాత రెండు బొమ్మలు దేస్తే
ఓ బొమ్మ ఆడ్తది ఓ బొమ్మ ఆడదు (విసుర్రాయి)

* రస రసాలు దిన్న
రాజు కడుపున పేగుల్లేవు (కంచం)

* జానెడు గుంతల- మానెడు పగడాలు (ఇంగలాలు)

* అలికి పూసిన తాన
గువ్వ గుడ్డు వెట్టె (బువ్వకుండ)

* సిన్న బీబమ్మకు సిన్న తూటు
పెద్ద బీబమ్మకు పెద్ద తూటు
ఇమాం బీబమ్మకు ఆయింత లేదు (సూది, దబ్బడం, గడ్డపార)

* మూడు గుట్టాలు
ఒకటే కోగిల
ఒగ రాజెక్కుతుండె
ఒగ రాజు దిగుతుండె (పొయిరాళ్ళు, పెంకు, రొట్టెలు)

* నిలబడ్డ రామక్క రావేమి అంటే
చేయివట్టి గుంజంది నేనెట్లు వర్తు (తలుపు)

* గింతంత పొట్టోనికి- పుట్టెడంగీలు (ఉల్లిగడ్డ)

గృహజీవనంలో ఎన్ని చింతలో, ఎన్ని వంతలో, ఎన్ని విందులో, ఎన్ని పసందులో-గృహజీవన ప్రహేళికలతో అన్ని చింతలు, అన్ని వంతలు, అన్ని విందులు, అన్ని పసందులు.

ఈ విధంగా గృహజీవనానికి సంబంధించిన పొడుపు కథలెన్నో సాంప్రదాయిక విజ్ఞాన ప్రబోధకాలై జానపదుల ఆచార వ్యవహారాలకు ఆటపట్టులై, చమత్కార శృంగార రసరామణీయకతకు నిలయాలై, గూఢార్థ భావ నిక్షేపాలై గృహజీవన మాధురులకేతాలై ఒప్పుతున్నాయి. గృహజీవనానికి సంబంధించిన ఇటువంటి పొడుపుకథలు ఒక్కొక్కటి ఒక్కొక్క ఖండకావ్యమన్నా కాదనేవారెవ్వరు.

## 2-5-2 : శ్రామిక జన ప్రహేళికలు

శ్రమచేసేవారు శ్రామికులు. శ్రామికులకు సంబంధించినవి శ్రామిక జన ప్రహేళికలు. వంటపనులు, ఇంటికి సంబంధించిన మరికొన్ని పనులు చేసే స్త్రీ పురుషులు శ్రామికులు కారా అనే ప్రశ్న పుడుతుంది. శ్రమ చేసే వారెల్ల శ్రామికులని ఎంత విశాల దృష్టితో చెప్పినా సర్వ సాధారణంగా ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొని కష్టించేవారినే శ్రామికులని పిలుస్తున్నారు వ్యక్తి శ్రేయస్సుకు సమాజ శ్రేయస్సుకు తద్వార దేశ ప్రగతికి ఈ శ్రమదోహదంచేస్తుంది. అందుకే వారిని శ్రామికులనడం జరుగుతోంది. ఇటువంటి శ్రమకు సంబంధించిన అనేకానేక కార్యక్రమాల్లో వ్యక్తిగత కృత్యాలు కొన్ని సామూహిక కృత్యాలు కొన్ని ఉంటాయి. వ్యక్తి ఒంటరి; ఒంటరి అయినా తన కొరకు కుటుంబంకొరకు శ్రమిస్తాడు. శ్రమ శ్రమగా అనిపించగూడదు. అది ఆటలా పాటలా సాగాలి. అందువల్ల అతడు శ్రమిస్తూనే కూని రాగాలు దీస్తాడు, గొంతెత్తి పాడుతాడు. తాను చేసేపనిలో వచ్చే శబ్దాలే ఆ పాటకు తౌర్యత్రికాలవుతాయి. ఈ విధంగా శ్రమించే వారి ద్వారా అతివేలంగా జానపద సాహిత్యావిర్భావం జరిగింది.

అదే విధంగా పదుగురు కలిసి శ్రమించేసన్ని వేశాలనేకాలున్నాయి. గుంటుకలు గొట్టేప్పుడు, నాగళ్ల దున్నేప్పుడు. మోటలు గోట్టేప్పుడు, మండెలు అలికేప్పుడు, కలుపులు దీసేప్పుడు, చేలనేరేప్పుడు, చేలుగోసేప్పుడు, కుప్పలు వేసేప్పుడు, బంతులు తిప్పేప్పుడు, కుప్పలు గొట్టేప్పుడు, కళ్లాలు చేసేప్పుడు పదిమంది కలుస్తారు. ఇటువంటివన్నీ వ్యవసాయక పరిశ్రమ సంబంధులు. వ్యవసాయానికి

అనుబంధంగా ఉండి, సామాజిక జీవనాన్ని సుసంపన్నంగానూ సుందరంగానూ తీర్చిదిద్దే పనులెన్నో ఉన్నాయి. అటువంటి వాటిలో వ్యవసాయేతర వృత్తులు ప్రధానమైనవి. ఒక ఇంటికి ఒకే వృత్తి అనేది పాటించి తరతరాలుగా అనుసరించినందువల్ల వృత్తులు కులాలుగా పరివర్తనం చెందాయి. వ్యక్తికి చేతినిండా పని ఉండడానికి, వ్యక్తి నైపుణ్యాన్ని బహిర్గతం చేయడానికి, కుటుంబ ప్రగతికి సమాజ కల్యాణానికి, రాష్ట్రాభ్యుదయానికేర్పడిన వృత్తులు కులాలుగా పిలువబడ్డనాటి నుండి సమాజంలో చీలికలు వచ్చాయి. వస్తు వినిమయం ఆగిపోయి ద్రవ్యం ప్రధాన పాత్ర వహించిన తర్వాత వృత్తికీ వృత్తికీ మధ్య గోడలు లేచినై. కందకాలులోతులు చూచినై. వ్యక్తి సమాజం సర్వం అర్థ ప్రధానంగా మారి అర్థవంతుడధికుడనీ, లర్థహీనుడల్పుడనీ అభిప్రాయమేర్పడిపోయింది. ఇది ఆశించదగ్గ పరిణామం గాదు. కాని జరిగిందదే. ఏ ఉత్పత్తి కార్యక్రమంలో సామాజికుడు పాల్గొన్నా దీనివల్ల తనకెంత అర్థం వస్తుందనీ తనకేమి ప్రయోజనం సమకూరుతుందనీ ఆలోచిస్తున్నాడు. అర్థపరచిత్తత, అధికారమత్తత ఫలవృక్షానికి కుక్కమూతి పిందెలు పుట్టడమే అనాలి. సమాజ వృక్షానికెన్ని కుక్కమూతి పిందెలు పుట్టినా జానపదజీవనం అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంది. వ్యావసాయక కార్యక్రమాలప్పుడు, వృత్తి పనులు చేసేప్పుడు జానపద సాహిత్యం ఆవిర్భవిస్తూనే ఉంది. ఇక్కడేగాక రోజుబత్తేనికి నెలబత్తేనికి పరిశ్రమించే ప్రతిస్థలంలోనూ వినిపిస్తూనే ఉంది,

బీడిలు తాల్చడం, కంకరకొట్టడం, లారీలకు మన్నెక్కించడం, బావులు త్రవ్వడం, ఇండ్లు కట్టడం, రహదారులు వేయడం, గిర్నీల నుండి బియ్యం తీయడం, బెల్లం వండడం మొదలైనపనులన్నీ రోజు బత్తెం, నెలబత్తాన్నే ఇస్తాయి. ఈ పనుల వేళల్లో పదిమంది కలుస్తారు; పాటలు పాడుతారు: పరిహాసాలాడుతారు; పొడుపు కథలు పొడుచుకుంటారు.

## 2-5-2-1 : పొలంగట్లులు

మోటగొట్టి అలసి, మోటపాటపాడి సొలసి, పొద్దెక్కి ఇంటికి వచ్చి, కడుపు నిండా అంబలితాగి, ఓ కునుకుతీసి, పొద్దువాలుతుంటే లేచి, ఇంతతిని, ములుకోల కట్టె చేతబట్టి జానపదుల పశువులవాడు సాయంకాలం వరకు పొలం

గట్టుకు చేరుకుంటారు. చుట్టుపక్కల పోలాల వారంతా ఓ నిర్ణీత ప్రదేశానికి వస్తారు. తాము గట్టునా చెట్టునా దాచిన కోలాటాల కట్టెలందుకుంటారు. లయతాళాలు దప్పకుండా కాళ్లతో కోలలతో దరువులు వేస్తారు. గూఢార్థభావ సంయోజిత గేయప్రహేళిక నందుకొంటారు.

* పోతుంటిరా జాణ పోతుంటిరా
చార్కమాసు కట్టమీద పోతుంటిరా!
వాగన్ని నలుసుకుంట—వాగన్ని సుట్టుకుంట
వాగని కోసరం నేను వోతుంటిరా!
పొవ్వాకు నలుసుకుంట సుట్టాకు సుట్టుకుంట
ఇంగలం కోసం నేను వోతుంటిరా! ॥పోతుం॥

వాగన్ని యెండ వెట్టి-వాగన్ని పండవెట్టి
వాగని కోసం నేను వోతుంటిరా
వడ్లాను ఎండవెట్టి-రోకలినీ పండవెట్టి
కుదురుకోసం నేను వోతుంటిరా! ॥పోతుం॥

వాగన్ని కట్టి వేసి-వాగన్ని ఇడ్సిపెట్టి
వాగని కోసం నేను వోతుంటిరా;
బజ్జెనూ కట్టివేసి - బర్ధాన్ను ఇడ్సిపెట్టి
దుత్తకోసం నేను వోతుందిరా! ॥పోతుం॥

వాగన్ని కూసోవెట్టి-వాగన్ని అండ్లవెట్టి
వాగని కోసం నేను వోతుంటిరా!
దుత్తాను కూసోవెట్టి-కవ్వాన్ని అండ్లవెట్టి
తాడుకోసం నేను వోతుంటిరా! ॥పోతుం॥

కాళ్లదరువులు తొక్కుతాయి; కోలలు లయలు చిలుకుతాయి; గళాలు ఏకమై పలుకుతాయి. పై పొడుపు కథల గేయంలో గూఢార్థ చమత్కారం సంప్రోక్షింప బడింది. ఎవరు సంప్రోక్షిస్తారో వారే మళ్లీ విడుపు చెప్పి వినేవారి హృదయాలపై పన్నీరు చల్లుతారు. ఇందులో విడుపులైన "పొవ్వాకు, చుట్టాకు,

ఇంగలం," జానపదులు శ్రమాపనోదన నిమిత్తం ఉపయోగించేవే. శ్రమ చేసే వారికి చుట్ట పీల్చడం ఒక విరామకాలం. ఆ సమయంలో శ్రమలో పాల్గొన్న పశువులు కూడా నెమరువేస్తూ ప్రశాంతంగా నిలిచి ఉంటాయి. జానపదులు ఈ విధంగా పాడేప్పుడు గేయగత భావదృశ్యం వాళ్ల కళ్లల్లో కదుగుతుంది. అవేవిధంగా పచ్చడెంపడంరా పడం, రోకల్ని పందవెట్టడం, కుదురుకోసం పోవడం అనేవి జానపద స్త్రీ పురుషుల్లో ఎవరైనా చేసేవే; పురుషులు కూడా తీరిక సమయాల్లో స్త్రీలకేవిధంగా తోడ్పడతారు. పల్లెలప బియ్యం దీసే మరలెన్ని వచ్చినా ఇప్పటికి[1] కూలీలు తవ్వేడూ మానెడు దంచు కొంటూనే కాలం గడుపుతున్నారు. ప్రభాత ప్రదోష కాలాల్లో బఱ్ఱెను కట్టివేయడం, పాలుదీయడం గేదెలున్న వారికి అనుభవైకవేద్యమైనా జానపదుల్లో పెక్కురికిది నిత్యజీవితంలో పెనవేసికొని పోయిన కార్యక్రమ మయింది. సాధారణంగా స్త్రీలే చల్లచిలుకుతారు. సకృత్తుగ పురుషులుకూడా చిలుకుతారు. అందువల్ల ఈ పొడుపు కథాగేయంలో ఈ భావం కూడా చోటుచేసుకున్నదనాలి. ఈ గేయ ప్రహేళికలో ప్రశ్నోత్తరాలు ఒక్కరే పలికారని భావించాలి.

ఈ జట్లు ఇంతతో ఊరుకోవు; దరువు మార్చిమరొక్కటి అందుకొంటాయి. అందులో ఒకడు ప్రశ్నిస్తాడు అందరు ముక్తకంఠంతో ఉత్తరాలిస్తారు. వారి కుత్తరాలు కొట్టిన పిండి.

ప్ర : ఏసేది యేందిరా! ఎక్కేదియేందిరా!
కారేది యేందిరా! కట్టేది యేందిరా!

ఉ : ఏసేది నిచ్చనా! ఎక్కేది మనిషిరా!
కారేది కల్లురా! కట్టేది రొట్టిరా!

ప్ర : నిలబడ్డదేందిరా! కూసున్నదేందిరా!
కాళ్లసందుదేందిరా! కారేది యేందిరా!

ఉ : నిలబడ్డది బఱ్ఱెరా! కూసున్నది మనిషిరా!
కళ్ల సందుది సెంబురా! కారేది పాలురా!

ఒక్కడే చెప్పడమేంటి అని కించిద్భేదంతో మరొకడు పొడుస్తాడు.

* ప్ర ; వంగబడ్డదేందిరా-అందున్న దేందిరా!
కాళ్లసందుదేందిరా-కారేది యేందిరా!

ఉ : వంగబడ్డది బఱ్ఱెరా-అందుంది రొమ్మురా!
కాళ్లసందుది సర్వరా-కారేది పాలురా!

అంతటితో ఆతడాగుతాడు. ఇంకొక మండలానికి చెందినవాడు తానొకటి పొడుస్తాడు.

* ప్ర : ఎక్కింది ఏమిందిరా-కుక్కింది ఏమిందిరా
ఉ : ఎక్కింది సెట్టూర-కుక్కింది వులిరా

ప్ర : కట్టింది ఎమిందిరా-కారింది యేమిందిరా
ఉ : కట్టింది లొట్టెరా-కారింది కల్లూరా

ప్ర ; అద్దింది యేమిందిరా-రుద్దింది యేమిందిరా
ఉ : అద్దింది పిడసారా-రుద్దింది అలుకూరా

ప్ర : అబ్బింది యేమిందిరా-రుబ్బింది యేమిందిరా
ఉ . అబ్బింది రోలూరా-రుబ్బింది పిండిరా!

ఈ మూడు పొడుపు గేయాలు వరుసగా పాలమూరు, ఇందూరు, రంగారెడ్డి జిల్లాలవి. ఇందులో ప్రశ్నార్థక క్రియలైన ఏసేది, ఎక్కేది, కారేది, కట్టేది. నిలబడ్డది, కూసున్నది. కాళ్ల సందుది, కారేది, వంగబడ్డది, అందున్నది, ఎక్కింది, కుక్కింది. కంట్టిది, కారింది, అద్దింది, రుద్దింది, అబ్బింది రుబ్బింది మొదలైనవన్నీ అశ్లీలాలుగా. అసభ్యశృంగారాలుగా కాముకత ప్రదర్శకాలుగా ధ్వనిస్తాయి. కాని మల్లెపూల పొట్లం విప్పితే పరిమళం గుప్పుమన్నట్లు చమత్కారార్థం భాసింపగా అందరూ ఆనందిస్తారు. "నిచ్చెన, మనిషి, కల్లు, లొట్టి, బఱ్ఱె, నరుడు, చెంబు, పాలు, బఱ్ఱే, రొమ్ము, సర్వ, పాలు, చెట్టు, ఉలి, లొట్టి, కల్లు, పిడచ, అలుకు,రోలు, పిండి" మొదలైన విడుపులు అశ్లీలాలని యెవరంటారు! అవి జానపదుల జీవనంలో పెనవేసుకొని పోయినవంటారు.

కూడు-గుడ్డ-గూడు-ఈ మూడు సమకూరితే జీవితంలో సుఖ సంతోషాలుంటాయని ఎంతగా చెబుతున్నా ఈ మూడు కూడడానికి ఎన్నెన్ని శ్రమలు పడాలో జానపద జీవన ప్రహేళికలేతెలియజేయాలి. మూటితో ముగిసి పోయిందనీ, ముగిసి పోతుందనీ పలకడం ఎంతతేలికో ఒంట పట్టడం అంత కష్టమని పై పొడుపు కథలే తెలుపుతున్నాయి. ఇటువంటి పొడుపు కథల అవిర్భావానికి పొలంగట్టులే కానక్కరలేదు; రచ్చపట్టులు గూడా కావచ్చు.

## 2-5-2-2 : రచ్చపట్టులు

ఒకనాడు రచ్చపట్టులు గ్రామన్యాయవేదికలు; రచ్చకొట్టాలు ధర్మశాలలు; రచ్చబండలు రగడలకు జగడాలకు పరిష్కారమంటపాలు. జానపదుల కులం పంచాయతుల్ని చిటుక్కున తెగగొట్టినవి ఈరచ్చపట్టులు. పొలం గట్టులు పోరులకు మెడకత్తిరింపులకు దారితీస్తే పోరును పొందుచేసి మెడ మెడను పెన వేయించి సమర్థర్మాన్ని ఈ రచ్చపట్టులు నెరపాయి;

కాలం కర్మంకాలి పెద్దల్లో ధార్మిక బుద్ధి నశించింది. రచ్చపట్టులు మూతాతగువులకు మూలాలయ్యాయి. గ్రామాధికారుల అధికార దౌర్జన్యాలకు ఆలవాలాలయ్యాయి. కాకిరెట్టల కేంద్రాలయ్యాయి. తగవుచెప్పేవాడు-వినేవాడు దానిని మల్లెపందిరిగా గాక ముళ్లపొదగా చూడడం మొదలెట్టారు. వారి వారి ఆలోచన లెట్లున్నా రచ్చపట్టులు రాతిరివేళ జానపదుల అభినయాత్మక గేయాలకు, ప్రహసన ప్రసంగాలకు, ప్రహేళికా ప్రహరణలకు నిలయాలై ఉన్నాయి.

అలసి సొలసి ఇంటికి వచ్చి కడుపునిండా తిని అక్కడికి మధ్య వయస్కులు వస్తారు. కష్టార్జితంతో కల్లు పట్టించి ఆ చోటకు తరుణ వయస్కులు వస్తారు. తాంబుల్లను చేతబట్టి తామూకొన్ని పారమార్థిక గేయాలు వినిపించడానికి తాతలు వస్తారు. తరుణుల్ని ప్రౌఢుల్ని తాతల్ని పరిహసించడానికి ఆ స్థలానికి పోకిరులు వస్తారు ఏమేమోఆడతారు; ఏమేమోపాడతారు; ఒకరిని ఒకరువింటారు; ఒకరిని ఒకరు వినరు; కొందరిని కొందరు వింటారు. మొత్తంమీద అదొక "సంకీర్ణ స్వరమేళ". చివరకు రచ్చపట్టుకింద రచ్చపట్టుమీద రచ్చచెటుపక్కన ఒరుగుతారు! ఒక తాతగారు ఒక ప్రౌఢవయస్కుని ఈ రోజేంచేశావని ప్రశ్నిస్తాడు. అతడు సమాధానం చెప్పక ఓ పొడుపు కథను పొడుస్తాడు. దానికి వచ్చే విడుపు తాను చేసిన పని అని అతని భావన.

* అచ్చమైన నల్ల ర్యాగట్ల
మూడుగాళ్ల పిట్టపుట్టె
నెత్తి మీద నోరువుండు
పోసినగింజలన్ని పోసినట్లు మింగుతుండు,
దీని అర్థం తెలిసినోళ్ల కు
నిండు నూరేండ్లు ఆయివుండు. (జడి(డ్డి)గం)

తాతగారు నవ్వి 'ఒరే ఒరే జడిగం గొట్టేతివటరా' అంటాడు. అక్కడ ఉన్న వారికెవ్వరికి ఇది ఆశ్చర్యాన్ని కలిగించేది కానే కాదు. కాని జానపదుల సంప్రదాయం తెలియని వారికి ఇది ఆశ్చర్యకర విషయమే. జడిగమంటే మూడు కాళ్లనాగలి. ఒకనాగలి అయితే సాధారణంగా ఒకరే విత్తనం వేస్తారు. మూడు వేర్వేరు నాగండ్లయితే ఒకరు విత్తనం వేస్తే రెండు చేతులతో వేయాలి. అప్పుడు విత్తనం సరిగా పడక ధారతెగి పోవడానికి అవకాశం ఉంది. మూడునాగళ్ల ఒక్క దగ్గర ఉన్నప్పుడు ఈ మూడింటి పైన దిండొకటే ఉంటుంది. ఈ మూడు నాగళ్లచాలులో పడేట్లు మూడు వెదురు గొట్టాలుంటాయి. ఈ మూడింటిని మీద కలిపి ఒక చిప్పఉంటుంది. దీనిని బుడ్డి అంటారు. ఈ బుడ్డికు మూడు రంధ్రా లుంటాయి. ఆ మూడు రంధ్రాలకు సమంగా విత్తనాలందేట్లు పోస్తారు. ఎప్పుడూ ఏ మాత్రం తగ్గకుండా విత్తనాలు పిడికిట బట్టి జడిగం వెంబడి నడుస్తూ పోయాలి. అలా పోస్తే ధారతెగకుండా చాలుకు సరిపోను విత్తనం పడుతుంది. మెత్తగా దున్నిన నల్లరేగడి నేలలో సాధారణంగా పెద్ద నాగలితో విత్తనం వేస్తారు. పెద్ద నాగలిని ఉపయోగించడం వల్ల చాలెక్కువ వచ్చి విత్తనం లోతునపడిపోయి మొలకెత్తని పరిస్థితికూడా యేర్పడుతుంది. అందువల్ల చిన్న నాగళ్లున్న జడిగం తోనే విత్తనం వేస్తారు. ఈ జడిగానికి మూడే నాగళ్లుండాలనే నియమంకూడా ఏమి లేదు. నాలుగైదుకూడా ఉండవచ్చు. ఇంత తెలిసిన గాని అచ్చమైన నల్లరేగడి అంటే ఏంటో, మూడుగాళ్ల పిట్ట అంటే ఏంటో, నెత్తి మీద నోరుండునంటే ఏంటో పోసిన గింజలన్నీ మింగుతుండునంటే ఏంటో అర్థంగాదు. ఆ తాతగారికర్థమైంది: అక్కడున్న వారికర్థమైంది; ఇంత తెలిసినప్పుడందరికర్థమైంది.

నవ్వి అర్థం చెప్పిన తాతగారు అంతటితో ఊరుకోరుగదా! 'పొడుపుకథలు మొదలెట్టిన పోరడా! నా తట్టుకు తట్టుకో చూస్తా' అంటాడు. అతడు కూడా పళ్లింతలు చేసి చెవులు వ్రేలాడ వేస్తాడు.

* దానిమొదలు చెరకు మొదలు
దాని ఆకు దేవదారాకు
దాని పూత రేగిపూత
దాని కాత రుద్రాక్షకాత (ఆముదం చెట్టు)

ఇది కనుగోడానికి యెంత ప్రజ్ఞ ఉండాలి. ఎంత పరిశీలన ఉండాలి. ఎంత లోకానుభవముండాలి. చెరకు వంటి మొదలు కలిగింది; దేవదారు ఆకువంటి ఆకు కలిగింది: రేగిపూతను పోలిన పూతకలిగింది; రుద్రాక్షతుల్యాలైన కాత కలిగింది. యేదో ఆది కనుగోవాలి. అద్దం కొండను పొదిగికొన్న విధంగా హృదయ ఫలకాన విశ్వప్రకృతిలోని వింతల్ని ముద్రించుకొన్న విజ్ఞానికే ఈ అర్థం చిక్కుతుంది ఆవిజ్ఞాని జ్ఞానబ్రహ్మ స్వరూపుడైన జానపదుడే అందుకే ఓ మధ్య వయస్కుడు ఆముదం చెట్టని విడుపు చెప్పాడు.

ఈ పొడుపులూ విడుపులు వింటున్న ఓ పోకిరితాత దగ్గరికి వచ్చి 'తాత! తాతా! తంగెడుపుల్ల-దొసినీయక్క కుందేలుపిల్ల-నేను పొడుస్తా కాచుకో అంటాడు. 'పొడువవోయి మొగాడా' అంటాడు తాత.

* తాతా తాతా తై బొమ్మలాట
బాటలున్నది బంగారుమూట
మూట ముట్టిచ్చి ముడిగట్టుతాత
తాతో తై బొమ్మలాట.

అని పొడిచి పకపక నవ్వుతాడు. తాతగారతణ్ణి పరిహసిస్తాడు. 'బంగారు మూట అంటే చెకుముకి సంచి, బాటలో ఆ మూట ముట్టించాలి అంటే అందున్న చుట్టను ముట్టించాలి, మళ్ళీ ముడిగట్టాలి'. తాతపైన, తైబొమ్మలాటపైన పడి పొడుపుకథ పొడవడం గూడ చేతకాలేదని తాత దెప్పుతాడు, నీవే తప్పుచెప్పావని పోకిరి తగాద పెట్టుకుంటాడు. తాత కోపంతో అతనివిక్కు జూస్తాడు. బాటలు న్నది బంగారుమూట అంటే మనిషి మలం. అది చూసిన తాతగారు తైతక్క లాడ్తూ బొమ్మవలె చిందులు వేస్తాడు చిందులు వేసేదెందుకు! ఆ మలం ఉప యోగపడుతుంది. దానిని ముట్టుకొని ముడి గట్టుకోవాలి. పొలంలో చల్లుకుంటే

పిచ్చిగా పంటలు పండుతాయి.' ఇదీ నా అర్థం, నీవు తప్పు చెప్పావని పోకిరి కేకలు వేస్తాడు. 'ఆపని నీవైనా నేనైనా లేకపోతే యే కాపు వాడైనా చేయాల్సిందే కదా' అని తాత అంటాడు, 'అట్లనుమరి' అంటూ ఆ కుర్రాడు వెళ్ళిపోతాడు. ఇక పొడుపుకథా ప్రసంగాలు సాగుతూనే ఉంటాయి. పానకంలో పుడక పోయింది ఇక ఆ ప్రసంగాలకు ఆటంకమేముంది, తాతగారు మరొకటి పొడుస్తారు.

వంకలొంకల మట్టి - వంపల్లిమట్టి
వడ్లోని దగ్గరకోయి వంక దీపిచ్చిన
కమ్మరోని దగ్గరకోయి కట్లేపిచ్చిన
ఈరపట్నం తీస్కపోయి రంగేపిచ్చిన (పల్లకి)

అర్థం ఆ ప్రౌఢునికి అవగతం కాలేదు, తాతచెప్పాడు. వంకలున్న కట్టెతో పల్లకి చేస్తారు. వడ్రంగి దగ్గరకు వెళ్ళి ఆ వంకలో కొన్నింటిని తీయించి, కొన్నిటిని తీర్పించి పల్లకి మూసుగా సిద్ధంచేస్తారు. అవి విరిగిపోకుండా ఉండడానికై ఇనుప రేకుల కట్లు వేయిస్తారు, రంగువేసే నగరానికి వెళ్లి రంగు వేయిస్తారు. అప్పుడది పల్లకిలాగా మెరుస్తుంది. వీరపట్టణాన్ని జానపదులు ఈరపట్నమంటున్నారు. ఇప్పుడిది ఇబ్రహీం పట్టణమని పిలువబడుతోంది. తెలుగునాట నామాంతరీకరణం జరిగిన నగరాల్లో ఇదొకటి

వడ్లోనికిత్తునా వంకదీపిత్తునా
కమ్మరోని కిత్తునా కట్లేపిత్తునా
పొడపట్ల గోడల్ల లెంకలేపిత్తునా (తుపాకి)

అది తుపాకి అందుకే సంశయంతో ఏది చేయించేది అని ఒక యువకుడడిగాడు. లెంకలు (అరపులు) మాత్రం వేయించు ఇక ఏమి చేసినా అది పాడైపోతుంద అని తాతగారు నవ్వారు.

ప్రహేళికలకు వేదికగా రచ్చపట్టును కల్పించుకొన్నాం గాని అవి ఎక్కడైనా పరిభ్రమించే ప్రతి స్థలంలోనూ, పరిభ్రమానంతరం విశ్రమించే ప్రతి ప్రదేశంలోనూ పొడవబడుతూనే ఉంటాయి.

## 2-5-2-3 : బీడీల పరిశ్రమలు

తెలుగు నాట ఈ నాడిది గృహ పరిశ్రమగా వర్ధిల్లుతోంది. నగరాల్లో పెద్ద పెద్ద కార్ఖానాలే వెలశాయి. గ్రామాల్లోను చిన్నచిన్నవి ఉన్నాయి. ఈ కార్ఖానాల్లో స్త్రీ పురుషులు కలిసి కూచొని బీడీలను అల్లుతుంటారు. యాజమాన్యం ఆకు తూకం చేసి ఇస్తుంది. ఆకులో నింపే పదార్థం పొగాకు పొడికూడ తూకం చేసి ఇస్తారు. బీడీలు కూడ తూకం చేసి తీసుకుంటారు. గుంపులు గుంపులుగా వీళ్లు కూర్చొని బీడీలు చేసేప్పుడు చమత్కారాలు గుప్పించుకొంటారు. వాక్పుణ్య చిత్రాలు ప్రదర్శించుకుంటారు. సరస సంభాషణ సుగంధాలు చల్లుకొంటారు. అది రసరాట్టుల, రసరాజ్ఞుల రాజ్యంలాగా కనిపిస్తుంది.

ఆరోజు బీడీలనల్లే ఒకరిద్దరు స్త్రీలు ఆలస్యంగా వచ్చారు. వారికి అతి సన్నిహితుడైన ఓ పురుష పుంగవుడు వారిని యెద్దేవచేస్తాడు. 'ఈరోజు రంభా ఊర్వశీ మేనక తిలోత్తమలు ఆలస్యంచేశారు. ఎక్కడెక్కడికి పోయారు'.... బీడీల బుట్ట లందుకొని కాళ్లు వారజాపుకొని ఆ అతివలు కూర్చుంటారు. ఏమేమో అంటున్నావని మోచేతితో పొడుస్తారు. అతడు మళ్ళీ అంటాడు. పొగాకుముక్కను నోట పట్టి కరకరనముల్తూ తుపుక్కున ఉమిస్తూ రంభగా ఉపమింపబడ్డ ఆ యువతి అంటుంటే అందరూ అందుకొంటారు. ఈ గేయ ప్రహేళిక పురుషులు పాడిన పాటనే అనుకరిస్తోంది.

* పోతుంటిరా నేను పోతుంటిరా
చార్కమాను కట్ట మీన పోతుంటిరా!

వాగన్కి కాలిచ్చి-వాగన్కి చెయ్యిచ్చి
వాగనీ కోసరం నేను వోతుంటిరా!
కంచరోన్కి కాలిచ్చి-గాజులోన్కి చెయ్యిచ్చి
పైసల కోసరం నేనువోతుంటిరా! ॥పో॥

వాగన్ని మీదవెట్టి-వాగన్ని కిందవెట్టి
వాగని కోసరం నేను వోతుంటిరా!
నొసటిమీన బొట్టువెట్టి-పండ్లాను దాళవెట్టి
అద్దం కోసరం నేను వోతుంటిరా! ॥పో॥

వొగన్ని మూసివెట్టి-వొగన్ని కప్పివెట్టి
వొగన్ని కొంగుతోటి ఇసిరుంటిరా!
కుండాను మూసివెట్టి-కుంపాటి కప్పివెట్టి
దీపాన్ని కొంగుతోటి ఇసిరుంటిరా! ॥వో॥

ఇవన్నీ స్త్రీ సహజాలైన చేష్టలే కాని వాటిని చెప్పేరీతి ఆదిలో అన్యార్థ భావద్యోతకమై అర్థవివరణానంతరం తెలిమబ్బు విచ్చిపోయిన విధంగా తేటతెల్ల మయింది. ఆ ప్రహేళిక విప్పుకొన్న విధానానికి అక్కడున్న స్త్రీ సమూహం చేతులతో ముఖాల్ని కప్పుకొని నవ్వింది. ఆ పరిశ్రమాంగణం నవ్వులపువ్వుల రువ్వింది.

ఆ సమయంలోనే అక్కడికి మెల్లగా నడుస్తూ ఓ ప్రౌఢ వచ్చింది. ఆమె కూడా ఆరోజు ఆలసించింది. పురుషుడేమో కొంటెవాడు. అందుకే ఓ పొడుపు కథను పొడిచాడు.

* కాయ నడిచివచ్చె
కంటె నడిచివచ్చె
పువ్వు ఎగిరి వచ్చె
చెప్పుకోర పిల్లగా
చెప్పకుంటె తప్పుకోర మెల్లగా

పక్కనే కూర్చున్న పిల్లవాడు బిక్కమొగం వేశాడు. అది తన పొడుపు గేయానికి మాదు పొడుపు గేయమని రంభ గ్రహించింది అందుకే రాగం దీస్తూ దానినిలా విప్పింది.

* కాయనడచివచ్చె - ఎండ్రకాయ నడచివచ్చె
కంటెనడచివచ్చె - నీరుకంటె నడచివచ్చె
పువ్వు ఎగిరివచ్చె - మిణుగురుపువ్వు ఎగిరివచ్చె
చెప్పుకొంటి పిల్లగా - చెప్పి తప్పుకొంటి మెల్లగా

తనమీద ప్రయోగించిన ప్రహేళికను అంత గొప్పగా విప్పినందుకు ఆ మందగమన రంభదిక్కు ప్రశంసా పూర్వకంగా చూసింది. మాటలతో పాటలతో ప్రొద్దుపుచ్చడం గాదు. ఒకవైపు శ్రమ, మరొకవైపు సంభాషణ, ఇంకోవైపు పాటలు, వేరొకవైపు పొడుపుకథలు, జానపదుడష్టావధానం చేస్తాడు. కష్టావధానం చేస్తాడు.

రంభ సంతోషించింది. ఆ పురుషునిపై తానో తట్టు విసరాలనుకుంది, అనుకున్నదే ఆలస్యం రాళ్లను విసరింది; పొడుపు రాళ్లను విసరింది.

* శేలలో శెల్వరాయి
పట్నాన పచ్చరాయి
వేలూరు తెల్లరాయి
నెల్లూరు నల్లరాయి
నాలుగున్నూ చేర్చి పదహారుమంది తొక్కంగ
వకడు తొయ్యంగ
రక్తము కారంగ-
దీని భావమేమి బావగారు.

చేతులు తిప్పుతూ, మూతులు తిప్పుతూ అందరూ ఆమెకు వంత పాడారు. అంతమాత్రం తెలియదేంటని అతడందుకొన్నాడు.

* శేలలో సెల్వరాయి - వక్క
పట్నాన పచ్చరాయి - ఆకు
వేలూరు తెల్లరాయి - సున్నం
నెల్లూరు నల్లరాయి పొగాకు
పదహారుమంది తొక్కంగ - అంటే పండ్లు తొక్కంగ
ఒకడు తొయ్యంగ - నాలుక
రక్తముకారంగ - తమ్మలం కారంగ
దీని భావ మిదేబొమ్మగారు.

పురుషుడెక్కడికక్కడికి పొడుపును విప్పివేశాడు. అతనికతని సహచరులు వంతపాడారు. ఊరకపాడడం గాదు; పనిచేస్తూనే పాడారు. ఊరకపని చేయడం గాదు; తలకాయ కూడ పని చేసింది. లేకపోతే ప్రహేళిక విప్పడం సాధ్యంగాదు.

అందువల్లనే "శ్రమకూ గేయానికి మిక్కిలి దగ్గరి సంబంధమనీ, గేయం లయబద్ధమైన కదలికలకనుగుణంగా, అనుభూతి ఆవేశాల కనుగుణంగా అవతరించడం సహజాతి సహజం"[1] అని అంటారు.

ఇదంతా అంతవరకు మౌనంగా గమనిస్తోన్న మరో స్త్రీ తానొక పొడుపు కథ పొడుస్తున్నానని, చేతనైన వారెవరైనా విప్పవచ్చునని అంది. అందరు ఆమెవైపు చూశారు.

* ఈగుంజాగుంజేరాండ్లు
పందిరి కిష్టమ్మ కోడండ్లు
వాళ్లాకెప్పుడు గోరాలు
వాళ్లా కాళ్లకు దారాలు (పొట్లకాయ)

పొట్లకాయ అంటూ అందరు అరిచారు. ఇక్కడ అత్త పందిరి; పొట్లకాయలు కోడండ్రు; వారికెప్పుడు ఏదో ఒకటుంటుంది; ఆరోగ్యం సరిగా ఉండదు; అందువల్లవారి పాదాలకెప్పుడు దారాలు కడతారు. పొట్లపందిరి గుంజలు ఏరాండ్రవలె ఉన్నవనడం వల్ల జానపదస్త్రీ ఆ కోడండ్ర చైతన్య రాహిత్య స్థితిని ఎంత సునిశితంగా పరిశీలించిందో తెలుస్తోంది. చల్లనీడనచ్చే అత్తగారు స్వేచ్ఛనివ్వక నిలువు గుంజలుగా నిలుపడం వల్ల కుటుంబ వాతావరణం చీలికలు పేలికలవుతుంది. ఏరాండ్రందరు (కోడండ్రు) అత్తగారికి కోడండ్రే అవుతారు. అంతగా స్వేచ్ఛనివ్వనందువల్ల వారికెప్పుడూ అనారోగ్యాలే విచిత్ర విషయాలే. ఇక్కడ 'గోర' మనేది రోగ శబ్దవ్యత్యస్తం వల్ల ఏర్పడినట్లనిపిస్తుంది. కాని జానపదులు 'గోరం' శబ్దం వింత విషయం విన్నప్పుడు ప్రయోగించు కుంటారు. అంతేగాక ఎప్పుడూ ఏదో ఒక రోగాన్ని తెచ్చుకొన్నవారికి ఉపయోగించడమూ ఉంది. ఇందులో మరొక్క విషయం పొట్లకాయ పెంచే విధానాన్ని సూచించడం జరిగింది. చాలా వరకు అన్ని కాయలు అవే పెరుగుతాయి.

1. "Song rises from rhythmical action and owes to it some of its most important charactaristics. Such action is older and earlier than rhythmical words, which are added to it and give to it a new clarifing element" C.M. Boura Primitive Song. p-38.

కాని పొట్లపిందే పడింతర్వాత చక్కగా ఎదగాలంటే కొన్ని దోహద క్రియలు తప్పకుండా చేయాలి. ఆ చిన్న పిందెనే కొద్దిగా సాగదీసి బట్టపేలికకు ఓ చిన్న రాయిగట్టి వ్రేలాడ దీయాలి. అప్పుడు పొట్లకాయ చక్కగా ఎదుగుతుంది. లేకపోతే కాయ వంకరలు పోయి ఒక్కచోటనే చుట్టుకొని ఎదుగూ బొదుగూలేక ఉంటుంది. అందువల్లనే ఎప్పుడూ రాయి కట్టిన దారాలనైనా, బట్టపేగులనైనా వ్రేలాడదీస్తారు. ఇదే విషయాన్ని వేమన్న కూడా ప్రస్తావించాడు.

> "పొట్లకాయ రాయి పొడవు త్రాటనుగట్ట
> లీలతోడ వంకలేక పెరుగు
> కుక్కతోక గట్ట చక్కగా వచ్చునా
> విశ్వదాభి రామ వినురవేమ"[1]

ఇటువంటి విశిష్టార్థాలు భాసించే పొడుపు కథల్ని అల్లిన వ్యక్తినీ అర్థాన్ని వెలికిదీసిన వ్యక్తినీ జానపదవిజ్ఞాని (Folk Lorist)అనీ, అల్లబడినదానిని జానపద విజ్ఞానం (Folk lore) అనీ అంటారు.

పొలం గట్టులు, రచ్చపట్టులు, బీడీల పరిశ్రమలు విభజన సౌలభ్యానికేర్పాటు చేసుకొన్నవేగాని పొడుపు కథలు అత్యావశ్యకంగా అక్కడే జనించాలని లేదు. ఇతరాలెన్నో చెప్పుకోవచ్చు.

## 2-5-2-4 : ఇతరాలు

పొలంలో కలుపు తీయడానికి జానపద సుందరులంతా సకాలంలోనే అడుగు పెట్టారు. అందరితో కలిసి వచ్చిన కలికి ఒకతె పొలంలో ఆలస్యంగా పాదం మోపింది. పొలంలోని పొంతులు ప్రశ్నార్థక ముఖలయ్యారు.

> * సిటుకు సిటుకు మెట్టెలు వెట్టుక
> మంచినీళ్ల బాయికోతె
> కొంటెముండా కొడుకొచ్చి
> కొంగువట్టిగుంజె (రేగుకంప)

---

1. వేమన్న పద్యములు—పు : 98, ప : 719.

అది ప్రహేళిక అని తెలియని ఓ కన్య 'చెంప పగుల గొట్టిక పోయావ్' అంది. ఆ కన్య పక్కనే ఉన్న పడతి అది పొడుపుకథ, విడుపేమో రేగుకంప అంది. కన్య కళ్లింతయి చేసింది. సిటుకు సిటుకు మెట్టెలు పెట్టుక అంటే గాలికి రెపరెపలాడే వస్త్రాన్ని కట్టుకొని అనడం; మంచినీళ్ల బాయికోతే అంటే దాపునకు వెళ్లగా అని అర్థం, కొంటె ముండా కొడుకు రేగుకంప అని అర్థం. రేగుకంపలో వస్త్రం చిక్కుకున్నప్పుడు తొందరపడితే బట్ట చినుగుతుంది. రేగుముల్లు కొనభాగం గాలంవలెఉంటుంది. జాగ్రత్తగ ముల్లు నుండి వస్త్రాన్ని విడిపించాలి. స్త్రీకి సందేశం అందించే ధ్వని ఈ పొడుపు కథలో ఉంది.

మంచినీళ్ల బావికో నీలాటి రేవుకో కడవ చంకన పెట్టుకొని జానపద గృహిణి నిత్యం వెళ్లడం పరిపాటి. అక్కడఅమ్మలక్కలు 'ఎల్లిమీద మల్లి మల్లిమీద పుల్లి 'ని గూర్చి చెవులు కొరుక్కుంటుంటారు. అప్పుడప్పుడు వారికి వారే దెప్పుకొని పొడుచుకుంటుంటారు. 'అంత దబ్బువెట్టి తెచ్చిన ఆ రవిక లట్లయిందేమే' అని ఓ అతివ చిరిగిన రవికనుద్దేశించి అంది. తన దీన స్థితిని యెత్తిపొడిచి నందుకు ఆ దీనురాలు కినిసింది. అయినా కోపం ప్రకటించ కుండా ఇట్లంది.

* దెబ్బయి రూపాయలు పెట్టి
డిబ్బీల రైకతెస్తే
ఎన్ను వలిగి
సన్నుగానొచ్చె (సీతాఫలం)

నిజానికవి దెబ్బది రూపాయల రవికగాదు. అంత వెలగలది జానపద స్త్రీ ఎక్కడ నుండి తెచ్చుకొంటుంది! అయితే ఆమె పలుకులో అతిశయోక్తి ఉందా! లేదు! సహజోక్తి ఉంది; చమత్కారోక్తి ఉంది; సత్యముంది. ఇదెలా విరోధాభాసమనిపిస్తుంది. కాని ఆమె పలుకులో ఆవేదనతో కూడిన నిజముంది. తనకూ పిల్లలకూ బట్టలు తెమ్మని ఆ జానపద స్త్రీ భర్తకు దెబ్బది రూపాయ లిచ్చింది. అతడాడబ్బుతీసుకుని పట్టణానికి వెళ్లి ఇచ్చారచ్చా తిరిగి ద్రవ్యమంతా వ్యయించి ఒక్క రవిక మాత్రం తీసుకొని వచ్చాడు. అదీ పూల రవిక. ఆ వస్త్రమైనా మంచిదిగాదు. బిగుతుగా కుట్టించుకొని ధరించిన కొన్ని రోజులకే వెనుక భాగం చిరిగింది. ముందు భాగం కానవచ్చింది. ఇది ఆదీన గాథ. కాని అర్థం

ఇది గాదు. సీతాఫలానికి రవిక మీది పూల వలె బొడుపులుంటాయి. డిబ్బీలనడం లోని లర్థమదే. కొన్ని సీతాఫలాలు పగులుతాయి; లోన ఉన్నదాని విత్తనాలు కనిపిస్తాయి. ఇందులో డెబ్బయి రూపాయలనడం ఒక్కటే అతిశయోక్తి; మిగిలినదంతా చమత్కారోక్తే. ఇటువంటిఅర్థం జానపదులే చెప్పాలి. జానపద హృదయ మర్మజ్ఞులే విప్పాలి.

పల్లెల్లో పడుచువాళ్ల మంచెమీదెక్కినప్పుడు చూడాలి సంరంభం. డప్పులు గొడతారు; డబ్బాలుగొడతారు; కోరుగొట్టుకుంటారు; పెడీల చప్పుడు చేస్తారు; వడిసెల విసురుతారు; పాటలు పాడుతారు; ఆటలనాడుతారు. మంచెలూగుతాయి; మనస్సు లూగుతాయి; జానపదుల పడుచువాండ్రు గుమిగూడుతారు; ఏమేమో మాటాడు కుంటారు. కంకులు తింటారు; నుగుకాయ కాల్చుకుంటారు; కమ్మని కథలు చెప్పుకుంటారు. ఒకడు కథ పొడుస్తాడు; మరొకడు [illegible].

* ములుకోల కట్టెమీద మున్నూరిండ్లు
మున్నూరిండ్లకు నన్నూరు తలుపులు
నన్నూరు తలుపులకు ఒకటే గొళ్లెం (నుగుచెట్టు)

నుగుచెట్టు కాండం మొదట ములుకోల కట్టెవలెనే ఉంటుంది. ఆ పిదప అది శాకోప శాఖలై విస్తరిల్లుతుంది. అటువంటి దానిని మున్నూరిండ్లని చెప్పడం జరిగింది. ఆ శాఖలకు లెక్కలేనన్ని కాయలున్నాయి. అవి నన్నూరు తలుపులుగా చెప్పబడ్డాయి. అంతేగాక ఆ మాటల్లో ఒక్కొక్క కాయలో ఎన్నెన్నో అరలున్నా యనే అర్థం దాగి ఉంది. ఆ అరల్లో లెక్కకు మిక్కిలిగా నుగుధాన్యముంటుంది. ఆ తలుపుల కన్నిటికి ఒకటే గొళ్లెముంటుంది. నుగుకాయమూతి కొనదేరి ఉంటుంది. ఆ కొనదేరి ఉండడమే గొళ్లెంగా చెప్పబడింది. ఇవి అన్నీ జానపద గ్రామికునికి మాత్రమే అర్థమయ్యే అంశాలు. ఇటువంటిదే మరొకటి.

* తిప్ప తిప్పరాయికాడ
జిలేటి మానికాడ
ఆలుముక్క దిడ్డి కాడ
[illegible] (నుగుగింజ)

మోటపనికి సంబంధించిందొకటి.

* పొద్దుగాలలేసి
కట్టె కుక్క బాయిలవడె (బొక్కెన)

ముళ్లకంప పనికి సంబంధించిందొకటి.

* సందుల్ల మాఅత్త
కొమ్ములాడిచ్చె (రాగోల)

నేతపనికి సంబంధించిందొకటి

* కాళ్ల సందున గుంత
జంకాయించి కొడితే
దూంతడాఖ ఉంటుంది (మగ్గం నేయడం)

కుమ్మరి పనికి సంబంధించిందొకటి

కాల్లు పంగటించి
కాము సేతవట్టి
తూటు లేని తాన
పోటు పొడిసె (కుండ చేసే కుమ్మరి)

గీతపనికి సంబంధించిందొకటి

* కిందికి మీదికి జానకి తాడు
మెల్లగ దించర బెల్లపు కుండ (కల్లులొట్టి)

అవుసలి పనికి సంబంధించిందొకటి

* ఓనా మట్టి
మట్టి గొట్టిస్తి
బాయిదోడిస్తి, బాయిలో బంగారు తీగ దీపిస్తి
వంకూరు పట్నంల వంక దీపిస్తి (వడ్డాణం)

చేపలు పట్టే పనికి సంబంధించిందొకటి

* జీవంలేని గుఱ్ఱం యొక్క జిగటా కోలా
ఆకులేని అడవిలో వేటాడబోయె (పడవ)

మంగలి పనికి సంబంధించిందొకటి

* బోడబండ మీద నుగులెండబోస్తె
నాలిక లేనిపిట్ట నాకిపాయె (మంగలి కత్తి)

ఎన్ని వృత్తుల్లో, ఎన్నిపనులో అన్ని పొడుపు కథలు. స్థాలీ పులాక న్యాయాన్ని అనుసరించి పైన కొన్ని నామ మాత్రంగా ఉదాహరించాను. చెట్టుకున్న కాయల్లో ఓ కాయను రుచి చూస్తే ఆ చెట్టు కాయల రుచి తెలుస్తుంది. బావినీరు దోసెడు తాగితే ఆ నీటి పస బయట పడుతుంది. దూడలు తిరిగే ప్రదేశాలు గమనిస్తే ఆవుల మనస్తత్వాలు తెలుస్తాయి.

మొత్తం మీద ఈ ప్రకరణాంశ ప్రహేళికలు జానపద గ్రామిక జనుల హృదయాల కద్దం పట్టాయి. అంతరంగ భావావిష్కరణం చేశాయి. సంక్షిప్తతలో సమస్తం నిక్షిప్తం చేసుకొని సాంప్రదాయక సౌగంధ్యానికి అనుభవ చమత్కార చంద్రికను రంగరించుకొని, అభివ్యక్తిలో అనుభూతుల పరిమళాల్ని వెదజల్లుతూ జానపద సాహిత్యంలో గ్రామిక జనుల పొడుపు కథ ఒక్కొక్కటి ఒక్కొక్క పొడుపు కొండ వలె దేదీప్యమానంగా వెలుగుతోంది. ఆ పుంతన-ఆపొంతన పయనించే పథికునికి పారిశ్రామికునికి వెలుగు దారులు చూపుతుంది.

## 2-5-3 : ప్రకృతి సంబంధి ప్రహేళికలు

సృష్టిలో ప్రకృతికతిసన్ని హితంగా ఉన్నది జానపదుడే. ప్రాక్తనమానవుని కాలంనుండి ప్రకృతిని ఆరాధ్య దైవంగా భావిస్తూనే ప్రకృతి శక్తిని వశీకరించు కుంటూనే ప్రకృతి అందించే ఫలాల వల్ల పరమానందాన్ని పొందుతున్నాడు జానపదుడు. శక్తి విజృంభిస్తే తట్టుకోలేక పరమ విషాద యోగంలో పడుతున్నాడు. విశ్వ ప్రకృతిని జయించడంలో వ్యక్తిశక్తి యొక్కవోయినప్పుడు సంఘ శక్తిని సమకూర్చుకొంటున్నాడు. యంత్రాలపై తంత్రాలపై మంత్రాలపై

ఆధార పడుతున్నాడు. జీవనానందానికీ, కుటుంబ ప్రగతికీ, సామాజికాభ్యుదయానికీ, రాష్ట్రసౌభాగ్యానికి పాటుపడుతూనే ఉన్నాడు ఆనందాభ్యుదయాలకూ, ప్రగతి సౌభాగ్యాలకూ మళ్లీ మూలాధారం ప్రకృతే. అందువల్ల ప్రకృతిని పరాదేవతగా భావిస్తున్నాడు; పరబ్రహ్మ స్వరూపంగా ఆరాధిస్తున్నాడు.

అటువంటి ప్రకృతిలోని వింతల్ని దార్శనికులు పరమ రమణీయంగా ప్రపంచానికందించారు. వేద సాహిత్యావిర్భావ కాలంనుండి ఈ దర్శన సృజనాలు జరుగుతూనే ఉన్నాయి. ఒక వంక అకలంక ప్రాకృతిక సౌందర్య ప్రభలు కనుగొంటూనే మహాత్ములు మానవాభ్యుదయ మంగళ తోరణాలు గట్టారు. అట్టి మహాపుణ్య కార్యాన్ని ప్రేరేపిస్తూ జానపదుడు ప్రకృతిగీతం ఆలాపించాడు. వేటయే ప్రధాన వృత్తిగా జీవించిన కాలంలో దివిని భువిని కనిపించిన సమస్త వస్తుసముదాయంపై పదాల నల్లాడు; పాటలు గట్టాడు. వ్యావసాయక జీవనాన్ని అవలంబించిన పిదప కొండకోనల్ని, చెట్టు పుట్టల్ని, పారే ఏరుల్ని, పంట పొలాల్ని, పిట్టగూడుల్ని, మట్టి బెడ్డల్ని, మనోహరాలంకార సమన్వితాలుగా చేసి, వాటికి తన ఆత్మ తత్త్వాన్ని జోడించి, తాదాత్మ్యం చెంది సమస్త ప్రపంచానికి తన్మయతా మహాసిద్ధిని కలిగించాడు.

ఈ భావ పరిమళాలచేత జానపద సారస్వతం గుబాళిస్తోంది. ఆజానపద సాహిత్య క్షీరంతో నవనీతం పొడుపుకథ. ఆ స్వచ్ఛనవనీత ఘృత సౌగంధ్యమే ప్రకృతి ప్రహేళిక. నాన్యతో దర్శనీయమైన ప్రకృతిని జానపదుడు దర్శించాడు. ఆ దర్శన స్పర్శనాలనుండి దివ్యభావ సంయోజితాలైన ప్రహేళికల్ని ప్రసరించాడు.

## 2-5-3-1 : చెట్టు పుట్టలు

జానపదుని జీవనంలో చెట్టుకూ గుట్టకూ, పుట్టకూ ఎంతో ప్రాధాన్యముంది. నాగలికి, కాడికి, ఇంటికప్పుకు, వంట చెరకుకు చెట్లే ఆధారాలు. చేనిగట్టుకు, ఇంటి గోడకు, బావితెట్టెకు గుట్టలే మూలాలు. ఇంటి పూతకూ, పొయ్యివేతకూ పుట్టమన్నే అవసరం. సౌఖ్య జీవనానికి ఇంతగా తోడ్పడే ప్రకృతిని జానపదుడు తలచక ఎట్లుంటాడు! జానపద గీతాలలో తలచాడు; పొడుపు కథలతో కొలిచాడు.

* ఆకుల్దాన్ని కాను ఆకులుంటాయి
పోకల్దాన్ని కాను పోకలుంటాయి
సన్నాసోణ్ణి గాను జడలుంటాయి (మఱ్ఱిచెట్టు)

ఆకులున్నది కాదుకాని ఆకులుంటాయి. పోకలున్నది కాదు గాని పోకలుంటాయి. బాలింత కాదు గాని పాలుంటాయి. సన్యాసి కాదు కాని జడలుంటాయి. నిషేధ విధులతో కూడుకొన్న ఈ పొడుపు కథ జానపదుని సామాజికావగాహనకు ప్రకృతి పరిశీలనకు మచ్చుతునక. ఆకులంటే వ్యవహారార్థం తమలపాకులనే; పోకలంటే ఆ తమలపాకు విడెంలో ఉపయోగించేవే. ఈ రెండింటిని గూడ నేనమ్మేదాన్ని గాననే అర్థం వస్తోంది. ఇవి రెండులేకున్నా, ఉన్నవి అనడం వల్ల మఱ్ఱి ఆకులు తమల పాకులవలె, మఱ్ఱిపళ్లు పోకలవలె ఉంటాయని భావించాలి. కొన్ని చెట్లనుండి ఆకులు వేరు చేసినా, కాయలు వేరు చేసినా, ఫలాలు వేరు చేసినా పాలు కారుతాయి. బాలింతకు పాలుంటాయి; మఱ్ఱికి పాలుంటాయి. మఱ్ఱిపాలను ఔషధాలలో ఉపయోగిస్తారు. సన్యాసికి జడలుంటాయి; మఱ్ఱికి ఊడలుంటాయి. ఆ సాదృశ్యంతోనే చివరి పాదం వేశారు. ఈ పొడుపుకథవల్ల మనస్సులో మఱ్ఱిబొమ్మ రూపుగట్టుతుంది

జానపదుని వ్యావసాయిక జీవనానికి నిత్యం ఉపయోగపడే వృక్షాల్లో తుమ్మ చెట్టొకటి. ఈ తుమ్మచెట్టు కాండాన్ని-కంటకాన్ని-పుష్పాన్ని ఏ ప్రతీకలతో పొడుపుకథలో తెలియజేశారో గమనిద్దాం.

* ఇనుపమూలము
వెండిచీల
బంగారు పువ్వు (తుమ్మచెట్టు)

మూలం గృహోపరి భాగానికి ఆధారం. కాండం వృక్షోపరి భాగాన్ని మోస్తుంది. బరువు బాధ్యతలుగల తుమ్మచెట్టు మొదలు నల్లగా ఉంటుంది. ఇనుము నల్లగా ఉంటుంది. ఒకవైపు బరువు బాధ్యతలు, ఇంకొకవైపు వర్ణ సాదృశ్యం దృష్టిని ఉంచుకొనే జానపదుడు ఈ ప్రయోగం చేశాడు. చీల అంటే చిన్న మేకు. సూక్ష్మాగ్రముంటుంది; గృహంలో పనులెన్నిటికో ఉపయోగిస్తారు సాధారణంగా ఇవికూడా ఇనుముతో చేయబడేవే. వాటినే చీలలంటారు కొన్ని ప్రాంతాల్లో కీలలని

పిలుస్తారు! తుమ్మచెట్టు ముండ్లు ఆ విధంగా ఉంటాయి. వెండి తెల్లది; తుమ్మముల్లు తెల్లది. కార్యసాఫల్యం గుణసాదృశ్యం దృష్టిలో ఉంచుకొనే జానపదుడు ఇటువంటి ప్రయోగం చేసి ఉండాలి. తుమ్మపువ్వు పసుపు పచ్చగాఉంటుంది; బంగారం అలా ఉంటుంది. "పదునారు వన్నెల బంగారమును పచ్చ-భామ కుచము మీద పసుపు పచ్చ" అనే పద్యాంశం కూడా వినిపిస్తుంది. వర్ణ సాదృశ్యం వల్లనే ఈప్రయోగం జరిగిందనాలి. ఇనుము వెండి బంగారాల్ని క్రమంగా చెప్పడం వల్ల ప్రథమ లోహానికున్న ప్రాచుర్యం తెలుస్తోంది. ప్రకృతిని మానవీకరించుకొని ప్రహేళికా రూపాన్ని ఇవ్వడంలో జానపదునిది అందెవేసిన చేయి అనాలి.

* నీల్లు తాగదు
మేతమెయ్యదు
దినాం బుడ్డెడు పాలిస్తది (ఈతచెట్టు)

కాయకష్టం చేసి అలసి సొలసిన జానపద పురుషుల్లో చాలామంది, స్త్రీలల్లో కొంత మంది సాయం సమయంలో కల్లు తాగుతారు. మద్యనిషేధ ప్రచారానికి వీరు వ్యతిరేకంగా సమాధానం ఇస్తారు. 'చెట్టు నీరు తాగుతున్నాం తప్పేం చేస్తున్నాం' అని. అందువల్లనే ప్రకృతిలోని సమస్తంవారికి సమాదరణీయమే అయ్యింది. ఈ పొడుపు కథలో ఈత చెట్టును నీరుతాగదని, మేతమెయ్యదని అనడం భౌతిక రూపదృష్టిని బట్టే అనాలి. చెట్టు అందరికి కనిపించే విధంగా నీరుతాగదు; మేత మెయ్యదు నిజమే. కాని అది తన వేళ్ల ద్వారా నీటినీ, భూసారాన్నీ పీల్చు కుంటూనే ఉంది. మానెడు కుండెడు మొదలైన మానార్థక శబ్దాల వలెనె బుడ్డెడు అనేదొకటి. దాదాపు పదిసేర్లు పట్టె కుండను బుడ్డీ అంటున్నారు. చిన్న దాన్ని చిన్న బుడ్డి అని, పెద్దదాన్ని పెద్ద బుడ్డి అనీ అంటారు. 'వాడు బుడ్డెడు తాగుతాడు' అనే వ్యవహారముంది. ఏమీ గ్రహించని ఈత చెట్టు ప్రతిరోజు కల్లునిస్తుందని సమగ్రార్థం. కల్లు ఇస్తుందంటే వాచ్యమవుతుంది. అందువల్ల పాలను ఇస్తుందని చెప్పడం జరిగింది. ప్రకృతిని ప్రకృతిగా గాక ప్రకృతిని మానవీకరించడంలో ప్రపంచంలో భారతీయ జానపదునిదే అగ్రతాంబూలం. ప్రచుర ప్రచారాన్ని పొందినప్పుడు ప్రపంచం ఈ సత్యాన్ని గుర్తిస్తుంది.

* రాజునల్లన
పతాని (పధాని) పచ్చన

కనుగుడ్డు తెల్లన
కలిపుల్లిన (తాటిచెట్టు, ఆకు, లుంజ, కల్లు)

తాటిచెట్టు నల్లగా ఉంటుంది; తాటి ఆకు పచ్చగా ఉంటుంది; తాటిలుంజ తెల్లగా ఉంటుంది; తాటికల్లు పుల్లగా ఉంటుంటె, వీటిని వరుసగా రాజుతో, మంత్రితో, కనుగుడ్డుతో, కలితో జానపదుడుపమించాడు. ఇది ప్రకృతి సమాజాలకు ఒకానొక తాదాత్మ్యం అభేదం, అద్వైతస్థితి కలిగించే రూపచిత్ర మనవచ్చు

* ఎఱ్ఱ గౌఱ్ఱె కెయ్యితూట్లు (పుట్టగడ్డ)

పుట్టగడ్డకనేక రంధ్రాలుంటాయి. ఎఱ్ఱమట్టి నేలలో పెట్ట బడ్డ పుట్ట గడ్డ ఎరుపుగా ఉంటుంది. జానపదుడు ఈ పుట్టను ఎఱ్ఱగౌఱ్ఱె అంటున్నాడు. దానికి వెయ్యి రంధ్రాలుండడం, ఉండి బ్రతకడం అసంభవం. కాని అది ప్రకృతిలో పుట్టిన పుట్టగడ్డ.

ఈ విధంగా చెట్లనూ, గుట్టలనూ, పుట్టలనూ, జానపద సామాజికుడు తన మనోభావాలకనుగుణంగా మలచి మానవీకరించాడు. చెట్టు పుట్టలేగాక ప్రకృతి మాతకు అలంకారాలూ వైభవకోశాలూ అయిన పంటపొలాలు అతని చేతిలో ఏ విధంగా పరవశించాయో పరిశీలిద్దాం.

## 2-5-3-2 : పంటపొలాలు

పచ్చని పంటపొలాలు కృషీవలుని కృషిఫలాలు. ప్రకృతి కన్యకు కైసేత చేసిన కళాకోవిదుడు జానపదుడు. పంటపొలాలు అటు ప్రకృతికి పన్నె చిన్నెల్ని దిద్దేవేగాక మానవ సౌభాగ్యాలనే ధాన్యరాశుల్ని గరిసెల్లో నింపుతాయి. సర్వ జీవులకు ఉపభోగ్యాలే అవి; అయినా పుడమితల్లి పుట్టగడపలో ఉన్నంత వరకు కన్నుల పండువును కలిగిస్తాయి. అందుకే జానపదుడు ఆ పంటల్ని ఆ పొలాల్ని పొడుపుకథల దండలుగా కూర్చాడు; భూమాత గళసీమ నలంకరించాడు.

* సిప్పోడు నీల్లల్ల
సీతమ్మ నీల్లాడె (వరివెన్ను)

వరిని సీతమ్మగా, ప్రసవించడాన్ని వరివెన్నుగా భావించడం జానపదునికే చెల్లింది. చిప్పెడు నీళ్లల్లో నీళ్లాడడం అసంభవం. చిప్పెడు నీటితో గోరుకడుగ వచ్చు; వ్రేలు కడుగవచ్చు, కాళ్లకు మాత్రం సరిపోవు. నీళ్లాడడం అసలు పొసగనే పొసగదు. సీత భూమి నుండి పుట్టింది; వరి భూమినుండి పుట్టింది. ఆ సామ్యంచేత జానపదుడెంతో ఆరాధనాభావాన్ని వ్యక్తీకరించాడు. అలనాడు సీతమ్మ ప్రకృతిలో పుట్టింది. ప్రకృతిలో తిరిగింది; ప్రకృతిలో కష్టాల్ని అనుభవించింది. ఆ వరిపొలం, వరిజలం, వరివెన్ను ప్రకృతి సౌందర్య వైభవ చిహ్నాలు.

* ఏడాకుల మాను
ఎక్కలేరు దిగలేరు (జొన్న చెట్టు)

పచ్చని జొన్న మొక్క ఏపుగా ఎదిగి అందంగా కనిపిస్తుంది. జొన్న కాడకు ఆకులు అటూ ఇటూ వంగి కదులుతుంటాయి. నెత్తి నిండుగా కొప్పువెట్టి కొన్ని వెంట్రుకలు వ్రేలాడదీసిన యువతివలె ఆ జొన్నకాడ నిండుగా ఉంటుంది. దాన్ని ఏడాకుల మాను అనడం జానపదుల సౌందర్య దర్శనానికీ, సప్తసంఖ్య పై వారికి గల ఆసక్తికీ నిదర్శనం.

* గంపెడు సెట్టుకు
గుంపెడు దయ్యాలు (మిరపపండ్లు)

మిరప చెట్టు గంపెడంత ఉంది. దానినిండుగా పండ్లున్నాయి. వాటిని దయ్యాలనడం కారం గుణం ఉన్నందువల్లనే అనాలి. ఉద్దేశమేదైనా నల్లరేగడిలోని పచ్చని మిరప ఎఱ్ఱని పండు ప్రకృతి రమణీయాలై విరాజిల్లుతుంటాయి.

* పచ్చని రవికది
పదహారు పండ్లది
నవ్వితే తెస్తాము
నవ్వకుంటే తేము (సీతాఫలం)

సీతాఫలవృక్షం పుడమికి పచ్చని రవిక తొడిగినట్లుంటుంది. ఆ వృక్ష ఫలాల్ని గూర్చి పచ్చని రవిక గలదనీ, పండుపై ఉన్న కన్నుల్ని (బొడుపుల్ని) పదహారు పండ్లున్నదనీ, నవ్వితే అంటే పండుగా మారి పగిలితే అని అర్థాలు. పండుగా మారకుంటే కోసుకొని రాలేమని పొడుపుకథలోనే ఉంది. ఆ కాయ పక్వం కావడానికి రెండు పద్ధతులున్నాయి. కాయలోని ధాన్యం నల్లగా మారాలి. అది తెలుసుకోవడానికి పై బొడుపు నొక్కటి గిచ్చి చూస్తారు. తెల్లగా ఉంటే గుడ్డి అంటారు. అలాంటి కాయను తెంపరు. నల్లగా మారితే తెంపి కాల్చుకొని తింటారు: లేదా గడ్డివాముల్లో దాచి మాగిన పిదప తింటారు. జానపదుని ఈ పొడుపుకథ భావన ఏదైనా ఆ ఫలవృక్షం ప్రకృతికి భూషణం.

పట్నముల్ల మాయక్క
గడెక్కి జడేసె (బెబ్బరితీగ)

పట్నమంటే జొన్నచేను; గడె అంటె జొన్నగడె; అక్క అంటే బెబ్బరి తీగ. ఈ తీగ పక్కన ఉన్నదేన్నయినా అల్లుకొని పైకి పోతుంది. సాధారణంగా జొన్న చేలలో ఈ బెబ్బరిని వేస్తారు. జొన్నగడను అల్లుకొని పైకిపోయి ఇది ఎన్నో చుట్లు తిరుగుతుంది. ఆ చుట్లు జడవేసినట్లుంటాయి. ఏడాకుల జొన్న గెడను అల్లుకొన్న బెబ్బరితీగ పరమరమణీయంగా కనిపిస్తుంది.

ప్రకృతి సంబంధి ప్రహేళికల్లో పంట పొలాలను ఒక అంశంగా స్వీకరించి పరిశీలించాం. పంట పొలాలకు సంబంధించిన సుదీర్ఘాలైన జానపద గేయాలు లభ్యమవుతున్నాయి; కానీ ప్రహేళికల్లో అటువంటివి కనిపించవు. అందువల్లనే లభించిన పొడుపొడుపుల్ని పరిశీలించడం జరిగింది. దీనికి దరిదాపుల్లో ఉన్న పూలుపండ్లు అనే శీర్షిక క్రింద ప్రకృతికి సంబంధించిన జానపదులపొడుపు కథల్ని కొన్ని గమనిద్దాం.

## 2-5-3-3 : పూలు పండ్లు

ఫలపుష్పాలు ప్రకృతి సుందరి కనుగొలుకుల్లోని ఆనందబాష్పాలు. ఆనంద బాష్పాలతో ప్రఫుల్లమయిన వదనారవిందం అరవిందంపైన జలబిందువుల అందాన్ని పొంది ఉంటుంది. అందమె ఆనందం, ఆనందమె జీవిత మకరంద

మనేది ఆనందో బ్రహ్మ సిద్ధాంత మహా ప్రవాహానికి పుట్టినపిల్లకాలువ. మహాప్రవాహాలు, పిల్లకాలువలు, నీటి ఊటలు సమస్తాలు ప్రకృతి సౌందర్య సంపోషకాలు. విశ్వవిశాల సాహిత్యంలో ప్రకృతి రమణి కంచుకానికి కుట్టిన ముకురశకలాలు పొడుపుకథలు.

* సురసుర కత్తులు
సురారి కత్తులు
రాజులు దెత్తురు
రంభల కిత్తురు (మొగలిపువ్వు)

* పచ్చని పెట్టెలో విచ్చుకోనుంది
తెచ్చుకోబోతేను గుచ్చు కుంటుంది (మొగలి)

ఇందులో రెండవది శిష్టులనోటెక్కింది. పచ్చనిపెట్టె అంటె మొగలి చెట్టు; విచ్చుకోడం మొగలి పూయడం; తెచ్చుకోబోగా కుచ్చుకోడం ఎందుకంటే దానికి ముళ్లుండడం అటువంటి ముళ్లనే పై పొడుపుకథ సుర సురకత్తులు, సురారికత్తులు అంది. సురసుర అంటే సురల సురల అనీ దేవతల కత్తులనీ అర్థం. అతిశయార్థంలో ఆమ్రేడిత ప్రయోగం సర్వసాధారణం. ఆ తర్వాత రాక్షసుల కత్తులనే ప్రయోగం. అటువంటి మొగలి పువ్వుల్ని రాజులుదెస్తారు; రంభల కిస్తారు. ఇక్కడ రంభలంటే వేశ్యలనీ, రంభలబోలు తమ భార్యలనీ అర్థం చెప్పవచ్చు రాజులంటే భూపాలకులనే రాదు; పురుషులని కూడా అర్థం. ఆకు పచ్చ మొగలి వృక్షాలు, పసుపు పచ్చని మొగలి పువ్వులు ప్రకృతికెంతో శోభ నిస్తాయి. ప్రకృతి సౌందర్య మర్మజ్ఞులైన మానవుల మనస్తత్వాల్ని పొడుపు కథలు ప్రస్ఫుటీకరింప జేస్తున్నాయి.

* బంగారు చెంబుల-వెండి కచ్చకాయలు (పొప్పడి)

బొప్పాయిని జానపదులు పొప్పడి అంటారు. పొప్పడి ఎప్పుడూ పచ్చగా కనిపించే వృక్షాల్లో ఒకటి. దానికాయలు కూడా ఆకుపచ్చగనే ఉంటాయి. పండుగా మారినప్పుడు పసుపు పచ్చమిసిమిరంగు వస్తుంది. అందువల్లనే అది బంగారు చెంబుతో ఉపమింపబడింది. ప్రకృతి సౌందర్య పరిపోషణానికి ఇంత మాత్రం చాలు. బొప్పాయిలోని విత్తనాలు వెండికచ్చకాయలయినాయి. బొప్పాయి

శ్రేష్ఠమైన బలవర్ధకమైన ఆహారం. అందువల్లనే జానపదుడు అధిక మూల్యమున్న శ్రేష్ఠలోహంతో, సువర్ణంతో పోల్చాడు. జానపదుని ప్రాకృతిక-లౌకిక దృష్టి ప్రశంసనీయం.

* ఉరుములు మెరుపులు లేకుండా
వానలు వరదలు లేకుండా
ఉత్తరాది చెరువు ఊరకనెనిండింది (కొబ్బరికాయ)

జానపదుని దృష్టి దివికి భువికితాకినడుమ నిలిచింది ఉరుములు మెరుపులుదివికి సంబంధించినట్టివి. వానలు వరదలు భువికి సంబంధించినట్టివి. ఉత్తరాది చెరువు రెండింటినడుమ ఉన్న చెట్టు జుట్టుపైని కొబ్బరికాయ. ఉరుములేదు, మెరుపులేదు వానలేదు, వరదలేదు, కొబ్బరికాయలోకి నీరెలా వచ్చింది! ప్రకృతిలోని చిత్ర విచిత్రాలు ప్రశ్నలుగానే మిగిలిపోతాయిగద! ఇక మొగలిపువ్వుతో ప్రారంభించిన ఈ ఫల పుష్పాల్ని మొగలిపువ్వుతోనే ముగిద్దాం

పిడికెడు సూదులు
పిలువ నంపులు
లంజెకులుకులు
ఘుమ ఘుమలు (మొగలిపువ్వు)

కేతకి సుమానికున్న కంటకాలు పిడికెడు సూదులనీ, దాని పరిమళాలు ఆహ్వాన పత్రాలనీ, దాని సొగసులు వేశ్యకులుకులనీ, పరిమళాలు పరివ్యాప్తాలైనా యనీ పై ప్రకృతి సంబధించిన జానపద ప్రహేళిక సూచిస్తోంది. ప్రకృతికి సంబంధించిన జానపదుల యొక్క పూల-పండ్ల పొడుపుకథలు ప్రకృతికన్యా పరిణయానికి సమర్పించి తదితరాల గవేషణ కొనసాగిద్దాం.

## 2-5-3-4 : తదితరాలు

మేకల గుంపు, గొఱ్ఱెల గుంపు, ఆవుల గుంపు-ఈ మూడింటిలో కలువక మరేవో ఒకటొకటి ఉంటే ఇతరాలు, అన్యాలు అని పిలువడం పరిపాటి. అట్లే పృథ్వ్యప్తేజో వాయ్వాకాశ సమన్విత సంక్లిష్ట సౌందర్య ప్రకృతిలో ఎంత భేద

ముందో అంత సమన్వయముంది. అందుకే భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని భారతీయ సంస్కృతి దర్శిస్తోంది. ఆదృష్టితో కించిద్భేద సాదృశ్యాలున్న జానపదులకు సంబంధించిన ప్రకృతి ప్రహేళికల్ని మచ్చుకు కొన్ని పరిశీలిద్దాం.

ఈడ గల గల
ఆడ గల గల
చెన్న పట్నంల గల గల (ఉరుము)

ప్రకృతిలో మార్పులు సహజం. ఆకాశంలో మేఘాలు కమ్మినప్పుడు మార్పు వెంటనే తెలిసి పోతుంది. జీవ ప్రకృతి అంతా వర్షారంభ సమయంలో మహానందం చెందుతుంది. ఆర్ద్రహృదయం ఉన్న మనోహరాకృతి ఒకటి విశ్వమంతా నిండి ఉంటుంది. అలాంటి సమయంలో ఆకాశం ఉరుముతుంది. జీవ జంతువులదరుతాయి. ప్రకృతి పొంగి శబ్దిస్తుందా అన్నట్లుంటుంది. ఎక్కడ ఉరిమిందో కనుగోవడం కష్టం. అది భువనైకమాత హృదయ ధ్వని అయినప్పుడు ఏ ప్రదేశమని చూపిస్తాం. ఇక్కడ గలగల, అక్కడ గలగల, చెన్న పట్నంలో గలగల. విశ్వ ప్రకృతికి జానపదుని మానసిక ప్రవృత్తి అద్దం పట్టింది.

* ఈడలేదు ఆడలేదు
రాజమణి తోట్లలేదు
పంతులింటి ఇత్తులేదు (వడగండ్లు)

తొలికారుకు పూర్వం తీవ్ర గ్రీష్మాతపముంటుంది. ఆ సమయంలో అప్పుడప్పుడు కాలిన పెనంపై నీళ్లుపడ్డట్లు తీవ్రవర్షం కురుస్తుంది. వర్షంతో పాటు వడగళ్లు పడతాయి. చిన్న చిన్న గోళీలవలె ఉన్న వడగళ్లు పుడమిని గప్పినప్పుడు మొగులు పాలపుంతవలె, ముత్యాల పందిరివలె భూమిపై వారికి కనిపిస్తుంది. కళ్ల పండువుగా ఉండే ఆ దృశ్యాన్ని చూస్తూ జానపదుల పిల్లలు, పడుచువాళ్లు వడగళ్లను ఏరుకొని తింటారు. పంటికి తగిలితే పన్ను పోతుందని గుటుక్కుమంటారు. ఆవురావురుమంటున్న అవనీతలంపై వడగళ్లు వెంటనే కరిగిపోతుంటాయి. ఆవి కని

పించవు. అప్పుడీవిధంగా భావిస్తుంటారు. ఈ భావనే పొడుపు కథగా మారింది. ఆ పొడుపుకథ ఎలాంటి ప్రకృతిని పిడికిట బట్టిందో! ఆ పిడికిలి విప్పినప్పుడు గాని ఆ కథ విశ్వ స్వరూపం భాసించదు!

* ఆడవాయె కోల
ఈడ వాయె కోల
మద్దూరి గట్లల్ల
మాయ మాయె కోల (ప్రొద్దు)

కోల శబ్దానికి గజంనర అనీ, కోలాటం కట్టె అనీ, ముల్లుకట్టె అనీ, నాగలి కట్టె అనీ జానపదుల హృదయ కోశాల అర్థాలు. ప్రపంచాన్నే తన వెలుగు ద్వారా కాంతి వంతం జేసిన శ్రీ సూర్యనారాయణుని జానపదుడు కోలగనే భావించాడు. సూర్యుడుదయించడు; ఉదయించినట్లనిపిస్తుంది. సూర్యుడస్తమించడు; అస్తమించినట్లనిపిస్తుంది. సూర్యుడున్నచోటనే ఉండడం శాస్త్రీయ సత్యం. పొడవడం కుంకడం వ్యావహారిక సత్యం. వ్యావహారిక సత్యాన్నే నమ్మిన జానపదుడు భాస్కరుని అక్కడవాయె ఇక్కడవాయె చివరికి మద్దూరి గట్లల్లో మాయమాయె అంటున్నాడు. భూమిని చాపగా చుట్టి వరాహమూర్తి ముల్లెమీద పెట్టుకొన్నట్టు జానపదుడు సూర్యుని కోల చేసి చేతపట్టాడు. ఈ పొడుపు కథలో సూర్యోదయాస్తమయాల సౌందర్యమేగాక జగన్మిథ్యాతత్వం అంతర్గతంగా పొదగబడి ఉంది. జానపదుడు ప్రకృతి పరిశీలనాదక్షుడు. ఆ దక్షత ఈ పొడుపుకథలో పొదిగాడు.

* నూతిలో నూరంబులు
వేసేవారేగాని
తీసే వారే లేరు (వానచినుకులు)

నూతిలోకి నూరు బాణాలా! ఏక కాలంలో నూరుబాణాల ప్రయోగం! వేసేవారెవ్వరు! అది ఇక్కడి సంగతికాదు. ఆకాశరాజు వేశాడు; మేఘుడు ప్రయోగించాడు. ఈ బాణాలు వానచినుకులు. వేసేవారైతే ఉన్నారు గాని ఆ చినుకులనే తీసేవారున్నారా! లేరు! ఇది పరమ రమణీయ భావచిత్రం. నూతిలోకిపడే

వర్షబిందువులు శరపరంపరలుగా భావించిన జానపదుడు ఒక మహా వీరునిగా ప్రకృతి సౌందర్య సందర్శనం గావించాడు. జానపదుని ఇటువంటి భావనలకు దీటు రాగల కవిత్వముందా అనిపిస్తుంది.

యంత్రయుగం వచ్చి జానపదుల్ని ఎంత ఆకర్షించుకొంటున్నా వారి సంఖ్య పెరుగుతూనే ఉంది. అశ్లీలాలు, అసభ్యాలు, ఆకర్షకాలు అయిన భావాలూ చిత్రాలూ జానపదులను తట్టుతున్నా తమ వృత్తి ధర్మాలు వీడకుండా పల్లె సీమల్ని బంగారు సీమలుగా తీర్చి దిద్దడానికి ఇంకా కృషి సల్పుతూనే, ప్రకృతి రామణీయకతను కథల ద్వారా, గాథల ద్వారా, గీతాలద్వారా, ప్రహేళికల ద్వారా బహిర్గతం చేస్తూనే ఉన్నారు. ప్రకృతికి సంబంధించిన జానపదుని భావాల్ని సర్వ భాషా సాహిత్యాల్లో క్రోడీకరించే శుభకాలం ఆసన్నమైనప్పుడు జానపదుడు జ్ఞాన భాస్కరుడనే ప్రశంసలందుకొంటాడు.

ఈ విధంగా ప్రకృతి సంబంధి ప్రహేళికలు జానపదుని చెట్టు పుట్టల పరిజ్ఞానాన్ని, పంట పొలాల పరమ రామణీయకత్వాన్ని, ఫల పుష్పాల రస మకరంద మాధుర్యాన్ని, శశితారక విద్యుల్లతాహస్కరుల కాంత సంక్రాంతి కాంతి విస్ఫులింగాల్ని ప్రకటించాయి; ప్రచలితం గావించాయి.

## 2-5-4 : తిర్యక్ సంబంధి ప్రహేళికలు

పిపీలికాది బ్రహ్మపర్యంతం ఈ ప్రపంచంలోని అణువణువులో చైతన్యముంది. చైతన్యమే జీవితం. జీవమున్నవే జీవులు. ఇవి లెక్కకు మిక్కిలి ఉన్నాయి. జానపదుడు మాత్రం అరవై నాల్గుకోట్లజీవరాశులున్నాయని అంటుంటాడు. ఈ మాటలోని సత్యాసత్యాలెట్లున్నా అది జీవ జంతు శాస్త్రజ్ఞులు తెల్పవలసిన విషయం. జానపద సాహిత్యంలో ఆయా సందర్భాల్ని అనుసరించి తిర్యక్కుల వర్ణన ఉండనే ఉంది. క్రిమి కీటకాలు, పశుపక్షులు, మృగసమూహాలు జానపదుని కంటిను దాటిపోలేదు. జానపద గేయ వచన సాహిత్యంలో అవి తావన్మాత్రంగా చోటుచేసుకున్నాయి. జానపద విజ్ఞానంలో ఒక ప్రత్యేక విభాగానికి చెందిన పొడుపు కథలలోనూ తిర్యక్కులు కనిపిస్తాయి. పొడుపు కథలకున్న గుణాల్ని బట్టి వీటిని వర్ణనలనలేంగాని భావ సంకేతాలనవచ్చు శిష్ట సాహిత్యంలోని ముక్తకాల్ని మురిపించే ఈ దేశి ప్రహేళికల్లో జంతువులు పక్షులు, కీటకాలు ఇంకా అవీ ఇవీ ఉన్న పొడుపు కథల 'కథాకమామిషు' పరిశీలిద్దాం.

## 2-5-4-1 : జంతువులు

మృగాలు, జంతువులు, పశువులు సాధారణంగా సమనార్థకాలే అయినా క్రూర సింహశార్దూలాల్ని మృగాలనీ మచ్చికవల్ల సన్నిహితాలైన ఉష్ట్రగజహరిణాల్ని జంతువులనీ సాధుప్రవృత్తి ఉన్న గేదెలు గోవులు మేకలు తదితరాల్ని పశువులనీ పిలుస్తుంటాము. జానపదుడు ఇప్పటికీ శార్దూలాల్ని ఎదుర్కొంటున్నాడు; లేళ్లను కుందేళ్లను వేటాడుతున్నాడు; ఆవుల్ని గేదెల్ని పాలిస్తున్నాడు. అందువల్ల అతని పొడుపు కథల్లో ఇవికూడా చోటుచేసుకున్నాయి.

* సుక్కాలు సురబొమ్మలు
జక్కులు మా యావులు
సూసెటోల్లేగాని
కాసెటోల్లులేరు (జింకలు)

హరిణాలు నక్షత్రాలనీ, సురబొమ్మలనీ, దేవతలనీ, ఆవులనీ జానపదుల భావన. లేడి కన్నుల కనీనికల చకచ్చకలు ముద్దు మురిపాల గురుస్తాయి. వాటి ప్రతి కదలికలో సొగసులొలకుతాయి. వాటిని కాయాలని అతనికి మనస్సుంది కాని కాసే దెలా! అవి అందక పొందక అరణ్యాల వెంబడి తిరుగుతాయి. వాటి సౌందర్యోత్కృష్టత చేత జానపదుడు పై విధంగా భావించాడు. ఒక పద ప్రహేళిక నాలాపించాడు. తిర్యక్ సంబంధియైన మరో ప్రహేళికను పరామర్శిద్దాం.

| | |
|---|---|
| * నాలుగు పచ్చి బద్దలు | (నాలుగు పచ్చి బద్దలు పశువు కాళ్లు |
| రెండు వట్టి బద్దలు | రెండు వట్టి బద్దలు కొమ్ములు |
| రెండు లొట లొట | రెండు లొట లొట చెవులు |
| రెండు మిట మిట | రెండు మిట మిట కళ్లు) |

ఆవు, గేదె, ఎద్దు మొదలైన వాటికిది వర్తిస్తుంది. ఆ పశువులతో కలిసి పోయి, వాటితో తన జీవనాన్ని ముడి వేసుకొన్న జానపదుని పరిశీలనా దృష్టి, గుణ సన్నిహితోక్తి చమత్కారానికి ఈ పొడుపు కథే నిదర్శనం. పాదాలు పచ్చిగా ఉంటాయి; కొమ్ములు ఒట్టిగా ఉంటాయి; చెవులాడించేప్పుడు లొటలొట అనే ధ్వని వస్తుంది. కన్నులు మిటమిటలాడు తుంటాయి.

* జివం జివం బండ కింద
జింకపోతులాట
తొంగి తొంగి సూసె నమ్మా
దొంగ రాములక్క (తొడేలు)

గొఱ్ఱెల కాపరి ఏ కొద్ది ఏమరు పాటుగా ఉన్నా తొడేలన్నకు పండుగ. కాపరి భయపడినట్లుంటే అది వెక్కిరిస్తూనే గొఱ్ఱెనో మేకనో కటుక్కున మెడ కొరికి ఈడ్చుకొని వెళ్లుతుంది. ఒక గుట్ట సమీపంలో మేకపోతులాడుతున్నాయి; కుమ్ముకొంటున్నాయి. పసుల పిల్లలు చూస్తున్నారు. అది గమనించి దొంగ రాములక్కయిన తొడేలు తొంగి తొంగి చూస్తుంది. దీని ద్వారా అజాగ్రత్త పనికి రాదనీ తమకు తామే హెచ్చరిక చేసుకొన్నట్లుంది. ఆటలాడువారికి, ఆటలో ఆదమరచు వారికి తొడేలును పోలిన వారున్నారు జాగ్రత్త అనే హెచ్చరిక చేస్తుంది పొడుపు కథ.

* అంగిని దిన్నా-బంగిని దిన్నా
సింగారమున్నా-కోతిని దిన్నా
అడవికోయి అర్కను దిన్నా
ఊర్లకు వచ్చి పియ్యిని దిన్నా (పంది)

పందులు అడవి పందులనీ ఊరపందులనీ రెండు రకాలు. అందులో ఊర పంది తిననిదిలేదు. అది అంగి దిన్నది; బంగిదిన్నది; బంగి అంటే గంజాయి. కోతిని తిన్నది; అడవికి వెళ్లి అర్కలను ధాన్యాన్ని తిన్నది. గ్రామంలోకి వచ్చి మనిషి మలం దిన్నది. ఎన్ని దిన్నా దానికి కడుపు నిండదు. అందువల్ల చెడ్డది పడ్డది, చివరికి తన సంతానాన్ని కూడా అది తింటుంది. ఎక్కువ తినేవాణ్ని పందిలాగ తింటాడని అంటుంటారు. ఈ విషయం జానపదుడెన్నడు గుర్తించాడో పొడుపు కథనే కట్టాడు.

తిర్యక్కులను తెలిపే జంతువుల అంశం క్రిందికే వచ్చే సమ్మిశ్రమ ప్రహేళికొకటి గమనిద్దాం.

* చీకటింట్లో కోరాదు
చీకుముల్లు తొక్కరాదు
బారి పగ్గమెయ్యరాదు
బట్ట కోడెను పట్టరాదు (తేలు, పాము, పెద్దపులి)

చీకటింటిలో ఎక్కడ ఏముందో కనిపించదు. ఉట్టి వ్రేలాడుతుంటుంది. అది తలకు తగులవచ్చు. భయంతో శరీరం జలదరిస్తుంది. చివికి పోయిన ముల్లు నిజంగానే తొక్కరాదు. అది విరిగిపోతే తీయడం కష్టం. చివికి ఉంది కాబట్టి ముల్లు తీయడానికి వీలు కాదు. తీయబోతె "పుట్ట పుట్ట" విరుగుతుంది. అయినా ఇక్కడ చీకుముల్లు తేలుకు సంకేత మయింది; తేలును తొక్కగూడదు. తొక్కితే అది కొండితో కొడుతుంది. పోటెక్కే బాధ భరించడం అతి కష్టం. కొన్ని రకాల తేళ్లు కుడితే ప్రాణాలే పోతాయి. బారి పగ్గమంటే పెద్ద పగ్గం. బండికి యెద్దుల్ని కట్టేప్పుడు వాటి కొమ్ములకు తాడుకట్టి చేత పట్టుకుంటారు. అటువంటి తాడును పగ్గమని అంటారు. నిజానికి పెద్ద పగ్గం విసరివేసి దేనినైనా పట్టుకోడం కష్టమే అవుతుంది. చేతి బలానికి తగిన పగ్గాలే వేయాలి. ఆయినా ఇక్కడ బారిపగ్గం పెద్ద పాముకు సంకేత మయింది. పెద్దపామును వెయ్యరాదు అంటే కొట్టరాదు. చంపవచ్చునుగాని కొట్టి విడిచి పుచ్చరాదు. పాములు పగబడతాయనే సందేశమే ఇది. బట్టకోడె అంటే తెల్ల మచ్చలున్న కోడె అని అర్థం. కోడెకు పౌరుష మెక్కువ. దాన్ని బుజ్జగించి పని నేర్పాలి. పట్టి కట్టి కొట్టి ఏమేమో చేయబోతే పని పాడవుతుంది. అందుకే పట్టరాదని చెప్పడం. ఇక్కడ బట్టకోడె పెద్దపులికి సంకేతం. పెద్దపులిని పట్టడానికి యత్నం చేస్తే ప్రమాదం. దాన్ని ఎదిరించి బ్రతకడం కష్టం. ఈ పొడుపుకథ మాటున ఇన్ని కష్టాలున్నాయి. జానపదుల ప్రహేళికలు అనుభవాల హరివిల్లులు. జానపదుల పొడుపు కథలు అనుభూతుల పన్నీటి జల్లులు.

## 2-5-4-2 : పక్షిసమూహాలు

కాకులు, గద్దలు, చిలుకలు తాము తమ కొరకు బతకడమే గాదు, మానవునికి మహోపకారం చేస్తున్నాయి కాకులుఎంగిలి మెతుకులు తింటాయి. గద్దలు చచ్చిన జీవాల్ని తింటాయి. చిలకలు ఫలించని కాయను ఫలింపజేస్తాయి. పక్షిజాతి

మానవునికి తోడ్పడ్డ సంఘటనలన్ని పురాణాల్లో కథలయ్యాయి; గాథలయ్యాయి. జగత్తున్నంతకాలం జీవ ప్రకృతి అంతా అన్యోన్యాశ్రయమై పరస్పరాభి వృద్ధికి సహకరించుకొంటుంది. ఎంత గూఢార్థ భావ సంయోజితాలైనా సుందర పద చమత్కారంచేత జానపదులు తమ పొడుపు కథల్లో పక్షి జాతుల్ని ఎలా సంభావించారో పరామర్శిద్దాం.

* ఆకులేదు, పోకలేదు, నోరెఱ్ఱన!
వానలేదు, వరదలేదు, వరిపచ్చన! (రామచిలక)

ఆకు వేయలేదు; పోక వేయలేదు; కాని దాని నోరు ఎఱ్ఱగా ఉంది. తాంబూల చర్వణంచేత నోరు ఎఱ్ఱగా అవుతుంది. రాగ రంజితాధర కాంతులు ముఖానికి ఇంపు నింపుతాయి. కాని తాంబూల చర్వణం చేయకున్నా దాని నోరు ఎప్పుడు అట్లే ఉంటుంది. వానలు పడితే, వరదలు వస్తే వరిచేను పచ్చగా అవుతుంది. కాని ఆ రెండు లేకున్నా దాని శరీరం వరిచేనులాగానే ఉంటుంది. పచ్చని వరిపొలాలు ప్రకృతికాభరణాలు ఆటువంటి ఎఱ్ఱని నోరున్నది, పచ్చని దేహమున్నది రామచిలుక. చిలుక పక్షుల్లో అందమయింది. చిలుక సౌందర్యాన్ని పొడుపుకథ ద్వారా చెప్పినా ఒక మహాకవి వాక్కులాగా ఉంది. ప్రత్యక్షరం ఆచితూచివేసినట్లుంది. మహా ప్రతిభావంతులకుగాని ఇటువంటివి సాధ్యంగాదు.

* లగు, బిగు, తపం
తానం, భోజనం
అన్నీ ఒకసారె (చేపల మీది పిట్ట-King Fisher)

ఒకదానితో ఒకటి కలువవు; అన్నీ ఒక పర్యాయమే జరిగాయి. అది ఒక పిట్టకు సాధ్యమయింది. దాన్ని చేపల మీది పిట్ట అంటారు. చిన్న చిన్న తెల్ల చుక్కలతో, నలుపూనశ్యపు వర్ణంతో, దబ్బడాన్ని పోలిన వెలెడు ముక్కుతో, పిడికెడు పిట్ట రెక్కలల్లారుస్తూ చేపలుండే నీటిమీద ఎగురు తుంటుంది. కాలం కర్మం గాలిన చేపపిల్ల నీటి మీదికి వస్తుంది. అంతే! అంతవరకు చేపకై తపస్సుచేసిన ఆ పిట్టకు సిద్ధి కలిగింది. ఒక్క లగు వేసింది. బిగుతుగ పట్టుకొంది; లేదా బిగువైన లగువేసింది. మొత్తంమీద గట్టిగా గంతు వేసిందనాలి. ఆ గంతులో స్నానమవుతుంది; భోజనమవుతుంది. ఆది ముక్కున కరుచుకొనింది కనిపించనే

కనిపించదు. నోట్లోకి ఎప్పుడు వెళ్లిపోతుందో ఆ పిట్టకే తెలియాలి; లేదా జానపదునికే తెలియాలి. పోతన్నగారు వామనుని త్రివిక్రమావతార ఘట్టాన్ని మహాద్భుతంగా వర్ణించి హృదయ ఫలకాలపై ముద్రించారు. జానపదుడు మూడు ముక్కల్లో చేపలమీది పిట్ట స్వభావాన్ని మనస్సనే తెరమీద గీచాడు. స్వరూపాన్ని కన్నులకు బొమ్మ గట్టించాడు. దీన్ని చేపలమీది పిట్ట అనేకన్న చేపలమారి అనడం సమంజసం.

* తల్లి సమర్త గాక పాయె
తండ్రి పెండ్లిగాక పాయె
రామ లక్ష్మణులు కొడుకులు పుట్టిరి (కోడి-పుంజు-పిల్లలు)

* అలూరు భోగంది
అధిక సక్కంది
సన్నియ్యక బాలలకు
సైగతోనడిపె (కోడి)

మొదటి పొడుపు కథకు విడుపులు తెలియనప్పుడు, హిందూ జీవన పద్ధతిని ఎరిగి ఎదిగిన వారు ముక్కుమీద వేలు వేసుకుంటారు. ఎటువంటి సంప్రదాయంలో అటువంటి సాహిత్యమే జన్మిస్తుంది; అయినా అది జరగకూడని విషయంగాదు. దేహమర్మం తెలియనప్పుడు ఆశ్చర్యపడటం జరుగుతుంది. సామాజిక నియమాల్ని ఉల్లంఘించినప్పుడు విపరీతంగా భావించడంజరుగుతుంది. కాని ఇక్కడ ఈ భావన క్షణికం. ప్రహేళిక అనగానే అంతరార్థమేమో ఉంటుందని అనుకుంటారు; ఆలోచిస్తారు: కోడి-పుంజు-పిల్లలని వివరిస్తారు.

అలాంటి కోడిని అలూరు భోగందని జానపదుడంటున్నాడు. కోడికొక భర్త లేడు గదా! అందువల్లనే దాన్ని వేశ్య అన్నాడు కోడి మిక్కిలి చక్కనిదనడం భోగందనడం గమనార్హాలు. పిల్లలకు పాలిచ్చి పెంచుతారు. కాని ఈ భోగంది సైగలతో నడుపుతుంది నడపడం అంటే పెంచడం, పెంపు చేయడం అని అర్థం. 'నన్ను సిన్నప్పటినుండి నడిపినవా, సెయివట్టి గుంజుతవు' అనేది లోకవ్యవహారం. కోడి సంజ్ఞలతోనే నడపుతుంది. ఆ సంజ్ఞా శాస్త్రమే కోడికి పిల్లలకూ విజ్ఞాన సర్వస్వం. ఇటువంటిదే మరో పొడుపుకథ.

* అరిశ్చంద్రుని బిడ్డ
అరికాలితో సన్నిచ్చి
నోట జోలపాడె (కోడి)

చన్నవ్వలేదు, సైగతో నడిపె అనేదానికి అరికాలితో చన్నిచ్చి నోట జోలపాడె అనేది మరింత వన్నె దెచ్చినట్లుంది. ఎప్పుడూ పూర్వపూర్వాలకన్న ఉత్తరోత్తరాలు ఉత్తమాలుగదా!

తిర్యక్ సంబంధులైన జానపదుల పొడుపుకథల్లో జంతుసమూహాలకు సంబంధించినవి కొన్ని, పక్షి సమూహాలకు సంబధించినవి కొన్ని పరిశీలించాం. ఇక క్రిమి కీటకాల్ని గూర్చి జానపదులనుకొంటున్న పొడుపు కథల తీరుతెన్నుల్ని పరామర్శిద్దాం.

## 2-5-4-3 : క్రిమికీటకాలు

జానపదుని జీవనంలోనే కాదు, సర్వమానవాళి జీవన పథంలో క్రిమికీటకాలు అడ్డు తగులుతూనే ఉంటాయి. ఇవి కొన్ని ఉపకారం చేస్తాయి; కొన్ని అపకారం చేస్తాయి. అడవుల్లో ఆకులలో తిరిగే వారికి క్రిమి కీటకాదుల పరిచయ మధికం. జానపదుల్లో అట్టివారేక్కువే. అందువల్ల తమ అనుభవాల్ని క్రిమికీటకాల్ని గుది గుచ్చి వారెన్నో పొడుపు కథల్ని పొడిచారు. స్త్రీని మృగమధ్యగా, అస్తి నాస్తి విచికిత్సా హేతుశాతోదరిగా[1] మహాకవులు వర్ణించారు. జానపదులు సన్నని నడుంపై పాటలే గట్టారు.[2]

1. శృంగార నైషధము-ఆ-2, ప : 40
2. "కందిరీగా నడుము దానా
కాసులోల్ల చిన్నదానా"

"నడుము సన్న నాగసరం
పెట్టుకో వడ్డాణం
నీ వయసు జూచి మురుపబోకె
వగల దానవే"

"ఎట్టావోనిత్తురో
కందిరీగ్గా నడుముదాన్ని
ఎట్టావోనిత్తురో ...."

* నడుము సన్నం
నాగలోకం
తరిమి కరిసెర
బింగిదయ్యం (కందిరీగ)

ఈ పొడుపు కథను లోచూపుతో అనుశీలిద్దాం... నాగలోకం కనిపించదు. కనిపించని నాగలోకాన్ని పోలిన నడుంగలది అని చెప్పి విన్నవారికి "ఆహా" అనిపించాడు. కాని వెంటనే తరిమి కరిసెర అనే పదాలు ప్రయోగించి 'అబ్బా' అనిపించాడు. ఇంతకదికందిరీగ. కందిరీగలు పొదలలో తెట్టెలు పెడతాయి. ఈ తెట్టెలు తేనె పట్టులుగావు. తేనెటీగలనేవి మాత్రమే తేనెపట్టులు పెడతాయి. ఈ తెట్టెలు వాటి గృహాలు. వాటి నాశ్రయించి బతుకుతాయి; పిల్లలు పెడతాయి. ఈ కందిరీగలకు తీవ్రకోధముంటుంది ప్రతీకారేచ్ఛకూడా అట్లే ఉంటుంది. తెట్టెను కదిలిస్తే వాటినిగాని తమకపకారం చేసిన వానినిగాని అవి వెంటబడి తరిమి తరిమికరుస్తాయి. ఒకచోట జరిగిన సంఘటన ఇది. "తెట్టెను కదిలించినవాని వెంబడి కందిరీగలు పడ్డాయి. అతనికి ఎటూ పాలుపోక, తప్పించుకునే ఉపాయం తెలియక పరుగెత్తి పెద్ద బావిలో దుమికాడు. అయినా అవి విడువలేదు. అతడు మునిగి పైకి లేచినప్పుడల్లా కరుస్తున్నాయి. ఇది అతని మిత్రుడు చూశాడు. కొన్ని కొమ్మల్ని విరుచుకొని బావిలోకి దూకి వాటిని పారద్రోలి మిత్రుణ్ని రక్షించాడు. ఇతడైతే రక్షింప బడ్డాడు గాని మరొకచోట కందిరీగలు కరచిన ఒక పాత్రికేయుడు మరణించాడు." మరి ఇలాంటి గుణాలున్న కందిరీగల్ని జానపదుడు బింగిదయ్యాలంటున్నాడు. వానికి బింగిచెవులున్నాయి అనే లోక వ్యవహారముంది. బింగి-వంకర అనే అర్థంలో జానపదలోకాన ప్రయుక్తం. వక్రబుద్ధిగలదయ్యాన్ని బోలినది అనే భావన గావచ్చు.

* ఆవగింజకు తొలిగొట్టె
అరవై ఆరు బర్లను గట్టె
అల్లుడస్తడని మంచమేసి
ఆసంట జరిగింది. (తేనెటీగ)

కందిరీగ అటువంటిది కాగా తేనెటీగ స్వభావం దానికి వ్యతిరేకం అది పరోపకారార్థ మిదం శరీరమ్మనే సూక్తిని అక్షరాల అమలు జరుపుతోంది. అలాంటి భావనే పై పొడుపు కథలో పరమాద్భుతంగా చెప్పడం జరిగింది. తేనెటీగ తేనెపట్టు పెట్టేచోట ఆవగింజంత తొలిగొట్టి పట్టు చిక్కించుకొంటుంది. ఆ ఆధారంతో ఎన్నో గదుల్ని నిర్మిస్తుంది. అరవై ఆరు బజ్జల్ని కట్టడం అంటె ఎన్నో తేనెటీగలుండడం అని అర్థం. అల్లుడు వస్తాడని మంచంవేసి అక్కణ్నుండి జరిగించె అనడం మరో మంచం వేయడానికే అని అర్థం. తేనెలు తెరువరులకనేది సత్యం అల్లుడంటే ఇక్కడ తెరవరే. అతని చేయి తేనెతెట్టెపై పడితేచాలు తమ సమస్తాన్ని అతని కప్పగించి తేనెటీగలు వెళ్లి పోతాయి. అంతటి మహోదాత్త చిత్త వృత్తి కలిగిన తేనేటీగల్ని జానపదుడు గుర్తించి ప్రహేళికతో సంభావించాడు.

* నాకుకాళ్లు లేవు-చేతుల్లేవు
ఎముకల్లేవు-మెడలేదు
చెవుల్లేవు-ముక్కులేదు
కళ్లు లేవు గాని పొనమున్నది (జలగ)

ఇది నీటిలోనూ బురదలోనూ ఉంటుంది. పైన చెప్పిన వేవీ దానికిలేవు, ఇదినీటిలో ఎక్కడ ఉంటుందో కనిపించదు. దాని ప్రాణ శక్తి నీటిలోకి దిగిన వారిని పసివట్టుతుంది. అది వచ్చి, దిగిన వారిని పట్టుకుంటుంది. రక్తాన్ని పీల్చి పీల్చి కడుపు నింపుకున్నంతవరకెవరికీ నొప్పికలుగదు నొప్పికలుగకుండా రక్తాన్ని పీల్చేనైపుణ్యం దీని కెట్లబ్బిందో పరిశోధకులు వివరించారు. దాని దేహం అనే గొట్టం రక్తంతో నిండిన పిదపనే ఇది పట్టుకొన్న ప్రాణినుండి వేరవుతుంది. అప్పుడుకూడా ప్రాణికి ఏకొద్ది నొప్పికలుగదు. అటువంటి జలగకు ఏదలేకుంటే నేం ప్రాణమొక్కటుంటే చాలు నొప్పికలుగకుండా రక్తాన్ని దీసి ప్రాణాలు తీయడానికి. ఇది ఒక పర్యాయం కడుపునిండా రక్తం పీల్చుకున్నపిదప సంవత్సరం దాటేంతవరకు ఆహారం లేకున్నా జీవిస్తుందంటారు.

* ఆరుకాళ్ల మృగము
కాళ్లు చాపుకొని నీళ్లు తాగుతది
ఇప్పి చెప్పిన వారికి ఆలునిత్తు, డాలునిత్తు

హనుమకొండ జాగీరునిత్తు
మానుకోట మాన్యమిత్తు (ఈగ)

ఎక్కడ అపరిశుభ్రమెక్కువగా ఉంటుందో అక్కడ ఈగలెక్కువగా ఉంటాయి. ఈగకు ఆరు కాళ్లుంటాయి. మృగమన్న వెంటనే ఇది ఈగ కావచ్చని ఎవరూ అనుకోరు. కాళ్లు నీటికి తగలకుండా ఇది నీటిపై నిలుస్తుంది. నీరు త్రాగుతుందో లేదో సూక్ష్మపరిశీలనద్వారగాని తెలియదు. చిన్న విషయమైనా చెప్పిన వారికి ఆటనిస్తానని, డాలునిస్తానని, జాగీరునిస్తానని, మాన్యమిస్తానని అనడం ప్రజ్ఞలు-ప్రగల్భాలు పలకడంగా అనిపించినా జానపదునికి పొడుపు కథలు వేయడంలో విప్పడంలో ఉన్న కుతూహలం-ఔదార్యం ప్రకటితమవుతోంది.

* నాల్గుకాళ్ల నటంగి
తోకలేని తొటంగి
గంతేసి
దొంతు మీదకూసొనె (కప్ప)

నటంగి అంటే నాట్యం చేసేది, తొటంగి అంటే పడడంలోని ధ్వని. కప్పకు నాల్గు కాళ్లుంటాయి-తోకఉండదు. అది సాధారణంగా గంతులు వేస్తూనే పోతుంటుంది; గంతులు వేసె దొంతిమీద కూచొంటుంది. వరుసగా పేర్చిన కుండల్ని దొంతులంటారు. ఇక్కడ ఆశ్చర్యాన్ని కలిగించే విషయమేమంటే దొంతిమీద ఎగిరి కూర్చొన్నా దొంతులకేమీ కాదు. కప్ప స్వభావాన్ని ఈపొడుపు కథ స్పష్టంగా వ్యక్తీకరిస్తోంది.

* మాడ్గుల గాడ్దులు పోయి
నల్ల జెర్వుకాడ
సేను విడ్సి-కంచెమేసె (చెదలు)

జీవమున్న వస్తువుకు చెదపురుగులు పట్టవు. జీవం లేని భద్రంలేని వాటికే చెదపురుగులు పడతాయి. చేను భద్రతకు కంచె వేస్తారు. రక్షించే దాన్నే భక్షించే చెదలు శక్తి నేమనాలి! చెదలు పట్టిన చోట సర్వనాశనం తప్ప మరేమీ మిగలదు.

దాని శక్తి అటువంటిది. పాలమూరు జిల్లాలో మాడ్గుల అనేదొక గ్రామం. దానికి సమీపంలో నల్లజెర్వనే ఒక గ్రామం ఉంది. కోపం వచ్చిన నల్లజెర్వువాడెవ్వడో ఈ పొడుపుకథ పొడిచి ఉంటాడనిపిస్తుంది. కాని చెదలుకు ఇది మాడ్గుల, ఇది నల్లజెర్వు అనే భేదభావం లేదు. సమస్త పదార్థాల విషయంలో వాటిది సమాన దృష్టే. ఈ విడుపును గ్రహించే దృష్టి జానపదుని కొక్కనికే ఉంది. ఇటువంటివే మరికొన్ని గమనార్హాలు.

* సంట్లులేని ఆడదాన్ని
కాళ్లులేని మగోడేసుక పోతుంటే
తలకాయలేనోడు కావలిగాసె (కప్ప, పాము, ఎండ్రకాయ)

* సూస్తే సిన్నగ
సురుక్కు దెబ్బ
రాజగాని పేరు భోజగాడు (తేలు)

* భూమిలో పుట్టింది
భూమిలో పెరిగింది
భూమిలో ఈనింది (ఎలుక)

* సన్నపు సుండల సున్నపు రౌతు
సూస్తే జల్లుమంటుంది (తేలు)

* జిల్కరంత జీవం
ఏనుగంత గొద్దె (చెదలు, పుట్ట)

* చెరువెండుక పాయె
జింక దెంక పాయె (చేప)

జానపదుల హృదయాల్లో జంతువులకు చెందినవి, పక్షిసమూహాలకు సంబంధించినవి, క్రిమికీటకాదుల్ని తెలిపేవి అయిన తిర్యక్ సంబంధి ప్రహేళికలు కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. పాశ్చాత్యులిట్టి వాటినే వర్ణనాత్మకాలైన ప్రహేళిక లన్నారు. **(Descriptive Riddles)** "ఒక జంతువును గాని, ఒక మొక్కను

గాని, ఒక వస్తువును గాని లేదా దేనినో ఒక దానిని గాని వర్ణించడం జరుగుతుంది. ఈ వర్ణన ఆశించిన సమాధానం నుండి పెడత్రోవ పట్టించేట్టుగా ఉంటుంది.[1]" పొడుపు కథల లక్షణాల్ని వివరించేప్పుడు వీటిని చర్చించడం జరిగింది.

క్రిమికీటకాదుల్ని వేరుచేయక తిర్యక్ సంబంధి ప్రహేళికలనడమే ఒప్పుగా ఉంటుంది. ఈ పొడుపుకథల్లో గృహజీవన గ్రామిక జన ప్రహేళికల్లాగా సుదీర్ఘాలైనవి కనిపించవు. చెప్పిన అల్పాక్షరాల్లోనే అనల్పార్థాన్ని ఇమిడించడం వీటికున్న గుణమనాలి. క్షణ క్షణం మారుతోన్న జీవ ప్రకృతిని మనో మందిరంలో ప్రతిష్ఠాపనంజేసి చమత్కార రామణీయకతను రంగరించి తిర్యక్ సంబంధి ప్రహేళికల్ని జానపదుడందించాడు. ఘూ గృహంలోని మూషికం, జలపంకాల్లోని జెంగ, కళ్లముందు కదలాడే మిణుగురు పురుగు, పలికిన పలికే రామచిలుక, కపటానికి క్రౌర్యానికి ప్రతీక అయిన తోడేలు మొదలైన తిర్యక్కులెన్నో జానపదుని గూఢార్థ భావసంపదచేత పుష్టినీ తుష్టినీ పొందాయి. జానపదుడు ఇటువంటి సరస సౌందర్య హృదయం గలవాడనీ దానికి తెలుసో తెలువదోగాని విశ్వానికి తెలుసు; విజ్ఞతకు తెలుసు.

## 2-5-5 : క్రీడావినోద ప్రహేళికలు

మానవుడెంతగా నిత్య నైమిత్తిక కార్యక్రమాల్లో నిమగ్నుడై ఉన్నా క్రీడా వినోద గోష్ఠుల్లో పాల్గొనాలని అభిలషిస్తుంటాడు. ఆర్జనమే పరమార్థంగా భావించే వాడైనా కొద్ది సమయాన్నయినా మానసికోల్లాసానికి సుఖ సంతోషాలకు కేటాయిస్తాడు. ఏకాకినని అప్పుడప్పుడనుకొన్నా సామూహిక క్రీడల్లో వినోదాల్లో పాల్గోవాలనుకుంటాడు. తాను పాల్గోకపోయినా పాల్గొన్న వారిని చూసి ఆనందిస్తాడు. ఆటలాడేవారి పాటలుపాడేవారి ఆనందోత్సాహోద్రేకాల్ని సామాజికునిగా తాననుభవిస్తూ వారిలో ఒకడవుతాడు.

కడుపునిండ తిని, కంటినిండ నిద్రపోక ఎందుకు ఈ బాదరబంది అనే ప్రశ్న పుడుతుంది. కడుపునిండ తిండి ఉన్నంత మాత్రాన కంటినిండ నిదుర రాదు. మనస్సనేది ఒకటుంటుంది. అది ఆ నిద్రకు సంసిద్ధం కావాలి.

1. Encyclopaedia Britannica-5-19. P. No : 321

దేహం అలిసినా మనస్సు నిద్రకు సమాయత్తం గానప్పుడు నిద్రరాదు. దానికి వినోదం కావాలి; ఉల్లాసం కావాలి. కావాలి అంటే క్రీడా వినోద విషయాల్లో పాల్గొనాలి; దర్శించాలి. దర్శనంలో అనుభవముంది;అనుభవంలో తృప్తి ఉంది; తృప్తి మానవుణ్ని సమున్నతుణ్ని చేస్తుంది. ఉన్నతపథాలవైపు పదాల్ని వేయిస్తుంది.

అనుశాసన జీవనానికీ, సామాజిక సుస్థిరతకూ, వ్యక్తి పటిష్ఠతకూ క్రీడల్ని వికసింపజేశారు. క్రీడల ద్వారా విద్యా విజ్ఞానాల ప్రచారం గూడా ఆశించారు. కౌటుంబిక జీవన ప్రాధాన్యం నొక్కి చెప్పారు. అంతర్జాతీయ భ్రాతృత్వ సద్భావనా సమైక్యాల్ని ఆపేక్షించారు. సాంస్కృతికాదాన ప్రదానాలు ఉద్దేశించారు. ఏ క్రీడ అయినా ఏ వినోదమయినా వ్యక్తిని కేంద్రంగా స్వీకరించి సామాజిక వలయాన్ని స్పృశించి రాష్ట్రౌన్నత్యాన్ని ఆశించి విశ్వశ్రేయస్సనే సమున్నతాదర్శాన్ని స్థాపించాలని అభిలషించారు.

జానపదుని ఆలోచనలు ఈవిధంగా బహిర్గతంగాకున్నా అందులోని అంతరికమైన భావన ఇదే. ఆ భావనా భావితులైన జానపదులు వ్యక్తితుష్టికి, సామాజిక పుష్టికిక్రీడా వినోదాలు ప్రేరకాలుగానే భావించారు. అందువల్లమాత్సర్యంలేని క్రీడా వినోద గోష్ఠులకు అలవాటుపడ్డారు.

జానపద క్రీడా వినోదాల్లో చెడుగుడు, చిట్టిగెన (చిట్టిగొనె), దాగుడుమూతలు, గోటి(ళ)లు, కోతికొమ్మచ్చి, బొంగరాలు, కోడిపందాలు, కోలాటాలు, బండ్లపందాలు, పడవపందాలు, అచ్చనగుండ్లు, గ(క)చ్చగాయలు, వామన గుంటలు, బారకట్ట, కుంటపీసు, తుడుంగు, కాళ్లగజ్జి, ముక్కుపుల్లి, పచ్చీసు, ఉప్పుగెజ్జ, కట్టెకడంగు, బుర్రకథలు, జంగంకథలు, వీరముష్టి కథలు, మాలదాసరుల కథలు, యక్షగానాలు, బై (బొ-బహు-బవు) రూపులు ఇలా ఆట పాటలెన్నో పరిశోధకులు తమతమ గ్రంథాలనే గంపలకెత్తి తూర్పారబట్టారు.

## 2-5-5-1 : ప్రహేళికే క్రీడ

ఇటువంటి క్రీడల్లో ప్రహేళికకూడా ఒకటి. సాధారణంగా క్రీడల్లో శరీరానికి అలసట కలుగుతుంది; కాని పొడుపుకథల ఆటవల్ల మనస్సు వినోదిస్తుంది. మెదడుకు మేత పెట్టేది ప్రహేళిక క్రీడ. ఈ క్రీడ మనస్సును చిక్కుల్లో ముంచు

తుంది. అర్థ ప్రకటనానంతరం చిక్కుల నుండి తేలుస్తుంది. హోమర్ కవి తానొక చిక్కుముడి విప్పలేకపోయానన్న మానసిక వ్యథతో మరణించాడని ప్లుటార్క్ పేర్కొన్నాడు [1] అంటే పొడుపు కథకు విడుపు చెప్పలేనంత మాత్రంలో క్రుంగి కృశించి పోతారని నిరూపించలేం. మానసిక క్లేశాన్ని కలిగించే పొడుపు సంతోషదాయకం ఎట్లవుతుందని సందేహం పుడుతుంది. విప్పలేక పోయాననే క్లేశం విప్పబడేంత వరకే అన్న విషయం ఇక్కడ గ్రహించాలి. పొడుపుకు విడుపు పెక్కు పర్యాయాలు పొడిచినవారే చెప్పడం సంభవిస్తుంది పొడిచిన వారికి సాధారణంగా విడుపు తెలిసి ఉంటుంది.

లోకంలో శారీరక శ్రమ కలిగించే పెద్ద పెద్ద ఆటలున్నాయి. ఆ యాటలాడించే వారుంటారు. ఆడించేవారు అంతకు పూర్వం ఆటగాండ్రయి ఉండాలి. ఆట పద్ధతిని తెలిసి ఉండాలి. నియమ నిబంధనలన్నీ ఒకరికి చెప్పగలిగే స్థితి ఉండాలి. లేకుంటే ఆడించే నైపుణ్యముండదు. అట్లే ప్రహేళికా క్రీడలోనూ ఎవరు పొడిస్తే వారికి విడుపు తెలిసి ఉండడం ధర్మం.

జానపదుల ఆటలకు, నాగరికుల క్రీడలకు కొన్ని కొన్ని సమయాలనేవి ఉంటాయి. ఆ నిర్ణీత సమయాలకు కొద్ది ఆటునిటుగా అవి ప్రారంభింపబడుతాయి. ఎక్కువగా ఉదయ సాయంకాలాల్లోనే ఈ ఆటలాడుతుంటారు. స్త్రీ బాల వృద్ధులు మధ్యాహ్న సమయాల్లోనూ ఆడుతుంటారు. పశుపాలకులకు చేనులో పశువు పడని సమయమే క్రీడానుకూలం వ్యవసాయ శ్రామికులకు పని మొక్కుబడిగా లేనప్పుడే సరియైన సమయం. వృత్తి కళాకారులు ఎప్పుడైనా క్రీడానుకూలురే.

భిన్న భిన్న వృత్తి కళా కార్యక్రమాల్లో పాల్గొనే వారి ఆటలు కూడా భిన్న భిన్న సమయాలకు చెందినవిగా కనిపిస్తాయి. కాని క్రీడల్లో క్రీడగా భావింపబడే ప్రహేళికలకు నిర్దిష్టమైన సమయ నిర్ణయమనేది లేదు. ప్రహేళికాసక్తులైన నలుగురొకదగ్గర చేరితే చాలు, ప్రహేళికా క్రీడ ప్రాదుర్భవిస్తుంది. ఒకే విధమైన పనిచేసే వాళ్లు ఒకే దగ్గర కలిసే అవకాశముంది. అట్లే ఏ పనిలేనివారు కూడా ఒక ప్రదేశంలోనే కలుస్తారు. అప్పుడు ప్రశ్నలు ప్రవేశిస్తాయి. చిక్కుముడులు దూసుకువస్తాయి; పరిష్కారాలు లభిస్తాయి.

---

1. ఆంధ్రజ్యోతి-దినపత్రిక-17-4-1978.

"క్రీడా ప్రాయాలైన వినోద గోష్ఠులలో సమాజమునందు గుప్తముగా సంభాషించుటలో తెల్పదగిన వ్యక్తికి తప్ప, మిగత వ్యక్తులకు బోధపడునట్లు మాటలాడుటలో వీనియుపయోగనుండునని దండి యుట్టంకించుట వలన ప్రహేళికా స్వరూప స్వభావోద్దేశ్యములు ఎట్టివో మనకు వ్యక్తమగును."[1] అనే అభిప్రాయం వల్ల ప్రహేళిక అనేది ఒక క్రీడ అని తెలుస్తుంది. "నలుగురూ చేరినచోట తమ పరిజ్ఞానాన్ని ప్రదర్శించి ఇతరుల్ని ముగ్ధుల్ని చేయడానికి ఉపకరిస్తాయి ప్రహేళికలు"[2] అనడం వల్ల నలుగురు కలిసినచోట వినోద విజ్ఞాన దాయిని అయిన ప్రహేళికా క్రీడ ప్రారంభమవుతుందని తెలుస్తోంది. మొత్తం మీద శారీరక శ్రమ కలిగించే క్రీడలకు భిన్నమయింది ఈ ప్రహేళిక క్రీడ అనవచ్చు.

గుణస్వభావాల్ని బట్టి గృహజీవనానికి సంబంధించినవిగా, శ్రామిక జనతా కార్యాలను సంబంధించినవిగా, ప్రకృతి సంబంధులుగా, తిర్యక్ సంబంధులుగా విభజించిన పిదప క్రీడావినోదాలంటే అంతర్భవిస్తాయనీ, వాటికొరకు ప్రత్యేకశీర్షిక ఎందుకని సందేహం కలుగుతుంది. అవును నిజమే! కాని కేవలమటువంటివేగాక ప్రహేళికా క్రీడార్థమే ప్రహేళిక అని భావించడానికి అవకాశమున్నవెన్నో కనిపిస్తున్నాయి. అందువల్లనే ఈ శీర్షిక ఆవశ్యకంగా స్వీకరించడం జరిగింది. ఈ క్రీడా వినోద ప్రహేళికల్లో స్థూలంగా సంవాదాత్మకాలని, సంఖ్యాత్మకాలని, వస్తుగుణాత్మకాలని అన్యాలు అని విభజించడానికి వీలుంది.

## 2-5-5-2 : సంవాదాత్మకాలు

విభిన్నాంగా లేవిధంగా రూపుదిద్దుకొని ఒక్కటై సమగ్ర మానవ రూప సాక్షాత్కారం జరిగిందో అది ఊహకందని విషయం. సంపూర్ణత్వం మూర్తీభవించిన ఒక స్వరూపం సౌందర్యాత్మకమై కనిపిస్తున్నా అంతరంగం మాత్రం క్షణక్షణం సంఘర్షిస్తూనే ఉంటుంది. మనిషిలోని మనిషి పొందే సంఘర్షణం వల్ల సందేహ భావావిష్కరణం జరుగుతుంది. అవి గేయ పద్యవచన రూపాలుగా లభిస్తాయి.

---

1. ప్రహేళికలు-ప్రథమ భాగము-అనుసంహిత- పు : 8.
2. ఆంధ్రప్రభ-దినపత్రిక 20-9-1978.

**సిద్ధయ్య** వీరబ్రహ్మాల ఏలపాటగా బహుళ ప్రచారాన్ని పొంది, జనబాహుళ్యం మన్ననల్ని అంది, అనేకానేక గ్రంథాల్లో కనిపిస్తున్న ఇది సంవాదాత్మక క్రీడా ప్రహేళికం కోవలోకే వస్తుంది. దీనిని జానపదులు కోలాటాలు వేసే సందర్భాల్లో పొడుస్తుంటారు.

* సి ; బోడివాడెవడయ్యా? బొచ్చువాడెవడయ్యా!
మొలచుట్టూ కత్తులున్న! వానిపేరెవరయ్యా!
పోతులోరో! శివపోతులోరో!

వీ ; బోడివాడు వెలక్కాయ! బొచ్చువాడు కొబ్బరికాయ!
మొల చుట్టూ కత్తులున్న వానిపేరు వంకాయ!
సిద్ధయ్యగారూ! జ్ఞాన సిద్ధయ్యగారూ!

సి : ఊరకున్నదేదయా! ఊగులాడేదేదయా!
కాళ్ల సందుదేదయా! కమ్మకొచ్చేదేదయా
పోతులోరో! శివపోతులోరో;

వీ : ఊరకున్నదావయా! ఊగులాడేది దూడయా!
కాళ్ల సందుది ముంతయా! కమ్మకొచ్చేవి పాలయా!
సిద్ధయ్య గారూ! జ్ఞాన సిద్ధయ్యగారూ![1]

ఈ పైఏలపాటకు అనుకరణమా అన్నట్లున్న ఈ క్రింది గీతం జానపదుల చిరుతల రామాయణాల్లోనూ, చిరుతల భారతాల్లోనూ ఆటల మధ్య మధ్యన పొడుస్తుంటారు. హరికథల్లో చెప్పే పిట్టకథలాగా సుదీర్ఘాలైన ఆటపాటల్లో జానపదుల కిటువంటి గీతాలు మహానందాన్ని కలిగిస్తుంటాయి.

* బోడోడు ఎవడురా
బొచ్చోడు ఎవడురా
సుట్టుముట్టు కత్తులుండు
వాని పేరు ఏమిరా!

---

1. జానపదగేయవాఙ్మయ వ్యాసావళి-పు : 50

బోడోడు కోడిగుడ్డు
బొచ్చోడు టెంకాయ
సుట్టు ముట్టు కత్తులుండు
వాని పేరు వంకాయ!

ఊరకున్న దేందిరా
ఊగులాడేదేందిరా
కాళ్లసందుదేందిరా
కమ్మ కొచ్చేదేందిరా!

ఊరకున్న దావురా
ఊగులాడేది దూడరా
రాళ్లసందుది సెంబురా
కమ్మ కొచ్చేవి పాలురా!

ఆధునిక కాలంలో సుదీర్ఘ నాటక ప్రదర్శనాల సందర్భంలో అంకాంకం మధ్యన పన్నీటి జల్లుల్ని చల్లే ఇటువంటి సంవాదాలనో, హాస్య ప్రసంగాలనో ప్రవేశపెట్టడం జానపదాను కరణమే అనాలి. ప్రత్యేకంగా కోలాటాలాడేప్పుడు పాడే ఈ క్రింది క్రీడా వినోదాత్మక ప్రహేళికకూడా బహుళ ప్రచారాన్ని పొందినట్టిదే.

* పల్లవి : తాన తందాని తాన। తక్కితై తానతందానితాన
నల్ల నల్లని పక్షియొకటి। నడినెత్తిని రెక్కలు వచ్చె
చేతులారా గోళ్లు వచ్చె। చెవుల సందున కొమ్ములొచ్చె
తాన తందాని తాన ॥త॥

దాని పచ్చరత్నములు। కత్తిన కత్తిన కోసి
బ్రాహ్మలనక బంటులనక—బంతిని భోంచేసిరంట
తాన తందానితాన ॥త॥

ఎంత చెప్పిన వేదశాస్త్రం। తెలియదాయె దానిభావం
దానిభావం బట్ట బయలు। దానిపేరె అరటిచెట్టు ॥తా॥

సందకాడలగ్గమాయే। సాని పొత్తున గర్భిణాయె
తెల్లవారిన పిల్ల తల్లి। పొద్దు పొడువ పేరుకొచ్చె
తాన తందాని తాన ॥త॥

ఎంతచెప్పిన వేద శాస్త్రం । తెలియదాయె దాని భావం
దాని భావం బట్టబయలు । దాని పేరె చల్లకుండ
తానతందాని తాన ॥త॥

ఇంటివెనక కుప్పవేసి। కుప్పకు నిప్పును బెట్టి
కుప్పకాలిపోతేను। అప్పులెల్ల తీరిపోయె
తానతందాని తాన ॥త॥

ఎంత చెప్పిన వేదశాస్త్రం॥ తెలియదాయె దాని భావం
దాని భావం బట్టబయలు। దాని పేరే కుమ్మరావం
తానతందాని తాన ॥త॥[1]

ఈ కోలాటం పాటలో అరటిచెట్టు, చల్లకుండ, కుమ్మరావంఅనేవి విడుపులు. ఈ పాటను ఒకరు చెప్పడం అందరు కోలలు వేస్తూ పాడడం కూడా ఉంది. విడుపు చెప్పే భాగంపై ఊనిక ఎక్కువగా ఉంటుంది. ఒక్కొక సమయంలో ప్రశ్నాభాగాన్ని ఒకరు, ఉత్తర భాగాన్ని ఇంకొకరు చెప్పడం కనిపిస్తుంది. ఈ క్రింది గూఢార్థ చమత్కార సంభాషణ సంవాదం క్రీడాత్మకంగాకున్నా పరితలకు శ్రోతలకు వినోదాత్మకమనే అనాలి.

* భార్య : ఒగన్ని మూసిపెట్టి ఒగన్ని గప్పిపెట్టి
ఒగన్ని కొంగుతో ఇసిడుంచరో - నేను
ఒగన్ని కొంగుతో ఇసిదుంటరో

భర్త : ఎవన్ని మూసి పెట్టి ఎవ్వన్ని కప్పి పెట్టి
ఎవన్ని కొంగుతో ఇసిరుంటివే-భామ
ఎవ్వన్ని కొంగుతో ఇసిరుంటివే

1. జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి—పు : 151.

భార్య : కుండాను మూసి పెట్టి కుంపాటి గప్పిపెట్టి
దీపాన్ని కొంగుతో [illegible]-నేను
దీపాన్ని కొంగుతో ఇసిరుంటరో!

కొన్ని వినోదాత్మక సంవాదాల్లో ప్రహేళికాభాసం కనిపిస్తుంది. అర్థార్థం ప్రయోగంగాక పరిహాసార్థమే ప్రయోగం అని భావించినప్పుడు ఇలా జరగడానికి అవకాశముంది.

* పిల్లవాడు ; గవ్వన్నరగడ్డము
ఎంటికన్నరకెంత?

తాత : పదహారు పండ్ల మీద
పాపోసుతోటి గొడితే
పల్లున్నర కెంత తగుల్తదె?

ఇందులో చమత్కారార్థం భాసింపకున్నా వ్యంగ్యాత్మకమైన దెబ్బకు దెబ్బతీసే పద్ధతి ఉంది. "గవ్వన్నర విలువ చేయలేని గడ్డం కలిగిన తాతగారూ! అందులోని వెంట్రుకన్నరకున్న విలువెంత!" అని బాలుడు ప్రశ్నించాడు. ఇక్కడ గడ్డం విషయం కంటే నీవు గవ్వన్నర విలువ చేయ లేవనే వ్యంగ్యాన్ని తాతగుర్తించాడు. అందుకే నీ పండ్లూడ గొడతా అని ధ్వనించేట్టుగా తాతగారు చమత్కరించారు. ఎక్కడైనా ఎప్పుడైనా అమ్మలక్కలు కలిసినప్పుడు ఈ క్రింది సంవాదం పొడుపు కథ పొడుచుకుంటారు.

* తండ్రికూతురింటికి వచ్చి తిరిగి వెళ్లేప్పుడు
కూతురు తండ్రితో
మళ్లీ ఎప్పుడు వస్తావని ప్రశ్నించగా అతడు

"పుస్తెలు తెంపినపుడు
నీ బొట్టు చెరిపినపుడు
కడపల మీది ముగ్గు మలిపినపుడు
అప్పటికి రాగలను" అంటాడు
మరి దాని అర్థమేంటి!
(తన కూతురుకు సంతానం కలిగినప్పుడు)

ఈ సంవాద వినోద ప్రహేళికల్ని తల్లులు, కన్యలు, పిల్లలు అందరు పొడుచుకుంటారు. సంతానాపేక్ష అనేది ఎంత ప్రగాఢ వాంఛో ఇందులో సువ్యక్త మవుతుంది. తండ్రి కూతురింటికి వచ్చాడు. కూతురుకు అంతవరకు సంతానం కాలేదు అందువల్ల అతడు మర్మంగా మాటాడాడు శిశువు తల్లిపాలు తాగుతూ అప్పుడప్పుడు గట్టిగా మంగళ సూత్రాన్ని పట్టుకుంటుంది; బొట్టు చెరుపుతుంది; కడపలపై వేసిన ముగ్గును మలపుతుంది. ఆ తండ్రి వేదన ఆ కూతురికి అర్థమవుతుంది. ఆ వేదన తీర్చడానికే ఆమెపూనుకొంటుంది.

క్రీడా వినోద ప్రహేళికలెన్నో సంవాదాత్మకాలుగా అవతరించి సరసుల శిరఃకంపనం గావిస్తున్నాయి. సహృదయ హృదయాహ్లాదకాలై అంతటా పరిభ్ర మిస్తున్నాయి.

## 2-5-5-3 : సంఖ్యాత్మకాలు

మనిషి జీవనంలో సంఖ్యకెంతో ప్రాముఖ్యముంది. సంఖ్యవల్ల ప్రగతి గుణింపబడుతుంది; ఉత్పత్తి గణింపబడుతుంది స్థితికి గతికి మధ్యగల దూరం సమ్మానింపబడుతుంది. బహుళ ప్రయోజనాన్ని ఆశించి శాస్త్రీయ దృక్పథంతో సంఖ్యా శాస్త్రమే ఆవిర్భవించింది. జీవునికి దేవునికి ప్రకృతికిగల సంబంధ బాంధవ్యాల్ని తాత్త్వికి దృక్పథంతో వివేచన చేయడానికి సాంఖ్య యోగమే ప్రాదుర్భవించింది. భారతీయ సాంఖ్యయోగ సిద్ధాంతం ప్రపంచంలో 'నభూతోన భవిష్యతి' అన్న కీర్తిని ఆర్జించింది. తాత్త్వికి సంబంధి సాంఖ్యయోగ విషయాలూ వేదాంత భావాలూ ఉన్న పొడుపుకథలు మరో ప్రకరణంలో వివరిస్తాను. క్రీడా వినోదార్థం సంఖ్యను సమాదరించిన కొన్ని ప్రహేళికలు మాత్రం ఇక్కడ పరా మర్శిస్తాను.

* మూలకు ముత్తుం జొన్నలు
లెక్కపెట్టరా కుక్కల కొడక! (చుక్కలు)

ఆకాశాన్ని ఓ మూలగా భావించి, జొన్నలను చుక్కలుగా తలంచి ఆగ్ర హంతో, లెక్కపెట్టుమన్నాడు. మూలకున్న ముత్తుం జొన్నలు లెక్కపెట్టడం పని లేని మంగలి పిల్లితల కొరగడమే. ముత్తుమంటే మూడు తూములు. తూముకు

రెండు కుండలు. మొత్తం ఆరుకుండలు, కుండకు ఇరవయినాల్గు సేర్లు. జానపదుడు ధాన్యంతో చుక్కల్ని పోల్చడం అతి సహజ విషయం. ఇందులో మూల కున్న అనే పద ప్రయోగం చేసినందువల్ల ఆకాశంలోని ఒకానొక మూలభాగం అనే అర్థం కూడా ధ్వనిస్తోంది.

* అయిదు రూపాయల గుడ్డ
నూరు రూపాయల కుట్టుకూలి
ఎన్నుకందుతదిగాని
సన్నుకందదు! ఏంది? (గుజ్జం జీను)

ధరలు ఆకాశాన్ని అంటిన ఇప్పటిమాట కాదిది. బట్ట అయిదు రూపాయలు కుట్టుగూలి నూరు రూపాయలు. ఎన్ను సన్ను (వెన్ను చన్ను) పదప్రయోగాల వల్ల అది రవికె అనాలి. వెన్నుకందడం చన్నుకందకపోవడం విచిత్రమే. గుజ్జం జీను అలాగే ఉంటుంది. గుజ్జానికి చన్నులు వెనుక కాళ్ల సందున క్రింది భాగాన ఉంటాయి. జీను వెన్నును మాత్రమే ఆక్రమించి ఉండేట్లు కుడతారు. అటువంటిది అన్యార్థద్యోతకమయ్యేట్లు సంఖ్యల్ని సమకూర్చి పొడుపుకథగా సంభావించడం జరిగింది.

* సెగ్గ అయిదు గుంజలు
ఊపితే ఊగుతయి
పీకితే రావు (చేతి వ్రేళ్లు)

ఈ పొడుపు కథలో జానపదుడు చేతిని తటాకంగా భావించి వ్రేళ్లను గుంజలుగా తలంచాడు. గేదెల్ని-పశువుల్ని కట్టివేయడానికి సర్వసాధారణంగా గుంజల్ని పాతుతారు. అవి ఊపితే ఊగుతాయి; పీకితే వస్తాయి. చెరువులో గుంజలు పాతడమే విచిత్రం. ఎందుకంటే నీళ్లున్న చెరువులో పశువును కట్టివేయడం సంభవించదు. అదీగాక అవి ఊపితే ఊగుతాయట, పీకితే రానే రావట; వాటిని చేతి వ్రేళ్లుగా భావించిన జానపదుని కల్పనకు జోహారు చేయవచ్చు.

* నూర్గు రన్నదమ్ములకొక చే మొలత్రాడు (చీపురుత్రాడు)

ఇక్కడ సూర్ధరంటే సరిగా సూర్యరనికాదు-దాదాపుగ అని అర్థం. కట్ట కట్టగా ఉన్న చీపురు పుల్లలు చెదరక ఉండాలంటే దానిచుట్టు ఒక దారంగాని త్రాడుగాని కట్టాలి. హిందువుల్లో చాలామంది మొలకుతాడు ధరిస్తారు. జానపదులు మొల్తాడని అంటారు.

* రెండు కాళ్ల పిట్ట
ముండ్లనేరుక బుక్కుతది (రాగోల)

వ్యవసాయదారుడు బీడు, చేను, చెలక, పొలాల్లోని ముండ్ల కంపను తీసి వేయడానికుపయోగించే ఒక పరికరం రాగోల. ఇది పంగల గుంజవలె ఉంటుంది. దీనితో కంపను తీసి ఎత్తిపట్టుకొని వెళ్లి పొలానికి కంచెగా వేయడమో లేదా కాల్చి వేయడమో చేస్తారు. కొందరీ కంపను వంటచెరుకుగా కూడ ఉపయోగిస్తారు. బుక్కుట అంటే తినడమని అర్థం ప్రాణమున్నదే ఏమైన ఇంత తింటుంది గాని ప్రాణంలేని పదార్థమేమితింటుంది! తిన్నప్పుడు ముండ్లు కనిపించకుండా పోతాయి. ఆసామ్యంతో జానపదుడు "బుక్కుతది" అనే పదప్రయోగం చేశాడు. ఈ క్రిందివి కూడా ఇలాంటివే.

* పదిరూపాయలు పారేసి
దాన్ని పట్టుకొని నాక (పళ్లెం)

* అయిదుగురు భర్తలుందురుగాని ద్రౌపదిగాదు (చేయి)

* ము(మూ)డాకుల రైకమీద
ముత్తుంపోత. (తెల్లకాగితంపై వ్రాత)

జానపదులు తమకు పరిచితాలైన అనేక విషయాలకు ఈవిధంగా సంఖ్యల్ని జతచేసి క్రీడా వినోదాత్మకాలైన పొడుపు కథలనెన్నిటినో కల్పించడం జరిగింది. ఇక వస్తు గుణాత్మకాలైన క్రీడా వినోద ప్రహేళికల్ని పరిశీలిద్దాం

## 2-5-5-4 : వస్తుగుణాత్మకాలు

మనిషి జీవితం మీద పరిసరాల ప్రభావముంటుంది. తానెలాంటి వాతావరణంలో పరిభ్రమిస్తాడో అలాంటి వాతావరణానికి సంబంధించిన బాహ్య ప్రకృతి

నిరంతరం పరివేష్టించి ఉంటుంది. అట్లే వస్తువులూ, వస్తుగుణాలూ అతని జీవితంతో పెనవేసుకొని పోతాయి. అప్పుడతని ప్రసంగాల్లో రచనల్లో ఆ వాతావరణమే కొద్ది రంగు పులుముకొని సమాజంలో ప్రవేశిస్తుంది. క్రీడా వినోదాత్మకాలైన అటువంటి పొడుపు కథల్ని పరిశీలిద్దాం.

* పొద్దున్నె లేస్తది
ఎండపూట వొాయి మూలకడ్తది
సాయంత్రం లేస్తది
పొద్దు గింతల మూలకడ్తది. (ముల్లుకట్టె)

ముల్లుగట్టెతో బాటు వ్యవసాయ దారుని నిత్య జీవితం ఈ ప్రహేళికలో పొదగట్టింది. వ్యవసాయదారునితో బాటు ఉదయమే ముల్లుగట్టె పనికి బయలుదేరుతుంది. ఉదయాన్నే లేస్తుందనే అర్థం అది. మధ్యాహ్న సందర్భంలో అలసిపోయిన రైతన్న విశ్రాంతి తీసుకుంటాడు. అప్పుడు ముల్లుగట్టె మూలకుంటుంది. మళ్లీ సాయంత్రం లేస్తుంది. సంధ్యాసమయంలో మూలకుంటుంది. ముల్లుగట్టె భారతీయకర్షకుడు కృషిచేసే సందర్భంలో అత్యావశ్యకంగా ధరించే దండం. రాజులు ధర్మదండాలు ధరించారు. కర్షకులు భారతాభ్యుదయానికి కర్మదండాలు ధరించారు. దాని నిత్య నైమిత్తిక కార్యాల్ని జానపదుడు ఈ ప్రహేళికలో సంధానించాడు. కర్మదండమైన ముల్లుగట్టె గుణ స్వభావాలకు వ్యతిరేక గుణ స్వభావాలీ క్రింది ప్రహేళికలో గమనిస్తాం.

* పొద్దుగాల్ల పండుకుంటది
ఎండపూట లేస్తది
సాయంత్రం పండుకుంటది
పొద్దుగింతల లేస్తది (తగులు)

తగిలించేది తగులు. పశువులుదయమే పొలాలకు పోతాయి. ఆ రాత్రి అంతా, వాటి మెడకున్న తగుళ్లు ప్రొద్దంతా పడుకొంటాయి. పశువులు మళ్ళీ ఎండపూట వస్తాయి. అప్పుడు తగుళ్లు లేచి వాటి మెడకు తగుల్కొంటాయి. సాయంత్రం పశువులు వెళ్లిపోతాయి. తగులూరకే ఉంటుంది. ప్రొద్దు క్రుంకిన పిదప

అవి వస్తాయి. ఇది మళ్ళీ తేవక తప్పదు. తగులు (పలుపు) ను గూర్చి ఏమి వ్యాఖ్యానిస్తామని కొందరనవచ్చు. కాని జానపదునికిదియదియనిలేదు. తన దృష్టికి తగిలిన ప్రతివస్తుపు స్వరూప స్వభావాల్ని ఆతగొక మహాకవిలాగా పలుకుతాడు.

* మోకాల్ల మంటి నీల్లల్ల
మొండోడు మొత్తుకునె (బొక్కెన)

నడుములబంటి, కుత్తుక బంటి అనే పదాలున్నాయి. అట్లే మోకాళ్లబంటి. పాపం ఆ వ్యవసాయ దారుని బావిలో అంత మాత్రం నీరే ఉంది; అయినా మోట గొట్టాలి; చేను తడుపాలి. బావినిండా నీరుంటే బొక్కెన బుడబుడ మునుగుతుంది, లేకుంటే ఆ బొక్కెన నేలను గీరుతుంది. మొత్తుకొన్న విధంగా చప్పుడు చేస్తుంది. ఇక్కడ బొక్కెన మొత్తుకోవడమంటే దీన హీన స్థితిలో ఉన్న కర్షకుని ఆక్రోశమే ఆవేదనే అది అని గమనించాలి. మొత్తుకోడమంటే బాధాతప్త హృదయ ఘోష. మరో గూఢార్థం ఇందులో నిక్షిప్తమై ఉంది మొండోడంటే కాళ్లు చేతులు లేనివాడనీ లేదా రెండింటిలో ఏదో ఒక అంగం లేని వాడనీ అర్థం. కాళ్లు సేతులు లేని వానికి తన ఆవేదన తెలియజేయడానికి ఇక మిగిలింది నోరొక్కటే. అందువల్ల 'మొండోడు మొత్తుకునె' అనే సమంజసమైన పద ప్రయోగం చేయబడింది. అల్పాక్షరాల్లో ఇటువంటి ధ్వని సంవేదనాద్భుతాలు మిళితమయ్యాయని అమాయక జానపదునికి తెలుస్తుందా! తెలిసినప్పుడూ లేదా జానపద హృదయ మర్మజ్ఞులు తెలియ జేసినప్పుడూ పొంగడూ--అహంకరించడు; నిర్వికారహృదయుడై తన త్రోవన అంటే తన కృషి జీవన పథంలో అడుగులు వేస్తుంటాడు. అతని దృష్టి వృత్తిపై, ఉత్పత్తిపై, కుటుంబంపై, గ్రామంపై, దేశంపై, ధర్మంపై.

* మునిమాపు ముట్టాయె
ఏగినాత్రి యాకటాయె
తెల్లాని పిల్ల పుట్టె
పొద్దు పొడువ పేరువెట్టె
(తోడు, పేరుకోవడం, పెరుగు, చల్ల)

పాలను బాగా కాచాక సాయంకాలం వరకు అవే చల్లబడుతాయి. పూర్తిగా చల్లబడక పూర్వమే మునిమాపువేళ అంటే రాత్రికి ముందు సమయంలోనే తోడు వేస్తారు. తోడు వేయడం ముట్టవడం. ఏగినాత్రి అంటే మధ్యరాత్రి. మధ్యరాత్రికి వేపటయిందని అంటే గర్భవతి అయిందని అర్థం. తెల్లారి పిల్లపుట్టే అంటే పెరుగు సిద్ధమయింది అని అర్థం. [illegible] పెరుగును మజ్జిగ చేస్తారు. అప్పుడు కాని దానికి చల్ల అనే పేరు రాదు. పై పొడుపుకథ గృహ జీవన సంబంధి అయినా, శృంగార భావనా భావితమైనదయినా స్త్రీలు పదుగురు కలిసినప్పుడు వినోదార్థం పొడుచుకుంటుంటారు. ఇటువంటి పొడుపు కథలే కొన్ని పద్యాల్లో పొదగబడ్డాయి.

వినోదార్థం పొడుచుకొనే ఇటువంటి ప్రహేళికలు మరెన్నో ఉన్నాయి కొన్ని మాత్రం ఉదాహరించి ఈ ప్రకరణాంశాన్ని ముగిస్తాను.

* ఎక ఎక కాయ (ఈతకాయ
పక పక కాయ పత్తికాయ
కీలుబంతి కాయ కాటిక కాయ
నేల జోలికాయ టపాకాయ)

* తుప్పుడు లేని కొబ్బరికాయ (కల్లుముంత)

* చిన్న పిట్టమ్మ కమ్మగుంటుండి (నుగులు)

* ఉరుములు మెరుపులు
ఉత్తరాని కొమ్ములు
పదమటాకులు
పంచరంగులు
బిల్లకొప్పులు
బీడి రైకలు
నాకు తెలువదు (బాసికాలు)

* గూట్ల మైసమ్మ
మెరిగి మెరిగి సూసె (నిప్పు)

మనిషి ఉత్పత్తి జీవనంలో యంత్రమై పోవడం బానిసతనాన్ని కోరి తెచ్చుకోడమే అవుతుంది. దాంతో అర్థంపై ఆపేక్ష పెరుగుతుంది. ఇంకేం అతన్ని స్వార్థం ఆవరిస్తుంది. వ్యక్తి కేవలం వీనిలోనే లయమై పోకుండా ఉండడానికై క్రీడా వినోద గోష్ఠుల్ని కల్పించుకొన్నాడు; అందువల్ల నిత్యనూతనోత్సాహాన్ని, అనవరత మానసికానందాన్ని అందుకొంటున్నాడు; నియమ నిగ్రహ బద్ధుడవుతున్నాడు. నిష్ఠాగరిష్ఠుడవుతున్నాడు. శిష్టుడై, ద్రష్టుడై మంగళ మయ పథంలో తాను నడిచి తనలోటి వారిని నడిపించడానికి ఇటువంటి క్రీడా వినోద గోష్ఠులత్యంతావశ్యకాలు. ఆవశ్యకమైన రాజ్యానికి ఉపతా భక్తిగా తోడ్పడుతున్న ప్రహేళికా క్రీడ పరమార్థదాయకం; పరమోత్తమం.

## 2-5-6 : బాలబాలికల ప్రహేళికలు

జానపదుల బాలబాలికలు పొడుపు కథల్ని ఉగ్గుపాలతో పొడవడం నేర్చారు. ఏ తల్లి గర్భంలో ఉండి అభిమన్యుడు అలనాడు పద్మవ్యూహాన్ని విన్నాడో ఆ తల్లుల గర్భంలో ఉండి ఈనాడు జానపద బాలబాలికలు ఈ సమస్తాన్ని వింటున్నారు. అనేక సమయాల్లో జానపద స్త్రీ పురుషులు పొడుచుకొన్న పొడుపు కథలు పిల్లల మనో విజ్ఞాన వికాసానికి మూలకందాలయ్యాయి. పెద్దలనుండి పిల్లలకు సంక్రమించే సంప్రదాయముంది. పిల్లలు పెల్లుబికించే అనేక భావాల్ని పెద్దలు పరిశీలించడం ఉన్నది. తద్వారా ఉత్తమ జీవనాదర్శాలు ఆవిర్భవిస్తున్నాయి. బాలబాలికల పలుకులు ప్రథమంలో పెద్దల్ని అనుసరించేవే అయినా వారి చిత్తవృత్తి దినదినం వికాసం పొందేప్పుడు వినూత్న విషయ సృజనం జరుగుతోంది. తద్విషయ భావనా భావుకులైన పెద్దలు అప్పుడు బాల వాఙ్మయ ద్రష్టలవు తున్నారు; బాలవిజ్ఞాన స్రష్టలవుతున్నారు ఒక్కొక్క సమయంలో బాలుర పలుకుల్ని ఉన్నవి ఉన్నట్లుగా గుదిగుచ్చడం జరుగుతోంది. అవి లయాత్మక వచనాలై, గేయాలై, పద్యాలై బాలవాఙ్మయంలో స్థిరపడుతున్నాయి. ఇదే విధంగా పిల్లల పొడుపు కథలెన్నో పుట్టాయి.

గృహజీవనాది విషయ సంబంధి ప్రహేళికల్లో పెల్లల పొడుపు కథలు ఉండొచ్చు. కాని బాలబాలికల హృదయాన్ని విప్పిచెప్పేవి, మృదుమధుర పదభావ

గుంభితాలైనవి, ప్రత్యేకంగా బాలబాలికలే పొడుచుకొనేవి ఎన్నో పొడుపు కథలున్నాయి. అందువల్ల ఈ ప్రత్యేక శీర్షిక ఒకటి అవసరమయింది.

విషయ విభజనలో వినూతనత్వం భాసించనప్పుడు ఈ పొడుపు కథల్ని ప్రత్యేకంగా నిరూపించడం ఎందుకు అనే ప్రశ్న పుడుతుంది. నిజమే కాని వీటిని బాలబాలికలే పొడుచుకుంటున్నందు వల్ల, ఇవి వారి మనో విజ్ఞాన ప్రదర్శకాలవుతున్నందువల్ల, వారి ఆట పాటలు పెద్దల ఆటపాటలకు భిన్నంగా ఉన్నందువల్ల, సమాజంలోని కల్మష వాతావరణం సోకని పన్నెండేళ్లలోపు వయస్సున్న పిల్లలైనందువల్ల, దర్శన స్పర్శనాల్లో పిల్లలకూ పెద్దలకూ ఉన్న అనుభవానుభూతులవైవిధ్యం ప్రపంచానికి తెలియజేయవలసి ఉన్నందువల్ల, ఇంకా ఏన్నోకారణాల వల్ల ఈ బాలబాలికా ప్రహేళికలు ప్రత్యేకంగా చెప్పడం అత్యావశ్యకంగా భావించాను.

ఈ ప్రకరణాంశంలో జానపద బాలబాలికల పొడుపు కథలు మాత్రమే స్పృశింపబడతాయి. గ్రామాల్లోనూ నగరాల్లోనూ పదుగురు బాలురు ఒక దగ్గర చేరడానికి అనేక కారణాలున్నాయి; అనేక సమయ సందర్భాలున్నాయి. గ్రీష్మాతపంలో బావుల్లోచెరువుల్లో ఈదులాడుతూ జానపద బాలురు మహానందాన్ని పొందుతారు. స్నానానంతరం మామిడి పిందెలు తింటూ ఒక దగ్గర కూచుంటారు. అప్పుడు ముచ్చటలకు, ముదిపాలకు, పోట్లాటలకు నాందీ వాక్యం పలుకుతారు. పశువుల్నికాచే పిల్లలు ఊరు దాటిన వెంటనే కలిసిపోయి పలకరింతలతో పులకరింతలతో పరవశిస్తారు. ఇట్లే గుట్టలకు వెళ్లి సీతాఫలాల్ని తెంపేప్పుడు, జానకాయల్ని (జానకి కాయల్ని) ఫలిమి కాయల్ని, రేగుపండ్లను తెచ్చేప్పుడు వీళ్లంతా ఒకదగ్గర చేరడానికవకాశముంది. ఎండా కాలంలో పశువులకు మేతలుండవు. అప్పుడు బాలబాలికలు గంపలు, గోనె సంచులు చేతబట్టి గుట్టలకు వెడతారు. గుట్టరాళ్ల సందుల్లో ఎండుగడ్డి ఉంటుంది. గుట్టమీద కొన్ని చెట్లు పచ్చగానే ఉంటాయి. వాటి ఆకుసు దూస్తారు; చిన్న చిన్న కొమ్మల్ని రెమ్మల్ని విరిచి గంపలు నింపుతారు. ఆ సమయంలో వారు పోయేప్పుడు వచ్చేప్పుడు కొట్టే కేరింతలు పొడుచుకునే పొడుపులు హృద్యాలై, వాళ్ల హృదయానంద ప్రదర్శకాలై ఒప్పుతుంటాయి. కేవలం ఇటువంటి సమయాల్లోనే గాక బాలబాలికలు

పెండ్లి వేళల్లో, పేరంటాలలో, ఆటపాటల్లో పాల్గొనే సమయాల్లో కలుస్తుంటారు; మనస్సులు, ముడులు విప్పుకుంటారు.

జానపద గేయ సాహిత్యం ఇప్పటికే బాలబాలికల పాటలచేత పరిపుష్ట మయింది. పరిశోధకులెంతమందో బాలబాలికల చిలక పలుకులకు అక్షయ స్థితి కలిగించారు; అక్షరీకరించారు; ప్రశంసించారు. "పామరులైన జానపదులు ప్రకృతి ప్రత్యక్షమువుకి పులకించి ఆపుకోలేని ఆనందావేశంలో ఋక్కులు గానం చేసిన ఋషులవలె అప్రయత్నంగా అర్థానికి మించిన అందమైన మాటల మానికతో పాటలు కట్టి పాడారు."[1] అనే విమర్శకుల వాక్కులక్షరసత్యాలు.

మరి అటువంటి రుక్కుల్ని బోలినవే బాలబాలికల పొడుపుకథలు. ఇవి జానపదుల పిల్లల హృదయ దర్పణాలు. ఈ పొడుపు కథల్ని వస్తుగుణ స్వభావాల్ని బట్టి తరులత ఫలపుష్పాలనీ, పశుపక్ష్యాదులని లేదా మానవేతర ప్రాణులనీ, మానవ సంబంధులనీ అనేక విధాలుగా వర్గీకరించి విశ్లేషించవచ్చు. స్థాలీపులాక న్యాయాన్ని అనుసరించి అవికొన్ని స్పృశిస్తూ జానపదబాలబాలికల మనస్తత్వాల్ని, సాంప్రదాయక జీవన ప్రభావాల్ని, పరిస్థితుల ప్రాబల్యంవల్ల కలిగే పరివర్తనల్ని పరిశీలిద్దాం.

## 2-5-6-1 : తరులత ఫలపుష్పాలు

ఏవోకొన్ని కారణాల వల్ల కొందరు చీకటి గుహల్లో నివసిస్తున్నారే తప్ప సమస్త ప్రాణికోటి ప్రకృతి రామణీయకత్వాన్ని అనుభవిస్తూనే ఉంది. ఈ సృష్టి నిసర్గ సుమపేశల సౌందర్య సందర్శన మాత్రంచేత జీవకోటి మహానందాన్ని పొందుతోంది. అటువంటి ప్రకృతిలో అంశమై ప్రకృతికే నిత్య నూతనత్వాన్ని నశ్వర మిథ్యాత్వాన్ని, శాశ్వత సత్యత్వాన్ని ప్రబోధిస్తోన్న తరులతా ఫలపుష్పాలకు అందరిలాగానే జానపద బాలబాలికలు ఆకృష్టులయ్యారు. ఆ ఆకృష్టత హృదయంలో తెలుగు పొడుపులు పొడిచింది. హృన్మందిరం నుండి అది మనో మందిరానికెక్కింది. అక్కణ్నుండి ఆ భావన మానవ ప్రపంచంపై అవతరించింది.

* ఎత్తెద్దును పట్టుకోనువోతె
వంకెద్దు వచ్చి పొడిసె (రేగుపండు)

---

1. బాలవాఙ్మయం పు. : 2

ఇందులో క్లిష్టతగాని, అస్పష్టతగాని అర్థం తెలియని పదంగాని లేదు. కాని ఏ అనుభవం ద్వారా ఈ పొడుపుకథ పుట్టిందో ఆ అనుభవం కలుగని వారికి ఇదెంత మాత్రం అవగతం కాదు. బాలబాలికలు రేగుపండ్లు తెంపబోతారు. రేగుకాయ ఆకుపచ్చగా, దోరకాయ పసుపు పచ్చగా, పండు ఎఱ్ఱగా ఉంటుంది. ఈ ఎఱ్ఱటి రేగు పండే ఎఱ్ఱెద్దు. దాన్ని పట్టుకోడానికై యత్నిస్తే వంకెద్దు వచ్చి పొడుస్తుంది. వంకెద్దంటే రేగుముల్లు. రేగుముల్లు గాలంపలె ఉంటుంది. ఆ ఆకుల్లో పండ్లల్లో రేగుముల్లు ఏ వైపు వంపు తిరిగిఉందో కనిపించదు. అందువల్ల తెంపేవారికది గుచ్చుకొంటుంది. ఆ గుచ్చుకోడమే పొడవడంగా జేసి పరస్పరం పొడుచుకుంటున్నారు బాల బాలికలు.

* తల్లి దయ్యం
పిల్ల పగడం (రేగుచెట్టు-రేగుపండు)

అటువంటి వంక ముండ్లుండే రేగుకొమ్మ పట్టుకుంటే శరీరం చీలికలవుతుంది; బట్ట పేలికలవుతుంది. ఆ కొమ్మను [illegible] కష్టం. అందుకే తల్లి రేగు చెట్టును దయ్యమంటున్నారు. పిల్ల రేగుపండును పగడమంటున్నారు. లోకంలో కొందరుంటారు. వారెప్పుడూ తమ మాటలతో చేష్టలతో ఇతరుల్ని బాధిస్తుంటారు. కొందరు స్త్రీలుంటారు; వారు కోడండ్రను అష్టకష్టాలను గురిచేస్తారు. ఇటువంటి వారిని దయ్యాలని గయ్యాళి గంపలని పిలవడం కద్దు అందువల్లనే "వాడు దయ్యపు ముండాకొడుకు; అది దయ్యపు ముండ; గయ్యాళి గంపతో సంసారం".... అనే లోక వ్యవహారాలు పుట్టాయి. అంత పిల్లలు ఇంతలోకాన్ని ఎరిగినా ఎరుగకున్నా దయ్యమంటే బాధించేవని, పగడమంటే అందంగా ఉండేవని ఎరిగి ఉంటారు. పగడాన్ని పోలిన ముత్యాలును ముట్టుకుంటే జగడాలు వస్తాయని వారికి తెలుసు. అందువల్లనే 'ముత్యాలు పగడాలు ముట్టుకుంటె జగడాలు' అని అంటున్నారు.

* ఆకాకు సందున
ఏకాకు సందున
ఎమయ్య పంతులూ
పైనిండ బెండులు (సీతాఫలం)

సీతాఫలం ఆకుల్లో దాగి ఉంటుంది. అవి పైకి కనబడవు. దేకాకనేమాట ప్రాసార్థమై ఉండాలి; దేకావలె దట్టమైన అనే అర్థమైన రావాలి. దెబ్బతగిలినచోట నెత్తురుతో కూడుకొన్న ఒక రకమైన వాపును బెందు అంటారు. సీతాఫలాలమీది బొడుపుల్ని బెందులతో పోల్చడాన్ని బట్టిచూస్తే తాముతిన్న దెబ్బల్ని వారెంత ఆవేదనానందాలతో సంకేతించుకున్నారో తెలుస్తోంది. ఇందులో మరో అర్థముంది. జానపదుల బాలురలో కొందరు రాత్రి సమయాల్లో ఏ గుడిలోనో చావడిలోనో చదువుతుంటారు. చదువుచెప్పే పంతులుగారు ఉచితంగానే విద్యాదానం చేస్తారు. వీళ్ల సర్వకపోతే ఆయనకు కోపం వస్తుంది. బెందులు వచ్చేట్టు బెత్తంతో కొడతారు. 'ఏమయ్యా పంతులూ! పైనిండా బెందులా' అని సీతాఫలాన్ని అంటూ పంతులుపై తమ కసిని తీర్చుకొంటున్నారు. సుప్పెడు పొడుపుకథ-విప్పిచూస్తే గుమ్మెడు అర్థం. పడితే పిడికెడు విడిచిపెడితే ఇంటి నిండ వ్యాపించేంత అర్థం.

* కొనేటప్పుడు నల్లగ
తినేటప్పుడు ఎఱ్ఱగ
పారేసేటప్పుడు తెల్లగ (అల్లోనేరేడు పండు)

జానపద బాలబాలికల దృష్టిలో కొనడమంటే తీసుకోవడం అనే అర్థం. లేకపోతే అల్లోనేరేడు పండు వాళ్లెందుకు కొంటారు. పట్టణంలో ఉన్నవాళ్లు కొనవలసి వస్తుంది. అల్లోనేరేడుపండు తీసుకొన్నప్పుడే నల్లగా ఉంటుంది. తినేప్పుడు ఎఱ్ఱగా ఉంటుంది. అందులోని గింజను పారవేస్తారు. అది తెల్లగా ఉంటుంది. కథ కట్టాలంటే బుద్ధికి తోచాలి. మరి అలాంటి బుద్ధి మంతుల్ని బృహస్పతులన్నా అతిశయోక్తి కాదుగదా!

* చారచారలపాము
చక్కనైనపాము
సున్ననైనపాము
పాముతెచ్చికూరచేస్తే
పంటికిందికే చాలదు (పొట్లకాయ)

కొన్ని దేశాల్లో పాముల్ని కూడా ఆహారంగా గ్రహిస్తారు. భారతదేశంలో అటువంటి ఆచారం లేదుకనుకనే ఇది పాముకాదని వెంటనే తెలుస్తుంది. పొట్లకాయలు చారలు చారలుగా ఉంటాయి. రాళ్లదారాలు కట్టడంవల్ల అవి చక్కగా ఉంటాయి.

నునుపుగా మృదువుగా ఉంటాయి. వండకపూర్వం ఉన్నంత వండిన తర్వాత ఉండదు. తక్కువప్పుతుంది. పంటి కింద కొరికితే చాలదనడంవల్ల పొట్లకాయరుచి బాల బాలికలు నెమరువేస్తున్నట్లు తెలుస్తుంది.

* గుప్పెడు పిసిక్కి
ఒంటినిండా గుడ్డలే (ఉల్లిగడ్డ)

జానపద బాలబాలికలు తమ పొలాల్లోనే ఉల్లిగడ్డలు చూస్తారు. వాటిగుణం వారికి తెలుసు. పిట్టలు కూడా వారికి సుపరిచితాలు. అందువల్లనే ఉల్లిగడ్డనుగుప్పెడు పిచ్చుకగా భావించడం జరిగింది. ఉల్లిగడ్డ పొరల్ని శరీరంనిండా వస్త్రాలని భావించడంకూడా పరమ రమణీయం.

తరులతా ఫలపుష్పాలకు సంబంధించిన జానపద బాలబాలికల పొడుపు కథలు ప్రకృతి సంబంధులనే అనాలి. వీటిలో బాలబాలికల ప్రకృతి పరిశీలనా పాటవం సువ్యక్తమవుతుంది. ఎంత చెట్టుకంతగాలి ఉంటుంది. ఎవరెవరెక్కడెక్కడ ఎదిగితే వారివారి పై అక్కడక్కడి పరిసరాల ప్రభావం పడుతుంది. విత్తేది పెడితే చెట్టదే మొలుస్తుందనేది జానపదుల విషయంలో మరీ సార్థకమయింది.

ఇక పశుపక్ష్యాదులకు సంబంధించిన బాలబాలికల పొడుపు కథల్ని పరిశీలిద్దాం. ఈ శీర్షిక కింద మానవుల్నితప్ప జీవమున్న ప్రాణుల్ని పరామర్శించడం జరుగుతుంది.

## 2-5-6-2 : మానవేతర ప్రాణులు

ప్రాణాలున్నవే అయినా చెట్లు చేమలు సర్వసాధారణంగా అచలాలే అనాలి. ఎక్కడో ఒకటి రెండు నడిచే చెట్లున్నాయని శాస్త్రజ్ఞులంటున్నారు. తరులతా ఫల పుష్పాలనే శీర్షిక క్రింద కొన్ని పొడుపు కథలు వ్యాఖ్యానించాను. వృక్షేతరాలు, మానవేతరాలు అయిన ప్రాణులు ఈ శీర్షిక క్రింద పరిశీలిస్తాను.

* తెల్లని కుండలో
పచ్చని బంగారం (కోడిగుడ్డు)

కోడిగుడ్డు తెల్లగా ఉంటుంది. అందులోని నీలం పసుపు పచ్చగా ఉంటుంది. గుడ్డును కుండగా, నీలాన్ని బంగారంగా భావిస్తున్నారు జానపద బాలబాలికలు. ఈ భావన నగరాల్లో గుడ్లను కొనే అమ్మే బాలబాలికలకు కూడా ఉంటుంది.

* కంచెలో కఱ్ఱావు ఈనింది (తేనెతుట్టె)

జానపదుల బాలురు పశువుల్ని మేపేప్పుడు ఇలా ఊహించి ఉంటారు. పశువులు కంచెదాటి చేనులో పడుతుంటాయి. అప్పుడు పరుగెత్తుకవెళ్లి వాటిని మళ్లిస్తారు. కంచెలో కఱ్ఱావీనడం అంటే దూడకు ప్రమాదకరం. ఆవు కంచెలో ఎటువంటి బలహీన స్థితిలోనూ ఈనదు. తేనెటీగలు తుట్టెగడతాయి; తెట్టెపెడతాయి. కంచె కంటకమయం; అది వాటికి అనుకూలం; అనుకూలంగా ఉన్నచోట గృహ నిర్మాణం ఎవరైనా చేసుకొంటారు; సంసారం చేస్తారు; పిల్లల్ని కంటారు. జానపదబాలుడు మరొకరితో ఇలాపొడిచాడంటే 'ఆవుపాలు తాగినట్లే జుంటితేనెలు గ్రోలుదాం' అనే ఆశను ప్రేరేపిస్తున్నాడన్నమాట.

* గుబ్బారి పొదల్ల
గుడ్డెలుగు మాయమాయె (పేను)

తల్లో, నాయనమ్మో, అమ్మమ్మో పిల్లల నెత్తిన పేలుచూస్తుంటారు. అది కనిపించినట్లే కనిపించి చటుక్కున మాయమవుతుంది. వెంట్రుకల్ని పొదలుగా పేనును గుడ్డెలుగుగా భావించి జానపద స్త్రీ తమ బాలికతో అంటోంది. ఆ బాలిక ఇంకెందరితో అంటుందో!

* ఒక ఇల్లుకు వెయ్యి మూతలు
మూత మూతకొక పిల్ల
పిల్లపిల్లకు నూనె (తెనెతెట్టె)

మూసేది మూత; మూసేది ఎప్పుడో ఒకప్పుడు తీసేదే. ఇది ఇంటి విషయం కాబట్టిదాన్ని గుమ్మమనో, దర్వాజాఅనో, తలుపులు అనోఅంటారు. ప్రతి గుమ్మానికి ఒక పిల్ల ఉంది. పిల్ల పిల్లకు నూనెఉంది. ఇందులో ఇల్లు తేనెతెట్టె; మూతలు తేనెటీగలుండే గుమ్మాలు; పిల్లలు తేనెటీగలు; నూనె తేనె. ఈ పొడుపు

జానపద బాలుర అనుభవంనుండి పుట్టిందే. ఇల్లు, ఇంటి గుమ్మాలు, పిల్లలు, నూనె వారికి కొత్తవేం కావు. అందువల్లనే వారి జీవితానికి ఈ పొడుపుకథ **అతి** సన్నిహితంగా ఉంది.

* మాను పుట్టి పన్నెండేండ్లాయె
పువ్వు కళ దప్పలేదు (నెమలిక)

మయూరం ఈక ఎన్ని సంవత్సరాలున్నా కళదప్పదు. మానుపుట్టడం అంటే నెమలి పుట్టడం. పన్నెండేండ్లనే మాట చాలా సంవత్సరాలు గడిచాయి అని చెప్పడానికే ప్రయోగింపబడింది. నెమలిని మానుగా, పువ్వును నెమలికగా భావించడం జరిగింది. కళాశబ్దం సౌందర్యార్థంలో ప్రయుక్తం సౌందర్య సుస్థిరత్వాన్ని జానపద బాలబాలికలు ఆశిస్తున్నారంటే వారిని బలీయమైన సంప్రదాయం వెన్నుతట్టుతున్నట్లు తెలుస్తుంది. "కళదప్పలేదు" అనే ప్రయోగంలో ఓ మహాకవి కనిపిస్తున్నాడు. అంతేకాకుండా ఈ పొడుపు కథలోని సత్యసౌందర్య సుస్థిరత్వాకాంక్ష అనేది ఓ మహాతాత్త్వికుని దర్శనాన్ని తలపిస్తోంది.

* గద్వాల శంకరయ్య
గంతులేసి
గొంతిగ కూసుంటడు (కప్ప)

కప్పగంతులు వేయడం గమనించిన అనుభవంతో బాలబాలికలు కప్ప గంతులనే ఆటనే సృష్టించడం జరిగింది. గద్వాల శంకరయ్యను దృష్టిలో ఉంచుకొని ఆయన్ని అపహేళనచేస్తూ ఈ పొడుపుకథను కల్పించారు. దొంతిగ కూచోడం అంటే కుదురుగా కదలకుండా కూచోడం అని అర్థం. పల్లెప్రజలు కుండల్ని పేర్చి గదుల్లో దాస్తారు ఆ దాచిన కుండల్లో దాచే వస్తువుల్ని వేస్తారు. అలాంటి కుండల్ని దొంతులు అంటారు. శంకరయ్య కూడా అంత కుదురుగా కూచుంటాడేమో! లేకపోతే ఆయనకూ కప్పకూ సామ్యం తీసుకురావడందేనికి!

* ఇస్తారెక్క
బెస్తోడువాయె (కుక్క)

ఆటవిక జీవనం గడిపిన్నాడు మానవుడు పళ్లాలుగా కొండబండల్ని, చెట్ల ఆకుల్ని ఉపయోగించాడు. ఈనాటికి కొందరు మఱ్ఱి, మోదుగ, బాదాం, అరటి మొదలైన చెట్ల ఆకుల్లోనే తింటున్నారు. గ్రామాల్లో జరిగే విందుల్లోను, పడమటి గాలిసోకని నగరాల్లోని విందుల్లోను ఈనాటికి భోజనానికి ఆకుల్నే ఉపయోగిస్తున్నారు. భోజనానంతరం విస్తరాకుల్ని పారవేస్తారు. అంతవరకు కాచుకొని కూచున్నకుక్క ఆ విస్తర్ల వెంటపడుతుంది. 'రోజూ విందులుకాని, ఆ విందులకు ఎక్కువ మందిరాని' అని కుక్క భావిస్తుందట. 'ఈ ఇంటిలో ఒక రెప్పుడు తక్కువగాని, పాలుపెరుగు మిగలని, నాకడుపునిండని' అని పిల్లి భావిస్తుందట. ఈ మాటల్నిబట్టి జానపదుల సునిశిత పరిశీలనం, పశుపక్ష్యాదుల అంతరంగాల్నికూడా అధ్యయనం చేసే బుద్ధి పాటవం సువ్యక్తమవుతుంది. బెస్తోడనేపదం ఒక వృత్తివారిని నిరసించే ఉద్దేశ్యంతో ప్రయోగించిందికాదు. జానపదుల బాలబాలికలకు అన్నివృత్తులు సమానమే. అర్థగౌరవ వృత్తులాదరించే మనస్తత్వం గలవారికి మాత్రమే హెచ్చుతగ్గులుంటాయి. కల్లలెరుగని పిల్లలకు ఎల్లలనేవి లేనేలేవు. ఒకని ఎంగిలికూటికి ఆశించే కుక్కవలె బ్రతుకును ఈడ్వరాదనే సందేశం ఈ పొడుపుకథ అందిస్తోంది.

* అడ్డగోడమీద
బుడ్డచెంబు (ఎద్దుమూపురం)

బుడ్డచెంబంటే చిన్న చెంబని అర్థం. ఎద్దును అడ్డగోడగా భావించడం, బుడ్డచెంబును మూపరంగా భావించడం జరిగింది. చిన్న చిన్న చెంబులతో జానపద బాలబాలికలు ముఖాలు కడుక్కునేప్పుడు పోటీలు పడుతుంటారు. 'నాకే బుడ్డసెంబు; నాకే బుడ్డసెంబు' అని ఒకరిచేతిలోదొకరు లాగుకొంటారు. ఎద్దుమూపరాన్ని అంత ప్రియమైన బుడ్డచెంబుగా భావించారు. ఎద్దునడ్డగోడగా సంకేతించారు. నిత్య జీవనానికి అతిసన్నిహితాలైన ఉపమానాల ప్రయోగం జరిగినప్పుడు అవి అలంకారాలుగా ఉండక సహజాతి సహజాలై పదార్థానికి పదార్థానికి అభేదాన్ని పాటిస్తాయి. సహజత్వంలో జవాన్ని జీవాన్ని పొదిగే శక్తి జానపదుల పిల్లలకుంది. ఆ పిల్లలు పొడుచుకునే మానవేతర ప్రాణులకు సంబంధించిన ఇటువంటి పొడుపు కథలు లెక్కకు మిక్కిలి ఉన్నాయి. ఇక మానవ సంబంధులైన పొడుపు కథల్ని స్పృశిద్దాం.

## 2-5-6-3 : మానవ సంబంధులు

ప్రకృతికీ మనిషికీ అనాదిగా అవినాభావ సంబంధముంది ప్రకృతి దర్శన స్పర్శనాల వల్ల మానవుడు పులకిత గాత్రుడవుతున్నాడు. మానవుని స్పర్శనానికే ప్రకృతి పరవశించి అతణ్ని ఫలసిద్ధి పర్యంతం తీసుక పోతుంది. మనిషి బాహ్య ప్రకృతి సందర్శనం మాత్రమే చేయడంలేదు. లోచూపు గలవాడై తనలోని తత్త్వం అన్వేషిస్తున్నాడు. ఆ తత్త్వాన్ని కప్పిన దేహంలోని వివిధ భాగాలకు గూఢార్థ చమత్కారపద సంధానం గావించి ప్రహేళికలు విరచించాడు. ముఖ్యంగా జానపద బాలబాలికలు అల్లిన అటువంటి పొడుపు కథల్ని పరామర్శిద్దాం.

* దిబ్బ దిబ్బలాడేవి రెండు
డిబ్బెక్కి సూసేవి రెండు
ఆలకించేవి రెండు
అందుకునేవి రెండు (కాళ్లు, కళ్లు, చెవులు, చేతులు)

నడిచేప్పుడు కాళ్ల వల్లదిబ్బదిబ్బ అనే ధ్వని వస్తుంది. దిబ్బ అనగా మట్టి గడ్డ; అదిఎక్కినప్పుడు చూసేవి కళ్లు; ధ్వని వినేవి చెవులు; తీసుకొనేవి చేతులు. బాలబాలికలప్పుడప్పుడు కొంటెపనులు చేస్తారు అల్లరిచేయడం పిల్లల సహజత్వం. ఓ కుర్రాడు మామిడితోటలో ప్రవేశించి ఎవరూ చూడకుండా, మరోకుర్రాని సహాయంతో కాయలు తెచ్చాడు. ఆ తెచ్చిన విషయాన్ని ఇలా చెప్పాడు పనిలో తన శరీరావయవాలు పాల్గొనే తృప్తి ఈ ప్రహేళికలో కనిపిస్తుంది.

* ముప్పది రెండు మంచి దంచంగా
ఒక్కతే తోస్తది (పండ్లు, నాలుక)

కాయలు తెంపాక ఇక చేసే పని తినడమే కదా! ముప్పయిరెండు దంతాలు పదార్థాల్ని దంచి పిప్పి చేస్తాయి. అప్పుడు నాలుక గొంతులోకి త్రోస్తుంది. ఇది పొడుపుకు విడుపైనా బాహ్యార్థంలో వద్దుదంచే రూపం పొడగట్టుతుంది. ఇదికూడా దేహ సంబంధి క్రియనే తెలియజేస్తుంది.

* మీ నాయన కాలెత్త
మీ యమ్మ చేయెత్త (గోచీ పెట్టడం, రవికతొడగడం)

పంచె కట్టుకొనేప్పుడు పురుషులు గోచీ చెంగును కాలు క్రింది నుంచి మళ్లించి, వెనుక నడుంభాగంలో చెక్కుతారు. అప్పుడు కాలెత్తవలసి ఉంటుంది. స్త్రీలు రవికలు తొడుగుకొనేప్పుడు చేయెత్తవలసి వస్తుంది. రవికలు బిగుతుగా ఉంటాయి కాబట్టి ఒకచేయి సాధారణంగానే తొడిగినా, మరోచేయి తొడిగేప్పుడు తప్పని సరిగాచేయెత్తవలసి వస్తుంది. భార్యాభర్తయి పొట్లాడుకుంటున్నారనే అర్థం స్ఫురించినా ఇది వస్త్రధారణకు సంబంధించిన మానవ సంబంధి పొడుపు కథ. ఈ వస్త్రధారణ విషయం పిల్లలకు కూడా తెలుసు; అందువల్ల వారినోట ఇలాంటి పొడుపు కథలు వినబడుతున్నాయి.

* వాకిలికి తాళం వేసింది
అయ్యా అంటే తెరుస్తుంది
ఆకలి అంటే తెరుస్తుంది.
అమ్మా అంటే మూస్తుంది (మూతి లేదా పెదవులు)

పెదవులు మూయడం వాకిలికి తాళం వేయడం; అయ్యా అనేప్పుడు ఆకలి అనేప్పుడు పెదవులు విడివడడమే తెరుచుకోడం; 'అమ్మా' అనేప్పుడు పెదవులు మూయబడతాయి. బాలబాలికలందరు అతి సులభంగా సమాధానం చెప్పే పొడుపుకథ ఇది.

* సెట్టెక్కి సెలిమె తోడేబోడు (ఈడిగ)

కల్లు గీత పనిలో ఉన్న వారిని ఈడిగ వాళ్లు లేదా గౌండ్లవాళ్లని అంటారు. చెట్టెక్కి కల్లుగీత కత్తితో గీయాల్సి ఉంటుంది. చెట్టు కొప్పుకు కొద్దిక్రిందుగా గీత కత్తితో కాట్లు పెడతారు. ఆ కాటు దగ్గరినుండి చెట్టునీరు బొట్లు బొట్లుగా కారుతుంది. గీత వృత్తివాళ్లు ఆ బొట్లు కుండలో పడేట్టు లొట్టిగడతారు. లొట్టిని మరునటిరోజు విడుస్తారు. వాగుల్లో, వట్టె కాలువల్లో, పెరువుల క్రింద నీరుపారని సమయాల్లో జానపదులు చెలి(ల)మలు తోడుతారు. నీహారీ ఊరీ అవి నిండి ఉంటాయి. చెలమ అక్షయ పాత్ర వంటిదని జానపదుల నమ్మకం చెట్టు మీద చెలమ తోడడం అంటే గీతపని చేయడమే. ఆ పారిశ్రమికుని ఈడిగ అంటారు. జానపద బాలబాలికలకు ఈ విషయాలెన్నో తెలుసు ఈ క్రిందివన్నీ మానవ దేహ సంబంధులైన పొడుపు కథలే.

* రెండు నాలిక లుంటయి
  కాని పాముగాదు (మానవుడు)

* గుంతల గుంట్రాయి (కనుగుడ్డు)

* గూట్లో పిల్ల
  గుంజితే రాదు (నాలుక)

* సిన్న గూట్ల
  సింతకాయ తొక్కు (జీవిలి)

తల్లి దండ్రుల తర్వాత పిల్లలకు తమ శరీరావయాల పేర్లు తెలుస్తాయి. రాను రాను వాటి ప్రయోజనం తెలుస్తుంది. మంచిచెడ్డలు అర్థమవుతాయి. వస్తు ప్రపంచం గుణ గణాలు అవగతమవుతాయి. ఉపమించడం ప్రారంభిస్తారు. ఉపమేయాలు అదృశ్యమవుతాయి. అప్రకృతాలైన ఉపమానాలు మాత్రమే పొడవబడుతాయి. అప్రకృతాలైన వస్తుగుణ స్వభావాదుల్ని బట్టి ప్రకృత వస్తువేదో తెలుస్తుంది. ఆ తెలిసినదేదో అదే విడుపుకథ అవుతుంది. జానపదుల పిల్లలింతగా ఎదిగారు. అందువల్లనే ఇలా పొడుస్తున్నారు.

## 2-5-6-4 : పంచభూతాదులు

నిప్పునూ, నీటినీ, గాలినీ, మట్టినీ, ఆకాశాన్నీ ప్రాణిభూమి మీద పడిన నాటినుండి చూస్తూనే ఉన్నాడు. ప్రాణి జీవనానికి వాటి అవశ్యకతను గుర్తిస్తూనే ఉన్నాడు. ప్రాణికి పంచభూతాలకు విడదీయ రాని సంబంధముంది. ఒకానొక ఆత్మైక్యం ఉంది. పంచ భూతాలు ప్రాణి రూపాన్ని పొందుతున్నాయి. ప్రాణి పంచ భూతాలలో లయిస్తుంది. వీటికున్న శక్తి తత్త్వాలపై నేటికీ అన్వేషణ కొనసాగుతుంది. ఆధునిక శాస్త్రీయ విజ్ఞాన సౌగంధ్యం సరిగా సోకని జానపదుడు ఈ పంచభూతాల శక్తి కబ్బుర పడుతూ కట్టిన పాటలు, అల్లిన కైతలు, పొడిచిన పొడుపులు సాహిత్యాకాశంలో శశితారకలయ్యాయి; జానపద విజ్ఞాన సముద్రంలో రత్నాలయ్యాయి; జానపద సారస్వత భూఖండంలో మణులయ్యాయి— మాణిక్యాలయ్యాయి.

* సిన తాంబాలం
పెద తాంబాలం
నూకల బువ్వ
నూనె ధార (చంద్రుడు, సూర్యుడు, చుక్కలు, వాన)

జానపద బాలబాలికలకు చల్లని వెన్నెలలు వెదజల్లే చంద్రుడు చిన తాంబాల మయ్యాడు. వెలుతురుల్ని ప్రసాదించే సూర్యుడు పెద తాంబాల మయ్యాడు. చుక్కలన్నీ నూకల బువ్వ అయ్యాయి. వర్షం తైల ధార అయ్యింది. సూర్యచంద్రతారకలు జానపదుల ఇంటికే వచ్చేశాయి. వారుపయోగించే తాంబాలాలలో, తినే అన్నంలో, త్రాగే నీటిలో పంచ భూతాల్ని దర్శిస్తున్నారు. ప్రకృతిని పరిశీలిస్తున్నారు. కష్టలకు, కావేశాలకు, చిల్లర పనులకు అతీతమైన విశ్వవిశాల సౌందర్య భావాల్ని జానపదుల పిల్లలు చిన్నతనంనుండే అలవరచు కొంటున్నారనడానికి ఇటువంటి పొడుపు కథలే నిదర్శనం.

* జానెడు గుంతల
మానెడు పగడాలు (ఇంగలాలు)

మూడు రాళ్లను మూడు దిశల్లో నిర్దిష్ట దూరంలో ఉంచో, ఇటుకల్ని పేర్చో లేదా పుట్టమన్ను వేసో పొయ్యిని నిర్మిస్తారు అది నిజానికి జానెడు గొయ్యి వలెనే ఉంటుంది. పొయ్యి మీద పదార్థాలు ఉడుకుతుంటే కట్టెలు కాలుతుంటాయి. కాలిన కట్టెలు నిప్పులవుతాయి: ఆ నిప్పులు పొయ్యినిండ ఉంటాయి; అవి ఎట్టిగా ఉంటాయి; పగడాలవలెనే ఉంటాయి జానపదుల పిల్లలు ఈ దృశ్యాల్ని చూస్తారు. తల్లిచెంకన కూర్చొని వంట అయ్యే తీరును పరిశీలిస్తారు. తల్లికి వంట పనుల్లో తోడ్పడతారు, సూక్ష్మ పరిశీలన కారణంగా ఆ పొయ్యినీ ఇంగలాల్ని, జేనెడు గుంతగా మానెడు పగడాలుగా సంకేతించారు ఆ సంకేతం అందరిలో ప్రదర్శించారు. జానపద బాలబాలికలు అక్షర జ్ఞాన శూన్యులైనా వారి బుద్ధి నైశిత్యం ఇటువంటి పొడుపుకథల్లో దృగ్గోచరమవుతుంది. వైవిధ్యం ఉండి ఇదే అర్థమిచ్చే మరి రెండు పొడుపు కథలు ఇక్కడ ఉదాహరిస్తాను.

* యాలక్కాయంత పగడాన్ని
ఎంత లావు వాళ్లయినా పట్టుకోలేరు (నిప్పు)

* యాలక్కాయంత బంగారాన్ని
ఏనుగుకూడ మోయలేదు (నిప్పు)

నిజమే! నిప్పును పట్టేవారెవ్వరు! నిప్పును మోసేవారెవ్వరు!

* చెట్టు కిందలింగడు
ఎంత గొట్టినా వంగడు (నీడ)

పిల్లలు ఎండ ఆట అనీ, నీడ ఆట అనీ రెండు రకాల ఆటలాడుతారు. ఒకరు ఎండలోకి వెళ్లి చిన్న అద్దాన్నిపట్టి నీడలోకి ఎండను పడేట్టు చేస్తారు. ఒకరిద్దరు ఆ యెండను పట్టుకొని కొట్టడానికి యత్నిస్తారు. వారికి దొరకనీకుండా ఎండలో ఉన్నవాడు అద్దం ఆడిస్తాడు. అట్లేతనకన్న పెద్దవారిని కొట్టాలనుకున్నప్పుడు పిన్నలు ఆ బాలుని నీడనుఅరచేతితో కొడతారు! అరకాలితో తంతారు. ఎండను గొట్టినా నీడను గొట్టినా ఫలం మాత్రం శూన్యం అయితే మానసిక తృప్తి ఉంటుంది. ఇటువంటి అనుభవాల వల్లనే జానపదుల పిల్లలు ఈ పొడుపు కథను సృష్టించారు.

* పుట్టెడు సెనిగల్లో
ఒకటే ఉసిక రాయి (చంద్రుడు)

జానపదుల దగ్గరినుండి ఇది వచ్చి శిష్ట జన బాలబాలికల హృదయంలో తిష్ఠ వేసుకొంది. పుట్టెడు సెనిగలు చుక్కలు, ఇసుక రాయి చంద్రుడు. రాయి మెరుస్తుంది; చంద్రుడు మెరుస్తాడు. ఆ సామ్యం వల్ల చంద్రుడు రాయి అయ్యాడు.

* తునికి పండు తుస్సు మంటే
పసులకాడి పిల్లలు పయనమయిరి (ప్రొద్దు)

పండు పాడైతే తుస్సుమన్నట్టే, అంటే పనికి రానిదైనట్టే; సాయంకాలానికి ప్రొద్దు పరిస్థితి అంతే అవుతుంది. త్వరత్వరగా అంతే కావాలని గోపబాలురు ఎదురు చూస్తుంటారు. అప్పుడు పశువులను తోలుకొని ఇంటికి బయలుదేరుతారు. ప్రొద్దెక్కి బయలు దేరేవారిలో పశువుల వారినే ప్రప్రథములుగా చెప్పాలి. వారి సమయ నిర్ణేత సూర్యుడే. అందుకే సూర్యుడు ప్రసాదించిన వెలుగు నీడలతో వారాడుకుంటారు. పొడుపు వెలుగుల పొలుపుల్ని కనుగొంటారు; పొడుచు కొంటారు,

ఈ విధంగా పంచభూతాల్ని వాటిని అనుసంధించుకొని ఉన్న ప్రకృతిని తమ పరిశీలనా శక్తిచేత అనక్తి చేత జానపద బాలబాలికలు ప్రహేళికల్లోకి దింపారు. ఇక వారు గృహ పరికరాల్ని పొడుపుకథల్లో ఎలా సన్మానించారో కనుగొందాం.

## 2-5-6-5 : గృహ పరికరాలు

బాలబాలికల భవిష్యజ్జీవనానికి ప్రథమ విద్యాకేంద్రం గృహం. గృహంలో అనేక పరికరాలుంటాయి. గృహం శుభ్రం చేసేప్పుడు, వంట చేసేప్పుడు, తినేప్పుడు వివిధ రకాల ధాన్యాలు సరిచేసేప్పుడు ఈ పరికరాల అవసరం కలుగుతుంది. ఇంటి శుభ్రానికి పొరక, ధాన్యం శుభ్రం చేయడానికి చేట, రొట్టె చేయడానికి సానపీట, అలుకడానికి పిడచ, రాత్రి అవుతుండగానే దీపం, ఇటువంటివెన్నో కావాలి. వీటికి సంబంధించిన పొడుపు కథలెన్నో పుట్టాయి.

* నా పేరే జిల్జిల్‌గాడు
నా ముడ్డికి మూరెడు తాడు
నేను లేకుంటె ఇల్లంతపాడు[1] (పొరక)

గృహ పారిశుద్ధ్యంలో చీపురుకెంతో ప్రాముఖ్యముంది. పాచి చిమ్మేప్పుడు చెత్త తొలగించేప్పుడు చీపురు పట్టాల్సిందే. పొరక కదిలేప్పుడు దుమ్ము దులిపేప్పుడు జిల్ జిల్లనే ధ్వని వస్తుంది. అందుకే జానపద బాలబాలికలు జిల్జిల్‌గాడని అంటారు. పొరక పుల్ల చుట్టు గట్టిగా బిగించిన చిన్న తాడు గడతారు. కొందరా త్రాడు మూరెడెక్కువ ఉంచుతారు. ఈ ఎక్కువ త్రాడు చేతపట్టుకోడానికి ఉపకరిస్తుంది. మరి పొరక లేకపోతే నిజంగానే ఇల్లు పాడుపడినట్లనిపిస్తుంది దయ్యాల కొంపవలె ఉంటుంది. నారికరవాలమనే సుప్రసిద్ధనామంతో పిలువబడుతున్న చీపురును నిత్యం బాలబాలికలు చూస్తుంటారు. ఆ చూచిన స్వరూప స్వభావాల్ని ముచ్చటగా మూడుపదాల ప్రహేళికగా కూర్చారు.

* ఇంటి సుట్టు తిర్గి
ఇంట్ల కూసునె (అలుకు కుండ)

---

1 నేను లేకుంటె ఊరంతపాడు. (పా)

భారతీయ గృహిణికి అన్నీ పర్వదినాలే. అయినా లక్ష్మీవారంనాడు ఇంటిలో, ఇంటి విడుపుల్లోచక్కగా అలుకుతారు; ముగ్గులు వేస్తారు. అలికేప్పుడు ఆలుకు కుండ వెంటనే ఉంటుంది. కూర్చొని లేదా వంగి అలుకుతారు. ఎడమచేత ఆలుకు కుండను జరుపుతూ కుడిచేత అలుకు పిడచతో రుద్దుతారు. ఇల్లంతా అల్లే కద్దిన పిదప ఇంటి విడుపుల్ని అలుకుతారు. ఈ విధంగా ఇంటిచుట్టు తిరిగిన అలుకుకుండ ఇంట కూర్చుంటుంది. శిశువులింట్లోనే మలవిసర్జన చేస్తే 'ఇంట్లకూసున్న' దని అంటారు. ఈ పొడుపు కథలో కూడా మొదట ఆ అర్థం స్ఫురించి జానపద బాలబాలికలు కిసుక్కుమంటారు. ఇల్లూకిన పిదప అలుకుతారు. ఆ తర్వాత చేట పట్టుకుంటారు.

* పావులకొచ్చింది
యాడాదికి నిల్చింది (చేట)

పావలకు వచ్చేది, ఎడాది నిల్చేది ఏదని మనస్సు పరిపరి విధాల ఊహిస్తుంది. చేటలు చాలా తక్కువ ధరకు దొరుకుతాయి. అందువల్ల పావలకు వచ్చిందని అంటున్నారు. చేటను ప్రతి శుక్రవారం పేడతో అలికి శుభ్రంగా ఉంచుతారు. అది ఏడాది ఉంటుంది. అంతకన్న ఎక్కువగనే ఉంటుంది. అల్ప మూల్యానికి అనంత కాలం నిలిచే పరికరం లభిస్తే ఆనందంపొందనిదెవ్వరు!

* గుట్టసుట్టు ముట్టు
గంగెద్దు పుట్టు గొట్టె (పిండి)

ఇది ఎలా సాధ్యమనిపిస్తుంది. ఇక్కడ గుట్ట అంటే విసిరే రాయి; గంగెద్దంటే ధాన్యం; పుట్టంటే పిండి; విసుర్రాయిలో ధాన్యం పోసి విసురుతారు. అప్పుడారాయిచుట్టు పిండి పడుతుంది. దానిని ఎద్దు పుట్టింటున్నారు జానపద బాలబాలికలు. ఇల్లూకారు; అలికారు; ధాన్యం చేశారు; విసిరారు; ఇప్పుడగ్గిపెట్టె కావాలి.

* చిన్న యింట్ల
నిండ కట్టెలు (అగ్గిపెట్టె)

ఇంటినిండ కట్టెలే ఉంటే ఆ యింట్లో ఉండేదెలా అనిపిస్తుంది. కాని అవి పొయ్యి ముట్టించడానికి ఉపయోగించేవి అని తెలిసినప్పుడు వెంటనే అగ్గి పెట్టి అనేస్తారు. ఇంకేం వంట అవుతుంది; తింటారు: పనులకు వెడతారు; సాయంకాలం వస్తారు. మరి అప్పటికి ప్రొద్దుక్రుంకి ఉంటుంది. మరొక పరికరం కావలసి ఉంటుంది.

* అయిదరబాదు సెరువు నిండే ఉండది
పాంపండే ఉండది
పడిగ ఆడు తుండది (దీపం)

చెరువునిండి ఉండడం, పాము పండి ఉండడం, పడిగ ఆడుతుండడం ఒకదానికొకటి కలవని విషయాలు. కానీ చెరువంటే దీపమనీ, నిండి ఉన్నదంటే చమురున్నదనీ, పాము పండి ఉన్నదంటే చమురులో వత్తి ఉన్నదనీ, పడిగ ఆడుతున్నదంటే దీపం వెలుగుతూ గాలికి కదలుతున్నదనీ అర్థం.

గృహజీవన సౌఖ్యానికి ఉపయోగపడే ఇలాంటి పొడుపు కథలెన్నో జానపద బాలబాలికలు కల్పిస్తుంటారు. ఎక్కడ కలిస్తే అక్కడ ఒకరిమీద ఒకరు ప్రయోగించుకొంటుంటారు. బాలబాలికలే ప్రయోగించుకొనే వినోద పరికరాలకు సంబంధించిన పొడుపు కథల్ని పరిశీలిద్దాం.

## 2-5-6-6 : వినోద పరికరాలు

పరిసర వాతావరణ ప్రభావం మనిషి మీద తప్పని సరిగా పడుతుంది. ఎటువంటి వృత్తి జీవనముంటుందో వ్యక్తికి అటువంటి వస్తుసామీప్య సాన్నిహిత్యాలే ఉంటాయి. తన బ్రతుకులో ఐక్యమై పోయిన వస్తువుల పైన ఎనలేని అభిమానాను రాగాలుంటాయి. ఆ అనురాగం చేత ఆ పరికరాలకు పేర్లు పెడతాడు; కథలు కడతాడు. వాటిని మాటిమాటికి స్మరించడం వల్ల అతిశయానందంలోకి వెళ్లి పోతుంటాడు.

జానపదులిదే విధంగా తమ జీవనం పెనవేసుకొని పోయిన వస్తువుల్ని స్మరిస్తారు. వాటినే వినోద పరికరాలుగా ఉపయోగించుకుంటారు. కుండ చేతపట్టి పోయే జానపదునికి అదే వినోద పరికరమవుతుంది. పెళ్లికి, పేరంటానికి, చావుకు

డప్పుగొట్టే జానపదునికి డప్పే వినోద సాధనమవుతుంది. ముల్లుగఱ్ఱ చర్నకోల, గడ్డపార, సెల్కపార, మట్టి తట్ట, నీటిగూడ, చిట్టిగెన, గీతకత్తి, ఆరెకత్తి, మోటకదురు, పడవతెడ్డు మొదలైవెన్నో వినోద సాధనాలవుతాయి. రాజువేషం గట్టినప్పుడు ముల్లుగఱ్ఱే రాజదండమవుతుంది. బిచ్చమెత్తినప్పుడు మట్టితట్టే అక్షయ పాత్ర అవుతుంది. గెనె దేవుడవుతుంది; బిల్ల జీవుడవుతుంది. చెడుగుడు ఆటలోని కూతే జీవన సంగ్రామంలోని భీకరారావమవుతుంది. ఇలాంటి ప్రభావాలెన్నో బాలబాలికల జీవితంపై పడ్డాయి. వినోద పరికరాలపై వారికి ఆసక్తిని అవి వెల్లడిస్తున్నాయి.

* గట్టు మీద పోరడు
ముట్టంగనే ఏడుస్తడు (డప్పు)

ముట్టంగనే బాలుడు నవ్వాలి. కాని ఏడుస్తాడనడం విరుద్ధంగా ఉంది. గట్టుమీద ఉన్నవాడు క్రింద పడుతాననే భావనతో ముట్టిన వెంటనే చేతులుచాచి నవ్వుతూ పైనబడాలి. కాని ఇది డప్పు; డప్పుజానపదుల వినోద పరికరం; జానపదుల పిల్లలు చీటికి మాటికి డప్పు ముట్టుకుంటారు; అది శబ్దిస్తుంది. డప్పును పోరడని, శబ్దాన్ని ఏడుపని సంకేతించడం జానపదుల బాలబాలికలకే చెల్లింది,

* ముప్పయి రూపాయలు పెట్టి
ముండను కొనుకొస్తే
ఆదేడ్వ నేనేడ్వ (హార్మోనియం)

కొంతకాలం క్రితం ఈ దేశంలోని కొన్ని వృత్తుల వారిలో కన్యాశుల్కముండింది. వరుడు వధుపుతండ్రికి ద్రవ్యాన్ని ఇచ్చి కన్యను తెచ్చుకొని పెళ్లిచేసుకునేవాడు. ఇప్పుడు ఆ ఆచారం మారిపోయింది. అనుశాసన బద్ధమూ, నియమ నిష్ఠా గరిష్ఠమూ అయిన గృహ జీవన వ్యవస్థను నెలకొల్పడానికే వివాహమనేది ఏర్పాటయింది. స్త్రీ పురుషుల మనస్సులు కలసిన-కలపోసికొన్న సంసారమే సుఖప్రదం. అటువంటి సుఖ జీవనానికే వివాహం. మరి అలాంటి వివాహానికే ద్రవ్యమిచ్చి కన్యను కొనడం. కొనితెచ్చుకొన్న ఆ యువతి ఏడుస్తూ కూర్చుంటే ఓదార్చలేని పురుషుడేం చేస్తాడు: తానూ ఏడుస్తాడు. అటువంటి

స్థితి ఆ సంసారానికి కలుగకూడదనే అందరూ ఆశిస్తారు. ప్రహేళికకున్న బాహిరార్థం వల్ల ఇలా ఊహిస్తాం కాని అది హార్మోనియం అని తెలిసినప్పుడు ఆనందిస్తాం. ఇది పెద్దలుపయోగించే వినోద పరికరమైనా, ఆసక్తి ఉన్న పిల్లలు నేర్చుకుంటారు పెద్దల మాటల్ని అనుకరిస్తారు. అందువల్లనే ఇది జానపద బాలబాలికల పొడుపుకథ య్యింది. ఇక ఈ క్రింది రెండు పొడుపు కథలు అచ్చంగా పిల్లలకు సంబంధించినవే.

* ఊదితే మొత్తుకుంటడు (పీకె)

* కొడితే ఉరుకుతడు (చెండు లేదా బిళ్ల)

బాలురు పచ్చి తంగెడు కట్టెలు కోసుకొంటారు. పైతోలు ఏ మాత్రం చెదర కుండా లోని కట్టెను తీసివేస్తారు. తోలుతో పీకెలు చేస్తారు; ఊదుతారు. అంతే గాకుండా పెద్దలూదే కొన్ని రకాల గొట్టాల్ని కూడా పీకెలనే అంటారు. ఊదిన ప్పుడు నాగస్వరాన్ని పోలిన ధ్వని బహిర్గతమవుతుంది.

చేతితో కొడితే చెండు ఉరుకుతుంది. గనెతో కొడితే బిళ్ల ఉరుకుతుంది. బాలబాలికల వినోద క్రీడా పరికరాల్ని కూడా ఇలా పొడుపుకథల్లో చొప్పించడం చూస్తే పొడుపుకథా నిర్మాణానికి ఏ వస్తువు కూడా అనర్హమైంది కాదని అనాల్సి వస్తుంది.

* పోత పోత మాతాత
పొక్కాల సేతి వెట్టె (జకముక సంచి)

తాతగారికి నడుస్తూనే చుట్ట త్రాగే అలవాటుంది. అతనివెంట ఎప్పుడూ చెకుముకి సంచి ఉంటుంది. అందులో ఒక ఉక్కుతునక, చెకుముకిరాయి, దూది ఉంటాయి. చుట్టలో పొగాకు నింపాక నిప్పు కావాలి. చెకుముకి రాయిపై దూదిపెట్టి ఎడమచేత అణగబట్టి, కుడిచేత ఉక్కుతునకను పట్టి, రాయికీ దూదికి రాచుక పోయేట్టుగా గీస్తాడు వెంటనే నిప్పురవ్వలు దుముకుతాయి. దూది అంటుకొంటుంది. ఆ దూదిని చుట్టమీద పెట్టి ఇక పొగను పీలుస్తాడు. తాతగారు పోతూ పోతూ పొక్కాలో చేతి పెట్టెనాడంటే సంచిలో చేతి పెట్టాడనే అర్థం.

* ఏనుగంత గుండుమీద
ఎండ్రకాయ పుంగిరిపూసె (మోటబిల్ల)

పుంగిరి (పింగిరి) అనేది బాలబాలికలు అల్లిబిల్లిగా చేతులు బిగబట్టి, ఇద్దరి కాళ్లు ఒకదగ్గరికి చేర్చి వెనక్కు వాలిపోయి ఆడే ఆట. కాళ్లు నిల్చదన్ని గుండ్రంగా తిరిగేప్పుడు చింతకాయ తొక్కుల తేలుండే-అప్పుడే నా పెండ్లవుతుండె' అని ఒకటి ఒకరు, ఇంకొకటి ఇంకొకరు అంటూ ఆడుచుంటారు. అదేవిధంగా పై పొడుపుకథ రెండు పాదాలు అంటారు. ఏనుగంత గుండంటే మోట అనీ, ఎండ్ర కాయ అంటే మోటబిల్ల అనీ అర్థం మోటగొట్టేప్పుడు మోటబిల్ల వెనుకకు ముందుకు గిరగిర తిరుగుతుంది. ఆ తిరగడమే పింగిరి అనే చిందులువేసినట్లుందని అర్థం.

వృత్తికి ఉత్పత్తికి తోడ్పడే పరికరాల్ని గూడ వినోదార్థం ఉపయోగించు కొనే జానపద బాలబాలికల అంతరంగాలు అమృతోపమానాలని అందాం; వారు ఖాద్య పదార్థాల్ని పొడుపుల్లో కూర్చుకొన్న సంవిధానాన్ని సంభావిద్దాం.

## 2-5-6-7 : ఖాద్య విశేషాలు

ప్రపంచంలో మానవోపభాగ్యం కానిదేదిలేదు ప్రాణశక్తి ఉన్నంతవరకు దేహం దేహేంద్రియాల అనుభవాల్ని ఆకాంక్షిస్తుంది. కొన్ని కొన్ని సమయాల్లో ఆ వస్తుగత ఆకాంక్ష ఆ వస్తు సందర్శనానంతరమే ఉన్నట్లు తెలుస్తుంది. వాసన లనేవి ఉంటాయి. అవి బహిర్గతం కావడానికి ప్రేరణలవసరం. ఇంద్రియ వలయ పరివేష్టితుడైనదేహి, ఇంద్రియాంతర్గతుడైన దేహి భిన్నుడు కాడు. అందు వల్లనే మనిషికి ఖాద్యపదార్థాలకు సంబంధించిన ఆపేక్షలు మనస్సంబంధులూ దేహ సంబంధులూ అని భావించాలి.

జానపదులు, జానపద బాలబాలికలు ఈ భావనలకతీతులుకారు. వాటిపై తమ అభిప్రాయాల్ని, వాటి వైశిష్ట్యాల్ని అందరూ వెల్వరించిన విధంగానే వారు కూడా ప్రకటించారు, కాని నాగరికుల వస్తు పరిచయజ్ఞానం, జానపదుల వస్తుపరి చయ జ్ఞానం, భిన్నభిన్నాలుగా ఉండడం అనేది వారిమాట, పాట, ఆటలవల్లనే వ్యక్తమవుతోంది. జానపద బాలబాలికలు ఎటువంటి ఖాద్యపదార్థాల్ని ఎలాఎలా ప్రహేళికల ద్వారా ప్రకటించారో పరిశీలిద్దాం.

* మాతాత మూడెద్దులను
కాలపవతల నుండి తీసుకొస్తుంటే
ఒక ఎద్దు మునిగింది
ఒక ఎద్దు తేలింది
ఒక ఎద్దు కరిగింది (వక్క, ఆకు. సున్నం)

తాంబూల చర్వణం నాగరికులే కాదు జానపదులు కూడా చేస్తారు. తనతాత గారికి కలిగిన అనుభవాన్ని మనుమడు తనతోటు పిల్లలతో పొడుపుకథా రూపంలో అంటున్నాడు. వక్కనూ, ఆకునూ, సున్నాన్ని ఎడ్లుగా రూపకీకరణంచేశాడు. వక్క నీట మునుగుతుంది; ఆకు నీట తేలుతుంది; సున్నం నీట కరుగుతుంది. ఎద్దు మునగ వచ్చు, తేలవచ్చు, లేదా సగం మునగవచ్చు, సగం తేలవచ్చు కాని కరగవు. అందువల్ల ఇందులో ఎదో మర్మముందని ఆ పొడుపుకథ విన్న బాలబాలికలు గుర్తిస్తారు; ఆలోచించి సమాధానిస్తారు.

* గట్టు తగలడుతుంటే
గుడ్డలు ఎండేస్తారు (రొట్టెలు లేదా అట్లు)

ప్రమాదవశాత్తు ఏదైనా కాలిపోతుంటే తమతమ శక్తి మేరకు సహాయం చేస్తారు. నీరుపోసేవారు, ఇసుక చల్లేవారు, పిల్లల్ని రక్షించేవారు, వస్తువుల్ని భద్రపరచేవారు, మంట చుట్టు ప్రక్కల గృహాలకు పోకకుండా ముందు జాగ్రత్త తీసుకొనే వారు, ఉడతాభక్తి సేవలు చేసేవారు ఉంటారు. కాని నాకేమి పట్టిందని తమ పనిలో తాము మునిగిపోయే వారొక రిద్దరుంటారు. సామాజిక విపత్తును ఎదు ర్కోవలసిన సందర్భంలో అందరు చేయి వేయవలసిందే. సామాజిక శరీరానికి వ్యక్తి అవిభాజ్య లవయవంగా వర్తించాల్సింవే. పైకి చప్పిన ఇన్ని విషయాలు మెరసినా జానపద బాల బాలికలు ఆశించిన అర్థం వేరేఉంది. గట్టు తగలడుతుంటే అంటే పొయ్యి మండుతుంటే అని అర్థం. గుడ్డలు ఎండవేయడం అంటే రొట్టెలు లేదా అట్లను గాల్చడం అని అర్థం.

* ఎట్టని ఆకును విరిస్తే
పటపటమని విరిగిపోవు (అప్పడం)

అప్పడం దోరగ వేగితే ఎఱ్ఱ రంగు వస్తుంది. ఆకును విరిచినప్పుడు ధ్వని రాదు. కాని బాగుగా వేగిన అప్పడం పటపటమనే ధ్వనితోనే విరిగిపోతుంది. ఈ అనుభవాలు నాగరిక బాల బాలికలకు కూడా ఉన్నాయి.

* ఆకులేని చెట్టు
అరవై పుట్లు పండె (ఉప్పు)

పదార్థానికి రుచిని ఇచ్చే గుణం ఉప్పుకుంది. అది ఒక రకమైన మట్టేఅనాలి. సాంద్ర సంతృప్త ద్రావణం ఘన స్వరూపమే ఉప్పు. అది ఒక పంట. వీరూ వారూ అనక ప్రపంచమానవాళి సమస్తంఉపయోగించుకునే పంట. దాని ఉత్పత్తి గణనీయంగా ఉంది జానపద బాల బాలికల దృష్టిలో అరవై పుట్లంటే సర్వ మానవాళికి అందేంత రాశి అని అర్థం. ఆకులేనిచెట్టు భూమికావాలి లేదా సముద్రం కావాలి. విశ్వ ప్రజానీకానికి ఉపకరించే వృక్షాన్ని స్వల్పంగా ఊహించడం జానపదునికి సాధ్యంగాని పని అట్లే మహార్థ గుణసంపన్న పరమోత్తమ పదార్థాన్ని ఒక్కరికన్వయించినప్పుడు కొండను అద్దంలో పట్టి చూపినట్లు చూపాల్సి వస్తుంది. ఇటువంటి భావనల్లో సంపూర్ణంగా లీనమైపోయినవారు జానపద బాల బాలికలు

* ములుకోల కట్టెకు
మున్నూరు ముత్యాలు (సజ్జకంకి)

ఆకులేక, ఈకలేక, తోకలేక బోడగ పొడుగ్గా ఉండేది ముల్లుగఱ్ఱ. ముల్లుగఱ్ఱకు మున్నూరు ముత్యాలట. ముక్కుకు ధరించేది ముత్యం. దాదాపుగా దేహోపరిభాగమే అనాలి. అట్లే ములుగఱ్ఱను బోలిన దానికి ఉపరిభాగంలో ముత్యాల్ని బోలిన ధాన్యముండాలి, అట్లుండేది సజ్జ (సద్ద). సజ్జకంకి మూరెడంతఉంటుంది. జేనెడంత ఉంటుంది. మున్నూరు ముత్యాలని సజ్జకంకిని భావించడంవల్ల జానపద బాలబాలికలకు ధాన్యం పైగల పవిత్రభావం సువ్యక్తమవుతుంది. ఈ సజ్జ కఱ్ఱ ఆకుల్నితీసి, ఊసవరకు విరిచేసి, చంకన పెట్టుకొని, బావి బావి తిరుగుతూ, చేను చేను చూస్తూ, ఆటలాడుతూ, పాటలు పాడుతూ పిల్లలు పరుగులు దీస్తారు.

ఖాద్య పదార్థాలలో నాటికీ నేటికీ మార్పు వచ్చింది. జానపదుల్లో చాలామంది నేడు జొన్నకలి, జొన్న యంబలి, జొన్న పిసరును తిడం మానివేశారు. జొన్న రొట్టె, సజ్జరొట్టె, సన్నన్నాల్ని తింటున్నారు. పంటల్లో కొద్ది మార్పులు మాత్రమే వచ్చాయి. వరి, జొన్న పూర్వంనుండి పండుతూనే ఉన్నా ఈ రోజుల్లో ఆర్థిక దృష్టితో వ్యాపారధాన్యం వైపు మొగ్గడం జరుగుతోంది. ధాన్య మూల్యాల్ని అనుసరించి పంటల్లో కూడా మార్పులుచేస్తున్నారు.

## 2-5-6-8 : వ్యావసాయక సంబంధులు

భారత దేశానికి రైతే వెన్నెముక. నూటికి ఎనభైమంది వ్యవసాయ జీవనం గడుపుతున్నారు. ఇక జానపదుల్లో సగానికి పైచిలుకు వ్యవసాయ దారులే. నేడు వ్యవసాయ కూలీలుగా పిలువబడుతున్న వారికేందరికో సొంత క్షేత్రాలు ఏర్పడ్డాయి. వాళ్ళంతా సన్నకారు రైతులు. గ్రామాల్లో వృత్తిపనులు చేసే చాలామందికి ఈనాడు స్వీయ క్షేత్రాలున్నాయి. గ్రామీణ జానపదుల్లో ఎక్కువ మంది వ్యావసాయక జీవనాన్ని నమ్మిన వాళ్లే; వారి బాలబాలికలు ఆ కృషిలో వారికి తోడ్పడే వాళ్లే. ఆ కారణం వల్ల వ్యవసాయానికి సంబంధించిన అనేక విషయాలు ఆ పిల్లలకు కొట్టిన పిండి అయ్యాయి. తమ జీవనంలో అంత సన్నిహితమైన వ్యావసాయక పరికరాల్ని వారేవిధంగా పొడుపుకథల్లో నిక్షేపించారో పరిశీలిద్దాం.

* చెట్టుకొడుతుంటే
పిట్ట పారిపోయింది (పేడు)

చెట్టుకొట్టేప్పుడు పిట్టలెగిరి పోతాయి. ఇదిసహజ విషయం అనిపిస్తుంది దీనేం పొడుపుకథ అనుకోవచ్చు. బాలబాలికలను నిత్యంచూసే విషయాన్నే పొడుపుకథగా మలచారు. చెట్టు గొట్టే సమయంలో గొడ్డలి దెబ్బకు చెట్టుపేళ్లెగిరి పోతాయి. కొన్ని పేళ్లెగిరినప్పుడు పిట్టలు లేచిపోయిన ధ్వని లాగానే వినిపిస్తుంది. నిర్జీవమైన పేడునుకూడా పిట్టగా భావించే జానపదుల పిల్లల చైతన్య దృష్టి నాన్యతో దర్శనీయం.

* కిందగడ్డ
నడుమ బెంకు
పైన సెండు (ఉల్లి)

వ్యవసాయదారుల పిల్లలు అల్లిన పొడుపుకథ ఇది. ఉల్లికి గడ్డ కిందనే ఉంటుంది; అనగా మట్టిలో ఉంటుంది. దాని పైన బెంకుంటుంది. ఉల్లికాడ గట్టిగా ఉండదు. బెండంటే గట్టితనంలేనిది; చేవలేనిది అయిన తేలిక కాడ. ఆ కాడపైన బంతివలె ఉల్లిపువ్వుంటుంది.

* చేను సెలక తిరిగివచ్చి
ఇంట్ల పదిపైసలంత చోట
నిలబడ్తది (చేతికఱ్ఱ)

చేనూ చెలక తిరిగే తాతలు చేతికఱ్ఱ ధరిస్తారు. వారుతిరిగిన ప్రదేశాలన్నీ ఈ కఱ్ఱలు తిరుగుతాయి. ఇంత తిరిగినా అది ఇంటికి వచ్చి పదిపైసలకెంత స్థలం కావాలో అంత స్థలంలో నిలబడుతుంది. తాతగారు కుక్కిమంచంలో ఉంటారు; తాతకఱ్ఱ మూలన ఉంటుంది. ఈ పరిశీలన జానపద బాలబాలికలదే. కనుకనే చేనూ చెలక అనే పదాల్ని ప్రయోగించారు.

* గట్టున ఆంబోతు
రంకె వేస్తుంది (గొడ్డలి)

కోడెలలో కొన్నిటిని పని గట్టకుండా వదిలేస్తారు. వాటిని దేవుని కోడెలంటారు. ఆంబోతులంటారు.ఇవి బాలబాలికల్ని లెక్కపెట్టక చేనులో ప్రవేశిస్తాయి కడుపునిండాతినిచేని వెలుపలికి వస్తాయి. చేను గట్టున నిలబడి తమ పరాక్రమం ప్రకటనం చేస్తాయి; అంటే గట్టిగా రంకె వేస్తాయి. ఈ దృశ్యం జానపదుల పిల్లల మనస్సులో ఉంది చెట్టుగొట్టేప్పుడు గొడ్డలి తాకిడి చప్పుడు వస్తుంది. ఆ చప్పుడు ఆంబోతు రంకె రెండూ ఒక్కటే అనిపించాయి. అందువల్లనే గొడ్డలి దెబ్బచప్పుడు ఆంబోతు రంకేగా సంకేతించారు. బాలబాలికలు.

* మా ఊరెద్దు మీ ఊరికి పోదు
మీ ఊరెద్దు మాఊరికి రాదు (చెట్టు)

చెట్లకు ప్రాణముంది; కానికదలవు. కదలిన వెక్కడో ఉన్నా కనిపించడం లేదు. అందువల్ల వాటిని ఎద్దులుగా ఉపమించి పిల్లలు పొడుచుకుంటున్నారు.

శాస్త్రీల సెన్నప్ప
నేల గీరప్ప (పార)

పొడుపు కథల్ని శాస్త్రాలనీ అంటారు. ఎక్కువగా పొడుస్తున్న బాలుణ్ణి చూసి మరో పిల్లవాడన్న పొడుపు ఇది. వ్యవసాయపు పనుల్లో ఎరువు వేసేప్పుడు వరంతిసేప్పుడు, కళ్లంచేక్కేప్పుడు, నేలగీరేది పార. అందుకే చెన్నప్పను గీరప్పతో గీకారు. వ్యావసాయక జీవన సంబంధులైన పొడుపు కథలెన్నో బాలబాలికలు ప్రయోగించుకొంటున్నారు. ఇవేగాక వృత్తి కళా సంబంధులైన పొడుపు కథలు కూడా ఉన్నాయి.

## 2-5-6-9 : వృత్తి కళాసంబంధులు

భారతీయ సమాజంలో అనాదికాలంనుండి ఉన్న వృత్తులు కేవలం పొట్ట కూటికొరకుగాక కళాత్మక మూల్యాలకు ప్రాధాన్యమిచ్చి ప్రపంచప్రసిద్ధి గాంచాయి. ప్రతిభావంతులైన వృత్తి కళాకారులెందరో విదేశీయుల పీడన తాడనలకు గురి అయినా తమ వృత్తుల్ని విడనాడలేదు. భారతీయ వృత్తి కళాకారులు ప్రపంచంలోని అనేక పట్టణాల్ని రాజసౌధాల్ని దివ్య మందిరాల్ని కళామయం చేశారు. విదేశీ నిరంకుశ రాజరికం పదఘట్టనలకు గురి అయినా వృత్తికారుడు కళా కౌశల్య ప్రదర్శనలో ఏమరు పాటును చూపలేదు. ఇప్పటికీ గ్రామాల్లో వృత్తులే జీవనాధారంగా నిలుపుకొన్న వారున్నారు; కాని కళాత్మక మూల్యాలు వెనుక పట్టుపట్టాయి. వృత్తి ఆర్జనార్థమే అనే నమ్మకం బలిసి పోయింది; వీరిలో అనేకమంది జానపదులే. వీరి జీవనాన్ని పరిశీలించిన జానపద బాలబాలికలు వారిని కూడ తమ పొడుపు కథల్లోకి లాక్కొని వచ్చారు.

బట్టలు తెల్లగా ఉతికి చలువలు చేసే చాకలి, మట్టిని తొక్కిసారెపైకి ఎక్కించి కుండలు చేసే కుమ్మరి, జీబురు నెత్తిని క్రమబద్ధంగా కత్తిరించే మంగలి, పోగు పోగును అతికి బట్టలునేసేపద్మశాలి, చెట్టును గీసి కల్లుతీసే ఈడిగ, నిగనిగలాడే చెప్పుల్ని సిద్ధంచేసే మాదిగ, సర్వాంగ సుందరంగా బుట్టలనల్లే మేదరి.... ఒక్కరా ఇద్దరా వృత్తికళాకారులెందరో జానపద బాలబాలికల పొడుపు కథల్లో చోటు చేసుకున్నారు.

* చలిలేక నిప్పులో కాగేవాడు
తాపంలేక చెరువులో నానేవాడు
బతికుండి గోతిలో కూర్చుండేవాడు
ఏ ఊళ్లోనైనా ఉన్నారు,

(కంసాలి, చాకలి, పద్మశాలి)

ఈ పొడుపు కథ జానపద బాలబాలికలనుండి శిష్టజన హృదయాలకెక్కింది. సొమ్ములు చేసే కంసాలి చలి లేకున్నా నిప్పుదగ్గరే ఉంటాడు. బట్టలుతికే చాకలి తాపంలేకున్నా నీటి దగ్గరే ఉంటుంది. మగ్గం నేసే పద్మశాలి బ్రతికిఉండి గోతిలోనే ఉంటాడు. వీళ్లు ఏ ఊరిలోనైనా ఉంటారు. సామాజికానుభవాల్ని వీరిజీవనాల్ని అధ్యయనం చేసిన పెద్దలెవరో దీనిని పొడిచారు. అది పిల్లలనోట ఆడుతుంది. గ్రామీణ జీవనరంగంలో ఈ మూడువృత్తులకు సముచిత ప్రాధాన్యముంది.

* కోస్తుండంగనే
మల్ల పెరిగొచ్చె (కుమ్మరి సారెమీద కుండ)

మెత్తగా చేసిన బంకమట్టిని కుమ్మరి సారెపై వేస్తాడు. "కాళ్లు పంగటించి కామ సేతవట్టి—తూటులేని లాన నేటుగ పొడిచి ..." చక్రాన్ని గిర గిర తిప్పుతాడు తన హస్తనైపుణ్యంతో కుండలు సిద్ధం చేస్తాడు. కుండ పెరుగుతుంటుంది. చాకువంటి మూరెడు పొడుగు గల కట్టె బద్దతో కుండ రూపం చెడకుండా కోస్తాడు. అది పక్కన పెడతాడు. వెంటనే మరి ఒకటి సిద్ధమవుతుంది. బాలబాలికలిది గుర్తించే 'కోస్తుండంగనే మల్ల పెరిగొచ్చె' అనే పొడుపు కథను కల్పించారు.

* గుట్ట చుట్టు పిట్ట తలకాయలు (లొట్లు)
* ఊరి బయట కుమ్మరోడు రిపెట్టుకునే (లొట్టి)

కుమ్మరి చేసిన కుండల్ని అనేకులనేకరకాలుగా ఉపయోగించుకుంటుంటారు. ఈడిగ చేతపడితే లొట్టి లంటారు. గొల్లెత చేత బడితే దుత్తఅంటారు 'కల్లులొట్టి, చల్లదుత్త' అనే మాటలు వ్యవహారంలో ఉన్నాయి. గీచాక తాటి చెట్టు చుట్టు లొట్లు

కడతారు. ఒట్టును గుట్టగా, తొట్లను పిట్టతలకాయలుగా సంకేతించారు జానపదుల పిల్లలు. ఈత పెట్టుకుంటున్న ఒక్కలొట్టినే కడతారు. ఏలొట్టిమెడకైనా త్రాడు గట్టి వ్రేలాడ దీయవలసిందే. అలా వ్రేలాడ దీసిన దానిని 'కుమ్మరోడుకి పెట్టుకు'న్నట్లుగా భావిస్తున్నారు పిల్లలు. అలంకారికుల లక్షణాలెరుగని బాలబాలికలు సహజాలంకార విభూషితులయ్యారు.

* పొరల పొరల గువ్వ—పొంకమైన గువ్వ
రాజుమెచ్చిన గువ్వ-రంగసాని గువ్వ
తిరుపతి గట్లన్ని-తిరిగి తిరిగొచ్చె (గంగెద్దు)

గంగెద్దుల ప్రదర్శనలు బాలబాలికలకు వినోదాలు. ఆడించే వారికది వృత్తి. ప్రతిభావంతంగా ఆడించడం వల్ల కళా సౌందర్యాలు భాసిస్తాయి. గంగెద్దుపై వస్త్రాద్యలంకరణలు ఉంటాయి అవి పొరలు పొరలుగా ఉన్నట్లు బాలబాలికలు భావించారు. గంగెద్దు పుష్టిగా నున్నగా ఉంటుంది. అందుకే పొంకమైందని అన్నారు. వన్నెలుండడం వల్ల నున్నగా ఉండడం వల్ల గంగెద్దును రాజు మెచ్చుకుంటాడు; రంగసాని మెచ్చుకుంటుంది. అంతగా బలువడానికి ఎక్కడెక్కడో తిరగాలి; కడుపు నింపాలి; తిరిగి రావాలి.

పదపదానికి శబ్ద సౌందర్యం, అర్థ సౌరభ్యం గుబాళించే జానపద బాల బాలికల పొడుపు కథలు, జానపదుల పదకవిత్వానికి ముక్తక గీతాలకూ పరాకాష్ఠలు. అటువంటివే అయినా ప్రశ్నాత్మక ప్రాధాన్యం ద్వారా పొడుపు కథల ఛాయలున్నట్లనిపించే బాలబాలికల ప్రహేళికల్ని స్పృశిద్దాం.

## 2-5-6-10 : ప్రశ్నా ప్రాధాన్యాలు

స్త్రీజంతువు ముఖం, సింహ శరీరం, పక్షి రెక్కలున్న స్ఫింక్స్ అనే ఓ విచిత్ర మృగం ఒకటి గ్రీకు పురాణాల్లో ఉంది. ఈ విచిత్ర ప్రాణి పర్వత సమీపాన ఉండి ఆ దారిన వచ్చేవారిని ప్రశ్నించేది. ఆ ప్రశ్న సరిగ్గా పొడుపు కథా లక్షణాల్ని పోలిఉండేవి ఆ ప్రశ్నకెవరైతే సమాధానం చెప్పరో వారిని చంపి ఆ జంతువు తినేవి. భారత మహేతిహాసంలోని యక్ష ప్రశ్నల వంటి ఈ వృత్తాంతం విశ్వసాహిత్యంలోని పురాగాథల సామ్యానికి నిదర్శనం.

జానపద సాహిత్యంలో కూడా ప్రశ్నా ప్రాధాన్యం వహించిన సంవాదాత్మక గేయాలెన్నో కనిపిస్తున్నాయి. పొడుపు కథల్లోనూ ఇటువంటివి ఉన్నాయి. కాని వాటిలో ప్రశ్నకన్న వస్తువే ప్రాధాన్యమై ఉంటుంది. బాలబాలికల ప్రశ్నా ప్రాధాన్యాలైన ప్రహేళికల్లో వస్తువుకన్నా అందులోని ప్రశ్నాత్మక క్రియా శబ్దానికే ప్రాధాన్య ముంటుంది. ఇవి అచ్చంగా జానపదుల పిల్లలకు సంబంధించినవే అనిపిస్తాయి. నాగరికుల బాలబాలికులకు సంబంధించిన ప్రశ్నాప్రాధాన్య ప్రహేళికలు కూడా ఎన్నో కనిపిస్తున్నాయి. తమకు అతి సాన్నిహిత్యమున్న కొన్ని వస్తువుల్ని గానీ, ఆ వస్తు స్వభావాల్ని గానీ, లేదా వాటికి విరుద్ధాల్ని గానీ ఈ ప్రశ్నల్లో అడుగుతారు.

ప్రశ్న అడిగిన పద్ధతిని బట్టి, తదందర్గత భావాన్ని బట్టి పృచ్ఛించిన వారి మనస్తత్వాన్ని గురికిబెత్తెడు గుర్తించవచ్చు. జానపదుల పిల్లలకు సంబంధించిన ప్రశ్నా ప్రాధాన్యాలైన పొడుపు కథల ద్వారా వారి మానసిక వికాసం, వస్తు పరిచయ జ్ఞానం సువ్యక్తమవుతోంది.

* ఈ ఊరి కల్లుగాదు–ఈతకల్లుగాదు
తాడూరి కల్లుగాదు—తాటికల్లుగాదు
కల్లుగాని కల్లేం కల్లు (ఉప్పుగల్లు)

అది కల్లుగాని కల్లు; అంతటా వ్యాపించి ఉన్న కల్లు; ఇంతకూ అది ఉప్పుగల్లు. ఈ ప్రశ్నా ప్రహేళికను ఈ క్రింది విధంగా కూడా అడుగుతారు.

* కల్లుల్లో కల్లు ఏకల్లెక్కువ (ఉప్పుగల్లు)

వివరణ అవసరంలేని ఇలాంటి పొడుపు కథలు ఎన్నో ఉన్నాయి. మచ్చుకు కొన్ని ఉదాహరిస్తాను.

* చెరువుల నీళ్లెట్లుంటయ్? (కట్టేస్తె ఉంటయ్)

* ఆవు ఎట్లుంటది? (కట్టేస్తే ఉంటది)

* గట్టుల్లో ఏగట్టు పెద్ద (కరిగట్టు)

* దూలాల్లో ఏదూలం పెద్ద! (ముక్కుదూలం)

* వంకాయ - బెంకాయ
కనుమ కాయ యేంది? (తలకాయ)

* రాళ్లగాని రాళ్లెన్ని? (ఉప్పురాళ్లు-ఏరాష్ల-బేరాష్ల
పెయిరాళ్లు-కీసురాళ్లు)

* గడ్డామి-సొప్పామి
కనుమ వామేంది? (సమ్మరామి)

* ఆకులేని కాయేది!
తొడిమలేని పండేది? (ఆకులేనికాయ లింగం కాయ
తొడిమలేని పండు విభూతి పండు)

* కాయగాని కాయలెన్ని!
(ఎండ్రకాయ-మొట్టికాయ-తలకాయ)

* పండుగాని పండు! (తలపండు)

* వంకగాని వంక! (గోడవంక)

'నువ్వుకట్టెను జాడిస్తే నూర్ల కొద్ది పిల్ల' లన్నట్లు జానపదుల నెవరిని కదిలించినా వందలకొద్ది పొడుపు కథలు పుట్టుకొస్తాయి. కొద్ది అర్థభేదాలతో, కొద్ది పదభేదాలతో ఎన్నో ఉన్నాయి. బాలురూ పెద్దలూ పెక్కుపర్యాయాలు పొడిచినవే పొడుస్తుంటారు.

ఇంత వరకు చర్చించిన బాలబాలికల ప్రహేళికల్లో ఏ శీర్షిక క్రిందికి రాక మిగిలిపోయినవి కొన్ని ఉంటాయి. వాటిని పొడిచిన అర్థాన్ని బట్టో, విప్పిన భావాన్ని బట్టో ఏదో ఒక శీర్షిక క్రిందికి తేవచ్చు. లేదా వాటిని బట్టి మరొక శీర్షిక నివ్వవచ్చు. కాకున్న ప్రకీర్ణక ప్రహేళికలనవచ్చు. మొత్తంమీద జానపద బాలబాలికలు ప్రకృతి రామణీయకతకు అద్దంపట్టే తరులతా పుష్పాదుల్ని, అటు ప్రకృతి సంరక్షకాలుగా ఇటు మానవ సేవకులుగా విశిష్ట బాధ్యతల్ని నెర వేరుస్తున్న మానవేతర ప్రాణుల్ని, ప్రకృతినీ పశుపక్ష్యాదుల్నీ మానవీకరింప

జేసుకొనే మానవ సంబంధుల్ని, జడ చైతన్యాల స్థితికీ గతికీ ప్రగతికీ ఆధార భూతాలైన పంచభూతాల్ని, నిత్య జీవన పథాన్ని నిష్కంటకం చేసే గృహపరికరాల్ని, జీవనానంద సాధనాలైన వినోద పరికరాల్ని, భౌతిక శారీరక తృప్తికి సహకరించే ఖాద్య విశేషాల్ని. దేశ సౌభాగ్యానికి మూలమైన వ్యావసాయక సంబంధుల్ని, వృత్తి ఉత్పత్తికి మూలమైనవైనా శాశ్వత జీవన మూల్యాల్ని అందించే వృత్తి కళా సంబంధుల్ని, పృచ్ఛించడమే విజ్ఞాన ప్రచార ప్రసార సాధనమని తెలిపే ప్రశ్నా ప్రాధాన్యాల్ని తమ అనుభవ పరిమళాలకు జోడించి పొడుపు కథల పూల చెండుల్ని గట్టి ఆఘ్రాణించే వారి కందించారు. ప్రహేళిక మల్లికామాలికలనల్లి దరిజేరిన వారి గళసీమ నలంకరించారు. ఆ అక్షయ పరిమళాల్లో మునిగి తేలుతూ పరమార్థం వైపు పయనిద్దాం. తాత్త్విక ప్రహేళికల్ని పరామర్శిద్దాం.

## 2-5-7 : తాత్త్విక ప్రహేళికలు

వేదాలు సూత్రించిన ఉపనిషత్తులు ప్రవచించిన పరబ్రహ్మతత్త్వాన్వేషణం అనాదిగా కొనసాగుతూనే ఉంది. తత్త్వచింతనమనేది మానవ జీవనంలో పెన వేసుకొనిపోయిన ఒక అంశమయింది. ప్రాణి ప్రకృతుల సత్య నిరూపణార్థం తత్త్వచింతనమావిర్భవించింది. శాస్త్రీయ విజ్ఞానం ప్రపంచంలోని అన్ని దిశల్ని స్పృశించని కాలంలోనే ప్రకృతి పరతత్త్వాల్ని గూర్చి పంచ భూతాల్ని గూర్చి చింతన ప్రారంభమయింది. భౌతిక సత్యాల్ని శాస్త్రీయ విజ్ఞానం వెల్లడిస్తున్నా మనిషికి సంతృప్తి కలగడంలేదు. అందువల్లనే కర్మకాండకు, జ్ఞాన కాండకు సంబంధించిన విషయాలతో, తద్వివరణాలతో, తర్కాలతో బృహద్గ్రంథాలావిర్భ వించాయి; భారతీయ జనతలో ఏకొందరో ఈ విషయం తెలిసిన వారు. జానపదులు ఈ గ్రంథాల ముఖం కూడా చూడలేదు. కాని వారు ఉపనిషద్ వేదాంత భావనాలంబితమైన సాహిత్యాన్ని అతివేలంగా సృష్టించారు. స్పష్టాస్పష్ట జానపద మార్మిక కవిత్వాన్ని కుప్పలుగా కుమ్మరించారు. అవి కాల జ్ఞానతత్త్వాలుగా, ఆత్మబోధామృతాలుగా, కలి ప్రమాణాలుగా ఇంకా అనేక నామాలతో పిలువ బడ్డాయి. ఆయా వ్యక్తుల నామాల్ని బట్టి తత్త్వాలని పిలువబడ్డవి కూడా కొన్ని ఉన్నాయి. జానపద సాహిత్యంలోని పారమార్థిక గేయాల్ని తమ తమ గ్రంథాల్లో

పరిశోధకులెందరో ఇంతకు మునుపే చర్చించారు.[1] ఇక ఇక్కడ పొడుపు కథల ఛాయలున్న కొన్ని ప్రహేళికల్ని పరిశీలిద్దాం. తత్త్వంలో కర్మజ్ఞాన భక్తులు అవిభాజ్యాలైనందువల్ల ఈ పొడుపు కథల్ని కర్మ సంబంధులనీ, జ్ఞాన సంబంధంలనీ భక్తి సంబంధులనీ విభజిద్దాం.

## 2-5-7-1 : కర్మ సంబంధులు

భారతీయ తాత్త్విక జీవనంలో కర్మకు అత్యంత ప్రాధాన్యముంది. కర్మ మన్నంతనే నిత్యానుష్ఠాన జీవన కార్యక్రమాలకు అతి దూరమయిందని కొందరు భావిస్తుంటారు. జీవితాన్ని అనుశాసన బద్ధంగా తీర్చిదిద్దుకోడానికి, మానవుణ్ని క్షణక్షణ కర్మానుగామిగా రూపొందించడానికీ, చేసేపనికి పవిత్రత నాపాదించడానికి మాత్రమే కర్మకాండ ఆవిర్భవించింది. ఇటువంటి కర్మలు నిత్య నైమిత్తిక కామ్య నిషిద్ధాలని నాలుగురకాలు. భారతీయులు స్మృతి శాస్త్ర సిద్ధాంతానుసారులై అనాది కాలం నుండి ఇటువంటి కర్మల్ని ఆచరిస్తూనే ఉన్నారు. సమాజంలో కాలక్రమంగా వచ్చిన పరిణామాల్ని పరిశీలిస్తూనే కర్మకాండలో అనేక పరివర్తనలు తెచ్చారు. కర్మ శాస్త్రాలు ధర్మ శాస్త్రాలు చాందసాలైన ఛాదివాదాలకు ఎగలేదు. కరడుగట్టిన మానిసులుగా వ్యక్తుల్ని సిద్ధం చేయలేదు. సమాజ శ్రేయస్సునే ఆకాంక్షించాయి. సత్కర్మకు అధిక ప్రాధాన్యం ఇచ్చాయి. ఆ కారణాన్నే జానపదులు పుస్తకాల్ని చూడకున్నా తద్విషయ జ్ఞానాన్ని కర్ణా కర్ణిగా ఆకర్షించి మస్తకాల్లోకి ఎక్కించారు.

జానపదులు శాస్త్రాలనీ మర్మాలనీ పొడుపు కథలని చెప్పుకొనేట్టి ఇవి. ఎవరు కట్టిన తత్త్వాల్లోనివో పరిశీలించాల్సి ఉంది ఏ తత్త్వాల ఛాయలు వీటిపైపడ్డాయో గుర్తించాల్సి ఉంది.

కుంటఎండే - కుంట ఎండే

కుంట ఎన్కా - పంట పండే

1. తెలుగు జానపద గేయ సాహిత్యము-పు : 359-440
   తెలుగు కన్నడ జానపద గేయాలు-పు : 72-111
   పల్లె పదాలలో ప్రజా జీవనము-పు : 184-203

పంటగోసి - కుప్పవెట్టి
కుప్పగాలే - అప్పుదేరే (కుమ్మరావం)

కుంటనిండింది; కుంటలోకి ఒండ్రుమట్టి వచ్చింది; కుంట ఎండింది; ఇక ఆ బంకమట్టి కుమ్మరికి పంటేమరి! అతడు ఆ కుంట వెనుకనే ఆ మట్టితో కుండల పంట పండించాడు. కుమ్మరి సారెపై కుండలు ఎదిగెదిగి వస్తాయి. ఆ కుండల్ని కుమ్మరి కోస్తాడు. వాటిని రకరకాల పద్ధతులతో తీర్చిదిద్దుతాడు. ఎండబెడతాడు; ఆ తర్వాత కుప్ప పెడతాడు; కుప్ప కాలుస్తాడు. ఈ కాల్చడాన్నే కుండలు వాన డం అంటుంటారు. అప్పుదేరడం కుండలమ్మిన పిదపనే జరుగుతుంది. కుంట నిండడం-ఎండడం, పంట పండడం-కోయడం, కుప్ప వెట్టడం-కాల్చడం ఈ పొడుపు కథలో ప్రధానాంశాలు.

కాలజ్ఞాన తత్త్వాల్లో ముఖ్యంగా యాగంటి వారి ఏలల్లో ఇటువంటివి ఎన్నో ఉన్నాయి. కాని ఇవి లేదు.[1] ఆకాశవాణి ప్రసారం చేసిన యాగంటి వారి తత్త్వాల్లో ఇది వినిపిస్తోంది.[2]

* కుంట నిండి పంటపండి
పంట పండి కుప్ప గాలే
కుప్పగాలె అప్పుతీరేరా — యాగంటిలింగ
దీని భావము నీకుదెలుసునా

ఇటువంటి తత్త్వాల నుండి జారి జానపదుల నోటపడి కొన్ని మార్పులతో చేర్పులతో పొడుపుకథా రూపాన్ని సంతరించుకున్నవాటిలో పై కర్మ ప్రహేళిక ఒకటి. కర్మమంటే పని. కుమ్మరి పని ఇందులో ఉంది, మర్మంతో కూడిన తత్త్వముంది. అందువల్ల తాత్త్విక ప్రహేళికల్లోని కర్మ సంబంధుల్లో ఇది చేర్చ బడింది.

---

1. కాలజ్ఞాన తత్త్వములు - సి.వి. కృష్ణా బుక్ డిపో. మదరాసు.
2. ఆకాశవాణి - హైదరాబాదు కేంద్రం-తేది : 24-4-80.

* ఆకూ లేని అడవిలోన
మేకాలైదు మెయ్యావోతే
కండ్లు లేని వాడు సూసేరా
కాళ్లలేని వాడు ఉరికేరా

(చెరువు, చేపలు, ఎండ్రకాయ, పాము)

ఆకులేని అడవి చెరువు; మేకలైదు చేపలు; కండ్లులేనిది పీత; కాళ్లు లేనిది పాము. ఈ తాత్త్విక సంబంధి పొడుపుకథననుసరించిన యాగంటి వారి తత్త్వ మొకటి కనిపిస్తోంది.

ఆకు లేని అడవిలోన
తోకలేని మృగము పుట్టె
తోకలేని మృగమూ కడుపూనా-ఓయాగంటిలింగా
ఈకలేని పక్షి బుట్టేరా![1]

ఈ తత్త్వంలో అంతూ పొంతూ చిక్కని ఇటువంటి భావాలుగల వెన్నో ఉన్నాయి. ఇటువంటి వాటినుండి దూరమై అర్థదిశకు దగ్గరై ఇవి తాత్త్విక సంబంధి పొడుపుకథలు గా మారాయి.

* ఊరులేని పాటిమీదా
పేరులేని గరిక మొలచే
నోరులేని లేడి మేసేరా
ఓరెతమ్మి ఓరి అన్న
దీనిలోని మాయ ఏంటిరా!
"ఊరులేని పాటితోలు
పేరులేని గరిక చాలు
నోరులేని లేడి కత్తి (వాలు)
ఓరితమ్మి ఓరి అన్న
దీనిలోని మాయ యిదేరా!

---

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పు : 394.

పాటి అంటే పాటినేల. సారమున్న నేల పాటినేల. ఓ ఊరు పాడుబడితే అక్కడ దిబ్బ ఏర్పడుతుంది. దానిని గ్రామీణులు పాటిగడ్డ అంటారు నెత్తి వెంట్రుకల్ని కత్తి మేసింది; అదీ విడుపు. క్షురకర్మ కర్మే. కనుక ఇది కూడా కర్మసంబంధి పొడుపు కథల్లో చేర్చడం జరిగింది.

* ముంతల సెట్టు
సెట్టుకు కాయ
కాయ పండయింది
ముంత పగులకుండ
పండు తెగుతది

(కడుపు, బీజం, పిండం, ప్రసవం)

ముంత అంటే దేహం; చెట్టంటే ఉదరం; కాయ లంటే బీజం; పండంటే పిండం; ముంత పగలకుండ అంటే శరీరం చెడకుండ; పండు తెగుతుందంటే ప్రసవమవుతుందని అర్థం. భారతీయ సంస్కృతి షోడశ కర్మల్ని ప్రతిపాదించింది. గర్భానికి గర్భస్థ శిశువుకు ఎన్నో కర్మలు చేయవలసి ఉన్నాయి. ఈ రోజు రేపు మందుల్ని ఉపయోగించడం తగిన జాగ్రత్తలు తీసుకోడం ఎటువంటిదో కర్మాచరణం కూడా అటువంటిదే. ఈ కర్మలన్నీ సంస్కారార్థం వచ్చినవే. ఆ కారణాన్నే ఈ ప్రహేళికను తాత్త్విక సంబంధమైన కర్మ ప్రహేళికల్లో చేర్చడం జరిగింది.

విడుపు కథలుండి అర్థవివరణానుకూల్యాలైన కర్మసంబంధి తాత్త్విక ప్రహేళికలు జానపదుల్లో మిక్కిలి తక్కువగా వినిపిస్తున్నాయి. అవికూడా వడ్రంగి కుమ్మరి, కంసాలి మొదలైన వృత్తి పనులు చేసేవృద్ధులు మాత్రమే పొడుస్తున్నారు. వారూ తాము పొడిచిన పొడుపుల్లో సగానికి పైగా విడుపుల్ని చెప్పలేని స్థితిలో ఉన్నారు. తాత్త్విక ప్రహేళికల్లో కర్మసంబంధుల రాశి తక్కువదే అయినా వాసి గణనీయమయిందే.

## 2-5-7-2 : జ్ఞాన సంబంధులు

బ్రహ్మజ్ఞానావిష్కరణలో భారతీయ సంస్కృతి విశ్వవిశాలాలైన భావాల్ని సంభావించింది. ఈ విషయంలో మహర్షుల దర్శనాలు ఉపనిషదమృతాన్ని అందిం

చాయి. "ఈశ్వరుడు ఈ జగత్తులో అంతటా వ్యాపించి ఉన్నాడు[1]. తేజస్సులాగా సర్వత్రా వ్యాపించిన ఆ బ్రహ్మాన్ని నేనే.[2] పూర్ణమై అక్షరమై ఉన్న ఈ బ్రహ్మం "ఓం" అని చెప్పబడుతున్నది.[3] ఈ ఆత్మే బ్రహ్మం; ఆ బ్రహ్మం స్వయం ప్రకాశమానుడైన ప్రత్యగాత్మ స్వరూపంగా గలది.[4] ఏకైక చైతన్యమే బ్రహ్మం; ఆ చైతన్యమే ప్రజ్ఞానం; ఆ ప్రజ్ఞానమే బ్రహ్మం.[5] ఎక్కడనుండి భూతాలు ఇక్కడ పుట్టాయో, దేనివల్ల జీవిస్తున్నాయో. మరణం ద్వారా దేనిలో లయమవుతున్నాయో అదే బ్రహ్మమని గ్రహించండి.[6] విజ్ఞానమే బ్రహ్మ.[7] జ్ఞానం కన్నా పవిత్రమైనదింకొకటి లేదు.[8]"

ఇటువంటి మహావాక్యాలెన్నో బ్రహ్మజ్ఞాన స్వరూపాన్ని వివరించాయి. అయినా అన్వేషణ ఆగలేదు. ఇంకా కొనసాగుతూనే ఉంది. మహా ప్రోక్తాలైన ఇటువంటి మహావాక్యాల్ని ఊతగా తీసుకొని కథలూ గాథలూ ప్రాదుర్భవించాయి. అవి మౌఖిక ప్రచారాన్ని పొంది భారతీయ జన జీవనంలో ప్రవేశించాయి. అటువంటి వాసనాలంచితుడైన జానపదుడు ఆ భావన మనన ధ్యానాలచేత జానపదగేయ సాహిత్య శరీరంలో ఆత్మ సాదృశ తత్త్వాన్ని ప్రతిష్ఠించాడు. ఆ తత్త్వంలో కర్మజ్ఞాన భక్తిమార్గాలు పరమోదాత్తాలైనవి. జానపదగేయ సాహిత్యాంతర్భాగాలుగా పరిగణించదగినట్టి తాత్త్విక సంబంధులైన పొడుపు కథల్లో అటువంటి జ్ఞానమార్గ చాయలు ఎడనెడ కనిపిస్తున్నాయి. అందులో కొన్ని పరిశీలిద్దాం.

---

1. ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ - ఈశోపనిషత్తు
2. యేషావసౌ పురుషః సోహమస్మి - ఈశోపనిషత్తు
3. ఓ మిత్యేదక్షర మిదగ్ం సర్వం — మాండూక్యోపనిషత్తు
4. అయమాత్మా బ్రహ్మ - స్వప్రకాశాత్మ రూపకం - మాండూక్యోపనిషత్తు
5. చైతన్యమేకం బ్రహ్మతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి-ఐతరేయము.
6. యతోవా ఇమాని భూతాని జాయన్తే - యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి - తద్విజి జ్ఞాసస్వ॥ తద్బ్రహ్మేతి॥ - తైత్తిరీయోపనిషత్తు
7. విజ్ఞానం బ్రహ్మేతి వ్యజనాత్ — తైత్తిరీయోపనిషత్తు
8. నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే - భగవద్గీత

* మూడు మూరల తోటలోన
ఆరుమూరల కాయగాసె
అడుగులేని దొంగ వచ్చె
తొడిమలేని తెంపు తెంపె (యముడు ప్రాణందీయడం)

మూడు మూరల తోట ముజ్జగాలు. ఆరు మూరల కాయ మనిషి; అడుగులేని దొంగ యముడు; తొడిమ లేని తెంపు తెంపడం ప్రాణం దీయడం - రూపు మిగలకుండడం. ఇది ఎవరి తత్త్వానికో అనుసరణ కావాలి. వృద్ధ జానపదులు దీనిని పొడుపు కథగా చెబుతున్నారు. మనిషిని ఆరుమూరల కాయ అనడం అరిషడ్వర్గాల్లో తిరిగే వాడనే ఉద్దేశ్యం ఉండేమో! యమధర్మరాజును అడుగులేని దొంగ అనడం జానపదుల నిశిత పరిశీలనానికి నిదర్శనం.

* చంద్రగిరిల పుట్టి పుట్టె
తిరుపతీల తీగవారె
ఆకాశాన కాయగాసె
పర్వతాన పండు పండె (చంద్రుడు)

చంద్రుడెక్కడో జన్మిస్తాడు; ఆ వెన్నెల తీగ ఎక్కడెక్కడికో పాకుతుంటుంది. నిజానికది ఆకాశాన కాసిన కాయ, అస్తమయకాలానికది అస్తాద్రిపై పండువలె అవుతుంది. పండురూపం పొందిన తర్వాత అందరేమవుతారో చంద్రుడు అదే అవుతాడు. బ్రహ్మ పదార్థం విశ్వవ్యాపి, జానపదుని భావన కూడా విశ్వవ్యాపే.

పొడుపు కథల ఛాయలున్న ఈ క్రింది తుమ్మెద పదం ఒకటి చారిత్రక నవలికలో కనిపిస్తోంది.

* ఆకులేని తీగ తుమ్మెదా, పూచె
రేకులేని పూవు తుమ్మెదా
జోకతో విరిసేను తుమ్మెదా నీ
రాకకై చూసేను తుమ్మెదా

దీనికి తాత్త్వికార్థమిలా ఉంది.

ప్ర : ఆకులేని తీగ యేమిటి?

జ : అనితర సాధ్యమైన మానవ శరీరం అది

ప్ర : రేకులేని పువ్వు!

జ : జీవాత్మ

ప్ర : మరి తుమ్మెద యెవరు?

జ : చిన్మయాకారుడైన పరబ్రహ్మయే

దీనికి శృంగారార్థమిలా ఉంది. "ఆకులేని తీగ, అతివమైతీగ రేకులేని పూవు రేవెల్గులాంటి సొగసు, జోకతో విరియడం చోద్యంగా వలచడం, కమ్మని చెలికాడే తుమ్మెద, రమ్మని పిలుచుటే చేకొమ్మని మనసమ్ముచే నమ్మటే. ఇదే పాటలోని భావం."[1]

ఏగంటి వారి వచన రచనల్లో కొన్ని ఇటువంటి తుమ్మెద పదాలు కనిపిస్తున్నాయి. మర్మకవిత్వం ఛాయలోకి వచ్చే ఇటువంటి పదాలు జానపదుల నోళ్ల నానుతూ అనేక విధాలుగా మార్పులు చెందుతూ ఏది మాతృకో ఏది పుత్రికో గుర్తించలేని దశకు వచ్చింది.

* చన్నులేని ఆవుపాలు
వేళ్ళులేని వాడు పిండె
అగ్నిలేని పాలుకాగె
నోరులేని బాలతాగె (వాన)

ఆకాశ దేవతే ఆవు; ఆమె వర్షిస్తోంది. ఆ దేవతకు స్తనాలులేవు. ఆపాలను పిండే వానికి చేతులు లేవు. భూమి మీద అగ్ని లేదు; కాని పాలు కాగుతున్నాయి. భూమికి నోరులేదు. ఆ బాల ఆ పాలను తాగుతోంది. ఆ కాశమంతా అల్లుకు పోయిన మహార్థాన్ని అద్దంలో పట్టి చూపాడు జానపదుడు.

క్రాంతదర్శులైన మహర్షులు భావించిన విశ్వవిశాలాలైన ఉపనిషద్ భావనలకు, వసుధైవ కుటుంబాదర్శానికై కలలుగన్న ప్రాచీనార్వాచీన-ప్రాక్పశ్చిమ

---

1. పండరంగుని ప్రతిజ్ఞ, పు : 168-169

మేధావుల రచనలకు, జానపదుల తాత్త్విక విజ్ఞానం ఎంతమాత్రం తీసి పోయేది కాదు. శబ్ద సంస్కారాన్ని మించిన అర్థసంస్కారంతో జానపదుల తాత్త్విక ప్రహేళికలు ఎవ్వాలై భవ్యాలై అందరిని ఆలోచనా విహంగాలుగా చేసేస్తున్నాయి. ఇక భక్తి ప్రహేళికలపై అటువంటి విహంగ వీక్షణం చేద్దాం.

## 2-5-7-3 భక్తి సంబంధులు

మంచికి ప్రతీక అయిన దైవాన్ని స్మరించి జీవుడు చేసే ధ్యానం భక్తి. ఈ ధ్యానానికి ఎన్నో సోపానాలుంటాయి. జీవునిలో దైవీ సంపదఉంది అజ్ఞానంవల్ల అది తెలువదు. భక్తి ద్వారా జీవుడు తనలోని దైవీ గుణాల్ని గుర్తిస్తాడు. అహంకార మమకార వర్జితుడవుతాడు. సమత్వాన్ని ఆచరణలో పెడతాడు. తనవారూ పరులూ అనే భేదభావం విడిచి అందరొక్కటనే మానసిక స్థితిని పొందుతాడు. అమృత పుత్రులైన మానవునిలోని దైవీ సంపదను లోకకల్యాణార్థం ఉపయోగించే నిమిత్తమే భక్తి ఆవిర్భవించింది. భక్తితత్త్వానికి సంబంధించిన సాహిత్యమెంతో పుట్టింది.

అట్లే జానపద సాహిత్యంలో భక్తికి సంబంధించిన గేయాలు, వచనాలు. గేయవచనాలు ఎన్నో కనిపిస్తున్నాయి. పొడుపు కథల్లో పటిష్ఠమైన భక్తితత్త్వం కనిపించదు కొన్ని పొడుపుల్లో మాత్రం దైవాన్ని స్మరించడమో లేదా దైవీ చిహ్నాల్ని తలంచడమో గమనిస్తాం. అంత మాత్రానికే అవి భక్తికాదు; కాని జానపదుల భక్తి భావ సంభృతులనడానికి అవి నిదర్శనాలవుతాయి. ఈశీర్షిక క్రింద అలాంటివి కొన్ని ఉదాహరిస్తాను.

* ఇంతంత గుడి గాదు
ఈశ్వరుని గుడి గాదు
కంచు గోపురము గాదు
కదిలించ రాదు (ఆకాశం)

ఆకాశం శూన్యం. అది ఎవరికి నిలయమని ఎలా చెప్పగలం. ఎక్కడ మానవుడుంటాడో అక్కడ ఈశ్వరుడుంటాడు. లేనిది ఉన్నట్లు కనిపిస్తోంది.

అది యెంత ఉంది! ఇంతా అంతా కాదు; ఎంతో ఉంది. అందుకే కదిలించరాదనే సత్యాన్ని పలకడం. ఈ పొడుపు కథలోని కూర్పును పరిశీలిస్తే ఇదికూడా జానపదుల తత్త్వమే అనిపిస్తుంది.

* పచ్చ పచ్చనిదదే
పసుపూసుకునే దదే
దేశం తిరిగే దదే
దేవుని పక్కాల పండేదదే (బంతిపువ్వు)

మనిషి అలంకార ప్రియత్వాన్ని దేవుని ద్వారా తీర్చుకొంటున్నాడు. కొందరు దైవాన్ని అలంకార ప్రియునిగాచేశారు. పూల రంగనిగా మార్చారు. అందువల్లనే బంతి పువ్వుపై పుట్టిన ఈ పొడుపు కథలోని చివరి పాదం వల్ల భగవంతుని భోగ ప్రియత్వాన్నే జానపదుడు చెప్పడం జరిగింది. భగవత్తత్త్వం అందువల్ల సామాన్య మానవునికి కూడా అర్థమయ్యేట్లు కథా రూపక ప్రచారం జరిగింది. విద్యాగంధ శూన్యుడైన జానపదునికి దైవీగుణాలు తెలిశాయి; ఆ సురీ గుణాలు అర్థమయ్యాయి, ఆ కారణాన్నే దైవానికి తన సర్వస్వం అర్పణ చేసుకొనేట్టి, లేదా తృణమో పణమో సమర్పించుకొనేట్టి మానసిక స్థితికి మనిషి వచ్చాడు. జానపదుడేమో తోటలో పూచిన బంతిపూవుకే విశ్వజనీనతను ఆపాదించాడు.

* ఓహో సన్యాసి
నీపై నిండ విభూతి
నీ చేతులకు శంఖ చక్రాలు
నీ నెత్తిన రుద్రాక్షలు (ఆముదం చెట్టు)

అటువంటి దైవీతత్త్వాన్ని ప్రచారం చేయడానికి కొందరు సన్యాస జీవనం చేపట్టారు. నిరలంకృతులై నిరాడంబరులై సంచరిస్తూ సమాజాన్ని దైవీతత్త్వం ద్వారా ఏకసూత్రాన బంధించడానికి వారు యత్నంచేశారు. అటువంటి సన్యాసులను ఆముదంచెట్టుకు సంకేతించారు. భగవంతునిపై భగవద్భక్తులపై జానపదుల విశ్వాసం అచంచలమయింది.

* గుడి వెనుక నల్లన
గుడికోన తెల్లన (కొబ్బరికుడుక)

* గుడిచుట్టు నల్లన
గుడిలో తెల్లన (అన్నంకుండ)

* గుడినిండ నిప్పులు
గుడికి తాళం (దానిమ్మపండు)

* గుడిలోన నల్లన
గుడివెనుక తెల్లన (ఇలాచి)

ఇటువంటివి భక్తి సంబంధులైన పొడుపుకథలు అనరేమనిమొదటే చెప్పడం జరిగింది. కొద్ది ఆ ఛాయలున్నాయి. జానపదుని హృదయంలో దైవానికి సంబంధించిన దైవచిహ్నాలను సంబంధించిన కొన్ని కల్పనలున్నాయి. అటువంటి కల్పనల్ని ఈ ప్రహేళికల్లో చిత్రాతిశయంగా జానపదులు ప్రదర్శించారు. కేవలం అటువంటి వాటినే ఆధారంగా తీసుకొని భక్తి సంబంధులనే పేరుపెట్టడం జరిగింది.

మొత్తంమీద జానపదుని తాత్త్వక జీవనంలో కర్మజ్ఞాన భక్తి మార్గాలకు అత్యంత ప్రాధాన్యముంది. జానపద తాత్త్విక ప్రహేళికలు అధికంగా లభించకున్నా జానపదుల పారమార్థిక జీవితానికి ఎటువంటి కొరత లేదు. భక్తి పథం ద్వారా ప్రచారమవుతుంది. ముక్తకాల వంటి పొడుపుకథా పద్ధతులు భక్తికి వాహకాలు కాజాలవు. తాత్త్విక విషయాల్ని అందించలేవు. ఒక్కొక్క భావన ఒక్కొక్క రీతిగా ఉంటుంది ఆ భావనల్ని ఆ రీతుల్లో చెప్పడమే మంచిది.

తాత్త్విక భావాలాలంబితాలై పొడుపు కథల ఛాయలున్న ఎన్నో గేయాలు, వచనాలు కనిపిస్తున్నాయి. వాటిని పరిశోధకులు మర్మకవిత్వమంటున్నారు. పొడుపు కథా లక్షణాల్లో మార్మికత్వం ఒకటి. అందువల్ల అస్పష్ట ప్రహేళికలనే శీర్షిక క్రింద అవి కొన్ని పరిశీలిద్దాం.

## 2-5-8 : అస్పష్ట ప్రహేళికలు

దూర తీరాల్లో, విశాల గగనంలో, దూరపు కొండల్లో, లోతైన లోయల్లో, అనంత సముద్రంలో ఉన్న ఏ వస్తువయినా, ఏ ప్రాణి అయినా ఎక్కడో పుడమి మూలల్లో నిలబడి చూచేవారికి స్పష్టంగా కనిపించదు. చూపు మందగిస్తే చిత్రం

సరిగాచూడలేరు. బుద్ధిని మాంద్యం ఆవహిస్తే ఆలోచన సరిగా చేయలేరు. దేహం బలహీనమైనపుడు శారీరక కార్యక్రమాల్లో సరిగా పాల్గొనలేడు. అనగా స్పష్టాలోచనలు, స్పష్ట వ్యక్తీకరణలు, స్పష్టదర్శనాలు జీవునిలో లేకపోవడం అనేదొకటి ఉంటుందని సుస్పష్టవుతుంది.

ఒక ఆలోచన సరిగా రూపం ధరించదు. అప్పుడు ఆ భావన మనస్సులో బొమ్మ గట్టలేదని అంటాం. కాగితం మీద కొన్ని రేఖలుంటాయి. అవి గజి బిజిగా ఉన్నట్లనిపిస్తుంది; ఆ గీతలు ఒక అర్థస్ఫూర్తిని ఇవ్వ లేదని అంటాం; గీచిన వారే చెప్పాలంటాం. ఒక నటుడు రంగస్థలం మీద హావభావాల్ని ప్రదర్శిస్తాడు. కాని భావ ప్రకటన ముఖంపై సరిగా కనిపించదు. అప్పుడు నటన భావస్ఫూర్తిని ఇవ్వలేదనే అంటాం. ఒక రచయిత ఏదో వ్రాశాడు. పదాలన్నీ తెలిసినవే; కాని అర్థం ఆవగతంకాదు. రచనలో పొందిక లేదంటాం. ఇలా ఎందుకంటున్నాం! ఆలోచనలో, రేఖా చిత్రంలో, నటనలో, రచనలో ఏదో కొరత ఉంది. ఆలోపం కారణంగా అందులో అస్పష్టత ఉందని దూషి పడుతుంది.

శరీరంలో కొన్ని భాగాలుండవు అయినా మనిషే అంటున్నాం. వృక్షానికి కొన్ని కొమ్మలు లేవు. అయినా చెట్టే అంటున్నాం. గృహం ఒక భాగం కూలింది. అయినా గృహమే అంటున్నాం. ఎంత ఆలా అంటున్నా మరొక విధంగా పిలుస్తున్నాం. మనిషిని కుంటి మనిసి అని, వృక్షాన్ని మొండి చెట్టు అని, గృహాన్ని శిథిల గృహమని.

అదే విధంగా జానపదుల పొడుపు కథల్లో అర్థస్ఫూర్తిని ఇచ్చేవేవో కొన్ని లోపించడం వల్లనో, లోపించి ఉండడంకూడా ఒక ప్రధాన లక్షణమని భావించడం వల్లనో అస్పష్టత కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది ఈ అస్పష్టత జానపద సాహిత్యంలోని పారమార్థిక గేయాల్లో అతివేలంగా ఉంది. విమర్శకులు ఇటువంటి వాటిని మర్మకవిత్వమంటున్నారు [1] ఈ మార్మిక కవిత్వ తత్త్వాల అర్థం బోధపడ కున్నా, గూఢార్థాలు తెలియకున్నా, జానపదులు ఆ బరువు సొమ్ముల్ని వేసుకొని అలవాటు చేసుకొన్నారని అన్నారు.[2] జానపదుల్లో తాము చెప్పిన వాటికే

1. తెలుగు జానపద గేయ సాహిత్యము, పు : 394
   తెలుగులో కొత్త వెలుగులు-పు : 171
2. తెలుగు కన్నడ జానపద గేయాలు, పు : 89

ముఖ్యంగా తాత్త్విక సంబంధులైన వాటికి అర్థ వివరణం చేయలేక పోతున్నారు. అవే అస్పష్టాలనదగిన పొడుపు కథలయ్యాయి. ఇవి ఏ తత్త్వాలనుండో జారిపడ్డ తునకలుగావచ్చు. వీటిలో కొన్నిటికి అర్థం చెప్పినా కృతకంగా ఉంటుంది; గుంజి గుంజి లాగినట్లుంటుంది.

* పదమంట పాడితే పండ్లన్నీ నొచ్చె
తేరా పండుటాకులు
నీళ్ల-సున్నం-నిలువుటద్దం
గొడ్డె పోతును - పల్లాబియ్యం

జానపదులు ఒకరి తర్వాత ఒకరు పదాలు పాడారు. నా పండ్లు నొస్తున్నాయి. నేను పాడలేనని ఒకడన్నాడు. మరొకడు హేళన చేస్తున్నాడు. పదం పాడలేని నీకు తిండి పోతంటున్నాడు. అందుకే పడుకోడానికి పండుటాకులు తెండి అంటున్నాడు పండుటాకులు అంటే పక్కబట్టలే. ఈ మర్మం ఒకటె తప్ప మిగిలినవన్నీ సాధారణార్థాలే. నీళ్లు వంటకు, సున్నం విడెంలోకి, నిలువుటద్దం అందం చూచుకోవడానికి, గొడ్డెపోతు కూరకు, బియ్యం అన్నానికి. పల్ల అంటే దాదాపు ఎనుబది కిలోలు. క్వింటాళ్ళ పద్ధతి రాకపూర్వం జానపదులు ఈ తూకానికి అలవాటుపడి ఉన్నారు. ఇప్పటికినీ క్వింటాల్‌ను తెలంగాణాలోని కొన్ని చోట్ల 'పల్లా' అనేపిలుస్తున్నారు. కాని క్వింటల్ పల్లాకన్న ఇరవై కిలోలు ఎక్కువగా ఉంటుంది. ఈ పొడుపు కథకు విడుపు తిండిపోతని జానపదులంటారు. "తిండిపోతు, నిద్దుర మొద్దు, సోగ్గాడు" అని ఏ పేర పిలిస్తే ఏంగాని ప్రహేళిక సమగ్రత ఇందులో లోపించింది. సున్నం తెమ్మనడంలో పదం పాడలేని వానికి తగిన 'శాస్తి' చేద్దామనే ఉద్దేశం కూడా ఉందేమో! పొడుపు కథల ఛాయలు మాత్రమే ఉండి అర్థ వివరణకు అందని దీనిని అస్పష్ట ప్రహేళిక అనడం బాగుంది.

* మూడు మూరల బావిలోన
ఆరు కన్నుల చేప పుట్టె
మూలా తిరిగి గాలామెయ్యారో!

ఏ జానపద తాత్త్విక గేయకర్త ఒడినుండి ఈ పదం జారిందో! మాటగొడ్డే జానపదుని నోట పడింది. అర్థం అంతూపొంతూ చిక్కదు. మూడు మూరల బావి అంటే త్రిగుణాత్మకుడైన మానవుడని, ఆరు కన్నుల చేపఅంటే లోనిఅరిషడ్వర్గాలని,

గాలమేయడం అంటే వాటిని అరికట్టడం అని, మొత్తంమీద అరిషడ్వర్గాల్ని అరికట్టడం అని విడుపు. అతుకుల బొంతవలె అర్థం కుదిరింది. మిగిలింది వసంత్పుష్పే. అందువల్లనే ఈ కోవకు చెందిన పొడుపు కథల్లో ఇది చేర్చడం జరిగింది.

*   తూరుపూన తుమ్మ పుట్టె
తుమ్మ మీదా జమ్మిపుట్టె
జమ్మి మీదా నిమ్మపుట్టె

తూర్పున సూర్యుడు ఉదయించాడని ప్రథమ పాదానికర్థం. ఆ తర్వాత అర్థమేంటో బోధపడదు. ఇది కూడా ఏదో ఒక తాత్త్విక గేయాంశమైఉండాలి.

*   గోపాలయ్య వంటలోన
ఒల్లెలైదు ఉత్కవోతే
ఒల్లెలన్ని మల్లెలాయె
నూటికొక్క ఒల్లెచిక్కె

తెలంగాణా మోటపాటకూ - ర్యాల పదానికీ, రాయలసీమ కపిల పాటలకూ ఇదే లయ ఉంటుంది. పంచ భూతాత్మకమైన తన దేహాన్ని కృష్ణార్పణం చేయడానికి గోపిక పోయింది. ఆ దేహం పుష్పమాలికగా మారింది. విశ్వంలోని పంచభూతాల్లో ఈ దేహి కలిసి పోయింది. పదం అంతరార్థం ఇలా ఉండవచ్చు. కాని జానపదుని వంతు పొడవడం మాత్రమే!

ఇట్టివే అస్పష్ట ప్రహేళికలింకా ఎన్నయినా ఉండవచ్చు. వీటికి మూలాలన దగ్గ కొన్ని తాత్త్విక గేయాంశాల్ని మాత్రం స్పృశిద్దాం.

పోతులూరి వీరబ్రహ్మం తత్త్వాలు ఆంధ్రదేశంలో విశేష ప్రచారం పొందాయి. వారితత్త్వాల్లో అస్పష్ట ప్రహేళికల కోవలోకి వచ్చేవి ఎన్నో ఉన్నాయి.

...."కాష్ఠ చేతులులేని వాడు కడవ ముంత చేతబట్టి
నిండు బావి నీళ్లన్ని వొకడె ముంచెనూ.."[1]

---

1. కాలజ్ఞాన తత్త్వములు

..."బూరుగ[ మాని మీద రెంతు పుట్టలు గలవు తెలుసుకొండి
ఆ పుట్టలో రెండు పెను బాములున్నవి పట్టుకొండి ..."[1]

...."మేఘములేనిది వర్షమున్నది మేకలనై దు మేపుచున్నది
మేఘములోపల మేయుచున్నది మేలిమైన వైభోగమున్నది...."[2]

యాగంటి లక్ష్మయ్య తత్త్వాలు జానపదులు పుక్కిట పట్టారు. వారి తత్త్వాల్లోనూ మార్మికత అస్పష్టత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

...."పుట్టమీద చెట్టు బుట్టె భూమి పైన తీగబారే
కాశిలోను కాయ గాసెరా-యాగంటి లింగా
పర్వలానా పండు పండేరా .."[3]

...."గండు పిల్లి లోకమెల్లగారవించి యేలగాను
కొండ యెలుక లొక్కరొండు। కొలువు చేసేరా!
అండబాయక చిలుకలైదు। అరిదిగాచుచుండగాను
పండుకోతులొక్కరెండు। [పహరితిరిగేరా!"[4]

యాగంటి వారి శిష్యులుగా [పచారంలో ఉన్న నంజయ్య పలికిన తత్త్వాల్లోనూ ఇవే గుణాలున్నాయి.

...."ఊరి పడమట నొక్క పాములేని పుట్ట
పుట్టలోన పూర పిచ్చుకంట,
పుట్టమీద నొక్క యూసర వెల్లియట
పట్టిదేసి వెన్న మెక్కునటన్నా...."[5]

ఘంటయ్య కూడా వీర[బహ్మం శిష్యుడనే అంటారు. అతని తత్త్వాల్లోనూ అస్పష్టాలైన పొడుపు కథల గుణాలు ఎడనెడ కనిపిస్తున్నాయి.

...."చీమదోమ కూడుకొని మిద్దెలు మేడలు గట్టెరా
మిద్దె మీద కన్నె పడుచు పెద్ద కూత పెట్టెరా
మూగవాడు వేదమెల్ల మొదటి నుండి చదివెరా...."[6]

1, 2, 3, 4, 5, 6, కాలజ్ఞాన తత్త్వములు

రాచిచర్ల చలమయ్య తత్త్వాల్లోనూ ఇటువంటి సమాసాలున్న పదాంశాలు సకృత్తుగా కనబడుతున్నాయి.

"ఎన్న దాని కంటిలోను
మెట్ట మట్టి పెట్టున్నాది .."[1]

...."గొడ్డు ముండ కడుపు నందు
దొడ్డ వాడు కొడుకు పుట్టె...."[2]

ఆధునికమైన తిక్కయ్య దార్శనిక గేయాల్లో అక్కడక్కడ మార్మికత అస్పష్టత కనిపిస్తోంది.

...."చిలుక పిల్లని బట్టెరా
ఎలుక పాముని గొట్టెరా"[3]

...."నేత్రంలేని వాడు దేశించగా
యీ చీర నూనే చేతుల్లేని వాడు కోరింపగా
గాత్రంలేని దాన నేను రాత్రింబగలు పట్టుకోని
పాత్రమాడితి పారమార్థిక సూత్రమెరిగి సూక్ష్మంలోనూ .."[4]

దార్శనిక విషయాల్లో అచల వేదాంతాన్నే నమ్మిన వారి రచనల్లో ఎక్కువగా ఇటువంటి అస్పష్టత-మార్మికత దృగ్గోచరమవుతున్నది. ఆ పద్ధతికి మొదటి పాట వేసిన మహాను భావులెవరోగాని అది నమ్మినవారికందరికీ ఆదర్శమయ్యారు. ఇటువంటి పలుకు పలకడంలో, పాట పాడడంలో, పదం పట్టడంలో ఎటువంటి అనుభూతి ఆ పద గేయకర్త పొందాడో గాని పఠితలు మాత్రం ఒక విచిత్రానుభూతిని-అయోమయ స్థితిని పొందుతున్నారు.

తెలుగు జానపద సాహిత్యం మీద వ్యాసాలు వ్రాసినవారు, గ్రంథాలు రచించిన వారు ఎందరో ఉన్నారు. వారి సేకరణల్లోనూ ఈ అస్పష్ట దార్శనిక గేయాలున్నాయి. అవి అన్నీ అస్పష్ట ప్రహేళికలకు మూలాలుగా అనిపిస్తున్నాయి. వారు సేకరించిన ఆ గేయాల్లోని ఆ అంశగల కొన్ని పదాల్ని చూద్దాం.

1. 2 కాలజ్ఞాన తత్త్వములు
3. 4. తిక్కయ్యగారి తత్త్వములు

శ్రీ నేదునూరి గంగాధరం గారివి.

"కానరాని అడవిలోనా విత్తులేకా చెట్టు పుట్టె
కొమ్మలేని చెట్టు మీదనూ రెక్కలేని పక్షి పుట్టేరా"[1]

"మూడు రెండును కలిసి యారోమేడ సౌధము నందుయుండే
చేడియతో జత గూడిరి బ్రహ్మజాడ దెలియుటకు"[2]

శ్రీఉమాకాంత విద్యాశేఖరుల సేకరణగా శ్రీహరి ఆదిశేషుపు ఉదాహరించినది

"....గొడ్డె యొక్కటి అయిదుపులులను కొట్టినెత్తురు త్రాగెరా
చిట్టిచెట్టున జాజి పూవులు శ్రీకరముగ పూచెరా"[3]

ఆచార్య బి. రామరాజు సేకరణలోనివి

"....నక్కయొక్కటి యుండెరా కుక్కలను యెగదోలెరా
చిక్కు లేకను చీమమకరిని నిక్కముగ దిగ మింగెరా...."[4]

"....బండమీద పైరు అలికి - గుంజలేని పందిరేసి
కాళ్లులేని వాన్ని కావలుంచేరా
దీని గాలిన మాయా తెలిసితే పరిపూర్ణమాయేరా...."[5]

ఆచార్య తూమాటి దొణప్ప సేకరణ

"....చెరువులో రెండు చేపా పిల్లలు-సెలుక్కుమాని సెలకంగా
గడ్డన వుండె గుడ్డికొంగా—ముద్దుబెడతాను రమ్మనగా
కుంటలో రెండూ తోకాకప్పలు కుణిసి కుణిసి కులుకంగా
పుట్టలో ఉండే నాగుంబాము పొప్పులు పెడతాను రమ్మనగా
మేకాపిల్లలు మేళం బట్టుక యాడికి సంతకు బోవంగా
తోడేల్నాతుడు దోవకడ్డ మొచ్చి పెండ్లికి రమ్మని పిలువంగా
గుమ్మకింద రెండు పంది కొక్కులు కడుపూనొస్తాదనంగా
మంచం కింద బావిరిగాడు మంతరిస్తాను రమ్మనగా...."[6]

---

1. మిన్నేరు-పు : 447   2. మిన్నేరు—పు 326
3. జానపద గేయవాఙ్మయ పరిచయము-పు : 241
4, 5 జానపదగేయసాహిత్యము-పు : 414
6. తెలుగులో కొత్త వెలుగులు-పు : 172

డా॥ యెల్దండ రఘుమారెడ్డి సేకరణలోనివి

"....తూర్పు దేశాన తుంగ మడుగులోన
నంది కడుపులోన పండె పుట్టెరోరన్న
ఒక్టై కడుపుల గొఱ్ఱె పుట్టెరన్న...."[1]

"....అమ్మమ్మ ఈ కప్ప అయిదు పాములు మింగె
తెలుసుకోదాన్ని తెలుసుకో
తెలసీన వారికి తెల్లమామిడి పండు...."[2]

ఇటువంటి అస్పష్ట తాత్త్విక గేయాల్ని పాడినవారు, పాటల గట్టినవారు, సేకరణ చేసిన వారు జానపద సాహిత్యానికి ఎనలేని సేవచేశారనాలి. జానపదులూ తదితరులూ వీటిలో అంతరార్థాలున్నాయని అంటున్నారు. చూస్తే ఉన్నట్లే అని పిస్తుంది. పరిశీలిస్తే ఎంతో కొంత ఊహకు అంది వస్తుంది. కాని ఆ వచ్చింది అసమగ్రం - అస్పష్టం. కాబట్టే "అవున్న మర్మం మటుకు మన వూహకి అంది రాదు[3]" అన్నారు శ్రీ దొణప్ప. "తత్త్వములందు మర్మకవిత్వముండును. అది తెలిసికొనుట మహాకష్టము.. యీ కల్పనా తత్త్వములన్నియు బూటకములేయని భావింప దొడగితిని"[4] అన్నారు శ్రీ బి. రామరాజు. "కొన్ని తత్త్వాల అర్థం బోధపడదు"[5] అన్నారు శ్రీ ఆర్వీ యస్ సుందరం. "తత్త్వము అనుభవము మీద గడించుకో దగినదే గాని కేవలము శాస్త్రపఠనము వలన గాదని, పల్లీయుల తత్త్వమును బట్టి తెలియనగును. ఒక్కొక్క పట్టున వారి తత్త్వమును విడమరచి చెప్పుట కష్టమగు చుండును"[6] అన్నారు శ్రీ యెల్దండ రఘుమారెడ్డి.

ఈ తత్త్వాలపైన ప్రాజ్ఞుల ప్రామాణిక వాక్యాలు చదివిన తర్వాత, వాటినీ పొడుపు కథల్ని బేరీజు వేసి చూచిన తర్వాత, అస్పష్ట ప్రహేళికలుగా పిలువ

1. పల్లె పదాలలో ప్రజా జీవనము-పు : 194
2. పల్లెపదాలలో ప్రజా జీవనము-పు : 17
3. తెలుగులో కొత్త వెలుగులు-పు : 171
4. జానపదగేయ సాహిత్యము-పు : 387
5. తెలుగు-కన్నడ జానపదగేయాలు-పు : 89
6. పల్లె పదాలలో ప్రజా జీవనము—పు : 192

వచ్చునని పించింది. కొన్ని పొడుపు కథల్లో ఇవే పాదాలున్నాయి. కొన్నిటికి రెండింటా అర్థం పొసగుతుంది.

"నేత్రంలేని వాడు నేసిండురా" అని తాత్త్విక గేయకర్త అంటే, "కళ్లులేనివాడు చూసేరా" అని పొడుపుకథా కారుడంటున్నాడు. "పుట్టమీద చెట్టు బుట్టె-భూమిపైన తెగపారే, కాలోసు కాయగాసెరా పర్వతాన పండు పండేరా" అని తాత్త్విక గేయకర్త పాడగా, "చంద్రగిరిల చెట్టుపుట్టె-తిరుపతిల తీగపారెఆకాశాన కాయగాసె పర్వతాన పంపు పండె" అని ప్రహేళికకర్త పలుకుతున్నాడు. ఏది మాతృకో ఏది పుత్రికో చెప్పడం సాధ్యంగాని ఇటువంటి తాత్త్విక ప్రహేళికలు మరెన్నో ఉన్నాయి. తాత్త్విక గేయాలు, తాత్త్విక ప్రహేళికల వింత శిశువుగా అస్పష్ట ప్రహేళికలు ఆవిర్భవించాయి.

ప్రకృతికి ముసికి పడినప్పుడు అది వికృతిగా కనిపిస్తుంది. వికృతికి ఆముసికిపోయినప్పుడు అది ప్రకృతిగ ప్రకాశిస్తుంది అట్లే ప్రహేళికా శరీరానికి అంగవైకల్యం కగిలినప్పుడు అస్పష్ట ప్రహేళిక అవుతుంది. అంగ సామగ్ర్యత సిద్ధించినప్పుడు ప్రహేళికగా భాసిస్తుంది.

అస్పష్ట ప్రహేళికలు సాధారణంగా తాత్త్విక సంబంధులైనవే. అయినా విభజన సౌలభ్యార్థం, అస్పష్ట స్వరూప స్పష్ట నిరూపణార్థం ఒక ప్రత్యేక శీర్షిక క్రింద వివరించడం జరిగింది. ఇక ఆత్మాశ్రయ ప్రహేళికల్ని పరిశీలిద్దాం.

## 2-5-9 : ఆత్మాశ్రయ ప్రహేళికలు

ఈ విశాల విశ్వమంతా చైతన్య పదార్థం నిండి ఉందనీ, దానినే సత్పదార్థ మంటారనీ, దానినే ఆత్మఅంటారని, ఆయాత్మ స్పృశించని ప్రదేశం లేదనీ, నీవూ నేనూ సర్వం ఆ ఆత్మ అంశాలే అని ఉపనిషత్తులుద్ఘోషిస్తున్నాయి.[1] ఆత్మ అనశ్వరమైందిగా భగవద్గీతాది గ్రంథాలు రూఢిపరచాయి. భారతీయ ధార్మిక గ్రంథాలన్నీ ఆత్మకు మహోన్నత స్థానం ఇచ్చాయి.

సృష్టిలోని సమస్త ప్రాణికోటని ఏక సూత్రంలో బిగించదలచి ఉత్తమా దర్శ సంస్థాపనా నిమిత్తం అటువంటి ఆత్మ సిద్ధాంతాన్ని ఆవిర్భవింపజేసినట్లని

1. ఛాందోగ్యోపనిషత్తు

పిస్తుంది. ఇంతకు మించిన మరేవస్తువుకూడా భూతకోటిని ఒకత్రాటిపై నడిపేట్టిది ఇంతవరకు ప్రతిపాదితం కాలేదు. ఆత్మ సిద్ధాంతం పారమార్థిక తత్త్వమని పక్కకు త్రోయబడింది గాని ప్రాపంచిక వ్యవహారాల్లో సర్వే సర్వత్ర వ్యాపించ వలసింది,

ఆత్మ పరమార్థపరమై పోయినా లౌకిక వ్యవహారంలో అది వ్యక్తినీ, వ్యక్తి భావననూ తెలిపేదిగా స్థిరపడింది. లౌకిక గ్రంథాలన్నిట్లోనూ అది అట్లే ప్రసక్తమయింది. ఆధునిక సాహిత్యంలో భావకవిత్వమంతా ఆత్మాశ్రయ పరమైందే అనే స్థితికి వచ్చింది. ఆత్మాశ్రయమైందంతా కేవలం వ్యక్తి మాత్రైక భావనే అనే విశ్వాసం ఏర్పడిపోయింది. ప్రాపంచిక వ్యవహార కల్లోలిని కల్లోలాలకు ప్రచలితమయ్యే మనిషి భావనల్లో కేవలం ఆత్మాశ్రయమే గాక, ప్రాపంచికానుభవాలు, వ్యక్తిగతానుభూతులు, సరళ తరళ సుందరాలై, మనోజ్ఞ మాధవీలతా మంజులలై బహిర్గతమవుతాయి. ఆభావ జాలమంతా ఏదో ఒక పాత్రపై రుద్దబడక తనవిగా ఉత్తమపురుషల్లో ప్రకటితమవుతాయి అటువంటి తలంపులన్నీ ఆత్మాశ్రయ సంబంధులని భావించడం జరుగుతుంది.

జానపద సాహిత్యంలో ఆత్మాశ్రయత ఉన్న గేయాలు, వచనాలు, పొడుపు కథలు ఎన్నో ఉన్నాయి. అవి వ్యక్తి సంబంధులే అయినా, వ్యక్తి సామాజిక శరీరంలో అవిభాజ్యమైన అవయవం అయినందువల్ల సామాజిక పరంగా వ్యాఖ్యానితమయ్యాయి. వాటిలో కొన్ని కేవలం ఆత్మ సంబంధులే అయినా విశ్వాత్మలో సామాజికాత్మ, వ్యక్తి ఆత్మ ఒక అంశమే కాబట్టి ఆ విధంగా చెప్పడంలో అసామంజస్యమేమీ కనిపించడం లేదు.

పూర్వమే వివరింప బడ్డ జానపదుల పొడుపు కథల్లో సంవాదాత్మకాలైన వాటిలోను, ప్రశ్నోత్తర రూపాలైన వాటిలోనూ ఎదదరోపొరల్లోని తీయని ఊహలున్నాయి "బావ్వాకు నలుసు పంట సుట్టాసు సుట్టుపంట-ఇంగలం కోసరం నేసువోతుంచిరో" అని కృషీ వలుడు పాడినప్పుడూ, "కుండాను మూసి పెట్టి కుంపాటి గప్పిపెట్టి దీపాన్ని కొంపతోటి-ఇసిరుంటిరో" అని జానపద గృహిణి మనోమోదంతో మర్మం విప్పి చెప్పినప్పుడూ ఆత్మాశ్రయతే భాసిస్తుంది. జాన పదుల ఆత్మాశ్రయ ప్రహేళికల్లో భావకవిత్వంలోని రమణీయత, నిగూఢ

తాల్త్వికత, తనవిగా చెప్పుకునే దైన్య ప్రపంచపుటావర్తాలూ, ప్రపంచంపై రుద్దే స్వీయదుఃఖాను భూతులూ ఎంతగా కనిపించవు. తన మీదనే పొడుచుకోడం అనేది ఇందులోని విశేషం ఆ పొడుపులో తనపాత్ర ఉన్నట్టనిపించడం రెండవరకం. తనపాత్ర ఉంటుంది, మరొక పాత్రకు ప్రాధాన్యముంటుంది; అది మూడవ రకం. ఈ మూడింటిని దృష్టిలోఉంచుకొని వీటిని ఆత్మాశ్రయాలనీ, అత్మాశ్రయాభాసాలనీ, ఉభయాలనీ విభజించడం జరుగుతోంది.

## 2-5-9-1 : ఆత్మాశ్రయాలు

* వస్తివా వాసువేవుడా
మంచ మేతునా
బొంతపరుతునా
దీపం ఓటుకు
నీ వటుకు-నేనిటుకు (నిద్ర)

పనిచేస్తున్న పడతి పైపైకి నిద్ర వచ్చింది. నిద్రాదేవిని వాసుదేవుడా! అని సంబోధించింది. నిద్రాదేవి ఆవేశిస్తుంటే మంచం వేయాలా, బొంత పరువాలా అని ఆలోచించింది. నిద్రకివన్నీ ఎందుకు! పైబడుటే దానిపని. అంతే! దీపమారింది; పని అటుక్కాయింది (పక్కకు జరిగింది), తాను ఇ టుక్కాయింది (నిద్రకువశమయింది) ఈ పొడుపు కథతో ఆ పొలతి తనను గూర్చే చెప్పుకొంది. ఇది కొద్దిభేదంతో మరోచోట ఇలా వినిపిస్తోంది.

* వస్తివా వాసునేవ!
మంచమేస్తునా
బొంత పరుస్తునా
పోగుపొటుక్కు-దారం దటుక్కు
నీవు అటుక్కు-నేను ఇటుక్కు (నిద్ర)

ఇందులో ఆ స్త్రీ చేస్తున్న పని ఏదో తెలుప బడింది, ఇక్కడ కూడా ఉత్తమ పురుషే ఉంది. అందువల్ల ఇది ఆత్మాశ్రయ ప్రహేళికల్లో చేర్చడం జరిగింది.

* మిద్దె మీద మిరప చెట్టు
నీకే కాని నాకు కనబడదు (బొట్టు)

మిద్దె నొసలు. మిరప చెట్టు బొట్టు. మిరప పండు ఎఱ్ఱగా ఉంటుంది. చెట్టునిండా పండ్లున్నప్పుడు చెట్టంతా ఎఱుపుగానే ఉంటుంది. ఆ అరుణ తిలకం ధరించిన వారికి అద్దంలోనే కనిపిస్తుంది. కాని ఎదుటి వారికి ఎప్పుడూ కనిపిస్తుంది. తన అందం తనకెప్పుడూ కనిపిస్తే బాగుంటుంది కదా అని భావించినట్లుంది ఈ యువతి. అలాంటి మరో భావాన్ని పొడుపుకథా రూపంలో ప్రకటించింది.

* మా అమ్మ దొడ్లో దోచుకుంటుంది (నాలుక)

దొడ్డి శబ్దాన్ని సాగరసీమ వాసులు మరుగు కలిగే అర్థంలో ప్రయోగిస్తారు. తెలంగాణాలో పశువుల కొట్టానికి ఉపయోగిస్తారు. తెలంగాణాలోని కొన్ని మండలాల్లో ఇంటి వెనుక భాగాన్ని కూడా దొడ్డి అంటారు. "పశువుల దొడ్డి, మరుగు దొడ్డి, దొడ్డికాన్లది" అనేమాటలు వ్యవహారంలో ఉన్నాయి 'మా' అక్షరానికిక్కడ 'నా' అనే భావం ఉత్తమపురుషలో 'నాయమ్మ - నాభార్య-నాపిల్లె అనే పదాలు వ్యవహారంలో మాయమ్మ మాభార్య మా పిల్లె అనే ప్రయోగంలో ఉన్నాయి. ఇక్కడ నాయికను తల్లిగా సంకేతించింది. తల్లి దోచుకోగూడదు, నిజానికి ఈ తల్లి దోచుకొంటోంది. ఎందుకొరకు! తన సంతానం కడుపు నింపడానికా! పొడుపు విన్నంతనే కలిగిన అసమంజస భావన విడుపు తెలిసిన వెంటనే సమంజసమని తేలిపోయింది.

* మా ఇంటెనుక రెండిత్తనాల పేర్పులు (పిరుదులు)

మా ఇల్లంటే తన శరీరమనీ, విత్తనాల పేర్పులంటే పిరుదులనీ అర్థం. వ్యవసాయదారులు విత్తనాల్ని పెద్ద పెద్ద కుండల్లో ఉంచి వేపాకువేసి చెమలేని చోట పెట్టి చెడకుండా భద్రం చేస్తారు. ప్రబంధాలన్నీ పిరుదుల్ని ఇసుక తిన్నెలతో పోల్చాయి. జానపద యువతి విత్తనాల పేర్పుతో పోల్చడం వల్ల సహజత్వం ఉట్టిపడుతోంది.

* పెట్టెసుంటూనే
పట్టి చూసుకొంటి (కొప్పు)

వెంట్రుకలు చిక్కుదీసి, సరిజేసి కొప్పు పెట్టుకుంటారు. వెంటనే పట్టి చూసుకుంటారు వినగానే అశ్లీలార్థద్యోతకం అయ్యే ఇది విడుపు తెలిసిన తర్వాత సముచిత పదార్థ ప్రహేళిక అనిపిస్తుంది. ఆత్మాశ్రయాలకు చెందినవే అయినా కొన్ని పొడుపుకథలు వాని వరుసలు, సంబంధ బాంధవ్యాల్ని తెలియజేస్తున్నాయి.

* మీ మామ మామామ మామనల్లుండ్లు
నీవు నేను ఎంగావాలి. (అన్నాచెల్లెలు)

* అతని అత్తను మా యత్త
ఓయత్తా అనిపిలుచును (తంత్రికూతుళ్లు)

## 2-5-9-2 : ఆత్మాశ్రయాభాసాలు

పై పొడుపుకథలన్నీ వ్యక్తి ప్రాధాన్యాలు. పొడుపూ విడుపూ రెండుకూడా చెప్పే వ్యక్తికే చెందినవై ఉంటాయి; లేదా సంబంధించినవై ఉంటాయి. అందువల్ల అవి పూర్ణాత్మాశ్రయాలుగా పరిగణించడం జరిగింది.

వ్యక్తి పొడుపుకథ పొడుస్తాడు. అది వ్యక్తికి సంబంధించిందే అనిపిస్తుంది; కాని వ్యక్తికి సంబంధించినదికాదు. పొడుపుకథ అంతా ఉత్తమ పురుషలోనే నడుస్తుంది. విడుపు మాత్రం వేరే అయి ఉంటుంది. అందువల్ల ఇది ఆత్మాశ్రయాభాసం అనాల్సివస్తుంది.

* కాట్ల గాల్తి - సావిట్లసస్తి
రోట్ల రుబ్బు రాయికి దగిలి
రోసానికి వస్తి (సున్నం)

ఇది మనిషికి సంబంధించిందనే భ్రమ కలుగజేస్తుంది. కాని అడవిలో కాలానని చావడికి వచ్చి చచ్చానని, రోటిలో రుబ్బురాయికి తగిలి రోషానికి వచ్చానని అర్థం సున్నంరాయిని అడవిలో కాలుస్తారు. ఆ రాళ్లనుదెచ్చి నడి వీధుల్లో, గృహ ప్రాంగణాల్లో పోస్తారు. వాటిపై నీళ్లు చల్లుతారు. అప్పుడు ఆరాళ్లు సెగలు పొగలు చిమ్ముతూ విచ్చుకొనిపోతాయి. పొడిసున్నం రూపు వస్తుంది. దానిని మీగడ సున్నంగా మార్చాలనుకున్నప్పుడు రోటవేసి నూరుతారు. ఆ మీగడ

సున్నాన్ని తాంబూలంలో వాడతారు తాంబూలంలో సున్నంరాయి రాగ మొలికిస్తుంది. రాగానికి ఎరుపు చిహ్నం; రోషానికీ ఎరుపే చిహ్నం. సున్నం ఈ పొడుపుకథను పొడుపదు; జానపదుడు పొడుస్తాడు; కాని ఇది జానపదునికి సంబంధించిందికాదు.

* గండం కడతేరింది
పిండం బయట పడ్డది
మంది కండ్లలో మన్నుపడుతుంది
నా అమ్మను వచ్చితోలుకొని పొమ్మను (ప్రత్తి)

సమాజం కన్నుగప్పి తల్లి అయిన ఓ యువతి రాయబారం ఇది అనిపిస్తుంది. కాని ప్రత్తికాయ పగిలింది. "కంకి ఎట్లుపైతే కన్నుబెట్టవద్దు" అనే భావన జానపదులదే. అందువల్ల మంది కండ్లలో మన్నుపడుతుంది అంటున్నారు కంట పెరిగిచ్చే వత్తిగా మాడ్చుకోవాలని ఎవరో తెంపుతుంటారు. ఆ కారణాన్నే మాయమ్మను అంటే వస్త్రాన్ని వచ్చి తోలుకొని పొమ్మనడం. సమాజంలో అమ్మతప్పుగాచి బిడ్డను ఒడిని దాచి బుజ్జగిస్తుంది, లాలిస్తుంది, ఆడిస్తుంది, పాడిస్తుంది. ఇచ్చట ప్రత్తి గాలికెగిరి పోకుండా భూమిపై పడకుండా అమ్మవంటి వస్త్రం ఆదరిస్తుందనే అంతరార్థముంది. నిజానికి వస్త్రానికి ప్రత్తి తల్లి, ప్రత్తికి చెట్టు తల్లి. చెట్టుకు భూమితల్లి. జానపదుల దృష్టిలో ఎవరెవరికి తల్లి అయితే ఏంటి ? ప్రోచుటే ముఖ్యం; దాచడం అంతకన్నా ముఖ్యం; వరిలీసుకోడం ముఖ్యాతిముఖ్యం. ఈ పొడుపుకథ విన్నంతనే అనాథ అయిన బాలెంత కన్నులపొమ్మ గట్టుతుంది. విడుపు ఆత్మసంబంధిగాక అన్యాన్ని ఆశ్రయించింది. అందువల్లనే ఆత్మాశ్రయా భాసమయింది.

* రాముడు సీత పుట్టుక ముందు
లంకల దీపం పెట్టకముందు
నేను పుట్టాను (ఉప్పు)

పొడుపుకథ విన్న వెంటనే ఇది పొడిచిన వారికి సంబంధించింది కాదని తెలిసిపోతుంది. కాని ఆ అనాది ప్రాణి చిరునామా తెలుసుకొంటే మనస్సు ఉత్సాహంతో ఉరకలు వేస్తుంది. రాముడూ సీత అంటే ఆది మానవులనీ, లంకలో దీప మంటే సూర్యచంద్రులని జానపదుల భావన. ఈ పొడుపు కథ ద్వారా ఉప్పుకున్న ప్రాధాన్యమెంతో తెలుస్తుంది.

* కోటు విప్పి నూతిలపడి (అరటిపండు)

పాపం ఆతనికేం కష్టం వచ్చిందో ఆత్మ హత్యకు పాల్పడ్డాడనిపిస్తుంది. ఆత్మహత్య చేసుకొనేవాడు కోటెందుకు విడుస్తాడు. నూతిలో పడ్డవాడు ఎలా వచ్చాడు; వచ్చాడు, పొడుపు పొడిచాడు. భ్రాంతి తొలగుతుంది; అరటిపండు మనస్సులో మెదలుతుంది. ఆత్మాశ్రయాభాసాలకోవకు వచ్చే ఈ క్రింది పొడుపులు కూడా గమనార్హాలు.

* మా ఇంటి పిల్లలను
లెక్కపెట్టలేం (చుక్కలు)

* నాకు కాళ్లులేవు చేతుల్లేవు
ఏవి లేకుండా నడుస్తాను (పాము)

## 2-5-9-3 : ఉభయాలు

ఇందులో వ్యక్తి ప్రాధాన్యం కొంత ఉంటుంది; వస్తు ప్రాధాన్యం కొంత ఉంటుంది. వ్యక్తికి సంబంధించినంత వరకు ఆత్మాశ్రయం అనాలి వస్తువుకు సంబంధించినంతవరకు ఆభాసమనాల్సివస్తుంది. ఈ రెండుగుణాలు ఒక్క పొడుపు కథలోనే సంగమించి ఉన్నాయి కాబట్టి ఇవి ఉభయాలనాల్సి వస్తుంది

* వాడు పోతుంటె-నేను పిలుస్తుంటి
వాడు పెడ్తుంటె-నే నేడుస్తుంటి (గాజులు)

జానపదస్త్రీలు నాగరస్త్రీలు అందరూ గాజులు ధరిస్తారు. శృంగారాభాసాలయిన గాజులవానికి సంబంధించిన కొన్ని గేయాలు జానపద సాహిత్యంలో ఉన్నాయి. ఈ పొడుపు కథ విన్నవెంటనే అశ్లీలం గుప్పుమంటుంది. కాని గాజులు ధరించడం అని తెలిసినప్పుడు పొడుపు కథావైచిత్రికి మెచ్చుకోని వారుండరు. ఈ పొడుపు కథలో గాజులు ధరించే వారికి సంబంధించినంత వరకు ఆత్మాశ్రయం, గాజులే విడుపయ్యాయి కాబట్టి ఆత్మాశ్రయాభాసం.

* అక్కంటెరాదు-అమ్మంటె రాదు
రెట్టవట్టి గుంజితె కుక్కలాగొస్తది (తలుపు)

తలుపు గృహ రక్షకం. తలుపు దగ్గర నిలబడి అక్కా అన్నా, అమ్మరా అన్నా అది రాదు. చేతబట్టి గుంజాలి. ఇంకేం ఎక్కడికి లాగితే అక్కడికి వస్తుంది. ఇక్కడ గుంజడం వ్యక్తికి సంబంధించింది. అందువల్ల ఆత్మాశ్రయ సంబంధి అయింది; ఆత్మాశ్రయాభాసమయింది.

* మీ అమ్మను పడుకో బెట్టి
మాయమ్మ దాటిపోయింది. (కడప)

కడప ఇంటిలోకి 'పురుగుబూసి' రాకుండా, తలుపు 'గూటుపట్లు కీలుబందులు' చెక్కుచెదరకుండా రక్షిస్తుంది. తలుపుకు రక్షక కవచం కడప. అటువంటి కడపను ఆంధ్రులు గౌరమ్మగా భావించి పూజిస్తారు. అందువల్ల కడపను అందరి తల్లిగా భావిస్తారు. మీయమ్మ అంటే గౌరమ్మ అనే అర్థం. కడప ఎప్పుడూ పడుకోనే ఉంటుంది. ఏ అమ్మ అయినా దాటి పోవలసిందే పడుకొన్న వారి పైనుండి దాటరాదని జానపదుల విశ్వాసం. 'మాయమ్మ' దాటిపోయిందంటే వారికాశ్చర్యాన్ని కలిగించే విషయం. ఈ పొడుపు కథలో కడపకు సంబంధించినంత వరకు ఆత్మాశ్రయాభాసం. దాటిపోవడం అనేది ఆత్మాశ్రయం. అందువల్ల ఇది ఉభయాల కోవకు చెందిందయింది.

* అడవిలో పుట్టింది-అడవిలో పెరిగింది
మాయింటి కొచ్చింది-మాయమ్మ మెచ్చింది
తాడేసి కట్టింది-తైతక్కలాడింది
కడవలో దూరింది-గట్టుమన్నాది
పెరుగులో మునిగింది-వెన్నంత తెచ్చింది
నాకింత పెట్టింది.[1] (కవ్వం)

ఈ పొడుపు కథలో 'మాయమ్మ మెచ్చింది-తాడేసి కట్టింది నాకింత పెట్టింది' అనే పదాలు ఆత్మాశ్రయాలు. మిగిలినవన్నీ ఆత్మాశ్రయాభాసాలు.

మొత్తంమీద ఆత్మాశ్రయ ప్రహేళికల్లో మొదటనే చెప్పుకొన్నట్లు భావ కవిత్వంలోని రామణీయకతగాని, నిగూఢమైన తాత్వికతగాని, తనవిగా చెప్పుకొనే

1. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి-పు : 144

దైన్య ప్రపంచపుటావర్తాలుగాని అంతగా కనిపించడం లేదు. స్వీయానుభవాల్ని పరానుభవాల్ని స్వీయలుగానే చెప్పుకొన్న భావ కవిత్వ సౌగంధ్యం మాత్రమే జానపదుల ఆత్మాశ్రయ ప్రహేళికల్లో ఉందని చెప్పవచ్చు.

## 2-5-10 : సింహావలోకనం

అటుశిష్ట సాహిత్యంలోను, ఇటు జానపద సాహిత్యంలోనూ సమప్రాధాన్య మున్న పొడుపు కథల్లో, జానపదుల పొడుపు కథల్ని మాత్రమే ఈ ప్రకరణంలో పరిశీలించడం జరిగింది. పొడుపు కథా శరీరం హ్రస్వ దీర్ఘాల్ని దృష్టిలో ఉంచుకొని ఏక పదాది విభజనం చేయడం జరిగింది. అదేగాక హ్రస్వదీర్ఘ ప్రహేళికల్ని వచనాలుగా గేయాలుగా వచన గేయాలుగా స్థూలంగా విభజించి అందులోని సూక్ష్మభేదాల్ని ఉదాహరించడం జరిగింది. ఈ విభజనం వల్ల జానపద ప్రహేళిక స్వరూపం [The Form of Folk Riddle] బహిర్గత మయింది.

ఆ పిదప ప్రహేళికా స్వభావాన్ని అన్వేషించి, అంతరంగాన్ని అవలోకించి తొమ్మిది విధాలుగా విభజించాను. అందులోని గృహ జీవన ప్రహేళికల్లో పెండ్లి పేరంటాలకు, గృహకలహాలకు, వివాహాలకు, ప్రకీర్ణకాలకు సంబంధించిన పొడుపు కథలు పరిశీలించాను.

గ్రామిక జన ప్రహేళికల్లో పొలం గట్టులు, రచ్చ పట్టులు, వీడీ పరిశ్రమలు, ఇతరాలు వ్యాఖ్యానించాను.

ప్రకృతి సంబంధి ప్రహేళికల్లో చెట్టు పుట్టలు, పంటపొలాలు, పూలూపండ్లు తదితరాలు సమీక్షించాను.

తిర్యక్ సంబంధి ప్రహేళికల్లో జంతుసమూహాలు, పక్షిసమూహాలు, క్రిమి కీటకాలు వివరించాను.

క్రీడావినోద ప్రహేళిల్లో ప్రహేళికే ఒక క్రీడ అనీ, సంవాదాత్మకాలా, వస్తుగుణాత్మకాలుగా విభజించి పరిశీలించడం జరిగింది.

బాలబాలికా ప్రహేళికలు మరో ప్రత్యేక ప్రకరణం చేయాల్సింది. విస్తృత భీతివల్ల ఇందులోనే తరులతాఫలపుష్పాలుగా, మానవేతర ప్రాణులుగా, మానవ

సంబంధులుగా, పంచ భూతాదులుగా, గృహపరికరాలుగా, వినోద పరికరాలుగా, ఖాద్య విశేషాలుగా, వ్యావసాయక సంబంధులుగా, వృత్తి కళాసంబంధులుగా, ప్రశ్నా ప్రాధాన్యాలుగా విశ్లేషించి వివరించాను

తాత్త్విక ప్రహేళికల్లో కర్మ సంబంధి, జ్ఞాన సంబంధి, భక్తి సంబంధి పొడుపు కథల్ని అనుశీలించాను.

అస్పష్ట ప్రహేళికల్లో మార్మికత ప్రాధాన్యం చెబుతూ, తాత్త్విక గేయకర్తల ప్రభావాన్ని వివరిస్తూ, జానపదుల తత్త్వాలు సేకరించిన పరిశోధకుల అభిప్రాయాల్ని మన్నించి అందించాను,

ఆత్మాశ్రయ ప్రహేళికల్లో పొడుపు కథలతో దేనిని ఆత్మాశ్రయత అనాలో చెప్పి, ఆత్మాశ్రయాలు, ఆత్మాశ్రయేతరాలు, ఉభయాలు అని విభజించి విశ్లేషించాను.

ఈ విధంగా జానపదుల పొడుపు కథల్లో గుణాత్మక ప్రాధాన్యాలైన నవవిధ ప్రహేళికల్ని అనుశీలించి రచించే సమయంలో ఎడనెడ జానపదుల జీవన సంస్కృతుల్ని స్పృశించాను. జానపదుల జీవన సంస్కృతుల్ని గూర్చి ఇదివరకే పరిశోధకులు సోపపత్తికంగా చర్చించి తర్కించి సిద్ధాంతీకరించడం వల్ల, ఈ ప్రకరణంలో నేనింకా లోతుల్లోకి వెళ్లలేదు.

మొత్తంమీద అతి విశాల సుసంపన్న జానపద సాహిత్య సాగరంలో వైవిధ్యం ఉన్న రూపరస భావ గుణ సంయోజితాలైన ప్రహేళికా రత్నాలు కోకొల్లలని తేలింది. జానపద సాహిత్య సుందరి ముఖమండలంపై పొడుపు కథ సౌభాగ్య చిహ్నమైన తిలకం. జానపద సాహితీ వేషకునికి పొడుపుకథ కరతలామలకం.

## 2-5-11 : ఇది ముగింపుకాదు

పొడుపు కథలు జానపద సాహిత్యం అనే ఈ ప్రకరణం ముగింపుకాదు. జానపదుల పొడుపు కథలనింకా అనేక విధాలుగా వింగడించుకొనే అవకాశముంది అరణ్యాలమీద ఆధారపడి బ్రతికేవారు, సముద్ర జలాలమీద జీవనం గడిపేవారు,

కొండల్లో నివసించే వారు, నిరంతరం యంత్రాల చుట్టే మూగిఉన్నవారు ....తదితరులు ప్రయోగించే పొడుపు కథల్ని వారి సామాజిక స్థితి గతుల్ని బేరీజు వేసి మరి పరిశీలించవచ్చు.

ఆయా కులాల వారు అలాంటి పొడుపు కథల్నే ఎందుకు ప్రయోగిస్తున్నారన్న అంశాల్ని నేను ప్రకరణంలో స్పృశించలేదు. వృత్తుల విషయమే ప్రస్తావించి దాటి పోయాను. జానపద విజ్ఞానాన్ని కూలంకషంగా పరిశీలించాలనుకున్న పరిశోధకుడు కులాల ప్రసక్తి వచ్చినప్పుడు కొన్ని అంశాలు చెప్పడానికి వెనుక ముందాడి నట్లయితే నిజాలు మరుగున పడే అవకాశముంది. కులనిర్మూలనను ఆశిస్తున్న సమాజంలో కులాల వారిగా విభజన చేసి పరిశీలన చేయడం మంచిది కాదని, వృత్తులనే మాటనే తీసుకొన్నాను. ప్రజా జీవనమనే ప్రకరణంలో కూడా ఈ జాగ్రత్త తీసుకోడం జరిగింది.

అన్య భారతీయ భాషల్లోనూ, పాశ్చాత్య భాషల్లోనూ పొడుపు కథ మీద పరిశోధనలు జరిగాయి. జానపద విజ్ఞానంలో పొడుపు కథ స్థానాన్ని నిరూపించేప్పుడు తులనాత్మక పరిశీలన చేసే అవకాశముంది. ఆ పద్ధతిని కూడా ఈ ప్రకరణంలో అనుసరించలేదు కేవలం జానపద ప్రహేళికల మీదనే అధ్యయనం చేసే వారు ముమ్ముందీ విషయం స్వీకరించి సుసంపన్నం చేయవచ్చు. జానపద ప్రహేళికల విషయం అనంతమైందే! అందువల్లే ఈ ప్రకరణం సమగ్రం కాదనీ ముగింపూ కాదనీ అంటున్నా!



# తెలుగు పొడుపు కథలు



కథాత్మకాలు
(గుప్తకథలు)
తృతీయ ప్రకరణం

# కథాత్మకాలు

## (గుప్త కథలు)

### 3-0 : బిందువునుండి సింధువు

ప్రకృతి పురుషుల ప్రతి కదలిక చైతన్యానికి ప్రతీకగా నిలుస్తుంది. ఆ కదలికల కారణంగా ఆవేదనానంద సమ్మిశ్రితాలైన అనేకానేక గాథలుద్భవిస్తాయి. ఆ కథలూ-గాథలూ సాహితీ ప్రపంచంలో అజరామరాలై నిలిచిఉంటాయి. మానవ లోకానికి అవి విజ్ఞానాన్ని-వినోదాన్ని అందిస్తాయి. కాబట్టే అక్షరాకృతి ధరించిన ప్రతికథ అక్షయంగా సందేశ కిరణాల్ని ప్రసారిస్తూనే ఉంటుంది.

ఎక్కడో సూర్యోదయం జరుగుతుంది. ఆ వెలుతురు సర్వ ప్రపంచాన్ని స్పృశిస్తుంది. ఎక్కడో ఒక సంఘటన జరిగింది. అదె ఒక కథ అయ్యింది; ఆ కథ ప్రసరించింది; దిక్కుల్ని చుంబించింది; ప్రకృతిని స్పృశించింది; మేధను కదలించింది; తాను సంకేతమయింది. ఆ సంకేతమే ఒకముడి. ఆ ముడి విప్పితేనే ఆ కథ సాక్షాత్కరిస్తుంది.

ఆ ముడే పొడుపు; ఆ పొడుపుకో విడుపు రావాలి. ఆ విడుపే విజ్ఞానం; ఆ విడుపే వినోదం; ఆ విడుపే చీకట్లు చీల్చుకొని వచ్చే సూర్యకిరణం.

ఒక శాస్త్రవేత్త పరిశోధన ఫలితమంతా సంకేతిత ప్రణాళికలో దాగి ఉంటుంది. ఒక కళావేత్త దర్శన స్పర్శనానుభూతులన్నీ అతని హృదయ ఫలకంపై ముద్రితమై ఉంటాయి. ఒక ఐంద్రజాలికుని మహిమలన్నీ ఆతని హస్తాలంకృత మంత్ర తంత్రదండాన్ని ఆవేశించి ఉంటాయి. ఒక మహా భూతం సర్వ శక్తులు ఉపాసకుని సీసాలో బుసగొడుతుంటాయి. ఒక మహా మాంత్రికుని పంచ ప్రాణాలు సప్త సముద్రాలకావల ఉన్న మఱ్ఱిచెట్టు తొఱ్ఱలోని చిలుకలో దాగి ఉంటాయి. అదే విధంగా కథాత్మక ప్రహేళికల సర్వ శబ్దార్థాంగ రహస్యాలు పొడుపుకథ లోపొరల్లో దాగి ఉంటాయి.

కథాత్మక ప్రహేళికల్లో పొడుపు ప్రశ్న, కథ సమాధానం. పొడుపు సంకేతం, విడుపు సంఘటనం. ఈ సంకేత సంఘటనల్లో మొదట పుట్టింది సంఘటనే. సంఘటనం లేనిది సంకేతం లేదు. సంకేతం లేకున్నా సంఘటనముంటుంది.

గంగ హిమాలయాల్లో పుడుతుంది; భారత భూమిని సుసంపన్నం చేస్తుంది. గంగ కదలికల్ని గమనించిన ప్రాణి లోకం పరవశించి నృత్యం చేస్తుంది తాను ప్రవహిస్తోన్న ప్రాంతంలోని ప్రజల సుఖ దుఃఖాల్ని ఆనందోత్సాహ తరంగిత ధ్వనులతో ఆ గంగమ్మ గానం చేస్తుంది. తన శీతల కర స్పర్శతో ఆ తల్లి అందరినీ పెన వేస్తుంది, ఆ గాఢాలింగనాను భూతిని అందుకొన్న ఒక హృదయం బద్ధి జీవి అవుతుంది. ఆ బుద్ధి ఊరుకోదు. గంగ ప్రాదుర్భావహేతువుల్ని శోధిస్తుంది; సాధిస్తుంది. గంగ పుట్టుక గంగోత్రి సామీప్యంలో అని తెలుస్తుంది. గంగోత్రి అనగానే గంగకథ బొమ్మ గడుతుంది. గంగోత్రి ఒక సంకేతం; గంగా ప్రవాహం అనేకానేక సంఘటనాసమిశ్రితం. సంఘటనలన్నీ గాథలే; ఆగాథలే కథలు. ఈ కథలు తెలిసిన ప్రాజ్ఞుడు ఆ కథా మూలాన్ని పరిశోధిస్తాడు. ఆ ఫలితమే గంగోత్రి. ఇకగంగోత్రిని గూర్చి ప్రశ్నిస్తాడు; అంటేపొడుస్తాడు. ఆగాథ తెలిసిన వాడు విప్పి చెబుతాడు; అంటే విడుపు చెబుతాడు.

దీన్నిబట్టి మనకేం తెలుస్తున్నది! విడుపు కథ గాలిలా, ధూళిలా, వెలుగులా నీరులా సర్వే సర్వత్ర వ్యాపించిం తర్వాత పొడుపుకథ పుట్టిందని. అలా పుట్టిన పొడుపుకథ ఆటలాడేప్పుడు, పాటలు పాడేప్పుడు, పరిశ్రమించేప్పుడు, పరాచికాలాడేప్పుడు, ముచ్చటించేప్పుడు, మురిపాల సంబరాల్లో కులికేప్పుడు, బడిలో-గుడిలో, మడిలో-మాన్యంలో, మోట బావిదగ్గర, కోట గోడ పక్కన, రచ్చకట్టు మీద, పొలం గట్టు మీద, కంచె చేని చాటున, మంచెకొప్పు మాటున, బావిలో, చెరువులో, నదిలో, చెట్టుపై, గట్టుపై, గుట్టపై, ఇంటి వసారాల్లో, పెంట కుప్పల్లో, పంట కళ్లాల్లో, పరువాల పడకల్లో ...ఇక్కడా అక్కడా అనిగాక ఎద ఎద కలిసిన ప్రతి ప్రదేశంలో పొడవబడుతుంది; ముడి విడువబడుతుంది.

ఇలాంటి పొడుపుకథలు పొడవడం సులభమే, కాని విప్పడమే కష్టం. పొడవడానికి అరనిమిషం చాలు; విప్పడానికి అరగంట కావాలి.

## 3-1 : ఉత్పత్తి

అదో పాఠశాల మైదానం. బాలికలాడి యాడి అలసి పోయారు. గుంపుగా ఓ చోట కూచున్నారు. ఆయాసం కారణంగా వారి ఎదలెగసెగసి పడుతున్నాయి. ఓ అమ్మాయి నెత్తి నుండి ప్లాస్టిక్ పిన్ను తీయ పోయింది. అది పుటుక్కున విరిగి పోయింది. ఆ బాలికకు చిన్న గాయమయింది. అమ్మా అన్నది. ఇది అందరు చూశారు. ఓ బాలిక పకపక నవ్వింది ఆ అమ్మాయి మనస్సులో ఏవో పూర్వ స్మృతులు తైతక్కలాడాయి. అంతే ఆ అమ్మాయి నవ్వుతూనే "పుటుక్కు జర జర, డుబుక్కు, మే" అన్నది.

ఒక్కసారికాదు; రెండు మూడు పర్యాయాలన్నది; అంటూనే నవ్వుతున్నది; నవ్వుతూనే అంటున్నది. ఆ కథస్మృతిలో తిరిగిన వారా నవ్వుకు నవ్వు కలిపారు కొందరు ఆశ్చర్యంతో మునిగారు; మరికొందరు ప్రశ్నార్థక ముఖులయ్యారు ఈ తతంగంతో అసహనం రేకెత్తిన కొందరు పిన్ను విరిగిందానికన్నా మీ విరుగుబాటే బాధాకరంగా ఉందన్నారు.

'నవ్వుతూన్న ఓ అమ్మాయిని 'చాల్చాల్లేవే' అంటూ మరో అమ్మాయి మోచేతితో పొడిచింది.

'నన్ను మోచేతితో పొడుస్తావా ......అయితే నేనో పొడుపుకథ పొడుస్తాను విప్పుకో!' అందా అమ్మాయి.

'సరే సరే' అన్నారందరు.

ఆ అమ్మాయి మరోసారి 'పుటుక్కు, జరజర, డుబుక్కు,మే' అంది.

ఆ కథ తెలిసిన బాలికలొకరిద్దరు మేము ముడి విప్పుతాం అన్నారు ఆ అమ్మాయి ఒప్పుకోలేదు. 'పిన్ను విరిగి ఏడుస్తున్న పిల్లయినా చెప్పాలి, లేదా పొడిచిన మోహిన్నైనా చెప్పాలి, పట్టుపట్టింది.

"మా యిద్దరికీ దాని అర్థమేంటో తెలియదు తల్లీ! నీవే చెప్పు! "అంటూ ఇద్దరూ చేయెత్తి మొక్కారు.

ఆ అమ్మాయి పైటతీసి నడుంకు చెక్కి, గళం సవరించుకొని పొడుపు కథకు విడుపు ప్రారంభించింది.

"అనగనగా ఓ ఊరు. ఆ ఊళ్లో ఓ పూరిల్లు. ఆయింటి చుట్టూరా చక్కని చెక్కని కూరగాయల మొక్కలు. ఆమొక్కల మధ్యమధ్య చిక్కుడు పందిళ్లు, పొట్ల తీగలు, బీర తీగలు, ఆ యింటి పైకప్పుపై పచ్చని గుమ్మడి తీగ, కప్పునిండ గుమ్మడి ఆకులు. చిలుక పచ్చగా నిగనిగ లాడుతోన్న గుడిసె. ఆకుల మధ్యమధ్య పసుపు పచ్చని గుమ్మడి పూలు.

ఆయిల్లో పేద రైతుది. అతనికో మేక ఉంది. దాని నెప్పుడూ గుడిసె తలుపుకే కట్టి వేస్తారు. ఆ మేక కడుపునిండా తిన్నది; హాయిగా నెమరు వేస్తూ ఉన్నది; నిలబడే ఉన్నది.

గుడిసె మీద ఆకుల్లో ఎలుకలున్నాయి. అవి అటూ ఇటూ పరుగెత్తు తున్నాయి. ఓ ఎలుక పెద్ద గుమ్మడిపండు కాడకొరికింది. కొండత్వే పిండిగొట్టే ఎలుకకు గుమ్మడి పండో లెక్కా....పక్కా!

ఇంకేం! కాడ 'పుటుక్కున' తెగింది. గుడిసె మీన్నుండి గుమ్మడి పండు 'జరజర' జారింది. నెమరు వేస్తున్న మేకమీద 'డుబుక్కున' పడింది. హఠాత్సం ఘటనం! మేక అదురుకుంది .'మే'... అంది.

ఆ అమ్మాయి విడుపుకథ ఆపింది. అందరిదిక్కు చూసి గలగలా నవ్వింది. అందరూ పుటుక్కు, జరజర, డుబుక్కు, మే' అంటూ నవ్వారు.

ఆ నవ్వుల తళతళలు ఇంటింటా ప్రసరించాయి. వీధుల్లో కాంతిని నింపాయి. ఈ కథ ఆ నగరం రాజు చెవిలో దూరింది. రాజు పండితుల్ని అడి గాడు. శబ్దార్థాలు మాత్రమే తెలిసిన పండితులకిది తలకు మించిన కార్యమైంది. ఇది ఏదో సంఘటనకు ముడి అనుకున్నారు. ఆ చిక్కుముడి విప్పితే గాని దీని అర్థం తేలదనుకున్నారు. అందుకే రాజును వారం రోజుల గడువడిగారు. పండితు లందరూ జనపదాలపై పడ్డారు. శబ్దాయి తెలుసు; శబ్దార్థాలు తెలుసు; కాని జరిగిన సంఘటనేంటో తెలువదు. మొత్తంమీద జనహృదయ సంశోధనం చేసి సాధించారు. కొండను త్రవ్వి ఎలుక పట్టారన్న సామెత ఎలాంటిదైనా అంత త్రవ్వితే గాని ఇంత దొరకదు మరి! ఇంత దొరికినప్పుడు అంత అర్థమవుతుంది మరి!

ఇలాంటి కథాత్మక ప్రహేళికలకు జన హృదయ మొక్కటే నిలయంకాదు. మార్గదేశి సాహిత్యాలు నిలయాలై ఆ రెండూ తెలుగు పొడుపు కథల్ని పోషించాయి. వేద బుక్కుల్లో ఉపనిషన్మంత్రాల్లో పొడుపు కథలున్నాయి.

బృహదారణ్యకంలోనిదిగా బహుళ ప్రచారంలో ఉన్న "దదద" కథ అచ్చంగా పొడుపుకథే. ఇది పౌరాణికులు, హరికథా కారులు ఉదాహరిస్తుంటారు.

"దేవతలు రాక్షసులు మానవులు ప్రజాపతికి శిష్యులై, నియమ నిష్ఠా గరిష్ఠులై వ్యవహరించారు. వారి అధ్యయనం పూర్తి అయింది. వారిక బయలుదేరే ముందు ఉపదేశార్థం ప్రజాపతి ముందు నిలిచారు. ప్రజాపతి 'దదద' అన్నారు. ఈ ముగ్గురు తలలూపారు. మీకేమర్థమైందో చెప్పండని ప్రజాపతి అడిగారు. అపుడు దేవతలు 'దమనం' (ఇంద్రియ నిగ్రహం) అవలంబించి నడచుకుంటా మన్నారు. రాక్షసులు 'దయ' నవలంబించి జీవిస్తామన్నారు మానవులు 'దానం' చేస్తూ బ్రతుకుతామన్నారు.

దదద అంటే దమనం - దానం-దయ అని అర్థం. దానికై ఓ సంఘటన. అదీ కథ. ఇందులోని చమత్కారం పొడుపు కథకు సన్నిహితంగా ఉంది. ఆర్షవాఙ్మయంలో ఇలాంటివి అక్కడక్కడ కనిపిస్తాయి.

ఆ తర్వాత నైమిశారణ్యంలో మహా పురాణాల్ని ప్రవచించిన, నిఖిల పురాణ మర్మజ్ఞుడైన సూతుని కథల్లో, మునుల సందేహాల్లో అక్కడక్కడ ప్రహేళికల ఛాయలు కనిపిస్తాయి. సంస్కృతాంధ్రాలు రెండూ చమత్కార చారుతకూ, లోకోక్తి రామణీయకతకూ, సంక్షిప్తతకూ, గుప్తతకూ నిలయమైన పొడుపు కథను స్వీకరించాయి. అవి విప్పి చెబితే 'బారెడు' అర్థాన్నిస్తున్నందు వల్ల నాలుగు పాదాల శ్లోకంలోనే నలబై పాదాల కథను నిక్షిప్తం చేయడం సులభ మైంది. అలాంటి శ్లోకాలు తెలుగు కథాత్మక ప్రహేళికలకు మూలాలుగా కనిపిస్తాయి. జన వ్యవహారంలో ఉండి గ్రంథస్థమైన కొన్నిటిని పరిశీలిద్దాం.

ఆంధ్రంలో ఆలివంకవాడు ఆత్మబంధువు అనే సామెత ఉంది. ఆలివంకకూ తనవంకకూ చెందని ఓ పుణ్యపురుషుడు వచ్చి ఇద్దరికీ మాయ మాటలు చెప్పి పొట్ట నింపుకుంటున్నాడు ఇతనెవరి పక్షానికిచెందిన వాడో ఇద్దరికీ అర్థం కాలేదు. దీనికో శ్లోకముంది; ఆ శ్లోకం వెనుక ఓ కథ ఉంది. శ్లోకం పొడుపైతే కథ విడుపవుతుంది. అలాంటి విడుపులున్నవే కథాత్మకాలవుతాయి.

* "శ్లో॥ అస్మాకం బదరీ చక్రం
యుష్మాకం బదరీతరుః।

వాదరాయణ సంబంధం

యూయం యూయం - వయం వయం॥

ఒక బ్రాహ్మణుడు వచ్చి ఒకరి ఇంట ఆరు నెలలు చుట్టపు కుడుపులతో పొట్టబోసికొనుచుండి నాడు గాని, అతడెవరి బంధువో తెలియదు. చివరకు ఒకరు ధైర్యం చేసి అతనిని 'నీవెవరి బంధువు!' అని అడుగగా, అతడు 'నాకూ మీకూ ఎట్టి సంబంధం లేదుగాని, అదిగో! ఆ బదరి (బాదరి-రేగు) వృక్షానికి, దాని క్రింద నిలిపి ఉన్న నాబండికి మాత్రం సంబంధం ఉన్నది. దాని చక్రం బదరీ దారువుతో చేయబడింది. అదే నాకు మీకు కలయిక కాని మీరు మీరే మేము మేమే' అని అంటూ, పైగుడ్డ విదుల్చుకుంటూ వెడలి పోయినాడట. అంతేగాని బ్రహ్మసూత్రాలు వ్రాసిన బాదరాయణ ఋషికి యీ సామెతకు సంబంధం లేదు".[1]

శ్లోకాన్ని అవరించిన పటాన్ని తొలగిస్తే తేలిన కథ ఇది. నాగలికి తల్లి. విషాన్నానికి కొడుకు గురై మరణించిన ఆస్తి మీది ఆశ కథను నిక్షిప్తం చేసుకొన్న శ్లోకమొకటున్నది. మాతా పుత్ర విరోధానికి కారణమైన ధనానికి వందన మంటూ పిట్టకథల్లో ఇది ఉదాహరించడం జరిగింది.

"శ్లో॥ లాంగలేన హతా మాతా
విషాన్నేన హతస్సుతః।
మాతా పుత్ర విరోధాయ
హిరణ్యాయ నమోనమః॥

ఒక రైతు భూమిని దున్నుచుండగా ఒక పాతు (నిధి) దొరికినది. తల్లి కొడుకులు ఆ పాతు పైకి దీసిరి. తల్లి కొడుకును జూచి నాయనా! నీ చెల్లెలికి దీనిలో సగమియ్యరా అని అన్నది. వాడు మూతి ముడిచి చురచుర చూచినాడు. కొడుకు ఇవ్వడని నిశ్చయించి తేనె మాటలతో ప్రొద్దు గడిపి తాను పని నెరవేర్చ వలయునని యిచ్చకముగా మాటలాడి సొమ్ము కుమారితకు చేర్చవలయునని చద్ది కూటిలోనాభి కలిపితీసుకొని వచ్చి కొడుకునుతినుమన్నది. వాడుఅన్నము తిన్నంత

---

[1] తెలుగు సామెతలు, పు : 442

తాలము, కూతురునకు సౌమ్యమ్మని వేధించే తల్లి బాధ తప్పించుకొనవలయునని నిశ్చయించి నాగలి నెత్తిన కొట్టి తల్లిని చంపి, తాను అన్నము తిని చచ్చెను."[1]

ప్రజల్లో ప్రచుర ప్రచారం పొందిన ఇలాంటి శ్లోకాలన్నీ కథాత్మకాంధ్ర ప్రహేళికలకు మార్గదర్శనం చేశాయి. ఏ గ్రంథాల్లో ఉన్నాయో తమకు తెలియదంటూనే కొందరు శ్లోకాలకు శ్లోకాలు చెబుతున్నారు, కథా కథనం చేస్తున్నారు. ఈ క్రిందిశ్లోకం-కథ ఆ విధంగా సేకరించిందే.[2]

"అన్యథా చింతితం కార్యం
దైవమన్యత్ర చింతయేత్,
రాజకన్యాభిలాషేణ
విప్రం భల్లూక భక్షణమ్॥

అదో మహానగరం; దాన్నో మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు యుక్తవయస్క అయిన ఓ కూతురుంది. ఆమె చక్కని చుక్క. ఆమెకు చాలా కాలం చదువు చెప్పి ఓ విప్ర విద్వాంసుడు చదువుల కుప్పగా తయారు చేశాడు. చక్కని చుక్క ... అందులో చదువుల కుప్ప.

ఆమె చదువు ముగిసింది. తండ్రి అనుమతితో ఆమె గురువుగారికి లెక్కకు మిక్కిలి శుద్ధ సువర్ణాల్ని గురుదక్షిణగా ఇచ్చింది. 'ఓ చదువుల కుప్పా! నీవేనాకు దక్షిణగారా' అన్నాడు గురువు. ఆమె పరిహాసంగా భావించి గురువు వైపు చూసింది, అతను నిశ్చలంగానే ఉన్నాడు.

'గురులకు శిష్యులు పుత్రులు, పరమార్థము లోకధర్మ పథమిది[3]...అని గురువుగారి పాఠం గురువుగారికే అప్పజెప్పింది. ఆయన తన పరీక్షలో గెలిచావని ప్రశంసించి వెళ్ళిపోయాడు.

రాజు కూతురు వివాహానికై ముహూర్తం నిశ్చయం చేయడానికి జోతిష్యుని పిలిపించాడు. రాజ కొమార్తె అందాన్ని ఆశించిన ఆ విప్ర విద్వాంసుడు ఆ జోతిష్యునితో స్నేహం చేశాడు అతణ్ని వశపరచుకొన్నాడు; డబ్బుకు లోకం దాసోహమన్నట్లు ఆ బీద జోతిష్యుడు గురు బోధననుసరించాడు.

1. పిట్ట కథలు (సామెతలు, సూక్తులు, లోకోక్తులు), పు : 30.
2. లింగంపేట, నిజామాబాదు జిల్లా, జూలై-1977.
3. ఆంధ్ర మహా భారతము, ఆది-3 ఆశ్వా-ప : 131.

'మహారాజా! మీ కూతురుకు వివాహమైన తొమ్మిదో రోజున ఏనుగులు, పదో రోజున గుఱ్ఱాలు, పదకొండో రోజున సైన్యం, పన్నెండో రోజున రాజ్యం వరుసగా నాశనమవుతాయి, మీరు శత్రువులతో సంహరింప బడతారు' అని జ్యోతిష్యుడు చెప్పాడు.

మహారాజు అయోమయంలో పడ్డాడు, ఆతణ్ని ప్రాణభీతి పట్టుకుంది. ఏంచేయాలో అర్థంకావడంలేదు. పరిష్కార మార్గం, వివరించాల్సిందని ప్రాధేయ పడ్డాడు. జ్యోతిష్యుడు గురువుగారు చెప్పిన మాటల్ని తుచ తప్పకుండా విన్పించాడు.

'ఓ పెద్ద పెట్టె, ఆ పెట్టెలో మంచం; మంచం మీద రాకొమార్తె; పెట్టె మూయాలి అర్ధరాత్రి మహానదీ ప్రవాహంలో వదలేయాలి; ఈ విషయం రాజపుత్రికి కూడా తెలియరాదు. అలా పీడ వదలించుకుంటేనే రాజ్యం దక్కుతుంది; లేకుంటే 'సర్వం జగన్నాధమవుతుంది'.... అన్నాడు జోతిష్యుడు.

మహారాజు జ్యోతిష్యునికి కానుకలిచ్చి సాగనంపాడు. ఆ రోజు అర్ధరాత్రే అనుంగు పుత్రిని పెట్టెలో పెట్టి ప్రవాహంలో వదిలించాడు.

ఆ పెట్టె ప్రవాహంలో మూడు రోజులు పయనించింది విప్ర విద్వాంసుడు ఆ పెట్టెను వెలుపలికి లాగే ప్రయత్నంలో మహారణ్యంలోని ఓ ప్రదేశంలో ఒక ఇద్దరు సేవకులతో కాచుకొని ఉన్నాడు.

ఈ లోగా పెట్టె మరొకరి చేతికి చిక్కింది పొరుగు రాజ్యానికి చెందిన రాజకుమారుడు, మంత్రి కుమారుడు ఆ అరణ్యానికే వేటకు వచ్చారు. ప్రవాహంలో కొట్టుకు పోతున్న పెట్టెను చూశారు. ఇద్దరూ నీటిలోకి దూకి ఒడ్డుకు తెచ్చారు; పెట్టె మూత తీశారు చక్కని చుక్కను చూశారు. ఆమెకు అప్పుడప్పుడే స్పృహ వస్తోంది. కళ్లు విప్పి చూసింది, తన పరిస్థితి అర్థం చేసుకోవడానికి కొంత సమయం పట్టింది. నీరసంగా ఉన్న రాజపుత్రికి చేతినూతంగా ఇచ్చి రాజకుమారుడు ఆమెను చెట్టు నీడకు చేర్చాడు.

మాటల మధ్యలో తనకు కాబోయే భార్య ఆమేనని రాజకుమారునికి తెలిసింది. రాజపుత్రికి కూడా తనకు కాబోయే భర్త ఆతడే అని అర్థమయ్యింది.

తనకు మత్తు మందెవరిచ్చారో, మందసంలో ఎవరు పెట్టారో, ప్రవాహంలో ఎవరు విడిచారో అర్థం కావడం లేదనీ, అంతా అయోమయంగా ఉందని రాజపుత్రి ఆలోచనల్లో పడిపోయింది. ఇందులో ఏదో కుట్ర ఉందనీ ఆ కుట్రను భేదించాలనీ, అందుకొరకు అప్పటికే తాము బంధించి ఉంచిన ఎలుగుబంటిని పెట్టెలో పెట్టి నీట వదలి పెట్టాలని మంత్రి పుత్రుడు సలహా ఇచ్చాడు. రాజపుత్రికి, రాజపుత్రునికి ఈ సలహా నచ్చింది. వెంటనే ముగ్గురు కలిసి ఎలుగు బంటిని పెట్టెలోకి చేర్చారు; మూత మూశారు; ప్రవాహంలోకి త్రోశారు. ఆ తర్వాత ఆకులలాలు చాటు చేసుకొని, పొదల మాటున నక్కుతూ నక్కుతూ నది ఒడ్డు ననుసరించే పెట్టెను చూస్తూ పరిసరాల్ని పరిశీలిస్తూ పట్టుదలతో నడిచారు.

అల్లంత దూరాన్నే వారికి గురువుగారు కనిపించారు. రాజపుత్రి అతనెవరో చెప్పింది. గురుదక్షిణనాటి అతని కోరిక సంగతికూడా విప్పి చెప్పింది. 'ఇతను గురువా! కాముకుడు, పాప కర్ముడు, అవివేకి' అన్నాడు మంత్రి కుమారుడు. 'అందుకే తగిన ఫలితం అనుభవిస్తాడు' అన్నాడు రాజకుమారుడు.

గురువుగారు పెట్టెను పట్టారు, ఒడ్డుకు లాగారు; సేవకుల సహాయంతో బండి పైకి ఎక్కించారు. బండిని నగరాభిముఖంగా నడిపించారు.

ఇక ఈ ముగ్గురు కూడ బలుక్కున్నారు. మారువేషాలతో నగరంలో ప్రవేశించి ఓ ధర్మ సత్రంలో విడిది చేశారు. విప్ర విద్వాంస గురువరేణ్యుడేం చేస్తున్నాడనేది ఎప్పటికప్పుడు తెలుసు కొంటూనే ఉన్నారు.

బండి పెట్టెతో బాటు గురువుగారి గృహాంతర్భాగానికి చేరింది. అప్పటికే గురువుగారి శిష్యులూ, సేవకులు వివాహానికి కావల్సిన ఏర్పాట్లన్నీ చేశారు.

పెట్టె తెరచిన వెంటనే తాళిబొట్టు కట్టాలని గురువుగారు తహతహ లాడు తున్నారు. తాళి కట్టిన తర్వాత రాకుమారి కుక్కిన పేనులా ఉంటుందని ఉబలాట పడుతున్నాడు. గదిలోకి ఎవరూ రావద్దని హుకుంజారీ చేశాడు. పెట్టె లోనికి తెప్పించాడు. చేత తాళి బొట్టుతో పెట్టెను సమీపించాడు; మూత తీశాడు.

బయట మేళ తాళాలు మ్రోగుతున్నాయి. లోన గురువుగారి మీదికి ఎలుగు బంటి ఎగబడుతున్నది. గురువుగారు 'కుయ్యో మొర్రో' అంటున్నారు. చివరికి ఓ పెద్దగావుకేక పెట్టి భల్లూకం చేతుల్లో ఇరుక్కు పోయారు.

అప్పుడే అక్కడికి రాజకుమారుడు, రాజకుమార్తె, మంత్రి పుత్రుడు వచ్చారు. ఎవ్వరినీ కదల వద్దని శాసించారు. గురువుగారున్న గది తెలుసుకున్నారు. తలుపులు పగులగొట్టించారు. దూసుకొని వస్తోన్న భల్లూకానికి దారి ఇచ్చారు. రక్తం మడుగులో పడి ఉన్న గురుపుశవాన్ని చూశారు.

రాజపుత్రి అప్పటికప్పుడే ఈ పై శ్లోకాన్ని వ్రాసి, మంత్రి పుత్రునికిచ్చి తన తండ్రి దగ్గరకి పంపించింది. రాజు తన అనాలోచిత కార్యానికి సిగ్గుపడ్డాడు. వెంటనే సేనాధిపతితో, మంత్రితో, గురువు గృహానికి వచ్చాడు. కూతురునూ, కాబోయే అల్లుణ్ని అక్కున చేర్చుకొని మూర్ధం ముద్దాడి, అశ్రు జలంతో అభిషేకించి రాజ గృహానికి తీసుకొని వెళ్లాడు."[1]

ఇదీకథ; అంత చిన్న శ్లోకానికి ఇంత పెద్ద కథ. బీజభూతాలైన ఇలాంటి శ్లోకాలు మహా వృక్ష తుల్యాలైన విసుపు కథలకు సంకేతితమైన పొడుపుకథలనే భావించాలి. ఈ శ్లోకాలెవరి విరచితాలో, ఏ చెవినిపడి, ఏ మనస్సులో నిలిచి, ఏ నోట ప్రకటితమవుతున్నాయో ప్రజల్లో తిరిగితేనే అర్థమవుతుంది. ఏ ఉద్దేశంతో ఈ శ్లోకాలు కట్టినా, ఎందుకొరకు ప్రచారం చేసినా, ఎవరిమీద సంధించినా ఇవి మాత్రం కొందరి నోట బతికే ఉన్నాయి. సార్వ కాలీన సందేశాన్ని అందించే ఈ క్రింది శ్లోకం -తదనంతర కథనం ఆ విధంగా బతికి ఉన్నదే.

* "భోజనం బలి భుక్తంచ
శయనే హస్త మార్జనం।
పరదేశేచ జాగారం
ప్రథమ కోప నివారణం॥[2]

అదో పట్టణం; ఆ పట్టణంలో ఓ విద్వాంసుడు; అతనికిద్దరు కొడుకులు. ఆ విద్వాంసునికి తన బతుకు పొద్దు కుంకుతున్నదని అనుమానం వచ్చింది. ఇద్దరు కొడుకుల్ని దగ్గరకు పిలచాడు. తన ఆస్తినీ, తన విద్యల్ని (శాస్త్రాల్ని) చూపించి ఎవరికేం కావాలో తీసుకొండన్నాడు. పెద్ద కొడుకు ఆస్తి, చిన్న కొడుకు శాస్త్రాల్ని తీసుకొన్నారు. పెద్దవాడు ధన ధాన్యాలతో భోగ భాగ్యాలతో ఆనందంగా ఉన్నాడు. చిన్నవాడు

1. శ్రీ నర్సింగరావు, వయస్సు 60 సం॥, భావం వారిది; భాషనాది.
2. సేకరణ: బుచ్చిగూడెం, మహబూబ్‌నగర్ జిల్లా, మే–1977.

పల్లెలూ-పట్టణాలూ తిరుగుతూ తాను నేర్చిన చదువులతో - శాస్త్రాలతో ప్రజల్ని నీతి మంతులుగా తీర్చిదిద్దు తున్నాడు. ప్రజలందరతణ్ని ఆదరిస్తున్నారు; గొప్ప పండితుడని ప్రశంసిస్తున్నారు. వేళకెవరో ఇంత అన్నం పెడుతున్నారుగాని చిరకాలం సుఖంగా ఉండే వసతులెవరూ సమకూర్చడంలేదు. అతనది కావాలని అనుకోలేదు కాబట్టి విచారం లేకుండా విద్యాదానం చేస్తూ దేశ దేశాలు తిరుగు తున్నాడు.

ఓనాడు ఆదేశం ముఖ్యపట్టణంలోని ధర్మసత్రంలో ఈ విద్వాంసుడు ధర్మబోధచేస్తున్నాడు. అక్కడికి మారువేషంలో వచ్చినస రాకుమారుడతని మాటలు విన్నాడు. అందరు వెళ్లిపోయాక తన దగ్గర ఉన్న ధనమంతా ఇచ్చి ఈ పైశ్లోకాన్ని తీసుకొన్నాడు. గుర్తుంచుకోడానికి కమ్మ కొనే దేందుకన్నా వినకుండా రాజకుమారుడు శ్లోకమున్న కమ్మతో వెళ్లిపోయాడు. తండ్రి దగ్గరకు వెళ్లి తాను చేసిన పని చెప్పి శ్లోకం చూపించాడు. డబ్బు దండగ చేసి శాస్త్రం కొన్నావా అని తండ్రి దూషించాడు; శ్లోకం కమ్మను ముఖాన కొట్టాడు; కొడుకును ఇంటినుండి గెంటించాడు.

ఇల్లూ వొల్లూ వదలి పెట్టిన కొడుకు దుస్థితి తల్లి గమనించింది. భర్త చాటుగా కొంత ధనం తీసి కొడుకుకు పంపించింది. ఆ ధనం సంచితో అతడో నగరం నడి వీధి గుండా పోతున్నాడు. ఆ వీధిలో ఓవేశ్య ఉంది. వీధిలో పోతున్న అతని ముఖలక్షణాల్ని పరిశీలించి, ఉన్నవాడని నిశ్చయించుకుంది. తన మేడకు పిలిపించుకొంది. ఒయ్యారాలు ఒలికబోసింది. అందచందాలు ప్రదర్శించింది. అతిథి మర్యాదలేవేవో చేసింది.

రాకుమారుడు నవ్వుకున్నాడు; నీతులు చెప్పాడు; బతుకుదాటలోని పర మార్థాల ముళ్లువిప్పిచెప్పాడు. అర్థంకన్నా పరమార్థం మిన్న అన్నాడు.

అతను తన వలలో చిక్కడని ఆ వేశ్య అనుకున్నది. తన ఆతిథ్యాన్ని స్వీకరించి వెళ్లాల్సిందిగా ప్రాధేయ పడింది. రాజకుమారుడు 'సరే' అన్నాడు. ఆ వేశ్య అన్నంలో విషం కలిపి పెట్టింది.

అన్నం తినడానికి ముందు అతని కాశ్లోకం గుర్తుకు వచ్చింది. ప్రథమ పదార్థం మననం చేసుకొన్నాడు. భోజనానికి పూర్వం భూత తృప్తి చేయాలని

ఆ పాదం నిర్దేశిస్తోంది. అది శాస్త్రార్థంగా అతని మనసులో నాటుకొంది. అందుకే అతను మొదట పిల్లికి అన్నం వేశాడు. ఆ పిల్లి అక్కడికక్కడే చనిపోయింది. రాకుమారుడా వేశ్యవైపు కోపంతో చూచి వెళ్లి పోయాడు.

ఆ తర్వాత రాజపుత్రుడా నగరంలోని మరొక వీధికి వెళ్లాడు. ఆ వీధిలో ఉన్న వేశ్యకూడా ఇతణ్ని చూసింది. ఇంటికి పిలుపించుకొంది. మాటా ముచ్చట జరిగాక అతడు తనకు వశం కాడని నిశ్చయించుకొంది. తన ఇంట భోజనం చేయుమంది. తాను అప్పటికే అన్నంతిన్నానన్నాడతను. పరదేశివి కాబట్టి ఈరోజు రాత్రికి తన ఇంటనే ఉండవల్సిందని .ఆమె అభ్యర్థించింది. రాజపుత్రుడు 'సరే' అన్నాడు.

ఆమె తన ఇంట పడగ్గదిలో ఓ గుంత (గొయ్యి) తవ్వించింది. దానిపై శయ్య ఏర్పాటు చేసింది. రాజపుత్రుణ్ని ఆ శయ్యపై పడుకోమంది అప్పుడతనికి ఆశ్లోకంలోని రెండో పాదం గుర్తుకు వచ్చింది. దాని ప్రకారం పడుకొనేముందు శయ్యను చేతితో తడిమి చూడాలి. అతనట్లే చేశాడు. రహస్యం బట్టబయలైంది. రాజపుత్రుడు తనను రక్షించిన ఆ శాస్త్రశ్లోక పత్రాన్ని కళ్ల కద్దుకొన్నాడు. అర్థం కొరకు ప్రాణాలు తీయడానికైనా వెనుకాడని ఆ వేశ్యకాంతను దూషించి, పరదేశానికి పయన మయ్యాడు.

ఆ దేశంలో అడుగు పెట్టిన వెంటనే ఓ విచిత్ర సమాచారం; ఆ దేశం రాజపుత్రిని ఎవరు పెళ్లి చేసుకొంటే వారు, పెళ్లినాటి రాత్రే మరణిస్తున్నారని తెలుస్తుంది. అప్పటికి ఎందరో చనిపోయారని వర్తమానం అందింది. ఆ రహస్య మేదో భేదించాలనుకున్నాడు రాజపుత్రుడు.

శాస్త్రం - లోకానుభవం రాజపుత్రునికి కొండంత అండగా ఉన్నాయి; సాహసించాడు; ఆపట్టం రాచపట్టిని పరిణయ మాడాడు. ఆ రోజు పడగ్గదిలో అతను అడుగు పెట్టక పూర్వమే రాజపుత్రి నిదుర పోయింది. గదిలో సహధర్మ చారిణి; ఉలుకూ పలుకూ లేక పడి ఉంది. అది గాఢ నిద్రేనా! అవి దంపతుల గదేనా! అలా అనిపించ లేదతనికి. ఆ ప్రదేశం పరదేశంగానే కనిపించింది. వెంటనే శాస్త్రంలోని మూడవపాదం గుర్తుకు వచ్చింది. దాని ప్రకారం పరదేశంలో నిదుర పోరాదు; జాగరణ చేయాలి. అతను శాస్త్రకారుణ్ని మెచ్చుకున్నాడు.

కంటి మీదికి కునుకు రాకుండా కాచుకొని కూచున్నాడు. ఊరికనే కాదు. ఖడ్గధారియై ఉన్నాడు. రాజపుత్రినీ పరిసరాల్నీ పరిశీలిస్తూ అతిజాగ్రత్తగా ఉన్నాడు.

సరిగా అర్ధరాత్రివేళ రాజపుత్రి నాసిక నుండి రెండు పాములు బుసలు కొడుతూ వచ్చాయి. ప్రమాదాన్ని పసిగట్టిన రాజకుమారుడు వెంటనే వాటిని ముక్కలు ముక్కలుగా ఖండించాడు.

అప్పుడే మేడమీది (ఉపరిగవాక్షం) నుండి ఓ రాక్షసుడు గదిలోకి దిగాడు. రాజపుత్రుణ్ని పట్టుకోడానికి చేతులు చాచాడు. వెంటనే అతని రెండు చేతుల్ని రాజకుమారుడు ఖండిచాడు. మొండి చేతులతో రాక్షసుడు మొండిగా పారిపోయాడు. అప్పుడే రాజపుత్రి కళ్లు విప్పింది. చచ్చిన పాముల్ని, ఖండిత హస్తాల్ని చూసి భయభ్రాంత అయ్యింది, రాజకుమారుడామెకు జరిగినదంతా వివరించి చెప్పాడు. ఆమె తనకు పట్టిన రాక్షస గ్రహపీడ విరగడైనందుకు సంతోషించింది. పట్ట లేనంత ఆనందంతో అతని పాదాలపై వాలిపోయింది. రాజకుమారుడామెను కౌగిలించు కొన్నాడు.

ఆ తర్వాత మామగారి రాజ్యమంతా అతనికే దక్కింది. తనకు లభించిన రాజ్యగౌరవ విశేషాల్ని వివరిస్తూ తండ్రి దగ్గరికి దూతను పంపించాడు. తాను తండ్రిని చూడ్డానికి వస్తున్నట్లు తెలియ జేశాడు. తన కొడుకు ఎంత వాడయ్యాడని ఆ తండ్రి ఎదురు చూస్తుండగ వెళ్లాడు.

తండ్రిగారానాడు విసరి కొట్టిన శాస్త్రం సాధించిన పరమార్థాన్ని విశదీకరించాడు. అంతే గాక ఆ శాస్త్రంలోని చివరి పాదం ఏం బోధిస్తుందో తెలిపాడు. క్రోధాన్ని ప్రప్రథమంగానే నివారించాలన్నాడు. తండ్రి ఆనాడు ఆవేశంగా వ్యవహరించిన తీరునుదాహరించాడు. ఆతండ్రి తనకు జ్ఞానోదయమైందని కొడుకునుకౌగిలించుకొన్నాడు."[1]

కథాత్మకాలైన పొడుపు కథల ఛాయలున్న ఇలాంటి శ్లోకాలు మన సాంప్రదాయక విజ్ఞాన కోశాలు. జానపదుల హృదయమర్మాలెరిగిన కవి

1. శ్రీ బలిజశరణప్ప. వయస్సు 56 సం॥లు; భావంవారిది; భాషనాది.

పండితులే వీటికి కర్తలు పద్యావివరణాని పపయుక్తాలైన ఇలాంటి శ్లోకాలన్నీ కేంద్రిత కాంతి బిందువులు. కథా వివరణసుంతా ఆ బిందువు ననుసంధించు కొని పరిభ్రమించే కాంతిపుంజం.

## 3-2 : వికాసం

ఆంధ్రసాహిత్యంలో పెల్లడ్డ చాలా కావ్యాలు సంస్కృతానుకరణాలు. సంస్కృత పంచతంత్ర హితోపదేశాలు, బేతాళపంచ వింశతి, కథాసరిత్సాగర. దశ కుమార చరిత్రం, మంచన కేయూర బాహు చరిత్రం, జక్కన్న విక్రమార్క చరిత్ర, గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, పాలవేకరి కదిరీపతి శుకసప్తతి కథలు, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి తదితర తెలుగు కథా కావ్యాల్లోనూ, ప్రశ్నోత్తర ప్రాయాలైన అనేక సన్నివేశాల్లోనూ పొడుపు కథల ఛాయలు కనిపిస్తున్నాయి. అయితే ప్రశ్నను పొడిచిన సమాధానాన్ని విప్పిన ప్రతి సన్నివేశంలో పొడుపుకథల చాయలున్నాయని చెప్పవచ్చుగాని కథ నిండా ప్రశ్నోత్తర రామణీయక దృశ్యాలు చమత్కార చారుతను రంగరించుకొని ఉన్నాయని నిరూపించలేం. అందువల్లనే పొడుపుకథల్లో కథా కావ్య గుణాల చాయలు, కథా కావ్యాల్లో పొడుపుకథల ఛాయలు అక్కడక్కడ కన్పించడం సంభవమయింది.

ప్రసిద్ధి పొందిన కొన్ని సంస్కృత కావ్యాల్లోని శ్లోకాలకు కట్టుకథ (marchen) లేర్పడ్డాయి. అనేక లక్షణాలంకృతాలైన పొడుపు కథల్లో సగానికి పైగా కట్టుకథలే ఉన్నాయి. కట్టుకథ పొడుపు కథ లక్షణాంశం. మహాకవి భారవి కిరాతార్జునీయంలోని శ్లోకం, పాణిని అష్టాధ్యాయిలోని సూత్రం కథాత్మకాలైన పొడుపు కథల ఛాయలకు నిదర్శనాలుగా కనిపిస్తాయి.

* "సహసా విదధీత న క్రియా
మవివేకః పరమాపదాం పదం।
వృణుతేహి విమృశ్య కారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥"[1]

---

1. కిరాతార్జునీయమ్, ఆ-2, శ్లో : 30

-భారవి నిరుపేద; కలిగిన ఇంటి నుండి వచ్చిన భార్య. 'పాండిత్యముండి ఏం లాభం ధనం లేకుండా' అని ఆక్షేపించి దెప్పి పొడుస్తుండేది. ఇక కొంత ధనమన్నా సంపాదించక తప్పదని భారవి బయల్దేరాడు. ఓ సరస్సు ఒడ్డున కూచొని అప్పటి కప్పుడు స్ఫురించిన భావాన్ని పై శ్లోకంగా కూర్చాడు. ఓ కమ్మ పై వ్రాశాడు. ఆ ప్రాంతానికే వేటకై వచ్చిన ఓ రాజు ఆ శ్లోకాన్ని చూశాడు. 'ఆత్రం పనికిరాదు-ఆలోచించి పనులు చేయాలి' అనే భావార్థం ఆశ్లోకం అందిస్తుం డడం గమనించాడు; కవిని ప్రశంసించాడు. తన వెంబడి రాజభవనానికి రావల్సిం దని చెప్పి ఆశ్లోకం కమ్మను తీసుకొని వెళ్లిపోయాడు అది తాను పడుకొనే పై భాగంలో కట్టాడు

కొన్నాళ్లకు భారవి రాజ సందర్శనార్థం వెళ్లాడు చింపిరి గుడ్డల్లో ఉన్న భారవిని ద్వారపాలకులు నిరోధించారు.

రాజోనాడు వేటకు వెళ్లి ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. రాత్రి బాగా పొద్దు పోయాక శయనమందిరానికి వెళ్లాడు. శయ్యపై రాణితో పాటు ఎవరో యువకుడు న్నాడు ఆ యిద్దరిని అలాగే చంపాలని కత్తి ఎత్తాడు. ఎదురుగా ఆ శ్లోకమున్న కమ్మ కనిపించింది. ఎత్తిన కత్తి దించి ఆలోచనలో పడ్డాడు. రాణిని మేల్కొలిపాడు. ఆ యువకుడు కొన్నేళ్ల క్రితం తప్పిపోయిన తమకుమారుడని తెలిసింది. తమను మహావిపత్తు నుండి రక్షించింది, ఆ శ్లోకమేనని రాజు ఆ కమ్మను కళ్లకద్దుకున్నాడు. ఆ మరు నాటి నుండే మహాకవి భారవిని అన్వేషించడం ప్రారంభించాడు. చివరికతని స్థలం ఇల్లా-పొల్లా అన్నీ తెలుసుకొని ఘనంగా సత్కరించాడు."

నిజానికీ శ్లోకం కిరాతార్జునీయంలోనిది. ఈ శ్లోకంచుట్టూర అల్లబడ్డ ఈ కథ గమనిస్తే, కొన్ని కథాత్మక ప్రహేళికలకు ఇలాంటి శ్లోక కథనాలు మూలాలా అనిపిస్తాయి. శ్లోకాలే కాదు, కొన్ని చిన్న సూత్రాల చుట్టూరా కథలల్లబడ్డాయి.

* "ఖరిచ[1]"

"ఇది పాణిని అష్టాధ్యాయిలోని సూత్రం అష్టాధ్యాయి రచన సందర్భంలో వ్యర్థాక్షరమొక్కటి కూడా చెప్పనని పాణిని ప్రతిజ్ఞ చేశాడు. ఆయన చెఐతు

1. అష్టాధ్యాయి 8-4-55.

న్నాడు; శిష్యులు వ్రాస్తున్నారు. ఆ సమయంలో ఆయన తొడకో గండుచీమ కరిచింది. పాణిని ఆ బాధ భరించలేక గట్టిగా 'ఖరిచ' అన్నాడు. శిష్యులది కూడా వ్యాకరణ సూత్రమనుకొని వ్రాసేశారు. ప్రతిజ్ఞ పొల్లయి పోయిందే అని పాణిని ఆలోచనల్లో పడ్డాడు. మీ నోట వెల్వడ్డ ఏ ఒక్క పదమూ వ్యర్థంకాదని అది సూత్రంగా ఎలాఅవతరించిందో ఏ అర్థాన్ని అది ప్రతిపాదిస్తుందో.విశదీకరించారు శిష్యులు".

అష్టాధ్యాయి బోధనా సందర్భంలోగాని, వ్యాకరణ సూత్రాల్లో పొల్లక్షరాలుండవనే సందర్భంలోగాని బోధన రక్తి కట్టడానికి ఆచార్యులీ విషయం చెబుతుంటారు. అదే విధంగా ఆంధ్ర సాహిత్యంలోని అనేక పద్యాలు, పద్యాంశాలు, చాటువులు, సామెతలు, పలుకుబళ్లు, పదబంధాలు, సమస్యలు, గద్యాలు, గద్యాంశాలు కథాత్మకాలైన పొడుపు కథలకు మార్గదర్శకాలుగా కనిపిస్తున్నాయి. పోతన్నగారి ఈ క్రింది పద్యం ఓ పండితునికి ఉద్యోగం ఇప్పించిన సంఘటన కథగా ప్రచారమయ్యింది.

* "లావొక్కింతయులేదు; ధైర్యమువిలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁదనువుండస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవే తప్పనితః పరంబెఱుగ మన్నింపందగున్ దీనునిన్
రావే! యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా![1]"

"-భారత దేశంలోకి ఉద్యోగ రీత్యా బ్రిటను నుండి వచ్చిన ఆంగ్లేయుల్లో కొందరు కళాసార స్వతాభిమానులున్నారు. అందులో ఆంధ్ర భాషకెనలేని సేవ చేసిన సి.పి. బ్రౌన్ అగ్రగణ్యుడు. సివిల్ సర్వీసు ఉద్యోగిగా అనేక బాధ్యతల్ని నిర్వర్తిస్తూ బహుభాషా ప్రావిణ్యాన్ని సాధించిన కవిపండితునిగా, కవిపండిత పోషకునిగా ఆయన విశిష్టకీర్తి నార్జించాడు. ఆయన దగ్గరికి ఉద్యోగార్థియై వచ్చిన ఓ పండితుడు పై పద్యాన్ని 'దరఖాస్తు'లో వ్రాశాడు. మకర రూప సంసార బంధిత గజేంద్రతుల్యుడైన ఆపండితునికి "ఏనుమృతుండ"నవుదునని చింతించడం కూడదనే పోతన పద్యాన్నే సమాధానంగా వ్రాసి పంపి, పిలిపించుకొని

1. భాగవతము, స్కం-8, ప: 90.

బ్రౌన్ ఉద్యోగమిచ్చాడు." ప్రాచీన కావ్యాల్లోని కొన్ని పద్యాలవిధంగానే కథా వృతాలయ్యాయి. పద్యాలేగాక పద్యాంశాలు కూడా సంఘటనలకూ కథలకు నిలయాలయ్యాయి.

* "ఏమి చెప్పుదున్ గురునాథా!"[1]

"మహాకవి తిక్కన భారతాన్ని తెనిగించేప్పుడు మిత్రుడు గురునాథుడు వ్రాయసకాడుగా వ్యవహరించాడు. గంటం ఆగకుండా చెబుతాననీ, పొరపాటు చెప్పననీ, ఒకవేళ చెబితే నాలిక కోసుకుంటాననీ తిక్కన ప్రతిజ్ఞచేశాడు. ఆంధ్రీకరణం నిరాఘాటంగా సాగిపోతున్నది. శల్యపర్వంలోని ఓ కరుణరస ఘట్టాన్ని వివరించేప్పుడు తిక్కన గొంతు పూడుక పోయింది; మాటలు పెగల్లేదు, ఆ మహాకవి ఆ ఘట్టంలో అంతగా లీనమై పోయాడు. పర్వం మూడు పాదాలు పైగా పూర్తయింది. 'ఏమి చెప్పుదున్ గురునాథా;' అన్నాడు నిండా విషాదంలో మునిగిపోయి. పద్యం తప్పు చెప్పానంటూ నాలికకోసుకోవడానికి సిద్ధమయ్యాడు. గురునాథా, కురునాథాగా మారి పద్యంలో ఎలా అతికి పోయిందో వివరించాడు వ్రాయసకాడు గురునాథుడు. పద్యాంశాలకు కూడా ఈ విధంగా కథలు చుట్టుకొన్నాయి.

ఇక చాటువుల చుట్టూరా అల్లుకొన్న కథలైతే కోకొల్లలుగా లభిస్తున్నాయి. తెనాలి రామలింగని హాస్య కథలెన్నో పద్యాల చుట్టే అల్లుకొన్నాయి.

* "ఆ రవి వీరభద్రు చరణాహతి డుల్లినబోసి నోటికిన్
నేరడు రామలింగకవి నేరిచెబోమన ముక్కుతిమ్మన
క్రూర పదాహతిం దెగిన కొక్కెర పంటికి దుప్పికొమ్ము ప
ల్గారచియించినాడు రవిగాననిచోఁగవిగాంచు నెయ్యెడన్"[2]

ఓ రోజు రామకృష్ణుడు ముక్కుతిమ్మన్న ఇంటికి వెళ్లాడు. ఆ సమయంలో ముక్కుతిమ్మన్న బంగారుతొట్టెలో కూర్చొని ఉయ్యాల ఊగుతున్నాడు. రామలింగడు ముక్కు తిమ్మన్నను చూచి పరిహాసంగా 'తాతా! ఊతునా అన్నాడు ముక్కు తిమ్మన్న ఉయ్యాల ఊతునా అని అడుగుతున్నాడను

2. ఆంధ్ర మహాభారతము, శల్య, 1 ఆ-ప : 401.
1. తెనాలి రామలింగకవి హాస్య కథలు, పు : 31.

కొన్నాడు. 'సరే' అన్నాడు. వెంటనే రామలింగ కవి తిమ్మన్న ముఖం మీద తుప్పున ఉమిశాడు. ముక్కు తిమ్మన్నకు కోపం వచ్చింది. రామకృష్ణుని పళ్లకు తగిలేట్టుగా చెప్పుకాలితో గట్టిగా ఒక్క తన్ను తన్నాడు. ఆ తాపుతో ఓ పన్నూడి నేల పడింది. రామకృష్ణుడు సిగ్గు పడ్డాడు. ఇంటికి వెళ్లి దుప్పి కొమ్ము పల్లుగా చెక్కించుకొని ఎవరికి తెలియకుండా అమర్చుకొన్నాడు. మరుసటిరోజు యథా విధిగా సభకు వెళ్లాడు. ఈ విషయం అప్పటికే భట్టుమూర్తికి తెలిసిపోయింది. అతనో పర్యాయం ఈ రామకృష్ణుని వల్ల అవమానానికి గురయ్యాడు. ప్రతీకారం తీర్చుకోడానికి ఇంతకు మించిన మంచి తరుణం రాదని ఆశువుగా పై పద్యాన్ని చదివాడు."

పద్యాంశాలే కాక కొన్ని సామెతలైతే కథలమీద ఆధారపడే నిర్మిత మయ్యాయి. కొన్ని సంఘటనల పిండీకృత సారంగా కూడా సామెతలు తయార య్యాయి. చిన్నపాటి వివరణతో తెలుగు సామెతల్లో ముద్రితమైన ఈ క్రింది అంశం పరిశీలనార్హం.

* "తురకమెచ్చు గాడిద తన్ను సంకటమే.

-ఒక నవాబు ఒక బ్రాహ్మణుని విద్యను మెచ్చుకొని తలకు పూలదండ చుట్టమన్నాడు, ఆయన జోడి తలలో దండ నిలువనందున తలలో మేకు దిగగొట్టి దండ తగిలించమని, అట్లే చేయగా ఆనందించినాడట."[1]

పలుకుబళ్ల వెనుక పదబంధాల వెనుక కూడా కథలుంటాయి. 'జిత్తులమారి' చుట్టూ ఉన్న కథ ఇలాంటిదే.

* "జిత్తుల మారి."

జంతువుల్లో నక్క టక్కరి; అందుకే దానికి జిత్తుల మారి అని పేరు. ఓ నక్క తాబేలును పట్టింది. నక్కమోసాలు (జిత్తులు) చేసి కోళ్లనూ చిన్న చిన్న జంతువుల్ని పట్టి (మారి) చంపుతుంటుంది. అయితే ఇప్పుడు పట్టిన ఈ తాబేలు దాని నోట పట్టుకు చిక్కడం లేదు. తాబేలు కూడా అంతకు మించి ఉపాయాన్ని పన్నింది. తనను నీళ్లో పెట్టి నాన్చి తినుమని చెప్పింది. నక్క నమ్మింది.

2 తెలుగు సామెతలు, పు : 316.

తాబేలును నీటిలో పెట్టి కాలితో అణచి పట్టింది. అంతా నాసిందిగాని కాలి క్రింద నానలేదు! కాలు తీయమని తాబేలన్నది. నక్క కాలు తీసింది; తాబేలు వెంటనే నీళ్లలోకి జారుకొంది; ఆ విధంగా ఉపాయంతో తాబేలు తప్పించుకొంది. 'నక్కజిత్తులన్ని నా దగ్గరుండంగా తప్పించుక పోయెరా తాబేటి బుట్ట' అని నక్క విచారించింది. టక్కరి పనులు చేసే వాణ్ని వాడో జిత్తుల మారి, వాడివన్నీ నక్క జిత్తులే అని వ్యవహరిస్తుంటారు.

* "రేగు చెట్టు భాగవతము."[1]

కొన్ని పదబంధాల వెనుక కూడా కథలున్నాయి. తనకు తెలియకున్నా తెలిసినట్లుగా నటించే సందర్భంలో ఉపయోగించే పదబంధమిది

ఓ గుడ్డివాడు భాగవతం చూడ్డానికి వెళ్లాడు. ఏదయినా హాస్య ఘట్టం వచ్చినపుడు తన్ను గిరుమని పక్కవానికి చెప్పాడు. వాడు గిరినప్పుడల్లా నవ్వ సాగాడు. భాగవతం అయిపోయింది, పక్కవాడు వెళ్లిపోయాడు. ఈ మధ్యలో ఇతనికి నిద్రపట్టింది. ఎవరున్నారో ఎవరుపోయారో కూడా తెలువదు. పక్కనున్న రేగుకంప మాత్రం గాలికి కదలినప్పుడల్లా గుడ్డి వాణ్ని గీసుకుంటుంది. పక్కవాడే గీరుతున్నాడనుకొని గుడ్డివాడు నవ్వుతూనే ఉన్నాడు..

కొన్ని ప్రాచీన సమస్యల పూరణాల పూర్వాపరాల్ని పరిశీలిస్తే వాటి వెనుక కూడా సంఘటనలున్నాయని, అవి కథలుగా లోకంలో ప్రచలిత మయ్యాయని తెలుస్తుంది. కుంజరయుధం దోమకుత్తుక కథ జగత్ప్రసిద్ధం కదా!

* "కుంజరయూథంబు దోమ కుత్తుక జొచ్చెన్.

తెనాలి రామకృష్ణుడు కృష్ణరాయల ఆస్థాన కవి. తన వాక్చాతుర్య పుణ్యంతో కవితాచాతుర్యంతో రాయల మన్ననలందుతున్నవాడు. రాయలంతటి వాడు రామకృష్ణునికి దాసోహమంటున్నాడని ఈర్ష్యతో ఓ కవి పుంగవుడీ సమస్య ఇచ్చాడు. దానికి రామకృష్ణుడతణ్నే తిడుతూ పద్యం చెప్పాడు. సరసం విరసంగా మారిందని భావించిన రాయలు భారతార్థంలో సమస్యను పూరించుమన్నాడు. రామకృష్ణుడు పూరించిన ఆ తిట్టుపద్యం, భారతార్థ పద్యం రెండు తెలుగునాట చాలా మందినోట ఈనాటికి నానుతున్నాయి.

1. పదబంధ పారిజాతము, సం-2, పు : 748.

* గంజాయి త్రాగి తురకల
సంజాతుల గూడి కల్లు చవిగొన్నావా!
లంజల కొడకా! ఎక్కడ
కుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్

* రంజన చెడి పాండవులరి
భంజనులై విరటు గొల్వ పాలైరకటా
సంజయ విధినేమందును
కుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్

అయితే ఇలాంటి వన్నీ పొడుపు కథలు కావు. పొడుపు కథల ఛాయలు, అందులో ప్రధానంగా కథాత్మక ప్రహేళికల ఛాయలు కనిపిస్తున్నాయని చెప్పడానికి, వాటి ప్రభావం పొడుపు కథల మీద పడిందని నిరూపించడానికి, పొడుపు కథలో కథలేదు అనే అభిప్రాయాన్ని దూరం చెయ్యడానికి బిందువునుండి సింధువు, ఉత్పత్తి, వికాసం, అనే శీర్షికల క్రింద ఈ సుదీర్ఘ వివరణమివ్వడం జరిగింది. ఇప్పుడు జానపదుల కథన కౌతుహలాన్ని అభివ్యక్తంచేసే కథాత్మక ప్రహేళికల్ని (Riddle tales) వివరిస్తాను.

ఈ గుప్త పొడుపు కథలు జానపదుల గుండెల్లోని కథా రామణీయకత్వాన్ని వెల్వరిస్తున్నాయి. ఇవి ధ్వనుల కాకరాలుగా నిలిచి ఉన్నాయి. దీర్ఘ ప్రహేళికలు, హ్రస్వ ప్రహేళికలు, పొడుపు సామెతలు కథా కథనం చేస్తూ చమత్కార చారుతను గుప్పిస్తున్నాయి.

వీటికున్న వైవిధ్యాన్ని బట్టి ఈ గుప్త పొడుపు కథల్ని పౌరాణిక (Mythological Riddles), చారిత్రక (Legendary Riddles), సాంఘిక (Sociological Riddles) కాల్పనికాలుగా (Novella Riddles) విభజించి పరిశీలిద్దాం. వస్తువృష్ట్యా చేసిన ఈ విభజన స్థూలమైందే అయినా ప్రస్తుతానికిదే సరిపోతుందని పించింది.

## 3-3 : పౌరాణికాలు

మనిషికి రూపదర్శనాభిలాష సహజమయిందే; ఆ రూపం వెనుక దాగి ఉన్న అంతరంగాన్ని అందుకోడానికి మాత్రం కొంత ప్రయత్నం చేయాల్సిందే. రూపాన్ని, అంతరంగాన్ని తత్త్వాభిముఖంగా గమింపజేసి మిత్ర సమ్మిత సాన్ని హిత్యాన్ని మనిషికందించి మహత్తర ప్రయోజనాన్ని సమకూర్చి పెట్టింది పురాగాథా సాహిత్యం. అష్టాదశ మహా పురాణాలు, ఉపపురాణాలే గాక వాటి చుట్టూర అల్లుకొని తత్ సదృశంగా కనిపించే అనేక కథాంశాల్ని పౌరాణికాలనే అనుకోడం సహజమైపోయింది. వాటికున్న పురాగాథా ప్రాధాన్యాన్ని బట్టి రామాయణాది గ్రంథాలు కూడా పౌరాణికాల క్రిందికే వచ్చాయి. ఇప్పటికే రామాయణం ఎవరైనా చెబుతుంటే 'ఆఁ పురాణం చెబుతున్నాడులే' అనడం లోక సహజమై పోయింది. అలాంటి పురాణాల్లో యుగ యుగాల సంస్కార మున్నదని హిందుజాతి భావిస్తున్నది. అందుకే పురాగాథా విజ్ఞానాన్ని ఈ జాతి నెమరు వేస్తూ కట్టుకొన్న పదజాలమే పౌరాణిక కథాత్మక ప్రహేళికగా భాసిస్తున్నది. పదం పొడుపుకాగా, ఆ పదం చుట్టూర ఆవరించుకొని ఉన్న, లేదా అంతరంగంలో ఉన్న భావ ప్రకాశం విడుపుగా వికసిస్తున్నది.

### * మూడింట ముగిసెనేకథ

ఈ పొడుపు కథను చెప్పిన విన్నప్పుడు ఏ మూడింట కథ ముగిసిందన్న ఆలోచన వస్తుంది. ఆ మూడేవని మనస్సు పరిశీలిస్తుంది సృష్టిస్థితిలయాలతో కథ ముగిసిందా, అండం పిండంగా, పిండం దేహంగా మారి కథ ముగిసిందా అని బుద్ధి తర్కిస్తుంది. ఆ తర్కం నిజాన్ని తెలిపి అందిస్తుంది ఆ నిజం రామాయణ గాథే. ఆ మూడు కట్టె-కొట్టె-తెచ్చె అనేవే. 'దీనిని చిన్న పిల్లలు ఒక్కొక్కరి పొడుపు కథగా ఉపయోగించుకోడం కూడా కద్దు',[1]

చిన్నపిల్లలేకాదు పెద్దలు కూడా పయోగిస్తారు "మూడింట ముగిసేకథ, కట్టెకొట్టెతెచ్చె" అనే ఈ పొడుపు విడుపులున్న కథ ఒక్కటే.

1. జానపద సాహిత్య స్వరూపం, పు : 77

దశరథుడు కోసల దేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఆ దేశానికి రాజధాని అయోధ్య. ఆ రాజుకు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను నలుగురు కొడుకులున్నారు. వారికి మిథిలరాజు రాజ బంధువుల పుత్రికలతో వివాహం జరిగింది. దశరథుడు తనభార్య కైకకిచ్చిన వరాల కారణంగా రాముడు **భార్య సహితుడై అరణ్యాలకు వెళ్లాడు. ఆ దంపతుల్ని లక్ష్మణుడు అనుసరించాడు. అరణ్యంలో శ్రీరాముని భార్య సీతను లంకాధిపతి** రావణుడపహరించాడు. సముద్ర మధ్యంలో ఉన్న లంకలో ఆమెనుంచాడు. రాముడు వానర సైన్యం సహకారంతో వారధిగట్టాడు; రావణున్ని కొట్టాడు, సీతను తెచ్చాడు.

మూడు ముక్కల్లో మహా కావ్యార్థాన్ని నిక్షేపించిన శక్తి పొడుపు కథది, ఆ పొడుపు కథ పట్టిన తెలుగు జానపదునిది.

* ఇంటి గుట్టు లంకకు చేటు

మడికట్టుమీద తాతగారు నడుస్తున్నాడు. ఆ తాతగారి కూతురు కొడుకు పట్టణం నుండి వచ్చాడు. జాగ్రత్తగా తాతగారిని అనుసరిస్తున్నాడు. తమ యింటి వ్యవహారాల్ని చెబుతున్నాడు. తాతగారు 'ఊ' కొడుతున్నాడు. మనుమడేమో నాయనమ్మ ఛాందసాల్ని దుయ్యబడుతున్నాడు.

తాతగారు ఓ క్షణం ఆగారు, మనుమనివైక్కు ఎగాదిగా చూశారు. "చూడు బాబూ! ఇంటి గుట్టు లంకకు చేటు" అంటే ఎంటే చెబుతావా! సూటిగా కళ్లల్లోకి చూస్తూ అడిగాడు.

రామాయణ కావ్యాధ్యేత మాత్రమే ఆ పొడుపునకు విడుపు చెబుతాడు. 'నాకు తెలువదు తాతయ్యా! నీవే చెప్పు అన్నాడు మనుమడు. ముడివేయడం ముడివిప్పడం' ఈ రెండింటి ద్వారా జ్ఞానోపదేశం చేయడం తాతగారి వంతే అయింది.

'రావణుడు శ్రీరాముని ధర్మపత్నిని సీతనపహరించాడు. అది అధర్మమని, సీతను రామునికి నప్పగించి శరణువేడుకోవాల్సిందని అని రావణుని సోదరుడు విభీషణుడు ఉపదేశం చేశాడు. రావణుడు వినలేదు పైగా తమ్ముణ్ని దూషించి

తిరస్కరించి తన్నే తగలేశాడు. విభీషణుడు శ్రీరాముని దరిచేరాడు; ఇంటి గుట్టు విప్పి చెప్పాడు; లంకకు చేటు తెచ్చిపెట్టాడు."

మనుమడు మాట పలుకలేదు. మౌనంగా తాతగారిని అనుసరించాడు.

రామాయణ గాథాంతర్గత సంఘటనలెన్నో ప్రదర్శించే ఇలాంటి పొడుపు కథలు తెలుగు నాట సామెతల రూపంలో బహుళ ప్రచారాన్ని పొందాయి. సామెత రచనకూ ఉపన్యాసానికీ సౌందర్యాన్ని ఆపాదిస్తుంది. పొడుపుకథ బుద్ధికి పటుత్వాన్ని కలిగించి జ్ఞాపక శక్తిని పెంచుతుంది. ఇక భారత గ్రంథాంశాల్ని ప్రదర్శించే ఒకటి రెండు పొడుపు కథల్ని పరిశీలిద్దాం.

* కాగల కార్యం గంధర్వులే తీర్చారు.

తప్పు చేసిన తమ్ముణ్ని దిద్దటానికి అన్న ప్రయత్నించాడు. తమ్ముడు తనను తాను దిద్దుకోడానికి అనుకూలంగా లేడు. చివరకో రోజు పోలీసులకు చిక్కాడు. తండ్రి కేంచేయాలో అర్థంగాక పెద్ద కొడుకును ప్రాధేయపడి 'చిన్నవాణ్ని విడిపించరా' అన్నాడు.

'కాగలకార్యం గంధర్వులే తీర్చారు' అన్నాడు పెద్దకొడుకు.
'అంటే ఏంటి నాన్నగారు' అడిగింది అమ్మాయి.
'నువ్వు భారతం చదివావు గదమ్మా' ప్రశ్నించాడు తండ్రి.
'ఓ' అంది అమ్మాయి.
'ఆలోచించు' సూచించాడు తండ్రి.

ఆ అమ్మాయి ఆలోచించింది; అర్థం గ్రహించింది; ఇది సామెతగా మారిన పొడుపుకథ అంటూ పిల్ల పిల్లకూ చెప్పింది.

మాయాజూదంలో పాండవులోడిపోయారు, "అరణ్యాల పాలయ్యారు. దుర్యోధనుడు ఘోషయాత్ర నెపంతో వారిని పరిహాసాలపాలు చేయాలనుకున్నాడు. తన కే ఎంతో ఉందని మిడిసి పడుతూ రథగజతురగ పదాతి బలాలతో, సేనీ సేనాం బలాంతో అరణ్యంలో ప్రవేశించాడు. అక్కడ గంధర్వుల సరస్సును దుర్యోధనుని ధటుబుపయోగించుకున్నాడు. గంధర్వులు పట్టున్న తన్నే తగిలేశాడు. దుర్యోధనుడు తన సర్వ బలాలతో గంధర్వుల్ని ఎదిరించి యుద్ధం చేశాడు; ఓడి

పోయాడు; వారికి బందీ అయ్యాడు. అప్పుడీవార్త పరిచారకులు ధర్మజునికి చేర వేసి కాపాడవలసిందని ప్రార్థించారు. ఆ సమయంలో అక్కడే ఉన్న భీముడు కాగల కార్యాల్ని గంధర్వులే తీర్చారని అన్నాడు. ఒక సంఘటనను సంక్షిప్తం చేసుకున్న పొడుపు సామెతగా ఇది భాసిస్తున్నది.

* ఆవుల మలిపిన వాడే లర్జునుడు.

అర్జున శబ్దం వాచ్యమయింది; ఇది భారతాంతర్గత సంఘటనంగా తెలిసి పోయింది. అయితే సందర్భమేంటి! తనలో గుప్త పరచుకొన్న కథాంశాన్ని విప్పితేగాని అది అవగతంకాదు.

మాయా జూదంలో పాండవులోడిపోయారు. పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం పూర్తి చేసి, ఒక ఏడు అజ్ఞాతవాసం విరాటరాజు దగ్గర గడిపారు. అజ్ఞాత వాసంలో పాండవులెక్కడ ఉన్నారో తెలుసుకోడానికి దుర్యోధనుడెన్నో ప్రయత్నాలు చేశాడు. అతని ప్రయత్నాలు ఫలించలేదు. అయితే విరాటనగరంలో పాండవులుండవచ్చునని ఊహించాడు. సుశర్మతో దక్షిణ గోగ్రహణం చేయించాడు. అదివరకే భీముని దెబ్బకు కీచకుడు మరణించాడు విరాటునికేటూ పాలుపోక కింకర్తవ్యతామూఢుడయ్యాడు. ఆ సమయంలో ధర్మజ భీమ నకుల సహదేవులు విరాటునికి సహకరించారు. దక్షిణ గోగ్రహణాన్ని నిరోధించారు. అప్పుడే భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణులతో దుర్యోధనుడు ఉత్తర గోగ్రహణం చేశాడు.

నగరంలో విరాటుని పుత్రుడుత్తరుడున్నాడు. ఎత్తున గొందు కౌరవుల నెల్లను[1] ...' అంటున్నాడు; తేరికి సారధి లేనందువల్ల చింతిస్తున్నానంటున్నాడు. సైరంధ్రి బృహన్నలా రూపధారి అయిన అర్జునుణ్ని సారథిగా కుదిర్చింది. ఇక ఉత్తరుడు బయలుదేరాడు. కౌరవ సైన్యాన్ని చూశాడు; భయంతో గజగజ వణి కాడు. బ్రతికుంటే బలుసాకు తినవచ్చుననుకున్నాడు బృహన్నలను రథమాపు మన్నాడు. తేరుదిగి పరుగు లంకించుకున్నాడు. అర్జునుడాతణ్ని దెచ్చి నొగలపై కూచోబెట్టాడు. శమీ వృక్షంవైపు తీసుకొని వెళ్లాడు. అస్త్ర శస్త్రాలు వృక్షం పై నుండి క్రిందికి దింపించాడు పాండవుల స్వస్వరూపాల్ని ఉత్తరునికి తెలిపాడు. ఆ తర్వాత కౌరవసైన్యాన్ని ఎదిరించాడు. సమ్మోహనాస్త్రంతో సైన్యాన్ని నేల

1. భారతము, విరాట పర్వము, ఆ-4, ప : 9.

కొరిగించాడు. ఒక్కడే అమరులకసాధ్యమైన కార్యం నెరవేర్చాడు. ఆవులను మళ్లించాడు; ఆవుల మరిపినవాడే అర్జునుడన్న సన్మానాన్ని ఆంధ్రావళితో అందుకొన్నాడు.

అది ఏనాటికథ! తాతల నాటికథ! ఎప్పటికథ అయితే ఏమిటి! ఇప్పుడైనా-ధర్మయుద్ధంలో విజేత అయిన వాడర్జునుడే. గోసంరక్షణం చేసి మాతృభూమికి పరమైశ్వర్యానికి-తోడ్పడేవాడే విజయుడే! వీర భారత పుత్రుడే! అది కేవలం పొడుపుకథే కాదు; సామెతే కాదు, జాతి సాంప్రదాయకతా సంఘటనాన్ని నిక్షిప్తం-చేసుకొన్న స్ఫూర్తి కిరణం

ఆంధ్ర పౌరాణిక సాహిత్య భాండాగారంలో ప్రహేళికా ఛాయలున్న పద్యాలు పౌరాణిక ప్రహేళికల కోవలోకే వస్తాయి. పరమార్థ ప్రబోధకం, తాత్త్విక చింతనాభివ్యక్తీకరణం ఈ క్రింది పద్యం. ఇందులోని పొడుపుకథాంశాన్ని గుర్తించవచ్చు.

'జనకుండెవ్వడు, జాతుడెవ్వడు, జనస్థానంబులెచ్చోటు, సం
జననం బెయ్యది, మేనులెక్కడివి, సంహారంబులేరూపముల్
వినుమాయంతయు విష్ణుమాయ తలపన్ వేరేమియున్ లేదుమో
హనిబద్ధంబది మూలమింతటికి జాయా! ఏన్నబో నేటికిన్'[1]

ఇందులోని ప్రశ్నలన్నిటికి ఒకే సమాధానం విష్ణుమాయ; పెక్కు పొడుపులకు ఒకే ఒక్క విడుపు. ఇలాంటివే కొన్ని మార్పులతో పొడుపు కథలవుతాయి. జానపదుల సృష్టిగా భావిస్తున్న కొన్ని పౌరాణిక ప్రహేళికలకు భాగవతాది పురాణాలు మూలభూతాలయ్యాయి. పొడుపు కథాంశను నిక్షిప్తంచేసుకొన్న ఈ క్రింది పొడుపు పదబంధాన్ని పరిశీలిస్తే ఆ విషయం సుస్పష్టమవుతుంది.

* వాతాపి జీర్ణం వజ్రశరీరం.

"ఇల్వలుడూ వాతాపి ఇద్దరూ అన్నదమ్ములు; పైగా రాక్షసులు. వీరిద్దరు దుర్గమారణ్య ప్రాంతంలో దారితలన ఇల్లు కట్టుకొని వచ్చే పొయ్యేవారికి మర్యాదచేసి వాతాపిని పొట్టేలుగా మార్చి, దానిని చంపి ఆ మాంసంతో ఆతిథ్యమిచ్చేవారు-అన్న అయిన ఇల్వలుడు తిన్న తర్వాత వాతాపి అని పిలువగానే పొట్టలోపలి మాంసం మరలా మానవాకృతి నొంది, ప్రాణం పోసుకొని కడుపు

చేల్చుకొని బయటకు వచ్చి వచ్చిన అతిథిని వండుకొని ఆరగించేవారు. ఇట్లా జరుగుచుండగా ఒకనాడు అగస్త్య మహాముని ఆదారిన వచ్చినారు. ఆ రక్కసి అన్నదమ్ములు ఇదే కపటనాటకం ఆడినారు (భారతం వన పర్వంలో వాతాపిని సంస్కరించి అశనంగా సమర్పించినట్లు, రామాయణ అరణ్య కాండములో మేష ముగా మార్చి చంపినట్లు ఉన్నది.) ఋషి యోగదృష్టితో నిజం తెలుసుకొన్నాడు వాతాపి అని పిలువగానే, ఋషి వాతాపి జీర్ణమనగా లోపల జీర్ణించిపోయినాడు. తల్లులు పాలో మందో పిల్లలకు త్రాగించి ఈ మాట అనడం వాడాయం."[1]

కేవలం వాడాయంగా ఈ ఒక్క మాటే కాదు తల్లులంటున్నవి. పెద్ద పాటనే ఉన్నవి.

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం!
గుర్రాల్ తిన్న గుగ్గిళ్లరాగి
ఏనుగుల్ తిన్న వెలక్కాయలరిగి
అర్జునుడు తిన్న అరటిపళ్లరిగి
.... ... .... ........[2]

ఈ పాట చిన్నప్పుడు వినడంతోనే సరిపోలేదు; పాటలోని ప్రథమ పాదం పొడుపుకథగా మార్చుకొన్నారు, పదుగురు బాలబాలికలు కలిసినచోట పొడుచు కోడం పరిపాటయ్యింది. నర మాంసాన్ని తినే నరరూప రాక్షసులను ఓ కంట కనిపెట్టాలనే సందేశం అందుకోడం అందరివంతయ్యింది.

కథాత్మక సాంఘిక ప్రహేళికలతో సరిపోల్చినప్పుడు పౌరాణిక ప్రహేళి కలు స్వల్పాతిస్వల్పమనే చెప్పాలి. ఈ పొడుపుకథలన్నీ చాలావరకు సామెతల రూపాన్ని సంతరించుకోడం జరిగింది. అయితే కథాత్మక ప్రహేళికల వెనుక పెద్ద విడుపుకథ ఉన్నట్లే పౌరాణికాంశాలున్న సామెతల వెనుక కూడా కథలున్నాయి; ఆ విషయం సామెతలు-పొడుపుకథలు పరిశీలించే ప్రకరణంలో వివరించడం జరిగింది.

1. తెలుగు సామెతలు. పు : 539.
2. బాలభాష, పు : 20.

## 3-4 చారిత్రకాలు :

పురాగాథలకు ఆధారాలు గ్రంథాలు. గ్రంథ గతాంశాలు ఆనోట ఈనోట పడి పుక్కిటి పురాణాలుగా తయారవుతాయి. పురాణాల్లోని పేర్లు ప్రదేశాలకుంటాయి; వ్యక్తులకూ ఉంటాయి. కేవలం ఆ ఆధారాలతో పురాణం జరిగిందని నిరూపించడం సాధ్యంకాదు. అందుకే పురాణం సాహిత్యంలో ఒక ప్రక్రియగా భావిస్తాం. ఆ ప్రక్రియ ననుసరించినవన్నీ పురాణాలే అవుతాయి. అందువల్ల పురాణాంశాల విషయంలో వాస్తవమా అవాస్తవమా అని చర్చించాల్సిన అవసరంలేదు. అయితే చరిత్ర విషయంలో ఈ చర్చ తప్పనిసరి. లభించినఆధారాలను బట్టి ఇది వాస్తవం ఇదికాదు అని నిర్ధారించే అవకాశముంటుంది, చారిత్రకాంశాలకు శాసనాలో నాణేలో, విజయ స్తంభాలో, పనిముట్లులో, సమకాలీనుల వ్రాతలో ఆధారాలవుతాయి. ఆంధ్రుల చరిత్ర సంస్కృతులకు సంబంధించినంత వరకు, ఆంధ్ర కావ్య ప్రపంచంలోని పీఠికలు, అక్కడక్కడ గ్రంథాంతర్గత విషయాలు కొంత వరకు తోడ్పడ్డాయి, కొన్ని శతకాలు చరిత్ర సంస్కృతులకు దర్పణం పట్టాయి,

అయితే చారిత్రకాంశాల్ని, సంఘటనల్ని, కథల్ని నిక్షిప్తంచేసుకొన్న కథాత్మక ప్రహేళికలు లేవనే చెప్పాలి. కాని కొన్ని పద్యాలు, కొన్ని సామెతలు కొన్ని సమస్యలు, కొన్ని పదబంధాలు చారిత్రకాంశాలున్నకట్టుకథలకు నిలయాలుగా కనిపిస్తున్నాయి. వాటిని మాత్రమే కథాత్మక చారిత్రక ప్రహేళికలుగా ఉదాహరిస్తున్నాను.

* మంగలి కొండోజి మేలు మంత్రుల కన్నన్.

చదువుకున్న వానికన్నా చాకలి నయమనే మాట వింటుంటాం. చదువుకున్నవాడు విత్తంపై పే చిత్తాన్ని తగిలిస్తే అడుగడుగునా మోసగించడం మొదలు పెడతాడు. చాకలి తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూ ఒక్క వస్త్రం కూడా పోగొట్టకుండా తేడానికే పూనుకొంటాడు. అందువల్ల ఆ సామెత సత్యమే అనిపిస్తుంది.

అట్లే తన అనుభవాన్ని పురస్కరించుకొని పై పాదం చివరగా ఉన్న ఓ పద్యాన్ని కందుకూరి రుద్రకవి చెప్పారు. ఈ పాదాని కర్థమేంటని అడిగినప్పుడు తెలిసినవారు ఆ పద్యమంతా చదివి, ఆ పద్యం పుట్టుక వెనుక ఉన్న కథంతా చెబుతారు. అప్పుడీ పద్యం కథాత్మకాంశాలున్న ప్రహేళికగా భాసిస్తుంది.

"శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్ర దేశాన్ని పాలిస్తున్నాడు. ఆ రాజు రాజధాని విజయనగరం. ఆయన కవి పండితుల్ని విశేషంగా ఆదరిస్తుండేవాడు. కటిక దరిద్రంతో కటకట పడుతున్న కందుకూరి రుద్రకవి రాయల దర్శనార్థం తహతహలాడాడు. అందుకని రాయల ఆస్థాన కవులనూ మంత్రులనూ ఆశ్రయించాడు. కాని ఏ కారణంగానో అతణ్ని వారెవ్వరూ రాజ సన్నిధికి తీసుకొని పోలేదు. కందుకూరి రుద్రకవి తన గోడంతా రాయల మంగలి కొండోజితో చెప్పుకొన్నాడు అతను వెంటనే రుద్రకవికి రాయల దర్శనం చేయించాడు. ఆ సమయంలోనే కవికి రాయల దర్శనం చేయించాడు. రుద్రకవి చెప్పిన చాటువుగా ప్రసిద్ధికెక్కిందీపద్యం.

"ఎంగిలి ముచ్చు గులాములు
సంగతిగా కులము చెరుప చను దెంచిరహా
ఇంగిత మెరిగిన ఘనుడీ
మంగలి కొండోజి మేలు మంత్రులకన్నన్"

ఇది పెద్ద చరిత్ర కాకపోవచ్చు; అసలు చరిత్రే కాకపోవచ్చు. కాని రాయల సభలోని మంత్రి వరేణ్యుల కవి పండితుల ఈర్ష్యలకద్దం పట్టిన పద్యం. పూర్వాపరాలు తెలిస్తేనే పాదం అర్థమవుతుంది; పద్యం అర్థమవుతుంది.

* వాయెత్తడు రామరాయ వసుధేశునకున్

కృష్ణరాయల అల్లుడు రామరాయలు; విజయనగర సామ్రాజ్యాన్ని ఏలుతున్న రోజులు. రాజ్యంలో అంతర్గత కలహాలు అణచాడు; బయటి శత్రువులైన అహమ్మదునగర్, బీజాపూర్, బీదర్, గోల్కొండ సుల్తానుల మధ్య చిచ్చు రగిల్చి చాకచక్యంగా రాజ్యపరిపాలన కొనసాగిస్తున్నాడు అలాంటి దినాల్లో ఓరోజున హఠాత్తుగా వాయురోగానికి గురయ్యాడు.

ఎన్ని మందులకూ ఆ రోగం తగ్గలేదు. రామరాజు చేత భూషణుడైన రామరాజ భూషణుడనే భట్టుమూర్తి మాత్రం రాయల దగ్గరనే కూచొని తన పద్యాలు వినిపిస్తున్నాడు తెనాలి రామకృష్ణుడిది గమనించాడు. ఈ రోగం పోవాలంటే ఏం చెయ్యాలో అర్థమైంది. అంతః పుర స్త్రీల దగ్గరికి వెళ్లి ఈ ఉపాయం చెప్పాడు.

"ఓ యమ్మలాల మందుల
వేయేల మకారకొమ్ము విషకవి గానిన్
వాయెత్తకుండ జేసిన
వాయెత్తదు రామ రాయ వసుధేశనకున్"

—మకారకొమ్ము విషకవి అంటే మూర్ఖకవి. వాయి అంటే నోరు. వాయు రోగం.

ఆంధ్ర దేశాన్ని పరిపాలించిన ఆయా రాజుల కాలంలో, రాజవంశాల కాలంలో ఇలాంటి పద్యాలు కొన్నయినా పుట్టాయి. ఆ పద్యాల పూర్వాపరాల్ని పరిశీలించి నప్పుడు కథాత్మక ప్రహేళికల ఛాయలందులో ఉన్నాయని పిస్తుంది.

* తాతాచార్యుల ముద్ర భుజముదప్పినా వీపు దప్పదు.

ఈ దేశంలోన పుట్టింది వైదికా ధర్మం. ఈ ధర్మంలో వ్యక్తికిచ్చిన స్వేచ్ఛ కారణంగా మతాలు—మతాంతరాలు - శుప్పలు తెప్పలుగా వికసించాయి. దర్శనాలుకూడా వచ్చాయి. ద్వైతా ద్వైత విశిష్టాద్వైత త్రైత మతాలు కాలూను కొన్నాయి. ఈ మతాలు, తమ భక్తుల గుర్తింపు కొరకు కొన్ని విచిత్ర విధానాల్ని అనుసరించాయి. ఆ పరంపరలోనిదే ఈ ముద్రల పద్ధతి.

శ్రీ కృష్ణదేవరాయల గురువు తాతాచార్యులు. వారు వైష్ణవ మతాభిమానులు; వైష్ణవ మత దీక్షా స్వీకారం కొరకు ఎవరువస్తే వారికి కాల్చిన కడ్డీలతో వైష్ణవ శ్రీచక్రాల్ని ముద్రలుగా వేస్తారు ఆచార్యులవారు. ఆ ముద్రలు కూడా భుజాల పైననే వేయాలనే ఆచారముంది. దీక్షా స్వీకార నిమిత్తం వచ్చిన వారిలో కొందరు వాతల్లాంటి ముద్రలకు భయపడి పరుగెత్తేవారు. ఆచార్యులవారు వారి వెంబడి పరుగెత్తి ముద్రలొత్తేవారు. ఆ వేగంలో, ఆ ఆత్రంలో ఒత్తే ఆ ముద్రలు భుజాలపై పడకపోవచ్చు; కాని వీపుమీద మాత్రం తప్పక పడుతుండేవి.

ఇప్పుడు తెలుగునాట ఇదొక సామెత. ఈ సామెతల్లో కథాత్మక ప్రహేళికాంశ లక్షణాలున్నాయి. ఈ లక్షణాలున్న మరికొన్నిటిని చారి తకాంశాల క్రింద పరిశీలించవచ్చు.

* "ఏమీ అప్పాజీ అంటే
  కాలం కొద్దీ రాయాజీ అన్నాడట.
* మర్యాద రామన్న మాట తప్పినా
  నా వేటు తప్పదు.
* గోలకొండ ఉద్యోగం గొజ్జతోక.
* [illegible] చేస్తున్నారంటే
  తప్పులు చేసి దిద్దుకుంటున్నారు.
* తాతాచార్ల తద్దినానికి
  పిల్ల పండుగకు ఏమి సంబంధం.
* యాచమ నాయని త్యాగం
  గోచులకేగాక కట్టుకోకల కగునా"

జన వ్యవహారంలో వినిపిస్తున్న, ఆయా సామెతల గ్రంథాల్లో కనిపిస్తున్న ఇలాంటి కథాత్మక చారిత్రక లోకోక్తి ప్రహేళికలెన్నో ఈ అంశం క్రింద పరిశీలించి విశ్లేషించే అవకాశముంది. ఇవేకాక ఈ మధ్య కాలంలో వెల్వడ్డ కొన్ని సామెతల వెనుక కూడా చారిత్రక సామాజికాంశాలు కనిపిస్తున్నాయి. అందులో ఒకటి మాత్రమిక్కడ ఉదాహరిస్తాను.

* విడిచిన ముండకు వీరేశలింగం
  తెగించిన వాడికి తెడ్డే లింగం.

ఆధునిక భారతంలో తిష్ఠవేసుకొన్న కొన్ని దురాచారాల్ని నిర్మూలించి, సంస్కార భావాల్ని ప్రతిష్ఠాపించి వెళ్ళిపోయిన మహాపురుషుల్లో శ్రీ కందుకూరి వీరేశలింగం ఒకరు. వారు ఆంధ్రదేశంలో బాల్య వివాహాలు నిరోధించారు; విధవా వివాహాలు చేయించారు. వారి ఈ సంస్కరణల్ని సమర్థించిన వారున్నారు, వ్యతిరేకించిన వారున్నారు; వెక్కిరించిన వారూ ఉన్నారు. ఆ కాలంలో విధవలు వివాహం చేసుకోరాదనీ, చేసుకొంటే తెగించిన వారనీ, వారు నింద వేస్తుండేవారు. తెగింపుతో సాహసం చేసిన వారిని విడిచిన ముండలని దూషిస్తుండే వారు; అటువంటి వారికి వీరేశలింగమే దిక్కని అపహస్యం చేస్తుండేవారు. ఇన్ని కారణాల వల్లనే పైసామెతలోని పూర్వార్ధం పుట్టింది; ఇక ఉత్తరార్ధం తెగించిన వాడి మనస్తత్వాన్ని తెలుపుతున్నది, అయినా పూర్వార్ధానికి అర్థాతిశయాన్ని ఆపాదిస్తున్నది.

పొడుపు కథల చాయలున్న, ముఖ్యంగా కథాత్మక ప్రహేళికల ఛాయలున్న ఇలాంటి పద్యాంశాల్ని, సామెతల్ని, పదబంధాల్ని పరిశీలిస్తే పౌరాణిక చారిత్రకాంశాలెన్నో బహిర్గత మవుతాయి. చారిత్రక సామాజిక విషయాలకు అర్థం పడతాయి. భవిష్యత్తరాలవారికి బాటలు వేస్తాయి.

ఈ ప్రకరణంలో ఇంతవరకు కథాత్మక ప్రహేళికల ప్రాదుర్భావ వికాసాల్ని, పౌరాణిక చారిత్రకాంశాలున్న సప్తకథా ప్రహేళికల్ని వివరించాను. ఇక ఆంధ్ర జానపద సాహిత్యాకాశంలో అతి వేగంగా పరచుకొన్న సాంఘిక కాల్పనిక కథాత్మక ప్రహేళికల్ని విశ్లేషించి వివరీకరిస్తాను.

## 3 - 5 : సాంఘికాలు

కథాత్మక ప్రహేళికల్లో ఈ మనిషి జీవన స్థితిగతులున్నాయి; ప్రగతి ఉంది; పరాభవమూ ఉంది; ప్రసన్న భావమూ ఉంది, విభిన్న మనస్తత్వాల మేళనమూ ఉంది: వికృత భావముంది; వినోదంపై ఆసక్తి ఉంది. యుక్తులున్నాయి; కుయుక్తులున్నాయి. ఇవి అధికంగా సాంఘిక ప్రహేళికల్లోనే కనిపిస్తున్నాయి. వస్తువును బట్టి, వస్తుగుణాన్ని బట్టి ఈ పొడుపు కథల్ని జంతు కథలుగా (Animal) సంకీర్ణ ప్రహేళికలుగా (Complex), నీతి పొడుపు కథలుగా (Fable) అద్భుత ప్రహేళికలుగా(Fairy), మతాచార సంబంధులుగా (Religious), సరళ ప్రహేళికలుగా (Simple) విభజించడానికి వీలున్నది. కొన్ని పొడుపు కథల్లో శృంగార పరాలు మోతాదు మించినట్లనిపిస్తాయి. మరికొన్నిట్లో హాస్యం చిప్పిల్లుతుంటుంది. ఇలాంటివాటిని శృంగార చమత్కార ప్రహేళికల క్రింద పరిశీలన చేయవచ్చు. అయితే వస్తుగుణ సాంకర్యం కారణంగా ఒక్కోసారి విభజన క్లిష్టమయ్యే అవకాశంకూడా ఉంది. అందువల్లనే ఈ గుణాలెన్ని ఉన్నా, అందులో సామాజికాంశం ఉంటే చాలు, అలాంటి వాటిని సాంఘికాలనే ఈ శీర్షిక క్రింద వివరించే ప్రయత్నం చేయడం జరిగింది.

* పతలన్ని ఎతలాయె
కాపురాలు రెండాయె
ఆడుపచ్చి ఆర్నెల్లాయె

ఆడేసిన కుందేలు
ఇయ్యాల్ల మాపటి కూరకాయె
సచ్చిన మగడు సండ్లమీద
మనున్న మగడు మంచంమీద[1]

మాపటివేళ మంచం ఎక్కిన తర్వాత మగనికావిషయం గుర్తుకు వచ్చింది. భార్యేమో మారు మొగమై పడుకొంది. అలిగిందో ఆలోచిస్తుందో అర్థంకావటంలేదు, అయినా భార్యను అటూ ఇటూ కుదుపుతూ అడిగాడు. "రాత్రి భోజనంలో వడ్డించిన కుందేలు మాంస మెక్కడిది" — అదీ అతని అనుమానం. భర్త అలా అడిగిన వెంటనే ఆమె చుట్టూరా ఏవో అనుభూతులు అలముకున్నాయి; మనస్సు పొరల్లోంచి ఏదో ఆవేదన త్రోసుకొని వచ్చింది. పెదాలమీద ఏదో విచిత్ర హాస్యరేఖ మెరిసి మాయమయింది. అందుకే ఆమె పై పొడుపుకథ పొడిచింది.

అదో పల్లె; ఆ పల్లెలో ఓ పడుచు; చిన్నప్పటినుండి బావమీదనే మనసు పెట్టుకొంది. వయసు వచ్చింది; వలపు హెచ్చింది; పరస్పరం పంచుకున్నారు; ప్రగాఢంగా మనసులు పెనవేసుకొన్నాయి. ప్రణయం సమారాధన దశకూ చేరుకుంది. కన్నులు కథలు చెప్పుకొన్నాయి జనమూ చూసింది; జగతీ చూసింది; ప్రకృతే కదలింది; ఆశీస్సులందించింది.

అయితే వారి తల్లిదండ్రుల మధ్య సయోధ్యలేదు. తాతలనాటి పాతపగలు రాజుకుంటూనే ఉన్నాయి. వియ్యం పొందాల్సిందిపోయి కయ్యాలకు కాళ్లు దువ్వుకొంటున్నారు. ఆ యింటిమీది పిట్ట ఈ యింటిమీద, ఈ యింటిమీది పిట్ట ఆ యింటిమీద వ్రాలితేచాలు అగ్గి రాజుకొంటుంది; బుగ్గిబుగ్గి అవుతోంది. అందుకే ఆ అమ్మాయి తల్లిదండ్రులు పొరుగూరు కుర్రానితో పెళ్లి జరిపించేశారు.

---

1 సేకరణ, పాలమూరు జిల్లా, జూన్-1988
పాఠాంతరం : కథలెల్ల లెతలాయె - కాపురం రెండాయె
నాడు చచ్చిన కుందేలు - రాజుకు వంటాయె
(జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పు : 34)

పాపం ఆ బావ భగ్న హృదయుడై పోయాడు. ఆ ఊరి గుట్టకింద అడవి లోని ఓ చెట్టుకు ఉరిపెట్టుకున్నాడు. ఆ ప్రదేశానికి ఎవ్వరూ వెళ్లరు. అది వారి సంకేత స్థలం. ఈ ప్రేమికులకే ఆ స్థలం తెలుసు. వివాహమైనంతర్వాత కూడా ఈ పడుచు అక్కడికి వెళ్లింది. తన బావ ఉరిపెట్టుకొన్నది చూచింది; పొర్లి పొర్లి ఏడిచింది.

అప్పటినుండి ప్రతిరోజూ అక్కడికి వచ్చేది; ఆ శవం కాళ్లకింద నీళ్లుపోసి వెనక్కు వెళుతుండేది. ఒకరోజు సాధ్యంగాకున్నా మరో రోజైనా వచ్చేది. అలా నీళ్లుపోస్తున్న కారణంగా అక్కడ పచ్చిగడ్డి పెరిగింది; అది గుబురులై-దుబ్బులై-గంటలుగా మారింది. అక్కడో కుందేలు స్థావరమేర్పరచుకొంది. ఆ విధంగా ఆరు మాసాలు గడిచిపోయాయి.

ఆ యువకుడు ఉరిపెట్టుకొన్న తాడు చివికింది. గాలికి అస్థిపంజరం కదిలి నప్పుడు తాడు తెగింది. అస్థిపంజరం కిందున్న కుందేలుమీద పడింది.

ఆరోజుకూడా ఆ పడుచు వచ్చింది. పడిపోయిన అస్థిపంజరాన్ని చూసింది. చచ్చిన కుందేలును చూసింది. కుందేలు నింటికి తెచ్చింది; కూర వండింది.

పొరుగూరికి పనిమీద వెళ్లిన భర్త రాత్రికి ఇంటికి వచ్చాడు. కాళ్లూ చేతులు కడుక్కొని భోజనం చేశాడు. ఆ భోజనంలో ఆమె భర్తకు కుందేలు కూర వడ్డించింది. ఆకలిలో ఉన్న అతను ఆదరాబాదరాగా తిని, అలసిపోయి ఉన్నందువల్ల వెంటనే మంచమెక్కాడు. ఈ కుందేలు మాంసం ఎక్కడిదని అప్పుడతనికి గుర్తుకు వచ్చింది. ఆ విషయమే భార్యను అడిగాడు. అప్పుడు భార్య పై పొడుపుకథ పొడిచింది. అతని కేమర్థమైందో నిద్రలోకి జారుకొన్నాడు.

ఈ పొడుపు కథలోని చివరి రెండు పాదాలు కథకు పరమ రామణీయకతను సంతరించిపెట్టాయి. వాటి అర్థం ఇలా ఉంది.

ఆమెకిద్దరు భర్తలు; ఒకడు మరణించాడు; మరొకడు మంచంమీదే ఉన్నాడు. చచ్చిన వాడేమో స్తనాలమీద ఉన్నాడు. అలా చెప్పడంలో తన హృదయంలో సజీవంగా ఉన్నాడనే అర్థం వ్యంగ్య సుందరంగా భాసించింది. మంచంమీద ఉన్న వాడూ భర్తే కాని అతను తన హృదయాధి నాథుడు. ఒకడు కట్టుకొన్నవాడైతే

మరొకరు మనసులో పెట్టుకొన్నవాడు. అలంకారికులు పొటుంబిన శాస్త్రమర్మ జ్ఞులు ఎవరేం చెప్పుకుంటే ఏంటి! ఆమె మనసు అది, ఆమె అప్పటి మానసిక స్థితి అది.

అయితే ఇంత వ్యంగ్యం రాని మరో అర్థం జానపదులు చెప్పుకొంటు న్నారు. చచ్చిన మగడు స్తనాలమీద ఎట్లుంటాడనే ప్రశ్న వేసుకొని వారే చెబు తున్న అర్థం ఇది.

ఉరిపెట్టుకున్న రోజే తన బావను ఆ అమ్మాయి చూసింది. అతనిమీది ప్రేమ చంపుకోలేకపోయింది. చెట్టెక్కి మెల్లగా శవాన్ని కిందికి దించింది. అతని శరీరంమీది తోలునంతా ఒలిచింది యథావిధిగా చెట్టుకు ఆ మాంసం ముద్దను వ్రేలాడదీసింది. ఒలిచిన చర్మంతో ఇంటికి వచ్చింది. తన మనసుదీరా ఆ చర్మాన్ని రవికగా కుట్టింది. ఆమె అప్పటినుండి ఎప్పుడైనా, అంటే ఈ కథ పొడిచినంత వరకు ఆ తోలు రవికే ధరించేది. ఆ మరునటి రోజు భర్తకి పొడుపు కథంతా అర్థమైంది. అడవిలోని అస్థిపంజరాన్ని కాల్పించాడు. భార్యమీది రవికనూ కాల్పిం చాడు. ఆమె ఆ తర్వాత బతకలేదు.

ఈ రెండో అంశాన్ని చెప్పకుండా కథ పొడిచేంత వరకే కొందరు చెప్పారు[1]. రెండో అంశంతోపాటు ఈ క్రింది విషయం మరికొందరివల్ల తెలిసింది2.

పెళ్ళి అయిన వెంటనే ఈ భర్తకు తన భార్యమీద అనుమానం వచ్చింది. ఆమె ప్రియుడెవరో తెలుసుకొన్నాడు. అతణ్ణి చంపి సట్టకింద చెట్టుకు వేలాడ దీశాడు. కసికొద్దీ తోలు ఒలిపించి ఇంట్లో చిలక్కొయ్యకు వ్రేలాడదీశాడు. ఆ తర్వాత మరిచిపోయాడు. ఆ తోలునే ఆమె రవిక కుట్టించుకొంది.

చంపి ఉరిపెట్టింది నిజమే, కాని తోలు ఒలిచి తెచ్చుకొని ఆ యువతే రవిక కుట్టించుకొంది. ఇలా ఈ కథలో పాఠాంతరాలనదగిన సంఘటనలు కొన్ని విశే షంగా దొరుకుతున్నాయి.

అదీ కథాత్మక ప్రహేళిక, ఇవీ పాఠాంతరాలు. జానెడు పొడుపు; మూరెడు విడుపు.

---

1. రారమ్మ (60), పోలెపల్లి, పాలమూరు జిల్లా, జూన్ 1977
2. కె. రుక్నుద్దీన్ (32), రాచూరు, పాలమూరు జిల్లా,
   కె. లక్ష్మారెడ్డి (34), పోలెపల్లి

ఇలాంటి ప్రేమకథలే కాక చిలిపిపాటలు ఎన్నో కూడా పాడుతూ పనులు చేస్తారు... అవి చెప్పవచ్చు; చెప్పితే మాత్రం నవ్వులు.

* పత పత కాసులు
పీడెను పాశం జుట్టుసులు1
పత్తులసెయ్యద్దసులు
దీపం సిటుకు
తలుపు పోటుకు2
వచ్చినా ఎనుక పండసులు3

ఓ భార్యామణి భర్తచాటుగ వాగా చినమురిగించి అతనికి మాత్రం పెద్దది పెద్దది చేసి పెట్టేది. తానుమాత్రం పంచభక్ష్య పరమాన్నాలతో పొట్టపూజ చేసేది. ఆ రోజు రకరకాల మధుర పదార్థాలు చేసింది. ఇక తిందామనుకొనే వరకు ఇరుగమ్మలు-పొరుగమ్మలు వచ్చారు. వారందరిని సాగనంపి సాపాటు కానిద్దామనుకొంది. అచ్చట్లు ముచ్చట్లు ముగిసి అమ్మగార్లు వెళ్లేవరకు అయ్యగారు వచ్చేశారు. ఇదేం కర్మరా భగవంతుడా అనుకొంటూ ఎంత అయిందో అంతదాని భర్తకు పెట్టింది; తాను మాత్రం భర్త తిన్న తర్వాత తిందామని వగలు పోయింది.

అలసి సొలసి వచ్చిన ఆ భర్త కంత గదికి, మంచంమీద అలా నడుము వాల్చేశాడు. అలసటతో అలా కళ్లు మూసుకొన్నాడు. అంతవరకు భర్తకేవో సేవలు చేసి ఇక నిద్రపోయాడనుకొని సంతోషంతో వంట ఇంట్లో ప్రవేశించింది. ఆదరా బాదరా అయినాసరే, కడుపునిండా తిని త్రేపుమని త్రేన్చుకుంటూ వచ్చి భర్త పక్కకు చేరింది.

'ఓయ్ - ఓయ్ ! అప్పుడే నిద్రపోయేవా ! ఒక ముద్దామచ్చటా లేదా ! ఓ కథా చెప్పు— ఓ పొడుపు కథన్నా చెప్పు!— చెప్పంటుంటే—' అంటూ ఎడమచేతితో గిల్లింది; మోకాలితో కుదిపింది.

1, 2. పాఠాంతరాలు : నూనెసులు, పొడపోటుకు

3 పాలమూరు జిల్లా, జూన్-1977

ఆ భర్తకు భార్య ప్రవర్తన తెలియందేమీకాదు. ఇది పెళ్లయినప్పటినుంచి సాగుతున్న భాగోతమే. తిండిపోతుది' అని లోలోనే నవ్వుకున్నాడు. అభిముఖంగా ఎదుగకుండానే పై పొడుపుకథ పొడిచాడు.

'ఓ అసులా! (ఆమె పేరు) ఈ కథను విను; ఇది కథకాదు. అయినా కథే! పీట కింద దాచిపెట్టిన పాయసం ఇష్టావు. చేయి వెలుపలకపుకొనేంటే తిన్నదేదో నాకు తెలిసిపోతుందని వత్తురో (వేడినీళ్లు కాచే కుండలో) పియ్యి లద్దిపడగినట్లు చేశావు. ఓ చిటుకు వేసి దీపం ఆర్పివేశావు. తలుపును పుటుక్కున దగ్గరికి లాగావు. ఏమీ ఎరుగనట్టు వచ్చి నా వెనుక పండుకొన్నావు.'

పై పొడుపుకథ అర్థం ఇది. పాపం భండారమంతా బయటపడింది. ముంతెడంత ముఖం చింతాకంత అయింది. మారు మాటాడలేదు అంటే మారు కథ పొడవలేదు లేకపోతే ఎన్ని కథలు వేసి, ఎన్ని శాస్త్రాలు చెప్పి భర్తనోరు ఆమె కట్టవేసేదని! ఇప్పుడామె తేలుకుట్టిన దొంగయ్యింది. అయినా తట్టుకు మారు తట్టు ఎట్లా తడుతుందా అని ఆలోచిస్తూనే ఉంది.

ఆ యువతి తాను చేసింది తప్పని భర్త దెప్పిపొడవడంతో నోరు తెరవలేదు పైలా పచ్చీసులో ఉన్న నలుగురు వ్యవసాయదారులు, వ్యవసాయ కూలీలు ఒకదగ్గర కూడితే నోరు తెరవకుండా ఊరుకోరు. తట్టుకొంటారు, తిట్టుకొంటారు; కథలపై ఒట్టుపెట్టుకొంటారు. ఈ క్రింది పొడుపు కథలో పశువుల కాపరి ఉన్నాడు; వేశ్యాసుందరి ఉన్నది. వారి పొడుపుల్లో స్వేచ్ఛ ఉన్నది. ఆ సంగతులు చెప్పుకొంటూ ఈ యువకులు పకపకల్లో పడి పొర్లుతున్నారు; వికవిక నవ్వి కళ్లు గిలుపుకొంటున్నారు.

* ఓ పసుల కాడి పిలగా
ఈ డంగ మావోల్లు
సిక్కాలల్ల ఆవాలు
పోసుక పోయింద్రా !
మావోల్లు పన్నెండేండ్ల పట్టి
బంతుల గచ్చె తొక్కిస్తున్నరు

సుంకొచ్చి నాకు సుట్టుకొంది
సేను పంట్లు సుక్కుకొంటున్న ![1]

పశువుల్ని కాస్తూ పిల్లరాల్ని మరిచిపోయాడో పశువుల కాపరి. ఆ కాపరి ఓ వెలయాలు వచ్చింది. ఆమెకారోజు ఎక్కువగా విటులు అందుబాటులో లేక పోయారు. అందుకే ఈ కాపరిమీద కన్ను వేసింది. మాట కలపాలనుకుంది. మాట లోనే మనసు తెలుసుకుంది ఒక అసంబద్ధ విషయాన్ని అతని ముందుంచాలి. అతను దానికి చెప్పే జవాబన్నిబట్టి మాట పొడిగించాలి. అందుకే– 'ఈడంగ మావోల్లు ఆవాలు పోసుక పోయిండ్రా' అని అడిగింది, చేరెడు చేనుకు రంధ్రాలుండేవి చిక్కాలు. అందులో ఆవాలు పోయడం, పోసినా అవి నిలవడం అసాధ్యం. అందుకే పశువుల్ని కాచే పసులువాడు కూడా పెడసరంగానే అన్నాడు

ఇదివరకే కొంతమంది వేశ్యలచుట్టు తిరిగాడు. రోగాలపుట్ట అయ్యాడు. ఆ రోగాలు పోగొట్టుకోడానికి శతథాయత్నం చేశాడు ఈ విషయంలో చాలారోజులనుండి చింతిస్తున్నాడు. పంద్రెండేళ్ల ప్రతినిలువబెట్టడం, బంతులు గట్టడం, దాని సుంకువచ్చి చుట్టుకోడం అనేది జరుగని పని నా కిప్పటికే బుద్ధి వచ్చింది తల్లి అని చెప్పడానికే ఆ కాపరి శాస్త్రానికెదురు శాస్త్రం పొడిచి తప్పించుకొన్నాడు. ఆ సరసాంగికి తన వైముఖ్యాన్ని అలా తెలియజేశాడు.

కథాత్మక ప్రహేళికల్లో ప్రశ్నోత్తర ప్రాయాలు కొన్ని వైరస్యానికి దారితీయగా, మరికొన్ని సామరస్య వాతావరణానికి అనుకూల్యంగా నిలిచాయి ఇంకా కొన్ని దెబ్బపొడుపుల వరకు వెళ్లాయి. ఈ క్రింది పొడుపు కథలోని భార్యాభర్తల ప్రవర్తనలు దెబ్బకు దెబ్బ తీసుకొన్నట్లనిపిస్తాయి. అయినా గుణపాఠం అంతర్గతంగా పారుతూనే ఉంది.

* మొటకొడ్ల ఉప్ప
మోదుగుల నీడ
మొగోల్లి కయిరాదు

1. పాలమూరు జిల్లా. జూన్ 1977

ఆజ్జం బంక
తొట్టం పెల్లం
ఆనోల్ల కయురాదు1

పక్షు మొలకలు వెళ్లాయి; ఆ మొలక వడ్లను బియ్యంగా మార్చి ఉత్తమ ఒల్లాయి అన్నంవండి దాచుకొంది. భర్త ఇది గమనించాడు. మొలక వడ్ల అన్న మంటే అతనికిష్టం. అందుకే అడిగాడు.

మొలక వడ్ల(బియ్యం) అన్నం, మోదుగుపల (చెట్ల) నీడ మగవాడికి పచ్చరా దంది మరీ మోదుగుల నీడన కూచొని ఈ అన్నం తినరాదన్నది. ఈ అన్నం, ఆ నీడ ఈ రెండూ పచ్చిరావని కచ్చితంగా చెప్పింది; నవ్వుతూనే చెప్పింది.

అప్పుడు భర్త ఏమీ అనలేదు. ఆరోజు సాయంకాలం అతడు తేనె తీసుకొని ఇంటికి వచ్చాడు. భార్యకు నోరూరింది; పెదాలు తడుపుకుంటూ భర్త సరసన చేరింది అది పుట్టతేనె కాదు; పెరతేనె కాదు; తొజ్జితేనె. అన్ని తేనెల్లోని తీపిని రంగరించుకొన్న తేనె. అందుకే ఓరచూపులతో దరిచేరి, తేనెమాటలతో తేనె కొరకు ప్రయత్నం ప్రారంభించింది భార్య. మొలక బువ్వ పెట్టని ఆ భార్యకు బుద్ధి చెప్పాలనుకొన్నాడు. అందుకే స్త్రీలకిది పనికిరాదని ఎదురుదెబ్బ తీశాడు. ఆచేతి ఇలా అంటే, ఈచేయి అలా అంటుంది. 'నావీపు నీవు గోకితేనే, నీవీపు నేను గోకుతా' అన్న సామెత సత్యమైంది.

ఈ విధంగా సాంసారిక జీవితంలో కాలిపేలినవారే రాదు కథలు పాడుచు కొంటున్నది! ఆ కుటుంబంలోని పూర్వ సంస్కారాల కారణంగా అక్కడ పుట్టిన చిగురు కొమ్మయినా చేవదేరి ఉంటుంది. చక్రవడ్డీలకు మరిగి పాషాణంగా మారిన

---

1 పాలమూరు జిల్లా, జూన్ 1977

పాఠాంతరం : హమారె తుమారె పువులు
మగోల్లు తాగరు-ఆడోల్లు లాగుతరు (మిరియాలచారు)
హమారె తుమారె బంక
ఆడోల్లు నాకరు-మగోల్లు నాకుతరు (తేనె)

సాహుకారి మనస్సులో మొలిచిన పరీక్ష వారి ప్రశ్న, ఈ క్రింది పొడుపు కథ నిండా పరచుకొని ఉంది.

* అప్పులోకొచ్చి అయ్యసంగతడిగితే
ముల్లుకు ముల్లు నాటవోయిండు,
ఒకటికి రెండు సేయవోయింది,
నూటొక్క రాశిని మర్దన సేస్తుంది ...[1]

ఆ కాపువానిది పాలిపోయిన సంసారం. అయినా నీతినియతికి కొదువలేదు. అందరూ రెక్కలుముక్కలు చేసుకొంటేనే నాలుగు వేళ్లు నోట్లోకి వెళ్లగలుగుతున్నాయి. అప్పటికీ తప్పనిసరిగా ఒకటి రెండు పర్యాయాలు ఓ సాహుకారిదగ్గర అప్పు చేయాల్సివచ్చింది.

సాహుకారు ఓనాడు పగటిపూట కాపు ఇంటికి వచ్చాడు. ఇంట్లో కాపు కూతురొక్కతే ఉంది. ఆ అమ్మాయినే అయ్య సంగతి అడిగాడు. కాపుబిడ్డ 'మా అయ్య ముల్లుకు ముల్లు నాటవోయిండు' అన్నది. సాహుకారికి అర్థంకాలేదు; చిత్తర పోయాడు; అయినాసరే అనుకొని అమ్మ సంగతి అడిగాడు. 'మా అమ్మ ఒకటి రెండు చేసుకురను వోయింది' అన్నది కాపు బిడ్డ. అదీ అర్థంకాలేదు సాహుకారికి, కొద్దిసేపు ఆలోచించి 'మరి నీవేమి చేస్తున్నావు అమ్మాయీ' అని అడిగాడు. 'నూటొక్క రాశిని మర్ధన చేస్తుంద' అన్నది కాపు బిడ్డ లోలోన నవ్వుకొని.

సాహుకారు బుర్ర గిర్రున తిరిగిపోయింది. కుతూహలం పెరిగింది. మాటల ముడిని విప్పనిదే కదలకూడదనుకొన్నాడు. 'ఏంటో అమ్మాయీ' కాపుబిడ్డ వినిపించావు. నీవు చెప్పింది నాకేమీ అర్థం కావడంలేదు' అన్నాడు శ్రేష్ఠి.

'అదిగో! సాహుకారా! ఈ అర్థం చెప్పినట్లైతే మా అయ్య నీకిచ్చే అప్పుకి రెండింతలిస్తా' అన్నది కాపుబిడ్డ పకపక నవ్వుతూ. తనకు వచ్చే డబ్బుకే తంటాలు పడుతున్నాళ్లు చెప్పుతుంటే ఈ అమ్మాయి రెండింతలేలా ఇస్తుంది అనుకున్నాడు శ్రేష్ఠి.

---

1. ఇందూరు జిల్లా, నవంబర్-1978

ఇది పరిహాసమే అయినా పరమ రమణీయంగా ఉందే అనుకొన్నాడు. అందుకే- 'ఇదంతా ఎందుకమ్మాయీ! నువ్వే చెప్పు' మీ అయ్య అప్పేచేదని, అంటా తీర్చే వాడని కాగితం వ్రాసిచ్చిపోతా'నన్నాడు సాహుకారు ఉత్సాహంతో ఉప్పొంగే హృదయంతో.

కాపుబిడ్డ సాహుకారు ఎక్కువ ఎగాదిగా చూసింది. తాను చెప్పిన పొడుపు కథ ముడి విప్పడం మొదలుపెట్టింది.

'అయ్యా! అయ్య ముల్లుకు ముల్లు నాటవోయాడంటే ముల్లు వంకాయ తోటకు (చెట్లకు) కంప (కంచె) నాటవోయాడని అర్థం ఒకటికి రెండు చేసుకు రాను పోయింది అంటే సెనగలను పప్పుబద్దలుగా చేసుకొని రావడానికై పొరుగింటికి పోయిందని అర్థం. ఇక నేను నూటొక్కరాశిని మర్దన చేస్తున్నానంటే రొయ్యల్ని చంపి పొట్టుతీసి వేపుడు చేస్తున్నా అని అర్థం' అంది దండంపెడుతూ కాపుబిడ్డ.

ఆకర్షకుని ఇంటి నగ్న స్వరూపం ఆ సాహుకారు కళ్లకు బొమ్మగట్టినట్టయింది. శ్రమకే అంకితమై తమ కడుపులు అంతంత మాత్రమే నిండుతున్నా పరోపకారం కొరకే పరిశ్రమించే ఆ మహా త్యాగం కళ్లకు నీళ్లు తెప్పించాయి, తానేమో అప్పులిచ్చి వడ్డీలకు వడ్డీలు వేస్తూ రైతన్న వెన్ను విరుస్తున్నాడు. కొంతసేపు అలాగే నిల్చిపోయాడు. కోటుజేబులోని అప్పు పత్రాన్ని తీసి, పాటాగొట్టి ఆ అమ్మాయి ముకుళిత హస్తాల్లో ఉంచి తేలికపడ్డ హృదయంతో వెనక్కు మళ్లాడు సాహుకారు.

పొడుపు విప్పేపదకు ఆ కుటుంబ వాతావరణానికి అద్దం పట్టినంత పనయ్యింది, అప్రమేయమది! ఈ సంస్కారం మహా సాగరం! ఆటూపోట్లూ ఉంటాయి; జడంగా నిల్చిపోతే అది మింగేస్తుంది; అందుకే నిరంతరం చైతన్యం తప్పదు, ఆగకుండా ఈదాల్సిందే; ఆవలిగట్టు చేరాల్సిందే; ఒడుదొడుకులున్నప్పుడు సంఘర్షించాల్సిందే; సమన్వయం సాధించాల్సిందే.

ఈ సంసారంలో ఎల్లల మనస్సులకు నచ్చని పనులు, ఏ కారణంగానో అప్పుడప్పుడు తల్లిదండ్రులు చేస్తుంటారు. ఆ విషయమే ఈ కథాత్మక ప్రహేళికలో నిక్షిప్తమై ఉంది.

* "తమలపాకు తెచ్చాను
తీసుకో మామయ్యా!"
"ఆకు తెచ్చావా!
సున్న మేదమ్మా!"
"సున్నం గోడకుంది-
తీసుకో మామయ్యా!"1

ఆ తల్లిదండ్రులకు తమ కూతురు పెళ్లి సమస్యగా పరిణమించింది. ఆస్తి ఉన్నవానికి ఇవ్వాలంటే కట్నాలు-కానుకలు ఎక్కువగా ఇవ్వాలి. అందుకే ఓ దూరపు బంధువును చూశారు. అతని భార్య పోయింది. రెండో పెళ్లికి సిద్ధమయ్యాడు.

లాలా! పెళ్లిచేసుకొంటావా అంటే నాకెవరిస్తారంటాడుగాని నేను చేసుకోను అనడట- పెద్దలీ మాటలుదాహరించి కామం ఎంత బలీయమైందో చెబుతుంటారు. ఈ విషయం ప్రస్తావించి చింతచచ్చినా పులుపు చావదు అంటారు కొందరు. ఈ పొడుపుకథ వెనుక అదే జరిగింది. అతడు వివాహానికి సిద్ధమై వచ్చాడు. తనకన్నా ఇరవై సంలు చిన్నదైన చిన్నదాన్ని కట్టుకోడానికే సిద్ధమయ్యాడు. కట్నకానుకల వ్యాపారం కొనసాగుతోంది. ముచ్చట్లు ముగిశాయి; ఈడుజోడు కుదరకున్నా పెళ్లి కుదిరిపోయింది. అందరు తృప్తిగా తిని త్రేన్చారు. పెళ్లి ఎలా జరగాలి, ఎక్కడ జరగాలి అని ఆలోచిస్తున్నాడు కాబోయే రెండో పెళ్లికొడుకు వసారాలోని కుర్చీలో కాలుమీద కాలు వేసుకుని కూచున్నాడు.

ఆ యింటి యజమాని కూతురు అప్పుడతని దగ్గరికి వెళ్లింది. 'తమలపాకు తెచ్చాను, తీసుకో మామయ్యా' అన్నది 'ఆకు తెచ్చావా! సున్నమేదమ్మా' అతడ డిగాడు ఆకువిప్పుతూ ఎగాదిగా చూస్తూ. 'సున్నం గోడకుంది తీసుకో మామయ్యా' అంటూ వెళ్లిపోయిందా అమ్మాయి

గోడకు వేసిన సున్నం గికి తమలపాకున వేయడు. వేయాల్సినంత పరిస్థితి రాదు. ఒకవేళ అలా చేసినా ఆనోరు పూర్తిగా పండదు ఆ అమ్మాయి హృద

1. ఇందూరు జిల్లా, నవంబర్-1978

యం ఆతనికి తెలిసిపోయింది. రెండు మాటల్లో పరిస్థితి అర్థమైపోయింది. నేరు పండినట్టే సంసారమూ పండింది. తొవ్వను గోడపేసిన సున్నం. ఆ అమ్మాయి ప్రజ్ఞకు అబ్బురపడ్డాడు. తన అజ్ఞానానికి చింతించాడు. చేసూడేసేపా కపిలె మరో సంబంధం సూచించి వెళ్లిపోయాడు.

పొడిపొడి మాటల పొడుపు కథ! పూర్వాపరాలు తెలిస్తే కథ పెరుగదు! తెలిసినప్పుడే కథకో రూపం వస్తుంది. పైకథ ఈడూజోడుకు పట్టంకట్టింది. కింది కథలో కామం పక్కలగప్పింది; ప్రజ్ఞ ప్రమాదాన్ని తప్పించింది.

* నూనె మల్లెడ్డి ఏసింది పొన్న
కై మల్లింది పొన్న
పొన్నకింద కోయిన ఫలమేం లేదుగాని
కారకుచ్చు తల్లారె ..
బంగారు కొడవలితోని కోసినగడ్డి
గాడ్దిముందల వేస్తే
తినది గాడ్దిది
ఎడమకాలితో తందునా
కుడికాలితో తందునా! 1

మానవ జీవితంలో పందాలూ ప్రతిజ్ఞలు మంచిని పెంచుతాయి; అప్పుడప్పుడు కొంప ముంచుతాయి. అయినా ఆ సాహసాలు ఆ జ్ఞాపకాలు మరొకరికి మార్గదర్శనం చేస్తాయి. ఎవరి మనస్సు ఎలాంటిదో చూపి, ఆ పరిస్థితులు నీకేవస్తే నీవెలా ఉండాలో తెలుపుతూ హెచ్చరికలు చేస్తాయి. మనస్తత్వాలు' మార్గదర్శనాలు, సాహసాలు, హెచ్చరికలు అన్నిటి సంకీర్ణ స్వరమేళ ఈ పొడుపుకథ.

ఇది తెలంగాణాలోని ఓ పల్లె ఆ పల్లెలో ఓ పటేల్ (మాలి) ఉన్నాడు; ఓ పట్వారి (కరణం) ఉన్నాడు. ఏ ఊళ్లో అయినా మాలిపటేల్‌కన్నా పట్వారీది

---

1. పాలమూరు జిల్లా, మే-1977

ఎప్పుడూ పైచేయిగానే ఉంటుంది. పన్నుల వసూళ్ల, ప్రభుత్వంలో వ్యవహారాలు ఎక్కువగా అతనిచేతి మీదుగానే నడుస్తాయి. ఇద్దరూ నిజాంరాజంనుండి గ్రామాధికారులుగా ఉంటున్నవారే! ప్రభుత్వ వ్యవస్థ నడవడానికి ప్రతి గ్రామానికీ ఈ ఇద్దరు రెండు కళ్లలాంటివారు.

ఆ ఊరి మాలి పటేల్ భార్యమీద పట్వారి కన్నుపడింది. ఆమె రావాలి; ఎన్ని యుక్తులైనా, కుయుక్తులైనా పన్ని సాధించాలి. తనమనసులోని మాట భార్యకు చెప్పాడు. ఆమెకతణ్ని ఎదిరించే శక్తిలేదు; తాను చెప్పినా వింటాడనే నమ్మకం లేదు, అందుకే భర్త ఆజ్ఞప్రకారమే నడుచుకోవాలనుకొంది. ఓ అపవిత్ర కార్యానికి ఓ పవిత్రకార్యాన్ని నెపంగా వాడుకోవాలనే నిశ్చయించుకొంది.

పట్వారీ భార్య సత్యనారాయణ వ్రతం సంకల్పించింది. సంభారాలన్నీ పూర్తిచేసి, పటేల్ భార్యను తానే స్వయంగా పిలుచుకొని తన ఇంటికి వచ్చింది, ఆరోజు రాత్రికూడా తమ ఇంటనే ఉంటుందనీ, ఆమె అత్తకు చెప్పివచ్చింది. వ్రతం విధివిధానంగా జరిగింది, మాలి పటేల్ భార్య ఆరోజు రాత్రి అక్కడే ఉండిపోయింది.

గ్రామాధికారుల ఇద్దరి భార్యలు ఒకే గదిలో పడుకొన్నారు. అది ఆ యింటి యజమానురాలి పడగ్గది అని తెలుస్తూనే ఉంది. పడకమీదికి చేరింతర్వాత చెప్పా పెయ్యకుండా పట్వారి భార్య గది వదలిపెట్టి వెళ్లిపోయింది. అప్పుడా గదిలోకి పట్వారి వచ్చాడు; తలుపులు మూశాడు; పడక దగ్గరికి వచ్చాడు, తన వాన్నాక్ష కోరిక వెలిబుచ్చాడు.

మాలిపటేల్ భార్య సంగతి గ్రహించింది. తానెక్కడ ఉందో, ఎలా ఇరుక్కుపోయిందో అర్థమైంది. ముల్లును ముల్లుతోనే తీయాలని నిశ్చయించింది.

అందుకే అంగీకరించినట్లు నటించింది. దగ్గరికి వస్తూ వస్తూ మెడలోని ముత్యాలదండను తెంపింది, ముత్యాలన్నీ నేలమీద వెదజల్లింది. అయ్యో! నాదండ తెగిపోయిందే! రేపు మా అత్త ఏమంటుందో అని వెక్కివెక్కి ఏడ్వడం మొదలెట్టింది.

'నువ్వేం ఏమవ్వకు, నేనాదండ తయారుచేస్తా' అని ఆమె ఇచ్చిన వెంట్రుక నందుకొని పల్లాపదురైన ముత్యాలతో దండ కుచ్చడం మొదలెట్టాడు. ఆమెమాత్రం శోకదేవతలాగా కదలక మెదలక ఒక దగ్గర కూచుంది.

పట్వారి పట్టిన పట్టు వదలలేదు, మాల తయారుచేయాలని నిశ్చయించాడు. అరి వెంట్రుక; ఒక పక్కనుంచి ముత్యాలు గుచ్చుతుంటే మరో పక్కనుండి జారి పోతున్నాయి. తెల్లవారింది; పని పూర్తికాలేదు; పటేల్ భార్య వెళ్ళిపోయింది.

తనకు జరిగిన పరాభవాన్ని ఆమె వెళ్ళిపోయినతర్వాత గుర్తించాడు పట్వారి. ఎట్లయినా ఆమెను సాధించాలనే నిశ్చయించుకొన్నాడు. ఓరోజు రచ్చకట్టమీద సభ ఏర్పాటు చేయించాడు. మాలిపటేల్ తండ్రిని పిలిపించాడు. 'సూసి మల్రెడ్డి పొన్న .' అనే శాస్త్రాన్ని వేశాడు. దీనికర్థం చెప్పాలిసిందని బలవంతం చేశాడు. పదిమందిలో మాట- మాలిపటేల్ తండ్రికేం పాలుపోలేదు 'అర్థం చెబితే నాఆస్తి వదులుకుంటా .. లేకపోతే నీ కోడలిని వదులుకోవాలి' అన్నాడు పట్వారి. ఆ ముసలికేం పాలుపోలేదు; పట్వారి సవాల్ చేస్తుంటే తలవంచుకొని ఇంటిదారి పట్టాడు. గుమ్మంలో కూచొని నెత్తికి చేతులు పెట్టుకొన్నాడు

మామ ఎక్కడికి వెళ్ళివచ్చాడో కోడలి కడవరకే తెలుసు మామ దగ్గరికి వెళ్ళింది; విషయమడిగింది. అతను తలవంచుకొనే సంగతీ-సందర్భమూ వివరించాడు.

ఇక ఆ కోడలు వెనుకాముందు చూళ్ళేదు; నడుం బిట్టుకట్టి రచ్చకట్ట దగ్గరికి బయలుదేరింది. ఆమె రాక గమనించి అందరూ చిత్తరబోయారు. దారి ఇచ్చారు; ఆమె అందరి మధ్యకు వెళ్ళింది. పట్వారి దిక్కు సూటిగా చూస్తూ . 'బంగారు కొడవలి .' అనే ప్రహేళిక పత్త్రార్థాన్ని ప్రయోగించింది

పట్వారి కర్ధమైపోయింది; చేజేతులా స్వర్ణావకాశాన్ని జారవిడుచుకొన్నా అని చింతించాడు. ముత్యాలపేరు సమకూరుస్తూ ముద్దుగుమ్మవైపుకే చూడలేక పోయానే అనుకొన్నాడు అదే అదనుగా ఆ కోడలు సవాల్ విసిరింది.... 'ఓడి పోయింది మామామ కాదు; నేను కాదు; నీవు!' అంది. ఒక్కసారికాదు.... ముమ్మారు అంది.... ప్రజలు చిత్తరపోయారు. పట్వారి వంచిన తలఎత్తలేదు.... ఆమె వెంటనే ఇంటివైపు నడచింది.

ఈ పొడుపుకథ మర్మం ఇద్దరికే తెలుసు. కాని ఆ ఇద్దరూ మర్మం మర్మం గానే ఉండాలనుకొన్నారు. పట్వారి పెదవి విప్పితే ఆ రహస్యాన్ని బట్టబయలు చేయడానికి ఆమె సిద్ధంగానే ఉంది. కాని తన తప్పుకు ఆస్తిని వదులుకోవడానికి సిద్ధమయ్యాడు పట్వారి. అయితే విడుపు విడుపుగానే ఉండే పొడుపుకథే నిర్మాణం కాదు. జానపద హృదయం ఈ రహస్యాలన్నీ లాగింది. పొడుపుకథా నిర్మాణం చేసింది. పెద్దల పెడబుద్ధుల్ని లోకానికి తెలియజేసింది. ఏ పుట్టలో ఏ పాముందో, ఏ పొట్టలో ఏ విషముందో, ఏ ఇంటిలో ఏ పట్వారి ఉన్నాడో తస్మాత్ జాగ్రత అంటూ హెచ్చరిక చేసింది. అందుకని కథా వైచిత్రిని ఆశ్రయించింది. అలాంటి వైచిత్రిని నింపుకొన్న ఈ కథాత్మక ప్రహేళిక గమనిద్దాం.

* మామా !
మేనమామ
ఉంచుకొన్నదాని కొడుకునురా !
మామ్మ అన్నాననికి రమ్మంటున్నదిరా ![1]

ఓ షోకిలారాయుడికి నాటకాలపై ఎనలేని మోజు. ఎక్కడ నాటకమాడినా వెళ్లి చూస్తాడు. ఓరోజు ఓ నాటకానికి వెళ్లాడు. వేషంవేసిన ఓ అబ్బాయిని అమ్మాయిగా భ్రమించాడు. అపహరించి ఇంటికి తెచ్చి గదిలోపెట్టి తాళంవేసాడు. ఈ అపహరణ ఎవరికంట బడలేదనుకొన్నాడు. ఆ నాటకాలవాళ్ళు ఊరినుండి రేపో మాపో వెళ్లిపోతారు; ఆ తర్వాత ఆ గదిలోని అమ్మాయిని తాను పెళ్లిచేసుకొంటాడు. అయినా ఈ విషయంలో ఎవరేమనుకొంటున్నారో! అలా ఓసారి తిరిగి రావాలనిపించింది.

అందుకే ఆ నాటకశాల పరిసరాల్లో తిరగడం మొదలెట్టాడు. ఆ సమయంలోనే అక్కడికి కొంతమంది సముద్రపు దొంగలు వచ్చారు, వారికి కండబలం గుండెబలం ఉన్న కొందరు యువకులు కావాలి. ఈ షోకిలా పట్టాన్ని పట్టుకున్నారు. తమ రహస్య స్థావరానికి ఎత్తుకుపోయారు. బలవంతాన శిక్షణ ఇచ్చారు. తమలో కలుపుకొన్నారు. తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే ప్రాణాలు పోతాయని

1 కృష్ణాజిల్లా, జనవరి–1979.

హెచ్చరించాడు. ఇక అతనికి తప్పలేదు. తప్పించుకోవాలని అనుకోలేదు. వారితో పూర్తిగా కలిసిపోయారు. సాహసాలు నేర్చాడు. ఆ దొంగల్లో మంచి పేరు సంపాదించుకొన్నాడు. అలా పది సంవత్సరాలు గడిచాయి. అతని మాట నెగ్గుతున్నది, అతనికి కావల్సినంత స్వేచ్ఛ లభిస్తున్నది.

ఇంటికి వెళ్లాలనిపించింది, ఆ గదిలోని అమ్మాయి ఏమయిందో తెలుసుకోవాలనిపించింది; ఈ కోరిక పది సం॥గా తొలుస్తూనే ఉంది.

ఇక్కడ కథ మలుపు తిరిగిందన్న సంగతి అతనికి తెలువదు. అతనికో చెల్లెలుంది; అన్న కనిపించడంలేదు; అతని గదికేమో తాళముంది. రెండురోజులుగా ఆ గది తలుపును లోనుండి ఎవరో తట్టుతున్నట్టు శబ్దమవుతుంది. తలుపులు తెరిచింది స్త్రీవేషంలో ఉన్న నటుణ్ని చూసింది. తన తల్లిదండ్రులకి సంగతి చెప్పింది. అప్పటికే నాటకాలవారుకూడా వెళ్లిపోయారు ఆ నటుడిక అక్కడే ఉండిపోయాడు. ఆ నటుడూ ఈ అమ్మాయి ప్రేమలో పడ్డారు. అమ్మాయి తల్లిదండ్రులు కూడా అనుమతించారు. వారి వివాహం జరిగిపోయింది వారి పెద్దబ్బాయి వయస్సిప్పుడు తొమ్మిది సంవత్సరాలు. వాడికి నటుని గుణాలు వచ్చాయి. మేనమామ సాహసమూ వచ్చింది; తల్లి తెలివి తేటలూ అలవడ్డాయి. వాడు ఆటలాడతాడు; పాటలు పాడతాడు; పొడుపు కథంతో పొడుస్తాడు.

ఇంట్లోకి వచ్చి కూచున్నవాడు మేనమామ అని ఆ అబ్బాయికి తెలిసింది. తన తల్లిదండ్రులవల్ల మేనమామ సాహసం వాడికి తెలిసిపోయింది. వచ్చిన మేనమామకు వాడు పొడుపుకథతో స్వాగతం పలికాడు మామా! అని సంబోధించాడు. మేనమామ ఉంచుకొన్నదాని స్త్రీ వేషధారి అయిన నటుని కొడుకునురా అన్నాడు. మా అమ్మ అంటే ... నీ చెల్లెలు నిన్ను అన్నానికి రమ్మంటున్నదిరా అని ఆహ్వానించాడు.

ఎంత బావుంది ఈ పొడుపు! విచిత్ర బంధాలు .. అనుబంధాలు... జీవితమంతా గుర్తుంచుకొనే తీపి గుర్తులు అయితే కొన్ని విచిత్ర సంబంధాల కారణంగా వావి వరసలు చెడిపోతాయి. కుటుంబ వాతావరణం పాడైపోతుంది. 'కాపురానికి వరుస లేదు కప్పకు తోక లేదు' అనే సామెతలు పుడుతుంటాయి. ఈ కథాత్మక ప్రహేళిక ఆ సామెతకు నిదర్శనం.

* తాతా ! తాతగారు
వరుసకు బావగారు
కూతురు మీ మత్తగారు
కూటికి పిలుస్తుంది రండి[1]

తన కూతురుకో, కొడుకుకో సంతానం కలిగినప్పుడు ప్రతివ్యక్తి తాత అవుతాడు. మనుమలూ మనుమరాండ్రు పెరుగుతూ తాతగారి మీసాలతో ఆడుకొంటారు. వారు పెద్దవారైనా తాతదగ్గరి పూర్వం చనువు మాత్రం తగ్గదు.

అదో దురదృష్ట ముహూర్తం. ఎదిగిన మనుమరాలు ఓనాటి రాత్రి తాతగారి ప్రక్కనే పడుకొన్నది. కామానికి కళ్ళులేవు. తాతకేదో దుర్బుద్ధి పుట్టింది. ఆ రాత్రి మనుమరాలితో సుఖించాడు. ఆ మనుమరాలి మనస్సు వికసించలేదు. లోకాన్ని చూడలేదు. మంచిచెడ్డలసలే తెలియవు. అందుకే తాతను వ్యతిరేకించలేకపోయింది. ఆ మరుసటిరోజు తాతగారు వెళ్లిపోయారు. మనుమరాలికి లోకం తెలిసింది. తాతపై అసహ్యం కలిగింది; చింతించింది; దుఃఖించింది; గుట్టు రట్టు కాకుండ వ్యవహరించింది.

వేములవాడ రాజరాజేశ్వర స్వామి దర్శనార్థం వెళ్లిన తల్లిదండ్రులు తిరిగి వచ్చారు. వారికి కూడ ఈ విషయం తెలియనీరాదనుకొంది. కొంతకాలం అలా అలా గడిచిపోయింది. మళ్ళీ తాతగారు వచ్చారు. ఆ తాతగారి కూతురు మీ తాతను భోజనానికి పిలుచుకొని రావల్సిందని తన బిడ్డకు చెప్పింది. మనుమరాలికి తాతమీద కసి ఉంది, తన మనస్సు ఎదిగిందని తాతకు చెప్పాలనీ ఉంది. అందుకొరకే తాత హృదయం కలుక్కుమనేట్లు పొడచింది. జానపదులు దీన్ని గట్టిగా పట్టుకొనేట్లుగా పొడిచింది.

---

కరీంనగర్ జిల్లా, నవంబర్-1973.

పాఠాంతరం : వరుసకు తాత—వావికి మగడు
కూతురు మీయత్త-కూటికి రమ్మంది
(జానపద గేయవాఙ్మయ వ్యాసావళి, పు : 34)

అతను నాత, తాను మనుమరాలు, అది తనతల్లివైపు వరస. అతను తనను పొందాడు, తనకతను బావ అయ్యాడు, తాను మరదలయ్యింది, ఇది తన వైపు వరస. తనను పొందాడు, అందువల్ల తానతనికి భార్య అయ్యింది, తన తల్లి అతనికి అత్తయ్యింది, ఇదికూడ తనవైపు వరసే.

బాంధవ్యబంధాలు— అనుబంధాలు శిథిలం రారాదు. అందుకే కుటుంబ సంబంధి ధర్మశాస్త్రాలావిర్భవించాయి. అవే శిథిలమైతే మనుగడ దుర్భర మవుతుంది. ఆ దుర్భర స్థితినుండి సుగతికి, ఆ సుగతినుండి ప్రగతికి భారతీయ సాహిత్యం సోపానాలు నిర్మించింది. కాని ఆ సోపానాలెక్కనివారూ, ఎక్కినా ఆచరణలో పెట్టనివారు తాము దిగజారిపోవడమే గాక బాంధవ్య బంధాల్ని, సామాజిక సంబంధాల్ని, అట్టడుగుకు నెట్టేశారు. ఈ కింద ఉదాహరిస్తోన్న భార్యాభర్తల కథాత్మక సంవాద ప్రహేళిక అందుకు నిదర్శనం.

* సవాశేరు బెల్లం
తైదా రొట్టె
సక్కంగ తినోయి
నా సామి.
పాలటిక తీసుక
పక్కన గొట్టిలే
పండ్లిగుల వట్టెనే
నీ దేవుడు.[1]

ఆ యిల్లాలి భర్త తన వృత్తిధర్మాన్ని అనుసరించి అప్పుడప్పుడు పొరుగూరికి వెడుతుండేవాడు. ఆ సమయంలో ఆమె తన పూర్వ ప్రియుణ్ని పిలిపించుకొంటుండేది. ఈ సంగతి ఎవరో అతని చెవిలో ఊదారు. అతనో పర్యాయం భార్యను పరీక్షించాలని నిశ్చయించుకొన్నాడు. పొరుగూరికి పోతున్నట్టు భార్యను నమ్మించి ఆ రోజు కొంతసేపటికి ఇంటికి తిరిగి వచ్చాడు. కాని అప్పటికే ఆమె ప్రియుడు వచ్చేశాడు. ఆ ప్రియుని కొరకే తయారుచేసిన బెల్లం

---

1 పాలమూరు జిల్లా మే-1977

రొట్టెను పాలకుండలో పెట్టింది. ఆ మధుర పదార్థాన్ని ఇంకా ప్రియునికి వడ్డించనే లేదు ఆపద ముంచుకొని వచ్చింది. ఆమె వెంటనే ప్రియుణ్ని పెద్ద కొప్పెరలో దాచేసింది. అతను ఆత్రంతో ఉక్కిరి బిక్కిరవుతూ ఆ కొప్పెర (పెద్ద బాన)లోనే కూచున్నాడు. ఆ తర్వాత ఏం ముంచుకు రాబోతుందో కూడా తెలియదు.

ఏ ప్రమాదమూ రాకుంటే అది తన ప్రియునికి చెప్పాలని ఈ ప్రియురాలు అనుకొంది. అందుకే ఓ ప్రియుడా చింతించకు అనేభావం వచ్చేవిధంగా అన్నది. 'ఇదిగో నీ కొరకే సవాశేరు (దాదాపు 300 గ్రాములు) బెల్లం కలిపి సంసిద్ధంచేసిన మైద (తవుడ) రొట్టె ఉంది; ఓనా స్వామీ! చక్కగా తినవోయి' అన్నది. 'తినవోయి' అనే పదానికి నిశ్చింతగా తింటూ ఉండు అంటున్నదనికూడ అర్థం వస్తుంది. అయితే పాలకుండ నెత్తిన కొట్టే పనికి పరమార్థముండదు. భార్య మాటి మాటికి ఒకేమాట అంటుంటే 'ఏంటి కథ' అని అడిగాడు భర్త. అదొక బొంకుపుకథలే అని చప్పరించివేసింది భార్య. అయితే నేను బొంకుపుకథ చూపిస్తా చూడు అంటూ భర్త పాలబిందె దగ్గరకు వెళ్లాడు. పట్టెమీదనుండి అది క్రిందకి దించాడు. అలాగే చేతపట్టుకొని వెళ్లి కొప్పెరలో ఉన్నవాడి నెత్తిన కొట్టి బొంకుపు కథ ఉత్తరార్థాన్ని అభినయించాడు.

సాంసారిక జీవితంలో పొరపొచ్చాలు రాకుండా ఉండడానికి (తమ తమ బలహీనతల కారణంగా) చేసిన తప్పుల్ని ఒప్పుకోకుండా, కొందరు రహస్యంగా కాపాడుతుంటారు. ఎదుటివారి ముందు లోకువ కావడం, సమాజంలో మర్యాద కోల్పోవడం తదితర కారణాలవల్ల అలా వ్యవహరిస్తుంటారు కాని 'రంకూ బొంకూ దాగడం కష్టం' అనే సామెత పుట్టింది. అయినా రంకును నేర్చినవారు బొంకాడి తప్పించుకున్న సంఘటనలు సాహిత్యంలో ఉన్నాయి; సమాజంలోనూ ఉన్నాయి. ఈ కింది కవితాత్మక ఛాయా ప్రహేళిక ఆ కోవకు చెందిందే.

* ఎద్దరి మీదెక్కి
ముగ్గన్ని మూటగట్టుకొని
పరాసికాన్ని పైనేసుకొని
హాసికాన్ని సేతపట్టుకొని

గాండ్లోని కొట్టెన్కంగ వడి
మా కోట్లకు రా![1]

ఆనాడు రుక్మిణి 'గోపలి సౌధంబు' లోనికి వచ్చే ఉపాయం. తనను తీసుకొనిపోయే విధానం కృష్ణునికి చెప్పంపింది. అట్లే ఓ కోటలోని దొరసాని మనసైన మగవానికి నర్మగర్భంగా మాట పంపించింది. కోటలోకి వచ్చేవారెట్లుం డాలో అట్లే అతని వేషధారణ ఉండాలని ఆమె మాటల్లోని మర్మం.

'ఇద్దరి మీదెక్కి' అంటే చెప్పులు వేసుకోవాలని, 'ముగ్గుర్ని మూటగట్టు కొని' అంటే కాసు-సున్నం-ఆకుల్ని నోటబట్టి అనీ, 'పరాసిరాన్ని పైనేసుకొని' అంటే జారిపోయే సిల్కు కండువాను భుజంపై వేసుకొని అనీ 'హాసిరాన్ని సేత పట్టుకొని' అంటే విలాసార్థం ధరించే దండం చేతిలో ఉండాలని, 'గాండ్లోని కొట్టి-వెన్కంగ కోట్లోకి రావాలి' అంటే అక్కడ అందరూ చూస్తుండగానే ధీమాగా రావాలి గాని దొంగచాటుగా రాకూడదు అనీ అర్థం. అంతగా కోరుకున్న ఆ కోమలి కోరిక తీరక ఉంటుందా! కడుపు పండక ఉంటుందా! జానపదుని కంటపడక ఉంటుందా! కథ రచ్చకెక్కక ఉంటుందా!

రావాలని రచ్చకెక్కించిన ఓ అందాల సుందరి కథ పొడుపు కథ అయ్యింది. జనంలోకి పొడుచుకువచ్చింది.

* ఏనుగ సెవులు
ఎనుబోతు గుడ్లు
రాలి మీగడ
ఎలుక కనుగుడ్లు
పదిమంది సేతులున్న లంజది

—ఇవన్నీ తెస్తే
రానిస్తానన్నది;
అన్నీ దొరకాయి

---

1 పాలమూరు జిల్లా మే-1977

అఖరిది దొరక్క
తన్నులు తిన్నాడు- ఏంది..?[1]

ఆ పడుచువానికి మొదట పొడుపే తెలియదు. అయితే ఓనాడు తననే తదేకంగా చూస్తోన్న ఓ తరుణిపై మనస్సు నిలిచింది. ఆ యువతి తన దగ్గరికి వచ్చేవారిని కొన్ని వస్తువులు తెమ్మంటోంది. అలాంటి వారికే తాను దక్కాలా నంటోంది. తలుపుచాటున ఉన్న ఆ యువతి దగ్గరికి వెళ్లాడీ పడుచువాడు. నేను నీకు శాశ్వతంగా దక్కాలంటే నేను చెప్పినవన్నీ తేవాలంది. అతని ప్రయత్నం మీద అన్నీ లభించాయి "పదిమంది చేతులున్న లంజది" మాత్రం దొరకలేదు. కొందరు కొరకొర చూశారు; మరికొందరు తిట్టారు; ఇంకా కొందరు కొట్టారు. చివరికి లాభం లేదనుకొని అన్నీ సమర్పించి అఖరిది అందలేదని దండం పెట్టాడు.

* ఏనుగ చెవులు - తమలపాకు
ఎనుబోతు గుడ్డు - కాచు
రాతి మీగడ - సున్నం
ఎలుకల గుడ్లు - పోకలు

దండంపెట్టి నిల్చున్న ఆ యువకుణ్ని వెంటనే తెడ్డుతో కొట్టింది ఆ యువతి. పదిమంది చేతులున్న లంజది ఇదే అంటూ తెడ్డు పట్టాడా యువకుడు. తెడ్డువిడిచి అతణ్ని చేపట్టిందా యువతి

పొడుపు కథల అర్థాలు అందరికీ తెలియవు. కొందరికే తెలుస్తాయి; కొన్నే తెలుస్తాయి. కొందరికి సద్యస్స్ఫూర్తి ఉంటుంది. వారి బుద్ధి చమత్కారాన్ని బట్టి పనిచేస్తుంది. పై పొడుపుకథలోని యువతి బుద్ధి అలాంటిది. ఈ క్రింది పొడుపుకథలోని యువకునికి పొడవడమే తెలుస్తుంది, విప్పడం తెలియదు.

* ఆరెప సెర్ల
కూరేరే పిల్ల
నీ ఒల్ల కూరేమి ?

---

[1] పాలమూరు జిల్లా మే-1977

సమా శాస్త్రం నేర్చిన
సాలివాడా !
రెక్కలు మడవని
పక్షి పేరేమి ! [1]

అదో చెరువు; ఆ చెరువు ఎండిపోయింది; అందులో బచ్చలికూర ఉంది గర్భంతో ఉన్న ఓ అమ్మాయి ఆ బచ్చలికూర ఏరుకొంటోంది ఓ కొంటె నీ ఒళ్లోని కూరేంటన్నాడు అతనడిగింది ఒళ్లోని కూర సంగతికాదు. కడుపులోని పిల్ల సంగతి! ఆడబిడ్డో మగబిడ్డో చెప్పేవారెవరు? అతనడిగిన ప్రశ్నలో గడుసుతనముంది; ఆ గడుసరికూడ అంతటి మారుతట్టు మంత్రించింది. ఆ పొడుపు ప్రశ్నకు సమాధానం జున్నకోల. దీన్ని కొన్ని గ్రామాల్లో పుల్లంగొయ్యి అని పిలుస్తారు. వర్షాకాల ప్రారంభ దినాల్లో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి చిన్న పిల్లలు వీటిని పట్టుకొని రెక్కలు లాగివేస్తుంటారు. ఈ సమాధానం తెలియని ఆ దుండగి ఇక అక్కడ నిలువక చకచక వెళ్లిపోయాడు

ఇలాంటి పొడుపు కథలు కొంత ప్రాచీనమైనవే. ఈ మధ్య పుట్టిన పొడుపు కథల్లో ఇంత క్లుప్తత—సవ్యత కనిపించదు. అక్షర రమ్యత, అల్పాక్షరాల్లో అనల్పార్థ ద్యోతకత చాలా తక్కువ అలాంటి ఒకటి రెండు పొడుపు కథల్ని పరిశీలిద్దాం

* ఒక కాపు, ఒక మాదిగ, ఒక తురక కలిసి ఓ అనాథ శిశువును కన్న బిడ్డలా పెంచారు. పట్నంలో చదువుకని ఉంచారు. ఓనాడు కాపు కోడినీ, మాదిగ పందిమాంసాన్నీ, తురక గొడ్డుమాంసాన్నీ తీసుకొని కూతురు దగ్గరకు వెళ్లారు. ఆమె ముగ్గురినీ సంతోషపరిచింది ఎలా? [2]

ఆ అనాథ శిశువు ముగ్గురి మమతానురాగాల్ని పంచుకొని పెరిగింది; అయినా అల్లరి పిల్ల కాలేదు. చక్కగా చదువుకొంది; లోకజ్ఞానం సంపాదించింది. చిన్నతనంనుండి ఆ ముగ్గురి మనస్సులకు కష్టం కలిగించే పని ఎన్నడూ చేయ

1 పాలమూరు జిల్లా మే-1977
2 గుంటూరు జిల్లా, 1976-నవంబర్

లేదు. పెరిగేకొద్దీ మనస్సు వికసించింది. ముగ్గురు తెచ్చిన ఆ వస్తువుల్ని చూచింది. సమస్యనెలా పరిష్కరించాలా అని ఆలోచించింది. ముగ్గురు పెంపుడు తండ్రుల్ని వరండాలో కూచోమంది. త్రాగడానికి చల్లని నీళ్లిచ్చింది. కోడి కాలుకు తాడుకట్టి విడిచిపెట్టింది. పందిమాంసాన్ని, గొడ్డుమాంసాన్ని చిన్న చిన్న ముక్కలుగా చేసి వాటిముందే కోడికి వేసింది. ముగ్గురు తండ్రులు ఆశ్చర్యంతో చూస్తున్నారు. ఆ కోడి మెల్లమెల్లగా ఆ మాంసం ముక్కలన్నీ తిన్నది. ఆ తర్వాత ఆ అమ్మాయి రాత్రి వంటకు ఆ కోడినే కోసింది. అన్నంలో ముగ్గురికి కోడిమాంసాన్ని వడ్డించింది. ముగ్గురు తృప్తిగ తిన్నారు.

నిజానికి ముగ్గురు ఆ అమ్మాయిని పరీక్ష చేయడానికే వచ్చారు. కొన్ని పరీక్షలకు గడువు ఇస్తారు. సమయస్ఫూర్తి ఉన్నవారికి గడువెందుకు !

* నది కావలి ఒడ్డున ఓ వ్యక్తి మేక ఆకులబుట్ట, పులితో ఉన్నాడు. ఆవలి ఒడ్డుకు చేరుకోవాలి, పడవమీద ఇద్దరు పోవడానికే వీలుంది. మేకకి అపాయం కలుగకుండా, ఏమీ చెదరకుండా ఆవలి ఒడ్డుకు చేరాలి ! ఎలా ![2]

ఆకుల బుట్ట మేకతో మొదటిసారి మనిషి ఆవతలి ఒడ్డుకు వెళ్ళి బుట్ట నవతల ఉంచి, మేకను మళ్ళీ తనతో ఒడ్డుకు పట్టుకొని రావాలి. రెండోసారి మేకని ఆవతలే ఉంచి, పులిని తీసుకొని వెళ్లి ఆవలి గట్టున ఉంచిరావాలి. మూడో పర్యాయం తానొక్కడేవచ్చి మేకను తీసుకొని వెళ్ళాలి.

ఈ విధంగా మూడు పర్యాయాలు మూడింటినీ చెక్కుచెదరకుండా చేర వేయడం సాధ్యమవుతుంది. కొద్ది ఆలోచిస్తే తెలిసిపోతుంది.

ఇటీవలికాలంలో వెల్వడ్డ ఇలాంటి పొడుపు కథల్లో భావవిషయకంగా కొంత పరిజ్ఞానం ఉన్నవారి హస్తం ఉన్నట్లు కనిపిస్తుంది. సాధారణంగా జానపద సాహిత్యంలో కనిపించే పొడుపుకథా శిల్పం ఇలాంటివాటిలో పూజ్యం ఇవి కొంతవరకు మెదడుకు మేతలాంటివే అయినా హృదయాన్ని పట్టి నిలిపే శక్తి వీటికి లేదు

[2] పాలమూరు జిల్లా, 1977-మే

కథాత్మక ప్రహేళికలో లభిస్తున్న వాటినిబట్టి ముప్పాప్పు మువ్వీసం అవి జానపదులవే అనాలి. పరిశోధకులు కొందరు వీటిని నామమాత్రంగా గ్రంథాం తెక్కించారు. ఇవి రసరంజకాలు; రమణీయకథాసంవిధాన సందాయకాలు; వాఖ్యాన సాపేక్షకాలు.[1]

ఇక ప్రశ్నోత్తరాలతో కూడుకొన్న కథాత్మక ప్రహేళికల్లో ఎక్కువ మిక్కిలిగా బూతుల బుంగలున్నాయి. చేలల్లో-పల్లాల్లో జానపదులివి నిస్సంకోచంగా పాడుకొంటారు. స్త్రీలూ పురుషులూ పాడుకొనేప్పుడు వివాజ్ఞములు ఖులపు

1 "కాలం మారింది - పంచం బోలయింది
కమత పిన్నమ్మా. పడవెత్తవమ్మా," అన్నాడట.
—అనిచెప్పి దీని సంబంధమను దేశవాళీ కథ చెప్పగా- మరొకరు.
కాలం మారింది - పంచం బోలయింది
ఉపద్రవం కాలంవచ్చి ఉమును తోటకూరయింది
పదిన పిన్నమ్మా, గంపెత్తవమ్మా," అన్నాడట
.. ... ....
మరో కథ
చెట్టేసిన సామంతుకుంటగా
నీళ్ళోసిన నీలారిగన్నెయుండగా
మరులుచెంపి, మధోళ్ళమీద రాలతావేమే?
మాయదారి మల్లెచెట్టా!" అన్నట్లు
అని యింకోకథ
విత్తనాలకొచ్చిన విరజాజి మొగ్గ,
సరసంకోసం వస్తే శిరస్సే పోతదో
సిరిపాదాలే పోతాయో!"
అంటే,
రసంవెళ్ళి రసంలో పడితే,
శిరసు పోతేనేమి! సిరిపాదాలు
పోతేనేమి చిన్నదానా! అన్నాడట....
[జానపద గేయవాఙ్మయ వ్యాసావళి, పు : 34]

తారు; మందహాస చంద్రికల్ని వెదజల్లుతారు; ఎందరి హృదయాల్ని కొల్లగొడ తారు. ఇవి ఎన్నయినా ఇక్కడ ఉదాహరించవచ్చు. సంభోగాల్ని అక్షరాంకితం చేయడం తప్ప ప్రయోజనం శూన్యం. అందుకే ఒకటి మాత్రమే ఉదాహరిస్తాను

* ఓ తొడల సండ్లదానా
మోకాటి సండ్లదానా
నీ మగడేడి కోయిందే!
అడ్డం దొడ్డం ఆరుగాళ్లోడా
నడివీపున గుద్దోడా
నా మొగడేటవతల
ముల్లుకు ముల్లు ఆనియ్యబోయిండు
వస్తే రాడు — రాకుంటే వస్తడు[1]

ఆరుబయట తడక చాటున ఓ యువతి స్నానం చేస్తుంది. ఆమె దగ్గరికి ఓ పురుషుడు వచ్చాడు. అతను గుర్రంమీద ఉన్నాడు. అలాంటి స్థితిలో తనను సమీపించిన అతణ్ని చూసి ఆమె ముడుచుకుపోయింది. అందువల్ల ఆమె స్తనాలు తొడల మధ్యకు కూరుకుపోయాయి. చన్నులేమో మోకాళ్లమీదికి వచ్చేశాయి. ఆ దృశ్యాన్ని వర్ణిస్తూ ఆ మొరటు మగాడు "నీ మగడేడికోయిందే" అని అడిగాడు.

ఆమెకు కోపం వచ్చింది. ఈ వెధవ చూడిందేగాక దగ్గరికి వచ్చాడు; దగ్గరికి రావడమే కాకుండా పలకరించాడు. పలకరింతలో నిండా పారుష్యముంది, ఏంటి! ఈ వంకర టింకర కూతలు. గుర్రానివి నాలుగుకాళ్లు; అతనివి నాలుగు కాళ్లు; మొత్తం ఆరు. 'అందుకే అడ్డంపొడ్డం ఆరుగాళ్లోడా' అంది. గుర్రానికి నడి వీపున అతని పృష్ఠపీఠముంది. అందుకే 'నడివీపున గుద్దోడా' అంది. పై రెండు మాటలు అపార్థ కల్పనాద్యోతకాలు! ఆలోచించిన తర్వాతే అర్థం సుస్పష్టమవుతుంది.

'ముల్లు వంకాయతోటకు ముల్లు ఆనియ్యబోయిండు' అంటే ముల్లు వంకాయతోటకు (చెట్లకు) ముల్లుకంప (ముండ్లకంప-కంచె) వేయబోయాడని అర్థం. ఏరువస్తే రాడనీ ఏరు రాకుంటే వస్తాడని అర్థం.

---

[1] పాలమూరు జిల్లా, 1977-మే

ఆ యువతి మాటల్లో పారుష్యముంది. ఈ పారుష్యానికి కారణం ఆ పురుషునికి సరసంగా మాట్లాడ్డం తెలపకపోడమే. అందుకే ఆమెకూడా పాటుగా మొదలుపెట్టి పొడుపుకథ చివరలో మోహనాస్త్రాన్ని సంధించింది. ధ్వనిగర్భితంగా తన మనసు మర్మాన్ని విప్పిచెప్పింది,

నిట్టంమీద ఉన్నవాడవు; వేగంగా వెళ్లు; ఏరు వస్తుందో లేదో చూడు. ఏరువస్తే మావాడు రాడు ఏరు రాకుంటే మావారు వస్తారు. ఇక నిర్ణయం తీసుకో వల్సింది నీవే; ఏరువస్తే మావాడు రాడు కాబట్టి నీవు రావచ్చు. ఏరు రాకుంటే మావారు వస్తారు కాబట్టి నీవు రాకూడదు ఇదీ ఈ పొడుపుకథ హృదయం.

అనంత వైవిధ్య ప్రపూర్ణ జానపద సాహిత్యంలో కథాత్మక ప్రహేళికలు ఎండని ఏరుల్లాంటివి. అందులో సాంఘిక కథా ప్రహేళికలు స్వాతిముత్యాల్లాంటివి. ఆ నీటిలో మునిగిన కొందరికి ముత్యపు చిప్పలు లభిస్తాయి; మరి కొందరికి రత్నసుల్లలు లభిస్తాయి. ఇక కాల్పనిక కథాత్మక ప్రహేళికలు ఆ ఏటిమీద పడే సూర్యచంద్రుల కాంతికిరణాల మెరుపుల్లాంటివి. వీటి తర్వాత ఆ మెరుపులనే పరిశీలిద్దాం.

## 3-6 : కాల్పనికాలు

ఈ మనిషి మనస్సు తన పరిసరాల్లోని యదార్థ విషయాల్ని గమనిస్తూనే, దానికి అతీతంగా, భిన్నంగా ఊహిస్తుంది. ఆ ఊహలు రూపుగడతాయి; అక్షరాకృతి ధరిస్తాయి. పదిమంది వాటిని అధ్యయనం చేస్తారు అవి వాస్తవ విరుద్ధాలనిపిస్తే కల్పనలని కట్టుకథలని పిలుస్తారు

ప్రపంచంలోని అన్ని సాహిత్యాల్లోనూ కల్పనలున్నాయి. కల్పనలేనిది సాహిత్యమే కాదనే వాదంకూడా ఉంది. అయినా సాంఘిక జీవితంలోని ఆటుపోటుల్తో పోలిస్తే కల్పనల్లోని ఆ యదార్థ సంఘటనలేంటో ఇట్టే తెలిసిపోతాయి. కల్పనలతో బరువెక్కిపోయిన సాహిత్యానికి సర్వసాధారణమైన ఈ గుణాల్ని కాల్పనిక ప్రహేళికలకూ అన్వయించవచ్చు.

“జానపద గేయగాథాస్రష్ట సంఘమునుండి తన యనుభవము వలన గ్రహించిన విషయములనే పొదిగి, పురా గాథలతో జోడించి, గేయగాథలను

మలచియిచ్చుట సత్ర్తింపదగిన యంశము....[1]" అనే వాక్యాన్ని రియువారి కాల్పనిక పొడుపు కథలకు అన్వయించవచ్చు. ఆ పొడుపుకథ సాంఘికమే; కాని అందులో పురాగాథాంశ కనిపిస్తుంది; చారిత్రకాంశ పొడచూపుతుంది. ఏవో కొన్ని అతీతాంశాలు ఆ సాంఘిక ప్రవాహానికి ఆవరించుకొంటాయి; లేదా అంతర్గర్భితంగా ఉంటాయి. ఇది జానపద మనస్తత్వ ప్రదర్శనం. వర్తమానం నుండి భూతంలోకి, భూతంనుండి భవిష్యత్తులోకి అతనెప్పుడూ తొంగిచూస్తూనే ఉంటాడు. అందుకే ఈ సాహిత్యంలో "విశ్వమానవ విరాట్ స్వరూపం స్పష్టంగా పరిపుష్టంగా గోచరిస్తుంది"[2] అంటారు.

కథాత్మకాంధ్ర కావ్యానికి ప్రవేశికల్లో రాజులు రాణులు, మంత్రులు, సేనాధిపతులు, వేశ్యలు, విదూషకులు, పరిజనాలు, పాములు ప్రధాన పాత్రలు. ముఖ్యంగా ఈ పొడుపుకథలన్నీ స్త్రీల మేధాశక్తి ప్రదర్శిస్తాయి. అందుకనే "ఎందరో రాకుమారులు పండితులు స్త్రీలు పన్నిన శాస్త్రముల చర్చలందు పూర్వపక్షమైపోయిరి"[3] అనడం ఎంతో ఎరుకతో చెప్పడం. ఈ క్రింది పొడుపు కథే పై అభిప్రాయానికి నిదర్శనం.

* కొడుకా కొడుకా
మొగనికి తమ్ముడా
నక్కన్న పండయ్య
నన్నిస్త లేవయ్యా.[4]

ఓ మహారాజ్యాన్ని ఓ మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు ఒకే ఒక్క కూతురుంది. ఆ అమ్మాయి అంతఃపురంలోకూడా అడుగులు కింద పెట్టకుండా అల్లారుముద్దుగా పెరిగింది. రాజూ-రాణి రాజకీయ వ్యవహార సముద్రంలో

---

1 తెలుగు జానపద గేయ గాథలు, పు : 17

2 తెలుగులో కొత్త వెలుగులు, పు : 157

3 జానపద గేయసాహిత్యము, పు : 519

4 పాలమూరు జిల్లా, 1977-జూన్

పూర్తిగా మునిగిపోయి కూతురుకు వయసువచ్చిన సంగతి మర్చిపోయాడు. రాజపుత్రి వేటకు వెళ్ళేది; విహారానికి వెళ్ళేది; అశ్వాన్నీ రథాన్నీ అశ్వశాలాధ్యక్షుడే సిద్ధంచేసేవాడు. అప్పుడప్పుడు వేటకు అశ్వశాలాధ్యక్షుడు కూడా వెంట వెళ్ళేవాడు.

ఓరోజు వాళ్ళిద్దరు వేటాడుతూ పరివారానికి దూరంగా వెళ్ళిపోయారు. ఇద్దరూ ఓ కొండగుహలో చిక్కుకొన్నారు. అక్కడ రాజపుత్రిని ఓ కొండచిలువ మింగే ప్రయత్నం చేసింది. ఆ అశ్వశాలాధ్యక్షుడు దాన్ని వెంటనే నరికి ఆమెను రక్షించాడు. రాజపుత్రి గజగజ వణికిపోయి అతని బాహువుల్లో సేదదీరింది. అప్పటినుండి అతనే తన భర్త అని తీర్మానం చేసుకొంది. కాపురం సాగుతున్నది; కాలం నడుస్తున్నది. రాజపుత్రి గర్భం ధరించింది; తల్లిదండ్రులకీ విషయం చెప్పడానికి ఆమె ఎన్నో పర్యాయాలు ప్రయత్నించింది. కాని వారు రాజకీయాల్లో ముజ్జిష్టంగా మునిగిపోయి ఏమీ వినా-వింటనా పెట్టలేదు ఆమె ప్రసవించింది ఈ విషయం ఇద్దరు పరిచారికలకూ, ఆ ప్రేమికులకూ తప్ప మరెవ్వరికీ తెలియదు.

సంతానం కలిగే కాలానికి రాజపుత్రిక వయస్సు పదునాల్గు సం॥లు మాత్రమే. ఆ అబ్బాయిని అదే నగరంలోవున్న పూటకూళ్ళ పెద్దమ్మ ఇంటిలో పెంచే ఏర్పాట్లన్నీ చేశారు. ఆ పెద్దమ్మకు ఆ దాసీలద్వారా కావలసిన వస్తువు లన్నీ పంపేవారు.

రాజపుత్రి పుత్రుడు శుక్లపక్ష చంద్రుడిలా దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. ఆ బాలుడు కంపచాటు మొక్కలా జువ్వున పైకి ఎదిగి వచ్చాడు. పదహారు సంవత్సరాలు గిర్రున తిరిగిపోయాయి. ఆజానుబాహువూ, సమున్నత శరీరుడూ అయిన రాజపుత్రి పుత్రుడు చూపరుల దృష్టిలో పడుతున్నాడు. ఆ అబ్బాయి ఆటపాటల్లో సాముగారిడీల్లో అందరిలో అగ్రణిగా పేరుపొందాడు

ఇన్నేళ్లు గడిచిపోయినా కూతురి బాగోగుల్ని గూర్చిగానీ, పెళ్లి పెడాకుల్ని గూర్చిగానీ ఆ తల్లిదండ్రులు ఆలోచించనే లేదు. అందువల్ల ఆమె ప్రణయ రహస్యం రహస్యంగానే ఉండిపోయింది. ముజ్జిష్టంగా ఉన్న రాజకీయ వ్యవహారాల కంటకావృత రథాన్ని ముందుకు లాగలేక ముసలిరాజు ఓరోజు గుటుక్కుమన్నాడు.

రాజు లేని రాజ్యంలో శాంతి పూజ్యమని భావించిన మంత్రులందరూ మంత్రాలోచనం చేసి ఓ నిర్ణయానికి వచ్చారు. తమ పట్టపు భద్ర కుంజరానికి పూలమాల ఇచ్చి నగరంలో విడిచిపెట్టారు. ఆ ఏనుగు ఎవరి మెడలో మాల వేస్తుందో, అతని మెడలో రాజపుత్రి మాలవేస్తుంది. అతనే రాజ్యానికి రాజవుతాడు. రాజపుత్రి ప్రమేయం లేకుండానే నిర్ణయాలు జరిగిపోతున్నాయి. భర్త మరణంతో వృద్ధురాలై సమస్త నిర్ణయాలు మంత్రులకే వదిలివేసింది. పట్టపేనుగు సరాసరి వెళ్ళి పెద్దమ్మ పెంచుతున్న రాజపుత్రి పుత్రుని మెడలో పూలమాల వేసింది.

అశ్వశాలాధ్యక్షునికి రాణివాసానికి సంబంధం తెగింది. ఇప్పుడేమి చెప్పినా దాసోహమే అని ఆమె ప్రేమిస్తున్న పనివాడయిన కొడుకును పెళ్ళిచేసుకొంది.

పదహారు సంవత్సరాలుగా రహస్య ప్రణయజీవన మాధుర్యంలో ఓలలాడుతున్న రాజమాత ప్రప్రథమంగా శోభనం గదిలో అడుగుపెట్టింది. పిచ్చిగా నవ్వుకొంది; నిర్లజ్జగా పరుపుమీదికి చేరింది. వెల్లకిలా పడుకొంది. బెదురు బెదురుగా పయ్యెదమీద చేయివేసిన కొడుకువైపు తిరిగింది. వాత్సల్యం నిండిన కళ్ళతో చూసింది. పసిపాపల కొడుకు కనిపించాడు. పుత్రహస్తస్పర్శకామె పాలిండ్లు క్షీరపూర్ణాలయ్యాయి, ఆమె మనసంతా మాతృప్రేమతో పరవశించింది.

ఆ పిల్లాడు తనకు కొడుకు. విధవరాలై వివాహం చేసుకొంది కాబట్టి తన మగనికి తమ్ముడు. అందుకే చక్కగా పడుకొమ్మంది; చన్నిస్తాలె (ర) మ్మన్నది.

ఆ పదహారేళ్ళ పిల్లాడు కన్నీటి పర్యంతమయ్యాడు; అలాగే తల్లి పాదాలపై పడిపోయాడు. ముప్పయి సంవత్సరాల ఆ తల్లి ఆ పిల్లాణ్ణి ఆప్యాయంగా ఒడిలోకి లాక్కొంది. కన్నతల్లి చంటికీ-చంకకూ దూరమైన ఆ అబ్బాయి మాతృప్రేమామృతంలో తనను తానే మరచిపోయాడు.

ఆ తల్లి అన్నీ సుద్దులూ చెప్పింది. ఇరువురు కూడబలుక్కొని అశ్వశాలవైపు నడిచారు, రాజరికం అశ్వశాలాధ్యక్షోద్యోగం అనే భేదభావం లేని

పదహారు సంవత్సరాల వాడి రహస్య ప్రణయం రేపటినుండి గట్టెక్కుతుంది. రాజుగారు రేపు తీర్పు ఇస్తారు; తన తల్లిదండ్రులకు పదిమందిముందు వివాహం చేస్తారు.

రహస్య ప్రణయం, రహస్య ప్రసవం, రహస్య పోషణం, గజమాలా ధారణం, మాతాపుత్ర వివాహం, ప్రహేళికా ప్రహసనం- అత్యద్భుత సన్నివేశాలలో అతిలోక కల్పనా రామణీయకంతో ప్రపంచం మెచ్చి తలపంకించగా సృష్టించాడు జానపదుడు. అతని మనస్సెన్ని అద్భుతాల నల్లుతుందో, హృదయానుభూతులనంత రమణీయంగా అభివ్యక్తీకరిస్తుంది. అంతేగాక నిత్యజీవితంలో తాను పాటించే నియమాల్ని కథయగా అల్లి ప్రాసల పంటగట్టిస్తుంది. అలాంటి కట్టు కథే ఈ క్రింది హాస్యకథ.

* 'అంచన్న వచ్చి కొంత వేసింపు'
'అంతనా ! కొంతనా !'
'గంటె సూత్రమంతా పెంటే'
'ముర్యాల పెప్పుకింద
వరాల తురాయికింద ఉన్నది
దాన్ని కాలదెబ్బ-ఖరీదు చేసుకురా !'[1]

ఓ రాజుగారు బ్రహ్మచారి; పైగా మితిమీరిన పొదుపరి. కూరా-నారా, ఉప్పు-పప్పు విషయంలో కూడా వంటవాడికి ఏపూట బత్తెం ఆపూటకిచ్చి వండిస్తుంటాడు. ఉదయం సభ తీరుస్తాడు; మధ్యాహ్నం అన్నం తినడానికి వెడతాడు. ఆలోగా వంటవాడు వంటపని పూర్తిచేసి రాజుకొరకు ఎదురు చూస్తుంటాడు.

ఓరోజు వంటమనిషి అజాగ్రత్తగా ఉన్నాడు. రాజుగారికి వండిన అన్నం కుక్క తిన్నది. రాజు వచ్చేవరకు మళ్ళీ వంటచేయాలి. కాని ఇంట్లో వంటచెరకు వంటసరకు ఏదీ లేదు. ఏం చేయాలన్నా రాజుగారినే అడగాలి. అందుకే నేరుగా సభకు వచ్చాడు. ఈ సంగతి అందరిముందు సభలో చెప్పేదెలా ! మర్మంపెట్టి, మెలిక తిప్పి చెప్పాడు.

---

[1] ఇందూరు జిల్లా, 1978-నవంబరు

'అంతన్న వచ్చి కొంత వేసిం'దంటే కుక్క ముట్టిందని రాజు గ్రహించాడు. వంటవాడేమో కొంతనే అన్నాడు. అంటే ఇంకా కొంత ఉండాలి అన్నమాట. ఆ కొంతలోనే ఈ పూటకు సరిపుచ్చుకోవచ్చు. సర్వప్రాణుల్లో పరమాత్ముడున్నాడు. కుక్క ఎంగిలి అంటే పరమాత్ముని ఎంగిలే. దాని ఎంగిలితింటే తప్పేంలేదు. అందుకే వెంటనే 'ఎంతనా-కొంతనా' అని అడిగాడు నిజానికి కుక్క తిన్నది కొంతే. కానీ కొంటెకాదు అంతా అని చెప్పి తాను తినాలనుకున్నాడు వంటవాడు 'గంటె సూత్రము-ఎంతా వెంటనే' లో ఒట్టుతిన్నాడు. బ్రాహ్మణుడేమో సూత్రంపట్టి ఒట్టు తిన్నాడు. వంటవాడేమో గంటెనే సూత్రంగా భావించి ఒట్టు తిన్నాడు

రాజుకు కోపంవచ్చింది. తన సంపాదనలో మిగిలిన ఒకే ఒక్క వరహా పాన్పుకింద ఉంది. అది కాలబెట్టి సాదర (సరకు) కొనుక్కురా అన్నాడు. కోపంవస్తే 'కాలబెట్టు' అనేపదం సర్వసాధారణంగా ఉపయోగిస్తుంటారు. వంటల వాడు అర్థం చేసుకొన్నాడు; వచ్చినదారి పట్టాడు.

రాజుకెంత ఉన్నా తన సంపాదనపైన్నే బతుకుతున్నవాడు. అలా బతకాలనికూడా సందేశం. గొంగడి ఉన్నంత కాళ్లు చాపుకోవాలి అనే జానపదుని భావన- అందరి భావన. ఇష్టంవచ్చిన విధంగా ఖర్చుపెట్టి బ్రతుకుభారం చేసుకోడం సమంజసం కాదు. అయితే బ్రతుకు భారంగా మారడానికి ఆదొక్కటే కారణముందనలేం. మరెన్నో ఉండవచ్చు. అందుకే ఆ అర్థాన్ని బలపరిచే ఈ క్రింది పొడుపుకథ పుట్టింది.

* పదిచ్చి తెచ్చుకొంటి
ఇరవై ఇచ్చి సేపిచ్చుకొంటి
ఎడల మెరిసె
మనసుల తిరిగె- ఏంది ?[1]

ఓ యువతికి కొంత వయసు ముదిరింతర్వాత వివాహమయింది. ఆమెకదివరకే ఓ పాముతో సంబంధముంది. భర్తతో సాంసారిక జీవనమామెకు

---

[2] పాలమూరు జిల్లా, 1977-మే

నరకప్రాయమయింది, ఒకరోజు సాయంకాలంలో పామూ-భర్తా ఇద్దరూ వచ్చేశారు, భర్తపీడ ఎలా విరగడవుతుందా అని ఆమె ఆలోచించింది. తలనొప్పి తీవ్రంగా పెరిగినట్లు నటన ప్రారంభించింది. ఊరవతల చిన్న పుట్టమీది మట్టే సరైన మందని కోరింది. ఆ మట్టిని మించిన మందు మరొకటి లేదంది,

ఆమె భర్త ఊరవతలి పుట్టదగ్గరికి వెళ్లాడు బుసలుకొడుతూ పైకివచ్చిన పామును చూశాడు. తనచేత ఉన్న పారతో వెంటనే పామును ముక్కలు చేశాడు, మట్టితీసుకొని ఇంటికివచ్చి భార్య ఫాలతలంపై పూశాడు. గట్టిగా పట్టీ వేశాడు. ఈ ఉపచర్యలు చేస్తూనే తనను కరవ వచ్చిన పాము సంగతి, దాన్ని ముక్కలు చేసిన సంగతి చెప్పాడు.

ఆమె వెంటనే వెలమొగమై పడుకొంది; ఎంతో చింతించింది. తన దాసీని పిలిపించింది. ఆమెకు పదిరూపాయలిచ్చి చచ్చిపోయిన ఆ పాము శరీరం ముక్కలు తెప్పించింది. ఇంట్లో ఉట్టిమీద సరిగెలో పెట్టింది. ఆ మరునటి రోజు వరకా ముక్కలు బంగారు కడ్డీలయ్యాయి ఆమె సంతోషించింది అవుసలిని పిలిచింది. అతనికిరవై రూపాయలిచ్చింది ఆ బంగారంతో సొమ్ములు చేయించింది. ఆ సొమ్ములన్నీ ఎదమీద వేసుకొని మెరిపించింది.

అయినా ఆమెకు భర్తమీది కోపం తగ్గలేదు. అతణ్ణి సాధించాలనే నిశ్చయించుకొంది. పాము పోయాక ఆమెకు జీవితంలో ఎటుచూచినా వెలితే కనిపిస్తున్నది. ఆ వెలితికి బాధ్యుడు భర్తే. అతణ్ణి సాధించాలి; తన ప్రతీకారం తీర్చుకోవాలి.

ఒకనాటి రాత్రి భర్తముందు ఒక సమస్యను తెచ్చిపెట్టింది. అది విప్పి చెపితే తన తలను, విప్పలేకపోతే భర్త శిరస్సును పందెంగా కాసింది, భర్త ఆశ్చర్యంలో మునిగిపోయాడు ఈ పంతాలు-పట్టింపులు ఎందుకో అర్థంకాలేదు. అయినా వెనుకడుగు వేయకుండా ఆమె సవాలును స్వీకరించాడు.

దేశదేశాలు తిరిగాడు; ఎందరినో అడిగాడు; అయినా ఆ సమస్య ముడి విప్పడంలేదు. తిరిగితిరిగి ఆతనొకనాడు తన చెల్లెలింటికి చేరుకొన్నాడు. చెట్టంత

అన్న పిట్టంతగా కనిపించడంతో ఆ చెల్లెలికి అన్న పరిస్థితి అర్థమైంది. అయినా సంగతులు అతని నోటనే విన్నది. ఆమెకు అంతకుపూర్వమే తన వదినకూ పాముకూ ఉన్న సంబంధం సంగతి తెలుసు. ఆ ఇంటి దాసీవల్ల ఎప్పుడేమి జరుగుతున్నదో తెలుసుకుంటూనే ఉన్నది. అన్నను ఓదార్చింది. అసలు విషయం చెప్పింది. అతను మహానందంతో ఇంటికి వచ్చాడు; శాస్త్రమర్మం విప్పిచెప్పాడు తన రహస్యం బట్టబయలు కావడం భరించలేని ఆ యువతి తలగొట్టుకొన్నది.

పొడుపుకథల్లోని పొలతులు మనసున్నవారు; మాట తప్పనివారు; మరణమన్న వెరవనివారు; మచ్చవచ్చినా జంకనివారు; మచ్చ రాకుండానే మెలిగే వారు; మచ్చరాకుండా తప్పించుకొన్న మరో మగువ కథ ఈ క్రింది పొడుపుకథ.

* "అన్నా ! పిండోతె ఎన్నెల
అచ్చం ఎన్నెల మద్దుగున్నది'

'అచ్చం ఎన్నెలేగాని
అచ్చానికో మచ్చపుట్టెగా చెల్లెలా !'

'అచ్చానికో మచ్చపుత్తే
సచ్చినా నీ యిల్లు సొచ్చపోదుగదా అన్నా !"

...  ...  ...

"ఒంటికాలి పట్టెపట్టి ధర్మమగునా,
'పంటచేను పదార్లు కల్పనీకు న్యాయమౌనా'
'సేను కోపులాస పడ్డదిగదా'
"సేనుకు పులికి సెల్లెలారున గదా!"[1]

ప్రజ్ఞా పాటవాలు కలిగిన ప్రధానమంత్రి అండదండలుండగా ఓ మహారాజు నిశ్చింతగా పరిపాలన కొనసాగిస్తున్నాడు. ప్రధాని మాటకూ-చేతకూ ఆ రాజ్యంలో ఎంతో విలువ ఉంది. అతని భార్య చక్కని చుక్క, సుగుణాలపుట్ట.

---

[1] పాలమూరు జిల్లా, 1977-మే

ఓరోజు రాజు ఉద్యానవన విహారం చేస్తున్నాడు.అతని పెంపుడు పైడికంటే చుట్టూ తిరుగుతున్నది, 'ఈ రాజ్యంలో అందంలో అందరిని మించిన సుందరాంగి ఎవరో చెప్పు పైడికంటే!' అడిగాడు రాజు. ఆ పైడికంటె వెంటనే 'ప్రధానమంత్రి భార్య' అని సమాధానమిచ్చింది.

రాజు మనస్సు వికలమైంది. మనస్సు ప్రధాని భార్యవైపు పరుగెత్తు తున్నది. మంత్రితోనే ఈ విషయం చెప్పీచెప్పనట్టు చెప్పాడు. మంత్రికి సంగతి తెలిసిపోయింది. గట్టెక్కే మార్గం ఆలోచించడం ప్రారంభించాడు.

ఓరోజు రాజు నేరుగా మంత్రి ఇంటికే వెళ్లాడు. మంత్రి అతణ్ని ఆద రించి మర్యాదలు చేశాడు. గృహాంతర్భాగంలోని మూడుగదులకు తాళాలు వేశాడు. భార్యను మూడుగదుల వెనుక ఉంచాడు. భోజనానంతరం మూడు విడాలు తెచ్చి రాజుముందుంచి లోనికి వెళ్లిపోయాడు.

అప్పుడు మంత్రిభార్య పెంచుకొన్న పైడికంటె రాజు దగ్గరికి వచ్చింది. 'రాజుకు ప్రధానిభార్య చెల్లెలౌరుస గద' అని అది పెగిలిపోయింది. ఆ పైడికంటె అలా పలకడంవల్ల రాజు అసహనం ఆకాశాన్ని అంటింది. కోపంతో విడెం విసరి కొట్టి అక్కణ్నుంచి వెళ్లిపోయాడు. రాజు ఆగ్రహం ఎటువంటిదో ప్రధానికి తెలుసు; ఈ సమస్య కాలమే పరిష్కరిస్తుందని, ఇక అక్కడ ఉండకూడదని నిశ్చయించుకొని, భార్యదగ్గరికి వెళ్లి, మా తమ్ముని పెళ్లికి వెడుతున్నానని చెప్పి, ఆ రాజ్య సమీపంలోఉన్న ఓ కొండ గుహలో దాక్కొన్నాడు.

మంత్రి వెళ్లిపోయిన విషయం రాజుకు తెలిసింది. రాజు ఆరోజు రాత్రి మంత్రి భార్యను పిలిపించాడు. అదివరకే సౌధోపరిభాగంపై మంచాలు వేయిం చాడు.

పిండారబోసినట్లున్న వెన్నెల. ఆకాశంనుండి భూమివరకు పైనిండా రాత్రికన్య పులుముకొన్న వెన్నెల. ఆ వెన్నెల్లో మంచాలు.

ఆ మంచాలమీదికి చేరాలని రాజు ఆతురతతో ఉన్నాడు. అనుకొన్నట్టే మంత్రిభార్య సర్వాలంకారభూషిత అయి వచ్చింది. తనను సమీపిస్తున్న రాజును

ఎగాదిగా చూసి కళ్ళల్లో నీళ్లు చిమ్ముతుంటే అన్నా అని కాళ్ళమీద పడింది. రాజు అలాగే ప్రమాన్పడి నిలబడ్డాడు. మంత్రిభార్య రాజు తనకెలా అన్న లవుతాడో అంతా విప్పిచెప్పింది.

రాజుగారి తల్లి తన తల్లి అక్కాచెల్లెండ్రు; ఒకే తల్లి పిల్లలు. తనతల్లి పొరుగు రాజ్యంలో ఉన్న మంత్రిగారి భార్య. తన తల్లిదండ్రులు షికార్లు చేసే వారు ఇరువురు కలిసి వేటకు వేళ్ళేవారు. ఓరోజు తనను తీసుకొని వేటకు వెళ్లారు అక్కడ సింహం తన తల్లిదండ్రుల్ని చంపివేసింది. పొదల్లో తప్పించుకొంది. ఆ అరణ్యానికే వేటకు వచ్చిన ఈదేశం మంత్రి తనను కాపాడాడు. ఆ తర్వాత వివాహం చేసుకొన్నాడు.

ఈ రాజు తన పెద్దమ్మ కొడుకన్న సంగతి భర్తకు తానింతవరకు చెప్పలేదు తల్లిదండ్రుల్ని పోగొట్టుకొన్న అనాథ బాలికగానే తాను భర్త దృష్టిలో మిగిలిపోయింది తన తల్లిదండ్రులతోపాటు తానుకూడా చనిపోయినట్టుగా లోకంలో ప్రచారం జరిగింది. ఆ దుఃఖంలోనే తానుండి తన సంగతి ఎవరికీ చెప్పకోలేదు. తన భర్త రాజు మనస్సు తనపైపు మళ్లతోందని సూచ్యార్థ సూచనం చేశాడు. దేశాన్ని ఏలేరాజు మనస్సు పరాయి స్త్రీపైపు పరుగెత్తడం ధర్మంకాదు. తన భార్య తప్ప దేశంలోని స్త్రీలందరూ ఆతనికి తల్లులూ-అక్కాచెల్లెండ్రే అవుతారు రాజు ధర్మాన్ని తప్పరాదు రాజు అవివాహితుడైతే తాను ఆశించిన అమ్మాయి అవివాహిత అయితే అప్పుడు అమెను ధర్మబద్ధంగా పెళ్లిచేసుకోవాలి. అధికారం ఉందని చెప్పి అత్యాచారానికి పూనుకోడం అధర్మమవుతుంది. తాను నిస్సహాయ స్థితిలో ఉన్నా తనలో క్షాత్రరక్తం ప్రవహిస్తోంది. ఈ రాజుకు గుణపాఠం చెప్పా లనే అప్పుడే తానసుకొన్నది. అందుకే తన ఇంటికి రాజు వచ్చినప్పుడు తనకూ రాజుకూ అన్నా చెల్లెలు వరుస ఉందని పైడికంచెతో పలికించింది.

ఇప్పుడే ఈ కథంతా రాజుకు ప్రధాని భార్య చెప్పింది. రాజు దుఃఖిం చాడు; తన అజ్ఞానానికి తల బాదుకొన్నాడు తన కళ్ళు తెరిపించిన చెల్లెలిని ప్రశంసించాడు. నిస్సత్తువతో అలాగే మంచంమీద వాలిపోయి దుఃఖిస్తున్నాడు.

అన్నకు జ్ఞానోదయమైంది; తన కర్తవ్యం తాను నెరవేర్చింది. ఇక తన భర్తను అన్వేషించాలి అనుకొంటూ ఆ పక్కనే, ఆ పింహారబోసిన వెన్నెల్లోని ఆ మంచంపైన్నే పడుకొంది ప్రధాని భార్య. పరిపరివిధాల పోతున్న ఆలోచనల్ని అన్నవైపు మళ్లించింది. ఆ అన్న చింతలో-వంతలో అతలాకుతలమైపోతున్నాడు. అతణ్ని మాటల్లోకి దింపాలనుకొన్నది.

"అన్నా పిండోలె ఎన్నెల, అచ్చం ఎన్నెల ముద్దుగున్నది' అన్నది. 'అచ్చానికో మచ్చపుట్టె గద చెల్లెలా' అన్నారు రాజు. 'అచ్చానికో మచ్చపుడ్తె సచ్చినా నీ యిల్లు సొచ్చపోదు గదా అన్నా" అన్నది మంత్రి భార్య.

ఆరోజు గడిచింది! ఆ మరునాటిరోజే రాజు అన్వేషణ ప్రారంభించాడు. మంత్రి ఏ కొండ గుహలో దాక్కొన్నాడో తెలిసిపోయింది. అతని దగ్గరికి వెళ్లి దండంపెట్టి ఒంటికాలిమీద నిలుచున్నాడు.

'ఒంటికాలి పబ్బతి పట్ట ధర్మమగునా' అన్నాడు మంత్రి. 'పంట సేను పదాట్లకల్ప నీకు నాయమగునా' అన్నాడు రాజు. 'సేనుకో పులాస పడ్డది గదా' అన్నాడు మంత్రి. 'సేనుకూ పులికీ సెల్లెలొరుస గదా' అన్నాడు రాజు.

ఆ మంత్రికి కథంతా చెప్పాడు. తన అజ్ఞానానికి చెంపలు వాయించుకొన్నాడు. మంత్రి ఆ గుహ పైభాగం నుండి దిగివచ్చి రాజును కౌగిలించుకొన్నాడు.

పొడుపు కథల్లో ఇలాంటి రాజులూ-మంత్రులూ-రమణులూ ఎందరో ఉన్నారు. ఈ క్రింది పొడుపు కథలో రాజున్నాడు; రాణి ఉన్నది; వేశ్య ఉన్నది. అంకెల గారడీతో సమయ నిర్దేశం చేయడమూ ఉన్నది.

* పచ్చని పతిమ ఒకటి
పసపేల పూసేవు రెండు
గుంజేల పట్టేవు మూడు
నగేల నగేవు నాలుగు

నాకంటె సక్కందైదు
అతనెక్కడపోయే ఆరు
వస్తడు పో- ఏడు.[1]

రాజో వేశ్యకు మరిగాడు. ఆమె చుట్టే తిరుగుతూ భార్య మాట మరిచాడు. రాజు భార్య సద్గుణవతి-సౌశీలవతి. పతివ్రతా ధర్మాన్ని అవలంబించి సహనంతో మంచికాలం కొరకెదురు చూస్తున్నది. అయినా చాలాకాలం వరకు రాజులో మార్పు రాలేదు. రాజుకు కనిపించకుండా కొంతకాలముండవలసిందని రాణి ఆ వేశ్యకు కబురు పంపించింది. ఆ వేశ్య రాణిమాట కాదనలేదు. కొన్నాళ్ళపాటు కనుమరుగై పోయింది. రాజు ఆమెకొరకు పరితపిస్తున్నాడు. రాణి ఈ విషయం గుర్తించింది. భర్త మనస్సుమెవైపే మొగ్గడానికి కారణం ఆ వేశ్య అదృష్టంగానే భావించింది రాజు చివరికి ఆ వేశ్యాసుందరి ఎక్కడుందో పిలిపించవలసిందని రాణినే వేడుకొన్నాడు. రాణి పిలిపించింది; వేశ్య సంతోషంతో వచ్చింది. ఈలోగా రాజు సభ దీర్చడానికి వెళ్లాడు.

వేశ్య వచ్చింది; రాణిని చూసింది; అక్కా అని పిలిచి అట్లాగే దూరాన నిలబడింది. రాణికా పిలుపులో ఏదో మాధుర్యం గోచరించింది. ఆమె సౌందర్యానికి ముగ్ధురాలైంది.

ఆ వేశ్య పచ్చని ప్రతిమ; పసపు మిసిమి ఛాయ; అమాయకంగా గుంజ పట్టుకొని నిలుచున్నది; మనోహరంగా నవ్వుతున్నది. తనకంటె చక్కదనంగా ఉన్నది. తనభర్త ఆ సౌందర్యానికే బంధితుడయ్యాడన్నమాట. అందుకే అతనెక్కడ పోయాడని అటునిటు వెతికించింది. చివరికి మగంటలకు వస్తాడు పొమ్మంటూ సమయం నిర్దేశం చేసి చీర రవిక పెట్టి పంపించింది.

ఈ క్రింది పొడుపుకథకూడా దాదాపుగా ఇలాంటిదే! అయితే ఫలితాలు భిన్నంగా ఉన్నాయి.

---

1. పాలమూరు జిల్లా 1977-మే.

* ఏ సెట్టి పోడగాయి ఒకటి
నీవే సెడిపోతివి రెండు
నా మగడు నాకొచ్చె మూడు[1]

వేశ్యలలో చిక్కుకొన్న ఓ రాజుగారు తన రాణి దగ్గర ఆమెను మెచ్చుకొంటాడు. ఆమె పతివ్రత అంటాడు; సౌజన్యవతి సద్గుణవతి అంటాడు; వేశ్యకు దృష్టి డబ్బుమీదనే సుమా అని భార్య అంటుంది ఇద్దరూ ఆమెను పరీక్ష చేయాలని నిశ్చయించుకొన్నారు. రాజు కొన్ని నెలలు వేశ్యకు కనిపించలేదు. వేశ్య రాజును చూడాలని అనేక ప్రయత్నాలు చేసింది. ఆయన నగరంలో లేడని రూఢి పడింది. రాజు వచ్చేవరకు తానిచ్చారచ్చా తిరగవచ్చుననుకొంది. ధనవంతుల్ని పిలిపించుకొంది విలాసాల్లో మునిగితేలుతుంది.

రాణి పురుషవేషం ధరించి రాజునమసరించింది. ఇద్దరు వేశ్యా గృహానికి వెళ్లారు. వేశ్య అసలు బండారం బయటపడింది రాజుకు ఆగ్రహం వచ్చింది. వేశ్యను తలగొరిగించాడు. ఆస్తిపాస్తులు లాక్కొని బికారినిచేసి ఊరు వెడలగొట్టించాడు ఆమె బిచ్చమెత్తుకొంటూ కాలం గడుప సాగింది. ఓరోజు రాణి దగ్గరికి వచ్చింది. అప్పుడు రాణి పావుసేరు (దాదాపు 300 గ్రాములు) తలక్రిందుగా పెట్టి బియ్యం కొలిచి భిక్షంగా ఇస్తూ పై పొడుపుకథ పొడిచింది ఇది తెలియని వారికి పొడుపు కథ. రాణి ఈ కథలోని పాత్రలకు కాదు.

కొన్ని పొడుపుకథలు కొద్ది మార్పులతో ఒకేవిధంగా ఉంటాయి. నల్లగొండ, ఇందూరు, పాలమూరు జిల్లాల్లో సేకరించిన పోలికలున్న కథల్ని పరిశీలిద్దాం.

* -ఏడు మేకల
ఎనుకపోయె మేక
సక్కటి మేక- సరాపు మేక
రాత్రటికి మారాజు రమ్మన్నడు.

-మూసు మాపు గూకినంక
మానజన్మ మెత్తినంక

1 పాలమూరు జిల్లా, 1977-మే

రాజు సచ్చినంక
రచ్చపాడు వడ్డంక
వస్తపో !

-ఏడు మేకల్ల
ఎనుకవోయె మేక
సక్కాటి మేక- సరాపు మేక
రాత్రటికి మారాజు రమ్మన్నడు.

-పచ్చగడ్డి తెచ్చివేస్తే
మెయ్యని గాడ్ది తప్పా
ఏసిన వాడ్ది తప్పా [1]

ఆ ఊరులో ఏడుగురు అక్కాచెల్లెండ్రున్నారు. అందరూ అందమైనవారే; ఒయ్యారిభామలే వలపుల మిఠారులే! అందరికన్నా ఆఖరి చిన్నది అందరికన్నా అందమైంది; అంతేకాదు మాటలు నేర్చింది; ఇట్టే మనసుల్ని పట్టేస్తుంది. అలాంటి ఆ చిన్నదానిమీద రాజు మనస్సు చిక్కుకొంది. రాజుగారి నర్మసఖుడొకడు రాయబారం కొనసాగించాడు. అందరిలో తననే ఎరుకొన్న ఆ పురుషుని రసిక్యానికే ఆమెకూడా ఉబ్బితబ్బిబ్బయింది. జగం-జనం-జననాథుడు నిద్దురపోయాక అప్పుడు తాను వస్తానన్నది. సమయం చెప్పింది. సంకేతంకూడా చెప్పింది.

('రాజు చచ్చినంక' అంటే చంద్రుడు క్రుంకిన తర్వాత అని అర్థం. 'రచ్చపాడు వడ్డంక' అంటే జనం సందడి తగ్గాక అని అర్థం.)

అన్నట్టుగా నియమానికి కట్టుబడి, మనసుపడ్డ మగవానిపైనే మనస్సుంచి మరీ వెళ్లింది. మనసు పడ్డవాడు మదిర సేవించాడు; మత్తులో ఉన్నాడు; నిద్దుర మత్తులో ఉన్నాడు. మనసుపడ్డ మగువనే మరచిపోయాడు. ఆ జాణ మనస్సు కలుక్కుమంది; హృదయం చివుక్కుమంది. చేతినుండి నోటిలోకి మారాల్సిన తమ్ములంతో రాగరంజితమైన నోటికెల్లను తుప్పున రాజుమీద ఉమిసేసింది. "ఛీ" అంటూ ఇంటికి వచ్చేసింది

1. నల్లగొండ జిల్లా, 1977-జూన్

ఆరోజు గడిచింది. రాజుగారి విదూషక నర్మ సఖుడు దాగిగాచి, అందరి వెన్నా వెనుకగా వెడుతున్న ఆ యువతిని సమీపించి నిన్నటి ప్రశ్న వేశాడు. ఆ భామ మనస్సు భగ్గుమంది; అతనివైపు చురచుర చూసింది. పొడుపుకథలోని చివరి భాగాన్ని త్రిశూలంలా ఎత్తి పొడిచింది. ఆ పంచెవికాని ముఖం చింతాకంత య్యింది.

* -పోతగౌడు ఇంటిమీద
పొన్న పూసింది - పొన్న కాసింది
అందలేదు - పొందలేదు
అంత్రాన తెల్లవారింది

—తిరుమసం పళ్లెంలో పిడియాలు
తినుమనని గాడిదకొడుకుకు
నీ చెప్పుతో కొట్టనా - లేక
నా చెప్పుతో కొట్టనా![1]

ఓ రోజు కొట్టంలోని కోడె కట్లు తెంచుకొని పోతున్నది. సాహసి పోతగౌడు కోడలు తన పంట్రపుకల్ని కోడె తోకకు కట్టి లాక్కొని వచ్చింది, కొట్టంలో కట్టివేసింది, ఆ దారినపోయే రాజుగారికి దృశ్యం నచ్చింది. దృశ్యంకన్నా గౌడు కోడలు నచ్చింది. పోతిగౌడును పిలిపించాడు. నీ కోడల్ని నా దగ్గరికి పంపించవలసిందన్నాడు. గౌడు ఇంటికి వచ్చి విచారిస్తూ కూచున్నాడు. కోడలు మామనడిగి విషయం తెలుసుకొంది. విచారించడం మానుమంది; తానే చిక్కును విడగొడతానంది.

ఆ రోజు రాత్రి పదింటికి తాను వస్తున్నట్టు రాజుకు చెప్పంపింది. రాజు ఎదురు చూస్తున్నాడు. గౌడు కోడలు కావాలనే బాగా ఆలస్యంచేసి వెళ్లింది. మత్తెక్కించే వాతావరణంలో మద్యాన్ని పుచ్చుకొన్న మహారాజుగారు మానవ రాక పూర్వమే మగత నిద్రలోకి జారుకొని అలాగే గాఢ నిద్రలోకి వెళ్లిపోయాడు. గౌడు కోడలు కొంతసేపు అక్కడే శయ్యమీద కూచొని, రాజుగారి దాసిత్వానికి నవ్వుకొని వెళ్లిపోయింది.

[1] ఇందూరు జిల్లా 1978-నవంబర్

తెల్లవారేంతరువాత రాజు లేచాడు. ఆగ్రహోదగ్రుడయ్యాడు, గౌడును పిలిపించాడు. పొడుపు కథలోని ప్రథమ భాగం పొడిచి చిక్కుముడి విప్పకపోతే శిరశ్ఛేదం చేయిస్తానన్నాడు. గౌడు గజగజ వణికాడు; ఇంటికివచ్చి ఈ సంగతంతా కోడలికి చెప్పి కంటనీరు పెట్టాడు.

గౌడు కోడలు పట్టాకట్టిన సభకు వచ్చేసింది. తాను సమాధానం చెబుతానంది. రాజు పొడుపు వేశాడు. గౌడు కోడలు విడుపు వేసింది. ప్రశ్నకు ప్రశ్న! పొడుపుకు పొడుపే! ఆమె పొడుపే అడిగించినా రాజుకది విడుపే! అతనికి తన నిర్వాకమేంటో అర్థమైంది. సభ విస్తుపోతున్నది; గౌడు కోడలు విసవిసా వెళ్లిపోతున్నది; రాజుగారి తల అలా నేలకే ఒరిగిపోతున్నది.

* -ఎలిగాటి పొపాయి మనిగ
మనిగకు తీగె
తీగెకు ఈగ
ఈగవచ్చినా ఒల్లంత - సెడగొట్టిపాయె

-కంచుకోట మీది కాకి
కోసి ముండ లేసై
మెయ్యని గాద్దని
చెప్పుతోటి కొట్టాలా -
పాపోసుతోటి కొట్టాలా![1]

ఆ ఊరిలోని పటేలు కోడలు సాహసి. పరుగెత్తే తమ బిత్తరిదూడను పరుగెత్తి పట్టుకొంది. దాని తోకకు తన పొడవాటి వెంట్రుకల్ని ముడివేసి లాక్కొని వచ్చింది. ఈ దృశ్యం ఆ వేళమేడపై రాజు కంటబడింది. ఆ సాహసి పొందుకై ఆ రాజు తపించాడు. పంచన నడిపించాడు. రాజుగారే తనను మెచ్చినప్పుడు కాదనేదేముందని కోడలొప్పుకొంది. రాజు తన ఇంటినుండి పటేలు కోడలు గడివరకు నేల బొయ్యారం త్రవ్వించాడు; పిలువనంపించాడు. పటేలు కోడలు సమయం చెప్పింది. కావాలనే తప్పించి వెళ్లింది. అప్పటికే రాజు పడుకొన్నాడు.

---

ఖమ్మం జిల్లా, 1977—మే

గంధం తాంబాళంలో కాళ్ల తొక్కి, ఆ కాళ్ళతో రాజు ఎదను తొక్కి, శరీరం మీదంతా గంధం పుప్పించి వెనక్కి వచ్చింది పటేలు కోడలు. ఆరాజు మరునటి రోజు కూడా పిలిపించాడు. కావాలనే పటేలు కోడలు మరీ ఆలస్యంగా వెళ్లింది. రాజు కప్పటికే నిద్రపట్టింది. నోటినిండా తాంబూలం పట్టి రాజు శరీరం నిండా ఉమిసి ఆమె వెళ్లిపోయింది.

ఆ మరునటి రోజు రాజు ఎలిగాటి పాపాయను (పటేలును) పిలిపించాడు. యి పొడుపు కథ ప్రథమార్థం ప్రయోగించాడు. అర్థం విప్పిచెబితే అర్ధ రాజ్యమిస్తానన్నాడు. చెప్పకపోతే తలగొట్టేస్తానన్నాడు.

పాపయ్య పటేలు ఇంటికి వచ్చి చింతిస్తున్నాడు. ఆతని కోడలడిగి విషయమేంటో తెలుసుకొంది. చింతించాల్సిన అవసరమేం లేదని, ఈ చిక్కుముడి తాను విప్పుతానని మామతో చెప్పి కచేరికి బయలుదేరింది. 'కంచుకోట మీది కాళ ...' అని ఎదురు పొడిచింది. రాజు గ్రహించాడు. అర్ధరాజ్య మిచ్చేశాడు.

ఈ మూడు కథాత్మక కాల్పనిక ప్రహేళికలు పక్కపక్కనే ఉన్న మూడు జిల్లాలవి. స్థూల దృష్టికి కూడా పెద్దగా వైవిధ్యం కనిపించదు. దీన్నిబట్టి జానపదుల ఊహల్లోని సాదృశ్యం తెలుస్తోంది. అవిచ్ఛిన్నమైన ఒకే సంస్కృతికి వారసులైన వారెవరైనా ఒకేవిధంగా ఊహిస్తారు వారికి కలిగే ఆవేశకావేశాలు హృదయ స్పందనలు, క్రోధోద్రేకాలన్నీ ఒకేవిధంగా ఉంటాయి. అలా ఉన్నప్పుడే సంఘంలో సమైక్యవాణి వినిపిస్తుంది; సంఘటిత శక్తి కనిపిస్తుంది

సరసం విరసం కావడమే కాదు; సరసం సమైక్యానికి కూడా దారి తీస్తుంది. అలా దారితీసినట్లు నిరూపించిన కాల్పనిక కథాత్మక ప్రహేళిక ఒకటి పరిశీలిద్దాం

* జలజల ముత్యము రాయే-
జలముత్యము రాయె
పూసిన తంగేడు రాయే
బూవేవి రాయే,

పూసిన తంగేడు రాయే
కామాచ్చి రాయే,

గన్నేర్ల మోతకు-
మావారు మేత వట్టక ఉన్నారు.
మేతవట్టి ఇత్తురాయే
చేత మామిడి కొమ్మ-

-వెనుక సెవులు - వెల్లాయి పళ్లు
రాతిలో మెదడు - రాయిపూరు చెక్క
ఇంటివెనుక తంగేడు పూసినపుడు
పట్నం పోడైనపుడు
వస్తిపోయె హన్మాండ్ల గుడికి[1]

ఓ రాజుగారు ఓనాడు సంధ్యాసమయంలో చల్లని పిల్లగాలిని పీలుస్తూ ఆంజనేయస్వామి మందిరం అరుగుమీద కూచున్నారు. ఆ దారివెంబడే ఆ నగరంలో పేరుమోసిన కాపు కోడండ్రు ఐదుగురు ఆదేసమయంలో నీలాటిరేవు వైపుగా పోతున్నారు. అందులో అందరికన్న చిన్నది- అందగత్తె హంసగమన. ఆ చిన్నదాని మీద రాజు మనసుపడ్డాడు ఆ వెనుక ఉన్న చిన్నదాన్ని దగ్గరకు పిలిచాడు.

'ఓ చిన్నదానా! అంత వేసి కొప్పును తలకోసి ముడిచావా! లేక కొయ్యకు ముడిచావా!' అడిగాడు రాజు

ఆ చిన్నది రాజు మనసును గ్రహించింది. 'ఈ లోకంలో కూచున్న చోటికే కూడు రావాలని కోరుకొనే వారెందరున్నారో కదా' అనుకొంది. అందుకే రాజుతో అన్నది.

'రాజా! రాజా! హనుమాన్ గుడి అరుగుమీద నీయంత నీవు కూసున్నవా! లేక నిన్నెవరన్నా కట్టేసిండ్రా' ... అంతే ఇక ఒక్క క్షణంకూడా అక్కడ నిలువక అక్కల్లో కలిసిపోయింది.

---

ఇందూరు జిల్లా, 1978-నవంబర్.

రాజు చింతాక్రాంతుడయ్యాడు; రాత్రివరకక్కడే కూచున్నాడు. రాజుగారి నర్మసచివుడు రాణికీవార్త చేరవేశాడు. రాణి హుటాహుటిన పయనమై రాజు దగ్గరికి వచ్చింది; రాజు భార్యతో మనసు విప్పిచెప్పాడు; ఆ మగువమీద మనసున్నదన్నాడు. 'ఓ అదెంతపనిలే! నేనే సంధానకర్తనవుతా'నంది రాణి. భర్తను ఇంటికి తీసుకొని వెళ్ళింది.

ఆ మరునటిరోజు కాపు ఇంటికి వెళ్ళింది. కాపు కోడండ్రు ఆమెను సాదరంగా ఆహ్వానించి సపర్యలు చేశారు. ఆ తర్వాత వడ్లు దంచడంలో మునిగిపోయారు, అప్పుడు రాణి "జలజల పుత్యము రాయే... చేత మామిడికొమ్మా" అంది. ఆమె పిలుపులోని అర్థాన్ని ఆ చిన్నది గ్రహించింది. అన్ని రూపకాలతో తన రూపాన్ని ప్రశంసించిన రాణి సౌందర్య హృదయానికి మురిసిపోయింది. వెంటనే ఇలా అంది.

'వెనుక ఒప్పులు = తమలపాకులు
వెల్లాయి పళ్లు = పోకలు
రాతిలో మెదడు — సున్నం
రాయిపూచ చెక్క = కాచు
ఇంటివెనకాల తంగేడు పూసినపుడు = వెన్నెల కాచినపుడు
పట్నం పాడైనపుడు — అందరు నిద్రించిన తర్వాత
వస్తిపోయే హన్మాండ్ల గుడికి—'

వడ్లు దంచుతూ, దర్వుమీద దర్వువేస్తూ, సువ్విపదాల నాలాపిస్తూ పై పాట పాడింది చిన్నది. సమయాన్ని నిర్దేశించి, సంభారాల్నికూడ సమకూర్చమంటోన్న ఆ చిన్నదాని జాణతనానికి రస హృదయానికి రాణి కదలింది; వెంటనే సెలవు తీసుకొంది; రాజుకు చెప్పింది; రాత్రికి స్వాగతం పలికింది.

## 3-7 : సింహావలోకనం

ఇలా జానపద హృదయసాగరాన్ని మథిస్తే కథాత్మక ప్రహేళిక రత్నాలెన్నో బయటపడతాయి. ఆ రత్నాల్లో మొదట మొదట కొంత వైవిధ్యం

కనిపిస్తుంది. కాని రాను రాను లన్నీ కొన్ని వర్గాల్లో ఇమిడిపోతాయి. వైదిక వాఙ్మయంలోని సూత్రాలు, పురాణ సాహిత్యంలో కథలుగా మారినట్టే, కథారహిత ప్రహేళిక కథాత్మక ప్రహేళికగా మారడానికి కొంతకాలం పట్టింది. పెద్దకథకు బీజభూతంగా కూడా కథాత్మక ప్రహేళిక నిర్మాణమయింది. ప్రబంధ వాఙ్మయంలో కథాకథనానికి వర్ణనలు తోడయ్యాయి. కథాత్మక ప్రహేళికల్లో వర్ణనం ఆయా వ్యవహర్తల భావుకతనుబట్టి నిర్మాణమవుతుంది. ఒకే అంశాన్ని ఇద్దరు వ్యవహర్తలు చెప్పినప్పుడు వారి వారి స్థాయీభేదం పట్టే కనుగొనడానికి పూర్వాపరాల పరామర్శ అవసరం.

ఆయా కాలాల్లో పండితులు చెప్పిన శ్లోకాలు, పద్యాలు హిమగిరిని అద్దంలో పొదిగినట్లు కథను పొదుగుకొన్నాయి. జానపదుల కథాత్మక ప్రహేళికలకు ఇలాంటివి కొన్ని బీజప్రాయాలుగా నిలిచాయి. పదబంధాల్లో సామెతల్లోకూడా కథాత్మకత కనిపిస్తున్నది. అందువల్లనే 'తిలకాష్ఠ మహిషబంధము' లాంటి పదబంధాల్లో పొడుపుకథా లక్షణాంశాలు కనిపిస్తాయి. ఈ పదబంధం శబ్దార్థం తెలిసినవారు "నువ్వుకట్టె–బఱ్ఱె పలుపు" అంటారు కాని కథ తెలియాలి. కృష్ణరాయల ఆస్థానానికి వచ్చిన ఓ పండితుణ్ని తికమకలు గురిచేసి పంపించాలని నిర్ణయించుకొన్న తెనాలి రామకృష్ణుడు "నువ్వు కట్టెమీద బఱ్ఱె పలుపును" చుట్టి తీసుకొనివచ్చి ఈ తిలకాష్ఠ మహిషబంధం ఆధారంగా మీతోటి వాదానికి దిగుతున్నానన్నాడు. ఆ పండితుడు భయపడి పారిపోయాడు. ఇందులోని వాస్తవికత ఎంత అని ప్రశ్నించినా పూర్వాపరాల్ని పరిశీలిస్తే ఓ కథాంశం కనిపిస్తుందని అంటాం. అందుకే కథాత్మక ప్రహేళికల్ని వివరించడానికి ముందు ఈ పదబంధాల ప్రస్తావన చేయడం జరిగింది.

ఇదేవిధంగా సామెతల్లో దాగిఉన్న కథల్ని పరామర్శించడం జరిగింది.

* వంకమూతి రామసిల్కా
పట్నమంత పాడుసేసె

ఇది నేటి సామెత; ఒకనాటి పొడుపుకథ. విడుపు నాగలి, అంత మాత్రంలో అంతా అవగతం కాదు. అందుకే ఏ నాగలి, ఏ పట్నాన్ని, ఎప్పుడు, ఎందుకు పాడుచేసింది అని అన్వేషించాల్సిన అవసరం ఏర్పడుతుంది. కథాత్మ

ప్రహేళికల్లో ఇవే గుణాలున్నాయి. అందుకే బలరాముని నాగలి, పాండవులమీద మమకారంతో హస్తినను నాశనం చేసిందని పూర్వాపరాలు వివరిస్తూ కథ చెప్పాల్సి వస్తున్నది.

జనంలో నానిన చారిత్రక-పౌరాణికాంశాలు సులభంగా తెలుస్తాయి. అలా తెలియకుండా జానపదులకే పరిమితమైపోయిన కథాత్మకాంధ్ర ప్రహేళికల్లో కొన్నింటినీ ప్రకరణంలో సుదీర్ఘంగానే వివరించడం జరిగింది. అలాంటి ఈ క్రింది ప్రహేళికకు కొంతన్నా వివరణ ఇవ్వకపోతే శబ్దార్థాలు తెలిసినా ప్రహేళికా హృదయం తెలియకుండానే పోతుంది.

* అమ్మమ్మమ్మమ్మా
  తాత ఏడికోయిండు !

  -అరవైయారు కుక్కల్ని తీసుకోని
  అడుగులేని జీవరాశికి
  పట్టవోయిండు.[1]

ఓ పిల్లాడికి తాతతో పని తగిలింది. ఎక్కడ వెతికినా తాత కనిపించ లేదు. నేరుగా అమ్మమ్మ దగ్గరికే వెళ్లాడు. తాత ఎక్కడికి పోయాడని అడిగాడు. అమ్మమ్మ చెప్పిన సమాధానం పిల్లవానికి అర్థంగాక తెల్లమొగం వేశాడు. ఆ అమ్మమ్మ నవ్వింది. అరవై ఆరు కుక్కలంటే 'వల' అనీ, అడుగులేని జీవరాశి అంటే చేపలనీ చెప్పి మనుమని బుజ్జగించి పడుకు పెట్టింది. ఇంతమాత్రమన్నా వివరిస్తేగాని పొడుపుకథ వెనుక ఉన్న కథ ఏమిటో తెలియదు.

ఇవేగాక అయిదారు పాదాలతో సంవాదాత్మక కథా ప్రహేళికలు కూడా కనిపిస్తున్నాయి. ఆ శబ్దార్థాలు తెలిసినా పూర్వాపరాలు తెలియకపోతే ప్రయోజనం ఉండదని అలాంటివి కొన్ని ఉదాహరించడం జరిగింది. ఈ ప్రకరణం చివర అవొక్కటి వివరించి ముగిస్తాను.

* 'నుగు సేనుకాడి కావలిపిల్లా
  సుగుసెట్టుకు నూరాకులు
  నూనె యాడంగ ఎల్తది'

---

1. ఇందూరు జిల్లా, 1978-నవంబర్

'రాజా రాజా నీయమ్మ
సంవర్తయినప్పుడు నీవేమన్నావు'

'పిల్లా నిన్నే పెళ్ళి చేసుకునేను
నీ నాగవెల్లి నిష్ఠూరమైపోయేను'

'రాజా నీకే ఓ కొడుకును కనేను
నీ రెట్టకు తాడు పెట్టించేను'[1]

ఓ అమ్మాయి నుగుచేనుకు కాపున్నది. ఆ అమ్మాయిని పరీక్షించాలని రాజు ఓ ప్రశ్న అడిగాడు. ఆ అమ్మాయి రాజును అవహేళన చేస్తూ తానో ప్రశ్న వేసింది. రాజు పంతంతో పెళ్ళి చేసుకొంటానన్నాడు; పెళ్లి తంతు పూర్తికాక పూర్వమే వెళ్లిపోతానన్నాడు. ఆమె కూడా ప్రతిజ్ఞ చేసింది. నీ వల్లనే కొడుకును కంటానన్నది; ఆ కొడుకుతో నీ రెట్టకు తాడు పెట్టిస్తానన్నది.

ఇంతవరకు అందరికీ అర్థమవ్వేదే! అయితే ఈ పంతాలూ—ప్రజ్ఞలు నెరవేరేదెలా! ఈ పొడుపుకథ తర్వాతి కథ తెలిస్తేనే ముడి విప్పడం పూర్తవు తుందని భావించాలి. ఆ విషయం మళ్ళీ వ్యవహర్తే చెప్పాలి

రాజు ఆరోజే కాపును పిలిచాడు. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకొన్నాడు. నాగవెల్లి పూర్తికాకముందే వెళ్లిపోయాడు. ఏమేంటని ఎవరూ అడగలేదు. ఆ అమ్మాయి ధైర్యంలోనే ఉంది. తాతగారిని తీసుకొని దొమ్మరులదగ్గకు బయలు దేరింది. వారిదగ్గర దొమ్మరాట నేర్చుకొంది. గడెక్కడం, తీగమీద నడవడం రకరకాల సాహసకృత్యాలు చేయడం అన్నీ వచ్చాయి ఆ అమ్మాయికి.

కొన్నాళ్ళకు రాజు గుర్తుపట్టకుండా వేషంమార్చి రాజుముందే ఈ ఆట లన్నీ ప్రదర్శించింది ఆ అమ్మాయి. రాజామె సాహసానికీ-సౌందర్యానికీ ముగ్ధుడై పోయాడు. ఆమెతో మూడురాత్రులు నిద్ర చేశాడు. ఆ మూడు రాత్రుల్లో ఆమె చంద్రహారాన్ని, అంగుళీయకాన్ని, చేతి కట్టనూ కానుకలుగా స్వీకరించింది.

ఆ తర్వాత ఆమెకో కొడుకు పుట్టాడు అతణ్ని పెంచింది; శౌర్యం ఉగ్గుపాలతో రంగరించి పోసింది. అతను పదహారేళ్ళ వాడయ్యాడు సాహసాలు

---

[1] పాలమూరు జిల్లా, 1977-మే.

ప్రారంభించాడు. అప్పుడు తన ప్రతిజ్ఞ సంగతి కొడుకుకు చెప్పింది. తల్లి ఆజ్ఞ నందుకొని కొడుకు దొంగతనాలు ప్రారంభించాడు. రాజభటులనూ, కొత్వాలునూ, సైన్యాధిపతినీ, మంత్రిని ముప్పుతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించాడు. ఎవరిచేతికీ చిక్కలేదు. చివరికి రాజే పట్టుకోడానికి బయలుదేరాడు. అతనిపుత్రుడు ఉపాయంతో రాజుగారి వస్త్రాల్ని అపహరించి, పదిమంది ముందు రాజే దొంగ అని చాటుతూ పెట్టెకు తాడుగట్టి సభలోకి తీసుకొని వచ్చాడు.

అక్కడ ఆనాటి సుంచేని కావలిపిల్ల కనిపిస్తుంది. రాజు కళ్లు పిచ్చు కొంటాయి. ఆమె తనదగ్గర చంద్రహారాన్ని, అంగుళీయకాన్ని, చేతికట్టును ప్రదర్శిస్తుంది. రాజు ఆమె సాహసాన్ని ప్రశంసించి ఆమెనూ కొడుకునూ స్వీకరిస్తాడు. ఆ పిల్లవాణ్ణే యువరాజుగా ప్రకటిస్తాడు.

ఇప్పుడివి జరిగినవి కావు; ఎప్పుడు జరిగాయో నిరూపించడానికి ఆధారాలు లేవు. ఒక దశలో మానవుని కల్పనాత్మక ప్రపంచంలోని వాస్తవమెంతో కొంత ఊహించవచ్చు. ఆ దృష్టితోనే ఈ ప్రకరణమంతా వ్యవహర్తల మీద ఆధారపడి, వర్ణనాత్మకతకు కొంత ప్రాధాన్యమిచ్చి వివరించడం జరిగింది.

ఇవి స్థూల విభజనమే! కథమీద—కథనంమీద మాత్రమే దృష్టి కేంద్రీకృతం చేయడం వల్ల, కథాత్మకాలు (గద్య కథలు) అని నామకరణం చేయడం వల్ల ఈ ప్రకరణానికి ఈ పద్ధతి నప్పిందనే భావించడం జరిగింది. కథలమధ్య మధ్య చమత్కార రామణీయకతనూ, వ్యంగ్య వైభవాన్ని కూడా ప్రదర్శించలేదు. కథాగమనానికవి ఆటంకాలని భావించడంవల్లనే ఈ పద్ధతి స్వీకరించడం జరిగింది.

. ఈ కథల్లోని జానపదులు ప్రయోగించిన నిసర్గ రమణీయమైన అలంకారాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా స్త్రీకి వారు చేసిన కైసేత నభూతో నభవిష్యతి. స్త్రీని పొన్నతో పోల్చి కైపుల్లినపొన్న" అనడంలోని సమలంకృత భావన ఎవరినైనా ఇట్టే పట్టి నిలుపుతుంది. పచ్చని పటిమ, సక్కటి మేక-సరాపు మేక, జల జల ముత్యము, జలముత్యము, పూసిన తంగేడు కాసిన తంగేడు.... తదితర రూపకాలంకారాలతో తమ పరిసర వస్తువులనే ప్రయోగించడంవల్ల సహజత్వానికి

మరింత వన్నె వచ్చినట్లయింది; కథాత్మకాలైన ఈ సాంఘిక కాల్పనిక ప్రహేళికల్లో వ్యర్థపదాలు తక్కువ దీనివల్ల కథన నిర్మాణం చెడకుండా నిలిచింది. వ్యర్థపద విరహిత ప్రహేళికలన్నీ కవితా శిల్పాన్ని పుణికిపుచ్చుకొన్నాయి. ప్రతి కథలో ఉన్న వక్రోక్తులు వ్యంగ్య వైభవంతో ప్రకాశిస్తున్నాయి. కావ్యకళా రహస్యాల్ని నిక్షిప్తం చేసుకొన్న ఈ పొడుపుకథలన్నీ రుచికి పాలమీగడలు-చెరుకు గడలు; శుచికి వెన్నెలలు; సువాసనకు విరిసెనలు; మృదుత్వానికి దూదులూ-వెన్నముద్దలు.

 

 

# పొడుపు కథలు - సామెతలు

**4-0 :** "సామెత లేని మాట ఆమెత లేని ఇల్లు" అనేది తెలుగుభాష ప్రాశస్త్యాన్ని తెలుగువారి గృహధర్మాన్ని వెల్లడిస్తోంది. ఆ మాట — ఆ ఇల్లు నిరర్థకాలనే అభిప్రాయం ఊరక పుట్టింది కాదు. ఆమెత అంటే విందు. విందు భౌతిక సుఖాన్ని ఇస్తుంది. సామెత మానసికానందాన్ని కలిగిస్తుంది. శరీరానికి పుష్టి మనస్సుకు తుష్టి ఉన్నప్పుడు మనిషి చేసే కార్యాలన్నీ ఫలిస్తాయి. అందువల్ల ఆ పై పలుకులో అనుభవసారమున్నదని తెలుస్తోంది.

అనుభవానికి వ్యాప్తి ఉంది. గంధానికీ, గాలికీ నీటికీ వ్యాప్తి ఉంది. వాటిని ఒక దగ్గర కూర్చాలి; అది తత్సారమనాలి. కూర్చడానికి నేర్పు కావాలి. అప్పుడు అది సామెత అని పిలువబడుతుంది. ఇంతకు సామెత అంటే తేలిన సారాంశం అనుభవ సారమని.

అనుభవసారాలైన సామెతలెప్పుడు పుట్టాయో నిర్ధారణ చేయడం కష్టం. భాషఎప్పుడు పుట్టిందో, భావమెప్పుడు ప్రసరించిందో, మనిషిలోని కళాకౌశల్యం ఎప్పుడు ఆవిర్భవించిందో సామెత అప్పుడు పుట్టింది. పొడుపుకథ కూడా ఇంచు మించు అప్పుడే పుట్టింది. పొడుపుకథ ఒక సంకేతం; ఆ సంకేతం కళాత్మకమైన విలువల్ని సంతరించుకున్నప్పుడు సామెత సాక్షాత్కరిస్తుంది: అన్ని పొడుపు కథలు అట్లే సాక్షాత్కరిస్తాయనడానికి అవకాశంలేదు; కొన్నింటికే ఆ అవకాశం ఉంది. అలా రూపుదిద్దుకొన్న వానినే సామెతలంటారు. కాని వాటికి పూర్వమున్న పేరే ఉంటుంది.

## 4-1 : పుట్టు పూర్వోత్తరాలు

ప్రాచీన భారతీయ సూత్ర వాఙ్మయ మంతా సామెతల మయం. వేదము సూత్రబద్ధం; సూత్రమనుభవసారం. అనుభవసారమే సామెత. వేదాలు, ఉప

నిషత్తులు, పురాణాలు, కావ్యాలు సామెతల ద్వారా అందచందాల్ని సంతరించు కొన్నాయి. ప్రపంచంలోని సర్వవాఙ్మయాల ప్రారంభ దశలో ఉద్భవించిన సారస్వతమంతటా ఈ సామెతలు కనిపిస్తున్నాయి. అందులో సామెతలుగా పరిగ ణింపబడ్డ పలుకులు జనవ్యవహారం నుండి గ్రంథస్థమైనట్లుగానూ, లేదా గ్రంథ కర్త కూర్చిన కమ్మని మాటల మూటలు జన సమ్మాన్యాన్ని పొంది సామెతలన బడినట్లుగానూ ఊహించడానికి వీలుంది.

సంస్కృత భాషలోని వేద పౌరాణిక లౌకిక వాఙ్మయాల్లో ఇటువంటివి కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. ప్రాచ్య పాశ్చాత్య భాషలన్నిటిలోనూ సామెత లున్నాయి. ఇవి ఒక ప్రదేశంలో పుట్టి అంతట వ్యాపించవచ్చు. లేదా వేర్వేరు ప్రదేశాల్లో పుట్టవచ్చు. ఏకమూల సిద్ధాంతాన్ని మొదటి అభిప్రాయం, బహు మూల సిద్ధాంతాన్ని రెండవ అభిప్రాయం బలపరుస్తోంది. ఇంతకు మించి మానవుని మూలభూత ప్రవృత్తులన్నీ ఒకటే అనీ, ఈ ప్రవృత్తుల్ని తరతరాల నాగరికతల్ని తరతరాలేవీ మార్చజాలవనీ మేధావులభిప్రాయపడ్డారు'[1] "ఏకం సత్ విప్రాబహుధావదన్తి" అనే ఆర్యోక్తి వీటన్నిటికీ మూలము, అంతవరకు మానవుడెదిగినప్పుడు మాత్రమే ఈ ఎకమూల సిద్ధాంతాన్ని అంగీకరిస్తాడు. అఖండ సృష్టి అర్థంకాని వారంతా ఖండ ఖండాలుగా దర్శించి విజ్ఞానాన్ని గ్రహిస్తారు. అందువల్లనే పొడుపు కథలకూ సామెతలకూ ఈషద్భేదం, ఈషత్ సామ్యం కనిపిస్తోంది.

సంస్కృత సామ్యశబ్దం అసాధు రూపం సామ్యత అని, సామ్యతే సామెత అయిన దనీ అంటున్నారు.[2] సాటి అయినదే సాటవ అనీ, సాటిజేసి అంటే పోల్చి చెప్పడమే ఈ సామెతకు ప్రధాన గుణమనీ, సాటవనే సామెత అంటారని కొందరి అభి ప్రాయం. సామెత పదమేభాషనుండి వచ్చిందైనా సాటవ అనే దచ్చమైన తెలుగు పలుకని వారే వ్రాస్తున్నారు.[3] సామెతకు సంస్కృతంలో లోకోక్తి, సూక్తి,

---

1. **Racial Proverbs, Pxxiv**లోని డా॥ చాంపియన్ అభిప్రాయం జానపద సాహిత్య స్వరూపము పుట 68లో ఉదాహృతం.
2. తెలుగు సామెతలు, పీఠిక పు : 2.
3. " " " పు : 39.

సుభాషితాలనే పేర్లున్నాయి. తమిళంలో పళమొళి (పాత మాట), కన్నడంలో గాదె (గాథా) లేక నాణ్ణుడి (నానుడి) అనే పేర్లున్నాయి. సామెత అనే పదం తెలుగులో ఎంత ప్రాచీనమో ఇతర భాషల్లో కూడా అంత ప్రాచీనమే. అన్ని భాషల్లోనూ పొడుపు కథలకూ సామెతలకు సామ్యం కనిపిస్తోంది. కొన్ని పొడుపు కథలు సామెతలుగా వ్యవహారమవుతున్నాయి.

## 4_2 : పొడుపుకథే సామెత,

పొడుపుకథే సరళమై సంస్కారవంతమై కళాత్మకమైన విలువల్ని పొదిగి కొన్నప్పుడు సామెత అవుతుంది. కథకు సంకేతించే శక్తి పొడుపుకథ కుంది. ఆ సంకేతాల్లోనివెన్నో సామెతలయినాయి. ఎక్కడో ఒక సంఘటన జరిగింది; దానిపై ఒక పొడుపుకథ పుట్టింది; అది సామెతగా మారింది.

ప్రకృతి తన ధర్మాన్ని ఆచరిస్తుంది. ఆ అనుభవాలు మానవుని కున్నాయి. విజ్ఞాన ప్రహారానికో, వినోదానికో ఆ అనుభవసారం మూటగట్టబడింది. ఆ మూటే పొడుపుకథ; అదీ సామెత రూపుదాల్చింది.

సాంప్రదాయక విజ్ఞాన మొకటి ఉంది. అది తరతరాల నుండి అంత స్స్రోతస్విని అయిన సరస్వతి వలె ప్రవహిస్తోంది. ఆ విషయం కూడా ముడుపు కట్టబడి పొడుపుకథ అయ్యింది. దానిని జనత సమ్మానించి సామెతగా తీర్చి దిద్దుకొంది.

* సంపాదన ఒకరిది

అనుభవం ఇంకొకరిది [చేపలు — కడుపు]

ఇది ఒకనాటి పొడుపుకథ. ఇప్పుడిది సామెతల సరసన కూచుంది. దీని అర్థమేంటని ఇప్పుడెవ్వరూ అడగడం లేదు. పనిచేసి సంపాదించే వాడొకడై అనుభవించే వాడింకొకడైన సర్వకాలాల్లోనూ ఇది ప్రయోగింపబడుతుంది. కాని ఇటువంటి గుణాలు తనలో ఉన్నాయని మానవుడల్లుకొన్న పొడుపుకథ ఇది. రాను రాను తాననేది పక్కకు జరిగింది. పొడుపును విప్పడంలోని క్లేశాన్ని దూరం చేసుకొని అర్థం కూడా మరచిపోయి ప్రజలు దానిని సాధారణీకరణం

చేశారు. ఇప్పుడు దానికి సామెతగా ప్రాచుర్యముంది గాని పొడుపుకథగా లేదు. సామెతకున్న సారళ్యాన్ని బట్టి ఈనాడు దానినెవరూ పొడుపుకథగా భావించడం లేదు. ఒకడి పాటు పదిమంది సాపాటు అనేదిట్టిది.

* ఇద్దరు పెండ్లాల మగడు
ఇరుకున పడి చచ్చెనట (పోక)

ఇద్దరు భార్యలున్న భర్త కష్టాలపాలే అని లోక వ్యవహారముంది. వ్యవహారమనే దూరపనే పుట్టదు. ఇక్కడ సమాజమే సంస్కరణాన్ని అభిలషిస్తుంది. కాని ఈ అర్థంలో ప్రయోగింపబడక పూర్వం ఇది ఒక పొడుపు కథ. భోజనానంతరం తాంబూలం వేసుకోవడం లేదా వాగాలు వేసుకోడం కొందరికల వాటు. అప్పుడు పోకల్ని అడకత్తి మధ్యన చేర్చి కత్తిరిస్తారు. పోక రూపం చెడిపోవడమే చావడం.

* చక్కనమ్మ చిక్కినా చక్కనే (సబ్బు)

సౌందర్యవతి కృశించినా చక్కగానే ఉంటుంది. జన వ్యవహారంలో ఈ పొడుపుకథ ఇలా ఉన్నా ఇది మాటి మాటికి అవృత్తమైన ద్విత్వాకకారం యొక్క శబ్దాలంకారం వల్ల కళాత్మక మూల్యాల్ని సంతరించుకొని చక్కని సామెత అయింది.

సామెతల్లో సాబాలుకు పైగా కథావిరహితాలైనా సామెతలన్నీ పొడుపు కథలే.

* చేసిన చేష్టలు ఎవరూ చూడరు కాని
కోసిన ముక్కు అందరూ చూచినారట.

భార్య పొరపాటు చేస్తుంది; భర్త తీవ్రంగా దండిస్తాడు. ఆ దండనం వల్ల ఆమె శరీరంపై కొన్ని గుర్తులేర్పడతాయి. అవి కొట్టవచ్చినట్లు పదిమందికి కనిపిస్తాయి. కొందరమ్మలక్కలు బుగ్గలు నొక్కుకొని భర్తను తిట్టిపోస్తారు. కొందరికి ఆమె చేసిన తప్పేంటో తెలుసు. వారప్పుడు పై విధంగా అంటారు. ఇక్కడ ఆ భర్త ముక్కే కోయాల్సిన అవసరం లేదు. చెంప పగలగొట్టినా, వీపు

చితుకగొట్టినా పై సామెతనే అంటారు. పై సామెత వెనుక జగమెరిగిన కథ ఉంది. శూర్పణఖ రామలక్ష్మణుల్ని కామించి వచ్చింది. వారు ఆమెను ఆటపట్టించారు. తన కోరిక తీరడానికి సీత ఆటంకమని శూర్పణఖ సీతను మింగడానికి యత్నించింది. అప్పుడు లక్ష్మణుడామె ముక్కు చెవుల్ని కోశాడు. ఆ కథ జన వ్యవహారం ద్వారా ప్రచలితమై పై పొడుపుకథగా సంకేతింపబడింది. లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు కోయడమని దీనిని సమాధానించాలి. కాని ఇది సంకేతింపబడ్డ ఒకానొక పొడుపుకథ అన్న సంగతి జనం మరిచిపోయింది. దానిని సామెతగా చెప్పుకొంటుంది. అంత పెద్ద ఆ రామ చరిత్రంలో ఇది ఒక సంఘటనయే. అందువల్ల సంఘటన పొడుపుకథ రూపు సంతరించుకొని సామెతగా పరిణామం చెందిందనడానికి ఇది ఉదాహరణ మనాలి. సంఘటనకు ఈ క్రిందిది కూడా ఒప్పుకోవచ్చు.

* అంకె లేని కోతి
  లంకంతా చెరచిందట

పిల్లవాడు చెప్పిన మాట వినక ఇంట్లోని వస్తువుల్ని నాశనం చేస్తున్నప్పుడు పొరుగింటివారో బంధువులో ఇలా అనడం సర్వసాధారణం. కాని దీని వెనుక సీతా సందర్శనానంతరం హనుమంతుడు అశోకవనాన్ని పాడుచేయడం, లంకను గాల్చడం మొదలైన సంఘటనలున్నాయి. అట్లే ప్రకృతి ధర్మాన్ని భావించిన మానవుడు పొడుపుకథగా కూర్చగా అదీ సామెత అయ్యింది.

* శివరాత్రికి చంకలెత్త నీయదు (చలి)

మాఘమాసంలో మహా శివరాత్రి వస్తుంది. అది చలికాలం చలికి "ఉహుహూ" అని లోకాలు వణకుతాయి. ప్రజలెక్కడ కూర్చొన్నా ముడుచుకొంటారు. ఆ చలి చంకలెత్త నీయదు. ప్రకృతి ధర్మాన్ని కూడా అట్లే పొడుపుకథ చొప్పించడం జరిగింది

ఒక జాతి జీవనాడులూ, నాగరికతా సంస్కృతులూ, ఆ జాతి ఏర్పరచుకొన్న సాంప్రదాయక విజ్ఞానంలో ఉంటాయి. ఆ విజ్ఞానంమీద ఆ జాతి అస్తిత్వం నిలబడి ఉంటుంది.

* ఆలి పంచాయితీ (రామాయణం)

పాలి పంచాయితీ (భారతం)

ఈ సామెత భారతీయ నాగరికతా సంస్కృతుల పరమోత్కృష్ట గ్రంథా లయిన రామాయణ భారతాల్ని సూచిస్తోంది. ఇది సామెత రూపు సంతరించుకొనక పూర్వం ఆలి పంచాయితీ అంటే రామాయణమనీ, పాలి పంచాయితీ అంటే భారత మనీ విడుపు చెప్పేవారు. కాని రాను రాను విడుపు కథలు పొడుపు కథల్లో ఐక్యమై పోయాయి

ఏ విధంగా ఈనాడు సామెతలుగా పిలువబడుతున్నవెన్నో పూర్వం పొడుపు కథలే అని నిరూపించడానికి వీలుంది. ఒకప్పుడు అవి పొడుపు కథలు; ఇప్పుడు సామెతలు. పరిశీలిస్తే అవి పొడుపు కథలనిపించాయి. పొడుపుకథల గుణాలు కొన్నిట్లో దూరమైనట్లనిపించినా ఆ వాసనల్ని ఆధారంగా చేసుకోవడం వల్ల ఛాయామాత్ర ప్రహేళికల వలె అవి భాసిస్తున్నాయి.

మొత్తంమీద ప్రహేళికా గుణ సంపూర్ణాలై-ఉన్నవాటినీ, గుణార్థాలై వెలసే వాటిని, గుణాంశాలై ఒప్పేవాటిని విషయాన్ని బట్టి స్థూలంగా విభజించే అవకాశముంది. సూక్ష్మ పరిశీలనం చేస్తే ఒక్కొక్క దానిలో ఇంకా అనేక విభా గాలు ఉద్భవిస్తాయి. కేవలం సామెతల్ని మాత్రమే గ్రహించి అటువంటి సూక్ష్మ విభజనం చేయడంలో సార్థకముంది. ఇవి పొడుపు సామెతలు. అందువల్ల స్థూల విభజనమే తగినదనిపిస్తుంది.



పొడుపు కథలు సామెతలుగా పరిణమించినందువల్ల కొన్ని సామెతలు పొడుపు కథలుగా పరిగణింపబడుతున్నందువల్ల నీటిని పొడుపు సామెతలనడం సమంజసమనిపించింది.

* అన్నేసి చూడు
నన్నేసి చూడు (ఉప్పు)

ఇది ఈనాడంతటా వాడబడుతున్న సామెత. వాడుకవల్ల రామణీయకత పెరిగింది. అర్థ గ్రహణానికి ఆలోచించాల్సిన అవసరం లేదు. ఉప్పు చప్పున రుచిస్తుంది. సరళ సౌందర్య సంస్కారాల సమ్మేళనం పొడుపు సామెత. ఇవి కథా సహితాలు, కథా రహితాలు. కథా సహితాలు పౌరాణిక చారిత్రక సాంఘిక కాల్పనికాది చతుర్విధ భేదాలతో ఒప్పుతున్నాయి.

## 4-3 : కథాసహితాలు

పొడుపు కథలు - కథాత్మకాలనే ప్రత్యేక ప్రకరణంలో పౌరాణిక-చారిత్రక-సాంఘిక-కాల్పనికాది భేదాల విరాట్స్వరూపం చూపించడం జరిగింది. అందులో పౌరాణిక చారిత్రకాల్ని వివరించేప్పుడు ఎక్కువగా సామెతలనే గ్రహించడం జరిగింది. అందుచేత ఇచ్చట వాటికి సంక్షిప్త పరిచయం మాత్రమే చేయబడుతుంది.

## 3-1 : పౌరాణికాలు

భారత భాగవత రామాయణాది గ్రంథాల్లోని కథలు-కథాంశాలు కొన్ని శైవ వైష్ణవాది మతాల సారస్వతాల్లోని కథలు-కథాంశాలు కొన్ని ఒకటి రెండు వాక్యాల్లో సంకేతింపబడ్డాయి. మొదట అవి వివరణను ఆకాంక్షించే ప్రశ్నా రూపపు పొడుపుకథలే. రానురాను పొడువు సామెతలయ్యాయి.

* రామాయణంలో పిడకల వేట

పిడకలంటే పేడతో చేసిన ఇంధన పదార్థం కాదు. బౌద్ధ ధర్మసూత్రాలుండే గ్రంథాల్ని పిటకాలంటారు. ఇవి మూడు (త్రిపిటకాలు). పిటకాలు పిడ

కలుగా రూపాంతరం చెందాయి. రామాయణంలో జాబాలి అనే ముని బౌద్ధ ధర్మ ప్రసంగాలు చేస్తాడు. రామాయణ కథా వేగానికి ఇది ఆటంకమని తలచిన వారెవ్వరో ఈ సామెతను సృష్టించారు. ఒకరు ప్రసంగిస్తున్నప్పుడు మరొకరెవరైనా అడ్డు తగిలితే సరి ఈ సామెతను ప్రయోగిస్తున్నారు.

* నవ్వు నాలుగందాల చెరుపు.

పదిమంది మాటాడుతుంటే ఎవడోఒకడు అసందర్భంగా నవ్వుతాడు. వాడెందుకు నవ్వాడో వానికే తెలుసు. అక్కడున్నవారు లోపాల్ని చూసుకొంటారు; వెదా వెతుక్కుంటారు; ఉలిక్కిపడతారు. అంతేకాక ఆ నవ్విన వానిపై కోపం తెచ్చుకొంటారు. మరి అటువంటి నవ్వు అన్ని విధాలా చెరుపును కలిగించేదే అవుతుంది. శ్రీరామ పట్టాభిషేక సందర్భంలో లక్ష్మణుడు అలా నవ్వాడు. రాముడు, సీత, హనుమంతుడు, సుగ్రీవుడు మొదలైన వాళ్లంతా ఆ నవ్వుకు నానార్థాలు గ్రహించారు. అన్ని రోజులు అన్నవదినల సేవచేసి నిద్రకు దూరమైన లక్ష్మణుడు నిండుకొలువులో శోభాయమానమైన ఉత్సవాన్ని కనులపండువుగా చూడకుండా ఆక్రమించుకొంటున్న నిద్రాదేవికి వశమవుతూ నవ్వుతున్నాడు. అందరూ సంస్కార చిత్తులయినందువల్ల ఆ నవ్వు ఒక దుమారాన్ని, ఒక అనుమానపు పెనుభూతాన్ని మాత్రమే సృష్టించగలిగింది. నాటి నుండే ఈ సామెత వ్యవహారంలో ఉంది. దాని వెనుక ఉన్న అర్థాన్ని ప్రజ నెమరువేస్తోంది.

రామాయణాంశాలు, భారతాంశాలు, భాగవతాంశాలు, శైవమత సంబంధాలు, వైష్ణవమత సంబంధాలు, ఇంకా తదితరాలైన కథల సామెతలు ఎన్నో ఉన్నాయి. ఆ దృష్టితో ఈ క్రింది పౌరాణిక సామెతలు పరిశీలనార్హాలు.

* శల్య సారథ్యం.

* కర్ణుడి మీదే కథంతా నిల్చింది.

* అందరూ ఒక ఎత్తు అగస్త్యులు ఒక ఎత్తు - [అతని కమండలువు ఒక ఎత్తు]

* పాండవుల వారి సంపాదన దుర్యోధనుల వారి పిండాకూళ్లకు సరి.
* కర్ణుని తల భారతమన్నట్లు.
* కోతలకు ఉత్తర కుమారుడు.
* కైక పుట్ట పెరపెగా రాము పట్టంబు.
* గరుడాయలెన్నా అంటే శేషాయ లెన్నా అన్నట్లు.
* గరుత్మంతుణ్ని చూచిన పాము వలె.
* యజ్ఞం చేసి రంకు దెలుపుకొన్నట్లు.
* యాదవ కులంలో ముసలం పుట్టినట్లు.
* రాముని పాదాలు తాకితే రాళ్లు రమణులౌతవి.
* రావణాసురుడి కాష్ఠం వలె.

## 3-2 : చారిత్రకాలు

పౌరాణికాలకు ఆధారాలు పురాణ గ్రంథాలు. చారిత్రకాలకు ఆధారాలు చారిత్రక గ్రంథాలు; చరిత్ర కాధారాలు శాసనాలు. ఇంకా అవీ ఇవీ. కేవలం శాసనాల ద్వారానే సంపూర్ణ చరిత్ర నిర్మాణం గాదు. నాటి కావ్యనాటకాది గ్రంథాలు, వాస్తుశిల్పాలు, ప్రజాజీవన సంస్కృతులు, జనవ్యవహారాలు మొదలైనవెన్నో చరిత్రకాధారాలవుతాయి. ఆ దృష్టితో మాత్రమే చరిత్ర సంబంధులైన పొడుపు సామెతలు పరిశీలించడం జరుగుతున్నవి.

* ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమ[1]

శ్రీకృష్ణదేవరాయలు ఆతని కూతురు మోహనాంగి చదరంగమాడుతున్నారు. రాయల రాజు మంత్రి మధ్యన మోహనాంగి భటుకు చిక్కాడు

1. ఒత్తికొని వచ్చు కటి కుచోద్వృత్తిఁ జూచి
తరుణి తను మధ్య మేడకో తలగిపోయె
ఉండె నేనియు కనబడకున్నె యహహ!
ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమ!
[కవి కర్ణరసాయనము - ఆ 3. ప-26-]

అప్పుడు మోహనాంగి బలవంతుల మధ్యన పేద ఉండలేడు కదా అనే అర్థం వచ్చే పై పద్యపాదం అనేసింది. కృష్ణరాయలు ఆ పద్యాన్ని వ్రాసిన కవిని బహుథా ప్రశంసించాడు.

"కటికుచాలు ఒత్తుకొని వచ్చాయి. వాని ఉద్వృత్తి గమనించిన తరుణి తనుమధ్యం తొలగిపోయింది. అది ఉంటే కనవడదామది! ఉద్ధతుల నడుమ పేదల కుండ తరం కాదు గదా!" అనే కావ్యార్థం లౌకికార్థ సంపన్నమై చరిత్ర పుటల కెక్కింది. ఆ సామెత వెనుక ఇంత కథ ఉంది; అందుకే చారిత్రక సంబంధులైన పొడుపు సామెతల సరసన చేరింది.

* సింగినాదం జీలకర్ర.

పూర్వకాలంలో జీలకర్ర సమ్ముతునే వర్తకులు ఊరూరా తిరిగేవారు, వారా ఊరికి వచ్చినట్లు తెలియజానికై శృంగనాదం చేసేవాడు. శృంగనాదమే సింగినాదమయింది. ఆ నాదం విని జీలకర్ర కొనదలిచేవారు వారిదరి చేరేవారు. అప్పుడు బొమ్మలాటలో బైరూపులాటలో ఆడువారు తప్పెటనో డప్పునో కొట్టి జనాన్ని ఆకర్షించే విధంగా ఆ కాలంలో శృంగనాదం చేసేవారు. ఇది సాంఘిక జీవితంలోని ఒక అంశంగా కనిపిస్తుంది. నేడిటువంటిది అంతగా కనిపించడం లేదు కాబట్టి చరిత్రగా చెప్పడం జరిగింది.

వివరణ ఎలా ఉన్నా వ్యవహారంలో ఈ విషయానికి సమన్వయం కుదరడం లేదు. అందువల్ల వివాహ సందర్భాల్లో వధూవరుల నెత్తిన ఉంచే జీలకర్ర బెల్లం రీ జీలకర్ర అనీ, మంగళవాయిద్యాలే ఈ సింగినాదమనీ, ప్రతి దానికి సింగినాదం జీలకర్ర కావాలా అని సాక్షేపంగా పలుకుట వల్ల ఈ సామెత పుట్టిందని కొందరి అభిప్రాయం.[1] ఏది ఎలా ఉన్నా "సింగినాదం జీలకర్ర" చారిత్రకమైన పొడుపు సామెత అనడంలో విప్రతిపత్తిలేదు.

చారిత్రక మహాయుగాల్లో ప్రభువులు, ప్రజలు, మేధావులు, సాధువులు, సంస్కర్తలు మొదలైనవారి జీవనాల్ని స్పృశించే కథాత్మకాలైన పొడుపు సామెతలెన్నో ఉన్నాయి. కొన్ని ఇక్కడ కేవలం సూచింపబడుతున్నాయి;

---

1. తెలుగు సామెతలు - పీఠిక. పు. 14.

* గజమూ మిథ్య పలాయనమూ మిథ్య అన్నట్లు
* మర్యాద రామన్న మాట దప్పినా నావేటు దప్పదు
* సూరకవి తిట్టు కంసాలి సుత్తె పెట్టు
  రామకవి దెబ్బ పెద్ద ఫిరంగి దెబ్బ
* అక్కన్న మాదన్న గార్లందల మెక్కితే
  సాటికి సరప్ప ఒరుపుకట్ట ఎక్కినాడట
* ఏమీ అప్పాజీ అంటే కాలంకొద్ది రాయాజీ అన్నాడట
* దాసుని తప్పు దండముతో సరి
* గోలుకొండ ఉద్యోగం గొడ్డెతోక
* తాతాచార్ల తద్దినానికి పీర్ల పండుగకు ఏమి సంబంధం.
* తాతాచార్యులవారి ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు
* నానాటికి తీసికట్టు నాగంభొట్లూ
* యాచమనాయని త్యాగము
  గోచులకే గాక కట్టుకోకలకగునా.

## 3_3 : సాంఘికాలు

జనజీవనం సంక్లిష్ట సమస్యా ప్రవాహ సంభరితం. భావ సంఘర్షణలనే ఆటుపోటులతో జీవనోపాధి ఎల్లప్పుడూ ఎగసెగసి పడుతుంది. ఎగసి కూలిన, కూలి ఎగసిన, ప్రతి తరంగం వెనుక కన్నీటి గాథ ఉంది; కమ్మని కథ ఉంది. ఆగాథలూ ఆ కథలూ సామాజిక జీవనానికి ఉజ్జ్వల దీప్తిని ఆదర్శవంతమైన స్ఫూర్తినీ ఇస్తున్నాయి. ఆ భావ వాహిని సాంద్రమై సాకారమయ్యింది. ఆ సాకారం స్వల్పమే అయినా సాంఘిక జీవన పరిమళాల్ని వెదజల్లే పొడుపు సామెతగానూ మారింది' సాంఘిక సంబంధి అయిన పొడుపు సామెతకాధారం సంఘం. అందువల్ల ఇది ఆధార రహితమయింది గాదు. వర్తమాన జీవన ప్రతిబింబమీ పొడుపు కథ లేదా పొడుపు సామెత.

* రెడ్డి వచ్చాడు మొదలెత్తుకో

"రెడ్డొచ్చె మొదలాడు" అనే పదబంధమే పై సామెత. కొద్దికాలం క్రితం, (నిన్న మొన్నటి వరకు) కొన్ని ప్రాంతాల్లో ఇప్పటికీ ఈ కథ జరుగుతోంది. యక్షగానాలాడేవారు, బహురూపుల వేషాలు వేసేవారు పండగ దినాల్లోనూ పర్వ దినాల్లోనూ-ఆటలాడుతారు. రాత్రి కొంత పొద్దు పోయింతర్వాత ఆట ప్రారంభి స్తారు. వారి ఆటలో కళా ప్రావీణ్యతా ప్రదర్శన సంగతి ఎట్లున్నా వారి దృష్టి అంతా మరుసటిరోజు ఆ గ్రామం రెడ్లిచ్చే దనధాన్యాలపై కట్న కానుకలపై కొంతయినా ఉండక తప్పదు. అందువల్ల ఆట ప్రారంభంలో వచ్చిన ప్రతి రెడ్డిని పొగడతారు. ఆట మొదలవుతుంది; అప్పుడే మరో రెడ్డి వచ్చినట్లు వర్తమానం వస్తుంది; అతణ్ని పొగడ్డం మొదలెత్తుకోవడం జరుగుతుంది. ఈ విధంగా తెల్లవారే వరకు జరుగుతూనే ఉంటుంది కథకు కాళ్లున్నా కదలదు; కదలినా నత్తనడకలాగే ఉంటుంది. ఇప్పుడీ కట్టడి ఇంచుమించుగా సాగడంలేదు. అయినా గ్రామాధికారులై రెడ్ల దర్పానికి సాక్షీభూతంగా ఈ పొడుపు సామెత నిలిచిపోయింది,

* "పులిచారలు వేసినవి అత్తయ్య" అంటే
"పురిసెడు వెనక్కి తియ్యవే కోడలా" అన్నదట అత్తగారు.

పడమటి దిక్కు ఆకాశంలో మబ్బులు కమ్మాయి. ఆ మబ్బులు పులి చారలవలె ఉన్నాయి. మబ్బులు అలా ఉంటే వర్షాలు సరిగా కురవవనీ, పంటలు పండవనీ, కరువు కాటకాలు వస్తాయనీ ప్రజల విశ్వాసం. ఈ లౌకిక విశ్వాసాలతో బ్రతికే వ్యవసాయదారుని కోడలు పరిస్థితిని గమనించింది. అత్తగారితో సంగతి చెప్పింది. రాబోయే కాలంలో కటకటలు పడగూడదనీ, ఉన్ననాడు ఉగాదిగానూ లేనినాడు కాముని పండుగగాను జరుగకూడదనే కోడలి భావాన్ని అత్త సర్తిందింది. పొదుపు చేసుకొని తినాలని కోడలిని ఆజ్ఞాపించింది. కడుపు గట్టుకొని కాలం వెళ్ళ బుచ్చాల్సి వచ్చినప్పుడు పౌరాణిక యుగంలో నలదమయంతులకు, చారిత్రక యుగంలో మహారాణా ప్రతాప్ కుటుంబానికి, ఆధునిక యుగంలో ఆ రైతు కుటుం బానికి కలిగిన అనుభవాలు పొదుపు కథలుగా పొదుపు సామెతలుగా రూపు దిద్దు కోడం అంటే శిలాక్షరమవడం, సత్య శివ సుందరమై సాక్షాత్కరించడం.

సాంఘిక సంబంధులైన కథాత్మక ప్రహేళికల ఛాయలు గల సామెతలు ఆంధ్ర భాషలో అనేకాలున్నాయి. కొత్తవి పుడుతున్నాయి; పుడతాయి. సజీవమైన సమాజం నిత్యనూతనతకు ఆలవాలం. చేదుకొన్న వారికి చేదుకొన్నన్ని భావాలు ఆ సమాజంలోని సామెతలందిస్తాయి.

* అరుంధతీ గిరుంధతి కనపడుటలేదు గాని
  ఆరువందలు అప్పుమాత్రం కనపడుతున్నది.

* రెంటికీ చెడ్డ రేవడు

* కాసుకు గతిలేదు కోటికి కోడి వేశాడు

* కోడీ కుంపటి లేనిది తెల్లవారదా !

* చెడిందిరా పిల్ల అంటే
  చేరిందిరా తెనాలి

* కొండ మంగలి కొరిగినట్లు

* గాలివానా వస్తే కథే ఆగిపోతుంది

* కంసాలిని జూచి కథ జెప్పు

* అగ్రహారం పోతే పోయిందిగాని
  ఆక్టు అంతా బాగా తెలిసింది

* అడ్డబొట్టువాడు నిలువు బొట్టువాడు తగవులాడి
  సత్రం తగలబెట్టినట్లు

* అంగట్ల బెల్లానికి గుడిల లింగానికి సమర్పయామి

## 3-4 : కాల్పనికాలు

ఆధార రహితాలైన విషయాలు కాల్పనికాలు. ఇది మానవుని సృజన శక్తే అయినా ఊహకూ ఆదర్శానికున్న పాలు ఇతరాలకుండదు. ఎక్కడో ఒక కథ పుట్టింది. పుట్టిన ఆ కథ వ్యాపించింది. చూసినవారెవరో తెలియదు. మొదట చెప్పిన వారెవ్వరో తెలియదు. కాని ఆ కథ ప్రజ చెప్పుకొంటున్నది. కొన్ని

పలుకులలోనే కథార్థం భాసింప చేసుకొంటున్నది. కాల్పనికాలైన పొడుపు సామెతలు సరిగా ఇలా ఉంటాయి.

* అందని ద్రాక్షపళ్లు పుల్లన

లోకంలో ఒకతొకటి ఆశిస్తాడు. తాను ఆశించింది ఉత్తమమయింది. శ్రేష్ఠమయింది అని భావిస్తాడు. దాన్ని పొందడానికి యత్నిస్తాడు. ప్రయత్నం ఫలించనప్పుడు చింతిస్తాడు విసిగి వేసారి తాను ఆశించినదాన్నే దూషిస్తాడు. ఇది మానవ స్వభావం-అంటే లోక స్వభావం. దీనికో నీతికథ ఉంది.

"ఒక నక్క ద్రాక్ష పండ్ల నాశించింది. ద్రాక్ష పందిరి కిందికి చేరింది. వాటి తీపిని గూర్చి, రస శ్రేష్ఠత్వాన్ని గూర్చి, రంగు రుచిని గూర్చి ప్రశంసించింది. ఒక్కసారి కాదు వంద పర్యాయాలు కీర్తించింది. కీర్తనతో కడుపు నిండదు కదా! అందుకే పందిరి కింద వేలాడబడి ఉన్న పండ్లను అందుకోవాలని ఎగిరింది. అవి అందలేదు. "అందని ద్రాక్షపళ్లు పుల్లన" అనిపించింది. అవి పనికిమాలినవని దూషించింది." ఈ కథ ఏనాడు జరిగిందో కాని ఆ భావాలు గల మనుజులీనాడూ ఉన్నారు, ఏనాడైనా ఉంటారు. ఈ కథ కాధారముంటే ఏంటి! లేకుంటే ఏంటి! మనుషులున్నంత కాలమీకథ ఉంటుంది. కథ కాలంబన సూత్రమైన పొడుపు సామెతా ఉంటుంది. చిరంతన కాల్పనికత, అనుక్షణ వాస్తవికత ఈ కథలో ఉంది.

* మంచి చేసిన ముంగికి మరణం వచ్చినిట్లు.

ఒకరొకరికి సహాయం చేస్తారు. అలా ఉపకారం చేయడం వారు తమ ధర్మంగా భావిస్తారు. కాని ఆ ఉపకారంవల్ల లాభం పొందినవాళ్లు దానిని గుర్తించరు; పైగా ఆ చేసింది అపకారమని భావిస్తారు. ఆ భావన వల్ల పెరిగిన ఆగ్రహంతో ఆ ధర్మానికి కీడు చేస్తారు. కాని ఆ ధార్మికుడు ఉపకారం ఆశించి చేయలేదు. తనకు అపకారం కలుగుతుందని కూడా తలచలేదు. కాని జరిగిందది. ఆ సమయంలో లోకంపై పొడుపు సామెతను ఉపయోగిస్తుంది, ఆ సామెత వెనుక ఉన్న నీతికథలో విచారం-ఆవేదన నిండి ఉన్నాయి.

"ఒక ఇల్లాలు ప్రేమతో ముంగీసను పెంచుకొంది. ఆ ముంగి ఆ ఇల్లాలు కనుసన్నల్లో మెలగుతూ బహుకాలంగా ఆ ఇంట్లోనే ఉంది. ఒకనాడామె ఊయల్లో తన పసిబిడ్డను పడుండబెట్టి బిందె తీసుకొని మంచినీళ్లకు వెళ్లింది. సరిగ్గా అదే సమయంలో ఒక త్రాచుపాము తొట్టెలను సమీపించింది. ముంగిస ఇది చూచింది; పాము మీదికురికింది; దానితో పోరాడింది; ముక్కలు ముక్కలుచేసి చంపింది; ఇంకేం ఆ ముంగిసకు ఆనందం మిన్నుముట్టింది. అది తన యజమానురాలికి ఎదురుగా వెళ్లింది. ద్వారంలోనే ఆ ఇల్లాలు ముంగిసను చూచింది. దాని మూతికి రక్తముంది. తన పసిబిడ్డను ఆ ముంగి చంపిందని ఆ తల్లి భావించింది. వెంటనే నిండు నీటి బిందెను ఆ ముంగీస నెత్తిపైన ఎత్తివేసింది, ముంగీస గిలగిల గొట్టుకుంటూ ప్రాణం విడిచింది. ఇల్లాలు ఊయల్లో కేరింతలు కొడుతున్న బిడ్డను, ఊయల ప్రక్కన్నే ముక్కలై పడిఉన్న త్రాచుపామును చూచ్చింది. తన అనాలోచిత కార్యానికి చింతించింది."

ఈ కథ ఎప్పుడు జరిగిందో చెప్పే దెవ్వరు! ఆధారమేంటి! కాని ఇలా అనాలోచిత కార్యాలు చేయరాదనే సందేశం అనాదిగా ఇస్తూనే ఉంది. కథంతా చెప్పాల్సిన అవసరం లేదు. సంకేతిస్తే చాలు ఆ సంకేతమే కాల్పనిక సంబంధి అయిన ఈ పొడుపు సామెత.

సర్వ ప్రపంచ కథా వాఙ్మయ మందంతటా కాల్పనికాలైన ఈ కథలున్నాయి. అవి పొడుపు కథలుగా సామెతలుగా ప్రచలితాలయ్యాయి. ఆంధ్ర సాహిత్యంలోనూ, ఆంధ్ర జనవ్యవహారంలోనూ ఇలాంటివి కోకొల్లలుగా ఉన్నాయి. అలాంటివే మరికొన్ని గమనార్హాలు.

* కొంగ జపం చేసినట్లు.

* పిల్లి మెడలో గంటకట్టేదెవరు.

* ఒకరి కలిమికి ఏడిస్తే ఒక కన్ను పోయింది.
  తనలేమికికేడుస్తే రెండు కళ్లూ పోయినాయి.

* నక్కచిక్కాన్ని నా వద్ద ఉండగ తప్పించుకపోయెనే తాబేలు బుజ్జి.

* పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినది.

* తోటకూర నాడైనా చెప్పవైతివి.

* అకటావికటపు రాజుకు అవివేకి ప్రధాని చాదస్తపు పరివారము.

* తనకుమాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం.

* ఉభయ భ్రష్టత్వం ఉప్పర సన్యాసం.

* ఒక్క దెబ్బకు రెండు పిట్టలు.

కథాత్మకాలైన పొడుపు కథలవలెనే పొడుపు సామెతలు కూడా పరమ రమణీయాలు. పొడుపు కథ ఒక ముడి సరుకు; పొడుపు సామెత ఆ ముడిపదార్థం తీర్చిదిద్దగా ఏర్పడ్డ పరమోత్కృష్ట శిల్పం. ఆ శిల్పంలోని పౌరాణికాది భేదాలు పరిశోధకుని దృష్టిగోచరాలు మాత్రమే. ప్రజలీభేదాన్ని పాటించరు. వారా సామెతను దర్శిస్తారు; స్పృశిస్తారు; అనుభవిస్తారు; తమ దర్శన స్పర్శనామ భవాల వల్ల కొత్తవాటిని సృష్టిస్తారు. ఈ సృష్టి ఉన్నంత కాలం ఆ సృష్టి జరుగుతూనే ఉంటుంది. అందుకే కథాత్మకాలైన పొడుపు సామెతలు చిరంతన కాల్పనికాలనీ అనుక్షణ యథార్థాలని చెప్పడం.

## 4-4 : కథారహితాలు

కథాసహితాలైన పొడుపు సామెతలకు, కథారహితాలైన పొడుపు సామెతలకు జానపదుల దృష్టిలోగాని నాగరుల దృష్టిలోగాని అంతరమేమిలేదు. సువిశాల కథా కాంతి పుంజానికి కేంద్ర బిందువు కథాత్మకమైన పొడుపు సామెత. వ్యాకోచమై ఉన్న కథాశరీరం సంకోచమై ముద్దగట్టుకొన్న స్వరూపమే పొడుపు సామెత. కేంద్రబిందువై ఉన్న కథారహితమైన పొడుపు సామెతలోని సూక్ష్మాణువు విడుపు సామెత. సంకోచపు ముద్దలో పొదగబడి ఉన్న మణి కథారహితమైన పొడుపు సామెత విడుపు.

జానపద సాహిత్యంలో పొడుపు కథ ఎన్ని సొగసులు పోయిందో పొడుపు సామెత కూడా ఇంచుమించుగా అన్ని వన్నెచిన్నెలు పోయింది. కాని స్థూలంగా ఇది అయిదారు విభాగాలలో ఇమిడి పోతోంది.

కథారహితాలైన పొడుపు సామెతల యొక్క స్వభావాన్ని బట్టి

వ్యావసాయాత్మకాలు, వస్తుగుణాత్మకాలు, పశు పక్ష్యాదులు, ప్రాకృతికాలు, గృహసంబంధులు, అన్యాలు తదితర విభాగాలు చేయడానికి వీలుంది. ఈ విభాగాల్లో ఉదాహరించే వాటిని పొడుపు కథలుగా సాహిత్యకారులుగాని ప్రజలు గాని వ్యవహరించడం లేదు. వాటిని సామెతలనే అంటున్నారు. కాని ఆ సామెత కున్న పూర్వవాసనలు పోలేదు. అలాంటివి మాత్రమే ఇక్కడ ఉదాహరింపబడు తున్నాయి. కనుకనే వాటిని కథా రహితాలైన పొడుపు సామెతలని పిలవడం జరుగుతోంది.

## 4-1: వ్యవసాయాత్మకాలు

మనది వ్యావసాయక దేశం. ఈ దేశంలో పుట్టిన ఏ సాహిత్య ప్రక్రియ అయినా, ఏ సామాజిక సమస్య లయినా కొద్దిగనో-గొప్పగనో, ప్రత్యక్షంగానో-పరోక్షంగానో వ్యవసాయ సంబంధి అయి ఉంటుంది. వ్యవసాయ దారుల్లో నూటికి తొంబది మంది జానపదులు. పొడుపు కథల్లో నూటికి తొంబది జానపదుల ముఖ నిర్గతాలు. పొడుపు సామెతలు కూడా అదే విధంగా జానపదుల సొత్తనే చెప్పాలి. అందువల్ల పొడుపు కథలూ — పొడుపు సామెతలు అధికంగా వ్యావసాయక జీవన ప్రతిబింబాలై ఉన్నాయి.

* ముక్కు మూరెడు సిగబారెడు [తోక వరిగింజ]

కోపం వస్తే పరస్పరం నిందించుకోవడం, మరొక అమ్మతో చెప్పు కోడం, ఆ చెప్పుకొన్నప్పుడు "దాని సొమ్మేమో పోయిందని ముక్కు మూరెడు సిగ బారెడు చేసింది" అనే వాక్యం ప్రయోగించడం సాధారణ లోక వ్యవహారం. కాని ముక్కు మూరెడు కాదు సిగబారెడు కాదు. కోపం వల్ల ముక్కు ఎరుపెక్కు తుంది. తలను అటూ ఇటూ కదిలించడం వల్ల సిగ ఊడి బారెడవుతుంది. సామెతనిలాంటి సందర్భాల్లో ప్రయోగిస్తున్నా దీని విడుపు మాత్రం తోక వరి గింజ. వరి ధాన్యాల్లో తోక బుడమలనేవి ఒక రకం. ఈ వడ్లకు పొడుగు తోక లుంటాయి, పొట్టి ముక్కులుంటాయి. కూలి వేసేప్పుడు పాత్రతో కొలిచి వేయక ఒకప్పుడు జొన్నకంకుల్లాగా చేతబట్టి వేసేవారు. ఇప్పుడీ ధాన్యమొక్కటో చవిటి నేలల్లో పండుతుంది కాబట్టి తోకబుడమలు కనిపించడం లేదు, వీటిని తోక

వడ్లని కూడా అంటారు. ఈ ధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని పొడుపుకథ సృష్టించ బడింది.

* శివరాత్రికి జీడికాయ
ఉగాదికి ఊరుగాయ [మామిడి పిందె]

ఒక వ్యక్తి తమ బంధువుల బాలికను కొంత కాలమైన పిదప చూస్తాడు. అప్పటికీ ఇప్పటికి ఆ అమ్మాయి కంపచాటు మొక్కలాగా ఎదిగిపోయింది. అప్పుడతడు పై సామెతతో పరిహసించాడు. శివరాత్రికి ఉగాదికి మధ్యకాలం ఒక మాసం మాత్రమే ఒక్కనెలలోనే అది పచ్చడికి (ఊరగాయగా) సిద్ధమవుతుంది. జీడికాయ చిన్నగా ఉంటుంది. ఊరగాయ టెంకపట్టి పెద్దదిగా ఉంటుంది. మామిడి పిందె లేదా కాయ అర్థాన్ని రాబట్టడానికై ప్రయోగింపబడ్డ ప్రహేళికా లోకోక్తి ఇది. మామిడి పిందెల విడుపులే ఉన్న ఈ క్రింది పొడుపు సామెతల వల్ల ఆయా తీర్థ ప్రదేశాల పేర్లు తెలుస్తున్నాయి.

* చొల్లంగి తీర్థానికి చోడి గింజలంతేసి
* పట్టిసం తీర్థానికి ప్రత్తిగింజలంత.
* వాడపల్లి తీర్థానికి వడగళ్లంత.
* కోరుకొండ తీర్థానికి కోడి గుడ్డంత.

ఈ పై పొడుపు సామెతలన్నీ మామిడి పిందెల క్రమ పరిణామోన్నతిని తెలియజేస్తున్నాయి. ఈ క్రింది వ్యవసాయాత్మక ప్రహేళికలు కూడా పరిశీలనార్హాలు.

* వస్తూ ఇల్లు నింపుతుంది
పోతూ ఇల్లు నింపుతుంది [ఆరికె]

* కార్తీకమాసంలో కదురంత ఉంటినా
మాఘమాసంలో నా మహిమ చూపుతా (చిక్కుడు తీగ)

* కార్తీకమాసమున కాకులు తొక్కుతాయి (జొన్నకంకులు)

* గొడ్డే తొక్కినా చాలును (మడి-పొలము)

* 'చిత్త చిత్తగించి, స్వాతి చల్లజేసి, విశాఖ విసరకుంటే
అనూరాధలో అడిగినంత పండుతాను' అన్నదట (జొన్న చేను)

* మఖకు మానికంత మొక్కయితే
కార్తీకానికి కడవంత కాయ (గుమ్మడి)

* భరణికార్తెలో చల్లిన
కాయకు చిప్పెడు పంట (నూవు)

* స్వాతి కురిస్తే చల్ల పిడతలోకి రావు (జొన్నలు)

## 4-2 : వస్తుగుణాత్మకాలు

సాధారణంగా జీవరహితాలై, ఒక స్పష్టమైన నిర్దిష్టమైన స్వరూపమున్న వాటిని వస్తువులనడం సహజం. స్వరూపమున్న దానికి స్వభావముంటుంది. స్వభావమనేది రంగుకూ రుచికీ వాసనకూ రూపానికీ సంబంధించిందై ఉంటుంది. ఈ స్వభావమనేది సహజసిద్ధమైంది గావచ్చు, లేదా నడమంత్రపు మార్పుగావచ్చు. కాకపోతే పరిస్థితుల ప్రభావంవల్ల, పరిసరాల సాహచర్యంవల్ల ఇటువంటి గుణాత్మక పరిణామాలు కలుగవచ్చు.

* గడ్డతిన్నా కంపే పాయ తిన్నా కంపే (ఉల్లి)

ఉల్లిగడ్డది అదొక రకమైన వాసన. అటువంటి వాసన మరోదానికి ఉండదు. ఇది సామెతగా ఈనాడు వ్యవహరింపబడుతుంది. కాని ఇది పొడుపు సామెత. సామెతగా ఇది పిసినారి గుణం ఉన్నవారి విషయంలో ప్రయోగించడం జరుగుతోంది.

* మూరెడు పుల్ల ముక్కోడు (వేపపుల్ల)
(పలుదోము పుల్ల)

గ్రామీణులు పళ్ల తోమడానికి ఎక్కువగా వేపపుల్లనే ఉపయోగిస్తారు అదికూడా చిన్నపుల్ల కాదు; మూరెడు పుల్ల. మూరెడు పుల్ల ముక్కంత అయ్యేంత

వరకు తోముతారు. అలా తోమాలట. ఇది పదబంధ లక్షణాలున్న సామెత. అర్థ వివరణాన్ని ఆశించేదైనా విడుపు చెప్పినప్పుడవగతమవుతుంది. వస్తుగుణ సంబంధులైన కథారహిత ప్రహేళికా లోకోక్తులు కొన్ని పరిశీలనార్హాలు.

* మూడు పావలాల గుడ్డ
  ముప్పాయి రూపాయల కుట్టు (విస్తరి)

* చెట్టుమీది వాడు
  జుట్టుమీది కెక్కె (కల్లు)

* తొక్కినా కరవకపోతే
  బురద తొస్సురా అన్నట్లు (పాము)

* పున్నమికి పూత
  అమావాస్యకు ఆరగింపు (తేనెపట్టు)

* పొట్టివానికి పుట్టెడు బుద్ధులు (ఉల్లి)

* ఏమీలేనివారికి ఏతులు లావు
  స్వాములవారికి జడలు లావు (విస్తరి-మట్టి)

## 4-3 : పశుపక్ష్యాదులు

ప్రపంచంలో ఏ ప్రాణి ఎందుకు పుట్టినా, వాటివల్ల సృష్టికర్త ఏయే ప్రయోజనాల్ని ఆశించినా అవి పరస్పరం సంఘర్షిస్తున్నాయి; సాన్నిహిత్యంతోనూ మెలగుతున్నాయి. అలా సంఘర్షణా సాన్నిహిత్యాలతో పశుపక్ష్యాదులు సహజీవనం గడుపుతున్నాయి.

తిర్యక్ సంబంధి పొడుపుకథలెన్నో ఉన్నాయి. పొడుపుకథల ఛాయ లున్న పొడుపు సామెతలు కొన్నే దొరుకుతున్నాయి. మానవుడుకూడా ద్విపాద పశువే. అందువల్ల మానవ సంబంధి పొడుపు సామెతలు కూడా ఈ శీర్షిక క్రింద పరిశీలించడం జరుగుతుంది.

* చూపుల పసేగాని చేపుల పసే లేదు (పాడిగొడ్డు)

ఎక్కడ రూపం సౌందర్యవంతమై ఉంటుందో, అక్కడ భావంకూడా సౌశీల్యవంతమై సద్గుణాల కాలవాలమై ఉంటుందనేమాట సర్వజన సమ్మతమూ కాదు; సార్వకాలీన సత్యమూ కాదు. ఈ సమాజంలో పయోముఖ విషకుంభాలు, తేనె పూసిన కత్తులు, గోముఖ వ్యాఘ్రాలు ఉన్నాయి. అందుకే మానవుడు భ్రమా పతితుడవుతున్నాడు. ఒక రైతు పాడిగొడ్డు తెచ్చాడు. అది చూడ్డానికి అందంగా ఉంది. కాని చేపదు, పాలివ్వదు. పాలివ్వనిది పాడిగొడ్డు ఎలా అవుతుంది అందే అనుమానం కలుగక తప్పదు. అది పాడిగొడ్డని అమ్మబడింది; ఇతడు కొన్నాడు. అది నిజానికి పాడి ఉన్న గొడ్డే కాని దానికి పాలిచ్చే ఇష్టంలేదు. ఆ ఇష్టం దానికి కలిగేట్టు సంస్కారమివ్వాలి. ఈ సామెత సమాజంలో అనేక సందర్భాల్లో ప్రయోగింపబడుతుంది.

* వెంట రావద్దంటే
ఎత్తుకొమ్మని ఏడ్చాడట (బిడ్డ)

ఒకడొక పనిమీద వెడుతున్నాడు. మరొకడేదో పని చెప్పాడు. మొదటివాడు తాను చేయనన్నాడు. రెండవ వాడు వెంట తీసుకొని పొమ్మన్నాడు. అప్పుడు మొదటివాడు పై సామెతను ప్రయోగించాడు. నిజానికిది పసిబిడ్డ విషయంలో మొదట మొదట ప్రయుక్తమై, పొడుపుకథయై సామెత రూపు ధరించింది. ఈ క్రింది పొడుపు సామెతలు ఈ శీర్షిక క్రింద చెప్పకోదగ్గవే.

* ఎలుకకు ఏడుగురు భార్యలు (కోతల రోజుల్లో)

మనిషికి సంపదలు కలిగినప్పుడు సుప్తమైఉన్న కోరికలు కొన్ని విజృంభిస్తాయి ఆ కోరికలు సుఖభోగాల అనుభవాలకై అఱ్ఱులు చాస్తాయి. అలాంటి సందర్భాల్లోనే ఎలుకకు ఏడుగురు భార్యలని ప్రజలనుకొంటారు. కోతల కాలంలో ఎలుక ధాన్యంలో పొరలాడినట్లే గడుపుతుంది. అది కావలసినంత ధాన్యం సమకూర్చుకొని నిగనిగలాడుతూ మహానందంతో తిరుగుతుంటుంది. అప్పుడు దానికిక సమకూరనిదేమి ? ప్రహేళిక ఛాయమాత్రమే. ఈ మెతపై పడింది

* వాడు ఒట్టి ఇరవై ఐదు ఇరవై ఆరు (ఖర-నందన)

ఒకడు ఒకణ్ని తిడతాడు. తాను తిట్టినట్లతనికి తెలియగూడదు. మడతన పెట్టి మాట అంటాడు. అనకుండా ఊరుకోడానికి మనస్సొప్పుకోదు. అంటేగాని తృప్తి ఉండదు. తెలుగు సంవత్సరాల్లో ఇరవై అయిదవ సంవత్సరం ఖర, ఇరవై ఆరవ సంవత్సరం నందన. ఇంతకతడు ఖరనందనుడు (గాడిద కొడుకు). పశుపక్ష్యాదుల పొడుపు సామెతల్ని ఇంకా తెలుగు సామెతల గని నుండి ఏరవలసి ఉంది.

## 4-4 : ప్రాకృతికాలు

మనిషికే ఏంటి, సర్వజీవులకూ మొదటి గురువు ప్రకృతి. భూమి, ఆకాశం, మబ్బులు, వర్షం వెన్నెల, చలి మొదలైనవెన్నో ప్రకృతిలో అంతర్భాగాలుగా ఉన్నాయి. ప్రకృతికి సంబంధించినవి కాబట్టి ఈ పొడుపు సామెతలు ప్రాకృతికాలని పిలువబడుతున్నాయి.

* చుట్టమై చూడవస్తే
దయ్యమై పట్టుకున్నాడు (రేగుచెట్టు)

ఒకరి ఇంటికొకడు చుట్టమై చూడవస్తాడు. ఆతనికా గృహస్థు అతిథిమర్యాదలు చేస్తాడు. ఆ మర్యాదలతోబాటు అతణ్ని చిక్కుల్లో ముంచేస్తాడు. వచ్చిన అతిథి ఆ చిక్కుల్లో నుండి బయటపడడానికి బహువిధాల ప్రయత్నిస్తాడు. ఒకవైపు ప్రయత్నాలు సాగుతూనే ఉంటాయి. ఆ సమయంలో అతని మిత్రులు కలుస్తారు. అప్పుడతడు పై సామెతనుపయోగిస్తాడు. ఇది మన అనుభవం. కాని ప్రకృతికి మానవునికీ విడదీయరాని బంధముంది. ఆ బంధమే దయ్యం (దైవం). రేగుచెట్టు పండ్లు తెంపుకోడానికి ఒకడు వెడతాడు. పండుచేత చిక్కింది కాని కట్టు బట్టలకు ముళ్లు పట్టుకున్నాయి. పండ్లకై వెళ్ళిన అతడు చుట్టం. రేగుచెట్టు ఆతిథ్యమిచ్చిందిగాని దయ్యమై పట్టుకుంది. ఈసామెతలో జీవదేవ సంబంధం, కష్టసుఖాల సమ్మిశ్రమమైన జీవన సత్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. నేడిది సామెతగా ప్రయుక్తమవుతున్న ఒకనాటి పొడుపుకథ.

* ఏటి ఒడ్డున చేను
చీటికి మాటికి భయం [ప్రవాహం]

ఆనాడు శ్రీనాథ మహాకవి ఏటి ఒడ్డున సేద్యం చేసి చేను పెట్టాడు. కృష్ణవేణమ్మ ఫలమంతా కొంపోయింది. ఏటి ఒడ్డున చేను పెట్టినప్పుడు ప్రవాహ భయం తప్పదు. ఇదీ సామెత రూపు సంతరించుకొన్న పొడుపుకథ. ప్రకృతి సంబంధులైన కొన్ని పొడుపు కథల్ని గమనించండి.

* ఆకార పుష్టి నై వేద్య నష్టి [పుచ్చకాయ]

* ఉడిగి ఉత్తరం చేరుతుంది [మబ్బు]

* శివరాత్రికి శివ శివ అని పోతుంది [చలి]

* హస్త ఆరుపాళ్లు - చిత్త మూడుపాళ్లు [వర్షం]

* దూరం గుడి కడితే దగ్గరలో వాన
దగ్గర గుడి కడితే దూరాన వాన [చంద్రపరి వేషం]

## 4_5 : గృహ సంబంధులు

ఆటవిక మానవుడు నాగరిక మానవుడుగా మారడానికి గృహమెంతో తోడ్పడింది. పశుప్రాయమైన జీవనాన్ని దివ్యంగా తీర్చిదిద్దింది గృహమే. ఆ కారణాన్నే గృహసంబంధమైన సాహిత్యమెంతో ఆవిర్భవించింది. పొడుపు కథలు ఆ సాహిత్యాంతర్భాగాలు. పొడుపు సామెత అందులోని అంతరికాంశాలు. గృహ సంబంధులైన పొడుపు సామెతలనేకాలున్నాయి. మచ్చుకొకటి రెండు పరిశీలిద్దాం.

* అత్త కాలం కొన్నాళ్లు
కోడలి కాలం కొన్నాళ్లు [గొంగడి, రుమాలు]

పాలనా యంత్రాంగంలో అధికారులు మారినప్పుడు, సామాజిక రంగంలో పూర్వపూర్వీకుల కన్నా ఉత్తరోత్తరులు ముందడుగు వేసినప్పుడు, రాజకీయ రంగంలో వృద్ధుల తరం తెరవెనక్కుపోయి, యువతరం తెరపైకి వచ్చినప్పుడు గృహజీవన రంగంలో అత్తగారు మూలనపడి కోడలు తాళాల గుత్తి చేత పట్టినప్పుడు ఈ పొడుపు సామెత ప్రయుక్తమవుతోంది. కాని వ్యవసాయదారుడు చలి కాలంలో గొంగడి కప్పుకోడాన్ని, వెంటనే వచ్చే వేసవి కాలంలో రుమాలనే

ఎక్కువగా చుట్టుకోవడాన్ని ఈ పొడుపు సామెత సూచిస్తుంది. పొడుపుకథార్థం సంపూర్ణంగా గోప్యం కాగా ఇది సామెత అవతారాన్నెత్తింది.

* జేనెడు పిట్టకు మూరెడు తోక [తెడ్డు]

అంగాలు వారి వారి ఒడ్డు పొడుగుల్ని బట్టి సమవిభక్తాలుగా ఉన్నప్పుడు దేహం సౌందర్యవంతమై శోభిస్తుంది. ఏ ఒక్కటి ఎక్కువ తక్కువగా ఉన్నా వికారంగా ఉంటుంది. ఆ దేహం అల్పబుద్ధుల పరిహాసాలకు గురిఅవుతుంది. పిట్ట చిన్నదిగాను తోక పొడుగ్గాను ఉన్నప్పుడు పై సామెత పుట్టవచ్చు. పొడుపు కథ ఎక్కువగా సంకేతాత్మకమై ఉంటుంది కాబట్టి అట్లే అది పుట్టకపోవచ్చు కూడా. విడుపేమో "తెడ్డు". "పిట్ట కొంచెం కూత ఘనం" దాదాపుగా ఇటువంటి సామెతే. గృహసంబంధి పొడుపు సామెతలు జాతి జీవన సంస్కృతులకు నిదర్శనాలు. కొన్ని కేవలం ఉదాహరిస్తాను.

* చూస్తే చుక్క - లేస్తే కుక్క [గయ్యాళి]

* మసిపాతలో మాణిక్యం మట్లు [అన్నం]

* అరటాకు మీద ముల్లు పడ్డా
ముల్లు మీద అరటాకు పడ్డా
అరటాకుకే ప్రమాదం. [కన్య - పురుషుడు]

* అత్త ఆరో నెలలో పట్టిన దయ్యం [బిడ్డకు వచ్చే మొదటి మాట]

## 4-6: అన్యాలు

ఇంతవరకు వ్యవసాయాత్మకాది భేదాలు వింగడించి చూపబడ్డాయి. కాని ఇంకా అనేక భేదాలు పొడగట్టుతున్నాయి. అట్టి వాటిని ప్రత్యేకంగా విశ్లేషించి చూపించడం వల్ల గ్రంథం పెరిగిపోతుంది. రూపమొక్కటే అయినా స్వభావాలనేకాలున్నాయి. కొన్ని విశ్లేషించి చూపించడం వల్ల మరికొన్ని విజ్ఞులూహించగలరని ఆశించి ఈ విభజనంలో చివర ఇతరాలనే శీర్షిక క్రింద ఒకటి రెండు వివరించడం జరుగుతుంది.

* అప్పుచేసి కొప్పు తీర్చిందట [వ్యభిచారం]

ఈ పొడుపు సామెత 'అప్పుచేసి కుప్ప తీర్చింది' అనే విధంగా అంటే "కుమ్మరి వామం" విడుపనే వారం. కాని కొద్ది భేదంతో మరొక అర్థం సంపన్న మయింది; 'అప్పు కొప్పు తీర్చింది" అంటే ఆమె వ్యభిచరించింది అని లోక వ్యవహారం. తీర్చడానికి అలంకరించడం అనే మరొక అర్థముంది. ఆ అర్థం కూడా ఇక్కడ రావచ్చు. అలంకరించడం అనే అర్థం మాత్రమే తీసుకొన్నప్పుడు ఇది కేవలం సామెత అవుతుంది. వ్యభిచారాన్ని విడుపుగా స్వీకరిస్తే అది పొడుపు సామెత అవుతుంది.

* దండులోనికి పోతే రెంటిలో ఒకటి
[విజయమో - వీరస్వర్గమో]
[చావో - బ్రతుకో]

దండులోనికి పోవడం అంటే దండయాత్రకు వెళ్లడం. అక్కడ ఈ రెండింట్లో ఏదో ఒకటి అవుతుంది. కేవలం ఆ సందర్భాన్నే ఇది ఇప్పుడు ప్రయోగింపబడకపోవచ్చు. ఒక కార్యానికి పూనుకొన్న పిదప 'మంచో లేదా చెడో' జరుగుతుందనే అర్థంలో వ్యవహృతమవుతుంది. ఈ క్రింది పొడుపు సామెతలు సులభ గ్రాహ్యాలు.

* లాకు ఏత్వము దాపు కొమ్ము లననివాడు [లేదు]

* వినకు అనకు కనకు [చెడు]

* వినను కనను రెండేసి ఇచ్చి
అనను ఒకటే ఇచ్చినాడు దేవుడు [చెవులు-కన్నులు-నాలుక]

* వినేవాటికి కనేవాటికి బెత్తెడే దూరం [చెవులు-కండ్లు]

* నూరయే వరకు కాపాడు [రూపాయి]

* ఉప్పూ పులుసూ కారము తినే శరీరానికి
ఊపిరి ఉన్నంత వరకు ఉండనే ఉంటుంది
[కామం లేదా ఉప్పు, పులుసు, కారం]

పొడుపు సామెతలనే మాట ఈ ప్రకరణంలో వినూత్న ప్రయోగం. పొడుపు కథ సామెతగా పరివర్తన చెందడం క్రమ పరిణామమే. భౌతికంగానో భావనాత్మకంగానో విశ్వం నిరంతరం పరిణామం చెందుతోంది. అటువంటి విశ్వంలో పొడుపుకథ అనేది స్వల్పాంశం మాత్రమే.

కథా సహితాలైన పౌరాణికాది భేదాల వల్ల, కథారహితాలైన వ్యవసాయాత్మకాది భేదాలవల్ల పొడుపు సామెత స్వభావాదులు తెలిశాయి. ఇక పొడుపు కథ, పొడుపు సామెత సాదృశ్య సారూప్య సాన్నిహిత్యాల్ని సంగ్రహంగా సమీక్షించాల్సి ఉంది.

## 4-5: పొడుపుకథ - సామెత తులనాత్మక పరిశీలనం

సామెతలు సారస్వత నిధులు సాహిత్యానికి జిగినీ బిగినీ కూర్చే శక్తి వానికుంది. అది పదుగురాడిన పలుకు కాబట్టి దానికి నిధికున్న గౌరవముంది. సారస్వత వృక్షంపై అది చిగురుకొమ్మే కాదు చేవగల కొమ్మ కూడా. వ్యవసాయదారుని మోట మోకుకు గర్భపు తాడుంటుంది. అది పురులన్నింటినీ కలిపిగట్టి పరుస్తుంది. సామెత వాఙ్మయ సారస్వతాలకు ఆ విధంగా ఉపయోగపడుతుంది. ఆ కారణాన్నే దాన్ని సూత్ర వాఙ్మయం కోవకు చెందిందని అంటారు. వాఙ్మయమంతా మాటల మూటలచేత నిండి ఉంటుంది. "పదుగురాడుమాట-పాటియై ధర జెల్లి" సామెత అవుతుంది. మనిషి తన మాటకు బలం చేకూర్చుకోడానికి సామెత ఉపయోగపడుతుంది. జ్ఞాపకంలేని విషయాలు సామెత విన్నవెంటనే జ్ఞప్తికి వస్తాయి. పలువురి జ్ఞానాన్ని మూటగట్టుకొని ఏర్పడ్డ సామెత ఒక్కని నోట వెల్వడుతుంది. మొత్తంమీద విజ్ఞాన వినోద ప్రసార వాహకం సామెత.

అటువంటి సామెతకు పొడుపుకథకు అనేక విధాల సామ్యముంది. "అఙ్గాదఙ్గాత్సమ్భవసి" అనే వేదవాక్యం ఎలాంటి అర్థాన్ని ఇస్తుందో ఇంచుమించుగా అలాంటి అర్థమే పొడుపుకథకూ సామెతకూ వర్తిస్తుంది. అయితే అన్ని సామెతలకిదే వర్తిస్తుందనరాదు. పొడుపు కథల లక్షణాల్ని పొదుగుకొన్న కొన్ని సామెతలకే ఈ మాట చెల్లుతుంది. పొడుపుకథ అంగాంగం నుండి అటువంటి పొడుపు

సామెతలుద్భవిస్తాయి. సాధర్మ్యమున్న పొడుపు కథల్ని పొడుపు సామెతల్ని స్థూలంగా పరిశీలిద్దాం.

5-1 : పొడుపుకథ లక్షణాల్లో సంక్షిప్తత ఒకటి. మట్టి విత్తనమంత శబ్దంలో మట్టిచెట్టంత మహార్థాన్ని నిక్షేపించుకొన్న శక్తి పొడుపుకథకు ఉంది. ఆ మట్టి విత్తనమే సంక్షిప్తత.

* కొడుకా కొడుకా - మొగనికి తమ్ముడా
సక్కన్న పండయ్య - సన్నిస్త లేవయ్య.

ఇది కథాత్మక కాల్పనిక ప్రహేళిక. రాజపుత్రిక మొదటిరోజు శోభనం గదిలో ఈ పొడుపుకథతో భర్తను పొడిచింది. ఆమె అదివరకే అశ్వ శాలాధ్యక్షునితో రహస్య ప్రణయకేళీ విలాసాల్లో తేలాడి కొడుకును కని విడిచి పెట్టింది. ఆ బాలుడు పెరిగి పెద్దవాడయ్యాక అతనితో రాజకుమార్తెకు పెళ్ళి చేశారు. ఈ విషయమంతా విపులంగా కాల్పనిక ప్రహేళికల్లో వివరించబడింది. పొడుపుకథ సంక్షిప్తతకు ఇది ఒక నిదర్శనం.

పొడుపు సామెతకు కూడా ఇటువంటి సంక్షిప్తతా లక్షణం ఉంది. "కొంగ జపం చేసినట్లు"—

అనేది కథాత్మకమైన పొడుపు సామెతే. విష్ణుశర్మకృత పంచతంత్రం భారతీయ దేశభాషల్లో చొచ్చుకొనిపోయింది. తెలుగు సాహిత్యంలో ప్రవేశించి, ఆంధ్రజన జీవనంలో హత్తుకొంది. "కొంగ చేపల్ని తినాలనుకుంది. అహింసా వ్రతం ధరించినట్లు నమ్మించడానికి ఒంటికాలిపై జపం ప్రారంభించింది. ఆ కొంగ ఉత్తమమైందని చేపలు భావించాయి. అది దినదినం కృశించడం పూర్వపాప ప్రాయశ్చిత్త నిమిత్తమని తలంచాయి. అందువల్లనే తటాకం ఎండిపోనుందని జాలరులు వచ్చేస్తారని అది చెప్పిన మాటల్ని నమ్మి దానికి ఆహారమైపోయాయి" పొడుపుకథకన్న మిన్నగా ఈ సామెత సంక్షిప్తతా లక్షణాన్ని రంగరించుకొందని తెలుస్తోంది.

5-2 : ఉక్తివైచిత్రీ రామణీయకత రెండింటిలోను ఇంచుమించు సమానమే అనాలి. పలికిన పలుకువల్ల ఆశ్చర్యం కలుగడం అర్థస్ఫురణానంతరం

ఆనందం కలగడం గమనార్హం. ఉక్తిలో వైచిత్ర్యముండడంవల్ల, రామణీయకత కూడా గోచరించడంవల్ల ఈ లక్షణం చెప్పబడుతుంది.

* వంగతోట నుండు వరిమళ్ళలో నుండు
జొన్నచేల నుండు చోద్యముగను
తలుపు మూలనుండు తలమీద నుండును
దీని భావమేమి తిరుమలేశ!

వంగతోటలో, వరిమళ్ళలో, జొన్న చేలలో, తలుపు మూలలో, తల మీద ఏమో ఉంటుందని భావిస్తాం. కాని తోటలో వంగ ఉంటుందని, మళ్ళలో వరి ఉంటుందని, చేనులో జొన్న ఉంటుందని, మూలలో తలుపుంటుందని, శరీరంమీద తల ఉంటుందని పొడుపు పద్యం పరిశీలనవల్ల తెలుతుంది. ఉక్తిలో వైచిత్రిఉన్నా అర్థస్ఫురణానంతరమే అందులో వున్న రామణీయకత అవగతమవుతుంది.

పొడుపు సామెతల్లో ఇటువంటివి తక్కువగా కనిపిస్తాయి. ఇదివరకే ఈ ప్రకరణంలో ఉదాహరించబడ్డ ఈ క్రింది సామెత ఉక్తివైచిత్రి కలిగిందే.

* లాకు ఏత్వము దాకు కొమ్ము అననివాడు

అభినవ కర్ణుడైన దాతనుగూర్చి పుట్టిందీ సామెత. ఏది అడిగినా "లేదు" అనని గుణం అతనిదని చెప్పడానికే ఉక్తిలో వైచిత్రి పాటించడం జరిగింది.

5-3 : <u>కథాసహితాలైన</u> పొడుపుకథల్ని, సామెతల్ని గూర్చి ఇంతకు పూర్వమే వివరించడం జరిగింది. రెండిట్లోను కథను గుప్తపరచుకొన్న తత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

5-4 : <u>కథారహితాలైన</u> పొడుపుకథలు-సామెతలు ఇంతకు పూర్వమే వ్యాఖ్యానించబడ్డాయి రెండింటా కథారహితత్వం ఉన్న పొడుపులు-సామెతలు కోకొల్లలు. విషయ వైవిధ్యం కూడా ఇంచుమించు సరిసమానమే అనాలి.

5-5 : పొడుపుకథల్లోనూ పొడుపు సామెతల్లోనూ <u>ఘటనా</u> విశిష్టత గమనింపదగింది. ఇందులో ఒక జీవితానికి సంబంధించిన సంపూర్ణకథ-గాథా

ఉండదు. కొన్ని సన్నివేశాల చిత్రణగాని, కొన్ని సమస్యల పరిష్కారంగాని ఉండదు. ఒకే ఒక సంఘటనద్వారా కథాత్మక ప్రహేళిక రూపాన్ని ధరించడం, లేదా సామెతగా మారడం జరుగుతుంది. కథాత్మక ప్రహేళికల్లో వివరించిన ఈ క్రింది పొడుపుకథలో ఘటనా విశిష్టతే ఉంది.

* ఆరేవి సెర్ల కూరేరే పిల్లా
  నీ వాళ్ల కూరేమి?
  సదూశాస్త్రం నేర్చిన సాకలివాడా!
  రెక్కలు మడవని పక్షి పేరేమి!

గర్భవతియైన యువతి కూరేరుతోంది. ఓ గడుసరి గడుసుగా అడిగాడు. అంత గడుసరిగా ఆమె సమాధానించింది.

ఈ క్రింది చారిత్రాత్మకమైన పొడుపు సామెత కూడా ఘటనా వైశిష్ట్య మున్నదే.

* తాతాచార్యుల ముద్ర భుజము దప్పినా వీపుదప్పదు.

తాతాచార్యుల వారు వైష్ణవ దీక్షాస్వీకారం ఇచ్చే సందర్భంలో కాల్చిన కడ్డీలతో వైష్ణవ శ్రీ చక్రాల్ని ముద్రలుగా వేసేవారు. ఎవరైనా భయపడి పరుగెత్తితే విడువక వెంటబడి వీపున ఒత్తేవారు. ఈ సంఘటన కారణాన్నే ఈసామెత పుట్టింది. ఈపై ఉదాహరణాల వల్ల ప్రహేళికల్లోనూ - ప్రహేళికా లోకోక్తుల్లోనూ ఘటనావైశిష్ట్యమనే సాదృశ్యం ఉందని తెలుస్తోంది.

5-6: <u>అపార్థద్యోతకత</u> ప్రహేళికల్లోనూ, ప్రహేళికా లోకోక్తుల్లోనూ కనిపిస్తోంది. విన్నంతనే ఒకటి అనుకోడం, పరిశీలనానంతరం మరి ఒకటి అని నిశ్చయించడం అపార్థద్యోతకత అనబడుతుంది.

* బిడ్డోడు బొడ్డాన వెట్టె (పల్లేరుగాయ)

విన్నంతనే ఈ పొడుపు కథలో ఒక అశ్లీలార్థం ద్యోతకమవుతుంది. కాని కాలికి పూర్తిగా నాటుకొనే పల్లేరుగాయ అది అని పరిశీలనానంతరం స్ఫురిస్తుంది. ఈ క్రింది సామెత కూడా అటువంటిదే.

* అత్త ఆరో నెలరో పట్టిన దయ్యం

శిశువు ఇంచుమించుగా ఆరో నెలరో అత్త త్త అనడం ప్రారంభిస్తుంది. కాని ఆరో నెలలోనే దయ్యం లాగా పట్టుకొన్న వారెవ్వరా అనే అపార్థం ద్యోతకమవుతుంది.

5—7: పొడుపు కథలోనూ పొడుపు సామెతలోనూ లయాత్మకత కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది. గణబద్ధత వల్లా మాత్రబద్ధత వల్లా గతి వల్లా ఈ లయాత్మకత ఏర్పడుతుంది.

* గూట్లో పిల్లా
గుంజితె ఒల్లా (నాయిక)

ఈ పొడుపుకథ రెండు పాదాల్లో ఎనిమిదేసి మాత్రలున్నాయి. అట్లే ఈ క్రింది పొడుపు సామెతలోని రెండు పాదాల్లోనూ పదకొండేసి మాత్రలున్నాయి. మాత్రా గణబద్ధత కారణాన రెండింటిలోనూ లయాత్మకత సిద్ధించింది.

* గడ్డ తిన్నా కంపే
పాయ తిన్నా కంపే (ఉల్లి)

5-8 : లయాత్మకత కూడా అలంకారానికి లక్షణమే అయినా శబ్దాల మేళవింపుల వల్ల, అర్థచారుత్వం వల్ల ఆలంకారికత సిద్ధిస్తుంది. ఈ క్రింది పొడుపు కథలో పొడుపు సామెతలో శబ్దాల మేళవింపువల్లనే ఆలంకారికత సిద్ధించింది.

పొడుపు కథకుదాహరణం

* సురసుర కత్తులు
సూరి కత్తులు
రాజులు దెత్తురు
రంభల కిత్తురు (మొగలి పువ్వు)

* చూస్తే చుక్క
లేస్తే కుక్క (గయ్యాళి)

5-9 : పొడుపుకథను శబ్దాల మాటున్నో, భావంచాటునో అర్థాన్ని మరుగుపుచ్చుకొనే శక్తి ఉంది. దీన్ని అర్థనిగూఢత అనవచ్చు. అన్ని పొడుపు సామెతల్లో అర్థనిగూఢత కనిపించకపోవచ్చు. కాని పొడుపుకథకిది సాధారణమైన విషయం.

* ఇంటివెనుక పప్పువేసి
  కుప్పకు నిప్పును పెట్టి
  కుప్పకాలి పోతేను
  అప్పులెల్ల దీఱిపోయె

పచ్చికుండల్ని కుప్పగా వేయడం, కాల్చడం. అమ్ముకొని అప్పులు తీర్చుకోడం అనే నిగూఢత ఇందులో ఉంది. అట్లే ఈ క్రింది పొడుపు సామెతలో చంద్రుని చుట్టు వర్తులాకారంగా ఉండే కాంతిపుంజం నిగూఢంగా చెప్పబడింది. దానిని పరివేషమంటారు.

* దూరం గుడికడితే దగ్గరలో వాన
  దగ్గర గుడికడితే దూరాన వాన (వరదగూడు)

5-10 : ప్రశ్నాపూర్వకమైన సమస్యాత్మకత కథల్లోనూ సామెతల్లోనూ ఉంది. కాకపోతే పొడుపుకథల్లో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి. సామెతల్లో అక్కడక్కడ అగుపిస్తాయి.

* ఏరాయి వద్దన్నా ఆ రాయికావాలి
  అదేమి రాయి ? (ఉప్పురాయి)

* ఆలి పంచాయితీ (రామాయణం)
  పాలి పంచాయితీ (భారతం)

ఉప్పురాయి అని పూరించడం వల్లగాని పొడుపుకథ సృష్టించిన సమస్యా పూర్వకమైన ప్రశ్నకు సమాధానం లభించలేదు. అట్లే ఆలి పంచాయితీ అనగానే రామాయణం అనడం వల్లగానీ పాలి పంచాయితీ అనగానే భారతమనడం వల్లగానీ సామెతకు సంపూర్ణత్వం సిద్ధించలేదు.

5-11 : సూటిగానూ ఘాటుగానూ ఉండే శబ్దతీక్ష్ణత లేదా విధి నిషేధాత్మకత, ప్రహేళికా లోకోక్తుల్లోనూ సహజ సిద్ధంగా ఉంటుంది. ఈ గుణంలోని విధి నిషేధాత్మకత గమనించదగిన విషయం.

* చాపను చుట్టను లేము
చంకను బెట్టనూ లేము (ఆకాశము)

* వినరు అనరు కనరు (చెవు)

5-12 : పొడుపుకథలు- పొడుపు సామెతలు రెండింటిలోనూ అడుగడుగునా ప్రతీకాత్మకత గోచరిస్తుంది. ఒక వస్తువుకున్న రూపగుణ రసధర్మాల్ని బట్టి మరొక వస్తువును సంకేతించడం జరుగుతుంది. ఆ సంకేతమే ప్రతీక అనబడుతుంది. సమస్త సాహిత్య ప్రక్రియల్లో పొడుపు కథలు-పొడుపు సామెతలు ప్రతీకాత్మకతలో అగ్రగణ్యాలే.

* నడిచిపోయే నల్లరాతికి
నాలుగే లింగాలు (గేదె)

ఈ పొడుపు కథలో గేదెను నల్లరాతితో గేదె చన్నుల్ని లింగాలతో సంకేతించడం జరిగింది. అట్లే ఈ క్రింది పొడుపు సామెతలో కన్యను అరటాకుతో ముల్లును పురుషునితో సంకేతించడం జరిగింది.

* అరటాకు మీద ముల్లుపడ్డా
ముల్లుమీద అరటాకు పడ్డా
అరటాకుకే ప్రమాదం (కన్య-పురుషుడు)

పొడుపు కథలకూ పొడుపు సామెతలకూ ఇన్ని విధాల సాదృశ్య ధర్మాలున్నాయి. ఆచార్యుడు పూర్వరూపం అంతేవాసి ఉత్తర రూపం అనే ఉపనిషదుక్తిని పొడుపుకథ పొడుపు సామెత సార్థకం చేశాయి. అందువల్లనే ఈడూ-జోడూ, తోడూ-నీడ అక్కడక్కడ అభేదం కొట్టవచ్చినట్లు అగుపిస్తుంది. ఇంతేగాక ఈ రెండింటిలోనూ క్రీడావినోదాత్మకాలైన గుణాలు, కళాత్మకాలైన విలువలు, రసవ్యంగ్య ధ్వన్యాదులు, దృశ్యాత్మకత స్వభావమూ, సాంప్రదాయక

బంం ఆరిగాగల అనేక విశేషాల్లో సామ్యం సాధర్మ్యం సాన్నిహిత్యం సమ్మిళితమై కనబడుతున్నాయి.

## 4–6 : కొసమెరుపు

'ఆరిపోయే దీపానికి వెలుతురెక్కువ'- ఇది 'పెద్దల మాట పెరుగన్నం మూట'. 'సామెత సాహిత్యానికే ఆమెత'. పూర్వాపూర్వంకన్నా ఉత్తరోత్తరం బలీయం అన్నట్లు పొడుపుకథ కన్నా సామెత ఉత్తమమని తేలింది. అయితే రాశిలో పొడుపుకథది వాసిలో పొడుపు సామెతది రాశిలోనూ వాసిలోను సామెతది అగ్రస్థానం.

ఈ ప్రకరణంలో పొడుపు కథను పొడుపు సామెతను ఆచి తూచి తూచడం జరిగింది. ఇంకా జాతీయాల్లోను, పలుకుబడుల్లోను పొడుపు కథల ఛాయలు చూపుల కెక్కుతున్నాయి. పొడుపు కథలు భాషావిషయాలు వివరించే సమయంలో అవి చర్చించడం జరుగుతుంది. ఈ ప్రకరణంలో సామెతల పుట్టుపూర్వోత్తరాల గురించి సంక్షిప్తంగా చెప్పి, పొడుపు కథే పొడుపు సామెత రూపం సంతరించుకొందని వివరించి, పొడుపు సామెతలు కథాసహితాలు కథారహితాలనబడతాయని తెలిపి, కథాసహితాల్లో పౌరాణికాది భేదాల్ని వ్యాఖ్యానించి, కథా రహితాల్లో వ్యవసాయాత్మకాది భేదాల్ని సమీక్షించి, పొడుపు కథను పొడుపు సామెతను తులనాత్మకంగా పరిశీలించడం జరిగింది.



# పొడుపుకథలు - ప్రజాజీవనం

## 5-1 : ప్రజలే ప్రతిబింబాలు

సూర్య కిరణాలు ప్రసరిస్తాయి; ధాత్రిని చుంబిస్తాయి; సర్వ ప్రకృతిని స్పృశిస్తాయి; ఆ కిరణ ప్రసారం వల్ల చీకటి కోణాలు కనిపిస్తాయి. అయితే ఆ సూర్యుడు పొందే అనుభూతిగాని, సుఖంగాని శూన్యమే. అయినా సూర్యుడు ధర్మ బద్ధంగా నడుస్తున్నాడు. తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు.

పొడుపుకథలు పుట్టాయి — పుడుతున్నాయి; హృదయాల్ని స్పృశిస్తున్నాయి; మనసుల్ని రంజిస్తున్నాయి. అయితే ఆ ప్రహేళిక కానందమెక్కడిది! అనుభూతి ఎక్కడిది; అయినా అదీ అర్కబింబంలాగానే తన ధర్మాన్ని నిర్వర్తిస్తున్నది.

ఈ ధర్మ నిర్వహణలో ప్రహేళికే బింబం - ప్రజలే ప్రతిబింబాలు. బింబ ప్రతిబింబాలు పరస్పరాధారాధేయాలు. అవి ప్రజా జీవనాన్ని ప్రస్ఫుటీ కరిస్తాయి; ఫలింపజేస్తాయి. జీవనం ప్రజలది; ప్రహేళికలు ప్రజల సృష్టి. సృష్టించేవారి గుణాలు, ఆలోచనలు, అనుభూతులు, ఆచారాలు, అలవాట్లు, అభిరుచులు, సంప్రదాయాలు అన్నీ వారుత్పత్తి చేసిన వస్తువులో అంతర్లీనంగా - బహిర్వ్యక్తంగా ఉంటాయి. విశ్వకర్త విషయమేమోగానే, ప్రహేళికా సృష్టికర్తలకే ఒక్కొక్కసారి వారి సృష్టి అంతుచిక్కదు - పొంతు చిక్కదు. నిజానికి సృష్టికర్త ఎవడో చిక్కడు-దొరకడు. కర్తలెవరో తెలియకున్నా పొడుపు కథలకేమీ కొదవలేదు; కోకొల్లలుగా ఉన్నాయి. అవి ప్రతిఫలించే ప్రజా జీవనం గత కాలానికి వర్తమానానికి సేతువుగా ఉంది. ఆ సేతువు మీద నడిచేవారు నాడైనా నేడైనా రేపైనా ప్రజలే,

వారు వ్యక్తులుగా, కుటుంబీకులుగా, సామాజికులుగా, రాష్ట్రీయులుగా (దేశీయులుగా), విశ్వమూర్తులుగా, ధర్మస్వరూపులుగా వ్యవహరిస్తున్నారు.

వారొక ప్రదేశంలో ఉన్నారు; అన్ని ప్రదేశాల్లోనూ ఉన్నారు. వారు విశ్వతో ముఖులు; అనంతరూపులు; బహుల బాహూరుపాదులు; ఒక్క మాటలో చెప్పా లంటే వారు విరాట్స్వరూప ప్రతీకలు. వారు ఎక్కడ ఏం చెప్పారో అది అక్కడే ఉండదు; ఉండాలనే నియమం లేదు. అలాంటి నియమం మానసిక వికాసానికి గొడ్డలి పెట్టు. ఆ కారణంగానే పొడుపుకథాకారుడు లేదా వ్యవహర్త తన భావాలు విశ్వ పరివ్యాప్తాలు కావాలని ఆలోచిస్తున్నాడు.

* ఈడేసిన కోల
ఇంజమూరు వాయె [బాట]

కోల అంటే కర్ర. ఈ శబ్దానికి ముందు కొన్ని పదాలున్నాయి. ఆ పదాల చేరిక వల్ల రకరకాల అర్థాలు వస్తాయి. ములు కోల, చర్నా కోల, నాగటి కోల' ఇలాంటివే. రూప భేదమేగాని మూలం అన్నింటికి కోల (కర్ర) మాత్రమే. అయితే ఇంజమూరు పోయేది కోల కాదు—బాట. ఇది ఇంజమూరేంటి ఇంద్ర ప్రస్థం వరకు కూడా పోతుంది. పోయేది బాటేకాదు పొడుపుకథ కూడా. అందు వల్ల ఏ ప్రాంతంలోని పొడుపుల ఉపుపులు ఒలిచినా ప్రజా జీవనం అచ్ఛాదన రహితంగా కనిపిస్తుంది. అటువంటి జీవనాన్ని పొడుపు కథలు-జానపద సాహిత్య మనే ప్రకరణంలో కొంతమేరకు చూపించడం జరిగింది. అందులో ప్రధానంగా జానపదుల విషయమే వచ్చింది. ఈ ప్రకరణంలో అందరినీ స్పృశించడం జరుగు తుంది.

**1-1 : వ్యక్తి :–** విశ్వంలో ఒక పదార్థం, ఒక సిద్ధాంతం చైతన్య వంతమూ గతిశీలకమూ కావాలంటే ప్రప్రథమంగా వ్యక్తిలో గతిశీలక ముండాలి; జవమూ జీవమూ ఉండాలి. విశ్వ చక్రానికి వ్యక్తే కేంద్ర బిందువు. వస్తూ త్పత్తికి కారకుడతనే. పదార్థ పరిణామానికి కూడా కొంతవరకు కారకుడతనే. కేవలం వ్యక్తి ప్రాధాన్యాలైన పొడుపుకథల్లో అభిరుచులు-అలవాట్లు ప్రతి బింబించడం సహజం.

* పైన పటారం - లోన లొటారం [మేడి పండు]

ఇది ఈనాడొక సామెతగా పరిణమించింది. ఆడంబరాలకు వెళ్లి అష్ట

కష్టాలు పడ్డవారిని దృష్టిలో పెట్టుకొన్న వారెవరో ఇది సృష్టించారు. పటారం అంటే పటహరవం. పై [మోతనే ఉందనీ లోన ఏదీలేదని అర్థం. ఆకారం పనే కాని శ్రీకారం లేదని కూడా అర్థం. అలాంటి వారిలో మార్పులు రావాలనే ఉద్దేశంతోనే ఈ పొడుపు సామెత సృష్టి జరిగింది. వ్యక్తిలో వచ్చే పరిణామమే విశ్వ పరిణామం. ప్రహేళికా సృష్టికర్త అలాంటి పరిణామాన్నే ఆశించాడు. ఇంకా ఆశిస్తూనే ఉన్నాడు. ఇక్కడ విడుపు మేడిపండే అయినా అది వ్యక్తినే తెలుపుతుంది; ముఖ్యంగా అలాంటి వ్యక్తి విషయంలోనే ప్రసక్తమవుతుంది.

* కతకతకత నీ కంటికి పోత
చెప్పకుంటె నీ చెంపకు పోత
విప్పకుంటే నీ వీపుకు పోత (కాటుక, పౌడరు, జంధ్యం)

విడుపెక్కడుందో అని ఎంతో దూరం పోవల్సిన అవసరం లేదు. విడుపు చెప్పకపోతే కంటిలో పొడుస్తారనీ, చెంపను చేయి చేరుస్తారనీ, వీపు విమానం మోత మోయిస్తారనీ భావించవలసిన అవసరం లేదు. వ్యక్తిని 'సవాల్' చేసి ప్రేరణ కలిగించి' ఆలోచనాలోచనాలతో అన్వేషించుమంటోంది ఈ పొడుపుకథ. వ్యక్తి వికాసమే ప్రధానం కదా! అందుకే వేసిన పొడుపుకథ కూడా వ్యక్తికి సంబంధించిందే! కంటికి కాటుక, చెంపకు పౌడర్, వీపుకు జంధ్యం వ్యక్తి అభిరుచులననుసరించి అలవాట్ల ననుసరించి పాటించాలని విధించుకొన్న నియమాలే. కేవలం వ్యక్తికే సంబంధించిన ఇలాంటి పొడుపుకథలెన్నయినా ఉదాహరించవచ్చు.

**1-2 : కుటుంబం :** వ్యక్తి ఎప్పుడూ ఒక్కడు కాడు. అతని ఈడుకు జోడూ తోడూ ఎప్పుడో ఎక్కడో బయటపడుతూనే ఉంటుంది, అపుడు వారిద్దరవుతారు; ముగ్గురవుతారు; పదుగురవుతారు. అందరు కలిసి ఒకే గృహంలో ఉంటారు. అదే కుటుంబ మవుతుంది. సామాజిక జీవనంలో కేంద్రమైన కుటుంబాన్ని ప్రపంచ మంతా ఆమోదించింది. కుటుంబ విధ్వంసక సిద్ధాంతాలు కొన్ని ప్రతిపాదితమైనా అవి నిలవలేకపోయాయి. ఎక్కువశాతం ప్రజలూ-మేధావులూ ఆ సిద్ధాంతాల్ని సమ్మానించలేదు. అవి మానవుణ్ణి కేవలం పశుత్వం వైపుగా దిగజార్చడమే అని ప్రజ నిరసించింది.

అందుకే కుటుంబ వ్యవస్థ విశ్వంలో ప్రధానంగా భారతీయ సమాజంలో సుదృఢంగా నాటుకొంది.

కుటుంబంలో అనురాగాలు-ఆలకలు సర్వసాధారణం. పాప పుట్టినప్పుడు కలిగే ఆనందాన్నే ఈ క్రింది పొడుపు కథ అభివ్యక్తీకరిస్తోంది.

* దూలదూలా లైన-దూలాలు రెండైన
ఏకచక్రం బైన-ఏనిగాలు రెండైన
తినరాని పండైన-తీపిదనము[1]

సాంసారిక జీవన మాధుర్య ఫలమే పసిపాప. దూరంగ ఉన్న దూలాలు ఒకటవుతాయి. ఆ దూలాలు స్త్రీపురుషులే. ఏకచక్రం కావడమంటే వివాహానంతర సాంసారిక జీవన స్థితిని తెలియజేయడం. ఆ దంపతులనే ఏనుగులుగా భావించాడు జానపదుడు. తీపి కలిగిన తినరాని పండే వారి పసిపాప. శిశువు భూమ్మీద పడ్డప్పటినుండే సంస్కారాలు ప్రారంభం కావు! శిశువు గర్భంలో నిలచినప్పటి నుండే సంస్కారాలారంభ మవుతాయి. అవే భారతీయ సమాజంలో షోడశ సంస్కారాల పేరిట ప్రసిద్ధి పొందాయి.

* పట్టుకొంటే పిడికెడు
ఇడిస్తే ఇల్లెడు (దీపం)

ఇది గృహాన్ని వెలిగించే దీపం. గృహాల్లోకి నేటి విద్యుద్దీపాలు రాక ముందు వెలుతురు కాధారాలు దీపాలే. దీపం వెలిగించింతర్వాత ఒక చోటునుండి మరోచోటుకు తీసుకొని వెళ్ళేప్పుడు ఎడమచేత దీపాన్ని పట్టి, కుడిచేతిని పిడికిలిగా మార్చి జ్యోతి చుట్టూరా ఉంచి తెస్తారు. ఆ చర్యను దృష్టిలో ఉంచుకొని సంసిద్ధం చేసిన పొడుపుకథ ఇది. చుట్టూ చేయి చేర్చినప్పుడు వెలుతురంతా పిడికిటనే పొదిగి పోతుంది. విడిచిన వెంటనే ఇంటినిండా అవుతుంది. ఇంటికి దీపం ఇల్లాలే అనే సామెత కుటుంబ జీవనంలో ఆమెకున్న ప్రాధాన్యాన్ని ప్రస్ఫుటీకరిస్తుంది.

---

1. తీపిఘనము.

గృహ జీవనాన్ని తెలిపే పొడుపుకథల్లో కుటుంబ ప్రాశస్త్యాన్ని ప్రకటించేవే అధికంగా ఉన్నాయి.

**1-3 : గ్రామం :—** గ్రామజీవనంలో వ్యక్తి జీవనం, కుటుంబజీవనం **అంతర్భాగాలు** మాత్రమే. వ్యక్తి జీవనాన్ని కుటుంబ జీవనాన్ని ప్రకటించే పొడుపు కథలతోపాటు **గ్రామ** జీవనాన్ని, గ్రామ శ్రేయస్సునూ ప్రతిబింబించే ప్రహేళికలూ ఉన్నాయి.

* వానిపేరే జిల్జిల్‌గాడు
వాని ముడ్డికి మూరెడు తాడు
వాడు లేకుంటె ఊరంత పాడు (చీపురు, పొరకట్ట)

చీపురును ఆడించేప్పుడు "జిల్ జిల్" అనేధ్వని వస్తుంది. వస్తుధ్వనిని బట్టి చీపురుకు జిల్‌జిల్‌గాడనే సార్థక నామం వచ్చింది. సాధారణంగా తాటి ఈనెలతో, తాటి జీబురుతో, ఈత ఆకుతో, కాశకొనలతో, చీపురు (కంచె) కొయ్యలతో పొరకట్ట తయారుచేస్తారు. దీని మొదట కొయ్యలు చెదిరిపోకుండా మూరెడు త్రాడు కడతారు. గ్రామ పారిశుద్ధ్యానికి ఎప్పుడూ చీపురు నుపయోగించాల్సిందే. నారీ కరవాలమనీ ముద్దుముద్దుగా పిలుచుకొన్నా పరిసరాల పరిశుభ్రత కుపకరించే సాధనమదే. అది ఎవరి కరవాలమైతేనేంగాని గ్రామాల్ని కళకళలాడిస్తుంది. అర్థమింతే అయినా ఈ పొడుపుకథాకర్తా వ్యవహర్తా అయిన జానపదుని దృష్టి ప్రశంసనీయమైంది.

వ్యక్తి ఔన్నత్యాన్ని అభిలషిస్తూనే, కుటుంబ సౌభాగ్యాన్ని కాంక్షిస్తూనే, గ్రామ శ్రేయస్సుకై చీపురు నుపయోగించవలసిందే; దుమ్ము దులపవలసిందే; చెత్త చెదారం బయటకు గెంటవలసిందే. గ్రామ పారిశుద్ధ్యంమీద గ్రామీణునికున్న పౌర దృష్టిని ఈ పొడుపుకథ వ్యక్తీకరిస్తూంది.

గ్రామంలో అప్పిచ్చువాడు ఉండాలి; వైద్యుడుండాలి.... ఇంకా వారూ వీరూ ఉండాలన్నాడు సుమతీ శతకకర్త. జానపదుడు మరో ముగ్గురుండాలంటున్నాడు; ఆ ముగ్గురుకూడా ఒకచోట ఉండాలంటున్నాడు.

* కుమ్మర మల్లయ్య
పత్తి పాపయ్య
ఆముదాల అచ్చయ్య
ముగ్గురొక చేగా[1] [ప్రమిద, ప్రత్తి(వత్తి), ఆముదం]

మల్లయ్య, పాపయ్య, అచ్చయ్య ముగ్గురొక్కటే ఎలా అవుతారు. ఆ పేర్లకుపైన ఉన్న విశేషాలు పరిశీలించాలి. పూర్వకాలంలో మట్టి ప్రమిదలు వాడేవారు. ఆ మట్టిలో పత్తితో చేసిన వత్తి వేసేవారు. అందులో ఆముదం పోసి వత్తిని ముట్టించేవారు. ముగ్గురొక్కటైనప్పుడది ఇక దీపమే. ఇప్పటికీ కిరసనాయిల్ చేరని గ్రామాల్లో, కిరసనాయిల్‌తో దీపం వెలిగించరాదన్న ఆచారమున్న గృహాల్లో ఆముదం దీపాలు గాని లేదా నూనె దీపాలుగాని వెలిగిస్తున్నారు. గుళ్ళల్లో వెలిగే దీపం ఈ నాటికీ ఇలాగే ఉంది. గుడి గూటిదీపం ఆ గ్రామీణులందరికి వెలుగే మరి. గ్రామ భౌతిక సౌందర్యాన్ని ఆశిస్తూనే చుట్టుకొన్న చీకటిని నెట్టివేయాలని జానపదుడాశిస్తున్నాడు.

* గట్టుల్లో ఏ గట్టు పెద్ద (కరిగట్టు)

—అని అడిగిన వెంటనే బోడగట్టో, గొల్లిగట్టో, తిరుమాలాయగట్టో దుబ్బగట్టో, కోల్లగట్టో ఏదో ఒకటి పరిచయంలో ఉన్నది చెప్పాలని అన్వేషిస్తాం. కాని అది కరిగట్టు అని తెలిసినప్పుడు వరిపొలం, వడ్లు, బియ్యం గుర్తుకువచ్చి గ్రామవైభవం మీద జానపదుని దృష్టి ఎటువంటిదో అర్థమవుతుంది. మోకాటిలోతు కరిగట్టులో బారెడు ముల్లు గట్టిపట్టి దున్నలదిలించే కర్షకుడు కళ్లల్లో మెదలతాడు. ఈ దేశానికి రైతే వెన్నెముక అనే భావన స్థిరంగా నిలిచిపోతుంది. ఇలా గ్రామీణుల జీవన విధానాల్ని గ్రామాల రమణీయ దృశ్యాల్ని కళ్లముందు బొమ్మ గట్టించే పొడుపు కథలు కోకొల్లలుగా ఉన్నాయి.

**1-4 : రాష్ట్రం :** రాష్ట్రమంటే దేశమే. అది కేవలం భౌగోళిక స్వరూపమే కాదు; అది ఒక భావాత్మక స్వరూపం కూడా. అంతేకాదు అది ఒక జాతి

---

1. ముగ్గురొక గూట్లో ఉంటారు.

సాంస్కృతిక స్వరూపం. లనేక శతాబ్దాల సహస్రాబ్దాల సుదీర్ఘ కాలంలో సహజంగా వికసించిన ఒక సజీవ స్వరూపం స్థాలనా సత్యమే రాష్ట్రం. ఇంత నిక్కచ్చిగా నిర్వచనం అందరికి తెలిసినా తెలియకున్నా, ఈ దేశ నాగరికతా సంస్కృతుల విషయంలో భారతీయులంతగా అనభిజ్ఞులం కాదు ఈ దేశ సంస్కృతిని సాహిత్యం ద్వారా సుసంపన్నం చేసిన మహర్షి మహాకవులను పొడుపు పద్యాల్లో స్మరించడం రాష్ట్రహితైక దృష్టితో చేసిన విశిష్ట కార్యమే అవుతుంది.

| | | |
|---|---|---|
| * వసుధలో సురలకు వైరియు నెవ్వడు | — | ప్రవ్యార్తు |
| దశరథ విభు కగ్రదార ఎవతి | — | కౌసల్య |
| శంభుని రాణిని జనులు ఏమందురు | — | భవాని |
| పాములుండెడి తావు నామమేమి | — | వల్మీకం |
| అతివల ముంజేతి కందమేమైయుండు | — | కంకణం |
| గౌతము సతితోడ కలిసె నెవడు | — | పాకారి |
| కృష్ణుడెవ్వరి తల కినిసి నాట్యము చేసె | — | కాళింగు |
| నృగరాజు ఏమిచ్చి నూతబడియె | — | గోదానం |
| ఉదధి గట్టెడి వేళ నుడుత తానేమిచ్చె | — | ఉసుక |
| రమణుల కీయగ రానిదేది | — | అలుసు |

ఆన్నిటికి జూడ మూడేసి అక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయము గాను
వ్యాస వాల్మీకులును కాళిదాసులెపుడు
మనల కరుణా విధేయులై మనుచుచుంద్రుడు.[1]

---

1. శ్రీ పొపిసెట్టి సీతారామ కవి వ్రాతప్రతి.

రాష్ట్రీయ చింతన ప్రజాజీవనంలో ఒక భాగమే. సాహితీ సంస్కృతుల మహత్వాన్ని జగత్తు కందించి మార్గ దర్శనం చేసిన మహర్షులను స్మరించడం వారిని సమ్మానించడమే. వ్యాస వాల్మీకి కాళిదాసులు భారతీయ ధార్మిక సాహిత్య సాంస్కృతికాది నిర్మాతలు వారిని గురించి అందరికీ తెలియకున్నా వారి భారత, రామాయణ, శాకుంతలాది గ్రంథాలు, లేదా ఆ గ్రంథ గత విషయాంశాలు పిల్ల పిల్లకు తెలుసు. అందుకే వారిని స్మరించడం వెనుక రాష్ట్రీయ దృష్టి ఉందనడం.

**1-5 : విశ్వం :** స్థావర జంగమాత్మకమైన ఇదంతా విశ్వమే. జీవ జడభూతాలు, సూర్యచంద్ర తారకలు అన్నీ విశ్వంలోనివే. ఈ విశ్వంలో దేశాలున్నాయి, జాతులున్నాయి; భాషలున్నాయి, సాహిత్య సంస్కృతులున్నాయి. మతోన్మాదముంది; జాతి దురభిమానముంది; పోరాటముంది; వసుధైక కుటుంబ భావనాపరమైన ఆరాటముంది. ఇలాంటి విచిత్ర విశ్వం ప్రహేళికల్లోనూ కనిపిస్తుంటుంది.

ప్రహేళికలు సాహిత్య సింధువులో బిందువులే అయినా అందులో జీవ జడ పదార్థాలున్నాయి; పంచభూతాలున్నాయి; సూర్యచంద్ర తారకలున్నాయి. అయితే అంతమాత్రానికే అందులో విశ్వం కనిపించిందనలేం. ఆ కనిపించిన దానిలో కూడా జాతులన్నీ ఏకం కావాలనీ, మతాలన్నీ మాసిపోవాలనీ, స్వర్గసుఖాలేవో రావాలనీ పొడుపు కథాకారుడేమీ ఆశించలేదు. పైగా ఈ భావాలన్నిటికి పొడుపుకథ సాధనమూ కాదు- వాహకమూ కాదు. అందుకే విశ్వాన్నో విశ్వాంతర్భాగ ఖండాన్నో ప్రహేళికాకారుడు ప్రస్తావించాడనాలి.

* నేను గుండ్రంగా ఉంటాను- కదలిస్తే తిరుగుతాను
నాపై పట్నాలుంటాయి గాని ప్రజలుండరు
నా మీద నదులుంటాయి గాని ప్రవహించవు
సముద్రాలుంటాయిగాని నీళ్లుండవు. (గ్లోబ్)

ఇది మరీ కొత్త పొడుపుకథ. బాలబాలికల మానసిక వికాసం నిమిత్తం పెద్దలు కల్పించింది; లేదా పిల్లలే కల్పించుకొన్నది. ఇది విశ్వాన్ని కళ్లముందు

నిలిపింది. పిన్నలకైనా పెద్దలకైనా ఈ విశ్వంమీద గురి ఉందనీ, ఆ గురి విశ్వాస ప్రపూర్ణమైందనీ, అంత పెద్ద గోళాన్ని తమ కళ్లముందు చిత్రించుకొని అధ్యయనం చేస్తున్నారనీ, ఏది ఎంత పెద్దదైనా మనిషిముందు దిగదుడుపే అన్న ఆత్మ ప్రత్యయంతో ఉన్నారనీ పై ఉదాహరణం ద్వారా తెలుస్తుంది.

* చిన తాంబాలం
పెద తాంబాలం
నూకల బువ్వ
నూనె ధార (భూమి, ఆకాశం, చుక్కలు, వాన)

జానపదుని దృష్టిలో ఈ విశ్వంలోని భూమి అంతా చిన్న పళ్లెం అయింది; ఆకాశమంతా పెద్ద పళ్లెం అయింది. నక్షత్రాలు నూకల అన్నం అయ్యాయి; వర్షం తైలధార అయ్యింది. విశ్వాన్ని బంధించిన ఓ రమణీయ దృశ్యం కళ్లముందు సాక్షాత్కరించింది.

* ఊరికొక్కటే ముల్లుగర్ర (సూర్యుడు)

ఊరంటే ఏదో చిన్న పల్లెగాదు; ఈ విశాల విశ్వమే ఊరు. ముల్లుగర్ర సూర్యుడు. ప్రపంచానికంతటికీ ఒకే సూర్యుడు. అవును ఒకే సూర్యుడు; కాని ఒక్కొక్క జీవికి ఒక్కొక్కడుగా అనిపిస్తాడని మహాకవి ప్రోక్తం. సరిగా జానపదుని భావనకూడా అదే.

**1-6 : ధర్మం :** ధరించేది ధర్మమని ఆర్యోక్తి. వ్యక్తి-కుటుంబం-గ్రామం—విశ్వం ఈ సమస్తం ధర్మబద్ధమై నడుస్తున్నది; నడవకపోతే నడపవలసి ఉంది. అందువల్ల కవి సృష్టికి ధార్మిక దృష్టి తప్పకుండా ఉండాలి, ప్రహేళికా కర్తలూ వ్యవహర్తలూ కూడా ధర్మదృష్టి ఉన్నవారే.

* మామిడేల పూచు మండు వేసంగిని
బాలుడేల పోవు పసులవెంట
రాజుసేన నేల రహిజేర్చు చుండును
మూటనొక్కమాట ముద్దుకృష్ణ! (కాయనే)

మంచు వేసంగి మామిడి "కాయనే" పూయడం ధర్మం. బాలుడు పశువుల వెంట "కాయనే" పోవడం ధర్మం. రాజు సైన్యాన్ని "కాయనే" సమకూర్చుకోడం ధర్మం. ఒకే శబ్దంలో మూడు ధర్మాలు ముడివేసింది పద్యం. ప్రజలు ధర్మాన్ని ఆశిస్తున్నారు; నిలుపాలనుకొంటున్నారు. మామిడిలో ప్రకృతిధర్మం, బాలునిలో ప్రజాధర్మం, రాజులో ప్రభుధర్మం ఆశిస్తూ నిర్మితమైంది పొడుపు పద్యం. సార్వకాలీనమూ సార్వజనీనమూ అయిన సత్య ప్రతిపాదనంలో చిన్న సాధనమైన పొడుపుకథ కూడా తన ధర్మాన్ని నిర్వర్తించింది.

* మీయమ్మ
మాయమ్మా ఒకటే (ముత్యాలమ్మ)

ముత్యాలమ్మ ఒక దేవత. ఆ తల్లి అందరికి తల్లి అంటున్నాడు జానపదుడు. నామరూప భేదాల్ని పాటిస్తున్నా భగవతి విశ్వమాత ఒక్కరే అనే అభిప్రాయం సామాన్యుని హృదయంలో ఉండడం అనుచానంగా వస్తోన్న ఏకాత్మతా తత్వ సందర్శనమే అనాలి. విశ్వమంతటి విశాల ధార్మిక దృష్టితో ప్రాదుర్భవించిన ప్రహేళిక ఇది.

* మిద్దెమీద మిరపచెట్టు
నీళ్లులేక ఎండిపాయె (దీపం)

మిరప చెట్టు భూమ్మీద ఉంటుంది. దానికి నీరు కావాలి. మిరపచెట్టే కాదు ఎన్నో చెట్లున్నాయి; అన్నిటికీ నీరు కావాలి. ఇంజన్ ఉంది, దానికి అన్నం కావాలి. అవి ఉంటేనే బండి నడుస్తుంది. ఇలా ఈ పొడుపుకథ వెనుక ఎన్నో స్ఫురిస్తాయి. అయితే విశుపుమాత్రం దీపం.

దీపానికి నూనె కావాలి, అప్పుడే అది వెలుతురిస్తుంది. ఆ దీపంకూడా ఇంటిదీపం కాదు వీధి దీపం. ఇంటిదీపం ఇంటికే వెలుతురిస్తుంది, వీధి దీపం వీధికంతా వెలుతురునిస్తుంది. చీకటిలో దారిని వెతుక్కొనే సర్వజీవులకు దారి చూపిస్తుంది. మరి ఆలాంటి దీపం నూనె లేకుండా ఎండిపోరాదనే ఆవేదన

ఈ పొడుపుకథ వ్యంజిస్తున్నది. ఇది సామాజిక ధర్మదృష్టితో పుట్టిన పొడుపు కథే.

జానపదుల నిర్మల మనస్సుల్లో పుట్టిన ఇలాంటి పొడుపుకథల నెన్నయినా గంపలకెత్త వచ్చు, గాదెలు నింపవచ్చు. కేవలం జానపదులవే కావు, సమస్త ప్రజానీకం కట్టుకొన్న పొడుపు కథల్ని రాశులుగా పోయవచ్చు, బండ్లకెత్త వచ్చు.

ప్రజా జీవనమనే ఈ ప్రకరణంలో జానపదుల పొడుపు కథలే కాక సర్వజన సమాదరణీయమైన ప్రహేళికల్ని స్పృశించడం జరుగుతుంది. ప్రజా జీవనంలో విభిన్నాంశాల్ని, వైవిధ్య ప్రపూర్ణ విషయాల్ని పొడుపుకథ ఎలా పొదుగుకొందో పరిశీలిద్దాం. జీవితాల్లోని చీకటి వెలుగుల్ని ప్రహేళిక ఏ విధంగా బొమ్మగట్టిందో దర్శిద్దాం.

## 5-2 : గృహజీవనం

గృహజీవనంలో శృంగారం చిలుకుతుంది, అంగారం ఒలుకుతుంది, బంగారం పండుతుంది. హిందువుకు గృహమే కర్మక్షేత్రం- ధర్మక్షేత్రం. గృహమే కాదు ఈ శరీరం కూడా, సామాజిక క్షేత్రంలో మనిషి ప్రవర్తించే పద్ధతికి ప్రాథమిక శిక్షణనిచ్చేది గృహం. తెల్లవారిన వెంటనే పక్షులు గూడు విడుస్తాయి; అనేక ప్రదేశాల్లో పర్యటిస్తాయి; కడుపు నింపుకొంటాయి; సాయంకాలం వరకు గూటికి వస్తాయి. అట్లే మనిషి గృహాన్ని వదలిపెట్టి వృత్తి-ఉత్పత్తి-కళా-సేవాక్షేత్రాల్లో పాల్గొని రాత్రికి ఇంటికి చేరుకొంటాడు. స్త్రీ పురుషులిద్దరూ ఈ అన్ని రంగాల్లో పాల్గొంటారు. గృహానికి వెలుపల పనిలేనప్పుడు, ఇంటిలోనే ఏదో ఓ పని కల్పించుకొంటాడు. పనివల్ల వచ్చిన ఫలితాన్ని పచనం చేయాలి, అందుకొరకు పాకశాల కావాలి.

**2-1 : పాకశాల :-** పాకశాల్లో రకరకాల పరికరాలతోపాటు ముడి పదార్థాలుంటాయి. పిండి, బియ్యం, కారం, ఉప్పూ, పప్పు తినడానికి యోగ్యంగా మారాలంటే వాటిని ఉడికించాలి; లేదా కాల్చాలి. అందుకే "పొయ్యి" కావాలి. రకరకాల "స్టవ్వు"లెన్ని వచ్చినా నేటికి నూటికి తొంబయిమంది అనాదిగా వస్తోన్న

పొయ్యిలమీదనే వంట చేస్తున్నారు. మరి ఆ పొయ్యిని పొడుపు పద్యమిలా పొదుగుకొంది.

* కాళ్లు మూడు కల్గి కదలగా లేకుండు
  కళ్లు చాలగల్గి కాంచలేదు
  ఖర్మమేమొకాని కట్టెలు భక్షించు
  దీని భావమేమి తిరుమలేశ! (పొయ్యి)

పొయ్యికి మూడు కాళ్లు; దిమ్మలే కాళ్లు. కణకణమండే నిప్పులే కళ్లు. మండేవి కట్టెలు; అవి మండీమండీ కరిగిపోతాయి; కాలి బూడిద అయిపోతాయి, అలా అయిపోవడమే పొయ్యి తినడం. ఇలాంటి పొయ్యి ఎన్ని పాత్రలనైనా మోస్తుంది. ఎందరి ఆకలినైనా తీరుస్తుంది. అలా మోయడాన్నే ఈ క్రింది పొడుపుకథ సూచిస్తుంది.

* చిన్న పిల్ల
  ఎన్నో కుండలు మోస్తుంది (పొయ్యి)

పొయ్యిలోకి కట్టెలే కాదు, పిడకల్ని కూడా వాడుతారు. పేడ భూసారమవుతుందని తెలిసికూడా కొందరింకా పిడకలనే వాడుతున్నారు. పిడకల పేరిట పుట్టిన పొడుపులెన్నో ఉన్నాయి.

* చేసేటప్పుడు మెత్తగా
  వాడేముందు గట్టిగా
  వాడిన తర్వాత పొడిగా
  మారుతుంది ఏమిటి! (పిడుక)

అపార్థద్యోతకత ఎంత అందగించినా మనస్సు మళ్ళీ పిడకమీదకే వచ్చి నిలుస్తుంది. ఈ క్రింది పొడుపుకథలో పిడకపడ్డ ఆవేదన ఇదివరకే వివరించడం జరిగింది.

* కటకట (సీతా) రాముల కసుపుల పుడితి
ఏమై పుడితే ఏం సుఖపడితి
ఆడదానితో దెబ్బలు తింటి
ఆగసంటవోయీ అగ్గిలబడితి

ఈ ఆవేదన ప్రజలదే. వారి దృష్టిలో గోమాత సీతారాముల ప్రతీక (దైవం). అగ్గిలో పడడం ఎవరికైనా తప్పదని వారికీ తెలుసు. అది పరమ ప్రయోజనాన్ని సమకూర్చిపెడితే అంతకన్నా వారికింకే మానందముంటుంది.

* అరచేతి కింద
అరిసె లప్పచ్చి - అంతేకూడా పిడకే.

అయితే ఒక్క పిడకతో పాకశాల వంటలు పూర్తికావు. వందలు వేలు కావాలి. అందుకని ఇంటివెనుక పిడకల గూడునే నిర్మిస్తారు.

* మా ఇంటెనుక బత్తె
బత్తెకో బొత్తె (పిడకల గూడు)

* పందిరెత్తు బత్తకు
పక్కల సుడి ,,

* సక్కటాడదానికి ,,
పక్కల తూటు

బొత్తె, సుడి, తూటు ఈ మూడు కూడా ఒకే అర్థాన్ని విశదీకరిస్తున్నాయి. పిడకలమీద పిడకలు సంద్రంగా పేరుస్తారు. అది గూడులా ఉంటుంది ఆ గూడుకు చిక్కటి పేడనీళ్ళతో పూత పూస్తారు ఎక్కడో ఒకవైపున మాత్రం పిడకలు తీయడానికి అరచేతంత సందు విడిచిపెడతారు. ఆ సందుకే ఆ మూడు పేర్లు.

పొయ్యి ఉంది; పిడకలున్నాయి; ఇక కుండ కావాలి.

* కాళ్ళకింద నలిగితి
సేతులల్ల జారితి
అగ్గిల వడితి
మనిషింటి కెడితి
సెయ్యి జారితే-
పుట్టినింటకే పోతి (కుండ)

సంసారానికి కుండ ఒక్కటే సరిపోదు. కుండకు మూత కావాలి; గరిట కావాలి; మరేవేవో కావాలి.

* మూడు దమ్మీసలు
రెండు దిమ్మీసలు
ఓ నూకుడు కట్టె
ఓ గెల్కుడు కట్టె

మూడు దమ్మీసలు పొయిరాళ్లు; రెండు దిమ్మీసలు అన్నంకుండ; ఓ మారెసరు కుండ; ఓ నూకుడు కట్టె పొయిల కట్టె; ఓ గెల్కుడు కట్టె తెడ్డు. అన్నంకుండ మీది పాత్రే మారెసరు కుండ; రెండింటా ఎసరుంటుంది. అన్నంలో ఎసరు తక్కువైనప్పుడల్లా మారెసరుకుండలో కాగిన ఎసరును పోస్తుంటారు. అందు వల్ల అన్నం "కచ్చాపచ్చా" కాకుండా ఉంటుంది. ఇప్పటికీ కుండల్లోనే వండేవారు మారెసరు కుండ వాడుతూనే ఉన్నారు. వేడెక్కి పైకుండ పగలకుండా ఉండడానికి అందులోని ఎసరు తోడ్పడుతుంది. మారెసరు కుండ తప్పకుండా ఉంచడం ప్రజల దూర దృష్టికి చిహ్నం.

ఇక పొయ్యికింద 'ఒకే కట్టె' అనే అర్థంలో 'ఓ నూకుడు కట్టె' అనే మాటలుపయోగించడం కూడా సమంజసమే. పొట్టు (ఉనుక) పొయ్యిలో, పిడకల పొయ్యిలో ఓ కట్టె ఉంటే చాలు వంట అవుతుంది. ఎక్కువ కట్టెలుపయోగించా ల్సిన అవసరం లేదు.

* మూడు గుజ్జాలు - ఒకటే కోగిల
ఒగ రాజెక్కుతుంటె - ఒగ రాజు దిగె

మూడు గుర్జాలు పొయిరాళ్ళు; కోగిల పెనం: రాజెక్కడం దిగడం రొట్టెలు చేయడం. రొట్టెలు-అట్లు విడుపులుగా వచ్చే పొడుపుకథలెన్నో ఉన్నాయి.

* కాలేకాలే బండమీద
కట్టెద్దు పుట్టుబోసింది (పెనంమీద అట్లు)

* గట్టు తగలబడుతుంటే
గుడ్డలు ఎండేస్తారు "

* పట్టెమంచంమీద
వేసే పరుపు - తీసే పరుపు (రొట్టెలు)

ఇందులో కాలేకాలే బండ, గట్టు తగలబడడం, పట్టెమంచం ఇవన్నీ పెనానికి (పెంకుకు) ప్రతీకలే. కట్టెద్దు పుట్టు వోయడం, గుడ్డలు ఎండవేయడం, పరుపు వేయడం తీయడం అనేవి అట్లో-రొట్టెలో అవుతాయి. మూడు విడుపులున్న ఈ క్రింది పొడుపు చివరకూడ రొట్టె ఉంది.

* కింద ఎఱ్ఱగ
నడుమ నల్లగ
పైన తెల్లగ (అగ్గి, పెంకు, రొట్టె)

పాత్రల్ని గరిటెల్ని బొమ్మలనడం గమనార్హం.

* రెండు ఎక్కుడు బొమ్మలు
ఒకటి దిద్దుడు బొమ్మ (వంటపాత్ర, మూత, గరిటె)

ఇంతవరకు పరిశీలించిన ప్రహేళికల్లో ప్రజా జీవనంలో పొయ్యికున్న పాత్ర, కుండకూ పెంకుకూ ఉన్న ప్రాధాన్యం, దోశెలకూ రొట్టెలకూ ఉన్న ఆవశ్యకత తదితరాంశాలెన్నో కనిపించాయి. ఏదీ లేకున్నా కష్టమే. అందువల్ల తెడ్డూ గరిటెలుకూడా పొడుపుకథాకారుడు మరచిపోలేదు. ఇతిహాసపు చీకటికోణాలు కొందరి దృష్టికి రాకపోవచ్చుగాని సాంఘిక చరిత్రలో ప్రజల కవగతం కానివి లేవు. అందుకే పాకం సిద్ధంచేయడం, భోజనం సంసిద్ధం చేయడం తదితరాంశాల నెన్నిటినో పొడుపుకథ పొదుగుకొంది.

* గుడిచుట్టు నల్లన
గుడిలోన తెల్లన (అన్నంకుండ)

* గుడినిండా నీరుపోసి
గుడికి తాళమువేసి
లంక తగులబెట్టి
లంజ మొత్తుకుంది (అన్నం ఉడకడం)

అన్నం పరబ్రహ్మ స్వరూపమని నమ్మిన జాతే అన్నం కుండను గుడిగా భావిస్తుంది. కుండ మసిపట్టి నల్లగానే ఉంటుంది. కుండలోని అన్నంమాత్రం తెల్లగా ఉంటుంది. గుడినిండా నీరు పోయడం ఎసరు వేయడమే; తాళం వేయడం మూత పెట్టడమే, లంక తగలబెట్టడం పొయ్యి మండడమే. లంజ మొత్తుకోడం లోన కుతకుత ఉడకడమే. అన్నం సిద్ధమైం తర్వాత చేసేది భోజనమే. కూరల విషయం తరువాత ప్రస్తావించడం జరుగుతుంది.

* చెక్కమేడమీద కూర్చొని /పీట
పింగాణి మేడలో పళ్లెం
రత్నాల కుప్పలో అన్నం
అయిదుగురు కన్యలు
నాట్యమాడుతుంటే చూస్తున్నాడు. (వేళ్లు)

చెక్కమేడమీద కూచోడం పీటపై ఉండడం, పింగాణి మేడ పళ్లెం, రత్నాలకుప్ప అన్నం, అయిదుగురు కన్యలు వ్రేళ్లు, నాట్యమాడడం అన్నం కలుపడం, ఆ తర్వాత తినడం. చదువూ శాస్త్రం తెలియని జానపదుని భావనలు, ప్రయోగించిన ప్రతీకలు అపురూపంగా ఉన్నాయి; అనుభవాల మాటలు విప్పి నట్లున్నాయి

**2-2 : ఖాద్యపదార్థాలు :** అన్నమూ రొట్టెలే గాక కూరగాయలు తదితర ఖాద్యపదార్థాల్నికూడా ప్రహేళికలు సంభావించాయి. ప్రజలదృష్టి పడ్డ

వస్తువు ప్రహేళికల కెక్కింది. వారు ముట్టని వస్తువు లేదు, వారు మనసుపెట్టని వస్తువు లేదు.

* పైస పెట్టి కొనాలె
ముందల పెట్టి ఏడ్వాలె (ఉల్లిగడ్డ)

* గింతంత పొట్టోనికి
పుట్టెడం గీలు ,,

* పనిముండ
ఎన్ని కోకలైనా విప్పుతుంది ,,

* గుప్పెడు పిసిక్కి
ఒంటినిండా గుడ్డలే ,,

ఉల్లి అందరికీ అందుబాటులో ఉన్నదే. ఉల్లికున్న పొరలనే పుట్టెడంగీలని, కోకలు విప్పడమనీ, ఒంటనిండా గుడ్డలే అని ప్రజలంటున్నారు. నిజానికది చిన్నదే, పొట్టిదే, గుప్పెడంత ఉన్న పిచ్చుకే. అది కోసేవారి కళ్లల్లో నీళ్ళు తిరుగుతాయి. ముందుంచుకొని ఏడ్వడమంటే అదే. ఘాటుమోతాదు మించితే పంచలు తడుస్తాయి; చీరకొంగులు తుడుస్తాయి.

* నూతిలో పామూ - నున్నని పామూ
పొడల పొడల పామూ పొట్టి పొడుగు పామూ
వాడవాడల పామూ - వాలైన పామూ
చారచారల పామూ - చక్కన్ని పామూ
పామును పట్టి కూరాచేస్తే పంటకిందకే రాదు (పొట్లకాయ)

పందిరికి వ్రేలాడే పొట్లకాయ అచ్చంగా పాములాగే ఉంటుంది. పందిరి క్రింది భాగంలో ఆకుల నడుమ వ్రేలాడుతున్నప్పుడది పామే అనిపిస్తుంది. పొట్టిగా, పొడుగ్గా, నున్నగా, పొడలు పొడలుగా, వాలుగా, చారలు చారలుగా....

ఇలా ఎన్ని విశేషణాలని ఆ పొట్లకాయకు. అవును మరి! కంటికింపయినవే ఒంటికింపితమవుతుంది.

* ఈః పొట్టోడికి ఒంటినిండా గజ్జి
కాని అతడంటే అందరిష్టపడతారు (కాకరకాయ)

అందరి సంగతి దేవుడెరుగు గాని కొందరికి కాకరకాయ అంటే బలే ఇష్టం. ఇక కాయగాని కాయ ఆవకాయ. ఆంధ్రులు ఆవకాయకు పెట్టింది పేరు. అందుకే అది పొడుపుకథల్లోకి కూడా వచ్చింది.

* ఒక కాయంటే
తెలుగువాళ్లకు బలే ఇష్టం
కాయ ఎఱ్ఱగా ఉంటుంది
కాని అది చెట్టుకు కాయదు (ఆవకాయ)

'ఆవ'తో ఏ కాయగూరనైనా ఊరగాయగా పెడతారు. కాయగూరకు పస గూర్చేది ఆవ. మామిడి ఊరగాయకే ఆవగాయ అనే పదం రూఢిపడింది. అయితే ఆవ ఎందులో వేసినా అది అవగాయే అవుతుంది. కాని మామిడి ఆవే ఆవ గాయ ... మరో రెండు తినే పదార్థాల్ని పరిశీలిద్దాం.

* మూడు అక్షరాల మాట
అందరూ ఆ మూడు అక్షరాల్ని తింటారు
కాని కొందరు ఆ మూడు అక్షరాలలోని
చివరి రెండు అక్షరాలనే తింటారు-ఏమిటి! (పకోడి-కోడి)

చిలకమర్తివారి పకోడి పద్యాలు విన్నపిదప ఎవరో ఆధునికులు కట్టిన పొడుపుకథ ఇది. శాకాహారుల్ని, మాంసాహారుల్ని దృష్టిలో పెట్టుకొని విడుపులోని ఆద్యక్షరానికి లోపం కలిగించి, చ్యుతాక్షరి విడుపులో చూపించి ప్రశ్నించిన తీరు కారణంగా ఏర్పడిందీ పొడుపుకథ.

* అంగట్లో బుద్దోడు
సెంగ సెంగెగిరె (పేలాలు)

అంగడి పెనం. పెనం వేడెక్కిన తర్వాత అందులోని జొన్నలు చెంగు చెంగున ఎగురుతాయి. అందులో కొన్ని పేలాలుగా మారుతాయి.

* మొదట చప్పన
నడుమ పుల్లన
కొస కమ్మన (పాలు, పెరుగు, నెయ్యి)

పాలది మంచి రుచే; అందులో మంచి పాలది మరీ మంచి రుచి; చప్పన మాట చెప్పేవరకు చప్పన అని వచ్చింది. ఈ పొడుపుకథాకారునికి పాలు చప్పన స్ఫురించినట్టే పెరుగు పుల్లన అనిపించింది. మీగడలేని పెరుగు, తోడు ఎక్కువగా పడ్డ పెరుగు, ఉష్ణ ప్రదేశంలో ఉన్న పెరుగు పుల్లగానే ఉంటుంది. నెయ్యి 'రుచి'కి మాత్రం కమ్మన అనే మాటకన్నా మరోటి లభించదేమో! సార్థక విశేషణాలు-అనుభవసారాలు.

* దోసెడు నీళ్ళలో
దొరసాని జలకమాడుతుంది. (వెన్నముద్ద)

చల్ల చిలకడం, వెన్నదీయడం ఈనాటి మాటగాదు; తరతరాలుగా జరుగుతున్నదే. సాధారణంగా "అమ్మే" వెన్నదీస్తుంది. ఆమె ఆ ఇంటి యజమాని. ఇంటిలో ఎంతమంది ఉన్నారో లెక్కగట్టుకొని వెన్నముద్దలు చేసి నీళ్ళున్న చిప్పలో వేస్తుంది. ఆ చిప్పలో ఆ ముద్దలున్నప్పుడు దోసెడు నీళ్ళల్లో దొరసాని జలకమాడుతున్నట్లే ఉంటుందిట. నాన్యతోదర్శనీయమైన నగ్న దృశ్యాన్ని చిప్పెడు నీళ్ళల్లో చూడ్డం మామూలు మాటగాదు.

* ఏ రాయి లేకున్నా (వద్దన్నా)
ఆ రాయి కావాలి

—అనేది ఈనాడో సామెతగా పరిణమించి, "అన్నేసి చూడు"అంటోంది. "కల్లులో ఎకల్లెక్కువ" అని ప్రశ్నిస్తుంది. ఉప్పు, 'ఉప్పురాయి'. ఉప్పుగల్లు లేక పోతే బతికేదెలా అన్నంతవరకు వెళ్లింది ఆలోచన. అందుకే ఆ ఉప్పుమీద ఈ మూడేకాదు మరెన్నో పుట్టినై.

* రాదారిపట్నం కట్టకముందు
  లక్ష్మీదేవి పుట్టకముందు
  ఆకులేని పంట పండుతుంది (ఉప్పు)

* రాముడు సీత పుట్టకముందు
  లంకల దీపం పెట్టకముందు
  నేను పుట్టాను

* ఆకులేని చెట్టు
  అరవై పుట్లు పండె

మోసంచేసిన వాణ్ని "నీకు ఊరిలో ఉప్పుగల్లుకూడా పుట్టదురా" అని శపిస్తారు పెద్దలు. "ఉప్పుతిన్నవాడు ఊరిపోతాడు, పప్పుతిన్నవాడు పారిపోతాడు" అని ఆటలాడేప్పుడు పిల్లలనుకొంటారు. "ఉప్పన పట్టైలాడునెడ ఉప్పులు దెత్తురు గాక" అని ప్రాచీనకాలంలో ప్రభువులు పరాక్రమాల్ని ప్రదర్శించేవారు. ఇప్పటికీ బాలబాలికలు "ఉప్పుగెట్టి"ల్ని ఆడుతూనే ఉన్నారు. జాతీయోద్యమం నిలదొక్కుకోడానికి మనదేశంలో ఉప్పు సత్యాగ్రహమే పుట్టింది. ఇప్పటికీ సముద్ర సామీప్య ప్రదేశాల్లో ఉప్పు ఊరుతూనే ఉంది; మనిషిని ఊరిస్తూనే ఉంది. అంతటి ప్రాధాన్యాన్ని సంతరించుకొన్న ఉప్పు స్పృశించని చోటంటూ లేదు.

**2-3 : పారిశుధ్యం :** గృహం ఉండాలి; ఉండవలసిన విధంగా ఉండాలి. ఈ విషయంలో అందరూ పాటించాల్సిన నియమాలున్నా బాధ్యతంతా గృహిణిదే. అందుకే "ఇంటిని చూచి ఇల్లాలిని చూడు" అనే సామెత పుట్టింది. గృహజీవన సౌఖ్యానికెన్నో చేయాలి. దుమ్ము దులపాలి; ఊడ్వాలి; అలకాలి; అలంకరించాలి.

* నూర్గురన్నదమ్ముల
కొకటే మొలతాడు (చీపురు-తాడు)

చీపురు పుల్లలే నూర్గురన్నదమ్ములు. దుమ్ము దులపాలన్నా, ఒత్తా చెదారం పారద్రోలాలన్నా ఈ పుల్లలన్నీ కలిసి ఉండాలి. అలా కలిపికట్టే తాడునే మొలతాడని సంకేతించడం జరిగింది. ఇందులోని ఏకత- సందేశం కవో తాల కథను, నాలుగెద్దులూ పులి కథను, నల్గురన్నదమ్ముల కథను గుర్తుకుతెస్తుంది. పారిశుద్ధ్య ప్రబోధంతోపాటు సమైక్య సందేశం.

ఈనాడు నగరాల్లోను, గ్రామాల్లోని కొన్ని గృహాల్లోను, గృహ ప్రాంగణాల్లోను షాబాదు బండలు వేయిస్తున్నారు; సిమెంట్‌తో నున్నగా చేయిస్తున్నారు, అందువల్ల అలుకు కుండల-పిడుచల అవసరం కనుమరుగైంది. అయినా మట్టినేల ఉన్న ఇళ్లల్లో వారం వారం ఇవి దర్శనమిస్తూనే ఉన్నాయి.

* ఇల్లంతా తిరిగి
ఇంటెనుకకు వాయె (అలుకు పిడచ)

* ఇంటిసుట్టు తిరిగి
ఇంట్ల కూసునె (అలుకు కుండ)

* పిల్లను పిసికితె
ఇల్లంతా రక్తము (అలుకు పిడచ)

అలుకు కుండలో ఉండేది అలుకు పిడచ. అది గట్టి బట్ట; ఆ కుండలోకి పోయినందువల్ల పిడచ అయింది. అలుకు కుండలో పేడ, ఎఱ్ఱమన్ను నీళ్ళు ఎప్పుడూ ఉంచుతారు. బట్టను మాత్రం అలికినంతసేపే అందులో ఉంచుతారు. అలుకు కుండ ఇంట్లోకూడా ఉండవచ్చు; పిడచ మాత్రం ఇంటివెనుకనే ఉంటుంది. ఒక్కోసారి కుండపైన్నే ఉంటుంది. ఇంటిలో వారంవారం అలుకు కుండ, అలుకు పిడచ ఎంత అవసరమో ఇంటిచుట్టుకూడా అంతే అవసరం. ఇంటిచుట్టూరా గోడకు ఓ అడుగు, గోడవగ్గర నేలకు ఓ అడుగు స్థలం అలుకుతారు. ఇంటిచుట్టు

తిరిగిన కుండ మళ్ళీ ఇంటిలోకే వస్తుంది. ఇక ఎఱ్ఱమన్ను కలిగిన పేడనీళ్ళు ఎరుపుగానే ఉంటాయని గ్రహించాలి. అందుకే పిల్లను పిసికితె ఇల్లంతా రక్తం అనడం. ఇక్కడ పిల్లపిడచ; ఎఱ్ఱమంటి నీళ్ళు రక్తం. అందుకే ఇల్లంతా రక్త మని ప్రయోగించడం జరిగింది. ఇక ప్రాంగణం ఎప్పుడూ పరిశుభ్రంగా ఉండ డానికి చాన్పి చల్లుతారు. ఆ పొడుపుకథ ఇది.

* బుడుగు బుడుగులాడె
బుడ్డాటలాడె
మద్యాన్నపు యాళకు
మాయమైపాయె (చాన్పి, చాన్పు)

పేడనీళ్ల చల్లేప్పుడు చెంబును మాటిమాటికి గోళెంలో ముంచాల్సి వస్తుంది. లప్పుడు బుడుగు బుడుగు అనే ధ్వని వస్తుంది. చల్లిన చాన్పి కొంత సేపటికి ఆరిపోతుంది.

* దాని కుట్టు బొమ్మకుట్టు[1]
దాని భోగము రాజ భోగము
దాని పాలు పెంటపాలు (విస్తరాకు)

గృహాని కతిథులు వస్తారు; వారికి సాధారణంగా విస్తరాకుల్లోనే వడ్డి స్తారు. ఆ విస్తరెంత చక్కగా కుట్టినా, అదెన్ని భోగాలు పొందినా చివరకు పెంటకే వెళ్ళుతుంది. డిబ్బికుట్టు, గొలుసు కుట్టు, డబుల్ కుట్టు, మ్యాట్నికుట్టు, పోసువెట్టు ఇవన్నీ కుట్ల రకాలే; చేతితో చేసే పనులే. ఏ కొద్దిపాటి కుట్టు నేర్చిన వారికైనా వీటితో పరిచయముంటుంది. కుట్లల్లో బొమ్మకమ్మి అనేదొకటి. గట్టివస్త్రం ఓ చోట పలచబడిపోతుంది; లేదా కొద్దిగా చిరుగుతుంది; ఆ పలచదనం పోవాలన్నా ఆ చిరుగును మూసివేయాలన్నా ఏదో ఒకటి కుట్టాలి. మామూలు కుట్లవల్ల బట్ట ముడతలుపడి నున్నదనం కోల్పోతుంది. అందుకే ఆ బట్టకు బొమ్మకమ్మి పెడ తారు. బట్టను పలచబడ్డ చోటకు నిలువుగా చీరుతారు. చీరిన రెండు పార్శ్వాల్లో

---

1. డిబ్బికుట్టు, డబుల్ కుట్టు

ఆ కొననుండి ఈ కొనవు, ఈ కొననుండి ఆ కొనవు కొంతమేరకు కత్తిరిస్తారు. అ తర్వాత రెండు ముక్కల్ని కలిపి కుడతారు. దీన్నే బొమ్మకమ్మి అంటారు. విస్తరాకులు కుట్టినప్పుడు ఆకు వెంబడి ఆకు పెట్టి కుడుతూ వర్తులాకారంగా వచ్చేట్టు చేస్తారు. ఇది బొమ్మకమ్మి పద్ధతే. బొమ్మఅంటే ఏర్పడ్డ బిరుగు. అది కమ్మికొనిపోయేట్టు కుట్టడంవల్ల దీనికీపేరు వచ్చింది. ఇక గృహ పరికరాల్ని పొదుగుకొన్న కొన్ని పొడుపుకథల్ని పరిశీలిద్దాం.

**2-4 : పరికరాలు :** గృహ జీవన సౌఖ్యానికెన్నో, సాధనాలు కావాలి. 'గొంగడున్నంతలో కాళ్ళు వారజాపుకొనే తృప్తి మంచిది. లేకపోతే ఆశ కంతుం డదు. సుఖశాంతులు అందకుండా ఆమడదూరం పోతాయి. సూది, దారం, ఉట్టి, జల్లెడ, జల్లిగంటె, తిరుగలి అద్దం, కవ్వం, కవిచిప్ప, చాప- ఇవన్నీ ప్రతి ఇంటిలో ఉండేవే-ఉండవలసినవే ప్రజల కంటిలో బడ్డది ప్రహేళిక ఒంటిరో పడ్డట్టె.

* ఒక్కొక్కడుగు పోయిన కొలది.
తోక కొంచెం తగ్గుతుంది
దీని పేరేమి ? (సూది దారం)

సూదికి దారముంది; దారం కొన తోక; కుడుతున్న కొద్ది తోక తగ్గు తుంది. పిల్లవాడికి చడ్డీ చిరిగినా, పిల్లదాని పరికిణీ పికిలినా సూదీదారం తప్పనిసరి.

* మబ్బుటింట్లో జడల దయ్యం (ఉట్టి)

* ఉట్టికి నిన్ను కట్టేను (సూది)

పాలూ, పెరుగూ, వెన్నా, నెయ్యి పిల్లలకూ అందకుండా భద్రపరచే ప్రదేశం ఉట్టి. అది చీకటింట్లో జడలు విరియబోసుకొని ఇంటి దూలానికి తల క్రిందుగ వ్రేలాడిన దయ్యంలాగ ఉంటుంది. భయం కలిగించాలనే ఉద్దేశంతో దయ్యమని ఉంటారు. ఆదీగాక చీకటింట్లో ఉట్టిని తగలకూడదని భయపెడుతూ ఉంటారు. నిజానికది దయ్యంకాదు; దానివల్ల భయంలేదు. పొరపాటున ఉట్టికెవ

రైనా తాకితే అందులో ఉన్నది బోర్లా పడుతుంది. "కుండలుండకుండా కుక్క-తినకుండా" అవుతుంది, రక్షించుకోడానికి ఓ సాకు దయ్యం; అంతే?

అలాంటె ఉట్టికి ఎవరి తల తాకదు. అందుకే సూదులు ఉట్టి చేరులకు కుచ్చి భద్రపరుస్తారు. అన్ని పరికరాలు భద్రంగా ఉన్నప్పుడే సంసారం సాఫీగా సాగుతుంది.

* జానెడు ముండకు
ఒళ్ళంతా కళ్ళు (జల్లెడ)

దేహంనిండా కళ్ళు దేవేంద్రునికున్నాయి; ఈ జల్లెడకూ ఉన్నాయి. కాని ఇది జానెడు ముండ, చిన్నది. పిండి పట్టే జల్లెడ, ధాన్యం చేసే జల్లెడ.

* బాయిల ఈత గొడ్తుంటే
దొంగోడొచ్చి లేపుకపాయె (జల్లిగంటె)

'పండుగనాడుకూడా....' అనే మాట పడకుండా పిల్లలకూ పెద్దలకూ గారెలో బూరెలో కర్జలో మురుకులో చేసి పెట్టాలి. పొయ్యిమీద బాండి[1] పెట్టాలి; కింద నిప్పు పెట్టాలి; బాండిలో నూనె పోయాలి. పిండి పదార్థం వేసి కలె గలపాలి(దేవాలి). మంటపల్ల వేడెక్కిన నూనెలో అవి కుతకుత ఉడుకుతాయి. ఈ ఉడకడమే ఈత గొట్టడం. అలాగే చాలాసేపు ఈతగొడితే అవి మాడి బొగ్గులవు తాయి. దోరగా వేగిన తర్వాత వాటిని జల్లిగంటెతో తీసివేస్తారు. ఆ తీసివేయ డమే లేపుకొని పోవడం.

* రథము తిరుగుతుండ
పూవులు రాలినవి (విసుర్రాయి. పిండి)

* మా ఇంటిలోకి ఇద్దరు భోగంవాళ్లు వచ్చారు
ఒకతె ఆడుతుంది-ఇంకొకతె ఆడదు (తిరగలి)

ఈనాడు పిండి గిర్నీలెన్ని వచ్చినా గ్రామాల్లో తిరగలి లేని ఇల్లులేదు. పప్పుకూ. బరపటకు (జొన్న రవ్వకు) పిండికీ విసుర్రాయి తప్పకుండా కావాలి.

1. మూకుడు, కడై

రథం తిరుగుతుంటే పూలు రాలినాయనడం వెనుక ఓ పవిత్ర భావన ఉంది. ఆడే భోగం మనిషి పైరాయి; ఆడని భోగం మనిషి క్రింది రాయి.

* సుందరి ముఖము
ఆందరు సూసిరి (అద్దం)

అద్దమే సుందరి కాదు; ఎవరి ముఖం వారికి సుందరమే.

* అడవిలో పుట్టింది
ఆడవిలో పెరిగింది
మాయింటికొచ్చింది
తైతక్కలాడింది (కవ్వం)

యంత్రయుగం ముదిరింది. పల్లెలు పాలు అమ్ముకొంటున్నాయి. పెరుగు తగ్గింది. కవ్వాలు మూలకు పడ్డాయి. అదీగాక చల్ల చిలికే యంత్రాలు వచ్చినై. కవ్వాలు అవ్వలెవ్వరో అక్కడక్కడ మాత్రమే ఆడిస్తున్నారు. అవ్వ, అమ్మ, అక్క, అయ్య ఎవ్వరు చిలికినా కడవలో కవ్వం తైతక్కలాడుతుంది; శివాలూగుతుంది. ఈ తైతక్కలూ ఈ శివాలూ గృహిణుల హస్తలాఘవాలే.

* ఇనుమూ ఇత్తడి కలవంది
ఇంట్ల సంసారం జేసె (కవిచిప్ప)

వంట పాత్రల కంటు ఉంటుంది; అది తొలగించేప్పుడు చేతులు గీరుకు పోతాయి; గోళ్ళు విరిగిపోతాయి. అందువల్ల కవిచిప్ప (కపిశ్చ, కపిశ్య, కప్ప చిప్ప)లనుపయోగిస్తారు. గోకెంలో అడుగుకు పట్టిన పాకరను తొలగించడానికి కూడా వీటినే ఉపయోగిస్తారు. ఇనుమూ ఇత్తడీ కలవనిదే అయినా ఇది గట్టిగా ఉంటుంది. బావుల్లో, చెరువుల్లో, నదుల్లో అట్టడుగున ఇవి లభిస్తాయి. వీటిలో ఓ జాతి కప్పలుంటాయి. వీటిని ఎండబెడతారు; అప్పుడు కవిచిప్ప విచ్చుకపోతుంది; కప్ప చచ్చిపోతుంది. ఆ తర్వాత కవిచిప్పల నుడికిస్తారు; గట్టిగా తయారుచేస్తారు.

* సాచుకొని సాపెట్లో పండుకొనే అమ్మ
ముడుచుకొని మూలకు నిలుచుకొనె (చాప)

పూలు అల్లినా, పుస్తెలు కుచ్చినా, పుస్తకాల పుటలు తిప్పినా, ఇరుగు పొరుగు పొలతులందరూ ముద్దుముచ్చట్లలో మునిగినా చాపటిలో చాప పరవాల్సిందే! దానిపై కూచోవాల్సిందే! గంటలు గడపాల్సిందే! అన్నీ ముగిశాక దానిని మూలకు నిలబెట్టాల్సిందే! అవసరమున్నప్పుడు చాచుకోడం, అవసరం లేనప్పుడు ముడుచుకోడం ఎంత వారికైనా తప్పని విషయమే

గృహ జీవనానికుపకరించే ఉపకరణాలనిలా ఇంకా ఎన్నో ఉదాహరించవచ్చు. చివరగా అనుబంధాలనే అంశం క్రింద కొన్ని బంధాల్ని, సంబంధాల్ని మాత్రం ప్రస్తావిస్తా.

**2-5 : అనుబంధాలు :** ప్రపంచమంతా బాంధవ్య సూత్రంలో బంధితమై ఉంది. అయినా ఎవరి హద్దులు వారికున్నాయి; ఎవరి ఆత్మాభిమానం వారికుంది; దురభిమానం కూడా తక్కువేంలేదు. అందువల్ల కలతలూ-కలహాలూ కోకొల్లలుగా పుట్టుకొస్తున్నాయి. గృహం కూడా వీటన్నిటికి అతీతమైందేమీ కాదు. అయినా నేటికీ గృహసీమే స్వర్గసీమగా నిరూపితమైంది. మనశ్శాంతికి గృహమే ఆధారం. కుటుంబంలో సంపాదించేవాడొకడే అయినా అనుభవం మాత్రం అందరిది. నా సంపాదన నేనే తింటాననే స్వార్థానికిక్కడ తావులేదు ఆ స్వార్థమే ప్రవేశిస్తే ఆ యిల్లు రెండు ముక్కలవుతుంది. ఇవన్నీ సాహిత్యంలో ప్రకటితమవుతాయి; తెలుగు పొడుపుకథల్లోనూ ఇవి చోటు చేసుకొన్నాయి.

గణితశాస్త్రం తెలిసిన కరణంగారి కౌటుంబిక ప్రేమను ఈ క్రింది పొడుపు పద్యం ప్రకటిస్తోంది ఇది తెలుగునాట బహుళ ప్రచారంలో ఉన్న పద్యం.

* ఖర్జూర ఫలములు గణికుండు కొనితెచ్చి
సగపాలు మోహంపు సతికి నిచ్చె
నందు నాలవపాలు ననుగుతమ్మునికిచ్చె
నష్టభాగంబిచ్చె నతని సతికి
తగఁదొమ్మిదవపాలు తనయునకిచ్చెను
దనచేత నాల్గున్న తల్లికిచ్చె

మొదటఁ దెచ్చినవెన్ని మోహంపు సతికెన్ని
భ్రాతకెన్ని వాని భార్యకెన్ని
తనయు కెన్నియిచ్చెఁ, దడయక తల్లికి
నాలుగెట్టులాయె, నయముతోడ
గణిత మెఱిగినట్టి కరణాలఁ బిలిపించి
యడుగవలయు దేవ యవసరముగ[1]

గణితం తెలిసిన కరణాలే కనుగొనాలి. మొత్తం ఖర్జూర పండ్లు 288, తనభార్యకిచ్చిన సగం 144, తమ్మునికిచ్చిన నాల్గవ భాగం 72, అతనిభార్య అష్టభాగం 36, తనయునికిచ్చిన తొమ్మిదవ పాలు 32, తల్లికిచ్చిన మిగిలిన పండ్లు 4. తల్లికిచ్చిన నాల్గుపండ్లు ఆధారంగా స్వీకరించి సులభంగా దీన్ని విప్పాలి. లెక్క సంగతి ఎట్లున్నా తన సంపాదన ఆత్మీయతతో అందరికీ పంచిన ఆ గృహ యజమానిని ప్రశంసించాలి. గృహజీవనంలోని ఈ అనుబంధాలే గృహ సీమను స్వర్గసీమగా మారుస్తాయి.

* మీ నాయన కాలెత్త
మీయమ్మ చేయెత్త

ఇది గృహ జీవనమేనా! కలహాల కాపురమా! అనిపిస్తుంది. అయితే ఈ పొడుపుకథలో స్త్రీ పురుషుల వస్త్రధారణ విశేషాలున్నాయి. దీనికి విడుపు పంచకట్టుకోడం, రవిక తొడుక్కోడం. పురుషులు పంచ కట్టుకొనేప్పుడు గోచీ చెరగును కాలెత్తి క్రిందినుంచి మళ్ళిస్తారు. స్త్రీలు రవిక తొడిగేప్పుడు ఒక చేయి సాధారణంగానే తొడిగినా, రెండోచేయి తొడిగినప్పుడు తప్పనిసరిగా చేయి ఎత్తాల్సి వస్తుంది. పొడుపులో కనిపించిన కలహాల కాపురం విడుపులో మాయమైంది.

* నాయన నూకితే
అమ్మ కడిగె ఏంది! (తలె)

1. పెద్దబాలశిక్ష, పు : 93.

పొడుపు విన్నవెంటనే శృంగారం వాచ్యమైందనిపిస్తుంది; అశ్లీలంకూడా ఉందేమో లనిపిస్తుంది. పురుషుడు గబగబ తిని వెంటనే పనికి వెళ్ళడం పరిపాటే. తినడంవల్ల తలె (పళ్లెం) అంటవుతుంది. దాను శుభ్రంచేసి వెళ్ళవచ్చు. కాని అవతల పని ఉంది. అందువల్ల పళ్లెం కడుగకుండానే వెళ్లిపోతుంటాడు. పళ్లెం, చెంబు, గ్లాసు శుభ్రం చేయడం భార్యల పని అయ్యింది. ఎవరిపళ్లెం ఎవరు కడిగినా కుటుంబాల్లో దాన్నేం న్యూనతగా భావించరు. ఆ పనులన్నీ సహజంగా జరిగిపోతూనే ఉంటాయి.

ఇక్కడ నాయన అన్నం కడుపులోకి నూకీనాడనే అర్థంకూడా వస్తుంది. ఎది ఏమైనా, అంటైన పళ్లాన్ని అమ్మ కడుగక తప్పదు. ఆలుమగల అను బంధాల్లో ఉచ్చనీచాల తారతమ్యాలుండవు. అయినా అప్పుడప్పుడు 'నాతిచరామి' అనే ధర్మాన్ని దాటే స్త్రీలున్నారు; పురుషులున్నారు. తనభార్య స్వేచ్ఛా విహారానికి కనలిన మగని నోట వచ్చిందే ఈ పాట.

* పోతావు చంద్రకాంత
పోలీసు మిండానెంట
నిట్టాలు తొక్కుకుంటా !
నీడాలు సూసుకుంటా !

లేమిని వదలి లేచిపోయింది భార్య. భర్త ఆక్రోశం అవహేళనా రూప గేయఖండంగా అవతరించింది. అవును మరి! సామాజిక నియమాలు శిథిలమైనప్పుడు ఆవిర్భవించిన అశాంతి, ఉద్యమాలు సృష్టిస్తుంది; విప్లవాలకు ఊపిరులూదుతుంది. అయితే జారుతు పాటున్నా జాణతనంలో కమ్మిపుచ్చుకొనేవారూ ప్రపంచకంలో ఉన్నారు.

* వస్తావు పోతావు - నా కొరకూ
వచ్చి కూకున్నాడు - నీ కొరకూ
వస్తేని వస్తావు - నా కొరకూ
వచ్చిన తోవను పొమ్మా - నీ కొరకూ !

ప్రియుడు ఇంటివెనక్కి వచ్చాడు. అది ఆమె సంకేతమే. కాని అదే సమయానికి సంతకు వెళ్ళిన భర్త కూడా వచ్చాడు. భర్తకు అన్నం పెట్టింది; దాక్కొన్న ప్రియుని కర్థమయ్యేలా గట్టిగానే పై పొడుపు కథ పొడిచింది. అర్థం చేసుకొన్న ఆ ప్రియుడు వెళ్లిపోయాడు. అది విప్పాలన్న భర్తను చూసి ఆమె పకపక నవ్వింది.

నిజానికీ పొడుపు కతను ఓ ఎఱ్ఱన్న (వానపాము) చేపతో అంటున్నది. "నీవేమో నా కొరకు వచ్చి పోతావు; నీకొతకేమో చేపలవాడు వచ్చికూచున్నాడు నేను వస్తే నా కొరకు నీవు వస్తావు; నీ ప్రాణం దక్కించుకోవాలంటే, నీకొరకు నీవు జీవించాలంటే వచ్చిన తోవనవెళ్ళిపో." భార్య విప్పి చెప్పాక భర్త ఐహూథా ప్రశంసించాడు,

గృహజీవన ప్రతిబింబాలైన ప్రహేళికల్లో ఇంకా వావి వరుస లున్నాయి; వస్త్రాభరణ్యలంకరణలున్నాయి. పెంపుడు జంతువుల వర్ణనలున్నాయి. ఇరుగు పొరుగుల అచ్చట్లు ముచ్చట్లున్నాయి. గృహంలోని ప్రత్యంగాన్ని పొడుగు కొన్న పొడుపు కథలెన్నో ఉన్నాయి. అలాంటి వాటిలో కొన్ని సంప్రదాయాల్ని ప్రతిబింబిస్తున్నాయి.

## 5-3 : సంప్రదాయాలు

గతానికి చరిత్ర ఉంది. వర్తమానానికి నిలకడ లేదు. భవిష్యత్తు అగమ్యగోచరం. అందువల్ల సంప్రదాయం ఎప్పుడైనా అది గతానికి చెందిందే. ఆ గతంలో కూడా ఏదిమంచో అదే సంప్రదాయం. సంప్రదాయానికి నిర్వచన మన్నట్టుగా ఓ కవితలో "లంత కడివెడు పాలపై ఒక్కింత మీగడ పేరినట్టుగ, మనకు మిగులును గతములోపలి మంచి; అదియే సంప్రదాయము" అంటారు ఆచార్య సి. నారాయణ రెడ్డి. కాల మహా ప్రవాహాన్ని తట్టుకొని చెడు ఎప్పుడూ నిలువదు. చెడే నిలిచే పక్షంలో మనిషి ఉన్నచోటు నుండి దిగజారి పోతాడేగాని ఉన్నత పథాలవైపు అడుగులు వేయలేడు. మత ధార్మిక సాంస్కృతిక సంబం ధలైన భారతీయ సంప్రదాయాలు ఏ ఒక్కవ్యక్తో ఏ ఒక్క గ్రంథమో నిర్ణయించి ఆదేశించినవి కావు. విశాల మేధా సంపత్తితో ఈ సమాజం ఆమోద ముద్ర

వేస్తాం తర్వాత ఈ సంప్రదాయాలు విదేశీ పరతంత్ర ఝంఝామారుతాల ధాటికి తట్టుకొని ప్రెక్కుచెదరకుండా హిమాలయాల్లా నిలిచి పోయాయి. నాటి త్రిమతాచార్యుల నుండి నేటి దయానంద, వివేకానంద, అరవిందాది మహర్షులందరు గతం లోని మంచినే ఎత్తి చూపించారు. అందుకే సంప్రదాయం తాత ముత్తాతల నాటి ధనంగా మిగిలింది. తెలుగు పొడుపు కథలీ సంప్రదాయాల్ని పొదుగుకొన్నాయి. అవి ఆరోగ్య విధులుగా, ఆచార విధులుగా,లంకారాలుగా కనిపిస్తున్నాయి.

**3-1 : ఆరోగ్య విధులు** :— ఆరోగ్యమే మహాభాగ్యమనే మాట సార్థకం. ఆరోగ్యం కాపాడుకోవాలంటే బతుకులో నియతి ఆవసరం. కఠినంగా నియమాల్ని పొడుపు కథలు నిర్దేశించక పోయినా ఆరోగ్య విధుల్ని మాత్రం సూచిస్తున్నాయి.

* వేసింది ఏమిరా - తీసింది ఏమిరా
వ్రేలుబెట్టి వాసన చూసింది ఏమిరా
వేసింది సానరా - తీసింది చెక్కరా
వ్రేలు బెట్టి వాసన - చూసింది శ్రీగంధం.

పేరంటాలు, వివాహాలు జరిగేప్పుడు మంది ఎక్కువగా కలుస్తారు. వాతావరణం వేడెక్కుతుంది. ధ్వని - జలవాయు కాలుష్యాలు ఎర్పడతాయి. అందుకే మన పూర్వీకులు కొంత జాగ్రత్త పడ్డారు. ఇది అసలే ఉష్ణదేశం. చలువ గావాలి; పరిమళాల పంటలు పండాలి. అందుకే స్నానపీట వేయిస్తారు; శ్రీగంధం చెక్కతో గంధం తీయిస్తారు. వచ్చిన వారికందరికీ పూయిస్తారు. ఇప్పుడీ సంప్రదాయం కేవలం స్త్రీలకే పరిమితమై పోయింది. చిక్కని శ్రీ గంధానికి శరీరంలోని అధికోష్ణాన్ని గ్రహించే శక్తి ఉంటుంది. అందువల్లనే ఇది ఆరోగ్య దృష్టితో ప్రవేశపెట్టిన సంప్రదాయమనడం. మరి ఇది పేదల కందదనో, పెద్దలకే పరిమితమని భావించడం వల్లనో ఈ క్రింది పొడుపు గేయం నిర్మితమైంది

* అడవిలో పుట్టింది — అడవిలో పెరిగింది
పాడు పాములు వచ్చి పైనబడ్డాయి
రాజింటికొచ్చింది రాజుపైకెక్కింది

పెంటలో నీళ్లన్నీ పెప లాగిపోయింది
చప్పితే నీ నోరు గప్పుమంటుంది
తప్పిలే నీ నోరు చప్పపంటుంది. (గంధపు చెక్క)

* మలన పుట్టి మలన పెరిగి
మలపాకుల కెడవాసి
ఎల్లారెడ్డి ఇంటి కాడ
పుల్లారెడ్డి బిడ్డ పెండ్లికాద
సగమయ్యో స్తివోయి సాయిరెడ్డి (గంధపు చెక్క)

గంధం చెక్కను పెండ్లి సందర్భంలోనే ఉపయోగించినట్లు పై పొడుపు కథ తెలుపుతోంది. ఆ చెక్క పదిమంది సంతృప్తి నిమిత్తం సగమవుతుంది; సొంతం కరిగిపోతుంది.

* వైశాఖ మాసంలో వదలిపోతాడూ
మాఘమాసంలోనూ మళ్ళీ వస్తాడూ
వస్తూను తెస్తాడు ఉల్లి పువ్వుల్లా
ఉల్లిపిల్లను విడిచి వెళ్లనంటాడు (నిప్పుల కుంపటి)

వైశాఖమాసంలో ఎండల తీవ్రత ఎక్కువ. ఆ కాలంలో ఇక నిప్పుల కుంపటి అక్కర లేదు. మాఘం చలికాలం. అప్పుడు మాత్రం కుంపటి కావాలి. నిజానికి భోగిమంటల పిదప అంటే సంక్రాంతి తరువాత కుంపటి అక్కరలేదు. కాని పూర్వం మాఘమాసమే అతి శీతల సమయం. ప్రాచీనాంధ్ర కవులు కూడా నాటి చలిని పులి అన్నారు. అయితే ఈ కుంపటి ఏ కాలంలో అయినా చలిలో వణికే పసిపాపలకు వృద్ధులకే కాని యువకుల కెందుకు! మాఘమాసంలో చలితోపాటు ఉల్లి పువ్వుల్నికూడా నిప్పుల కుంపటి తెస్తుందట! అది ఉల్లిపిల్లను విడచి వెళ్లదట. ఆ కాలంలో ఉల్లిపాయలు సిద్ధమవుతాయనీ, కుంపటిలో ఉల్లిపాయలు కాల్చుకొని తింటూ చలి కాచుకొంటారని అర్థం. ఇది ఒకప్పుడు నిజం గావచ్చుగాని ఇప్పుడు మాఘమాసానికి పూర్వమే ఉల్లి పంటకాలం దాటిపోతున్నది. కొన్ని పంటలకు పూర్వనిర్దిష్టకాలం సరిపోకపోవడం పరిశీలించ దగిన అంశం.

ఈ పొడుపుకథలో ఒక విశిష్టార్థం ధ్వనిస్తున్నది. ఉల్లికి పైన పువ్వు లుంటాయి; పిల్ల (గడ్డ) కింద ఉంటుంది. పువ్వులున్న ఉల్లి బాలింతకు ప్రతీక. గడ్డ సంతానానికి ప్రతీక. బాలింతకు నిప్పుల కుంపటి దగ్గర ఉండాలి. లేకపోతే తల్లీ పిల్లలిద్దరు ప్రమాదానికి గురయ్యే అవకాశముంది. వైశాఖమాసం బాలింతకు కుంపటి సమీపంలో లేకున్నా మాఘమాసం బాలింతకు తప్పనిసరిగా ఉండాలి. ఇది ముఖ్యంగా గ్రామీణ జీవితంలో పాతుకుపోయిన ఆరోగ్యవిధి సంప్రదాయం.

* అతన్ని పోనీకుండా పట్టుకొండి
వెన్నెముక విరిచిన తర్వాత
అతని ఒంటికి వెన్న పూయండి
ఆ తర్వాత భద్రంగా బంధించండి (తాంబూలం)

వెన్నెముక విరువడమంటే తమలపాకుపై ఈనె తీసివేయడం, ఒంటికి వెన్న పూయడం అంటే సున్నం పూయడం, గదిలో బంధించడం అంటే నోట వేసుకోడం. ఇందులో వక్క-కాచు లోపించింది. అవికూడా ఉన్నాయనుకోవాలి. కాని కొంతమంది తాంబూల వ్యసనపరులవడం దురదృష్టం. కొందరికిది విలాస జీవన చిహ్నమవడం శోచనీయం.

* చెట్టున బుట్టిన చెంగి
రాతిన బుట్టిన రంగి
తీగను బుట్టిన తిమ్మి
బావనోట్లో వసంతము లాడేరు (తాంబూలం)

చెంగి కాచు లేదా వక్క, రంగి సున్నం, తిమ్మి ఆకు, వసంతాలాడ్డం రంగుల్నీ పరిమళాల్ని విరజిమ్మడం.

పొడుపు కథల్లో ఇలా కనిపించే ఆహార విహారాది నియమాల్ని, ఆరోగ్య విధుల్ని ప్రజాజీవన ప్రతిబింబాలుగానే భావించవచ్చు. సంప్రదాయాల్లో కొన్నిటిని ఆచార విధుల క్రింద పరిశీలించవచ్చు.

**3–2 : ఆచార విధులు :–** ఆచారాల్లో దురాచారాలుంటాయి; సదాచారాలుంటాయి. దురాచారం ఏ చారిత్రక సాంఘిక పరిస్థితుల్లో కాలూనుకొన్నా అది శాశ్వత కాలాలపాటు నిలిచి ఉండదు; సదాచారం ఎప్పుడూ ఉంటుంది; దేశ కాల పరిస్థితుల్ని సమన్వయించుకొంటూ కొనసాగుతుంటుంది.

* వంకర టింకర మానూ
వయ్యారి మానూ
మామలెక్కే మానూ
మా ఊరొచ్చే మానూ (పల్లకి)

* వంకర టింకర మానూ !
వయ్యారి మానూ
రాజులెక్కే మానూ
మా వూరొచ్చే గూనూ
కాపులెక్కే మానూ
కష్టజీవుల మానూ!
ఎత్తుకు తిరిగే మానూ
ఇంతుల పెండ్లి కౌనూ (పల్లకీ)

హిందూ వైవాహిక సంప్రదాయాల్లో, ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో వధూవరుల్ని పల్లకిలో లేదా మేనాలో మోసుకొని వెళ్ళడముంది. మంగళసూత్ర ధారణంకూడా వైవాహిక సంప్రదాయమే.

* ఇంతింతాకు
బ్రహ్మంతాకు
పెద్దలు పెట్టిన
పేరంటాకు (మంగళసూత్రం)

* షాదునగర్ కట్ట
అందరు ముట్ట
ఒకడే కట్ట

* ఆమనగల్లు గుట్ట
బాదేపల్లి మిట్ట
ఒక్కడు కట్ట
పదిమంది పుట్ట

మంగళసూత్రాలు లేని వివాహాలూ ఉన్నాయి. దేశకాల పరిస్థితుల్ని బట్టి ఏర్పడ్డ ఆచారాలే ఇవి. హిందూ సమాజంలో కూడా పుస్తెలు, మెట్టెలు, నల్ల పూసలు ప్రాచీనకాలంలో లేవు. వివాహమైందని తెలువడానికి ఇవన్నీ పై మెరుగులు మాత్రమే. పైదంతా తంతు; తంతు అంతరంగంలో తత్వముంటుంది. ఈ ఆచారాలకు అధిక ప్రాధాన్యం మధ్యయుగాలనుండే వచ్చింది. విదేశీ దోపిడీదారులే దేశంలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకోడం ప్రారంభించారు. ఇక్కడి హిందూ స్త్రీలను బలవంతంగా సొంతం చేసుకోసాగారు. అప్పుడు హిందువులు తాళిబొట్టు, నల్లపూసలు, మెట్టెలు ఆచారాలు పాటించారు. అవి అందరికి కనిపించేవి. అప్పటినుండి ఈ దోపిడీదారులు వివాహిత స్త్రీల దగ్గరికి రాలేదు. అయితే కన్యల్ని విధవల్ని ఎత్తుకుపోవడం మొదలుపెట్టారు. అప్పుడు అపద్ధర్మంగా బాల్య వివాహాలు, సతీసహగమనాలు ప్రవేశించాయి. ఆ తర్వాత ఈ దురాచారాలు జాతి నుండి దూరమైపోవడానికి ఏండ్లూ పూండ్లూ పట్టినై. సూత్రధారణానికి అనేకులనేక కారణాలు చెబుతున్నారు. ఇంకా సత్యం తేలవలసే ఉంది.

మంగళసూత్రానికి తెలుగువారెంతో పవిత్రత నాపాదించారు. "ఇంటింతాకు, బ్రహ్మంతాకు, పెద్దలు పెట్టిన పేరంటాకు"- అనడంలోనే ఆ విషయం అభివ్యక్తమవుతుంది. "అందరు ముట్ట ఒకడే కట్ట" అనేది ఆచారమే. సూత్రధారణానికి ముందు మాంగళ్యాన్ని ఓ పళ్ళెంలో (ఎండుకొబ్బెరలో) ఉంచి బ్రాహ్మణుడు అందరిలో తిరుగుతాడు. దానిని స్పృశించడమే అందరి ఆమోదం పొందడం. ఆ తర్వాతనే సూత్రధారణం జరుగుతుంది. "ఆకు" అనే మాటవల్ల పూర్వం స్వర్ణ మాంగళ్యాలు కాక ఆకులతో తయారుచేసినవే ఉపయోగించేవారని తెలుస్తుంది. ఇలాగే కర్ణభూషణాలకు "కమ్మ"లనే పేరు వచ్చింది.

ముగ్గువేయడంకూడా ఆచారమే. రంగవల్లులకు సంబంధించిన ప్రహేళికలన్నీ అచ్చంగా ఆడువారివే.

* పదహారు కొమ్మల వటావృక్షం
పడితే లేవలేదు (ముగ్గు)

* కిరకిర తలుపులు-కిరాయి తలుపులు
పెట్టవస్తయికాని-తియ్యరాపు "

* ఆగిరి వాకిట మొగిలి పూసింది
సూసే జాణుండరుగాని
కోసే జాణలు లేరు "

* వెయ్యంగ వెయ్యవస్తుంపిగాని
తియ్యంగ తియ్యరాదు "

గృహ ప్రాంగణం ప్రతిదినం ఊకి, చానిపి చల్లి ముగ్గువేస్తారు. సంక్రాంతి పండక్కి ఓ నెల ముందునుండి వాకిలి అంతా రంగవల్లులతో అలంకరించడం ప్రారంభిస్తారు. ఇది వ్యవసాయ ప్రాధాన్యమైన దేశమైనందువల్ల వాకిలి ఎప్పుడూ సున్నగా ఉంచుకోవలసిన అవసరం వచ్చింది. అందుకే ప్రతిరోజు జాన్పి చల్లడం. సున్నంలో సుద్ద ఓ రకమైంది; ఈ సుద్దే ముగ్గుపొడి అవుతుంది మనిషి కపకారం చేసే సూక్ష్మాతి సూక్ష్మజీవుల్ని నాశనంచేసే గుణం ముగ్గుకుంది. ఆరోగ్య దృష్టితో ఏర్పడ్డ ఈ ఆచారం ఇప్పుడలంకార ప్రాయమైంది. కొన్నిచోట్ల ముగ్గుగా పిండినుపయోగిస్తారు. చీమలు తదితర ప్రాణులకు ఈ విధంగానైనా ఆహారం అందించాలన్న తపనే ఈ ఆచారంగా పరిణమించింది. ఇలాంటి అంతరార్థాలు తెలిసినా తెలియకున్నా ఆచారం మాత్రం అనాహతంగా సాగుతూనే ఉంది.

నాడైనా నేడైనా ముగ్గులు పరచేపని స్త్రీలదే. ముగ్గులు వేసేప్పుడు చలనాల వల్ల వ్యాయామం చేసినట్లవుతుంది. సహనం పెరుగుతుంది. ఇంటిల్లిపాదిలో కళాహృదయం పెంపొందుతుంది. ఏ హృదయం కళకు నిలయమవుతుందో అక్కడ దైవముంటుంది.

పదహారు కొమ్మల వటవృక్షం అంటే విశాలంగా వేసిన ముగ్గే అని అర్థం. అది పదహారు శాఖలుగా రచితమైంది; షోడశ కళాప్రపూర్ణమై ప్రకాశిస్తుంది. "పడితే లేవలేదన్నా, పెట్టవస్తాయిగాని తియ్యరావన్నా, సూసే జాణ

లుండరు గాని కోసే జాణలు లేరన్నా, తియ్యంగ తియ్యరాదన్నా" అన్నిటికీ అర్థం ముగ్గే, పరచబడ్డ ముగ్గు మళ్ళీ ఎత్తుకోరనీ, ఎత్తబడదనీ, ఎత్తగూడదనీ విశేషార్థాలు - విశిష్టార్థాలు.

* మిద్దె మీది ఉంగరం
అందరికీ కనబడుతుందిగాని
నాకు కనబడదు (బొట్టు)

ఇది ఉంగరంలా గుండ్రంగా తీర్చిదిద్ది పెట్టిన బొట్టు మాట. ఎవరిబొట్టు వారికి అద్దంలో కనిపించవలసిందే. తిలకం ధరించడం భారతీయ సంప్రదాయమే. కనుబొమ్మల మధ్య చర్మాన్ని అచ్ఛాదన చేయాలనీ, అందుకనీ గంధమో - తిలకమో ధరించాలని ఆరోగ్య దృష్ట్యా ఏర్పడ్డ సంప్రదాయమే ఇది. తిలకానికీ, కుంకుమకు సంబంధించిన ఒకటి రెండు పొడుపు కథలు జానపద సాహిత్యమనే ప్రకరణంలో చర్చించడం జరిగింది.

* కీసు గిద్దెడు బియ్యం వండి
కీసు కెట్టంగ కీసు పిల్లల కెట్టంగ
ఆమన గంటోల్ల కరవై మంది కెట్టంగ
దేవర కొండోల్లకు డెబ్బయి మంది కెట్టంగ
ఇంకా ఇసుజ్జాయంత పెల్ల ఉండే (కుంకుమ)

ఎందరికి పెట్టినా కుంకుమ తరగదు. కుంకుమ సౌభాగ్యం కూడా తరగరాదని భావం. అతిథి మర్యాద చేయడంలో కుంకుమ తప్పకుండా పెట్టే ఆచారం పాటించాలని కూడా ఈ ప్రహేళిక ప్రతిపాదిస్తున్నది, స్త్రీల విషయంలో ఇప్పటికీ ఈ ఆచారం కొనసాగుతూనే ఉంది,

* నాల్గు కాళ్ల నటంగి
రొమ్ము తప్పెట తీస్కరా -
ఏంది కథ !

కాకి కూటమి చూడరాగనే నమ్మకాన్ని పల్లె ప్రజలు ఈనాటికీ పాటి స్తూనే ఉన్నారు. నిజానికి చూసేవారెవరు! చూస్తే మాత్రం మూర్ఛపోతారని అంటుంటారు. ఈ మూర్ఛ మరణానికి కూడా దారితీస్తుందట.

కాకులు రెండు కాట్లాడుతున్నాయి (కూటమిలో ఉన్నాయి). ఒకరు చూశారు. "ఆఁ ఆఁ" అంటూ పడిపోయారు. అతనికి మందూ మాకూ ఏమీ అక్కరలేదు. 'అయ్యో నాకొడుకా పోతివా' అని తల్లి, "అయ్యో! నా మగడా పోతివా' అని భార్య రొమ్ము గొట్టుకొంటూబిగ్గరగా రోదిస్తూ వచ్చారు. పెద్దగా ఏడ్వడమేగాక ఓ పాడె కూడా చేయించి దాన్ని ఇద్దరు మోస్తుండగా అనుసరించారు. ఈ ఏడ్పుల కతను లేచాడు. నాల్గు కాళ్ల నటంగి అంటే పాడె; రొమ్ము తప్పెట అంటే అప్తులు రొమ్ముగొట్టుకోడం. మూర్ఛపోయిన వ్యక్తిని ఆత్మీయుల ఆవేదన స్పృశిస్తే జాగ్రదవస్థలోకి వచ్చే అవకాశముంది. ఈ సంగతి మరుగున పడింది. కాకి కూటం మీది నమ్మకమే బాగా ప్రచలితమయింది,

**3-3 : వస్త్రాద్యలంకరణాలు** :— దేశకాల పరిస్థితుల్నిబట్టి ఈ మానవజాతి అనాదిగా శరీరాచ్ఛాదనానికి సముచిత వస్త్రధారణ చేస్తున్నది. కొన్ని ప్రాంతాలవారు ప్రత్యేక వస్త్రాల్ని, ప్రత్యేక ఆభరణాల్ని ధరించడంవల్ల ఆదివారి సంప్రదాయ సిద్ధ వస్త్ర ధారణంగా రూఢికెక్కింది.

* ఆడదణగ వత్తే
మగోడు లేవట్టి పెట్టె (చింగులు, గోచి)

హిందువుల్లో సర్వసాధారణంగా స్త్రీలు చీరలు, పురుషులు పంచెలు కడతారు. స్త్రీలు చీర గట్టేప్పుడు చీర చెంగులు చెదరకుండా ఉండడానికి కాళ్ల మధ్య అణచిపడతారు. పురుషుడు పంచె గట్టేప్పుడు గోచి కాలికిందినుంచి మళ్లించి వెనుక చెక్కుతాడు. అదే కాలు లేవట్టి పెట్టడంగా పొడుపుకథ ప్రస్తావించింది. గృహజీవనంలో అమ్మా నాయనల విషయం చర్చించినప్పుడు ఈ ప్రస్తావన వచ్చింది. ఇక ఈ క్రిందివన్నీ ఆచార దృష్టివల్లా, ఆరోగ్య దృష్టివల్లా, నేటికీ ఆచరణంలో ఉన్న అలంకరణాలే.

* గవాసిల గడ్డపార (ముక్కుపుల్ల)

గవాక్షానికి వికృతి గవాచి. కాని మిద్దెమీద వెలుతురు కొరకేర్పరచిన గూన (రంధ్రం)ను గవాచి అంటున్నారు.[1] ముక్కుకు చేసిన రంధ్రం గవాచి; ముక్కుపుల్ల గడ్డపార. ముక్కుపుల్ల కేవల అలంకరణం కాదు; ముక్కుపుల్ల పోతే ముత్తయిదుతనమే పోయినట్లేనే నమ్మకముంది సమాజంలో.

* పడితే పిడికెడు
ఇడిస్తే మూరెడు
ఆడోల్లకు ఆపేక్ష [సవ(వు)రం]

వెంట్రుకలు బారెడు కన్పించాలి. బారెడు బారెడు వెంట్రుకలు ఐతే అందం. అయితే అవేమో మూరెడు దాటవు. ఏం చేయాలి! ప్రాచీనకాలంలో స్త్రీలు చమరీ మృగం తోక వెంట్రుకల్ని తమ వెంట్రుకలకు కట్టుకొనేవారు. సవరం చమరీ మృగం తోక. ఆ తోక కుచ్చులే చామరాలయ్యాయి. చామరాలే సవరాలయ్యాయి. ఆ సవరం పట్టుకొంటే పిడికెడే; విడిస్తే మూరెడవుతుంది; బారెడవుతుంది. ఇది ఆడువారి అందచందాల్ని పెంపొందిస్తుంది కాబట్టి వారికి ఆపేక్షేమరి!

* ఆడదాని కంటుకొనె
మగోని కూగులాడె (ముక్కుపుల్ల, కొణిక పోగు)

స్త్రీ ధరించే ముక్కుపుల్ల అంటుకొనే ఉంటుంది. పురుషుడు ధరించిన చెవుల కొణికి పోగులూగులాడుతుంటాయి. కొణిక పోగులవానిమీద మనసుపడ్డ జానపది జానపద గేయమొకటుంది.[2] ఇప్పుడు కొణిక పోగులు బాగా తగ్గిపోయినై. స్త్రీల అలంకరణ సామగ్రిలో కాటుకకున్న ప్రాధాన్యం మరువరానిది.

---

1. పాలమూరు, నల్లగొండ, రంగారెడ్డి జిల్లాల్లో.
2. మూల బురుజుమీద ఓయత్త - నల్లగొంగటోడోయత్త
కోట బురుజుమీద ఓయత్త - కొణిక పోగులోడో యత్త
ఓణ్ణి విల్వు ఓయత్త - వోణ్ణి నన్ను ఓయత్త
ఒగింట్లెయ్యి ఓయత్త (ఖిల్లా గణపురం, పాలమూరు జిల్లా,
-1977లో సేకరణ)

* గుళ్లో నల్లగ
గుడెన్క తెల్లగ (కాటుకకాయ)

* కింద బొచ్చు పైన బొచ్చు
పగలదీసి పెట్టవచ్చు (కాటుక పెట్టడం)

కాటుక డబ్బి(కాయ) గుడి. గుడిచుట్టు తెల్లగ ఉంటుంది; కాటుక నల్లగ ఉంటుంది; గుడిలో నల్లగ ఉంటుంది. కంటికందాన్నిచ్చేది కాటుక. కంటిరెప్పల్ని చీలదీసి కాటుక పెడతారు. రెప్పల వెంట్రుకల్నే కిందబొచ్చు పైనబొచ్చు అనడం జరిగింది. కంటికి చలువ నందించాలనే ఆరోగ్య దృష్టితో వచ్చిన కాటుక ఆచారంగా పరిణమించింది.

* గట్టు గుమ్మీత సొంటేరు (మొలత్రాడు)

గట్టుచుట్టు సన్న ఏరని అర్థం. హిందువుల్లో పురుషులందరూ మొలత్రాడు ధరిస్తారు. అదే దీక్షగాకూడా భావిస్తారు. పూర్వం బాల్యంనుండి పంచలే కట్టేవారు. పంచెలు జారకుండా ఉండడానికి మొలతాడుపయోగపడేది. ఇప్పుడు పిల్లలు పిన్నులూ-కాంటాలు వేసుకొంటున్నారు. పెద్దలు తాళంచెవులు తగిలిస్తున్నారు. మొలతాడుతో ఉరిపోసుకొన్న వారున్నారు; దానికి తగిలించిన చాకుతో స్వీయ రక్షణం చేసుకొన్నవారున్నారు; ఇతరుల్ని కాపాడిన వారున్నారు. స్త్రీలు కోపంతో తిట్టే తిట్లల్లో 'నీ మొలతాడు దెంప' అనేదొకటి. 'నీవు చావ' అని ఆ తిట్టుకర్థం. చనిపోయినవారి అంత్యేష్టికి పూర్వమే మొలతాడు తెంపివేస్తారు.

* చిక్ చిక్ తాళం
చికరోళ్ల తాళం
బయటకు ఎత్తే
బయరూపులోళ్ల బాధ (గెంటీలు)

గెంటీలు చెవులకు ధరించే ఆభరణాలు. అవి అటూఇటూ తగిలినప్పుడు చిక్ చిక్ అనే తాళధ్వని వస్తుంది. చికరోళ్లు భజనపరులు. బంగారంమీద భ్రమ పడనిదెవ్వరు! ఆరోజు సీతమ్మ తల్లే బంగారు లేడి భ్రాంతిలో పడింది. ఆభరణాలున్న స్త్రీ ఈనాడు ఒంటరిగా వెళ్లలేని పరిస్థితులు దాపురించాయి. మంగళ

సూత్రాల్ని, గెంటీలను, చెవి కమ్మల్ని, మెడ గుండ్లను, చేతి గాజుల్ని అపహరించడానికి వ్యూహాలు పన్నే ముఠాలు కొన్ని బయలుదేరాయి. బంగారం కొరకు బ్రతుకులనే కంగాళీగా చేసే బహురూపుల (బయిరూపుల) వారివల్ల పడేబాధల్నే పై ప్రహేళిక ప్రకటిస్తోంది.

**3–4 : అలవాట్లు :–** ఆలవాట్లు ఆచారాలు కావు; సంప్రదాయాలు కావు. ఇవి ఆయా వ్యక్తుల అభిరుచుల్ని బట్టి పుడతాయి, పోతాయి. ఒకనికి తాగడం అలవాటు, మరొకనికీ నల్లమందు తినడం అలవాటు, ఇంకొకనికి వేటాడ్డం అలవాటు, వేరొకనికి వ్యభిచరించడం అలవాటు.... ఇట్లే పేకాట-చదరంగం, కోళ్లపందేం, గుఱ్ఱప్పందాలు, సట్టా, మట్కా ...ఇలా ఎన్నో.... వందలు. భారతీయ నీతిశాస్త్రం చెబుతోన్న సప్త వ్యసనాల్లోకే ఇవన్నీ వస్తాయి. అలవాట్లను అలవర్చుకొన్న వానికి అభ్యుదయం సున్న. ప్రజా జీవనంలో పాతుకుపోయిన ఈ అలవాట్లను ప్రహేళికలూ ప్రకటించాయి.

* మెడసన్నకాయ (కల్లుసీసా)

సీసా మెడ సన్నగా ఉంటుంది. అందువల్లనే కల్లుసీసా మెడసన్నకాయ. ఈనాడు బీరు ప్రియులు కొందరు బీరు సీసాను 'బీరకాయ' అని ముద్దు ముద్దుగా పిలుచుకొంటున్నారు. ఈతకాయ, తాటికాయ, సొరకాయ అన్నట్టు బీరుసీసా బీరకాయ అయ్యింది. మెడసన్నకాయ జానపదుడు పెట్టుకొన్న అందమైన పేరు.

* తుప్పుడులేని కొబ్బరికాయ (కల్లుముంత)

కొబ్బరికాయమీన నార ఉంటుంది. కొన్ని ప్రాంతాల్లో ఆ నారను తుప్పుడు అంటారు. తుప్పుడు లేనిది బోడికాయే. ఇక బోడికాయ కల్లుముంతే.

* తీరిచ్చి దిద్దిచ్చి
ఎక్కిచ్చి పొక్కల పెట్టిచ్చి (చుట్ట)

అందంగా గుండ్రంగా తయారుచేసి పొగాకు నెక్కించి, చుట్ట పొక్కలో నిప్పు పెట్టడాన్ని పై పొడుపు కథ తెలుపుతుంది. చుట్ట, సిగరెట్, బీడి, చిలుంగొట్టం....ఏదైతే ఏంటి అన్నీ అలవాట్లే.

* ఇచ్చలి చెట్టుకు ఐచ్చలికూర
పెరిగితే సాటెడు
వంతే తెడ్డెడు
తింటే లేవడు (నల్లమందు)

ఇది మాదకత గుణమున్న ఓ రకం చెట్టు. ఈ చెట్టుకూర (ఆకు) పెరిగిన తర్వాత చాటెడు తెంపి వండితే అయ్యేది తెడ్డెడే. ఆ తెడ్డెడు తిన్నవాడిక లేవడు. నల్లమందు గుణమది. నల్లమందు అన్ని విధాలుగా మనిషిని పాడుచేస్తుంది. అందుకే పొడుపు కథాకారుడు ఆ అలవాటుకు గురైనవాడు లేవడని అంటున్నాడు.

ఆచారాలు-అలవాట్లేగాక ప్రజా జీవితంలో ప్రతిబింబాలైన మరెన్నో పొడుపు కథలున్నాయి. వ్యవసాయదారుడు పనిచేయడానికి పొలానికి వెడతాడు. మధ్యాహ్నం ఇంటికి వస్తే పని పాడైపోతుంది. అందువల్ల భార్యో తల్లో అన్నం అక్కడికే పంపించే ఏర్పాటు చేస్తారు; లేదా తామే తీసుకొని వెడతారు. దాన్నే చద్ది, చద్దిబువ్వ అంటారు. కొన్నికొన్ని సమయాల్లో రైతు ఉదయమే చద్ది కట్టుకొని బయలుదేరతాడు.... పంటచేను దగ్గర కావలి ఉండే పిల్లలుకూడా చద్ది కట్టుకొని వెడతారు. చద్దిమూటతో బయలుదేరిన పిల్లలు భోజన సమయంవరకుండలేరు; కనీసం చేనిదగ్గరికి వెళ్ళేంత వరకుకూడా ఆగలేరు. ఊరు దాటాక, ఊరి చెరువు దగ్గరే సాపాటు కానిస్తారు. ఆ విషయాన్నే ఈ క్రింది పొడుపుకథ తెలుపుతున్నది.

* ఇక్కడ కట్టిన కట్టు
ఇంపైన కట్టు
మాఊరు చెరువులో
మాయమైపోయే (చద్దిబువ్వ)

* ఇంటికి వాకిలే లేదు (బొంద)

గచ్చుమిద్దెకు గనుమల్లేవు అన్నా, చుట్టింటికి పొక్కలేదన్నా కోడిగుడ్డే. ఇక్కడ గచ్చుమిద్దె చుట్టిల్లు అన్న విశేషణ విశేష్య పదాలవల్ల విడుపు కోడిగుడ్డని తేలింది. కాని పై పొడుపులో ఇంటికి విశేషణ మేమీలేదు. విడుపు బొంద(బృంద). బొందకు ద్వారం ఉండదు; ఉండకూడదు; ఉంచరు. సమాధులు కూడా అంతే.

వివిధ దేశాల్లో ఉత్తర క్రియలు వివిధ రకాలుగా ఉన్నాయి. ఎక్కువశాతం ప్రజలు పొందకే ప్రాధాన్యమిచ్చారు. భారతీయ సంప్రదాయంలో దహనమూ, పొంద పెట్టడం రెండూ ఉన్నాయి.

* ఒకటి లోపల
రెండు బయట (శవము, మంచి-చెడు)

మనిషి మంచి చేసినా చెడు చేసినా లోకం ఊరుకోదు. భూషిస్తుంది, దూషిస్తుంది. బతికి ఉన్నప్పుడే నేటుగానో చాటుగానో జరిగేపనే ఇది. చనిపోయిం తర్వాత శవం ఇంట్లోనే ఉంటుంది; బయటమాత్రం మంచిచెడ్డల గూర్చిన ప్రసం గాలు కొనసాగుతుంటాయి. ఇది లోకం; నోరుమూయడం అసాధ్యం. అంత లోకాన్ని పరిశీలించిన వారెవరో ఇంత పొడుపుకథను సంసిద్ధం చేశారు.

ప్రజా జీవనమంటే ఇంత తిండితిని, కొంత పనిచేసి, ప్రొద్దంతా నిద్ర పోడం కాదని ఈ ప్రహేళికల పరిశీలనవల్ల తెలుస్తూనే ఉంది. ఆచారాలు, సంప్ర దాయాలు, అలవాట్లు విశ్వాసాలు, విలాసాలు, వినోదాలు .. ఎన్నిఉంటే అన్ని సాహిత్యం దర్పణమై చూపిస్తుంది. పొడుపుకథ కూడా తన మేరకు తనవంతు బాధ్యత నిర్వర్తిస్తుంది. ప్రజా జీవనాన్ని స్పృశించని సాహిత్యం, పరమార్థాన్ని ప్రబోధించని సాహిత్యం కలకాలం బతికి బట్టకట్టలేదు. అక్షరబద్ధం గాకున్నా, గ్రంథస్థమై లేకున్నా తెలుగు పొడుపుకథా వైభవాన్ని గమనిస్తే ప్రజాజీవనాన్ని అదెంత తలస్పర్శిగ తాకిందో తెలుస్తుంది.

## 5-4 : వృత్తివిశేషాలు :-

దేశ సౌభాగ్యాన్ని తీర్చిదిద్దడంలో వృత్తి కళాకారుల కృషి ప్రశంస నీయమైంది. ఓవైపు ఉత్పత్తిరంగం, మరోవైపు కళాసేవారంగం గణనీయంగా కష్టించినప్పుడే ఆదేశం ఆర్థిక సౌష్ఠవాన్ని అందుకొంటుంది. అన్యదేశాలతో సరి తూగుతుంది. వ్యవసాయం, కమ్మరం, కుమ్మరం, వడ్రంగం.... ఇవన్నీ వృత్తులే. విద్యాబోధనం, వైద్యం, వస్తు వికేంద్రీకరణం, రహదారులు-బావులు-చెరువుల నిర్మాణం, దేశ రక్షణం తదితరాలన్నీ సేవారంగం క్రిందికి వస్తాయి. వ్యాపారంకూడా సేవారంగం కిందికే వస్తుంది..

ఒక్క వ్యాపారాన్ని వదలివేస్తే తెలుగు పొడుపుకథల్లో సేవారంగానికి సంబంధించినవి చాలా తక్కువనే చెప్పాలి. ఆడీగాక వృత్తి విశేషాలనే శీర్షిక కింద ఉత్పత్తిరంగానికి సంబంధించిన ప్రహేళికల్ని పరామర్శించడమే సంభావ్యం.

**4-1 : వ్యవసాయం :-** కూడు గుడ్డ రెండూ వ్యవసాయ ఫలాలే. పాడీపంట సమృద్ధికి వ్యవసాయమే ఆధారం. భారతదేశం వ్యావసాయక దేశం. అందువల్లనే కర్షక జీవన ప్రతిబింబిత సాహిత్యం ఎక్కువగా లభిస్తుంది. తెలుగు పొడుపుకథల్లోనూ ఎక్కువశాతం వ్యవసాయానికి సంబంధించినవే ఉన్నాయి. ఇక్కడ కొన్ని మాత్రమే ప్రస్తావిస్తా.

* పది పదములారు కన్నులు
వదనంబులు మూడు మూడు వాలంబులతో
చదునైనచోట దిరిగెడు
నెదొ చెప్పెడివాడు జాణ ఇమ్మహిలోనన్ (నాగలి)

రెండెద్దుల కాళ్లు, రైతుకాళ్లు మొత్తం పదికాళ్లు. అదేవిధంగా ఆరు కన్నులూ మూడూ ముఖాలు. ఎద్దులవి రెండుతోకలు, నాగలిది మేడితోక మొత్తం మూడుతోకలు. ఈ రూపం బొమ్మగట్టేట్టు ఈ ప్రహేళికా పద్యం చిత్రించింది.

* మామ నల్లుండ్లు నాగల్లు దుంతుంటే
తల్లి బిడ్డలు అన్నందెచ్చిరి
ఎవరి నాయనకు వాళ్లిచ్చిరి

"మామనల్లుండ్లూ-తల్లి బిడ్డలు.... ఇదెక్కడి వరస అనిపిస్తుంది. కొంత సేపు ఆలోచిస్తేగాని సందేహ నివృత్తిగాదు. "అల్లుని భార్య-అల్లుని కూతురు" ఈ పొడుపుకున్న విడుపు అల్లుని భార్య మామ కూతురే. పొలాలు దున్నేప్పుడు చద్ది తీసుకొనిపోడం రైతుల గృహాల్లో సర్వసాధారణ విషయం. తల్లివెంబడి పిల్లలూ వెడతారు. చద్దిగంపలో ఆహార పదార్థాలు పట్టనప్పుడు కూతురు కూడా మరో చిన్నబుట్టలో పెట్టుకుని తల్లిని అనుసరిస్తుంది. భారతీయ గృహిణి తన

భర్తతోపాటు కర్మక్షేత్రంలో పాల్గొనడం నాడుంది; నేడుంది; రేపూ ఉంటుంది, ఈ పొడుపుకథ అదే చెబుతుంది.

* కాళ్లు పంగటించి - కమ్మలగడించి
ఎత్తెత్తి కొట్టంగ - పరుశెపారంగ (ఏతం)

* పొద్దున లేస్తే
కట్టెపిట్టె బాయిల వడె (బొక్కెన)

పూర్వం ఏతాలు తొక్కి నీరు పారించేవారు. ఇప్పుడవి అక్కడక్కడ మాత్రమే కనిపిస్తున్నాయి; ఏతంకట్టను గట్టిగా తొక్కడంవల్లగానీ. ఒత్తడం వల్లగానీ నీరుపైకి తెచ్చే అవకాశమేర్పడుతుంది. అట్లే కట్టెపిట్ట బావిలో పడడం బొక్కెనను బావిలోకి విడిచి మోట గొట్టడమే. భూమిలోని నీటిని పైకితెచ్చి పొలాలకు పారించి కళకళలాడేట్టు చేయడానికి రైతుకనుగొన్నదే ఈ ఏతం-ఈ మోట. ఇవాళ అయితే ఇంజన్లు, కరెంటు మోటార్లు వచ్చినై. రైతుశ్రమను కొంతమేరకు తగ్గించినై.

**4-2 : కుమ్మరం :-** కుండలు చేయడం కుమ్మరివృత్తి. ఇత్తడిపాత్రలెంతగా రాజ్యం చేస్తున్నా ఈ నాటికి కుండల ప్రాధాన్యం తగ్గలేదు. కుమ్మరిసారె మీద ఓ పొడుపు పద్యమే పుట్టింది.

* కాళ్లు పంగపెట్టి కామ చేతులపట్టి
పొక్కసూటి చూచి పోటు పొడిచి
పోటుకొక్క పిల్ల నీటుగా దీయురా
దీని భావమేమి తిరుమలేశ! (కుమ్మరి-సారె)

ఇది తెలుగునాట సుప్రసిద్ధ పద్యం. కుమ్మరి కుండలు చేసే విధానాన్నిది చిత్రించింది, పద్యంనిండా శృంగారమే. అయినా విడుపు కుమ్మరి వృత్తినే సూచిస్తుంది. కుమ్మరి చక్రం తిప్పేప్పుడు కట్టె చేతపట్టి తిప్పడం, ఒకసారి తిప్పి ఆగి ఒక కుండను తీయడం ఈ పద్యంలో వర్ణితం.

* కోస్తుంటంగనే మల్లీ పెరిగొచ్చే (కుండ)

కుమ్మరి సారె తిప్పుతూ ఒక్కో కుండ తయారు చేస్తూ అడుగు కోస్తుంటాడు. వెంటనే మరొకటి తయారుచేస్తాడు. ఆ చేయడమే పెరిగి రావడమన్న మాట. నిర్మాణ దశను చూస్తే, ఒకవైపు కోస్తుంటే మరోవైపు ఎలా పెరిగి వస్తుందో తెలుస్తుంది.

* కుప్పగాలి - అప్పుతీర్చె (కుమ్మరివామి)

కుమ్మరి పచ్చికుండలు ఎండింతర్వాత, వాటిని ఓ పద్ధతి ప్రకారం కుప్పగా పెడతాడు. ఆ కుప్పనే "కుమ్మరావ"మంటారు. చెదరకుండా ఉండడానికి అక్కడక్కడ బురద (తడిమట్టి) పూస్తారు. పొట్టు గప్పుతారు. ఆ తర్వాత ఆ వం (వాము) కింద కట్టెలుపెట్టి కుప్ప కాలుస్తారు. అప్పుడు కుండలు తయారవుతాయి. ఇది చేసేప్పుడు తాను అప్పుచేసి పప్పుకూడు తింటాడు. కుండలు అమ్మకొని అప్పు తీర్చుకొంటాడు.

* రథం కొండమీద పోతుంటే
సారథి నేలమీద కూర్చుంటాడు
అది వాయువేగంతో పయనిస్తుంది
కాని-ఉన్నచోటునుంచి అంగుళమైనా కదలదు-ఏమిటది!
(కుమ్మరి-సారె)

కుమ్మరి వృత్తి ప్రజలకెంతో సేవచేసింది. పొయ్యిమీదికి కుండనెక్కించింది. నీళ్లు నిలువ ఉంచుకోడానికి కడవ అందించింది. గురుగులు, చిప్పలు, ప్రమిదలు, పెంకులు, బోకులు, బానలు, ముంతలు, రొట్లు, కూజాలు, గోళాలు-ఒక్కటా రెండా ఎన్నో రకాల పాత్రల నందించింది. ఎవరు తలచినా తలవక పోయినా పొడుపు కథారాయుడు కుమ్మరి వృత్తి విశేషాల్ని మన్నించాడు; మర్యాదలు చేశాడు. శ్రమజీవిని స్మరించడం ప్రతిమనిషి కనీసధర్మం.

**43 : కమ్మరం :-** పారలు, గడ్డపారలు, పలుగులు, కట్టులు, కొంకులు, కొడవళ్ళు, సుత్తెలు, చమ్మెటలు, పలాకలు.... ఇంకా ఎన్నో పరికరాలు కమ్మరి

తయారుచేస్తాడు. కొందరు కంసాలులుకూడా ఈ పనులు చేస్తున్నారు. సుత్తె, కొలిమి, కొలిమితిత్తి, దిమ్మె, పటకార మొదలైనవన్నీ అతని పరికరాలు.

* భూమిని పడి పొర్లాడును
గాలికి నోరావళించి గ్రక్కున మ్రింగుస్
నడినెత్తిమంట నుండును
నాకీ భావంబు దెలుపు నాగఫణీశా! (కొలిమితిత్తి)

పద్యం కుదిరిందిగాని ప్రాస పోయింది. కొలిమితిత్తికున్న రూపాన్ని ఈ పద్యం పొదుగుకొంది. తోలుతిత్తిని పైకెత్తినపుడు తిత్తినోరు తెరుచుకొని గాలి మింగుతుంది. తిత్తిని కిందికి వత్తినపుడు నోరుమూసుకొనిపోయి, గాలి బుస్సుమని ముందుకు త్రోసుకొని వెళ్లి మంటను రేపుతుంది, మండుతున్న కొలిమిలో ఇనుపముక్క నుంచుతారు. ఆ విషయమీ క్రింది పొడుపుకథ ప్రస్తావిస్తున్నది.

* నల్లది పెట్టే
ఎఱ్ఱది తీసె
అరికాళ్లమీద కూచోని
ఊనిచ్చి ఊనిచ్చి గుద్దె

కొలిమిలో ఇనుపముక్క పెట్టి వేడెక్కిన పిదప తీస్తాడు. ఆ ముక్కను అనుకొన్న రూపానికి మలచాలి. దిమ్మెమీద పెట్టి కొట్టేప్పుడు "ఊఊ" అంటూ గట్టిగా కొట్టాలి. అప్పుడుగానీ ఆముక్క కఱ్ఱో, కొండో, కొడవలో అవుతుంది.

ఇలా చేసిన పరికరాలమ్ముకొని అతను బతుకుతాడు. సాధారణంగా మొదటనే తమకేది కావాలో చెప్పి ప్రజలు చేయించుకొంటారు. సమాజ విరాట్స్వరూప యంత్రంలో కమ్మరికూడా తనపాత్ర పోషిస్తూనే ఉన్నాడు. అతనివృత్తే అతనికన్నం పెడుతుంది; ఆదరిస్తుంది.

**4-4 : వడ్రంగం :-** వడ్రంగి కట్టెలతో రకరకాల వస్తువులు తయారు

చేస్తాడు. పీటలు, కుర్చీలు, బల్లలు, బాజులు, తలుపులు, బెత్తాలు, దూలాలు, నాగళ్ళు. బండ్లు, మంచాలు ఎన్నని! ఎన్ని రకాలని! వందలు వేలు.

* చేను చెలక తిరిగివచ్చి
ఇంట్ల పదిపైసలంత
చోట నిలబడ్డది (చేతికఱ్ఱ)

తాతకు చేతికఱ్ఱ కావాలి. చేను చెలిక తిరిగేప్పుడు తప్పనిసరి కావాలి, వ్రడంగి నున్నగా తీర్చిదిద్ది కఱ్ఱలు తయారుచేసి ఇస్తాడు.

"వంకరొంకల మట్టి, వంకల్ల మఱ్ఱి, వడ్లోని దగ్గరకోయి వంక దీపిచ్చిన'.... అని పల్లకినిగూర్చి చెప్పినప్పుడు, "వడ్లవాడు చెక్కలేని వయ్యారి మొగ్గా" అని ముగ్గుసుగూర్చి చెప్పినప్పుడు, "వడ్లోని కిత్తునా వంక తీపిత్తునా" అని తుపాకినిగూర్చి చెప్పినప్పుడు వ్రడంగిని పొడుపు కథాకారుడు స్మరించాడు.

**4-5 : చేనేత :-** చేనేత పారిశ్రామికుడు బట్టలు నేస్తాడు. ఇతణ్ణి పద్మశాలి అంటారు; 'సాలె' అనికూడా పిలుస్తారు. దూదితో దారం తీయడం, నేయడం మొదలైన విషయాలు పొడుపు కథల్లో కనిపిస్తున్నాయి. దారం, రాట్నం, మగ్గం తదితరాలెన్నో పద్మశాలి పరికరాలు. తెలుగునాట ప్రసిద్ధమైన "బాహువులు పదునారు" అనే పద్యం రాట్నాన్నే తెలియజేస్తుంది.

* మాను మాను దిరుగు మరకటం బదిగాదు
స్త్రీలచేత చిక్కు చిలక గాదు
మాటికి ముద్దిచ్చు మగువ యన్నదిగాదు
దీని భావమేమి తిరుమలేశ!

మగ్గమాడించేప్పుడు ఆసుకొయ్య అనేది అటూ ఇటూ తిరుగుతుంది. దాని రంధ్రంలో దారం ఇమిడిస్తారు. ఆ దారంతోనే అటూఇటూ పరుగెత్తుతూ దారాలను పడుగు పేకగా మారుస్తుంది. వస్త్ర నిర్మాణంలో ఆసుగొయ్య పని అతి కీలకమైంది. దారం పూర్తిగా అయిపోయినప్పుడు ఒక కొననుండి దారాన్ని

ఎక్కించి (దారం కండెనెక్కించి) మరో కొననుండి గాలి పీలుస్తారు. దారం అవ తలి కొనకు వస్తుంది. దానినే మాటికి ముద్దివ్వడంగా పద్యం ప్రకటించింది.

* బోడబావిలో బోగమోళ్లాడతారు.

(మగ్గం గుంతలో కాళ్ళు ఆడడం)

మగ్గం ఆడించేప్పుడు కింద కాళ్ళుకూడా ఆడుతుంటాయి; భోగం వారాడి నట్లు ఈ ఆట ఉంటుందని పొడుపు కథాకారుని భావన.

* బిజినపల్లికాడ బిగు
తాండూరికాడ తగు (దానికి దీనికి తగు)
ఆడికీడికి లగు మగ్గం)

మగ్గానికెంతో స్థలం అవసరం. చాలా పొడుగు గది కావాలి. ఆ విష యమే పై పొడుపుకథలో ఉంది.

* రుసి లేకున్నా
ఎప్పుడూ నాకుతుంటడు (పోగు అతకడం)

బట్ట తయారుచేసేప్పుడు మాటిమాటికి పోగు తెగిపోతుంటుంది. అప్పుడు చేయినాకి ఆ ఉమ్మితో పోగును అతుకుతుంటాడు. మరి ఇది రుచి తెలిసి మోజు పడి నాకటం మాత్రం కాదు. వృత్తిలో తప్పనిసరి.

* మాయమ్మ మీద
మీయమ్మ కాళ్ళేసే (రాట్నం)

దారం తీసేప్పుడు రాట్నంమీద కాలువేయడంవల్ల రాట్నం కదలకుండా ఉంటుంది. వేగంగా దారం తీయడానికి వీలవుతుంది. రాట్నాన్ని మాయమ్మనీ, దారం తీసే స్త్రీని మీ యమ్మనీ అంటున్నాడు పొడుపు కథా కారుడు. పద్మశాలి విషయంలో "బ్రతికుండి గోతిలో కూర్చుండే వాడని" ప్రయోగించాడు ప్రహేళికా కర్త-వ్యవహర్త.

తన ఇల్లే వృత్తి విద్యా నిలయంగా మార్చి, పడుగు పేకవలె తన జీవితాన్ని తీర్చుకొని, ఈ దిగంబర సమాజాన్ని తాను నేసిన వస్త్రాలతో

అలంకరించి, నేత పారిశ్రామికునిగా ఖ్యాతిగాంచిన పద్మశాలిని (సాలెను) సమాజం సముచితరీతిగా సన్మానించింది. అందువల్లనే అతనిపై-అతని వృత్తిపై అన్ని రకాల ప్రహేళికలు ప్రాదుర్భవించాయి.

**4-6 : మంగలిపని:–** ప్రాక్తన మానవుడధునాతన మానవునిగా పరివర్తన చెందుతున్న ఏ దశలోనో ఈ శరీరం నుండి పెరుగుతోన్న గోళ్లనీ, వెంట్రుకల్నీ కత్తిరించడంఆవశ్యకంగా గ్రహించారు. ఆ కత్తిరించడంలో కొంతమంది నైపుణ్యాన్ని సంపాదించారు ఇక వారికదే వృత్తి స్థిరమైంది; అదే అన్నం పెట్టింది; సమాజంలో ఆదరణ కలిగించింది. ఆనాటి నుండి వారు ఆ వృత్తి పేరునే పిలువబడ్డారు. మంగళ్లనీ పిలువబడ్డారు. కత్తి, కత్తెర, దువ్వెన, అద్దం వారి పనిముట్లు. కొన్ని రకాల కత్తులకు వృత్తి కారణంగా మంగలి కత్తులనే పేరుకూడా వచ్చింది.

* బెత్తెడు బెత్తెడు పెయ్యి
ఛేతాడంత తొయ్యి
ఎం చక్కని చేనంతా
అంతలో మింగే ఏం వింతా! (మంగలికత్తి)

అవి బెత్తెడు బెత్తెడు వెంట్రుకలు; అందంగా ఉన్నాయి. ఛేతాడంత తొయ్యి అంటే మంగలి కత్తి. అది వింతగా అంతలోనే మింగివేసింది.

* గుండు మీద ఎండ్రకాయంత
ఎన్న రావ పెట్టే
కాకి ముట్టరాదు-గద్ద ముట్టరాదు
లేకి పిట్టొచ్చి నాకి పోయె. (మంగలి కత్తి)

తలకాయను కొన్ని ప్రాంతాల్లో గుండు అంటారు. 'ఎండ్రకాయంత వెన్న రావ' ముద్దు ముద్దు వెంట్రుకలే. అవి ఎవరూ ముట్టరు; లేకి పిట్టపనికి మాలింది; అమాయకంగా ఉండేది; ఓ రకంగా ఉంటుంది, అదే మంగలికత్తి, నాకి పోవడమంటే గుండుగా చేయడమే,

ఆంధ్ర సాహిత్యంలో మంగలికీ, మంగలి పొదికీ మన్ననలు లభించిన కాలముంది. క్షౌరం మంగళకార్యంగా భావించి క్షౌరకళ్యాణమని పిలిచారు ఎంతో కొంత డబ్బుతీసుకొని కేశాలు కత్తిరిస్తున్నా ఇది కూడా సేవా వృత్తిలోకే వస్తుంది.

**4 7: చాకలిపని:-** ఎవరి వస్త్రాలు వాళ్లే శుభ్రం చేసుకోడం మంచిది. తొలిదశలో ప్రతివృత్తి స్వయం సేవకత్వం ద్వారా సాధించుకొన్నదే. అయితే వస్త్రాలు శుభ్రం చేయడంలో కొంత మంది సాధించిన నైపుణ్యం వారినీ వృత్తిలో నిలిపింది. వారే చాకళ్లయ్యారు. వీరికి నీరున్న ఏరుకావాలి; నీరు నిండా ఉన్న బావి కావాలి.

* మోకాటి నీళ్లల్ల
మొండోడు మొత్తుకొనె (చాకలి)

'మొండోళ్ల' (మొండివాళ్ల) కులమొకటి తెలుగునాట ఉంది. పూర్వం వీరి ముక్కుల్ని ఎవరో కత్తిరించారట, అందువల్ల వీరిని మొండోళ్లని పిలిచారట! వీళ్లు పిల్లుల్ని తింటారు; పిల్లి కనిపిస్తే ఇంట్లోకి వెళ్లయినా పట్టుకొంటారు. నోరు లబ లబ కొట్టు కొంటూ భిక్షమెత్తుకొంటారు. భిక్షం వేసేంత వరకు మొండి పట్టుతో అలాగే ఉంటారు. ఆ మొత్తుకోడం బట్టలుతికే ధ్వనిగా ఉందని జానపదుని భావన.

* తాపం లేక
చెరువులో నానేవాడు (చాకలి)

అవును! తాపమున్నా లేకున్నా వృత్తి ధర్మాన్ని నిర్వర్తించక తప్పదు. చాకలి బట్టల మూట తీసుకొని వెడతాడు. బరువు కారణంగా వంగడం తప్పదు.

* వంగిన్న గూనిపై
వన్నెల్ల మూట (ఛాకలి మూట)

నిజమే! ఆ మూట వన్నెలున్నది; వన్నె చిన్నెలున్నది ! వలపులున్నది. చాకలిమోసే ఆ మూటలో ఎన్ని కథలున్నాయో! ఎన్ని గాథలున్నాయో! ఎన్ని వ్యథలున్నాయో! అవన్నీ మోస్తూ వాటికంటిన మురికిని కడిగివేస్తూ, నిర్మల శుభ్ర వస్త్రాల్ని అందిస్తూ, సమాజ శిరస్సులో నాలుకలా వ్యవహరిస్తూ తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూ చీకటి బతుకుల్ని తెల్లవారుస్తున్న శ్రమజీవి చాకలి.

**4-8 : గాజులవృత్తి :-** భారత దేశంలోని స్త్రీలు గాజులు ధరిస్తారు. బాలికలు పగులగొడతారని రబ్బరు గాజులు వేయిస్తారు. ఆచారం కారణంగా విధవలు వెండి గాజులు ధరిస్తారు. ఎవరికైనా గాజులు కావలసిందే. అందుకే గాజుల పరిశ్రమలే వెలిశాయి. అక్కడక్కడ కొన్నిగృహాల్లో ఇది గృహపరిశ్రమగా కూడా స్థిరపడింది. తయ్యారీ ఎక్కడ జరిగినా అమ్మేవాళ్లలో కొందరిది వృత్తిగా స్వీకరించారు. అమ్మడంలోనూ, చేతులకు తొడగడంలోనూ వారూ విశేష నైపుణ్యాన్ని సాధించారు.

* వాడు పోతుండె
నేను పిలుస్తుంటి
వాడు పెడ్తుండె
నేనేడుస్తుంటె (గాజులు)

గాజులవాడు పోతుండగా ఆ గృహిణి పిలిచింది. గాజులు పెట్టేప్పుడు చేతులు నొప్పి పెడతాయి కొందరాబాధ భరించలేక ఏడుస్తారు.

* ఒత్తొత్తి పెట్టంగ
ఓయి ఓయి అనంగ
సాలు సాలనంగ
సంతోష పడంగ (గాజులు పెట్టడం)

* మాట ముచ్చటెప్పుడు
మట్ట వట్టినప్పుడు
గున్నుడు దన్ను డెప్పుడు

సగం జొచ్చినప్పుడు
సంతోస మెప్పుడు
సొంతం జొచ్చినప్పుడు (గాజులు తొడగడం)

* వస్తాడు - పరుస్తాడు
పిసుకుతాడు - పెడుతాడు (గాజులవాడు)

* అంగడి మీద గొంగడి
ఒకదాని మీద ఒకటపడి
అబ్బ అమ్మ అనంగ - అమ్మమ్మనంగ
వాడు పెట్టి పోయినాడు (గాజులు)

జానపద శృంగార సాహిత్యంలో గాజుల వానిది విలక్షణమైన పాత్ర. అమాయకురాం(డయిన పల్లె పడతుల్ని ఇతడు, నెరజాణలితణ్ని వశపరచు కొన్న వర్ణనలున్న గేయాలు పరమ రమణీయాలు. పైపొడుపు కథల్లో శృంగారం ప్రతిమించినా అంతరార్థం మాత్రం గాజుల అమ్మకమే. చాప పరచడం చేయి పట్టడం, చేయి మెత్తగ చేయడానికి మర్దించడం (నలపడం-పిసకడం) గాజులు తొడగడం లనే అంశాలు అన్ని పొడుపుల్లో సమానమే.

ఈ వృత్తిలో ఎంతో సుకుమారంగా వ్యవహరించాలి. మృదుభాషణం, వినయం విక్రేతకు తప్పనిసరిగా ఉండాలి. ఈ వృత్తి కి సంబంధించిన ఎదో ఒక పొడుపు కథ తెలియని వారు తెలుగునాట లేరు.

**4-9 : కల్లుగీత :-** కల్లుగీత ఈనాడొక పారిశ్రామిక వృత్తి అయ్యింది: దీని మీద ఎందరికో బతుకుతెరువున్నది; ప్రభుత్వానికి కూడా కావల్సినంత ఆదాయం వస్తున్నది. కాని కల్లుమాత్రం ఒంటినీ - ఇంటినీ గుల్ల చేస్తున్నది. తాటి చెట్టుసూ, ఈత చెట్టును గీయడం వల్ల కల్లు కారుతుంది. దాన్ని ముంతల్లో, సీసాల్లోనింపి అమ్ముతారు. కల్లుగీసిన వారిని - అమ్మేవారిని గౌడులనీ, గౌండ్ల వారనీ, ఈడిగలని అంటారు.

* చెట్టెక్కి సెలిమ తోడెటోడు (ఈడిగ)

కడివెడు నీళ్లూ కారుకురాగా
చాటెడు చెక్కులు చెక్కుకురాగా
అందులో ఒక రాజు అల్లల్లాడాడు
చెప్పితే నీ నోరు గప్పు మంటుంది
తప్పితే నీ నోరు చప్పగుంటుంది (గానుగ)

గానుగలో నలిగిన నువ్వుల (తెలికల) నుండి నూనె వస్తుంది. గానుగ చుట్టూ తిరుగుతుంటే, నువ్వుల్ని చల్లుతుంటే, నూనె కారుతుంటుందనీ, అందులో పిప్పి చేటెడు మాత్రమే వెడుతుందని పై పొడుపు కథ అర్థం. ఇప్పుడు మిల్లులే నూనె తీస్తున్నా అక్కడక్కడ గానుగలు కూడా ఈ పని చేస్తూనే ఉన్నాయి.

**4-11 : బెస్త పని :-** మత్స్య పారిశ్రామికులు బెస్తలు. వీరు చేపలు పడతారు; అమ్ముతారు. పడవలు, వలలు, గాలాలు వీరి పరికరాలు.

* దేహమెల్ల కనులు దేవేంద్రుడా కాడు
నరుని ఎక్కిగాని నడవబోడు
తనకు ప్రాణిలేదు తగిలి ప్రాణులజంపు
దీని భావమేమి తిరుమలేశ! (వల)[1]

వలతో చేపలు పడతారు. కుందేళ్లు తదితర జంతువుల్ని పడతారు. అయితే వేటి వలలు వాటివి.

* జీవంలేని గుఱ్ఱం యొక్క జిగటాకోలా
ఆకులేని అడవిలో వేటాడబోయె (పడవ)

---

1. దేహమెల్ల కనులు దేవేంద్రుడును కాడు
నరవాహనమునెక్కి నడచి పోవు?
నింకు ప్రాణమ్ములేదు తగిలి జీవులజంపు?
దీని భావమేమి తిరుమలేశ!

జీవంలేని గుఱ్ఱం పడవ, జిగటా కోల వల, ఆకులేని అడవి సముద్రం, వేటాడబోవడమే చేపలు పట్టడం.

* ఏట్లో ఎఱ్ఱిపాప ఏడుస్తుంది (పడవ)

ఎఱ్ఱిపాప పడవే. ఏడుపు మాత్రం పడవది కాదు. పడవమీద చేపలు పట్టే బెస్త పాట ఏడుపు.

ప్రపంచంలో జనం పెరుగుతున్నది. కొత్త ఆహార పదార్థాల అన్వేషణ చేయాల్సి వస్తున్నది. ఆ దృష్టితో చూస్తే, పౌష్టికాహారాన్ని అందించే వృత్తిగా దీన్ని పరిశీలిస్తే మత్స్యపారిశ్రామికుని పని తక్కువవేమీకాదు. నిజానికి ఏ వృత్తీ తక్కువదికాదు; ఏ వృత్తీ ఎక్కువదికాదు. పొడుపుకథా కారుని దృష్టిలో అన్నీ సమానమే. అందుకే అన్నీ ఒడిలోకి లాక్కొన్నాడు

**4-12 : ముచ్చెపని :-** ముచ్చెవారు (మోచ్చాలు) చెప్పులు చేస్తారు. చర్మకార వృత్తి చేపట్టిన వారెవరైనా చేయవచ్చు. మాదిగలి వృత్తిలో నైపుణ్యం సాధించారు. ఆరెకత్తి, రాతిదిమ్మ, ఇనుప కడ్డీ, లంద, తవతరాలు వీరి పరికరాలు.

* మంచం కింది మైసమ్మ
పయనమొచ్చే లేవమ్మ (చెప్పులు)

మైసమ్మ ఒక దేవత. కోళ్లను మేకల్ని దున్నపోతుల్ని బలిగోరే దేవత అని ప్రసిద్ధి. మహిషమంటే దున్నపోతు, మహిషానికి స్త్రీ వాచకం మహిషి మహిషమ్మ. మహిషమ్మకు వికృతే మైసమ్మ. చెప్పులు దున్నపోతుల తోళ్లతో, బఱ్ఱెల తోళ్లతో చేస్తారు. ప్రయాణ సమయంలో కాళ్లకు వేసుకొని వెళ్ళిపోతారు. మాదిగలెన్నో ప్రహేళికలు చెబుతున్నారు. అయితే వారినాడొక వృత్తికే కట్టుబడి లేరు. ఈ చెప్పులు కుట్టేపనికి సంబంధించిన ప్రహేళికలు అంతగాలేవు. ఉదాహరించినది కూడా ఒక అలవాటును తెలిపేదేగాని ముచ్చెపనికి నిదర్శనంకాదు.

**4-13 :- మంత్రసాని :** పూర్వం మంగలి వృత్తి [illegible] మహిళకే

మంత్రసాని పని చేసేవారు. పురుడుపోసేపని మంత్రసానిది. పురుడు పోసేవారు ఏ కులానికి చెందిన వారైనా ఇప్పటికీ గ్రామాల్లో వీరిని పేరుతోనే పిలుస్తున్నారు.

* ఇత్తులేసి పొట్టునాటడం అంటే (మాయి, మావి)

పొట్టు పారవేస్తారు; విత్తునాటుతారు. పొడుపేమో విపరీతంగా ఉంది. ఏత్తు అంటే శిశువనీ, పొట్టు అంటే మావి అనీ తెలిసినప్పుడు అసంగతం సుసంగతమవుతుంది. శిశువును చేత పట్టడం, మావిని భూమిలో నాటి పెట్టడం ఈ రెండు పనులూ మంత్రసానే చేస్తుంది. బొడ్డుకోసి ఈ రెండింటినీ వేరుచేసే మంత్రసాని వృత్తి తల్లికి శిశువుకు మరో జన్మను ప్రసాదించే అతి పవిత్ర కార్యం.

**4-14 : పుష్పలావికలు :-** సంస్కృతాంధ్ర సాహిత్యాలలో పుష్పలావికలకెంతో ప్రాధాన్యముంది. వీరు కథా గమనానికంతగా ఉపయోగించే వారు కాకున్నా కథాకాశంలో మెరుపుల్లాంటివారు. అందువల్లనే హృదయాల్లో అలా నిలచిపోతారు. ప్రాకృతిక సత్యాన్ని ప్రకటించే ఒక పొడుపు కథలో పరోక్షంగా పుష్పలావికల ప్రసక్తి వచ్చింది.

* ఇంటిముందు పోయేప్పుడు తవ్వెడు
అంగట్లో కూసుంటే మానెడు (మల్లెమొగ్గలు)

తవ్వెడు మల్లెమొగ్గలు తీసుకొని ఎక్కడ కొంత సేపు కూచున్నా అవి మానెడు అవుతాయి. అంగట్లో కూచోడం అమ్మకానికే కాబట్టి తప్పదు మరి. అలా చూస్తుండగానే మొగ్గలు విచ్చుకుంటాయి; పువ్వులవుతాయి. అవి రెట్టింపవుతాయనే ఈ ప్రహేళిక చెబుతుంది. రెండు తవ్వలు ఒక మానిక; ఒక మానిక మూడుశేర్లకు సమానం ఇలా పరచుకొని పదిమంది కూచుంటే అది పూల అంగడే అవుతుంది. ఇది ఏ కాలంలో పుట్టిన పొడుపు కథో చెప్పలేము. ఆ అంగట్లో కూచున్నవారు పుష్పలావికో, పుష్పలావికుడో చెప్పలేము. అయితే నగరాల్లో పువ్వుల్నిబుట్టలుగా పోసుకొని వీధి వీధి తిరిగే వారు, దండలల్లుకొని సైకిళ్లమీద వెళ్లేవారు ఒక వృత్తిగా జీవిస్తున్నారు. కాబట్టి ఇదీ ప్రజా జీవనంలో అంతర్భాగంగానే తీసుకోడం జరిగింది.

**4-15 : వ్యాపారం :-** వ్యాపారం ఉత్పత్తి రంగానికి చెందిన వృత్తి కాదు; ఇది సేవా ధర్మం. వస్తుసేకరణ, వస్తువికేంద్రీకరణ (వచ్చిపుచ్చుకొనడం, డబ్బు పుచ్చుకొని అమ్మడం) కారణంగా సంపాదన పెరుగుతుంది. ఉత్పత్తిదారునికి వినిమయ దారునికి మధ్యవర్తి వ్యాపారి. తక్కెడ, బాట్లు, శేర్లు (తూనికలు-కొలతలు) ఇతని పరికరాలు. ఇవివలే వచ్చిన ఈ చిక్కు లెక్కలో పొడుపుకథా లక్షణాలున్నాయి. వ్యాపార సంబంధి విషయాలున్నాయి.

* ఒక వ్యాపారికి రెండు గుర్రాలున్నాయి
ఆ గుర్రాల మీద 100 టెంకాయలు
తీసుకొని బయల్దేరాడు. అతడు
50 పోలీసు స్టేషన్లుదాటివెళ్లాలి.
ఒక్కొక్క స్టేషన్లో గుర్రానికొక టెంకాయ
చొప్పున సుంకమిచ్చివెళ్లాలి. అలాగే
50 స్టేషన్లలో ఇస్తూ వెళ్ళాడు. అతని
దగ్గర మిగిలిన టెంకాయలెన్ని?

50 స్టేషన్లు 100 టెంకాయలు 2 గుర్రాలు, గుర్రానికొక టెంకాయ; ఇంకేం మిగుల్తాయి అనుకొంటారు కాని 25 కాయలు మిగిలాయి. అతను వ్యాపారి; అతని ఉపాయం అతనికున్నది. 25 స్టేషన్ల వరకు అతనొక గుర్రంపైనున్న టెంకాయలే ఇస్తాడు. అనగా అప్పటికి 50 టెంకాయలు అయిపోతాయి. ఇక్కడి నుండి కాయలు మోసేదొకటే గుర్రం. కాయలు లేని గుర్రానికి సుంకముండదు. మిగిలిన 25 స్టేషన్లలో 25 కాయలే సుంకంగా చెల్లించగా అతనికి చివరికి మిగిలినవి 25.

* ఒక్కటె పట్టుకుంటె
రెండూ ఊగులాడె (తక్కెడ)

త్రాసు పట్టుకొంటే, అంటే తూకం కొరకు పైకెత్తితే రెండు వైపుల్లోని పళ్లాలు ఊగులాడుతాయిగదా! ఆ విషయమే పొడుపుకథకెక్కింది.

* ఆకులేని మాను
గల గల మనెను (సంత, అంగడి)

ఇంతవరకు ప్రస్తావించిన ఈ వృత్తుల వారంతా కలిసే చోటు సంత. తెలంగాణలోని కొన్ని జిల్లాల్లో (పాలమూరు) సంతను అంగడి అంటారు. మరికొన్ని చోట్ల కొట్టునే అంగడి అంటారు.

'ఒడి ఆకుపేని మాను' కాని ఎప్పుడూ గల గల మంటుంది. అందరూ కలిసి నప్పుడు ఎవరేమంటున్నారో ఎవరికీ స్పష్టంగా తెలియదు. ఆ కలకలమే' గలగల.

ప్రపంచ మానవులందరూ వృత్తి జీవన రంగంలో ఉన్నవారే. చివరికి అడుక్కోడం కూడా భిక్షుక వృత్తిగా పరిగణితమయింది. వృత్తులకు సంబంధించిన పొడుపుకథలెన్నో ఇంకా ఉన్నాయి. ప్రజా జీవనమనే సాగరంలో మునిగితే ఆ ప్రహేళికారత్నహారాలతో తెలుగు సాహిత్య సుందరి గళసీమనందంగా అలంకరించవచ్చు.

## 5-5 : క్రీడా వినోదాలు

పొడుపు కథలూ జానపద సాహిత్యమనే ద్వితీయ ప్రకరణంలో క్రీడా వినోద ప్రహేళికల్ని వివరించడం జరిగింది. జానపదులు నాగరికులనే తేడా పాటించకుండా ఈ శీర్షిక క్రింద ప్రజలందరికి సంబంధించిన అంశాలున్న పొడుపు కథల్ని స్పృశిస్తాను.

క్రీడలూ—వినోదాలూ వృత్తులు రావు. జీవితంలో అవే ప్రధానమూకావు, అవి అనుషంగికాలు మాత్రమే. క్రీడలు క్రమశిక్షణను పెంచుతాయి. ప్రజానీకం మధ్య సౌర సౌచ్చాలు దూరం చేస్తాయి. జీవితంలో ఉత్సాహాన్ని నింపుతాయి. రాష్ట్ర శక్తి ప్రదర్శనానికి క్రీడలే ఆధారం. ప్రపంచంలోని వివిధ దేశాలమధ్య సాంస్కృతిక సంబంధాల్ని పటిష్ఠం చేసే శక్తి క్రీడా వినోదాలకుంది.

ప్రహేళిక కూడా ఓ ప్రత్యేక క్రీడే శారీరక శ్రమ లేకపోవచ్చు గాని, మానసిక పరిశ్రమ చేయనిదే ఒక్కోసారి సమాధానం లభించదు స్త్రీ సంబంధి, పురుష సంబంధి జానపద క్రీడలెన్నో ఉన్నాయి. నవనాగరికులు ఆడే వాలీబాల్, ఫుట్‌బాల్, బాస్కెట్‌బాల్, హాకీ, క్రికెట్ తదితర క్రీడలు ఇప్పుడందరివై పోయాయి. కబడ్డీ అతి ప్రాచీన కాలం నుండి ఉన్న భారత జాతీయ క్రీడ.

పొడుపు కథా క్రీడ కూడా ఎంత పాతదో అంత కొత్తదే. ఈ ఆటకు సంకేత స్థలమేదీలేదు. నలుగురొకదగ్గర కలిస్తే చాలు. ఉబుసు పోకకు ప్రారంభమై పంతాల దగ్గరికి తీసుకొని వెడుతుంది. పాతవీ వస్తాయి; అప్పటికప్పుడే పుట్టుకొని వచ్చినవీ రంగం మీదికి వస్తాయి.

ప్రజాజీవనంలో సమధికోత్సాహాన్ని నింపేకొన్ని క్రీడల్ని పరిశీలిద్దాం. పొడుపు కథలకే పరిమితమైన కొన్ని వినూత్నాంశాలు తెలుసుకుందాం.

**5-1 : క్రీడలు :–** ఈ క్రింది పొడుపు కథ పిరికిపందనుద్దేశించింది అనిపిస్తుంది. కాని అది చెండు. కాలి బంతి లేదా చేతి బంతి.

* కొడ్తే ఉరుకుతడు (చెండు)

కోలాటం వేసేప్పుడు పాడే ఈ కింది పాట ఇదివరకే వచ్చింది. కోలాటంలో ఆట–పాట, విజ్ఞానం - వినోదం లన్నీ ఉంటాయి.

* పోతుంటిరా జాణ పోతుంటిరా
  చార్ కమాను కట్టమీద పోతుంటిరా
  ఒగణ్ణి నలుసుకుంట – ఒగణ్ణి సుట్టుకుంట
  ఒగని కోసరం నేను వోతుంటిరా!
  పొవ్వాకు నలుసుకుంట - సుట్టాకు సుట్టుకుంట
  ఇంగలం కోసరం నేను వోతుంటిరా!

శారీరకంగా అలుపునూ, మానసికంగా ఉల్లాసాన్ని కలిగించే క్రీడ కోలాటం. ముఖ్యంగా దసరా దీపావళి పర్వదినాల సందర్భాల్లోనూ, వెన్నెల రాత్రుల్లోనూ ఆడుతుంటారు. ఇప్పుడు గ్రామాలకు విద్యుద్దీపాలు వచ్చినందువల్ల యువకులు కొన్ని గ్రామాల్లో ప్రతి దినం ఆడుతున్నారు.

* గెలిచే జట్టు
  ఎప్పుడూ వెనక్కే లాగుతుంది (తాడులాగే ఆట, టగఫ్‌వార్)

తాడు లాగే ఆటలో రెండు జట్లుంటాయి. త్రాడు మధ్యభాగంలో చేలి రుమాలు గడతారు! మూడు అడ్డగీతలు గీస్తారు. మధ్యగీతకు సమాంతర దూరాన రెండువైపులా రెండు గీతలుంటాయి. చేలిరుమాలను కట్టిన తాడు భాగాన్ని సరిగా మధ్య గీత దగ్గర ఉంచుతారు. తాడు పట్టి అటువైపొకరు - ఇటువైపొకరు (రెండు జట్లు) లాగుతారు. ముందుకు పోవాలి గాని వెనుకకు లాగడం ఈ ఆటలోని విశేషం. ఎవరి వైపున్న గీతను చేలి రుమాలు దాటుతుందో వారు గెలిచినట్లుగా పరిగణిస్తారు. పాఠశాలల్లో, కళాశాలల్లో, గ్రామీణ క్రీడా మైదానాల్లో ఈ ఆట నేటికీ కొనసాగుతూనే ఉంది.

* చస్తుంటారు - పుడుతుంటారు
పుడుతుంటారు - చస్తుంటారు
ఈ ఆట పేరేమిటి! (కబడ్డీ)

ఈ ఆట పేరేమిటి అనే ప్రశ్న లేకపోలే కొంత మానసిక పరిశ్రమ చేయాల్సి వచ్చేది. పుట్టినజీవికి చావు తప్పదు; చచ్చిన ప్రాణికి పుట్టుక తప్పదు. అంటూ అటు జీవన సత్యాన్ని తెలిపేది, ఇటు నవనవోత్సాహాన్ని నింపేది కబడ్డీ తెలుగునాట ఇది చెడుగుడుగా ప్రసిద్ధం. ఇది ఇప్పుడు భారత జాతీయ క్రీడగా పేరు పొందింది.

* 4 బాజార్లు 7గురు లంజలు
6 గురు మిండెలు
4 బాజార్లు తిరిగి
నడింట్లకు వోయింద్రు (పచ్చీసు)

ఇది ముఖ్యంగా ఆడవారె ఆడే ప్రజలందరినీ అలరించే ఆట ఆసక్తినీ ఆలోచననూ పెంచే ఆట. ఇందులోని 4 వీధులు (బజార్లు) పచ్చీస్ ఆకారాన్ని తెలుపుతున్నాయి. 7గురు లంజలు గవ్వలు. 6గురు మిండెలు కాయలు. అయితే ఆడే నలుగురికి $4 \times 6 = 24$ కాయలుంటాయి. $4 \times 4 = 16$ కాయలతోకూడా ఇప్పుడు ఆడుతున్నారు. ఇద్దరే ఆడితే $2 \times 4 = 8$ కాయలే ఉపయోగిస్తున్నారు. గవ్వలతో పందాలు వేస్తారు. ఆ పందెం ప్రకారంగా ఎవరి కాయల్ని వారు అన్ని

బజార్లలోని గడుల్ని – గడుల్ని తిప్పి తిప్పి మధ్యరంగానికి తెస్తారు. కాయలు ఒక్కొక్కటే నడింటికి చేరుతుంటాయి. అలా చేరడానికి గవ్వలతో వేసిన పందెమే ప్రధాన కారణమవుతుంది.

వేటకూడా క్రీడే. వేటాడ్డానికి వాడే సాధనం తుపాకి. తుపాకిపై కొన్ని పొడుపు కథలు పుట్టినై.

* మొదలున ప్రూనై యుందును
తదుపరి నిలువెల్లలోహధరుడై యుందున్
హృదయము కర్కశ నిలయము
కదలికచే హంతకుడను కమగొనగలరా! (తుపాకి)

తుపాకి నిర్మాణ విధానం పై పొడుపు కథ ప్రస్తావించింది. దాని హృదయం కర్కశ నిలయమే. అందుకే కదలితే హంతకుణ్నవుతానంటున్నది.

* నీళ్లు తాగదు, మేత మెయ్యదు
అడవికి వెళ్లి కేక లేసె (తుపాకి)

* తుమ్మ తూటుల నుంచి[1]
బొమ్మ మెట్లనుంచి
పాటిచ్చి చూసెరా పైడికంపె (తుపాకి)

* వడ్లోనికిత్తునా - వంకదీపిత్తునా
కమ్మరోనికిత్తునా - కట్లేపిత్తునా
పొదపట్లగోదల్ల లెంకలేపిత్తునా (తుపాకి)

కొందరికి వేట వ్యసనమైంది. ఆ వ్యసనాన్ని ఈ పొడుపు కథలు తెలుపక పోయినా తుపాకి తత్త్వాన్నివి తెలుపుతున్నాయి. అడవి మృగాల్ని చంపడం సామాజిక ధర్మమా! అది క్రీడా! వేట వ్యసనమా! అనే మీమాంస ఇక్కడ అక్కరలేదు. ఇది కూడా ప్రజా జీవనంలో ఉంది అనే లంశమే ఇక్కడ కావల్సింది ప్రజా జీవనంలో అనేక రకాల క్రీడలు కనిపిస్తున్నాయి. అవన్ని ప్రత్యేకంగా పరిశీలించాలి. పొడుపు కథల్లో కొన్ని ఆటల ప్రస్తావన మాత్రమే

1. తుపమాట్లకెల్లి - బ్రహ్మరంధ్రములోంచి

కనిపిస్తుంది. అచ్చమైన ప్రజా సాహిత్యంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో వారి ఆచార వ్యవహారాలు వినోద విజ్ఞానాలు తప్పకుండా ప్రతిబింబిస్తాయి.

**5-2 : వినోదాలు :** డప్పులు, కొమ్ములు, పీకెలు, మద్దెళ్ల, చెంబులు, కుండలు ప్రజా జీవనంలోని ఆచార సంప్రదాయాల ప్రదర్శనల సందర్భంలో ప్రచారార్థముపయోగపడే పరికరాలు; అయితే అవి వినోద సాధనాలు కూడ. అలాంటివే కొన్ని పొడుపు కథల్లో చోటు చేసుకున్నాయి.

* ఆ చెంప ఈ చెంప వాయించినప్పటికి
మనలను సంతసింప జేసేది ఎవరు! (మద్దెల)

భజనలు చేసేప్పుడు, కోలాటాలాడేప్పుడు, భగవంతునికి మేల్కొల్పు లిచ్చేప్పుడు మద్దెల ప్రయోజన మేంటో తెలుస్తుంది. నృత్యాల్లో, నాటకాల్లో, సర్వ ప్రదర్శనకళల్లో భావానుగుణమైన నటనకు శబ్దం ద్వారా అర్థాభివ్యక్తీకరణం చేసేది మద్దెల. దాని చెంపల్ని వాయించడమంటే మనల్ని సంతోషింపజేయడమే

* ఒగమ్మ ఇంకో అమ్మదగ్గరకోయి
అక్కా అక్కా నన్నొకవంక కొడుతున్నరన్నది
నిన్ను ఒక్కొంక కొడితే
నన్ను రొండొంకల కొడుతున్నారని
ఆయమ్మ అన్నది (రోలు - మద్దెల)

అక్కా చెల్లెండ్రు పడుతున్న అష్టకష్టాలే పైకి కనిపిస్తాయి. దంచేప్పుడు రోలును ఒకవైపునుండి, మ్రోగించేప్పుడు మద్దెలను రెండు వైపులనుండి కొడతారు.

* గట్టుమీద పోరడు
ముట్టంగనే ఏడుస్తడు (డప్పు)

* వంగిసూస్తే వంక
తొంగిసూస్తే తొఱ్ఱ
అనిచ్చుకుంటే అబ్బుబ్బుబ్బు (కొమ్ము)

బ్యాండు మేళాలు వచ్చినై, డప్పు కొమ్ముల ప్రాధాన్యాన్ని తగ్గించినై. గ్రామాల్లో జరిగే పెండ్లి పేరంటాలకు, సత్యనారాయణవ్రతాలకు, మైసమ్మ పండుగలకు, వనవాసాలకు (పెట్లలోకి వెళ్ళడానికి) శవయాత్రలకు, డప్పు కొమ్ములే దిక్కు. నగరాల్లోనూ డప్పు కొమ్ముల వాడకముంది. డప్పు మోగించడంలో నైపుణ్యాన్ని సాధించిన వ్యక్తి డప్పు సాయన్న అయ్యాడు; కొమ్ము ఊదడంలో సామర్థ్యాన్ని బాగా చూపించిన వ్యక్తి కొమ్ము మైసన్న అయ్యాడు.

గట్టంటే డప్పు. అది ముట్టిన వెంటనే శబ్దం వస్తుంది కొమ్ము అర్ధ చంద్రా కారంలో వంకరగా ఉంటుంది. ఈ వంకరలు ఒకటికి మించి కూడా ఉండవచ్చు. కొమ్ము నోటికి అన్చుకోగానే ధ్వనిరాదు.; గట్టిగా ఊదాల్సి ఉంటుంది.

* అండ్ల పెట్టి ఊదితే
అబ్బుర బొబ్బ (పీకె)

చిన్న పిల్లలు వినోదార్థమూదే దానిని పీకె అంటారు. తంగెడికొమ్మను విరచి, మీది తోలు చెడకుండా లోని కట్టె తీసివేస్తారు. పై తోలు రంధ్రం చెదరకుండా సమంగా కత్తిరించి నోట పెట్టుకొని పశువుల కాపర్లు తదితరులు ఊదుతారు. వీటినే తంగెడి పీకెలంటారు. నగరాల్లో వాడే వాటిని 'సీటీలని' 'విజిళ్ల'ని అంటారు.

* ముప్పయి రూపాయలు పెట్టి
ముండను కొనుకొచ్చి
ముందల పెత్తె
అదేడ్సనేనేడ్చు (హార్మోనియం)

ఒకప్పుడీ దేశంలో కన్యాశుల్కమనే ఆచార ముండింది. ఈ ఆచారం కూడా అన్ని ప్రాంతాల్లోనూ, అన్ని వర్గాల్లోను లేదు. ఇది అందరేమి పాటించలేదు. స్త్రీలు తక్కువ కావడం, విదేశీ దురాక్రమణ దారులు స్త్రీల నపహరించడం, తదితర కారణాలవల్ల ఈ ఆచారం నెలకొంది. ఇప్పుడిది లేదు వరశుల్కమున్నది. ముప్పది రూపాయల కన్యాశుల్కమిచ్చితెచ్చుకొన్న ఆయువతి ఏడుస్తున్నదనీ,ఆమెను

ముందుంచుకొని తాను కూడా ఏడుస్తున్నాడని పొడుపు కథ ప్రస్తావిస్తున్నది. ఆపార్థం మబ్బు విచ్చిపోతే అది హార్మోనియం అని తెలుతుంది. హార్మోనియం కేవలం వినోద సాధనం కాదు. అది సంగీతానికుపకరించే పరికరం కూడ. వీణ కూడ అటువంటిదే. ఈ క్రింది పొడుపు పద్యం వీణ విషయమే చెబుతున్నది.

* కాయమీద మ్రాను కడు రమ్యమైయుండు
మ్రాను మీద లతలు మలయుచుండు
లతలమీద వేళ్లు నాట్యమాడుచు నుండు
దీని భావమేమి తిరుమలేశ!

వీణ మొదలు భాగం తలకాయవలె ఉంటుంది. దాని పై భాగం తీగలతో కట్టి ఉంటుంది. కాయమీద చెట్లెలా ఉంటాయని అలా నిలిచిపోతాడు శ్రోత. లతల మీద వ్రేళ్ల నాట్యమాడడం తీగలు మీటడం, వీణ ప్రజలందరికి అందుబాటులో ఉండే సాధనం కాదు అయితే వస్తు సంపాదన అనేది అభిరుచికి సంబంధించిన అంశమే కాని కొందరంటున్నట్టు కలిమి లేములు ప్రధాన కారణాలు కావు.

ఇంతవరకు పొడుపు కథలలోని కొన్ని వినోద పరికరాలకు సంబంధించిన అంశాలు ప్రస్తావించడం జరిగింది. ఇక ముందు "అన్యాల"నే శీర్షిక క్రింద కొన్ని ప్రహేళికలను పరిశీలిద్దాం.

**5-3 : అన్యాలు :** అక్షర శబ్ద చమత్కారం వల్ల కొన్ని పొడుపు కథలు అలాగే గుర్తుంటాయి. ఈ క్రింది పొడుపు కథ అలాంటిదే.

* ముక్కుమీది కెక్కు
రెండు చెవులు నొక్కు
టక్కు నిక్కుల సక్కు
జారిన పటుక్కు (కళ్ళజోడు)

ఇందులోని ద్విత్వకార ప్రయోగం ఒక చమత్కారంగా భాసిస్తుంది ఇది సులోచనాలకు సంబంధించిన విషయమని వెంటనే తెలిసి పోతుంది.

* మెడ వుంది కాని తలలేదు
చేతులున్నాయికాని వేళ్లులేవు ఏమిటది? (చొక్క)

మనిషి శీత వాతాతపాదుల నుండి కాపాడుకోడానికి ధరించేదే అయినా చప్పున స్ఫురించక పోవచ్చును. పొడుపు కథ ఒక క్రీడగా భావించి సృష్టించిన ప్రహేళికలెన్నో ఉన్నాయి. ఇవి బాలబాలికలు సృష్టించినవే.

* కట్టెల్లో నడిచే కట్టె ఏది (నీరుకట్టె)
* కాయల్లో నడిచే కాయ ఏది (ఎంద్రకాయ)
* తొడిమ లేని పండు (విభూలిపండు)
* ఆకులేని పంట (ఉప్పు పంట)
* తన కంటె పెద్దడాలు ఏది (అప్పడాలు)
* గడ్డామి - సొప్పామి - కనుమవామేది (కుమ్మరామి)
* నీటి కోడి - నిప్పుకోడి - కనుమకోడి (పకోడి)
* పండ్లల్ల పండు ఏ పండు పెద్దది (తలపండు)
* దూలాలల్లో ఏ దూలం పెద్దది (ముక్కుదూలం)

ఇలా పిల్లలు అడిగే పొడుపు కథ లెన్నో ఉన్నాయి. పెరిగిన పరిసరాలను బట్టి వారికి పరిజ్ఞానం ఉంటుంది. పొలాల్లో తిరిగే వారు నీరు కట్టెలూ ఎంద్రకాయన్లూ చూస్తారు. ఉప్పు, అప్పడం, పకోడి పిల్లలందరికీ తెలుసు. విభూతి కొందరికి తెలిసి ఉంటుంది. కుమ్మరి ఆవం నగరాల్లోని పిల్లలకు పరిచయ ముండదు. ఇక తల, ముక్కు శరీరాంగాలు అందరికీ తెలిసినవే.

* ముసలోని గడ్డం
జుట్టెడు బెల్లం (మామిడి పండు)

మామిడి పీచు రుచిని తెలుసుకోడానికి ఓ అరబ్ పాదుషా చింతపండు ఉప్పు, బెల్లం పట్టించి నాకిన గడ్డం తమాషా కథను మించి పోయిందీ పొడుపు కథ.

* అచ్చి కజ్జావు — బుచ్చి కజ్జావు
సీళ్లంచుకొచ్చి - నిల్చె కజ్జావు (చెప్పులు)

చెప్పులు నల్లగానే ఉండాలని నియమమేమి లేదు. కానిసాధారణంగా పూర్వ కాలం గేదెలు, దున్న పోతుల తోళ్లతోనే చెప్పులు చేసే వారు. వాటికి నల్లరంగు వేయకున్నా నల్లగానే ఉండేవి. ఈ పొడుపు కథ ఆనాటి చెప్పులనే ప్రస్తావించింది.

జానపద సాహిత్యంలో ముక్తపద గ్రస్తం లాంటి గేయాలు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. అంత్య పదాన్ని గ్రహించి ప్రశ్నించే పద్ధతి పొడుపు కథల్లోనూ ఉంది. ఈ క్రింది ప్రశ్నోత్తర రూప ప్రహేళిక ఆది పదాన్ని గ్రహించింది.

* కొక్కొరొకో - కోడికూసెను
ఏం కోడి - రాముని కోడి
ఏం రాముడు - అడవి రాముడు
ఏం అడవి - కారడవి
ఏం కారు - గోశ కారు
ఏం గోశ - పుట్ట గోశ
ఏం పుట్ట - పాముపుట్ట
ఏం పాము - నాగుపాము

ఇది వినోదార్థం కల్పించిన పద సంయోజనం. ఇలాంటి గేయాల్లోని కొన్ని పదాలకు అర్థం కనిపించదు. ప్రశ్నోత్తరాల నిమిత్తమే పదాలు కూర్చారని పిస్తుంది.

ప్రహేళికలు ప్రజల క్రీడా వినోదాల్ని ప్రతిబింబించిన తీరు ఇంతవరకు వివరించడం జరిగింది. ఇక పారమార్థిక జీవనానికి సంబంధించిన కొన్ని పొడుపు కథల్ని ప్రస్తావిస్తా.

## 5-6 : పారమార్థిక జీవనం

పొడుపు కథలు జానపద సాహిత్యమనే ప్రకరణంలో కొన్ని తాత్త్విక ప్రహేళికల్ని, కొన్ని అస్పష్ట ప్రహేళికల్ని వివరించి అవి పారమార్థిక జీవనాన్ని

స్పృశించిన తీరుతెన్నుల్ని సమీక్షించడం జరిగింది. కర్మ సంబంధులు, జ్ఞాన సంబంధులు, భక్తి సంబంధులూ అయిన జానపదుల పొడుపు కథలు జీవాత్మ విశ్వాత్మలకు సంబంధించిన భావాల లోతుల్లోకి వెళ్లక పోయినా పారమార్థిక సాహిత్య ప్రాతినిధ్యం విషయంలో తమ వంతు బాధ్యత నిర్వర్తించాయి.

స్వీయ ప్రయోజనాల్ని వదలిపెట్టి, త్యాగమయ జీవనం గడుపుతూ, సమాజం కొరకో, రాష్ట్రం కొరకో, విశ్వం కొరకో, ధర్మంకొరకో అంకితమై పని చేసిన వారిదే పరమార్థ దృష్టి అనాలి. దేశ పరమ వైభవ చింతన, దైవ చింతన రెండూ పారమార్థిక జీవనాంశాలే అవుతాయి. ప్రహేళిక లక్షణాలున్న ఈ క్రింది మార్మిక గేయం జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి లో శ్రీ నేదునూరి గంగాధరముదాహరించారు. ఏక్ తారానో, తాంబుర్లనో తీసుకొని ఇలాంటి పాటలు పాడుతుంటారు.

* ప : చేతుల కందవు రెండు
శివనీతులు చెప్పగ విందురటన్నా

ఊరిపడమట నొక్క పాములేనిపుట్ట
పుట్టలోన ఊరపిచ్చుకంట
పుట్టమీద నొక్క యూసర వెల్లియట
పట్టిదేసి వెన్న మెక్కునటన్నా ॥చే॥

మొదలులేని మ్రాను, ఆకులేని తీగ
తీగెతీగెకు అయిదు కొమ్మలటా
మొగ్గలేని పిందె తొడిమలేని పండు
నోరులేని బాల మ్రింగెనటన్నా ॥చే॥

గుఱ్ఱము ఎనుబోతు కూడి చరించగ
నట్టెడ్ల మీదను నడచునటా
జెట్టిపోతు జింక మట్టి మ్రాను మీద
నమలక యాబైలు మేసునటన్నా ॥చే॥

గురుతుగ యాగంటి గురుకృపగలిగితే
గురుతుగ నంజయ్య తెల్పునటా
శివుని భక్తులైతె శివుని సన్నిధికి
జేరుమని శివుడు చెప్పనటన్నా ॥చే॥

ఇందులోని పరమార్థమంతా విడుపుల్లో తేలవలసిందే. అర్థాపేక్ష లేకుండానే గుళ్లల్లో, వీధి అరుగుల మీద, రచ్చకట్టుమీద ఈ పాట నేటికీ ప్రజలు పాడుకుంటున్నారు. దైవచింతన పొదుగుకొన్న పొడుపు పద్యాలసంఖ్య తక్కువేమీలేదు.

* ఇంద్ర తనుజుని ఇంతి నామంబేమి (సుభద్ర)
ఇందు శేఖరుహారమందు నేమి (రుద్రాక్ష)
గోపాల కృష్ణుండు గోట నెత్తినదేమి (అచలం)
కొడుకును బొంచితా గూడు చేమి (స్త్రీలను)
పాండు పుత్రుల కెప్డు పగగోరు నెవ్వడు (రారాజు)
ఫాలాక్షుదేసతి భ్రమసిగూడె (ఉమను)
గంధర్వు చేజిక్కి కరి ఎట్లు మొరపెట్టె (ఓ స్వామి)
కడగొట్టు దశరథు కాంత ఎవరు (సుమిత్ర)

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
భద్రగిరి రామస్వామి నిబద్ధముగను
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

శ్రీ పాపిసెట్టి సీతారామకవి వ్రాత ప్రతిలోనిదీ పద్యం, భద్రాచలరామస్వామి కెందరో భక్తులున్నారు; భక్తకవులున్నారు, ఓ భక్త రామదాసు, ఓ సీతారామకవి. తిరుమలేశ శతక కర్త పార్వతీ దేవిని స్మరించిన తీరు పరమ రమణీయం.

* కన్నతల్లి రీతి కాపాడుదును నేను
దయనుబ్రోతు, కన్నతల్లిగాను
లోకమంతమందులోకాంబనై యుందు
దీని భావమేమి! తిరుమలేశ (పార్వతి)

పైకి రామ నామ స్మరణం, విడుపుబియ్యపు గింజ ఈ క్రింది పొడుపుకథ తీరు తెన్నులిన్ని చూడండి.

* ఒండొండు జలములో ఓ రాముడు జన్మించె
ఆ రాముని ఉదరంబున శ్రీరాముడు జన్మించె
శ్రీరాముని ఉదరంబున వజ్రము జన్మించె
ఏమా కథ! (బియ్యపు గింజ)

నీట పుట్టిన రాముడు వరి; వరి ఉదరంలో పుట్టిన రాములు వడ్లు. వడ్ల ఉదరంలో పుట్టిన వజ్రం బియ్యపు గింజ. అన్నానికి పరబ్రహ్మానికి వేసినముడి అద్వితీయం, అపురూపం.

గుళ్లున్నాయి; గుళ్లల్లో దేవుళ్లున్నారు; దేవుళ్లకు పూలు సమర్పిస్తారు. సమర్పించే పూల మీద కూడా ఓ పొడుపు కథ (లెక్క).

* మూడు గుళ్లు, గుళ్లముందు గుండాలు
గుండంలో ముంచితే ఉన్నపూలు రెట్టింపవుతాయి
వాటిని సమానంగా ఉంచగా మిగులుండవు
మొదట తెచ్చిన పూలెన్ని!
ఒక్కొక్క గుడిలో పెట్టిన పూలెన్ని!

భక్తుడు 7 పుష్పాలతో వస్తాడు: మొదటి గుడి గుండంలో మునుగుతాడు. అవి 14 అవుతాయి. అందులో8 ఆ గుడిలోని దేవుని పాదాలకు సమర్పిస్తాడు. మిగిలిన ఆరింటితో బయలుదేరి రెండో గుడి ముందున్న గుండంలో మునుగుతాడు. 12 అవుతాయి. రెండో గుడిలోని దేవుని పాదాలకు 8 సమర్పిస్తాడు. మిగిలిన 4 పుష్పాలతో మూడో గుడిముందున్న గుండంలో మునుగుతాడు. అప్పుడవి 8 అవుతాయి. ఆఎనిమిది. మూడో గుడిలోని పరమాత్ముని పాదాలకు సమర్పించి వెళ్లి పోతాడు

పరమాత్మునికి నామరూపభేదాలు ప్రజలు కల్పించుకొన్నవే. సామాజిక నియమాలు ఏర్పాటు చేసుకొన్నదీ ప్రజలే. ఆ నియమాలకు లోబడి జీవించడానికి దైవభక్తి - పాప భీతి ఎంతో దోహదం చేస్తున్నాయి. దైవభక్తివల్ల పుణ్య

కార్యాలు నిస్వార్థంగా — నిష్కామంగా ఆచరించే అవకాశం కలిగింది. మనిషే దైవం అన్నంత వరకు ఎదిగిందీ తత్త్వం. అందువల్లనే దైవభక్తి సర్వ సాహిత్య ప్రక్రియల్ని స్పృశించింది. ప్రహేళికలు కూడా ఆపరమార్థ భావాలకు అతీతంగా ఉండలేక పోయినై.

పారమార్థిక జీవనానికి పునాది దైవభక్తి. లోకంలోని మంచి చెడ్డల్ని గమనించిన జీవుని వేదనకు కారణం ఈ పారమార్థిక జీవనమే. సర్వాత్మ ఏకతా సిద్ధాంతాన్ని విశ్వసించిన వ్యక్తి అద్వైత సిద్ధిని పొందుతాడు. తోటివాని కష్టాలు తన కష్టాలు గానే భావిస్తాడు. ఆ తపనే ఆ వేదననే వైరాగ్యమనీ జ్ఞానమనీ పిలుస్తారు. ఆవలి వ్యక్తికి బోధించాల్సింది తనకు తానే బోధించుకొని, స్థిరీకృత సంకల్పంతో కార్యాచరణకు పూనుకొంటాడు. అయితే మనస్సుకు తనకు తానే చెప్పుకొన్న ఆ ప్రబోధం ఆత్మబోధ అవుతుంది. జ్ఞానబోధ అవుతుంది.

"....చిలుక నిను పెంచిన కనుల భ్రమలే కాని
పశ్వశించవే రామ చిలుకా
తత్త్వాల కొరకై అర్థమై యుండగా
వ్యర్థమైతివె రామ చిలుకా
నువ్వు వ్యర్థమైతివె రామచిలుకా...."

ఇది ఇనాటికీ వ్యవహారంలో ఉంది. అచ్చమైన పారమార్థిక చింతన ఈ గేయ ఖండికలో ఉంది.

* ఎన్నిసార్లు చచ్చినప్పటికి
సజీవంగా ఉండేది ఏది (ఆశ)

మనిషి ప్రయత్నం చేస్తాడు. ఫలితాన్ని ఆశిస్తాడు. ఆశించిన ఫలితంరాదు. అయినా ఆశ చావదు, దేహంలో ప్రాణమున్నంత వరకు చాలా మందికి ఆశ చచ్చి పోదు. తీరని ఆశలతో పోయిన ప్రాణం తన ఆశల్ని తీర్చుకోడానికి ప్రేత రూపాన్ని పొందుతుందని ప్రజల విశ్వాసం. సంచిత కర్మనూ, ఆగామికర్మను సమానం చేయాలని కూడా ఆ ప్రాణి పునర్జన్మ ఎత్తుతుందని ప్రజలు నమ్ముతున్నారు.

* నేను ఎప్పుడూ మీ ముందే ఉంటాను
కానీ నా గురించి మీరు తెలుసుకోలేరు
నన్ను చూడలేరు. (భవిష్యత్తు)

భవిష్యత్తు తెలుసుకోడం కష్టమే అయినా ఊహించవచ్చు. ఊహ ప్రకారమే లన్నీ జరుగుతాయని కూడా చెప్పలేం. అయితే ప్రయత్నం వల్ల సాధించవచ్చు. నిజానికి భవిష్యత్తెప్పుడు ముందుండేదే! కాబట్టి ముందుచూపు అవసరం. ఇదికూడా జ్ఞానోపదేశమే!

కర్మజ్ఞాన సంబంధి ప్రజాజీవనం పరమార్థ తత్త్వ ప్రబోధకంగా ఉంటుంది. తెలుగు పొడుపు పద్యాల్లో భక్తిజ్ఞాన సంబంధులైనవి కొన్ని వందల వరకు ఉన్నాయి. వచన గేయాలుగా కనిపించే ప్రహేళికలెక్కువగా సాంఘిక జీవన స్థితిగతులకు ప్రతి బింబంగా ఉన్నాయి. ఇవన్నీ కర్మసంబంధులే. కర్మ అంటే పని అనే అర్థాన్నే గ్రహిస్తే ఇవన్నీ శ్రమ జీవన సంబంధులే అని చెప్పాల్సి వస్తుంది. అయితే నిత్య నైమిత్తిక కామ్య నిషేధ కర్మల్ని తెలిపేవిగాక, ధర్మ కర్మ ప్రతిపాదకాలైన ప్రహేళికలే పారమార్థిక జీవన ప్రతి బింబాలుగా వెలుగుతాయి.

## 5-7 : ఆధునిక జీవనం

పొడుపు కథలు - ఆధునిక సాహిత్యం అనే ప్రకరణంలో పత్రికలు, ఆకాశవాణి, చలన చిత్రాలు ప్రహేళికం ప్రచార ప్రసారాలకు ఎలా దోహదం చేశాయో కొంత వివరించడం జరిగింది. ప్రహేళిక ఎంత ప్రాచీనమో అంత అర్వాచీనం కూడా. యంత్రాల ప్రాధాన్యం సమాజంలో పెరిగిన తర్వాత ప్రజల జీవన స్థితిగతుల్లో అనేక పరిణామాలు వచ్చాయి. అలాంటి మార్పుల్ని కూడా పొడుపు కథలు ప్రతిబింబిస్తున్నాయి.

**7-1 : వాహనాలు :** కాశీకైనా కాలినడకనే వెళ్లే మనిషి, ఇవాళ మామూలు దూరానికే సైకిలునో, మోటారు సైకిలునో, కారునో బస్సునో, రైళ్లనో

ఉపయోగించు కొంటున్నాడు, దూరభారం వెంటనే తగ్గించుకోడానికి విమానాల్ని ఎక్కుతున్నాడు.

* ఇంతింతబండి - ఇనుపరేకులబండి
తొక్కితే తొంబయి ఆమడవాయె (సైకిలు)

సైకిలు ప్రయాణంలో శ్రమ తప్పదు. అయినా కాలి నడకకన్నా కొంత మేలే. ఇవాళ పాలవారికి పత్రిక లమ్మేవారికి, కార్యాలయాలకు వెళ్లేవారికి, ఉత్తరాలు తెచ్చే బంట్రోతులకు, బుట్టల్లోపెట్టుకొని కోడిపిల్లలమ్ముకొనే వారికీ, వారికీ వీరికీ అందరికీ, ముఖ్యంగా మధ్య తరగతి మనుషులందరికి సైకిలెంతో ఉపకరిస్తుంది: తిరుమలేశ శతక కర్త సైకిలుపై రాసిన ఈ పొడుపు పద్యం చూడండి.

* రెండు వాడి కొమ్ములుండు నెద్దునుగాదు
అన్న మడగబోదు ఆర్తిగనదు
మనము చెప్పినట్లు మంచిగా బరుగెత్తు
దీనిభావమేమి తిరుమలేశ![1] (సైకిలు)

ఈనాడు సైకిలు లేని గ్రామములేదంటే అతిశయోక్తి కాదు. నగరాల్లో సైకిళ్ల సంఖ్య అన్ని వాహనాలకన్నా అధికం.

* ఎద్దులేని బండి
చూడముచ్చటగా ఉండు
నీరుత్రాగి పరుగిడుచుండు
అరువది ఆమడలనైనా పొవు (మోటారు)

ఇది పదిమందినీ, పనిబడితే వందమందినీ తీసుకొని వెళ్ళే వాహనం. నీరంటే పెట్రోలు లేదా డీజిల్. ఇది నాగరికుల సృష్టే. బస్సును గూర్చి జానపదులన్న ఈ క్రింది మాట వరాల మూట.

---

1. కాళ్లరెండు గలవు గాని మానిసికాదు
నోరుగల్గి యెదుటి వారినఱచు
గాలిమేసి లెస్సగా నడమోయును
దీని భావమేమి తిరుమలేశ! (సైకిలు)

* దుడ్డిచ్చి దొడ్లకు వోయిరి (బస్సు)

తెలంగాణాలో దొడ్డి అంటే పశువుల కొట్టం. పశువులెక్కువగా ఉంటే దొడ్డి ఇరుకవుతుంది. బస్సు ప్రయాణీకులెక్కువగా ఉంటే బస్సూ ఇరుకవుతుంది. డబ్బుకుక్కుర్తితో బస్సునిండా కుక్కేస్తున్నారని భావించినజానపదుని భావనఇది.

* మాటలులేవు, పెద్ద ఊపిరి విడుస్తాడు
శక్తిలేదు, బరువు మోస్తాడు
ప్రాణములేదు, పరుగెత్తి తిరుగతాడు
అన్నములేదు, నీరుత్రాగుతాడు
గెడ్డలు గెడ్డలుగ బొగ్గుతింటాడు
కనులులేవు ఆమడనడుస్తాడు
గొంతులేదు, కూతకూస్తాడు
ఎండలో వడిగా నడచు చుండు
భోంచేయడు
ఎటుల చెప్పినను అటులే వింటాడు (రైలు బండి)

ఇందులో రైలుకు సంబంధించిన వర్ణన ఉంది. విధినిషేధ వాక్యాల ద్వారా విరోధాభాసాన్ని నిర్మించి సుదీర్ఘంగానే చెప్పడం జరిగింది. అయితే నిషేధ వాక్యం మొదట వచ్చి, విధి వాక్యం తర్వాత ఇచ్చే ఈ పద్ధతి కొన్ని పొడుపు కథల్లో మొదటి నుండి కనిపిస్తూనే ఉంది. ఈ పొడుపుకథ నిర్మాణంలోని అపరిపక్వతే ఇది ఇటీవలిదని తెలుపుతుంది. ఈ క్రిందిది కూడా రైలే.

* ఇంతింత నా బండి - ఇనుప గీరల బండి
తొక్కితే నా బండి - తొంబై గీరల బండి
విష్ణుముండ్లకెల్లి - బ్రహ్మముండ్లకెల్లి
మాట్లాడుకుంటూ వచ్చేది. (రైలు)

గీరలంటే చక్రాలు (గిల్లలు). విష్ణుముండ్లు - బ్రహ్మముండ్లు పలుగురాళ్లూ - అడ్డ కట్టెలు. రైలు పట్టాల క్రింద ఇవి పరుస్తారు.

* తీగ గుంజితే పొగ కవితే (రైలు)

రైలు పరుగెత్తడం తీగ గుంజడంగా చెప్పడం జరిగింది. అప్పుడు పొగరావడం సహజమే కదా! ఇది బొగ్గు రైలుకు సంబంధించినదిగానే భావించాలి.

* తుమ్మెదలు కాయంగా
దూలాలు కదలంగ
అక్కినక్కెరు పండు
ఎక్కి తోలంగ (రైలు)

రైలుపొగే తుమ్మెదలు, రైలు పరుగెత్తడమే దూలాలు కదలడం. అక్కినక్కెరు పండు రైలు ఆకారాన్ని తెలియజేస్తుంది. రైలును ఎక్కి తోలడం సహజంగా జరిగేదే.

* నీరు నిప్పు ఉన్న నెలలు వత్సరములు
పరుగులెత్తుచుండు బాధపడదు
ఎంత బరువునైన సంతోషమున మోయు
దీని భావమేమి తిరుమలేశ (రైలు)

తిరుమలేశ శతక కర్త ఈ పద్యంలో చమత్కారం అంతగా భాసించక పోయినా. అతి నవీనమైన ఈ క్రింది పొడుపుకథ ఆలా కొంతసేపు పట్టి నిలుపుతుంది.

* ఒక ఎలక్ట్రిక్ ట్రైన్
తూర్పునుండి పడమరకు పోతోంది
గాలి పడమర నుండి తూర్పుకు వీస్తుంది
దాని పొగ ఏవైపు ప్రయాణం చేస్తుంది.

రైలు తూర్పునుండి పడమరకు పోతున్నా, గాలి పడమరనుండి తూర్పుకే వీస్తున్నది, కాబట్టి పొగకూడా పడమరనుండి తూర్పుకే వీస్తుందని వెంటనే సమాధానం చెప్పేస్తారు. అది ఎలక్ట్రిక్ ట్రైన్ అయినందువల్ల పొగ ఉండదని సమాధానం.

ప్రజా జీవనంతో రైలు ప్రయాణమెంతగా పెనవేసుకొని పోయిందో పొగబండి పొడుపుకథల్ని చూస్తేనే తెలుస్తుంది. కాలు కదల్చకుండా కూచున్న చోటునుండే సర్వ ప్రపంచాన్ని దర్శించే శక్తి ఈనాటి మానవునికుంది. కాలు కదలిస్తే చాలు ఒళ్లు కదలకుండా ప్రయాణించే అవకాశాలు కలిగాయి. ఇదంతా విజ్ఞానశాస్త్ర ప్రగతి కారణంగా కలిగిన సౌకర్యమే అయినా ఆ శాస్త్రంవెనుక ఉన్నది మనిషే అన్నది మరువరాని సత్యం.

**7-2 : ప్రచార ప్రసార సాధనాలు :** కాశికి పోయినవాడూ కాటికి పోయినవాడూ సమానమే అన్న నమ్మకం నాటిది. కాశికికాదు ఖండ ఖండాంతరాలకు వెళ్లినా ఒక్క గంటలోనే రావచ్చునన్న నమ్మకం ఈ నాటిది. ప్రపంచంలో ఏ మూల జరిగిన సంఘటనైనా అప్పటికప్పుడే అందించే ఆకాశవాణి ఉంది; దూర దర్శనముంది. ఆధునిక మానవుని కందందిగానీ తెలియందిగానీ ఏదీలేదు. అయితే అన్ని విషయాలు ప్రసారం చేయాలనే నియమాలేం లేవు; ఆయా ప్రచార శాఖల అధిపతుల ఇష్టాయిష్టాలమీద వార్తాప్రసారాలు జరుగుతాయి.

* ఎన్నియెన్నొ కథలు ఎన్నెన్నొ నీతులు
తెలియబలుకు చాల సులభముగను
ముసలితాతకాదు ముత్తవ్వయును కాదు
దీని భావమేమి తిరుమరేశ ! (రేడియో)

ఈనాడు రేడియోలు లేని గృహాలింకా గ్రామాల్లో ఉండవచ్చుకాని రేడియో అంటే తెలియని, రేడియో ప్రభావమే కొద్దిగానో పడని మనిషి అసలే లేడన వచ్చు.

* తెల్లరేగడి - నల్లవిత్తనము
చేతితో అలుకుదురు
నోటితో పలుకుదురు

తెల్లరేగడి కాగితం, నల్లవిత్తనం శాయి (మషిరసం). చేతితో అలుకడం రాయడం, నోటితో పలుకడం చదవడం. ఇది రాతపుస్తకమో లేదా రాసిన ఒక

కాగితమో కావచ్చు, ఈ నాడు పత్రికకున్న ప్రాధాన్యం అపూర్వమైంది. నిన్న జరిగిన సంఘటనలతో ముస్తాబై తెల్లవారేవరకు గుమ్మాన్ని తట్టి పిలుస్తుంది, రేడియోలో వ్యాఖ్యానించడానికి వివరించుకోడానికి వీలుకాని అనేకాంశాల్ని సమాచార పత్రాల్లో చదువుతున్నాం.

వినడం చదవడమేకాదు: కూచున్న చోటనే వినవచ్చు, దృశ్యాన్ని చూడవచ్చు.

* బొమ్మలుండు - పలుకుచుండు
కనులకు విందు - చెవులకు పసందు (టి. వి)

దూర దర్శనం సంగతి పొడుపు కథలో సూటిగానే ఉంది. విడుపు వాచ్యం కాలేదుగాని సులభంగా తెలిసిపోతున్నది.

* కాశికి పోతది - గయకూ పోతది
గంపెడు నీళ్లకు - జీవిడుస్తది (కారటు, కార్డు)

"తోకలేని పిట్ట తొంబయి యామడపోతది" అనే పొడుపు కథ చాలా ప్రసిద్ధమైంది. ఉత్తరం కూడా ప్రముఖ ప్రచార ప్రసార పరికరమే అయినా అందులో హృదయముంది; అక్షరాక్షరంలో ఆత్మీయత నిండి ఉంది.

* నోరులేదు, చెప్పగలదు
చెవుల్లేవు వినగలదు
కాళ్లులేవు, నడవగలదు
తిండిలేదు, నోరులేదు,
కూలిడబ్బులడుగుతుంది.
చెప్పుకోండిమరిచూద్దాం
ఒప్పుకోండి నేను చెబుతాన్ (అవునా మరి టెలిఫోన్)

ఒకరితో మాటాడ్డానికి, తానొక విషయం వినడానికి అన్నిటికీ ఆధారం తీగతే. టెలిఫోన్‌వల్ల అంతరాలు తగ్గినై; ఆత్మీయతలు పెరిగినై. ఈనాడు పరిపాలనా వ్యవహారాలకు, నగరాల మధ్య సాన్నిహిత్యానికి టెలిఫోనే ప్ర ప్రథమ సాధనమైంది. టెలిగ్రాంపై తిరుమలేశ శతకకర్త ఒక పద్యాన్ని రాశాడు.

* నేను చెప్పుమాట తెల్లదాగొంపోయి
తెలియజెప్పుచుండు తెలివిగలిగి
రూపురేఖలేదు చూపులా? పుక్కక్కి
దీనిభావమేమి తిరుమలేశ! (తంతి)

ఇన్ని సౌకర్యాలు కలిగినందువల్లనే ఆధునిక మానవునికి ప్రపంచం గుప్పిట చిక్కినట్లనిపిస్తుంది. అంచెలంచెలుగ వార్తలు వెళ్ళే అలి ప్రాచీన కాలానికి నేటికి ఎంతో తారతమ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది, ప్రజాజీవనంలో ఇప్పుడు శరవేగం కాదు, రాకెట్ వేగం వచ్చేసింది.

**7-3 : యంత్రాలు పరికరాలు :-** ఇది యంత్రయుగం, అణు యుగం. యంత్రాలు మానవ నిర్మితాలు అయినా మనిషి ప్రతి అడుగును నిర్దేశించే దశకు అవి చేరుకున్నాయి.

* అన్నదమ్ములు పన్నెండుగురు
పరువుగా బతుకు చుండ
అప్పల వాళ్లిద్దరు ఎల్లప్పుడు
వాళ్ల చుట్టు తిరుగుచుండె
బంధించబడిరి వాళ్లంతా
ఓ అద్దాల మేడలో - ఏమిటది! (గడియారం)

పన్నెండు మంది అన్నదమ్ములే అంకెలు. అప్పుల వాళ్లిద్దరూ పెద్దముల్లూ చిన్నముల్లు. అద్దాల మేడ అన్నది పొడుపు కథగానీ, అద్దం ఒకవైపే ఉంటుంది. ఇల్లంతా అద్దాల మయం కాకున్నా పది అద్దాలుంటేచాలు అద్దాల మేడే అనవచ్చు. ఆ దృష్టితో ఇది సమన్వయించుకోవాలి. కాలాన్ని కొలుస్తున్న గడియారం ప్రజాజీవనంలో అంతర్భాగమైంది. తిరుమలేశ శతక కర్త గడియారాలను వదలలేదు!

* దినదినంబు రెండు తేపలు కరములు
రెండు శిరముజేర్చి ప్రీతిమొక్క
నరుడుగాడు వాడు నరుసిచే జన్మించె
దీని భావమేమి తిరుమలేశ (గడియారం)

* చలనశక్తి గలదు జంతువు గాదది
చేతులెపుడు త్రిప్పు శిశువుగాదు
కాళ్లు లేవు సర్వ కాలంబు నడచును
దీని భావమేమి తిరుమలేశ! (గడియారం)

మొదటి పద్యం కన్నా రెండోపద్యం రమణీయం. రెండూ అర్వాచీనాలే. కాలాన్ని కొలిచే యంత్రాల్ని ప్రజలూ ప్రహేళికా కర్తలు మరచిపోలేదుమరి!

* అలసట లేదు సొలసటలేదు గాని
అలిస్తే జీవితం అంతం (ఆటోమాటిక్ వాచ్)

అలసట అంటే యంత్రమాగిపోవడమే; బాగు చేయాలి; లేదా కొత్తది అమర్చాలి.

* లేవలే నెద్దు
లెంక గొట్టె (ఇంజన్)

ఇంజన్ తనంతట తాను లేవలేదు. ఇంజన్ పెట్టినప్పుడు మాత్రం మొదట పెద్దగా చప్పుడు వస్తుంది. ఆ చప్పుడే లెంకగొట్టడంగా జానపదుడు భావించాడు. పశువుల్లో కోడె మరొక కోడెను చూచినప్పుడు కాలు దువ్వి పోరాటానికి సిద్ధమైచేసే ధ్వనినే లెంకగొట్టడం అంటారు. వ్యవసాయ వృత్తిలోని వారికి ఆయిల్ ఇంజన్ల ప్రాధాన్యం బాగా తెలుసు.

* పంధుము బుక్కుతది
ఫర పర యిడుస్తది (గిర్ని)

బియ్యం పట్టడానికి, పిండి చేయడానికుపకరించే యంత్రం గిర్ని. ఆగిర్ని ఎంత ధాన్యమైనా తింటుంది. గిర్నీలు వచ్చినంతర్వాత దంపుళ్ల తగ్గినా, విసుర్రాళ్ల పని తగ్గినా తప్పేవా, మానేవా కూలి తెచ్చుకొనే వారు దంచుకోవాల్సిందే, విసురు కోవాల్సిందే!

* ప్రపంచంలో ఒక అద్భుతమైన సిటీ ఉంది
ఆ సిటీలోకి ఎవరు పోయినా
విగత జీవులవుతారు (ఎలక్ట్రిసిటీ)

ఇవాళ వ్యవసాయ పారిశ్రామిక రంగాలకు విద్యుచ్ఛక్తి ఊపిరి పోస్తున్నది. అలాంటి విద్యుత్తు విషయంలో అజాగ్రత్తగ ఉంటే అది ప్రాణాలు తీసేస్తుంది. ఆ సిటీలోకి పోవడమంటే విద్యుతీగను స్పృశించడమే అని భావించాలి.

* నాల్గుకాళ్ల ఉంటాయి జంతువుకాదు
రెండు చేతులుంటాయి మనిషికాదు
చెట్టు చేమలే మా అమ్మా నాన్నలు (కొయ్యకుర్చి)

కుర్చీలు, సింహాసనాలు, మంచాలు బల్లలు అతి ప్రాచీన కాలంనుంచీ ఉన్నాయి. వ్యవహారంలో ఉన్న ఓ పొడుపు పద్యం కుర్చీని ఇలా వర్ణించింది.

* బరువు మోతుగాని బండినేమియు గాదు
కాళ్లనాలుగున్న కరముగాదు
చేతులుండుసుగాని చేజాలనేరదు
తెలుగుబిడ్డ నన్ను తెలుప గలవ (కుర్చి)

ఇంట్లో బడిలో, కార్యాలయాల్లో కుర్చీల కంకితమైపనిచేసే వారుకూడా సమాజ సేవ చేస్తున్నట్లే లెక్క. ప్రజాసేవ చేసేవారి ధర్మ కర్మమర్మాలకు సాక్షులీ కుర్చీలు. గృహాల్లోనూ కార్యాలయాల్లోనూ కుర్చీలకున్న ప్రాధాన్యం మరువరానిది.

చక్కనమ్మ చిక్కినా అందమేనట
ఈ చక్కనమ్మ సంగతీ అంతే
రోజు రోజుకీ చిక్కిపోయినా
వన్నె తరిగిపోదు-తావి చెడిపోదు (సబ్బు)

ప్రజలందరూ సబ్బులు వాడుతూనే ఉన్నారు. ఈ వాడకం కారణంగా సబ్బు అరిగినా దాని పరిమళం చెడదు. చక్కనమ్మ చిక్కినా చక్కనే అనే మాట జనవ్యవహారంలో నానీ సామెతగా పరిణమించింది.

బోధనోపకరణాలైన మ్యాపుల్ని, గ్లోబుల్ని కూడా పొడుపు కథలు వదిలి పెట్టలేదు.

* నా పై పట్నాలుంటాయిగాని
ప్రజలుండరు
నాపై సముద్రాలుంటాయి గాని
నీరుండదు (మ్యాపు)

* పెద్ద ఇల్లు
పెద్ద ఇంటిలో చిన్న ఇల్లు
చిన్న ఇంటిలో గుంట
గుంటలో స్థంభం
స్థంభం మీద
రాజుకూర్చుని తపస్సు చేస్తాడు (గ్లోబు)

ఈ పొడుపు కథలు పిల్లలు సృష్టించినవే. పిల్లలకోసం పెద్దలు సృష్టించినవే.

ఈనాడు ధనం రాజ్యం చేస్తున్నది; డబ్బుకు ప్రాణాలిచ్చే వారున్నారు. "తెల్లటోడు పోయి నల్లటోడు వస్తా" డంటే తెల్లని రూపాయలు పోయి నల్లని చింతపండు వస్తున్నదని అర్థం. పూర్వకాలంలో వెండి రూపాయలకే ప్రాధాన్య ముండింది, వెండి మూల్యం మరీ పెరిగిపోవడం అది మరుగై పోయింది. ఆ

రూపాయలూ కనిపించడం లేదు. ఇప్పుడు కాగితం రూపాయలే ఎక్కువ కనిపిస్తున్నాయి.

* గింతంత పిట్ట
గిన్నెడు గుడ్లు పెడ్తది (రూపాయి)

రూపాయిని విడిపిస్తే, అంటే చిల్లర చేయిస్తే గిన్నెడు చిన్న పైసలు వస్తాయని అర్థం.

* గచ్చు గచ్చుల బండ
ఘనమైన బండ
పిన్నలకు పెద్దలకు
పేరైన బండ (రూపాయి)

(గరుసు గరుసు బండ - ఘనమైన బంత
పెద్దిరాజుల బండ - పేరైన బండ
పెద్దసేట్లకెల్ల పేరైన బండ)

గచ్చు (సున్నం ఇసుకతో చేసిన పని) తెల్లగా ఉంటుంది గచ్చు బండ అంటే తెల్లబండ అని అర్థం. రూపాయి తెల్లగా ఉంటుంది పిన్నలకు పెద్దలకు ఈ బండ అక్కరకు వస్తుంది. చివరకు పిల్లలకొచ్చే తారాజువ్వకూడా పొడుపు కథల కెక్కింది.

* సూది వెళ్లి చుక్కలు తాకింది (తారాజువ్వ)

అలవాటు పడ్డవారంతా కాల్చే సిగరెట్టును తిరుమలేశ శతక కర్త పద్య ప్రహేళికలో బంధించాడు.

* పీల్చ పీల్చ మదికి వేడుక కలిగించు
పీల్చి విడువ పొగలు వేగవచ్చు
పీల్చపండ నుండు వీరులు స్వల్పంబు
దీని భావమేమి తిరుమలేశ! (సిగరెట్టు)

చుట్ట, బీడి, సిగరెట్టు కాల్చడం వేడుక కొరకా! సరదా సిగరెట్టు కంపుగొట్టే సిగరెట్టుగా పేరుపొందింది. గ్రామాల్లోనూ, నగరాల్లోనూ పిన్నలూ పెద్దలెందరో సిగరెట్టును వాడుకలహస్యాన్ని ఆలోచనం రేకెత్తిస్తుందని కొందరు, చురుకుదనం కలిగిస్తున్నదని కొందరు, వేడెక్కిస్తుందని కొందరు, ఉబుసు పోకకు వెలిగించామని కొందరు తమ తమ అలవాట్లను సమర్థించుకొంటారు. ఇలాంటి అలవాట్లకెన్నింటికో పొడుపు కథలు దర్పణంగా నిలిచాయి.

ఇలా పొడుపుకథలెన్నో ఆధునిక మానవుని జీవనంలోని అనేకాంశాల్ని ప్రతిబింబించాయి. వాహనాలు, ప్రచార సాధనాలు, యంత్రాలు, సౌఖ్యసాధనాలెన్నో పొడుపు కథల్లో పొదుగుకొన్నాయి. కాని ప్రాచీన ప్రహేళికల్లోని రామణీయకతగానీ శిల్పనిర్మాణం గానీ, భాషాసౌందర్యంగానీ నవీన ప్రహేళికల్లో కనిపించదు. జానపద ప్రహేళికల్లోని సహజ సౌందర్యం కూడా, ఈ ఆధునిక ప్రహేళికల్లో లేదు, ఇవి కృత్రిమంగా కనిపిస్తాయి. కావాలని కట్టిన కట్టు కథలనిపిస్తాయి.

ఇక ప్రజల ప్రకృతి పరిశీలన దృష్టిని స్పృశించే ప్రయత్నం చేస్తాను. ప్రకృతిలో బ్రతికే ప్రజలు ఏ విధంగా ప్రహేళికల్ని సమ్మానించారో చెప్పడమే ప్రకరణాంశ విశేషం.

## 5-8 : ప్రకృతి పరిశీలనం

ప్రకృతి పరిశీలనం కూడా ప్రజా జీవన ప్రతి బింబమే. ప్రజల ప్రకృతి పరిశీలనాసక్తి, సౌందర్య దృష్టి, ప్రకృతిలో ప్రజా సంలీన స్థితి ఇలా ఎన్నో అంశాలు పొడుపు కథలు బహిర్గతం చేస్తున్నాయి. పృథ్వ్యప్తేజో వాయ్వాకాశాదులు, శీతవాతాతపాదులు, పంట పొలాలు, నదీనదాలు, జలపాతాది ప్రకృతి సౌందర్యాంశాలెన్నో ప్రహేళికలు ప్రకటిస్తున్నాయి.

ఏ సాహిత్య ప్రక్రియ చేపట్టి రచన చేసిన వారైనా వీటిని విస్మరించ లేదు. వాటిని విస్మరించిన రచనలో జవమూ జీవం శూన్యం. తెలుగు పొడుపు కథాకారులందర్నీ గుర్తించలేం. కొన్ని పద్యాలు వ్రాసినవారు మాత్రం పేరెన్నిక

కెక్కారు. గేయ, వచన గేయ, వచన ప్రహేళికల సృష్టి కర్తలు వీరే అని చెప్పలేము. అందుకే కర్తలూ ప్రజలు, వ్యవహర్తలూ ప్రజలే అని చెప్పడం జరిగింది.

తన అవసరం తీర్చే వస్తువు, తనకు ప్రయోజనాన్ని సమకూర్చి పెడుతున్న పని, తనకు సుఖాన్నిస్తున్న పరికరం ప్రహేళికేతి వృత్తాలైన విధంగానే ప్రకృతిలో ప్రచలిస్తోన్న సమస్తం పొడుపు కథకు వస్తువయ్యింది.

* ఆకాశాన్ని ఆ చివరినుంచి
  ఈ చివరి వరకు కప్పివేసే
  ఆయుధం ఏది! (ఇంద్ర ధనుస్సు)

వాన వెలసిం తర్వాత వినిర్మలాకాశంతో ఆ చివరినుండి ఈ చివరి వరకు సప్త వర్ణ పరిశోభిత మైన ఇంద్ర ధనుస్సు అర్ధ చంద్రకారంతో కనిపించే మనో హర దృశ్యం. ఆయుధ శబ్దంతో ధనుస్సును సంకేతించటం జరిగింది, "ఆ చివరి నుంచి ఈ చివరి వరకు కప్పివేసే" అనే ప్రయోగం వల్ల ప్రజల ప్రకృతి పరిశీలనం సువ్యక్తమవుతున్నది.

* పగలల్లా పడిన పళ్లు
  రాత్రిపూట పారబోస్తాం. ఏమిటవి! (నక్షత్రాలు)

పగటిపూట నక్షత్రాలు కనిపించవు. అవి పగలల్లా క్రిందికి పడుతూనే ఉన్నాయి. రాత్రిపూట వాటిని పారబోశారు. అక్కరకు రానివి పారబోస్తారు. ఈ పారబోసినవి ఆరబోసినట్లయి ఆకాశంలో వెలిగినై. అందరికీ వెలుగుదారులు చూపినై.

* ఊరంతటికీ ఒక్కటే దుప్పటి (ఆకాశము)

* చాపచుట్టనూలేము
  చంక పెట్టనూలేము (ఆకాశము)

అది ప్రశాంతనిశీథి; సౌధోపరి భాగం; నీలాకాశం పందిరికింద పిల్లలు నిద్రిస్తున్నారు. ఆ తల్లి వారికందరికి ఒకే దుప్పటి కప్పింది; ఆకాశం వంక

చూచింది: ఊరువంక చూచింది; నిద్రపోతున్న ఊరూ వాడనూ పైనున్న ఆకాశాన్ని మాటి మాటికీ స్మరించి ఇలా అన్న తల్లి ఎవరో! ఆమె దృష్టిలో ఈ ప్రపంచ మంతా ఒకే ఊరు; ఈ ఆకాశమంతా ఒకే దుప్పటి.

చాపచుట్టి, చంకన పెట్టి, మూలకు నెట్టిన మరొక అమ్మ ఆకాశందిక్కు బరువైన కనురెప్పల నెత్తింది. దీర్ఘంగా నిట్టూర్చింది. "చాపచుట్టనూలేము చంక పెట్టనూ లేము" అనిభావించింది. అల్పకార్యంతో అల్పసంతోషాన్ని ప్రకటించే మనిషి బరువు పనికి చింతించే బాధా- మయభావనకొక రూపమే ఈ ప్రహేళిక.

* అంతులేని చెట్టుకు అరవై కొమ్మలు
కొమ్మకు కోటి పువ్వులూ
పువ్వుల్లో రెండేకాయలు (ఆకాశం, చుక్కలు, సూర్యచంద్రులు)

అరవై నాల్గు కొమ్మలున్న అంతులేని చెట్టు ఆకాశం. చతుష్షష్టి కళల్ని దృష్టిలో పెట్టుకొని అరవైనాల్గు శబ్దాన్ని ప్రయోగించారు. ఆకాశం కళా కాంతుల నిలయమనే భావనకీ పోడుపుకథ నిలయం, కోటి పువ్వులు చుక్కలు: రెండు కాయలు సూర్యచంద్రులు. ఆకాశాన్ని ఊరన్నా చెట్టన్నా, ఆకాశం ఆకాశమే. సుమార తీరాల్లోనివి వస్తువులను కూడ ప్రజలు తమ సమీపంలో ఉన్నట్టుగా భావించి తమకు పరిచయమున్న వస్తువులతో పోల్చుకోడం సర్వసాధారణ విషయం.

* గాజుల గలగలలు నావే
కోయిల కుహూ కుహూలు నావే
తుమ్మెద ఝుంకారములు నావే
అయితే నేనెవరిని! (జలపాతం)

జలపాత ధ్వని మనోహరంగా ఉంటుంది. ఆఅనుభవాన్ని ప్రహేళిక కర్త జోడించాడు. గాజుల గలగల ఆహ్వానం, కోయిల కుహూకుహూ రాగాల ప్రేరేపణం జలపాత స్నానానికి పురికొల్పే సన్నివేశాలు. ప్రకృతినిలా మానవీక రింప జేసుకొనడం పొడుపు కథాకర్తలూ వ్యవహర్తలూఅయినా ప్రజలకే చెల్లింది.

* తెల్లని మల్లెల గుచ్ఛంలా కనిపిస్తాను
అందుకే అందుకోలేరెవ్వరూ
మీరు నాదగ్గరకు వచ్చినప్పుడు
గెంతుతూ మీ దగ్గరకు వస్తాను
అయినా పట్టుకోలేరు నన్ను మీరు
—అయితే నేనెవరిని! (కెరటం)

కెరటం మనిషై మాటాడుతున్నది. తెల్ల మల్లెల గుత్తి, కెరటం, అపురూప దృష్టి, రసాత్మక వాక్య నిర్మాణం వల్ల కావ్యాత్మ సిద్ధి.

పొలాల్లో కనిపించే జొన్నకంకి, వానకు పుట్టుకొనివచ్చే పుట్టకొక్కు (పుట్టగొడుగు—కుక్కగొడుగు) కూడా ప్రకృతి అంగాలే.

* లుక్ లుక్ పెట్టె
లక్షవరాలు (జొన్నకంకి)

* నాకు ఒక్కటే కాలు
నాకుమాత్రం నాగలికలదు
దాని పేరేమి; (పుట్టకొక్కు)

లుక్‌లుక్ పెట్టె అంటే దృఢంగాలేనిదనీ, జిగిబిగి తక్కువగా ఉన్నదని, కొంత విచ్చుకొని ఉన్నదని అర్థం. ఇంతకూ అది ముద్దకంకి కాదు. మక్కజొన్న కంకి కాదు; మక్కజొన్న కంకి పై పొర 'చింపిరి చింపిరి గుడ్డలు - లోనివి - ముత్యాల వంటి బిడ్డలు.' ఈ పొడుపు కథలో లక్ష వరహాలనేది వినూత్న ప్రయోగం. వర్షాకాలంలో పుట్టకొక్కులందంగా కనిపిస్తాయి. ఆ ఆకర్షణం వల్లనే తయారైన పొడుపు కథ ఇది. ఇక్కడ నాగలి కాని నాగలి ఉంది నిజమే; కాని ఉద్దేశం నాగళ్లు పట్టే కాలం వచ్చిందని చెప్పడమే.

ఈ ప్రకృతి పరిశీలనంలోని ముగింపులో ముచ్చటగా మూడు పువ్వుల్ని ఉదాహరిస్తా.

* కొనా మొదలు విచ్చని పువ్వేది (గునుగు (కు) పువ్వు)

* గట్టు నిండా పసుపు గుడ్డలు (తంగేడు పువ్వు)

* పచ్చని పెట్టెలో విచ్చుకో నుంది
తెచ్చుకోబోతేను గుచ్చుకొంటుంది
ఎంత గుచ్చుకొన్నా ఏమైనా గానీ
తెచ్చుకో మాన మెచ్చుకో మాన (మొగలి పువ్వు)

మొగ్గ అదే, పువ్వు అదే. గునుగు మొగ్గ అనే మాటే లేదు. అది పువ్వా! మొగ్గా! రెండు కూడా! గునుగు ఎప్పుడు వికసించిన పువ్వే మొగ్గ ఉంటుంది కాని పైకి కనిపించదు. అందువల్లనే విచ్చిన పువ్వును విచ్చని పువ్వని ప్రజ లంటున్నారు.

గట్టు నిండా పూచిన తంగేడు పసుపు గుడ్డలార వేసినట్లుగా ఉంటుంది. నల్లరాళ్లున్న నల్లగట్టు, తెల్లరాళ్లున్న తెల్లగట్టు. ఆరవేసిన పసుపు బట్టలు, ఇది కంటికింపైన దృశ్యం.

ఈ మొగలి పువ్వు పొడుపు కథ తెనుగునాట ప్రసిద్ధం. పచ్చని పెట్టె మొగలి పెట్టు; విచ్చుకొన్న పువ్వు మొగలి; అది గుచ్చుకొన్నా తెచ్చుకునేవారు తెచ్చుకొంటూనే ఉంటారు.

ప్రకృతి సౌందర్యాన్ని ప్రశంసించే గుణం ప్రహేళికా కర్తలైన ప్రజలకుంది. ఆరాధించే భావమూ ఉంది; ఆనందించే మనస్సూ ఉంది; ఈ ప్రకృతి పరిశీలనంలో ప్రజల నిత్య నైమిత్తిక వ్యవహారాలు అంతగా కనిపించ కున్నా, వారి హృదయం లోతుల్ని దర్శించే అవకాశం కలిగింది. ఇక వారికున్న శాస్త్ర పరిచయాన్ని సంభావిద్దాం - ఇది ఆధునిక విజ్ఞాన శాస్త్రం కాకపోవచ్చు; కాని బతుకు తెరువులో అంతర్భాగమైన అనుభవ రమణీయ శాస్త్రంగానే దీనిని భావించాలి.

## 5-9 : విజ్ఞాన శాస్త్రీ పరిచయం

ఇది ప్రజల విజ్ఞానం; వారి అనుభవసారం మాత్రమే ఇక్కడ కని పిస్తున్నది. పొడుపు కథలు, పొడుపు కథాంశాలు మాత్రమే స్వీకరించి ప్రజల కున్న విజ్ఞాన విషయ పరిచయం స్పృశించడం జరుగుతున్నది. పొడుపు కథలు-జానపద సాహిత్యమనే ప్రకరణంలో ప్రజల మనోవైజ్ఞానిక దృష్టి, మనస్తత్వం, ఆరోగ్య దృష్టి, వస్తు విషయ పరిజ్ఞానం తదితరాంశాలు ఆయా సందర్భంలో వ్యాఖ్యానించడం జరిగింది. పొడుపు కథ ఉబుసు పోకడ కాదనీ, దాని వెనుక మానవ మనస్తత్వ మున్నదని నిరూపించడం జరిగింది. ప్రజా జీవనమనే ఈ ప్రకరణంలో పొడుపు కథల ఆధారంగా వారికున్న విజ్ఞాన శాస్త్రీ పరిచయాన్ని ప్రదర్శించాలనే ఈ అంశం స్వీకరించడం జరిగింది.

కర్షకుడొక కాలంలో భూమిపై విత్తనాలు చల్లుతాడు. అప్పుడు పంట సరిగా రాదు. మరో కాలంలో చల్లుతాడు. అప్పుడు ఫలమధికంగా వస్తుంది. ఏ సమయంలో ఏ నేలలో ఏ విత్తనాలు చల్లితే పంట బాగా పండుతుందో అతనికి తెలిసిపోతుంది. కొందరీ విషయం ప్రచారం చేస్తారు; మరికొందరు గ్రంథస్థం చేస్తారు. అప్పుడది పఠనపాఠనాలకు యోగ్యమవుతుంది; శాస్త్రీ మవుతుంది. ఈ శాస్త్రీ మనేది కూడా సార్వకాలీన సార్వజనీన సార్వదేశిక సత్యం కాకపోవచ్చు. మొదటి ప్రయోగాన్ని మించిన ప్రయోగం మరొకటి జరుగుతుంది. అది శాస్త్రీయ సత్యమవుతుంది. మొదటిది శాస్త్రీ నిరూపిత సత్యం కాదా అంటే ఆ కాలానికది సత్యమే అవుతుంది గాని, ఆ తర్వాత కాలానికి అది పూర్వపక్షమైపోయింది; అది చరిత్ర అవుతుంది. పరిణామ స్వరూపం తెలుసుకోవాలనుకొన్న పఠితుడు ఆ చరిత్రను తప్పకుండా చదవాలి.

తెలంగాణాలోని వరంగల్లు, పాలమూరు, ఇందూరు, కరీంనగరం తదితర జిల్లాలలోని కొన్ని గ్రామాల్లో పొడుపు కథల్ని శాస్త్రాలంటున్నారు ఒక అంశాన్ని సూత్ర రూపంలో చెప్పే నిర్మాణ శక్తి పొడుపు కథకుంది. ప్రజా విజ్ఞానం కూడా సూత్రబద్ధమైంది ఆ సూత్రాలే పొడుపు కథలు అవి సత్యాలని ప్రజ విశ్వసిస్తున్నది. కొన్ని గీటురాయి మీద నిలుఫకపోవచ్చు. అంత

మాత్రానికే నిరసించడం తిరస్కరించడం విజ్ఞత అనిపించుకోదు. ఒక విషయాన్ని పరిశీలించేప్పుడు అది పుట్టిన కాలానికి సంబంధించిన సామాజిక చారిత్రక పరిస్థితుల్ని సమన్వయ దృష్టితో సమీక్షించడం సమంజసం.

శాస్త్రీయ విజ్ఞాన మతివేలంగా పెరిగిపోయిన ఈ కాలంలో ఆ విజ్ఞానమంతా పొడుపుకథ పొదిగికోటం గానీ, పొదిగికోవాల్సిన అవసరం గానీ ఎంత మాత్రం లేదు. పొడుపు కథ సర్వరంగాల్ని స్పృశించవచ్చు; కాని సర్వరంగాలు తానేకాదు. ప్రజల మనస్సులలో కొన్ని విషయాలు నాటుకొని ఉంటాయి. అవి ఆయా సాహిత్య ప్రక్రియల్లో చోటుచేసుకొంటాయి. ఈ విషయాలే ఈ ప్రక్రియల్లో ఉండాలనే నిర్దిష్ట నియమం కొన్నింటికున్నా అవశ్యంగా వాటినే చొప్పించాలనే ఒత్తిడి ఎప్పుడూ ఉండదు. పొడుపు కథకు కూడా ఇది వర్తిస్తుంది.

పొడుపు కథల్లో వైద్య, జ్యోతిష, గణిత శాస్త్రాదులకు సంబంధించిన అంశాలు కొన్ని కనిపిస్తున్నాయి. ప్రజా జీవనంలో అవసరార్థం ఏవి పెనవేసుకొనిపోతే అవే నిలుస్తాయి. తాత్కాలికంగా వచ్చి పోయేవి చరిత్రలో మెరుస్తుంటాయి.

**9-1 : వైద్యం :-** మనిషి తన జీవన సౌభాగ్యానికి, ప్రకృతి ప్రసాదించిన వస్తువులెన్నో ఉపయోగించుకొంటున్నాడు. కంటి నొప్పికి, కడుపు నొప్పికి, కాలి బెణుకుకు ఏవేవో మందుల్ని వాడుతున్నాడు. ఈ కాలంలో దగ్గినా డాక్టరు దగ్గరికి పరుగెత్తుతున్నారు; కాని ఒకప్పుడు గృహ వైద్యంతో ఎన్నో నయం చేసుకొనేవారు. గ్రామంలో చిన్న వైద్యుడుండేవాడు; కాయో-కసరో-పసరో ఇచ్చేవాడు; లేదా చిట్కా వైద్యాన్ని ప్రయోగించి రోగాలు మాన్పేవాడు.

వేపాకు, కరివేపాకు, కరక్కాయ, తంగేడు చిగురు, తుమ్మచెక్క-విష్ణుకాంతవేరు, తాటి బెల్లం, అల్లం, మిరియాలు, సొంటి, పసుపు, బందెరి ఆకు, వరిపొట్టు, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు, మైసాక్షి, ఎల్లిపాయ గంధం, పొగాకు, కుంటగజ్జలివేరు, గజరలం, బాదాం ఆకు, వామ పోచ, నల్లేడ, కారు మునగాకు, మేడిపాలు .. ఇలా ఎన్నింటినో వైద్యాని కుపయోగించుకొనేవారు. ఇవేకాక చురుకులు వేసేవారు; చిన్న చిన్న వాతలు పెట్టేవారు; భూతవైద్యం

చేయించేవారు. నమ్మినవారు నమ్ముతారు; ఆచరించేవారు ఆచరిస్తారు. కొన్ని నయమవుతాయి; కొన్ని వికటిస్తాయి.

అరవై ఆరు రోగాలను ఒక్కువామపోచే మంచనీ, ఈనాటికీ ప్రజలందరూ తింటూనే ఉన్నారు. కడుపు నొప్పికి అల్లం, నెత్తి నొప్పికి సొంటి, గడ్డకు ఎల్లిపాయ గంధం, లేదా మైపాక్షి, కాలి బెణుక్కి వరిపొట్టు ఈనాటికీ గృహ వైద్యంగా చలామణిలో ఉన్నాయి. ఈ క్రింది పొడుపు కథ ఆ వైద్యాన్నే సూచిస్తున్నది.

* వంకర టింకర శొ
వాటి తమ్ముడు అ
నల్లని పిల్లా మి
(నల్లని గుడ్లా మి)
నాకేమిస్తావు తే

ఒక వ్యక్తి కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. ఆసుపత్రి దూరంగా ఉంది. అతను 'వంకర టింకరలుగా' తిరిగి పడిపోతున్నాడు. మరి ఎదో వైద్యం చేయాలి. అలాంటి వ్యక్తికి వెంటనే (శొ) శొంఠి వాడాలని, దానికి తోడు దాని తమ్ముడైన (అ) అల్లాన్ని ఉపయోగించాలని, అంతే గాకుండా నల్లని పిల్ల (మి) మిరియాన్ని జోడించాలని, ఇవన్నీ (తే) తేనెలో రంగరించి ఇవ్వాలని ఈ పొడుపు కథ కర్థం.

కడుపునొప్పికి ప్రధాన కారణం అజీర్ణం; రక్త ప్రసరణం సరిగా లేక పోడం కూడా మరోకారణం ఈ రెండింటినీ దూరం చేసే శక్తి పై చిట్కా వైద్యానికుంది. కడుపు నొప్పికి తమ్ముడు అజీర్ణమని కూడా ఈ పొడుపుకథే చెబుతున్నది. 'నల్లని పిల్లా మి' అనే పదానికి 'నల్లాగుడ్లామి' అనే పాఠాంతరం ఒకటి లభిస్తున్నది. రోగి ఈ బాధతో గుడ్లు తెలవేస్తే మిరియం ఇవ్వాలని ఈ పాఠాంతరానికి అర్థం, ఈ పొడుపు కథకే పాఠాంతరమొకటున్నది..

* వంకర టింకర ఓ
వానీ తమ్ముడు సో
నల్లాగుడ్లా మి
నాలుగు కాళ్లా మే

వంకర టింకర తిరిగి పోతూ అతను 'ఓఓ' అంటున్నాడు (అరుస్తున్నాడు) అంతే కాదు 'సో' లి పోతున్నాడు. నల్ల గుడ్లతో 'మి' ట్టి మిట్టి చూస్తున్నాడు. అలాంటి వ్యక్తి చివరకు నాలుగు కాళ్లు పార చాపుకున్నాడు. (నాలుగు కాళ్లు = చేతులు—కాళ్ళు). అలాంటి బలహీనునికి 'మే'క మాంసం తినిపించాలి. అని అర్థం. నిజానికి ఇంత బలహీనునికి మేక మాంసం మంచిది కాదు.

ఓ - ఓదార్చాలి
సో — సోచయనిగా చూడాలి
మి - మీవాడనే అనాలి
మే - మేమే అంటూ మేకలాదరిజేరాలి (బుజ్జగించాలి)

ఆ మాంసం తిండి ఉన్నా లేకున్నా రోగికి ఇవి కావాలి. దీనికర్థం తెలిసినా తెలియకున్నా బాలబాలికలు ఒకరిని ఒకరు పరిహసించుకొంటూ పై పొడుపు కథను విసురుకొంటారు,

సంప్రదాయాన్ని, వైద్య శాస్త్రాంశాల్ని మేళవించుకొన్న ఈ క్రింది రాయలసీమ మారుకథ పరమ రమణీయంగా ఉంది. ఆ రచయిత మాటలతో పాటు ఉన్నది ఉన్నట్లుగా ఈ పొడుపు కథ ఉదాహరిస్తాను.

* "గొల్లభామ-పొడుపు (ప్రశ్న)
వడ్లుపండీ వరికూడెరుగా
నూగులు పండీ నూనె ఎరుగా
ముగ్గురు బిడ్డల తల్లినైనారా
ఓ.... మామ కొడుకా!
మొగుని ఫక్కా మొదలే ఎరుగారా!"

సుంకరి కొండడు - ఏడుపు (సమాధానం
గుజ్జుపు కొండా బెల్లపు ముద్దా
గుబ్బాదేశపు కొబ్బారుండీ
నాకు పండిన నూగులున్నాయా....
ఓ ... గొల్లభామా!
ఆరు తూముల నూగులున్నాయి!"[1]

...."ఈ పేలకత ఎంత తల బద్దలు కొట్టుకున్నా అర్థం కాదు. గొల్ల భామ తాను పెద్ద మనిషినయ్యానని తెలియజేస్తోంది. ఆమె మామ కొడుకైన సుంకరి కొండడు "నిన్ను నేను పెళ్లి చేసుకుంటాను" అని జవాబు చెపుతున్నాడు. పుష్పవతియైన కన్యకు ఆ మూడు రోజులు అన్నం పెట్టరు. అన్నం పెడితే వాతం క్రమ్ముతుంది. అందువల్లనే గొల్లభామ "వస్తు పండి వరికూడెరుగా" అని వాపోతుంది. సమర్తాడిన కన్య ఆ మూడు రోజులూ తలకి నూనె రాచుకోగూడదట. ఇది రాయలసీమలో సంప్రదాయం. అందుకనే 'నూగులు పండీ నూనే ఎరుగా' అంటోంది గొల్లభామ. మొగుని పక్కా తెలియకుండానే ముగ్గురు బిడ్డల తల్లి అయిందట ఈమె. అంటే 'వివాహం కాకుండానే ముగ్గురు పిల్లలు పుట్టారు' అనే దుష్టార్థం గోచరిస్తోంది పైకి. కాని నిజానికి దీంట్లో ఆ అర్థం లేదు. రాయల సీమలో పల్లె ప్రజల ఆచారాలు పరిశీలించినట్లయితే దీని అర్థం సులభంగా తెలుస్తుంది. బాలిక పెద్దమనిషి అయినప్పుడు ఆ మూడు రోజులూ గొప్ప వేడుకలు జరపడం మనకు తెలుసు. రాత్రివేళ ఆ బాలిక పడుకుంటే భయపడుతుందని చెప్పి ఆమె పక్కలో ముగ్గురు నలుగురు చిన్న పిల్లల్ని కూడా పడుకోబెడతారు. అప్పుడామె పిల్లల తల్లిలా కనబడ్డం సహజం. అందుచేతనే గొల్లభామ 'ముగ్గురు బిడ్డల తల్లినైనారా, మొగుని పక్కా మొదలే ఎరుగనురా' అంటోంది.

రాయలసీమలో సమర్త పెండ్లి కూతురికి ఆ మూడు రోజులూ తీపి సరుకులు పెడతారు. ముఖ్యంగా బెల్లమూ నువ్వులూ కలిపి చిమ్మిలి, కొబ్బరి కాయతో కజ్జికాయలు చేసి పెడతారు. ఇది వైద్య శాస్త్రం దృష్ట్యా కూడా మంచి

1. రాయలసీమ మాఘ కతలు (వ్యాసం) భారతి, జనవరి, 1968

ఆహారం! శరీరంలో ఉన్న దుష్ట రక్తమంతా తీపితినడం వల్ల బయటపడిపోతుంది అందుచేతనే ఆమెకు కావలసిన మధురాహారం తన దగ్గర పుష్కలంగా ఉందని సుంకరి కొండకు జవాబిస్తున్నాడు...."

రాయలసీమలోనే గాక తెలుగునేల నాలుగు చెరగుల్లోనూ ఈ ఆచారముంది. పుష్పవతి అయిన బాలికల సమీపంలో కేవలం రాత్రిపూటనే గాక ఎప్పుడూ పిల్లల్ని కూడా పెడతారు. ఇక తీపి వస్తువులివ్వడం వైద్యశాస్త్రం కూడా అంగీకరిస్తుంది; ఇప్పుడు నగరాల్లో నువ్వులు, బెల్లం కొబ్బెర పాలు తగ్గి ఇప్పటి 'స్వీట్సు'కే ప్రాధాన్యం పెరిగింది.

ఇక దగ్గు మందు కూడా పొడుపు కథల్లో కనిపిస్తుంది. ఈ క్రింది ములక్కాయ అదే.

* సంగూరు సాలోడు
సవునేతకాడు
సన్న బియ్యం గుమ్మరిచ్చి
సంచుడక్క వెట్కటినె (ములక్కాయ)

ములక్కాయలోని విత్తనాలను తీసివేస్తారు. పైతోలును ఉడికించి, ఉప్పూకారం వేసి కూరచేసి తింటారు. ఈ కూర ఖాద్య పదార్థమే కాక దగ్గును నివారించే ఔషధంగా కూడా ఉపయోగపడుతుంది.

* కరణాల చేతిలో కలుగునాయుధమేది
కాసకు గుణమీయగలుగు నేది..." (కలము - ములక)

కాస అంటే దగ్గు. పల్లె ప్రజలే ఈ వైద్యాన్ని అనుసరిస్తున్నా, పై పద్యం పాదం మాత్రం తెలుసుకొన్న పండితులు కూర్చిందే.

* ... "ఖాండవం బేటికి కాల్చెను సవ్యసాచి..." (అజీర్తి)

ఈనాటికీ అజీర్ణం చేస్తే కడుపు కాపుతారు. అలనాడు అగ్ని అజీర్తికి అర్జునుడు ఖాండవం కాల్చాడు. వైద్యం సంగతి చెప్పలేదుగాని పోచమ్మను దేహ తాపం కలిగించే దేవతగా నమ్ముతున్నారు ప్రజలు.

* '... దేహతాపము జేయు దేవత పేరేమి... " (పోచమ్మ)

ఆటలమ్మ, అమ్మవారు, అమ్మతల్లి, స్ఫోటకం, మశూచి అని ఈ రోగానికి పేర్లున్నాయి. చిన్నగా పోస్తే తట్టుతల్లి అంటారు. పెద్దగా పోస్తే మశూచి అంటారు. పదాల వాడుకలో ప్రాంత భేదాలున్నాయి. ఇక జ్వరం వచ్చినవారికి విష్ణుకాంత వేరు రసాన్ని తాపుతారు. ఆ వేరును రంగరించి రసం తీస్తారు. అందువల్లనే విష్ణుకాంత కూడా విడుపుల్లోకి ఎక్కి కూచుంది.

* "... వెన్నునందు మరి కాంత ఓవరింప నొక్కటి... " (విష్ణుకాంత)

ఇంకా అనేక పద్యాంశాల్లోనూ, పొడుపు కథల్లోనూ ఏదో విధంగా కనిపిస్తున్న వస్తువులెన్నో వైద్యానికి ఉపకరించేవే. వివరాల దగ్గరికెళ్ల కుండా కేవలం ఉదాహరిస్తాను.

* రారాజు రతి రాజు రాజ రాజును గూడి
యొకమాట లోపల నుండవలయు (రాజమదనకు బేరము)

* ఎనుగు సింహంబు నెలనాగయును గూడి
యొకమాట లోపల నుండవలయును (నాగకేసరాలు)

* గీముశుద్ధికి నేమి గేహినుల్ దెత్తురు (గోమయం)

* జీవంతి యనివేని చెప్పు చంద్రుదు (కరక)

* పువ్వుగాని పువ్వు-
పూసుకొంచే నవ్వు (కుంకుం పువ్వు)

* కట్టగాని కట్ట
కరే పాకుజుట్టా (జీలకట్ట)

జానపద గేయాల్లోని పిల్లల పాటల్లో కూడా ఆయుర్వేదానికి సంబంధించిన అనేక రహస్యాలున్నాయని పరిశోధకుల అభిప్రాయం.[1] ఔషధాలు రోగిమీద అందరూ ప్రయోగించరు; ప్రయోగించరాదు. అందరూ ప్రయోగించడం ప్రారం

1. తెలంగాణా పల్లెపాటలు-పు : 28, 32.

భిస్తే శాస్త్రాధ్యయనం చేసే నిపుణుల అవసరమే ఉండదు. రోగం వికటించి, రోగి పోయే ఏ పనైనా గర్భ నియమే. అందుకే తెలియక ఔషధం ప్రయోగించిన వారి నుద్దేశించే "కొండనాలికకు మందు వేస్తే ఉన్ననాలిక ఊడిపోయిందట" అనే సామెత పుట్టింది. పలుకుబళ్లు, సామెతలు, జాతీయాలు శారీరకలనారోగ్యాన్ని దూరం చేసే మందుల పొట్లాలు పొట్లాలు కట్టేది ప్రజలే; విప్పేది ప్రజలే.

**9-2 : జ్యోతిషం :_** జ్యోతి అంటే వెలుగు. వెలుగునిచ్చేవన్ని జ్యోతిస్సులు. జ్యోతులకు సంబంధించిన శాస్త్రం జ్యోతిశ్శాస్త్రం. సూర్యుడు చంద్రుడు, అంగారకుడు,శుక్రుడు మొదలయినవన్నీ వెలుగునిస్తాయి. ఈవెలుగులు లోకంలో ప్రసరిస్తాయి. ప్రకృతిపై తమ ప్రభావాన్ని చూపిస్తాయి. మనిషి శరీరంపై మనస్సు పై కూడా ఆధిపత్యాన్ని చలాయిస్తాయి. వీటినే గ్రహాలంటారు. గ్రహప్రభావాల్ని తెలిపేదే జ్యోతిశ్శాస్త్రం. కాని కాలక్రమంగా మనిషిభవిష్యత్తును నిర్వచించిన ప్రతిపలుకూ జ్యోతి శ్శాస్త్రంగా వ్యవహారంలోకి వచ్చింది. అందువల్ల ఆశాస్త్రం మీద తార్కికులకు అపనమ్మకం కలిగింది. ఆశావాది అయిన మనిషి భవిష్యత్తు తెలుసుకోవాలనుకోడం సహజం. ఆ తహతహలో శాస్త్రీయాంశాల్ని అశాస్త్రీయాంశాల్ని రెండింటినీ విశ్వసించాడు. గ్రహనక్షత్రాలతోపాటు ద్వాదశ రాశుల్ని జీవితానికన్వయించుకొన్నాడు.

* కన్యకునైదు జంఘులును, కన్యకు నారుకుచంబులెన్నగా
కన్యకు నాల్గు కన్బొమలు, కన్యకు నేడు విశాల నేత్రముల్
కన్యకు ద్వాదశంబులగు కౌనును గల్గిన పంచ లక్షణా
కన్యకు నీకు నింక పదిగావలె కస్తురిరంగ నాయకా![1]

కస్తురి రంగనాయకుని కవి దీవిస్తున్నాడు అయిదు జంఘలు, ఆరు కుచాలు, నాల్గుకనుబొమ్మలు, ఏడు నేత్రాలు, పండ్రెండు నడుములున్న పంచలక్షణ సుశోభిత అయిన కన్యరంగనాయకునికి పది అవుతుందని దీవెన. ద్వాదశ రాశుల సాంకేతికార్థాలుఅన్వయించుకొంటేగాని అర్థం బయటికి రాదు.

1. పొడుపు కథలు-పు : 51

ఐదు, ఆరు, నాల్గు, ఏడు, పండ్రెండు, పది రాశులు ఈ పద్యంలో ఉన్నాయి. ద్వాదశ రాశుల వరుస ఇది. 1. కన్య, 2. తుల, 3. వృశ్చికం, 4. ధనుస్సు, 5. మకరం, 6. కుంభం, 7. మీనం, 8. మేషం, 9. వృషభం, 10. మిథునం, 11. కర్కాటకం, 12. సింహం.

కన్యకు మకర (5) సదృశాలైన జంఘలు, కుంభా (6) లను పోలిన కుచాలు, ధనుస్సు (4) వంటి కనుబొమ్మలు, విశాల మీన (7) నేత్రాలు, సింహంలాంటి (12) నడుమూ ఉన్నాయి. ఆ కన్యకూ నీకూ మిథునం (జంట, 10) కావాలి. రంగనాయకునికి జంట కుదరాలని కవి దీవించాడు. రాశుల సంఖ్యలతో చేసిన చమత్కారమిది. రాశులు జ్యోతిశ్శాస్త్రమందలివే. ఆ రాశులతో అవతరించినదీ పొడుపు పద్యం.

* పెద్దవాడు పడుచువాడుమామ గూడినా
గ్రుడ్డివాడు నడ్డివాడు మామగూడినా
వంచ నింత లేకుండ వాన వచ్చును.[1]

పడుచువాడు, నడ్డివాడు అనే పదాలకు పిన్నవాడు గూనివాడు అనే పాఠాంతరాలూ ఉన్నాయి. పెద్దవాడు సూర్యుడు, పడుచు (పిన్న) వాడు బుధుడు, గ్రుడ్డి వాడు శుక్రుడు, నడ్డి (గూని) వాడు శని. చంద్రునితో సూర్య బుధులు గాని, శుక్రశనులుగాని, కూడినట్లయితే వర్షం కురుస్తుంది. ఇవి పరిశోధనల ద్వారా తేలవలసిన అంశాలే అయినా సమాజంలో ఇలాంటి నమ్మకాలెన్నో ఉన్నాయి.

ఈ సంవత్సరం వాతావరణమిలా ఉంటుందనీ, పంటలీవిధంగా పండుతాయనీ తెలిపే పంచాంగ విజ్ఞానాన్ని జ్యోతిషమే అంటున్నారు. ఈ క్రిందివి ఆ దృష్టితో పరిశీలించవచ్చు.

కలివి పండితే కరువు వచ్చును.
మోదులు కాస్తే ముంగారి పంటలు
వేములు కాచితే భూములు పండును.

---

1. వ్యవసాయ సామెతలు, ఉపోద్ఘాతము - 24.

బలుసులు పండినచో కాయ ధాన్యాలు గొలుసుల వలె పండును.
నేరేళ్ల నిగిడేది, మామిళ్లమగ్గేది, మంచికాలానికి లక్షణం.
మిథునంలో పుట్టిన మొక్క, మీన కట్టున పుట్టిన కొడుకు అక్కరకు
వచ్చును.

కర్కాటకము బిందిస్తే పర్పాటకము పండును.
తులలో వానకు ధరణి పండును.
మృగశిర బిందిస్తే అయిదు కార్తులు వర్షించును.
ఆరుద్ర బంధిస్తే ఆరవై రోజులు వలుపు."

ప్రజల విజ్ఞాన భాండాగారాలీ సామెతలు; జానపద వాఙ్మయ పరిశోధకు లెందరో సంకలనం చేశారు.[2] జ్యోతిశ్శాస్త్ర సంబంధి పొడుపు కథలూపద్యాలూ కొన్ని మాత్రమే లభించాయి. అయితే గణిత శాస్త్రసంబంధి పొడుపు కథలు లెక్కకు మిక్కిలిగానే ఉన్నాయి. వీటిని పొడుపు లెక్కల క్రింద ప్రత్యేకంగా సంకలనం చేయవచ్చు.

**9-3 : గణితం :-** మనిషి జీవితంలో అడుగడుగునా గణితం ఉపయోగ పడుతున్నది. గిద్దెడు, సోలెడు, తవ్వెడు కొలిచే సాధారణ మానవునికీ, టన్నుల కొద్దిగా తూకం వేసే వ్యాపారికి, గనులనుండి బొగ్గుతీసే కార్మికునికి, పైసా పైసా సమకూర్చుకొనే భిక్షుకునికి, వేళ్లలెక్కపెట్టుకొని అంకెలు సరిగావేసుకొనే విద్యార్థికి, వారికీ వీరికీ అననేల అందరికీ లెక్కల అక్కర ఉన్నది. ఇక పొడుపు పద్యకర్త పొడుపు లెక్కల చిక్కుముళ్ళ విప్పడానికి గణిత మెరిగినట్టి కరణాలనే పిలిపించు మంటున్నాడు. కరణాలు గణిత శాస్త్ర పారంగతులు. పద్యాల్లోని పొడుపు లెక్కల చిక్కుముళ్ళు వారే విప్పాలి.

* ఖర్జూర ఫలములు గణికుండు కొనితెచ్చి
సగపాలు మోహంపు సతికినిచ్చె

---

1. వ్యవసాయ సామెతలు (గ్రంథంలోని పుటల్లో అక్కడక్కడ)

నందు నాలవ పాలు ననుగ తమ్మునికిచ్చె
నష్టభాగంబిచ్చె నతని సతికి
తగ తొమ్మిదవపాలు తనయునికిచ్చెను
తనచేత నాల్గన్న తల్లికిచ్చె
మొదట దెచ్చినవెన్ని మోహంపు సతికెన్ని
భ్రాతకెన్ని, వాని భార్యకెన్ని
తనయుకెన్ని యిచ్చె, డడయక తల్లికి
నాలుగెట్టులాయె, నయముతోడ
గణితమెరిగినట్టి కరణాల బిలిపించి
అడుగవలయు దేవయవసరముగ.

ఈ పద్యానికి వివరణ ఇవ్వడం జరిగింది. మొత్తం పండ్లు 288; భార్యకు 144; తమ్మునికి 72; తమ్ముని భార్యకు 36; తనయునికి 32; తల్లికి 4 పండ్లు నిచ్చాడు. ఇది సాధారణంగా తేలే విషయం కాదు. అందుకే గణిత మెరిగిన కరణాల్ని పిలిపించమనడం పెద్దబాలశిక్ష తదితర గ్రంథాల్లో వీటినే యుక్తి లెక్కలనీ, చిక్కులెక్కలనీ ముద్రించారు. ఈ క్రింది పద్యాలు పెదబాలశిక్షలోనివే.

* తార్కికుల్ నలుగురుత స్కరులేవురు,
శ్రోత్రియులిద్దరు, చోరుడొకడు,
భూసురుల్ ముగ్గురు, ముడియవిప్రొక్కడు,
సకలార్థనిపుణుడు శాస్త్రియొకడు
యల్లాపులిద్దరు, యాచకులిద్దరు,
బిరివాంద్రు ముగ్గురు, బాపడొకడు,
అగడీలిద్దరు, ఆరాధ్యులిద్దరు
దుష్టాత్ముడైనట్టి దొంగయొకడు
ఆరసి వారల నొకశక్తి యశనమునకు
సగము గోరగ, నవసంఖ్య జగళిసుడు
చెప్పదొంగలు హతులైరి, చేటుదప్పి
విజయమందిరి యావేళ విప్రులెల్ల
(X . బ్రాహ్మణుడు, 0. దొంగ)

XXXX 00000 XX 0 XXX 0 X 00 XX 000 X 00 XX 0

పదిహేను మంది బ్రాహ్మణులు, పదిహేను మంది దొంగలు కలిసి పోతున్నారు. వారిని దారిలో దయ్యం నిలబెట్టింది. సగం మందిని తింటానంది. ఓ బ్రాహ్మణుడు ఆలోచించి తనవారినీ దొంగలను పై వరుసలో నిలిపాడు. ఆ తర్వాత ప్రతి తొమ్మిదవ వ్యక్తిని తినుమన్నాడు. నిలిపిన క్రమాన్ని బట్టి పదిహేను మంది దొంగలే దయ్యానికి ఆహారమై పోతారు. ఈ విధంగా నిలబెట్టాలంటే ఎంతో యుక్తి ఉండాలి.

* అర్చకుండొకడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
మూడచ్యుత స్థానమునకు జేర్చి
తొలి దేవళంబు ముంగలి కొలంకున దోగ
చేతిపువ్వులు యథాస్థితి దలిర్ప
నందు గొన్నిటిని దైత్యారికి నర్పించి
శేషమాగుడి తటాకమున ముంప
తత్స్నానమున రెట్టదనర పూర్వపురీతి
నర్పించి యవలి కోశంబు వలన
త్రిగుణమైన మొదలి తీరున పరమేశు
పూజ చేసి మిగులు పూలు గుట్ట
మూటరెంట నొకట మొగివృద్ధిగానుంచె
తొలుత నెన్నిదెచ్చె తోయజములు
పుష్పాలు మొత్తం : 111
దీనికి సూత్రం ఈ క్రింది పద్యం.

* తిరమగుప్రసూన వృద్ధులు
వరుసను లిఖియించి యంశవర్గంబు పర
స్పర గుణితంబైనను గన
బరగుం బూజా ప్రసూన పటలంబనఘా!

* మున్నూటరువది మాటలు
నెన్నగ పవియుంగరంబు లెంతెంతో భటుం

డెన్నాళ్ల జీతమడిగిన
నన్నాళ్లకు నుంగరంబు లారాజిచ్చున్.
ఉంగరాల ఎత్తు

1234 10 20 30 40 100 150
దీనికి సూత్రం ఈ క్రింది పద్యం

* ఒకటి రెండు మూడు నొనరంగ నాల్గిడి
యదియుబెట్టి సున్నలమర బెట్టి
నూరుబెట్టి పిదప నూటయేబది బెట్టి
ఉంగరముల యెత్తు లెరుగవచ్చు.

ఇలాంటి యుక్తి ప్రశ్నలు, యుక్తి లెక్కలు పెదబాలశిక్ష తదితర గ్రంథాల్లో లభిస్తున్నాయి. శ్రీ మంగిపూడి వేంకటశర్మ చమత్కార చంద్రికలో యుక్తిలెక్కల పద్యాలు కొన్ని ఉన్నాయి. ఈ క్రింది రెండు పద్యాలు పండ్ల పంపిణీకి సంబంధించినవే.

* ఐదవ పాలు దేవునకు నందుల నాలవపాలు పత్నికిన్
మోదము మీరశేషమున మూడవ భాగము పట్టికిచ్చి మ
ర్యాదగ నర్థమున్ హితునకంపి భుజించెను మూడుపండ్లు తా
నాదిని నెన్ని పండ్లుకొనె నా యజమానుడు మాకుజెప్పుడీ!

* పురుషుడొకండు కొన్ని ఫలముల్ కొనితెచ్చి సగంబు తల్లికిన్
నెరిని చతుర్థ భాగమును నెచ్చెలికేడవ పాలు భార్యకున్
దొరకొని పుత్రమౌళికి జతుర్దశ భాగము నీయనిల్చెత
త్కరములలో ఫలాష్టకము తాగొని వచ్చినవెన్ని చెప్పుడీ!

పై మొదటి పద్యంలోని యజమాని 15పండ్లు, రెండోపద్యంలోని పురుషుడు 224పండ్లు తీసుకొని వచ్చి పంపిణీచేశారు, తాను సంపాధించిందితానే తినకూడదని, కుటుంబ ధర్మాన్ని పాటించి బ్రతుకులో పరమార్థాన్ని సాధించాలనీ ఈ పద్యాలన్నీ తెలుపుతున్నాయి. పైకిమాడ్డానికి సౌడుపులెక్కలే అయినా అంతరార్థం మాత్రం ఇదే.

పొడుపు పద్యాల్లోనేగాక జనవ్యవహారంలో కూడా లెక్కలేనన్ని చిక్కు లెక్కలు వినిపిస్తున్నాయి. అవికూడా ఎప్పుడో ఎవరో సంసిద్ధం చేసినవే, అయితే వ్యవహర్తలకు అవి ఎప్పుడు ఎవరు తమతో అన్నారో గుర్తుండదు, కొన్నివారే సంసిద్ధం చేసినా తమవిగా చెప్పుకోరు. తాము విన్న అంశాన్ని మరచిపోవడంవల్ల కూడా ఎంతోకొంత కలిపి చెప్పడం కూడా జరుగు తుంది. ఈ క్రింద ఉదాహరించే పొడుపు లెక్కలన్నీ ఈ మధ్య కాలంలోనే ప్రచారంలోకి వచ్చాయి. కొన్ని లెక్కల్ని పత్రికలు కూడా అచ్చు వేసినై.

* ఓ వ్యక్తికి 9 బఱ్ఱెలున్నాయి. అవి 45 శేర్ల
పాలు ఇస్తాయి. మొదటి బఱ్ఱె 1శేరు, రెండో
బఱ్ఱె 2శేర్లు, మూడో బఱ్ఱె మూడు శేర్లు....

ఇలా వరుసగా సంఖ్యాక్రమాన్ని అనుసరిస్తూ పాలనిస్తాయి. ఆయనకు ముగ్గురు కొడుకులున్నారు. ఈ ముగ్గురికీ మూడు బఱ్ఱెలు రావాలి. ఒక్కొక్కరికి 15 శేర్లు పాలు రావాలి. పంపకం కుదిరే పద్ధతి చెప్పండి!

దీనికో పద్యసూత్రం ప్రజల్లోనే సంసిద్ధమైంది. మూడు మూడు గదులుండి 9 దాటని అంకెలతో ఎటుకూడినా పదిహేను రావాలని అడగే "ఫజిల్" వంటిదే ఇది.

* ఆరున్నొక్కటి యెనిమిది
సారంబుగ నేడు నైదు సరగున మూడున్
ధీరత రెండును తొమ్మిది
శ్రీరాముని కడకు నాల్గు శ్రీరఘురామా!

| | | | |
|---|---|---|---|
| మొదటి వానికి | 6 | 1 | 8 |
| రెండో వానికి | 7 | 5 | 3 |
| మూడో వానికి | 2 | 9 | 4 |

* ఇలాంటిదే 40 గేదెల లెక్క వ్యవహారంలో ఉంది. పిల్లల బుద్ధికి పదును పెట్టడానికి ఈ లెక్కనూ వేస్తున్నారు. అయితే నలభై గేదెలు నల్గురన్న

దమ్ములకు పంచాలి; గేదెలు 40, పాలు 820 లీటర్లు; ఒక్కొక్కరికి పది గేదెలు రావాలి. 205 లీటర్లపాలు రావాలి.

| ప్ర | ద్వి | తృ | చ |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 8 | 7 | 6 | 5 |
| 9 | 10 | 11 | 12 |
| 16 | 15 | 14 | 13 |
| 17 | 18 | 19 | 20 |
| 24 | 23 | 22 | 21 |
| 25 | 26 | 27 | 28 |
| 32 | 31 | 30 | 29 |
| 33 | 34 | 35 | 36 |
| 40 | 39 | 38 | 37 |
| 205 | 205 | 205 | 205 |

* ఓ మామిడి చెట్టు దగ్గరికి మిత్రులిద్దరు వెళ్లారు.
చెట్టెక్కి కాయలు తెంపే వ్యక్తికి
రెండు పాళ్లు, క్రింద ఉన్నవానికి ఒక పాలని
మొదటే కట్టడి చేసుకొన్నారు. కాయలు
తెంపిన వ్యక్తి కిందికి వచ్చింతర్వాత
అనుకొన్నట్టుగానే 2:1గా పంచుకొన్నారు.
కింద ఉన్న వ్యక్తి తనకొకటి ఎక్కువగా
ఇవ్వవలసిందని కొసరి తీసుకొన్నాడు
అప్పుడిద్దరి దగ్గర కాయలు సమానమైనై.
అతను కిందవేసిన కాయలెన్ని? (6)

4 : 2

4 — 1 = 3

2 + 1 = 3

* ఓ దొంగకు నిధి దొరికింది. అది బంగారు
నాణాల నిధి. ఇది ఇంకొకడు చూశాడు. ఇద్దరు
సమానంగా పంచుకోవాలనుకొన్నారు. పంచుకోగా
ఒకటి మిగిలింది. ఇద్దరూ కీచులాడుకొంటున్నారు.
ఇంకొకడు వచ్చాడు. ముగ్గురూ సమానంగా పంచు
కోవాలనుకొన్నారు. మళ్ళీ ఒకటి మిగిలింది;
మళ్ళీకీచులాట. నాల్గోవ్యక్తి వచ్చాడు. నల్గురూ
సమంగా పంచుకొన్నారు. ఈసారికూడా ఒకటి
మిగిలింది. అయిదోవ్యక్తి వచ్చాడు. మళ్ళీ ఆలాగే
జరిగింది ఆరోవ్యక్తి వచ్చాడు. పరిస్థితిలో
మార్పులేదు. ఏడోవ్యక్తి వచ్చాడు. అప్పుడు
ఏడ్గురికీ ఆ నాణాలు సమంగా వచ్చేశాయి.
ఇంతకూ ఆ తొలి దొంగకు దొరికిన నిధిలోని
నాణాలెన్ని? (301)

ఇవన్నీ ప్రజల వ్యవహారంలో ఉన్నాయి. కేవలం జానపదులే వ్యవహరించే గణిత సంబంధి పొడుపు కథలు కూడా ఉన్నాయి. వాటిలో కొన్ని ఉదాహరిస్తా. ఇవన్నీ వారు పొడుపు లెక్కలు పొడుపు కథలు అంటున్నారు.

* 5 శేర్ల ఆనగపు బుఱ్ఱ
3 శేర్ల ఆనగపు బుఱ్ఱతో ఆ ధాన్యాన్ని
ఇద్దరికి చెరి సగం పంచాలి.

ఆధునిక కాలంలో తూనికలూ కొలతల లెక్కలేనన్ని వచ్చేశాయి. ఈ ప్లాస్టిక్ లోహ పరికరాలు ఏ రూపంలో అయినా తీర్చిదిద్దుకొనే అవకాశం నేడుంది. మరి ఈ పరికరాలు ప్రవేశించని కాలంలో ప్రజలు ఆనగం కాయల్నే (సొరకాయల్నే) వాడుకొన్నారు. వాటిని అవసరాన్ని బట్టి చిన్నవిగా - పెద్దవిగా కత్తిరించుకొని ఉపయోగించుకొన్నారు లీటర్లు రాకముందు వ్యవహారమంతా శేర్లలోనే సాగేది. పై పొడుపు లెక్క ఓ కథతో జోడించి చెప్పుకొంటున్నారు.

మీసాలు నెరసి అనుభవం పండిన తాతగారు ఆటకోయిల్లయిన తన మనమలిద్దర్నీ దగ్గరికి పిలిచాడు. 8 శేర్ల జొన్నలు వారిద్దరి ముందు కుప్పగా పోశాడు. 5 శేర్ల ఆనగం బుడ్డి, 3 శేర్ల ఆనగం బుడ్డి రెండూ ముందుంచి, 'బుడ్లు పాడు చేయకుండా ధాన్యం చెరి సగం పంచు కొని కొమటి కొట్టుకు వెళ్లండర్రా' అన్నాడు. మనుమలూ తెలిగలవాళ్ళే. తాతగారి తలలో పుట్టినవాళ్ళే. చిటికలో చెరిసగం చేశారు. మొదట 8 శేర్లనుండి 3 శేర్లుతీసి పక్కకు పోశారు. మిగిలిన 5 శేర్లనుండి 3 శేర్లుతీసి ఆ మూడింటిలోనే పోశారు. అప్పుడవి ఆరయ్యాయి. ఆరుశేర్లనుండి అయిదు తీసి వేశారు, ఒక శేరు అలా పక్కకు ఉంచారు. అప్పుడు 5 నుండి 3 తీసి, ఆ మూడింటికి ఒకటి కలపగా 4 శేర్లయ్యాయి. మొదటి 2 శేర్లు చివరి రెండు శేర్లు కలపగా అవీ 4 శేర్లయ్యాయి. ఈ విధంగా 5 శేర్ల ఆనగం బుడ్డితో 3 శేర్ల ఆనగం బుడ్డితో 8 శేర్ల ధాన్యాన్ని సమంగా పంచడం జరిగింది.

కథ చెబుతూ, ఇన్ని వివరాలివ్వాలంటే ప్రతిదీ చేట భారతమవుతుంది. అందువల్ల జానపదుల పొడుపు లెక్కలు కొన్ని కేవలం ఉదాహరిస్తా,

* శెర్ల బర్లు
బర్లమీద కొంగలు వాలుతాయి
ఒక కొంగ మిగుల్తది.
రెండ్రెండు వాల్తయి
బర్రెమిగుల్తది-
బర్లెన్ని కొంగలెన్ని? (3 బర్రెలు, 4 కొంగలు)

* ముప్పయి రొట్టెలు
ముప్పయి మంది -
మగోళ్లకు 2
ఆడోళ్లకు 1 1/2
పిల్లలకు (సగం) 1/2
ఎవరెవరెంత మంది!

(మగోళ్లు-6, ఆడోళ్లు-6, పిల్లలు-18)

* 121 ఎడ్లను
సరి సమానంగా బంతులు కట్టాలి
ఎన్ని బంతులవుతాయి. $(11 \times 11 = 121)$

* బంతికి నాలుగెడ్లు
ఎనిమిది బంతులు $4 + 8 = 32$ ఎడ్లులు
కింది గెట్టెలెన్ని! $1 \times 16 = 16$ గిట్టెలు
మీది గెట్టెలెన్ని? $32 \times 16 = 512$గెట్టెలు

* తండ్రి - కొడుకులు
మామ - అల్లుడు
మూడు రొట్టెలు సమానంగా పంచాలి (ఒక్కొక్కటి)

తినడానికి కూచున్నది నలుగురనుకొంటాం. కాని అక్కడ ఉన్నది ముగ్గురే. తండ్రి - మామ అనబడే వ్యక్తి ఒక్కడే. అతని పక్కన అల్లుడూ, కొడుకూ కూచున్నారంతే!

* ఆడంగ వాయ్యేటివన్ని — 36
మల్లన్ని 36
అండ్ల సగం 18
సగంల సగం 9
నాతోటి న్గూరురు 1
100

ఆధునిక కాలంలో పత్రికలెన్నో మెదడుకు మేత నందిస్తున్నాయి. చిక్కులెక్కలనీ, యుక్తి ప్రశ్నలనీ, తమాషాలెక్కలనీ శీర్షికలుపెట్టి గణిత సంబధి పొడుపు కథలెన్నో గుప్పిస్తున్నాయి. అవన్నీ ప్రత్యేకంగా పరిశీలించి వర్గీకరించి ఓ సంకలనంగా వెల్వరించాల్సిన అవసరంకూడా ఉంది. ఇక్కడ ఆంధ్రభూమి వారపత్రికలోని అయిదింటిని ఉదాహరిస్తా. 1980 జూన్, జులై ఆగష్టు, సెప్టెంబరు మాసాల్లోని పత్రికల్లో ఇవి అచ్చయినవి.

* "ఒక ఏనుగ రోజుకు 4 మైళ్లచొప్పున నడుస్తూ పోతుంటుంది. కొద్ది రోజులయినాక ఆ ఏనుగు ఒక ఎనుగునుకని, తన ప్రయాణం సాగిస్తూ ఉంటుంది. ఆ చిన్న ఏనుగు పుట్టిన 1వ రోజు 1 మైలు, 2వ రోజు 2 మైళ్లు, 3వ రోజు 3 మైళ్లు .... ఇలా రోజుకొక్క మైలు చొప్పున పెరుగుతూ పోతుంది. ఎన్ని రోజులలో తల్లిని కలుసుకోగలుగుతుంది. (7 రోజులు)

* ఒక నిమ్మ తోటకి మూడు ద్వారాలున్నాయి. మూడు ద్వారాల దగ్గరా ముగ్గురు కాపలా దారులున్నారు. ఒక వ్యక్తికి ఒక నిమ్మకాయ అవసరం వచ్చి తోటలోకి వెళ్లాడు. ప్రతి కాపలా దారుడు అతను కోసుకున్న వాటిలో సగం మీద ఒక నిమ్మకాయ యిచ్చే షరతు మీద అతన్ని లోపలికి విడిచి పెట్టారు. ఆ వ్యక్తి కొన్ని నిమ్మకాయలు కోసుకొని, కాపలావాళ్ల వాటాల్ని వారు కోరినట్లే ఇచ్చి బయటకు వచ్చేసరికి సరిగ్గా అతనికి ఒక్కకాయే మిగిలింది అయితే అతను మొత్తం ఎన్ని కాయలు కోశాడు. (22 నిమ్మకాయలు)"

* "భీమయ్య ఒక బస్తా వేరుశనక్కాయలు నెత్తిన పెట్టుకున్నాడు. రామయ్య 10 బస్తాలు పెట్టుకున్నాడు. అయినా భీమయ్యమోసె బరువు రామయ్య మోసేబరువుకి 20 రేట్లు వుంది! ఏందుచేత!

(రామయ్య మోసేవి ఖాళీ సంచులు కాబట్టి)"

* " 1 రూ. కి 20 వంకాయలు. 1 బెండకాయ. 5 రూ కి 1 గుమ్మడి కాయ వస్తాయి. అన్ని కూరగాయల్ని తెమ్మని 100 రూ. ఇచ్చాను. మొత్తం 100 కూరగాయలు రావాలి! ఎలా చెప్పండి!

| | | |
|---|---|---|
| 19 గుమ్మడికాయలు | .... | 95రూ. |
| 1 బెండకాయ | .... | 1రూ. |
| 80 వంకాయలు | ... | 4రూ. |
| 100 కూరగాయలు, | | 100 రూపాయలు" |

* తొమ్మిది మామిడి పళ్లని అక్క చెల్లెళ్లిద్దరు పంచుకుంటే ఎన్ని మిగుల్తాయ్?

(అక్క ఇద్దరు చెల్లెళ్ళు ఒక్కొక్కళ్లకి మూడేసి కాయలు వస్తాయి అసలు మిగులవు)"

ప్రజా జీవనోపయోగం కాని గణితం లేనే లేదనవచ్చు. ముఖ్యంగా పొడుపు లెక్కల విషయంలో ఇది మరీ వాస్తవం. రూపాయలు, కూరగాయలు, పువ్వులూ, సరస్సులూ, దేవుళ్లూ, పశువులూ ఇవే కదా ఈ గణిత సంబంధి ప్రహేళికల్లో వచ్చినవి. పిల్లలకు బెత్తాన్ని చూపిస్తూ ఒక లెక్క అర్థం కాకపోతే ఒక జీవితమే అర్థం కాదోచ్" అంటుంటారు లెక్కల పంతుళ్ళు. జీవితాల్ని అర్థం చేసుకోడానికి, మానసిక వికాసానికి పొడుపు లెక్క ఎంతో తోడ్పడు తుందని చెప్పవచ్చు అందుకే ప్రజా జీవనంలోని శాస్త్రీయాంశాల్లో ఇది అంతర్భాగంగా చేర్చడం జరిగింది. ప్రజల దగ్గరి నుండి ప్రహేళికల లెక్కల వరకు సాగిన ఈ ప్రకరణం పిండితార్థమిది.

## 5-10 : పిండితార్థం

తెలుగు పొడుపు కథలు ప్రజాజీవన ప్రతినిధులు—సంప్రదాయ నిధులు అందువల్లనే ప్రకరణ ప్రారంభంలో ప్రజల ప్రతి బింబాలని వివరించాను. గృహ జీవన ప్రహేళికల్ని సమీక్షించాను. సంప్రదాయాల్లోని విధినిషేధాంశాల్ని విశ్లేషించాను. వృత్తి విశేషాల్లో వ్యవసాయ వ్యాపారాది అనేక వృత్తుల్ని వ్యాఖ్యానించాను. క్రీడా వినోదాల్ని అనుశీలించాను. పారమార్థిక జీవన పరమార్థాల్ని స్పృశించాను. ఆధునిక జీవన విధాన విశేషాల్ని వింగడించాను. ప్రకృతి పరిశీలనం ద్వారా ప్రజా హృదయాన్ని ఆవిష్కరించాను. ఇక ప్రకరణాంతంలో విజ్ఞాన శాస్త్ర పరిచయమనే శీర్షిక క్రింద వైద్య, జ్యోతిష, గణిత శాస్త్రాంతరంగాల్ని ఉల్లేఖించి పొడుపు కథల్లో అవి ఎలా పొదిగాయో విశ్లేషించి ప్రజా జీవనంతో సమన్వయించి చూపించాను.

నిజమే ప్రజల అంతరంగాన్ని అద్దంలా పట్టి చూపించింది ప్రహేళిక. ప్రజలు ప్రకృతినీ సమాజాన్నీ సందర్శిస్తున్నారు. బతుకుబాటలోని ఒడిదుడుకుల్ని ఎదుర్కోడానికి నిష్కంటక మార్గాన్ని నిర్మించుకొంటున్నారు. అదేజీవనం; అది అనుభవైక వేద్యం. శరీరం, మనస్సు బుద్ధి, ఆత్మలు తమ కార్య

క్రమాల్లో తాము సాగిపోతుంటే అనుభవాలు మూటలు మూటలుగా మేటపడు తుంటాయి. ఆ మేటల్లో నుండి ఏ ఒకటి దూసుకు వస్తుంది; అది పదిమందికంట పడుతుంది. పరిశోధకుని వెంట పడుతుంది. దాన్ని పట్టుకొని ప్రాకులాడితే ఇంత జీవనం ఇంటి ముంగిట నిలిచింది. చూపున బట్టి మరెంతైనా నిలిచే అవకాశముంది.



# పొడుపు కథలు - ఆధునిక సాహిత్యం

## 6-1 : ఆధునికత - ఒక ఆలోచన

ప్రపంచం మహావేగంగా పరుగిడుతుంది. ఎండ్లకు బదులుగా ట్రాక్టర్లు, మోటరులకు మారుగా కరెంటు మోటర్లు, నాగళ్లకు ప్రతిగా మరనాగళ్ళు జానపదుని జీవనంలో అక్కడక్కడ చోటుచేసుకొన్నాయి. యంత్రాల ప్రాబల్యం దినదినం పెరుగుతుంది. కొన్ని కుటుంబాలు పూర్వం నుండి అనుసరిస్తున్న వృత్తులనే అనుసరించాలనే నియమాలిప్పుడేం లేవు. వృత్తుల్లో - పరిశ్రమల్లో యంత్రాల ప్రాధాన్యం పెరిగి, ఉత్పత్తి వేగాన్ని పుంజుకొంది. యంత్ర ప్రాబల్యం కారణంగా సమస్త జీవన రంగాల్లో వేగం పెరిగినట్లనిపించినా కొన్ని విషయాల్లో మాత్రం ఏక్కడ వేసినా గొంగడి అక్కడే ఉంది.

గ్రామీణ జానపదుని జీవితంలో ఈనాటికీ ఎండ్లూ నాగళ్లూ తొంబయి శాతం వరకుండనే ఉన్నాయి. మోటలు దాదాపుగా మూలకు పడ్డాయి. వాటి స్థానంలో కరెంటు మోటర్లు రాజ్యం చేస్తున్నాయి. గ్రామీణ జానపదుని జీవనంపై నగరవాసుల నాగరికత ప్రభావం పడింది అతని వేషభాషల్లో కొంత మార్పు వచ్చింది. కత్తెర జుంపాలు వదిలి క్రాఫింగుకెదిగాడు. కొందరాజుంపాలను షెఫ్పీ శైలికి దించారు. యువకులెందరో పంచల్ని వదిలి ప్యాంట్లకు ప్రాకారు, చెవుల పోగులు, దండె కడాలు మోటయ్యాయి. అయితే గ్రామ స్త్రీల వేషభూషణాల్లో ఏ మాత్రం మార్పురాలేదు. గ్రామాలనుండి కూలీ నాలీ నిమిత్తం నగరాల కెగ బ్రాకిన స్త్రీ పురుషులిద్దరిలో కొంతమార్పు స్పష్టంగా కనిపిస్తున్నది.

ఎటువైపు చూసినా వేగమే కనబడుతున్నది. ఫలితం విషయంలో కూడా మనిషి ఆత్రపడుతున్నాడు. తెల్లవార్లూ నాటకాలు, వీధిభాగవతాలు, యక్షగానాలు చూసిన ప్రేక్షకుడు మూడు గంటల సినిమాతో ముగిసిపోతున్నాడు. హరికథలూ పురాణాలు గంటలకొద్దివిని సంతోషించిన శ్రోత రేడియోలోని అరగంట నాటకానికే ఆనందిస్తున్నాడు.

పనిలో వేగం పెరిగింది, నిలకడలో సమయం, సంయమనం తగ్గింది. స్థిరతలేదు; అస్థిరత ఉంది; సంచలనం ఉంది; అనైకాగ్రత ఉంది; ఏకాగ్రతలేదు. ఈ భావాలు, ఈ గుణాలు సాహిత్యంలోనూ చోటుచేసుకొన్నాయి.

దినాలకొద్దీ సాగిన సాహిత్య సాంస్కృతిక ధార్మిక ప్రసంగాలు గంటల్లోకి - నిమిషాల్లోకి దిగజారిపోయాయి. మహా పురాణాల, మహాకావ్యాల పఠన పాఠనాదులు తగ్గినై. ఆ స్థానంలో ఆధునాతన ధోరణులతో సూక్ష్మంలో మోక్షం అందించే సాహిత్యం ప్రాదుర్భవించింది. తర్కాలు తగ్గినై. సిద్ధాంతాలు నోళ్లు మూసుకున్నై. రాజకీయ కుటిల వ్యవహారాలు రాజ్యాలు ఏలుతున్నై. వ్యక్తి తన భద్రతకు అధికారాన్ని-అర్థాన్నీ ఆశ్రయిస్తున్నాడు. మరి కొందరు గుండాల్ని పోషిస్తూ రౌడీయిజాలతో రాజ్యాల్ని ఏలుతున్నారు. తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో ఈ భావాలన్నీ చోటుచేసుకొన్నాయి. సాహిత్యం సమాజ దర్పణం కదా! అది తన బాధ్యత నిర్వర్తించింది.

ఈ ప్రక్రియల్లో పొడుపు కథలున్నాయా! వాటి ఛాయలున్నాయా! అలవోకగా కుదురుకున్నాయా! కావాలని కల్పించారా! పొడుపుకథ ఛాయామాత్రంగానైనా చోరబడ్డానికి. దానికున్న స్వరూప స్వభావాలెంత వరకు దోహదం చేశాయి. ఈ ప్రశ్నలన్నిటికి సమాధానమే ఈ ప్రకరణం.

## 6_2 : ప్రక్రియల్లో ప్రహేళికల ఛాయలు

ఇది కథానికలయుగం; నవలల యుగం; పత్రికలయుగం. సాహిత్యంలో పత్రికల్లోని కథలూ - నవలలూ రాజ్యం చేస్తోంటే, పత్రిక సర్వ రంగాల్ని స్పృశిస్తూ సామాజిక రాజకీయ వ్యవహార జ్ఞానాన్ని విశేషంగానే అందిస్తున్నది. వ్యాసాలూ అతివేలంగానే వస్తున్నాయి. అయితే వాటికి పాఠకుల సంఖ్య కొంత వరకు పరిమితంగానే ఉంది. పద్యాలు, వచన కవితలు, గేయాలు, నాటకాలు, హాస్య సంభాషణలు పుడుతున్నాయి; కొన్ని తాత్కాలిక ప్రయోజనాల్ని సాధిస్తున్నాయి. మరికొన్ని కలకాలం నిలుస్తామంటున్నాయి. అన్నిటిని పత్రికలాదరిస్తున్నాయి. గ్రంథాలు రూపొందుతున్నాయి. ఈ రూపొందడంలో కూడా ఒక వేగం కనిపిస్తుంది. ఆ వేగంలో కూడా కొన్నిట పొడుపు కథల

ఛాయలు కాంతులీనుతున్నాయి. రచయితలనుకోని చేసిన పనికాదుఇది. వేగంలో రాస్తున్నారు. ఓ ఆలంకారికత అందులో చోటు చేసుకొన్నది. అది పొడుపు కథగా భాసిస్తున్నది. పద్య గేయాదుల్లో ఆ భాసింపును పరిశీలిద్దాం.

**2-1 : పద్యాలు :–** ఆధునిక తిరుమలేశ శతకం పూర్తిగా పొడుపుకథం మయమే. ఈ శతాబ్ద ప్రారంభంనుండి ఆధునిక యుగమనుకొన్నా 1920 లో వచ్చిన శ్రీ మంగిపూడి వెంకటశర్మ చమత్కార చంద్రికలోని 250 పద్యాలూ పొడుపుకథల కిందికే వస్తాయి. ఈ మధ్యకాలంలో మహాకవులు కావ్యాలూ ఖండ కావ్యాలు రచించారు. ఆ కావ్యాల్లోనూ అక్కడక్కడ పొడుపు కథల ఛాయలున్న పద్యాలు కనిపిస్తున్నాయి తిరుపతి వెంకటకవుల ఈపద్యంలో ఆ లక్షణాలున్నాయి,

* ఎవ్వాడు ఖండించె నేపు మీఱెడిపాండు
నందనుసేన నానంద మొప్ప
నెవ్వాడు విష్ణుచే నెలమి చక్రమ్ముదా
బట్టించి ప్రతినను భంగ పఱచె
నెవ్వాడు శరముల నెసగ దల్పము చేసి
బాగు మీఱగ నందు పవ్వళించె
నెవ్వాడు మాఘ శుద్ధైకాదశీతిథి
హరివాసమునకు దానరిగె ప్రీతి
నట్టిభీష్ముని సర్వవేదాంతతత్త్వ
నీరరాశి ఘటోద్భవు నిర్జరేశ
ముఖ్య సంస్తూయమాన సంపూర్ణబలుని
వర్ణన మొనర్చుకొలది యెవ్వారి కొదవు.[1]

ఈ సీస పద్యంలోని నాల్గు పాదాలకు సంబంధించి ఆ విషయగత జ్ఞానంలేని వారికి ఆయనెవ్వరో వెంటనే తెలుసుకొనే అవకాశం లేదు గీతంలోని భీష్మ శబ్దం విన్న వెంటనే అర్థం తెలిసిపోతుంది. గీతంలో మిగతా విషయమంతా

---

1. శతావధాన సారము, పు : 10

భీష్మునికి సంబంధించిన విశేషణాలతో నిండింది. కాబట్టి నాల్గుసీస పాదాల్లో ప్రశ్న ఉన్నట్లుగా, నాల్గుగీత పద్య పాదాల్లో ఉత్తరమున్నట్లుగా తెలుస్తున్నది. అందువల్ల సీసం పొడుపునకుదాహరణం కాగా గీతం విడుపునకయింది. ఇలాంటి ప్రశ్నోత్తరాలున్న పద్యాలు ప్రాచీనార్వాచీనాంధ్ర సాహిత్యంలో అక్కడక్కడ కనిపిస్తూనే ఉన్నాయి. ఆధునిక కాలంలోని అవధాన పద్యాల్లో సమస్యా పూరణాలన్నీ పొడుపు కథల ఛాయలున్నవే అవుతాయి.

'కన్నులలో చన్నులమరె కాంతామణికిన్' అనేది సమస్య. అలా ఉండడం విరుద్ధం; ఈ వైరుధ్యాన్ని, ఈ అసహజ విషయాన్ని సహజాతి సహజంగా పరిష్కరించాలి.

* చెన్నలబెస్త చేడియ
క్రన్నన వల వల్లెవాటు గాగొని వేడ్కన్
మున్నీటికి జనునెడ, వల
కన్నులలో చన్నులమరె కాంతామణికిన్.[1]

ఇక్కడ బెస్త చేడియ వలె వాటుగా వల వేసుకొంది. వలకు కన్నులుంటాయి; ఆ కన్నుల్లో చన్నుల మరినై. సమస్య పొడుపవుతుంది; పూరణం విడుపవుతుంది.

* పంచె వన్నెలైన పంజరం బదియహ
మంచి చిలుక యిందు మటముదీర్చి (ఘ)
మాటలాడు నయ్యె మాణిక్యముల మాట
నఖిల జీవసంగ యాత్మలింగ[2]

శ్రీ అకుల గురుమూర్తి ఆత్మలింగ శతకంలోని అనేక పద్యాల్లో పొడుపు కథల ఛాయలున్నాయి. అవన్నీ పారమార్థిక ప్రహేళికల కిందికి వస్తాయి.

---

1. బ్రహ్మశ్రీ పోకూరి కాశీపతావధానిదిగా ప్రచారంలో ఉంది.
2. ఆత్మలింగ శతకము, ప ; 14

ఈ పద్యంలోని పంచెవన్నెల పంజరం పంచభూతాత్మకమైన దేహం; మంచి చిలుక ఆత్మ; మ(ఘ)టము నీర్చడం నివసించడం; మాటలాడ్డం మాన వృత్తి కర్మాభీసుణ్ణిగా చేయడం. శతకాల్లోని సహస్రాధిక పద్యాలు పొడుపు కథలకు సన్నిహితంగా ఉంటాయి.

* కొమ్ములు దిరిగిన పరుషం
బిమ్మహిలో పురుషుడనగ, నెద కఠినమగున్
సుమ్మీ యందులకే ని
క్కమ్ముతనికి జగతియందు గనుమాయార్యా![1]

కొమ్ములు దిరిగిన పరుషానికి మురిసిపోయిన పరుషమనీ, కొమ్ములున్న పరుషమనే పదమనీ అర్థాలు. పరుషానికి కొమ్మిస్తే పురుషుడవుతాడు. కొమ్ములు దిరిగిన పరుషమనే కఠినుడెవడనే పొడుపునకు పురుషుడనే విడుపు సాధించినట్లయింది. సహజంగా అది పరుషమే. కొమ్ములు తిరిగిపోయి మరీ పరుషమయిందన్న మాట.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఇన్నీ అన్నని లెక్కించలేనన్ని పద్యాలు పుట్టాయి. పొడుపు కథల ఛాయలున్న పద్యాలు గ్రంథానికొకటి చూపించినా ఈ ప్రకరణం బలుస్తుందేగాని ప్రయోజనం శూన్యం. అందువల్ల నాల్గింటనిమాత్రమే ఉదాహరించి గేయాలవైపు ప్రస్థానిస్తున్నా.

**2-2 : గేయాలు :-** వీరబ్రహ్మం, సిద్ధప్ప, తిక్కయ్య, హనుమద్దాసు, రామదాసు తదితర మహానుభావుల తాత్విక ప్రజ్ఞాన ప్రబోధాత్మక సాహిత్యమంతా ఈ గేయాలక్రిందికే వస్తుంది. అవన్నీ ఈ మధ్యకాలంలో పుట్టినవే. వాటిని జానపద సాహిత్యమనే ప్రకరణంలో చర్చించడం జరిగింది. అందువల్ల ప్రహేళికా ఛాయయున్న ఆధునిక గేయ కవితల్నిమాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తా.

* "....రాజా! ఓహో! సాగర రాజా!
హోరను ఘోషల

1. ఆర్యాశతకము (చిత్రపది) ప : 29

తీరని బాధలు
ఇంతగ గుండెల
నెందులకోయీ?...[1]

ఇది నార్లవారి గేయఖండం; సాగర రాజు శీర్షిక క్రింద విరచితం. ఆ సాగరుణ్ని అడిగితే సమాధానమేం వస్తుంది. ఇది జనం కలకలం: అల అలకలిస్తే అల్లరి; ఆ అల్లరి నిత్యచైతన్యానికి ప్రతిరూపం: అది ఆగిపోతే ఎవరూ ఉండరు. ఈ ప్రశ్నే ఉండదు. కాబట్టి ఆ గుండెల్లోని బాధ చైతన్యమే అవుతుంది.

యక్ష ప్రశ్నలన్నీ పొడుపుకథలే! అయితే శ్రీ బి. వి. నరసింహం ఆధునిక యక్ష ప్రశ్నలడుగుతున్నారు.

* లక్ష ప్రశ్నలు! యక్ష ప్రశ్నలు!
అద్దమున ముఖమెందుకగపడు ?
సద్దు ఎందుకు మనకు వినబడు ?
చుక్కలెక్కడదాగు పగలు ?
సూర్యుడెక్కడకేగు రేలు ?
ఆకసంబది నీలమెందుకు ?
అంబుధియు నీలంబు ఎందుకు?
నీరు నూనెయు ద్రవములయ్యును
వేరువేరుగ నుండు కలియవె?
అన్ని ప్రాణులు గాలి పీల్చితె
కొన్ని నాళ్లకు తగ్గిపోదె?
తిరుగునట్టిది భూమియైతే
తిరుగునట్లగ పడునె సూర్యుడు?
ఉప్పునీటను ఈత తేలిక

1. జగన్నాటకం (గీతాలు గేయాలు) పు : 3.

చప్పనీటను కంటె; ఎందుకు?
చందమామకు సముద్రానికి
బంధమెట్టిదో తెలియజెప్పుము?
మెత్తమెత్తని మేఘమెట్టుల
మేటి గర్జన చేయగలుగును?[1]

వీటికన్నిటికి విజ్ఞానశాస్త్రమే సమాధానం చెప్పాలి. ఒక ప్రశ్నకు ఒకమాటతో సమాధానం కుదరదు. శోధనతో—సాధనతో సవివరంగా సమాధానం చెప్పాల్సి ఉంది. అందుకే రచయిత వీటిని ఆధునిక యక్షప్రశ్నలన్నారు.

* "...శాతవాహనుల వంశాన పుట్టినవాడు
కాకతీయుల కోటగడ్డ మెట్టినవాడు
పల్లెలోనే కాదు ఢిల్లీలో సైతమ్ము
పెద్ద గద్దెలనేలి పేరుకెక్కినవాడు...."[2]

డా॥ సి. నారాయణరెడ్డి ఈ గేయం మరో హరివిల్లులోనిది. ఇది పూర్తిగా పొడుపుకథ ఛాయను పుణికిపుచ్చుకొన్నది దీనిననుసరించే ఉన్న "ఎవరయ్యా ఎవరువాడు! ఇంకెవడయ్యా తెలుగువాడు" అనే ఖండిక పై పొడుపునకు విడుపుగా భాసిస్తుంది. శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి ఈ క్రింది గేయంలో ప్రశ్నోత్తరాలున్నాయి. ప్రశ్న పొడుపు; సమాధానం విడుపు.

* ....దక్షిణమ్మున పుట్టి
తన ధర్మమే దేశ
ధర్మమ్ముగా నిలువు
స్వామి పేరేమి?
స్వామి యన్నను చాలు
జగమునకే గురుడు

1. బాల వాఙ్మయం, పు ; 42-43.
2. మరో హరివిల్లు, పు : 12.

కాలడీ గ్రామమ్మున
కన్న దాతనిని....[1]

'ఈ దేశమే నాది' అనే శీర్షిక క్రింద ఈ గేయ భాగముంది. గేయ పూర్వార్థం పొడుపుకాగా ఉత్తరార్థం విడుపవుతుంది. అప్పటికీ సమాధానం తేలదుకాబట్టి "ఉపోత్తర"గా భావించి జగద్గురు శంకారాచార్యులు అని విడుపు చెప్పుకోవాల్సి వస్తుంది. శ్రీ తాడి వెంకట కృష్ణారావు ఈ క్రింది గేయంలో జానపదుల పొడుపుకథల్లోని ఛాయలు పూర్తిగా ఉన్నాయి.

* "....                ....                ....
సరస్సు మధ్యలో దిబ్బవున్నదీ
దిబ్బన పెద్దామఱ్ఱి వున్నదీ!
మఱ్ఱితొఱ్ఱలో గూడు వున్నది
గూటిలో చక్కని పక్షి వున్నదీ!
పంచెవన్నెలా కుంచెతోకది!
కంచు కంఠమూ కళల పక్షిదీ!
పల్కుల చిల్కులు పసందుగాను
ముచ్చటబెట్టి మురిపిస్తుందీ!
కమ్మని కథలు కల్పిస్తుందీ!
కరువుదీరగా కవ్విస్తుంది."[2]

'పక్షి-పాము' అనే శీర్షిక కింద ఉన్న పెద్దపాటలోని చిన్న భాగమిది. దీనికన్నా జానపదుని తత్త్వం స్పష్టంగా ఉంది. ఇందులోని కుంచెతోక, కంచు కంఠం, పల్కుల చెల్కులు (చిల్కులు?) కవి కల్పనలే. పంచెవన్నెల కుంచెతోక ఉన్న ఆ పక్షి జీవుడే; మఱ్ఱితొఱ్ఱ ఈ ప్రపంచమే; గూడు దేహమే! ఇది విప్పుకొనేంతవరకు అస్పష్ట గేయంగా భావిద్దాం.

---

1. విజయ భారతి, పు ; 34.
2. సిరిచుక్క మొగ్గ, పు; 62.

ప్రశ్నోత్తర ప్రాయాలైన, సమాధానాపేక్షితాలైన గేయాలన్నీ పొడుపు కథలే అనలేం. అపార్థద్యోతకత, నిగూఢత.... తదితర లక్షణాల్లో ఏదో ఒకటి కనిపిస్తే వీటికింద పరిశీలించే అవకాశమేముంటుంది. అర్వాచీనాంధ్ర సాహిత్యంలో త్ర్యశ్ర, చతురశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణాది గతుల్లో లెక్కకు మిక్కిలిగానే గేయ కవితలు వచ్చాయి. గేయ కావ్యాలుకూడా వచ్చాయి. వాటిలో ఎక్కడో ఒక దగ్గర పొడుపుకథా లక్షణ స్పర్శ ఉంటుంది. అష్టాదశ లక్షణ విలసితమైన పొడుపుకథలోని ప్రధాన లక్షణాలే ఈ గేయాలకు పట్టించి పరిశీలించాలి. అప్పటికీ చేటభారతమంత రాకతప్పదు. ఇక వచన కవితల్లో పొడుపుకథల ఛాయల్ని పరిశీలిద్దాం.

**2-3 : వచన కవితలు :–** కవిత్వంలో ఇది వచన కవితాయుగమే. అయితే దేని నిర్మాణం దానిది. దేని వైశిష్ట్యం దానిది. అన్నీ సాహిత్యసుందరి గళసీమలోని అలంకారాలే. వచనకవిత్వమెందరో రాస్తున్నా కవితాశిల్పం తెలిసి రాసేవారు కొందరే ఉన్నారు. అయితే కవిత్వంలో ప్రహేళికల ఛాయలు కని పించడానికి ఆ శిల్ప మర్మాలన్నీ తెలిసి ఉండాల్సిన అవసరమేం లేదు. ఉక్తి వైచిత్రి రామణీయకత, చమత్కారోక్తి ప్రయత్నపూర్వకంగా సాధించేవే అయినా ఒక్కోసారి అప్రయత్నంగా కూడా కుదురుకొనే అవకాశముంది.

* ఒకటినుంచి రెండు పుట్టినదనిమాత్రం
ఒప్పుకుంటాను నేను
అది ఎల్లా జరిగినదంటే మాత్రం
ఎరగనంటాను నేను...[1]
... ... ...

ఇలా అంటూనే రవీంద్ర కవీంద్రులు ఇది జరగడానికి కారకుడు "సుందరుడు, మహనీయుడు, మహా భయంకరుడు, వైచిత్ర్యోపేతుడు, అజ్ఞేయుడు, అతడు నా మనోహరుడు" అని వివరించారు. ఎవరో తెలియదనడం పొడుపు; ఎవరో తెలియజేయడం విడుపు.

---

1. రవీంద్ర వ్యాసావళి, ప్ర. సం. ; నివేదన, పు ; XIII.

శ్రీ సంజీవదేవ్ తమ స్మృతి పుటలను అక్షరాంకితం చేశారు. 'గతం లోకి' వెళ్లిపోయిన వారి ఈ కవిత పరిశీలనార్హం.

* ఉనికి దుఃఖమయం
లేమి సుఖమయం
ఉనికి సుఖమయం
లేమి సుఖమయం
ఖేదాల ఉనికి దుఃఖమయం
మోదాల లేమి దుఃఖమయం
మోదాల ఉనికి సుఖమయం
ఖేదాల లేమి సుఖమయం
మనిషి ప్రయత్నిస్తాడు
ఉనికిని అతిక్రమించాలని
మనిషి సాధన చేస్తాడు
లేమిని అధిగమించాలని[1]

పై కవితలోని మొదటి నాలుగు పాదాలు పొడుపులా భాసిస్తాయి. తర్వాతి నాల్గు పాదాలు విడుపులవుతాయి. వారు అదే గ్రంథంలో తాము అనువదించిన జాపానీ హైకూ కవితనిచ్చారు. అదీ పొడుపుకథే!

---

1. Presence is sorrow, Absence is sorrow
Presence is joy, Absence is joy;
Presence of pain is sorrow
Absence of pleasure is sorrow
Presence of pleasure is joy
Absence af Pain is joy;
Man strrivcs, To transeemd the presence
Man attempts. To excel the absence. గతంలోకి, పు : 274.

* ఒక కొవ్వొత్తిని మరో కొవ్వొత్తి
జ్వాలతో, వసంత సంధ్యలో వెలిగిస్తే
అది అదిగానే ఉంటూ
అది కాకుండానూ ఉంటుంది[1]

శ్రీ సంజీవదేవ్ దీన్ని ఇలా వివరించారు.... "విచిత్రమైన భావచిత్రణ! కొవ్వొత్తి కరుగుతూ తన స్వంత జ్వాలనే మండిస్తుంది. కనుక తన జ్వాల తనదే అయితే ఏమి, అది సంపూర్ణంగా తన జ్వాలకాదు, కారణం మరొక జ్వాలద్వారా తన జ్వాల వెలిగించబడటం వల్ల మరొక జ్వాల భాగం కూడ దాని జ్వాలలో ప్రవేశించి ఉంది; కనుకనే అది అదేకాదు కూడా!"

సృష్టికర్త అనే సుదీర్ఘ కవితలో శ్రీ పాతలపాటి గంగాధరం ఈ లక్షణాలున్న భావాల్ని సంకలించారు.

* ".... జీర్ణించిన గృహంలో ఏకాంతంగా
జీర్ణించిపోతున్న -నువ్వెవరు" అన్నాను
ఆయన అన్నాడు!
'నేను సృష్టికర్తను
... ...
కవిని... నేను... తెనుగు... కవిని'[2]

నేను సృష్టికర్తను అనే సమాధానం సుదీర్ఘంగా ఉంది. రచయిత ఎన్నో వివరణలిచ్చారు. శ్రీ తిరుమల శ్రీనివాసాచార్య ఈ కవితలో పొడుపుకథల ఛాయ లున్నాయి.

---

1. Lighting one candle with another s dlame
At dush is spring-the same, yet not the same.
-గతంలోకి, పు : 191.

2. చీకటి నుంచి. పు : 64

* నరులకన్న అందంగా
నదీ తరువులు నవ్వుతాయి
నది నవ్వుతుంది
ఎలా?
నురుగులా ;
తరువు నవ్వుతుంది
ఎలా?
విరిలా.[1]

ఇందులోని నురుగు, విరి రెండు కూడా విడుపులే! వాటి పై ప్రశ్నలు పొడుపులు.

అయితే ఇవన్నీ పొడుపుకథలుగా ఎవరూ గుర్తించరు. గుర్తించవలసిన అవసరమూలేదు. ఇవి వచన కవితలు. పొడుపుకథల ఛాయలు ఆధునిక సాహిత్యంలో కూడా అక్కడక్కడ కనిపిస్తాయని నిరూపించడానికే వీటిని ఉదాహరించడం జరిగింది. ఆధునిక సాహిత్యంలో పత్రికలకెక్కే చమత్కార సంభాషణల్లోనూ పొడుపుకథల ఛాయలు కనిపిస్తాయి. ఈ చమత్కారాలకు పిట్ట కథల్లాంటి గ్రంథాల్లోని పునాదులు పడ్డాయి. అవి ఒకటి రెండు పరిశీలిద్దాం.

**2-4 : చమత్కార సంభాషణలు :-** చమత్కార పొడుపుకథలు, నూతన చమత్కార పొడుపుకథలను పేర అయిదారు పుటల పుస్తికలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. సంభాషణల్లోనూ చమత్కారం! సాహిత్యంలో ఈనాడివి "జోకులు"గా ప్రేలుతున్నాయి.

అదో బడి; ఆ బళ్ళో అధ్యాపకుడు, విద్యార్థులు, పరీక్షాధికారి ఇలా మాటాడుకొంటున్నారు.

* "ఉపా : ఆరు నాలుగు లెంత?
1విద్యా : ఏబదియారు.

1. కిరణాలు-కెరటాలు, పు : 59

ఉపా : సిడౌను.

పరీ : అదేమయ్యా! ఆరునాలుగు లిరువది నాలుగు కదా!

ఉపా : అంతేనండి, అవి పూర్వము, ఇప్పుడు ధరవరలు పెరిగినవి. అంచేత సిడియు బెరిగినది.

పరీ : సరేలే!

* ఉపా : రైలు ఘన పదార్థమా! ద్రవ పదార్థమా!

2 విద్యా : ద్రవ పదార్థమండి.

ఉపా : యస్. సిడౌను. ఎందుచేతరా!

3 విద్యా : ప్రవహించెడిది ద్రవపదార్థములండి. రైలు పట్టాల మీద ప్రవహించి పరుగెత్తదా మరి.

* పరీ : ఎంతో వింతగా ఉన్నది మీ చదువు అబ్బాయి! కాకినాడ నుండి సామర్లకోట ఎనిమిది మైళ్ళు, రానుపోను ఎన్నిమైళ్ళు

1 విద్యా : నాలుగండి.

పరీ ; (నవ్వుతు) ఎట్లు?

2 విద్యా : రానుపోను నాలుగక్షరాలు కదా! అందుచేత నాలుగండి."[1]

విశేషించి విద్యారంగం మీద. రాజకీయ రంగం మీద ఇలాంటి జోకు లెక్కువగా పుట్టినై. జానపదుల ప్రహేళికా గీతాల్లోని ప్రశ్నోత్తరాల ఛాయలు ఈ చమత్కార సంభాషణల్లో కనిపిస్తున్నాయి. ఇక కథల్లో పొడుపుకథల ఛాయలున్నా యేమో చూద్దాం.

**2-5 : కథలు :-** ఆధునిక సాహిత్యంలో కథానికలతివేలంగా వస్తున్నాయి. కథాకథనంలో ప్రసన్నతకే ప్రాధాన్యమిచ్చి నందువల్ల, అవగాహనలో క్లేశాన్ని కలిగించే ప్రహేళికా పద్ధతుల్ని ఆ ఛాయల్ని కథల్లో ఎవరూ ప్రత్యేకించి చొప్పించ

1. పిట్ట కథలు, పు: 187, 188

లేదు. అయినా బాలబాలికల నిమిత్తం వినోదార్థం రచితమైన అతుకుల బొతు కుల కథలు లేకపోలేదు. అందులో ఒకటి మాత్రం ప్రస్తావిస్తా.

*"అనగనగా ఒక అడవి చివర జంతువులన్నీ అయిపోయాయి. నక్క రోజుకొక సింహానికి పాలిస్తూ ఉండేది. ఒక నక్క అడివికి మంత్రిగా ఉండేది. ఒక పులి వచ్చేది. అప్పుడింకెలాగ! అది రానంటోంది. మీరే వెళ్ళి గుటకాయస్వాహా చేసింది. ఒక సింహం ఇలా ఉండగా వుండగా ఆ సింహం పుట్టింది. రాజుగారి తనను చంపి తినండి. అంది జంతువును చంపేస్తుందని ఆ అడవిలో నక్కకు, ఎందుకంత దూరం యిప్పుడూ? ఆహారానికి గాను ఇంక పిలుచుకొని భయం సింహంతో యిలా ఒక ఉపాయం ఆలోచించి వెంటనే ఆ నక్కని ఒక్క దూకుదూకి నువ్వున్నావుగా యీ రోజుకి అని అంది; మృగరాజా యీ సింహం ఉంది.

—(ఈ పై అతుకుబొతుకుల కథలోని మాటలన్నీ సరిగా చేర్చినచో సరియైన కథ ఏర్పడుతుంది)

*జవాబు ; అనగనగా ఒక అడవిని ఒక సింహం పాలిస్తూ ఉండేది. ఒక నక్క సింహానికి మంత్రిగా ఉండేది. నక్క రోజుకొక జంతువును రాజుగారి ఆహారానికి గానూ పిలుచుకొని వచ్చేది. ఇలా ఉండగా ఆ అడవిలోని జంతువులన్నీ అయిపోయాయి. అక్కుడింకేలాగా! సింహం ఇంక తనను చంపే స్తుందని నక్కకు భయం పుట్టింది. వెంటనే ఒక ఉపాయం ఆలోచించి సింహంతో యిలా అంది. 'మృగరాజా యీ అడవి చివర ఒక పులి ఉంది. అది రానంటోంది. మీరేవెళ్లి చంపి తినండి' అంది.

సింహం ఎందుకంత దూరం యిప్పుడూ! నువ్వున్నావుగా యీ రోజుకి అని ఒక్క దూకుదూకి ఆ నక్కని గుటకాయస్వాహా చేసింది."[1]

---

1. బాల, మాస పత్రిక, సెప్టెంబర్-అక్టోబర్ ; పు : 1956

ఈ కథను శ్రీ రేడియో అన్నయ్య కూర్చారు. ఆటుకుల పొటుపులతో సమస్య సృష్టించారు. ఆ పదాలే ఓ వరుసలో కలిపి సమస్యను పరిష్కరించారు.

సమస్య సృష్టి, పరిష్కారం ఈ రెండూ ఉన్నందువల్ల ఇందులో పొడుపు కథల ఛాయలు భాసించాయి.

**2-6 నవలలు :-** నవలకూ, పొడుపు కథకూ పొంతనలేదు. నవలకున్న పరిధి దృష్ట్యా అది ఒక విజ్ఞాన సర్వస్వంగా, సర్వకళా సమాహారంగా రూపుదిద్దుకొనే అవకాశముంది. ఇంద్రజాల మహేంద్రజాల విద్యలతో, అద్భుత చమత్కారాలతో సాగిన నవలల్లో పొడుపు కథాంశాలు అస్పష్టంగా కనిపించవచ్చు. బొమ్మలు చెప్పిన కథల్లాగా నవలలు నడిచి చివర మాత్రమే పరిష్కారం సూచించే విధంగా రచన కొనసాగిన వాటిల్లో ప్రహేళికల ఛాయలుండవచ్చు. నవల పూర్తిగా ఆధునిక ప్రక్రియ. భారతీయ సాహిత్యంలో ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు, బృహత్కథలు ఉన్నాయి శైలిలో భేదం ఉన్నా నిర్మాణంలో ఆధునిక నవలకు దోహదం చేసినవీ ఉన్నాయి. అయితే తెలుగు నవల మాత్రం పాశ్చాత్య నవలల ప్రభావంతో అన్య భారతీయ భాషల్లోని నవలల ప్రభావంతో పెరిగిందనే చెప్పాలి. నిర్మాణ దృష్ట్యా కూడా పొడుపు కథకూ నవలకూ ఎంత మాత్రం సాదృశ్యం లేదు.

అయితే 'పొడుపుకథ' అనే పేర శ్రీ కె.పి. బాబు ఒక నవల రచించారు. ఈ నవలలో స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి ఇతివృత్తమున్నది. సామాజిక రాజకీయ సమస్యలున్నాయి. నవల చివరలో కూడా ఆ సమస్యలకు పరిష్కారం లభించలేదు. అందువల్లనే తాను దీనికి 'పొడుపుకథ' అని పేరు పెట్టినట్లుగా రచయిత ముగింపు మాటల్లో చెప్పుకొన్నారు. పదేళ్ళ తరువాత ఈ నవల ద్వితీయ ముద్రణ పొందింది. రచనా కాలంనాటి రాజకీయ సాంఘిక పరిస్థితుల్లో మార్పు రాలేదని, అందువల్ల దీనికి పొడుపుకథ పేరే సరిపోయిందని రచయిత భావించారు. అంతేగాక "ఈ పొడుపు కథల విడగొట్టగలమని ఎవరైనా ముందుకు వస్తే వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు సమర్పించుకోవడానికి సిద్ధంగా

పున్నాను"[1] అని ముగించారు రచయిత. ఇంతకుమించి ఈ నవలకు పొడుపు కథల లక్షణాలు గానీ, కనీసం ఆ ఛాయలు సోకిన మాటలుగానీ కనిపించవు.

ఆధునిక సాహిత్యంలోని విభిన్న ప్రక్రియలను పరామర్శించి, కొన్ని పొడుపుకథల ఛాయల్ని ఇంతవరకు స్పృశించడం జరిగింది. ఒక ఆంశిక సత్యం సమగ్రతకూ సంపూర్ణతకూ నిదర్శనం కాదు. అందువల్లనే వీటిని చాయలనడం జరిగింది.

ఈ ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నింటినీ ఈ యుగంలో పత్రికలు, రేడియోలు, చలన చిత్రాలు, దూరదర్శన్‌లు పరిపోషిస్తున్నాయి. అవి ప్రహేళికల్ని ఎలా సమాదరించాయో తెలుసుకొందాం.

## 6-3 : పత్రికలు-ప్రహేళికలు

తెలుగులో దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక పత్రికలున్నాయి. అవి రకరకాల శీర్షికలుపెట్టి అనేకాంశాల్ని అందిస్తున్నాయి. "బాల" మాస పత్రిక బ్రతికిఉన్న రోజుల్లో చాలాకాలం పొడుపుకథల్ని ప్రచురించింది. ఆ పత్రిక వ్యవస్థాపకులూ, సంపాదకులూ అయిన శ్రీ న్యాయపతి రాఘవరావు (అన్నయ్య) శ్రీమతి న్యాయపతి కామేశ్వరి(అక్కయ్య) 1945 నుండి 16 సం.లు ఆ పత్రికను నడిపించారు. అది మధ్యమధ్య ఆగుతూ-సాగుతూ 1961లో పూర్తిగా ఆగిపోయింది.

ఆ రోజుల్లో పిల్లల్లో పఠనాసక్తిని పెంచిన 'బాల'— కథలు, కథానికలు, నాటికలు, జోక్సు, నర్సరీ గేయాలు, విజ్ఞాన విషయాలు, రామూ-సోమూ, లటుకు-చిటుకు, మాటలు నేర్చుకో, అంకెల తమాషాలు, అక్కతో 5 నిమిషాలు, మాటలతో ఆటలు మొదలైన శీర్షికలే గాక, ప్రత్యేకంగా పొడుపుకథల్ని కూడా ప్రచురించింది. పై శీర్షికల క్రింద ప్రచురించిన వాటిలో కొన్ని పొడుపు కథల ఛాయలున్నవి ఉన్నాయి. పొడుపు కథల క్రిందికి వచ్చేవి ఒకటి రెండు మాత్రం ఉదాహరిస్తాను.

---

1. పొడుపుకథ (నవల), పు : 112.

* నేను ఒక చెట్టుని నా కాయలు అందరూ తింటారు
కొత్తలో ఉన్నానుగాని పాతలో లేను
పబ్బములో ఉన్నానుగాని పండుగలో లేను
నేను ఎవరినో పోల్చుతోండి (కొబ్బరి)

* నా పేరు నాల్గు అక్షరాలు, నేను ఆంధ్రులం పట్టణాన్ని
మంచిలో ఉన్నానుగాని చెడ్డలో లేను
వేదములో ఉన్నాను గాని సామములో లేను
రాత్రిలో ఉన్నాను గాని పగలులో లేను
పసుపులో ఉన్నాను గాని కుంకుమలో లేను
నా పేరేమిటి చెప్పుకోండి.[1] (మదరాసు)

ఇవి పొడుపుకథలే. వీటికి విడుపులివ్వలేదు. దాగుడు పేర్లనే శీర్షిక క్రింద వీటిని శ్రీమతి గండికోట వెంకటలక్ష్మి (ఖడ్గపురం) కూర్చారు. అయితే చాలా పత్రికల్లో పొడుపులూ, విడుపులూ ప్రక్కప్రక్కనే ఇచ్చారు. ఒక్క నెంలో ఇచ్చినవన్నీ ఉదాహరిస్తా.

* పైరులేని పంట—పువ్వులేని కాయ (ఉప్పు)

* తలా కాళ్లు లేని మగవాడు
దేశమంతా తిరుగుతాడు (చొక్కా)

* నాకు అమ్మ—నీకులమ్మ-అందరికీ అమ్మ (తులసమ్మ)

* జేబులో తానుండి-ఇంకోరిని ఉండనీయదు (చినుగు)

* మంచం క్రింద మావయ్యా-సంతకి వెడదాం రావయ్యా (చెప్పు)

ఈ పొడుపు కథలీనాటికి జనవ్యవహారంలో ఉన్నాయి. పొడుపుకథల ప్రచారానికి 'బాల' చేసిన విశేష కృషి మరవరానిది. ఇతికి ఇట్టగట్టి ఉంచే బాల పొడుపు కథల గాదెలు పోసేది.

---

1. బాల, మార్చి : 1949
2. బాల, జనవరి : 1951

భారతి (మాస), స్రవంతి (మాస), యువభారతి (మాస), ఆంధ్ర జ్యోతి(దిన), ఆంధ్రప్రభ(దిన),తెలుగువాణి (మాస) తదితర పత్రికలు అప్పుడప్పుడు ఆయా రచయితలు పొడుపుకథలపై వ్రాసిన వ్యాసాలు ప్రచురించాయి. వారి అభిప్రాయాలు తెలియడానికి ఒక్కో వ్యాసం నుండి ఒక్కో వాక్యం ఉదాహరిస్తా.

"ఎదుటివాళ్ళు సమాధానం చెప్పలేని అద్భుతమైన మూడు కథల్ని వేయాలని బాలబాలికలు స్పర్థిస్తూ ఉంటారు."[1]

"పొడుపుకథలు అల్లడం, చిక్కుముడి విప్పడం బహుశా ప్రాథమికమైన అభిరుచి కావచ్చు."[2]

"నలుగురూ చేరినచోట తమ ప్రజ్ఞానాన్ని ప్రదర్శించి ఇతరుల్ని ముగ్ధుల్ని చేయడానికి ఉపకరిస్తాయి ప్రహేళికలు. మెదడుకు పదునుపెట్టి, మనస్సుకు ఉల్లాసాన్ని కలిగిస్తాయి ప్రహేళికలు."[3]

"పొడుపు కథలు ఎక్కువగా లయాత్మకంగా ఉంటాయి. అంటే Rythem, Rhyme పొడుపుకథల్లో ప్రధానపాత్ర వహిస్తాయి."[4]

జానపద సాహిత్యంలో స్థూలంగా గద్య పద్య భేదాన్ని పాటిస్తే గేయేతరమైన వాఙ్మయంలో కథలు వాటిలో పొడుపు కథలు ఒక వర్గంగా తెలుస్తాయి."[5]

---

1. రాయలసీమ మాటుకతలు, భారతి, జనవరి : 1968
2. వినోదంతో పాటు విజ్ఞానం అందించే పసందైన పొడుపుకథలు. ఆంధ్రజ్యోతి, దిన, ఆది :1978 ఏప్రిల్ 17
3. మెదడుకు పదును పెట్టే ప్రహేళికా క్రీడ, ఆంధ్రప్రభ, దిన, బుధ, 1978 సెప్టెంబర్ 20.
4. తెలుగులో పొడుపు కథలు, స్రవంతి, 1979-ఏప్రిల్.
5. పొడుపు కథ-భాషా సాహిత్య దృష్టి, స్రవంతి, 1980 జనవరి

"తెలుగువారి ప్రాచీన సాంఘికాచారము, సంప్రదాయము, సంస్కృతి నిక్షిప్తమైన అచ్చపు పసిండి జాతి సంపదగా వెలుగొందునవి పొడుపుకథలనుట అతిశయోక్తికాదు ఈ పొడుపుకథలు జానపదుల సొత్తు."[6]

పొడుపుకథ కాలక్షేపము కొరకు సృజింపబడిన ప్రక్రియయే అయినను ఇది పెద్దల పిన్నల మధ్యన ఒక విధమైన సామాజిక విషయ సామగ్రిగ నున్నది.[7]

ఈ విధంగా ఆయా పత్రికలు పొడుపుకథలపై వచ్చిన వ్యాసాల్ని ప్రచురించాయి. వాటి వైశిష్ట్యాన్నీ, వైవిధ్యాన్నీ, వైలక్షణ్యాన్నీ తెలుగువారి కందించాయి. ఈమధ్య కాలంలోనే ప్రారంభమై, పొడుపుకథల ప్రచురణ విషయంలో ఎనలేని సేవ చేస్తున్న మరో రెండు పత్రికలనిక్కడ ప్రస్తావించవలసి ఉంది.

నీలిమ మాసపత్రిక మద్రాసు నుండి వెలువడుతుంది.[8] ఈ పత్రిక కథానికలకు, నవలలకే ప్రథమ తాంబూలమిచ్చింది. అయినా చాలా కాలం ప్రతి మాసం పది పొడుపు కథల నందించింది. ఇవి ప్రచురించే విషయంలో ఆ పత్రిక కొన్ని పద్ధతులననుసరించింది. ఆ పద్ధతులిలా ఉన్నాయి.

"ఈ దిగువ 10 పొడుపుకథలు ఇస్తున్నాం. వాటి సమాధానాలన్నీ పక్క పేజీలోని బొమ్మలో దాగి వున్నాయి. ఏ పొడుపు కథకు ఏది సమాధానమో వ్రాయండి. గడువు 5–12–1977. ఆల్ కరెక్టుగా వ్రాసిన యాభై మందికి రాబోయే నీలిమ 'ఫ్రీ'. ఎక్కువ మంది కరెక్టుగా వ్రాస్తే లాటరీ వేస్తాం. ఒక్కరే కరెక్టుగా వ్రాస్తే 'నీలిమ' నాలుగు సంవత్సరాల పాటు ఫ్రీగా పంపగలం."[9]

---

6. పొడుపు కథలు, యువభారతి, 1980-జూలై.

7. పొడుపుకథలు, తెలుగువాణి, 1978–నవంబర్.

8. ఈ మధ్యనే ఇదికూడా ఆగిపోయింది.

9. నీలిమ, 1977–డిసంబర్.

కొన్ని మాసాల్లో మరికొన్ని కొత్త పద్ధతుల ననుసరించారు. పాఠకుల్ని పత్రికవైపు లాగడానికి చేసిన పనిగా కొందరు భావించినా పొడుపు కథలకు వారు చేసిన సేవ అపూర్వమైంది. కొంతమంది ఆంధ్ర ప్రదేశ్‌లోని వివిధ నగరాల గ్రామాల నుండి వినూత్న ప్రహేళికలు కూడా ఈ పత్రికకు పంపేవారు. అందులో నుండి అయిదార్గురివి ఎన్నుకొని పత్రికవారు ప్రకటిస్తుండేవారు. సమాధానాలు పంపిన వారిలో వారన్నట్టే ఏబైమంది ఊర్లు పేర్లూ ప్రచురించేవారు. 77 అక్టోబర్లోని పొడుపు కథలకు 77 నవంబర్లో ప్రచురించిన వ్యక్తుల ప్రదేశాలు పరిశీలిస్తే, నీలిమ పొడుపుకథల పేరిట ఎక్కడెక్కడ చొచ్చుకుపోయిందో అర్థమవుతుంది. ఇందులో వచ్చిన ఊరి పేరే మళ్ళీ మళ్ళీ రావచ్చు. అక్కడున్నుండి అంతమంది పంపించారని గ్రహించాలి.

"భీమవరం, హైద్రాబాద్, చీరాల, ఒంగోలు, గూడూరు. నెల్లూరు, తెనాలి, హైద్రాబాద్, కొత్తపల్లి, ధోన్, ధవళేశ్వరం, మచిలీపట్నం, దొడ్డిపట్ల, నిడదవోలు, కళ్యాణదుర్గం, చిలువూరు, సికింద్రాబాద్, హోసూరు, రాజమండ్రి, గుణదల. ములకలచెర్వు, వరంగల్, కారేడు. మడకశిర, పొదిలి, గుత్తి, గుంటూరు, తిరుపతి, ధర్మవరం, గుడివాడ, పాకాల, నల్గొండ, కోదాడ, కాకినాడ, భట్టిప్రోలు, మేదరమెట్లు, చిత్తూరు, నెల్లూరు, కపిళేశ్వరపురం, విశాఖపట్నం, హైద్రాబాద్, ఆకివీడు, అనంతపురం, కొవ్వూరు, హోసూరు, రాజమండ్రి, నూజివీడు, ఖమ్మం, పేరాల, విజయవాడ."[1]

ఈ ఊర్ల పేర్లను బట్టి పొడుపు కథలను పొడిచేవారు, విప్పేవారు ప్రాంతమంతట ఉన్నారని తెలుస్తోంది. ప్రాంతమంతటా ఏంటి! ఆ పత్రిక వెళ్లలేదుగాని ప్రపంచమంతటా ఉన్నట్టు తెలిసేది! ఒక్కోనెల సమాధానాలు పంపినవారు రెండు మూడు వందలకు పైగా ఉన్నారని పత్రిక ప్రకటించింది. నీలిమ ఈ సేవ బహుధా ప్రశంసనీయం. ఆ పత్రిక ప్రకటించిన ఒక మాసం పొడుపుల్నీ-విడుపుల్నీ ప్రస్తావిస్తా.[2] వైవిధ్యం తెలుస్తుంది; విభిన్న ప్రహేళికల నిర్మాణ సంవిధానం అర్థమవుతుంది.

---

1. నీలిమ, 1977-నవంబర్
2. నీలిమ, 1977-అక్టోబర్

* అందరికీ నేనవసరం
కానీ అందరూ నాకనవసరం
అందరినీ నేను చూస్తాను
కాని నన్ను ఎవరూ చూడలేరు
ఒక యుగాన్ని పలికిస్తే నాదీ ఓ బిసప్పైన జన్మ (గాలి)

* నేను ఒక కవి వ్రాసిన గ్రంథమును
నా పేరు ఏడక్షరములతో కూడిన ఒక పదము
నా పేరులోని 4,5,6,7 అక్షరములు కలిపితే
గ్రామాధికారి పేరు వస్తుంది.
5,6,7 అక్షరములు కలిపి చదివితే
యుద్ధము అను అర్థము నిచ్చే పదమొస్తుంది
(బాలవ్యాకరణము : కరణము - రణము)

* శుద్ధ కులజాతి యొకసతి
ఇద్ధరణిం దండ్రిఁ జంపి యొసగ విశుద్ధిన్
బుద్ధిఁ బితామహుఁ బొందుచు
సిద్ధముగా దండ్రిగనుచు చెప్పుదు దీనిన్ (మజ్జిగ)

* పచ్చని పడవల మధ్యన
పకపక నవ్వుతూ వుంటాను
వాటికి నేనే యువరాణిని-
నా రూపమే తెల్లని రూపము-
అయితే నే నెవరిని ? (తామర పువ్వు)

* గాజుల గలగలలు నావే
కోయిల కుహూ కుహూలు నావే
తుమ్మెద ఝంకారములు నావే
అయితే నే నెవరిని ? (జలపాతం)

* పండగ నెండినదొక్కటి
ఖండించిన పచ్చిదొకటి కాలిన దొకటై
లిండికి రుచియైయుండును
ఖండితముగ దీనిదెల్పు కవియుంగలడే? (ఆకు-వక్క-సున్నం)

* ఐదు అక్షరముల మహారాజుకి
మూడక్షరముల ముద్దుల యువరాజు
మూడక్షరముల ముద్దుల యువరాజుకి
రెండక్షరముల మురిపాల రాణి (దశరథుడు-రాముడు-సీత)

* అక్షరాలన్నీ ఉంటే అందమైనదానినే
అందులో మధ్య అక్షరాన్ని తొలగిస్తేమాత్రం
జంతువుగా మారతాను
అన్నట్టు ఈ మధ్యవచ్చిన ఒక సినిమాలో
నాకుకూడా వాటా ఉంది
అయితే ఇంతకీ నే నెవరిని? (మేనక)

* తెల్లని మల్లెల గుచ్ఛంలా కనిపిస్తాను
అందుకే అందుకోలేరెవ్వరూ
మీరు నా దగ్గరకు వచ్చినప్పుడు
గెంతుతూ మీ దగ్గరకు వస్తాను
అయినా పట్టుకోలేరు నన్ను మీరు-
—అయితే నే నెవరిని ? (కెరటం)

* ఆకుపచ్చన మా తల్లితండ్రియు
తేటతెల్లన మా తాత, తాతమ్మయు
పటపటలాడే పిల్లలం మేము
కలిస్తే మిసమిసలాడే
ఎర్రటి వాటిని అవుతాను-అయితే నే నెవరిని ? (కిల్లీ)

ఇందులో బాల వ్యాకరణం, మేనక, కిల్లి అనే విడుపులున్న పొడుపుతప్ప మిగిలినవన్నీ పాతవే. పాతవాటిలోకూడా కొన్ని మార్పులున్నాయి. పొడుపు పద్యాల్లో మార్పులు లేవు. సంప్రదాయ పండితులు, జానపదులు, నవ నాగరికులు ఈ మువ్వురి ముప్పేటగా అల్లుకొని నిలచినవిధంగా ఈ పొడుపుకథలు కనిపిస్తాయి. ఇదొక అపూర్వ భావచిత్రం. పొడుపుకథల కూర్పువల్ల ఏర్పడింది. ఈ కూర్పునకు మూలం సినిమ. పొడుపుకథా వృక్షానికి సినిమ చేసిన దోహదం ప్రశంసనీయం.

ఆంధ్రభూమి వారపత్రిక ఈ మధ్యనే ప్రారంభమైంది. ఆ పత్రిక కొన్ని పొడుపు కథల్ని, ఆ ఛాయలున్న పదబంధాల్ని ప్రకటించింది. ముఖ్యంగా బాలబాలికల వినోదానికి, మానసిక వికాసానికి, పత్రికలో రెండు పుటలు కేటాయించింది. ఒక చిన్నకథ, చిట్టి(బొమ్మల కథ), పొడుపు విడుపు. మీకు తెలుసా, కనుక్కోండి చూద్దాం, తెలుసుకోండి చూద్దాం, మాటల గారడీ, అనండి చూద్దాం, చింటూ సందేహం, తమాషా లెక్క, చిక్కులెక్క బొమ్మా మాట్లాడమ్మా... ఇలా అనేక శీర్షికల్ని నిర్వహిస్తోంది.

వీనిలో మీకు తెలుసా, కనుక్కోండి చూద్దాం, తెలుసుకోండి చూద్దాం అనే శీర్షికల కింద ప్రచురించినవి చాలావరకు పొడుపు కథలే. వీటిలో పెద్దగా వైవిధ్యం కనిపించదు. మాటల గారడీ, అనండి చూద్దాం అనే ఈ రెండు శీర్షికల కింద ప్రచురితమైనవాటిలో కూడా వైవిధ్యం లేదు; ఈ రెండొకటే. తమాషా లెక్క—చిక్కు లెక్క రెండూ ఒకేవిధంగా ఉంటాయి. ప్రతివార పత్రికలో పైన చెప్పిన శీర్షికలన్నీ లేకపోవచ్చు; ఏదో ఒక పేరుతో కొన్నయినా ఉన్నాయి.

1980వ సం.లో ఆంధ్రభూమి వారపత్రిక ప్రకటించిన కొన్ని పొడుపు-విడుపుల్ని ఉదాహరిస్తాను. ఇవి సర్వసాధారణంగా వారానికొకటే కనిపిస్తున్నాయి.

* నలుగురు పట్టగా
పయుపురు కొట్టగా
లోనికేగు    20-11-80 (అన్నం)

* పంచవన్నెల పక్షి
పలుకనేర్చిన పక్షి 13-11-80 (చిలుక)

* నీరుకాని నీరు
కాయలోనే వూరు 25-9-80 (కొబ్బరికాయ)

* ఋతువులో వుంది
లతలో వుంది
కన్నెపిల్ల సిగ్గులో వుంది
దేవుని దయలో వుంది
స్నేహ పరిమళంలో వుంది. ఎమిటది
11-9-80 (తులసిదళం)

* పక్షిలాగుంటుంది
పైకెగురలేదు
పకోడితో పేరు
పాడుకొని ఉన్నది 18-9-80 (కోడి)

* నాకు కనిపించదు
నీకు కనిపిస్తుంది
నీకు కనిపించదు
నాకు కనిపిస్తుంది 7-8-80 (కన్ను)

* నేను ఎప్పుడూ మీముందే వుంటాను
కానీ నా గురించి మీరు తెలుసుకోలేరు
నన్ను చూడలేరు 14-8-80 (భవిష్యత్తు)

* ఏటిలో తేలి—గాలికి కదిలి
ఎటైనా వెళ్లు 23-10-80 (పడవ)

* ఓహోహో రాజుగారు
వళ్లంతా గజ్జి యేమిటండీ ?
కండంతా తీపి యేమిటండి ? 4-9-80 (సీతాఫలము)

* నరుడికుంటుంది
నరంమాత్రం వుండదు 3-7-80 (నాలుక)

* నీళ్లనుంచి వస్తుంది
నీకూ నాకూ రుచిస్తుంది 26-6-80 (ఉప్పు)

* అందరాని వస్త్రంపై
అన్నీ వడియాలు 17-7-80 (ఆకాశంలో నక్షత్రాలు)

* చెరువులో పూస్తుంది
దాని పేరు తాతయ్యలో వుంది
మామయ్యలో వుంది
గోపురంలో వుంది 5-6-80 (తామర)

* చక్కని మామ
చిక్కినా అందమే 22-5-80 (చందమామ)

"నరుడికుంటుంది - నరంమాత్రం ఉండదు" అనే పొడుపుకథ శ్రీ రెడ్డి రాఘవయ్యది. 'నరంలేని నాలుక ఎటుచెప్పితే అటు తిరుగుతది' అనే సామెత దీనికి మూలం. పై పొడుపు కథలు ఎక్కువగా ఆంధ్రభూమి పత్రిక నిర్వాహకులే సృష్టించారు. వారి కృషి ప్రశంసనీయం. మీకు తెలుసా, కను క్కోండి చూద్దాం తెలుసుకోండి చూద్దాం శీర్షికల కింద ప్రచురించిన వాటిలో ఒకటి రెండు చూద్దాం.

* శికాయలోని శివ క్షేత్రమేమిటో
మీకు తెలుసా ? 26-6-80 (కాశీ)

* కడపలో ఏముంది
పడుకోడానికి 10-7-80 (పడక)

* తలుపులులో వున్న మృగాలు ఏవి 4-9-80 (పులులు)

* ఒక పెద్ద సున్నావెంట మరో రెండు పెద్ద సున్నాలు పడుతున్నాయి. ముందు సున్నా ఎటువెళ్తే మిగతా రెండు సున్నాలు అటే వెళ్తుంటాయి. ఎన్నాళ్ల పరుగెత్తినా వెనుక సున్నాలు ముందు సున్నాని కలుసుకోలేవు. అదేమిటో చెప్పుకోండి చూద్దాం.

22-5-80 (రిక్షా చక్రాలు)

* ఏలూరులో ఏమి ప్రవహిస్తుంది. (ఏరు)

* అతనిలో ఆమె ఎవరు! 20-11-80 (అనిత)

ఇవి కూడా పొడుపు కథలే శీర్షిక వైవిధ్యంతపు పేర్కొన్న వాటిలో భేదం లేదు. ఆంధ్రభూమి పత్రిక ఇవేగాక చింటూ సందేహాల పేరిట కొన్ని జాతీయాల్ని-పదబంధాల్ని ప్రకటించింది. అమ్మ ఒక్క మాట. అంటుంది. ఆ మాటకు అందరు తీసుకొనే అర్థంగాక చింటూ మరో అర్థం తీసుకొంటాడు.

* చింటూ : అమ్మా మెడమీద ముళ్లు పడితే గుచ్చుకోవూ

అమ్మ : గుచ్చుకొంటాయి....!

చింటూ : మరిందాక జయత్తయ్య నీతో మా కామాక్షి మెళ్ళో ఆ మూడు ముళ్లు పడేదెప్పుడో; అన్నదెందుకు!? 30-10-80

* చింటూ : మన బావిలో నీళ్లు పడలేదని ఇందాక పిన్నిగారితో చెప్పావు....!

అమ్మ ; అవును మన బావిలో ఇంకా నీళ్లు పడలేదుగా!

చింటూ : ఇవాళ పొద్దున నేను గ్లాసుతో పోస్తే పడ్డాయిగా!

13.11 80

* చింటూ : అమ్మా! కావాలని ఎవరైనా నిప్పు కళ్లల్లో వేసుకుంటారా!

అమ్మ ; ఎవరూ అలాంటి పని చేయరురా?

చింటూ : మరినాన్నగారితో మన సంసారం చూసి పక్కింటి వాళ్లు కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారని అన్నావే! 11.9.80

అమ్మ ; అదేమిట్రా చింటూ! వాళ్లిద్దరి మధ్య పచ్చగడ్డి పట్టుకొచ్చి అలా పడేస్తున్నావ్?

చింటూ : ఇందాక సుజ్ఞాగా వాళ్ళిద్దరి మధ్య పచ్చగడ్డి వేసినా భగ్గు మంటుందని పక్కింటి పిన్నిగారితో చెప్పావు! 7.8 80

* చింటూ ; అమ్మా! మన పక్కింటి గీత ఇంట్లో వలలేదుగా.

అమ్మ : వల వాళ్ల ఇంట్లో ఎందుకుంటుందిరా!

చింటూ ; మరిందాక గీత ఎదురింటి వాళ్ళబ్బాయిని వలలో వేసు కుందంటావేంటి! 5.6.80

చింటూ సందేహాల్లోని "మెళ్లో మూడు ముళ్ళు పడడం, బావిలో నీళ్ళు పడడం, కళ్ళల్లో నిప్పులు పోసుకోవడం, పచ్చగడ్డి వేసిన భగ్గుమనడం, వలలో వేసుకోవడం" అనేవి తెలుగులో జాతీయాలు - పలుకుబళ్ళు వీటికి పెదర్థాలు తియ్యడం వ్యాకభాష్యం చేయడం జరిగింది. అవి శబ్దంలోని అర్థాలే. కానీ రూఢిపడ్డ అర్థాన్ని పక్కకునెట్టి చింటూ సందేహాల పేరిట వీటిని ప్రచురించి ఆంధ్రభూమి పొడుపు కథల్లోని చమత్కారతను గుర్తుచేసింది.

ఇక ఆ పత్రికలోని ఆనంది చూద్దాం, మాటల గారడి శీర్షకల కింద ప్రచురితమైన "గిరగిర బండి-బిరబిరబండి ఎల్లి మీద మల్లి-మల్లి మీద ఎల్లి-కల్లబొల్లి కబుర్లతో-అల్లి బిల్లి తిగ్గి-తల్లడిల్లి పోయారు"... తదితర శబ్ద చమత్కారాలెన్నో బాలబాలికల్లో భాషాభిమానాన్ని, శబ్దాల కూర్పులో ఉత్సాహాన్ని పెంచేవిగానే భావించాలి.

విభిన్న శీర్షికల కింద వారం వారం ఆంధ్రభూమి వారపత్రిక పొడుపు కథల్ని - సామెతల్ని - పలుకుబళ్ళనూ ఆంధ్ర పాఠక లోకానికివిధంగా అందించింది. ఈ విషయంలో సంపాదకులు శ్రీ కందనాతి చెన్నారెడ్డి చూపించిన శ్రద్ధ ప్రశంసనీయం.

1980 ప్రథమార్థంలో బాలజ్యోతి మాసపత్రిక ప్రారంభమయింది. అదీ పొడుపు విడుపుల్ని ప్రచురిస్తున్నది. కాని అవి ఎక్కువగా సూటి ప్రశ్నలే

వేస్తున్నది. దశాంశ పద్ధతిని ఎవరు కనిపెట్టినారు!" మొదలైన ప్రశ్నలు పొడుపు కథల కిందికి రావు.

పొడుపుకథల్ని ప్రోత్సహిస్తూ, తెలుగు పాఠక లోకాన్ని ఉత్సాహ పరుస్తూ, వినూత్న ప్రహేళికా నిర్మాణానికి దోహదం చేస్తున్న ఈ పత్రికల కృషి మరువరానిది. ఏం చేయకుండా ఉండేకంటే ఎంతో కొంత పనిచేయడం మంచిది కదా! అందుకే ఆధునిక సాహిత్య ప్రక్రియలతో పాటు పత్రికల కృషి కూడా వివరించడం జరిగింది. ఇక ఆకాశవాణి సేవల్ని సమీక్షిస్తాను.

## 6-4 : ఆకాశవాణి

ఆకాశవాణి వార్తల ద్వారా ప్రపంచాన్ని దగ్గరకు తెస్తున్నది. జాతీయ అంతర్జాతీయ విషయాలెన్నో చిటికెలో అందిస్తున్నది. అనేక సాహిత్య ప్రక్రియల్ని తనదైన బాణితో ప్రచారం-ప్రసారం చేస్తున్నది. జానపద గీతాల్ని కూడా ఆకాశవాణి సమాదరించింది. ఈ విషయంలో హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో పనిచేస్తున్న వింజమూరి సీతాదేవిగారి కృషి కొనియాడదగింది.

వారు ప్రసారం చేస్తున్న జానపద గీతాల్లో పొడుపు ప్రగేయాలు కూడా ఉన్నాయి. జానపద సాహిత్య ప్రకరణంలో ఉదాహరించిన గేయాల వంటివే ఆకాశవాణిలో వచ్చినై. వీరబ్రహ్మం, యాగంటి సిద్ధప్ప, నంజయ్య తదితరుల తాత్త్విక ప్రహేళిక గేయాలు అనేక పర్యాయాలు ప్రసారమయ్యాయి. 'ఒకరికి చేయునిచ్చి... ' 'బోడివాడెవడయ్యా.....' 'నల్ల నల్లని పక్షి యొకటి.....' పోతుంటిరా జాణ పోతుంటిరా.....' 'సూర్య చంద్ర వహ్ని నడుమా....' తదితర ప్రసిద్ధ ప్రహేళిక గేయాలు అనేక పర్యాయాలు ఆకాశవాణిలో వచ్చినై.

"భావమేమో తెలియండి, దీని అర్థమేమో కనండి," ... "దీని అర్థ మేమోగాని తెలుసుకోండి జ్ఞానులైతే, తెలిసినోనికి తెలియునన్నా-తెలియనోనికి మదన చిక్కన్నా'' ... "దీని భావం వినండన్నా-దీని భంగం బట్టబయలూ— తెలిసినోళ్లకు తెలుసునన్నా - తెలియకుంటే మారు చెప్పన్నా".... "యాగంటి లింగ దీని భావము నీకు దెలుసునా".... ఇలాంటి పల్లవులున్న గేయ ప్రహేళికల

నెన్నింటినో ఆకాశవాణి ప్రసారం చేసింది. వాటిలో రెండు మూడు గేయాంశాల్ని మాత్రముదాహరిస్తా

* ముక్కు మొగమూ లేని పక్షి
ముప్పయారు గుడ్లు పెట్టె
దెబ్బయారు పెట్లు విరిగి ఇరవయ్యారు పిల్లలేసె
.... తెలిసినోనికి తెలియునన్నా
తెలియనోనికి మదన చిక్కన్నా
దాని భావం బట్టబయలు
దాని పేరే కుమ్మరి సారెన్నా

* కోలుకోలన్న చెలియ - మేలు
కోలుకోలన్న చెలియ
ముక్కు మొగం లేని పక్షి
ముప్పయ్యారు గుడ్లు పెట్టె
ఇరవయ్యారు పిల్లలేసె
డెబ్బయ్యారు బట్టలు సుట్టె
దీని భావం వినండన్నా
దీని భంగం బట్టబయలూ
తెలిసినోళ్లకు తెలుసునన్నా
తెలియకుంటే మారుచెప్పు!
దీని భావం వినండన్నా
దీని పేరే ప్రత్తి కాయ.

పై రెండింటిలో విడుపు భేదం తప్పిస్తే గతి-పదం-పాట అన్నీ ఒకే విధంగా నడిచాయి. ఇలా స్వల్ప భేదాలతో ఎన్నో లభిస్తున్నాయి.

* కాశిలోన కాయగాస్తే
పర్వతాన పండు పండే
కండ్లు లేసివాడు చూచేరా—
॥యాగంటి లింగ దీని భావము నీకు తెలుసునా!

కండ్లు లేనివాడు చూసి
చేయి లేనివాడు కోస్తే
నోరు లేనివాడు మేసేరా—
॥యాగంటి లింగ దీని భావము నీకు తెలుసునా!

ఇది పొడుగు పాట- ఈ పాటలోని కొన్ని ఖండికలకు మాత్రం విడుపు చెప్పవచ్చు. మిగిలిన గేయమంతా అస్పష్ట తాత్త్విక ప్రహేళికల్లోకి వస్తుంది. ఆకాశవాణి అనేక పర్యాయములీ గేయాన్ని ప్రసారం చేసింది.

"ముట్టపట్టరాని బట్టబయలులోనే, తేనె పండున్నదే చిలుకా..." "తెలుసుకోండి తెలుసుకోండి— మొండి గేదె మేతకి- మూడుకాళ్ల గొంగడంట- మూడుకాళ్ల గొంగడికి ఆరుకాళ్ల గుజ్జుమంట..." ఇటువంటి గేయా లన్నిటిలోనూ పొడుపుకథల ఛాయలున్నాయి. ఇవన్నీ పెద్దలు కట్టినవే; పెద్దల కొరకు పాడినవే. ఇక పిల్లల పొడుపుకథల విషయంలో ఆకాశవాణి కృషి పరిశీలిద్దాం.

ఆకాశవాణిలో ప్రతి శని ఆదివారాలు బాలానంద, బాలవినోద కార్యక్రమాలు వస్తాయి. శీర్షికల పేర్లు కొన్ని నెలలకు కొన్నేళ్లకు మార్చవచ్చుకూడ. ఏం మారినా ఆ కార్యక్రమాలు మాత్రం పిల్లలవి.

ఈ కార్యక్రమాల్లో చిక్కు ప్రశ్నలు, యక్ష ప్రశ్నలు, పొడుపు కథలు అడుగుతారు. ఈ పొడుపుల్ని దేశంలోని శ్రోతలెవరైనా పంపిస్తారు. కార్యక్రమంలో పాల్గొనే పిల్లలుకూడా తెస్తారు. వివిధ మండలాలనుండి వచ్చినవే. ఎక్కువగా వినిపిస్తున్నాయి. ఇవి పిల్లలడుగుతారు; కార్యక్రమ నిర్వాహకులడుగుతారు. తెలిసిన పిల్లలు విడుపులు చెబుతారు. అనేక పర్యాయాలు ఏకగళంతో అందరూ అరచి చెప్పిన సన్నివేశాలున్నాయి. అది వారి ఉత్సాహం; పొడుపు కథలమీద వారికున్న ఆసక్తికి నిదర్శనం.

ఈ పొడుపుకథలన్నీ చిన్నవే. గేయరహితాలనిపించినా మాత్రాగణ బద్ధత ఉంటుంది; గతికూడా ఉంటుంది.

* అన్నకు అందవు
అమ్మకు అందుతాయి
తమ్ముడికి అందుతాయి (పెదవులు)

* ఇందిరంగు ఎరుపు
దానిలోపల తెలుపు
నల్ల మనుషులుంటారు (ఆపిల్)

* నేను నల్లలో పుడతాను
ఆకుపచ్చగా పెరుగుతాను
బంగారు రంగులో ఉంటాను
మీరు తినేవరకు తెల్లగా ఉంటాను (బియ్యం)

* ఆదివారం అమావాస్యనాడు
కరీంనగర్ కమాన్‌కాడ
వాహనాలకు లైట్లు లేవు
అవి అక్కడిక్కడ పోతున్నాయి
అవి ఒకదానొకటి-ఢీకొనడం లేదు. —ఎందుచేత?
(పగటిపూట అయినందువల్ల)

పిల్లల పొడుపుకథల్లో పరిసరాల ప్రభావం కనిపిస్తుంది. ఆయా ప్రదేశాల పర్యాయ నిమిత్తమే ఆకాశవాణి వీటికి ఆహ్వానం పలికింది. ఆమనగల్లు, పోలెపల్లి, బాదెపల్లి, కల్వకుర్తి, పాలమూరు, కర్నూలు, హైదరాబాదు ఇలా గ్రామ-నగరాల పేర్లెన్నో పిల్లల పొడుపుకథల్లో వచ్చినై. శబ్ద పరిజ్ఞానం నిమిత్తంకూడా ప్రవేశపెట్టిన పొడుపులున్నాయి.

* ఇది ఒక పక్షిపేరు
మొదటి అక్షరం చిక్కడపల్లిలో ఉంది
పంజగుట్టలో లేదు,
రెండవ అక్షరం లక్షల విలువ చేస్తుంది
వందల్లో కాదు

మూడవ అక్షరం కష్టంలో ఉంది
నష్టంలో కాదు (చిలుక)

ఆకాశవాణి ప్రసారంచేసే పిల్లల కార్యక్రమాల్లో ఒక్క పొడుపు ఒక్క విడుపేగాక, పెక్కు విడుపులున్న పొడుపుకథలూ ఉన్నాయి. మచ్చుకొకటి-

* ఒక మామిడిచెట్టుకు ఒక పండు
ఒకడు చూస్తాడు (కండ్లు)— చూస్తాయి
చూసినవాడు కొయ్యడు (చేతులు)— కోస్తాయి
కోసినవాడు తినడు (నోరు)— తింటుంది
ఇంతలో తోటమాలి వచ్చి
కోసినవాణ్ని కొట్టడు (చేతుల్ని)— కొట్టడు
కొట్టినవాడేడువడు (వీపు)— ఏడవదు
ఏడ్చినవాడు (నోరు)
పరుగెత్తడు (కాళ్లు)— పరుగెత్తుతాయి.

పై పొడుపులో నీతి ఉంది; పిల్లలకది అందాలి. ఆపని పొడుపు ప్రక్రియ చేసింది. కేవలం నీతేగాక భాషా పరిచయంద్వారా శబ్ద పరిజ్ఞానం పెరగాలి. విరుపుద్వారా సాధించే శ్లేష ఆ పని చేస్తుంది.

* రాముడు కృష్ణుడు పోతూ ఉంటారు
వారికి మూడు కొబ్బరికాయలు దొరికాయి
పగలగొట్టకుండా పంచుకోవాలి! ఎలా?
(రాత్రి కొట్టి) (రాముడు, కృష్ణుడు, పోతు)

పగలన్ (పగటిపూట) కొట్టకుండా అనే అర్థం తీసుకొని రాత్రిపూట అనే విడుపు చేర్చారు. రాముడు, కృష్ణుకు ఈ ఇద్దరితోపాటు 'పోతు' అనే వ్యక్తి కూడా ఉన్నాడని సమాధానం చెప్పారు. ఈ కార్యక్రమాల్లో పొడుపుకథల ఛాయ లున్న గేయాల్నికూడా ఆకాశవాణి ప్రసారం చేసింది.

* కాయలు కాయలు తింటారంట
ఏమి కాయలు తింటారంట
అల్లరిచేసే పిల్లలాకు
మొట్టికాయలు తింటారంట.

పాశం పాశం తింటారంట
ఏమీ పాశం తింటారంట
అల్లరిచేసే పిల్లలాకు
తొడా పాశం తింటారంట

బాజా బాజా మోగేనంట
ఎమి బాజా మోగేనంట
అల్లరి చేసే పిల్లలాకు
వీపు బాజా మోగేనంట

ఈ విధంగా ఆకాశవాణి తెలుగువారి వినోద విజ్ఞాన వికాసం నిమిత్తం జానపద గీతాల్లోనూ, బాలానంద బాలవినోద కార్యక్రమాల్లోనూ పొడుపు కథల్ని ఇంకా ప్రచారం చేస్తూనే ఉంది; సాహిత్యంలో ఒక విశిష్ట ప్రక్రియా వికాసానికి కూడా దోహదం చేస్తూనే ఉంది.

ఇక చివరగా చలన చిత్రాల కృషి సమీక్షిద్దాం. సామాన్యుణ్ణి, ధీమాన్యుణ్ణి అందరినీ అలరించే శక్తి ఉన్న సినిమా పొడుపు కథల నెలా సంభావించిందో, అవసరార్థం ఎలా వాడు కొందో పరిశీలిద్దాం.

## 6-5 : చలనచిత్రాలు

పత్రికలు ప్రచురిస్తున్న పొడుపు కథలు చదివిన వారికే తెలుస్తాయి. రేడియో ప్రచారం చేస్తున్న ప్రహేళికలు ఆ సమయంలో విన్నవారికే తెలుస్తాయి. చలనచిత్రాల్లో పొడుపుల పాటలు వింటారు; దృశ్యాలు చూస్తారు; ప్రచురిత

మయింతర్వాత చదువుతారు. సినిమాల్లో పొడుపు కథల పాటలు తక్కువే వచ్చినా ప్రచార విషయంలో అన్నిటిని దాటిపోడం జరిగింది. ఇవి సినిమాల్లో ఆయా కథల సమయ సందర్భాల్ని అనుసరించి ఉంటాయి.

తల్లి తన కొడుక్కి అద్భుత విషయం చెప్పింది. అది పాట రూపంలో ఉంది. చివరికా వస్తువేదో తెలుస్తుంది. అబ్బాయి కిల కిల కల కల నవ్వుతాడు. ఆ తల్లి చెప్పిన అద్భుత విషయం పొడుపద్యం?.

ఒక కళాశాలలో సాంస్కృతిక కార్య క్రమాలు జరుగుతుంటాయి. పాత్రధారులు రెండు జట్లుగా విడిపోతారు గేయరూపంలోని చిక్కు ప్రశ్నల్ని గుప్పు కొంటారు; సమాధానాలు చెప్పుకొని హాయిగా నవ్వుకొంటారు.

పొలం గట్టుమీద నాయికా నాయకులు కలుస్తారు. యుగళగీతమెత్తు కొంటారు. అందులో చిక్కుముళ్ళు వస్తాయి. వాటిని విప్పుకొంటారు. కళ్లు గిలుపు కొంటారు; చేతులు కలుపు కొంటారు.

ఓ గదిలో నాయికా నాయకులిద్దరే ఉంటారు. ఆ యిద్దరు ఒకరినొకరు తాకరాదు. ఏ కారణంగానో ఆ నియమం ఒకటుంటుంది. పొద్దుపోదు; నిద్దురారాదు. అప్పుడిక ఏం చేస్తారు! పొడుపు కథలు పొడుచుకొంటారు.

ఇలా చలన చిత్రాల్లోని వివిధ సన్నివేశాల్లో కళాశాలల్లో, విశాలశాద్వలి స్థలాల్లో, గృహాల్లో, వనాల్లో, నడిరోడ్డులో, ఊరి నడిబొడ్డులో అక్కడా-ఇక్కడా అంతటా పొడుపు కథలు పుట్టినై. ఈ పుట్టుకకు సినీ గేయరచయితలుగా లబ్ధ ప్రతిష్ఠులైన తెలుగు కవులెందరో దోహదం చేశారు. అవి ఆయా సందర్భానికి చక్కగా అమరినై. ఆ సందర్భాల పూర్వోత్తరాల్ని వివరిస్తే గ్రంథం పెరుగు తుంది. ఆ పని ప్రత్యేకంగా చేయాల్సి ఉంది. అందువల్లకొన్ని పాటల్ని మాత్రమే ప్రస్తావిస్తా

* కాశి : సవాల్ సవాలన్న చిన్న దానా సవాల్ పై సవాల్
నన్నోడించేవో చేతులు జోడించేవా-సవాల్

నారయ్య ; సై సామి సై!

బంగారు : పెళ్ళి అయ్యోరా-ముందే నువ్వే ఎంట్ర!

కాశి ; వెన్నెలలో వికసించె తామర కమలం మీద
ఒంటి రేక కలువ పూలు జంటగ మొలిచాయంట
అంటే ఏమిటో - ఆ వింత ఏమిటో?

నారయ్య : ఓస్ యింతే గదూ? కాసుకో?

బంగారు ; పిల్లా ఎత్తుకో సెప్తా

మంజు : సవాలు వేసిన చిన్న వాడా ఆ వింత నీ వెంటనే వుందిలే

బంగారు : ఉందిలే

నారయ్య : ఏందిరా

బంగారు : ఏందో

మంజు : తామర కమలం తరుణి నగుమొగం

బంగారు : హాఁ! అద్దసీ

మంజు : కలువలజోడే కాటుక కన్నులు

బంగారు : హౌ — హౌ — హౌ

మంజు : మునులున్న వనములో ఎలమావి నీడలో
చిలకల్లు పెంచిన చినదెవరోయా!
ఆ చిన్నారి కన్నవాడు సింగంతో ఆడగాడే
మొనగాడోయ్ — ఓ మొనగాడా!
ఆ బాలుని పేరేమోయా ఆ మాటే మన ఆటానోయా

కాశి ; ఆ బాలె శకుంతలా-అవునా!
బాలుడే వీర కుమార భరతుడు
ఆ ఆటే నవరస భరితమౌ భారతము

కాశి : మగరాయనిపై అలిగిన సొగసరి
మొగమున తోచీ తోచని దేమో!

మంజు : పెదవుల దాగిన చిరునవ్వు

కాశి : నిదుర మబ్బులో వున్న అర్జునుని
చూచిందెవరో తల పూచిందెదరో?

మంజు : ఉవ్విళ్లూరే ఉలూచి కాదా!

కాశి : నీటి పైనా కలకలా
కొమ్మ మీద కిలకిలా
విలవిలా కిల కిలా
ఏమిటా కథ చిన దానా ఏమిటా కథా!

బంగారు : చేపలు పచ్చులు చెప్పు

నారయ్య ; కాదు కప్పలు కోతులు

కాశి : కాదు .... కాదు.

చలిలో యమునా నదిలో
జలకాలాడే కన్నెలు కల కల
వలు వలు దాచిన కృష్ణుడు కిల కిల
తెలిసిన కన్నెలు విల విలా
అక్కడ విల విల ఇక్కడ కిల కిల
చివరికిది కథ చినదానా!

ఈ పాట శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిది; 'జయభేరి' చిత్రంలోనిది. ఇందులో సవాల్ చేయడమే పొడుపు; సమాధానం చెప్పడమే విడుపు. భరతుని జననం, ఉలూచి ప్రణయం, గోపికా వస్త్రాపహరణం అనే అంశాల్ని స్వీకరించి గేయ ప్రహేళికను నిర్మించడం జరిగింది.

చలన చిత్ర గేయావిర్భావ ప్రథమ దశలో జానపద బాణీల్లో పాటలు కూర్చిన కీర్తి శ్రీ కొసరాజుకే దక్కింది. 'ఎత్తుకు పై ఎత్తు' సినిమాలో ఆ పద్ధతిలో ప్రవేశ పెట్టిన ఈ కింది బృందగీతం నిండా పొడుపు కథలే ఉన్నాయి.

పాలిక ఖరీదు నాలు గణాలే
తికమక అంతా పావలలోపే
తెలుసుకుంటె బహు సులువుగా వుంటది
(నయాపైసా! నయాపైసా!)
రెండు పక్కలా రెక్కలుంటవి
రివ్వురివ్వుమని ఎగురుతుంటవి
గాలి వేగమున కదులు తుంటవి
కావాలంటే ఆగుతుంటవి

(పక్షి పక్షి)

ప్రాణం కలిగిన పక్షే కాదు
మరలు విప్పనిది పరుగిడ లేదు
(విమానం ! విమానం)

ఈ పాటనిండా నిత్య జీవితంలో రోజూ చూసే అంశాలే పొడుపు కథలుగా రూపుదిద్దుకొన్నాయి. పొడుపునకు విడుపు చెప్పక పోవడం, పొడిచిన వారే విప్పడం ఈ గేయంలోని విశిష్టత. అయితే ఎదుటి వారు కూడా సమాధానం చెప్పేవారే అని నిరూపించడానికి సరియైన విడుపొకటి చెప్పించడం జరిగింది.

చలన చిత్ర గేయ సాహిత్యంలో డా॥ సి. నారాయణరెడ్డి కొత్త పుంతలు తొక్కారు; సమాసాల్ని, పద్ధతుల్ని ప్రవేశపెట్టారు, వాటిలోని నుండి గేయ ప్రహేళికలెన్నో పుట్టినై. ఈ క్రింది పాట 'చిన్ననాటి స్నేహితులు' లోనిది. ఈ పాటలోని పొడుపు వల్ల కలిగిన అపార్థ ద్యోతకత విడుపు వల్ల విచ్చుకు పోతుంది.

* రవి : అడగాలని వుంది-ఒక—ఒడగాలని వుంది
అడిగిన దానికి బదులిస్తే

అరుణ : ఇస్తే

రవి : అందుకు బహుమానం ఒకటుంది!

రవి : ఎదురుగా నిలుచుంటే - ఎంతో ముద్దుగ మెరిసేదేది?
అంటి అందపుంటే - ఇంకేంతో అందం చిందేది?

అరుణ ; చేప! చూపు! సిగ్గు! మొగ్గ

రవి : మొగ్గకాదు కన్నెపిల్ల బుగ్గ

అరుణ : కొత్తగా రుచి చూస్తుంటే - మత్తుగా ఉండేదేది
మళ్లీ తలచుకుంటే - మరింత రుచిగా వుండేదేది?

రవి ; వెన్న! జున్ను! తీపి! పులుపు

అరుణ : తీపి కాదు తొలి వలపు

రవి ; ఎంతగా చదివేస్తుంటే - అంతగా మనసయ్యేదేదీ

అరుణ ; కంపడి! దుప్పటి! గొంగళి! కంబళి

రవి : కంబళీ కాదు-కౌగిళి!!

రవి : అడగాలని వుంది-అది-అడగాలని వుంది

అరుణ ; అడగంగానే ఇచ్చేస్తే - అందులో రుచి ఏముంది!

అలంకారికమైన సాహిత్య మర్యాదల్ని సంతరించుకొని మూడు పొడుపు కథలతో ముద్దులు కురిసే గేయమిది. ఆ యువతీ యువకుల మనస్తత్వాలకు ఆ చలన చిత్రంలోని సమయ సందర్భాలకు అతికిన పొడుపు పాట ఇది

శ్రీ ఆరుద్ర సుప్రసిద్ధ కవి పండిత పరిశోధకులు. వారు వ్రాసిన ఓ పొడుపు పాట జమీందార్ సినిమాలోనిది అయితే అందులోని పొడుపులూ- విడుపులూ తెలుగునాట అప్పటికే బహుళ ప్రచారాన్ని పొందాయి వారు నడిపించిన బాణీ వల్ల అవి ఇంకా వన్నె కెక్కినవి

* సెక్రటరీ : చుక్కలు పొడిచే వేళ
ఆహా' మక్కువతీరే వేళ
ఆడపిల్లే పొడుపుకథ పొడవాలి

అందగాడే తెలుసుకొని విప్పాలి
కిట కిట తలుపులు కిటారి తలుపులు
వేసిన తీసిన చప్పుడు కావు
ఏమిటి ? ఏమిటి ?

హీరో : కిటకిట తలుపులా, ||ఓహో||
కిటారి తలుపులా....
కిట కిట తలుపులు, కిటారి
తలుపులు గడసరి చూపులు
కన్నుల రెప్పలు, కన్నుల రెప్పలు ||చుక్కలు||

సెక్రటరీ : బిబబిబలాడేవి రెండూ
బిత్తరపోయి చూచేవి రెండూ
ఆలకించేవి రెండూ
అందుకునేవి రెండూ
ఏమిటి ?

హీరో : బిబబిబలాడేవి రెండా
ఆహా బిత్తరపోయి చూసేవి రెండా
బిబబిబలాడేవి కాళ్ళు
బిత్తరపోయి చూసేవి కళ్ళు
ఆలకించేవి చెవులు
అందుకోబోయేయి చేతులు, చేతులు ||చుక్కలు||

సెక్రటరీ : తండ్రిని చంపి, తాతను గూడి
తండ్రిని కన్నది తానెవ్వరూ....

హీరో : తండ్రే పెరుగూ, తాతే పాలు
తండ్రే పెరుగూ, తాతే పాలు
తానే చిలికిన చల్లమ్మ చిలికిన చల్లమ్మ

సెక్రటరీ : అఁ

హీరో : ఔనమ్మా పిచ్చిపుల్లమ్మా, పిచ్చి పుల్లమ్మా....

హీ॥సె॥ : చుక్కలు పొడిచే వేళ...

'కిటకిట తలుపులు, కిటారి తలుపులు, ఎప్పుడు తీసిన చప్పుడు కావు' అనే పొడుపుకథ ఒకప్పటి వాచకాలలో ప్రచురించారు; అదిప్పుడు ఎవరినోటపడితే వారినోట నానుతున్నది. చిబిచిబిలాడేదు, తండ్రిని చంపి అనే రెండు పొడుపు కథలను ఉన్నవి ఉన్నట్టుగా గ్రహించి రాగం కొరకు పాదాంతాల్లో హ్రస్వ దీర్ఘాల్ని తెచ్చిపెట్టారు.

ఆచార్య ఆత్రేయ సినీ గేయ సాహిత్య స్రష్టల్లో సుప్రసిద్ధులు. మనసున్న కవిగా మనసు కవిగా లబ్ధప్రతిష్ఠులు. వారు బడిపంతులు సినిమాలో అత్యాధునిక పరికరంపై ఓ పొడుపుకథ కల్పించారు.

* చూచాడమ్మా చూచాను- బుల్లిపెట్టెలో వున్నాడు
కళ్లకెపుడు కనపడడూ- పలుకులెన్నో పలుకుతాడు ||చూచా||

గురుగురుమంటూ గోలచేస్తాడు- హల్లో అని మొదలెడతాడు
ఎక్కడవున్నా ఎవ్వరినైనా- పలుకరించి కలుపుతాడు ||చూచా||

తెలుగూ తమిళ హిందీ కన్నడ- భాషా భేదాలెరుగనివాడూ
కులమూ మతమూ జాతేదైనా— గుండెలు గొంతులు
ఒకటంటాడు ||చూచా||

ఢిల్లీ, మద్రాస్, హైదరాబాద్
రష్యా, అమెరికా, లండన్, జపాన్
ఎక్కడికైనా వెళుతుంటాడూ
ఎల్లలు మనకూ లేవంటాడూ
ఒకే తీగపై నడిపిస్తాడూ
ఒకే ప్రపంచం అనిపిస్తాడు ||చూచా||

దీనికి సమాధానం టెలిఫోను. ఇంతవరకు పరిశీలించిన చలనచిత్ర గేయాలకూ ఈ పాటకూ భేదం ఉంది. పూర్వగేయాలన్నిటిలో మూడు నాలుగుకు మించి పొడుపుకథలున్నాయి. ఈ సుదీర్ఘ గేయం ఒకే ఒక్క పొడుపుకథ నిమిత్తం పుట్టుకొని వచ్చింది.

'ఇల్లు ఇల్లాలు' సినిమాలోని ఈ కింది హాస్య ప్రహేళికా గీతాన్ని శ్రీ అప్పలాచార్య వ్రాశారు. ఈపాటనుగూర్చి వివరిస్తూతమ పొడుపుకథలు గ్రంథంలో శ్రీ జి. శంకరరావు ఇట్లంటున్నారు.

"కడుపుబ్బా నవ్వించే ఘట్టాలకు హాస్యరస పాత్రలకు ఒకరకం పొడుపుకథలను పాటల రూపంలో సినీ సాహిత్యంలో వాడుతున్నారు. పాటల్లో మనలను ఉక్కిరి బిక్కిరి చేస్తూ పతాకస్థాయి వరకు సమాధానం చెప్పి కాళ్లూ చేతులూ చల్లబరిచే హాస్యాన్ని సృష్టించడం ఈ కోవలోకే వస్తుంది. వయసులో ఉన్న భార్య నిజం చెప్పి తన భర్తను ఆట పట్టించిన తీరు మనలను తప్పుదారి పట్టిస్తుంది. కేవలం ప్రశ్న-సమాధానం రూపంలో లేని పాట పొడుపుకథ అవుతుందా? అని శంకించకూడదు."[1]

* ఆమె : వినరా సూరమ్మ కూతురు మొగుడా!
విషయం చెబుతాను— అసలు విషయమ్ము చెబుతాను

అతడు : చెప్పు మరి

ఆమె : కారుమబ్బులు కమ్మేవేళా— కాకులు గూటికి చేరేవేళా

అతడు : కా—కా

ఆమె : చందమామ తొంగిచూసేవేళా— సన్నజాజులు పూసేవేళా
అతడు : ఆహా—ఓహో

ఆమె : ఒంటిగ నేను ఇంట్లోవుంటే
ఉయ్యాల ఎక్కి ఊగుతువుంటే
లాలి లాలి లాలి లాలి లాలిలో

అతడు : ఏం జరిగింది ?

ఆమె ; తలుపు కిఱ్ఱున చప్పుడైనది
గుండె ఝల్లునా కొట్టుకున్నదీ

1. పొడుపుకథలు, పు ; 90

మెల్లమెల్లగా కళ్లు తెరచి
నే వచ్చినదెవరో చూశాను

అతడు ; ఎవలాలు ?

ఆమె ; నల్లనివాడు- గుంటకన్నులవాడు
గుబురు మీసాలవాడిరా

అతడు : అయ్యో బాబోయ్

ఆమె : ఆరడుగుల పొడుగువాడు- ముద్దివ్వమని నన్ను
అడిగినాడు

అతడు : ఏమె వాణ్ణి నేన్నరికేస్తాను

ఆమె ; నేనివ్వ రానంటూ మొఖము దాచుకున్నా
పోనివ్వ పోనివ్వ ముద్దివ్వమంటూ జడను లాగినాడురా
అమ్మా-నాన్నా— అమ్మా-నాన్నా
కాపాడమంటూ అల్లాడిపోయానురా
అయినా కాని వదలక నన్ను ఒడిసిపట్టినాడురా
అంతలో వచ్చింది

అతడు ; ఏమిటి మూర్చా ?

ఆమె ; కాదు మా అమ్మ

అతడు ; ఊఁ ఏమంది

ఆమె ; వెళ్లవే నా తల్లి వెళ్లవే అమ్మాయి
ముద్దులిస్తే నీకు డబ్బులిస్తాడు
మంచి బట్టలిస్తాడు అని ముందుకు

అతడు : ఆఁ— అది తల్లా కాదు రాక్షసి, పిశాచి, దయ్యం,
తల్వాతేమయిందో చెప్పు

ఆమె : తప్పనిసరియై వెళ్లాను— సిగ్గుపడుతు నిలుచున్నాను

అతడు : ఆఁ

ఆమె : గదిలోకెత్తుకపోయాడు- కథలూ కబుర్లు చెప్పాడు
తన దుప్పటిలో చోటిచ్చాడు

అతడు : ఛీ! కులతా! పాపాత్మురాలా! నువ్వు నాకొద్దు- పో
వాడి దగ్గరకే పో—

ఆమె : అంతకోపం ఎందుకయ్యా
అప్పుడు నా వయసైదయ్యా

అతడు : ఏమిటీ అప్పుడు నీ కైదేళ్లా!

ఆమె : వచ్చిందీ మా తాతయ్యా— తాతయ్య!

అతడు : తాతయ్యా! మళ్లి చెప్పవే! తాతయ్యా!

ఆమె : తకదియ్య

అతడు : తాతయ్యా నేను ఎవరో అనుకున్నాను
తాతయ్యా కొంప ముంచేశాడు.

పాటలో మాటల్ని రాగయుక్తంగా పేర్చి అపార్థాన్ని కలిగించి, అదీ పతాకస్థాయికి తీసుకొని వెళ్ళి అసలు నిజాన్ని చెప్పించి, ప్రేక్షకుల్లో శ్రోతల్లో రేకెత్తించిన ఉత్కంఠను తీర్చారు రచయిత.

సులభంగా అంతుచిక్కని గూఢార్థాల్ని నిక్షేపించి 'బంగారక్క' సినిమాలో చమత్కార ప్రహేళికా గీతాన్ని డా|| సి. నారాయణరెడ్డి రచించారు. చిత్రంలోకూడా అదొక నాటక సన్నివేశం. అందువల్ల సందర్భం కథకలికి పోయింది.

* అతడు : సంతకెల్లి వచ్చేతలికి ఎంత మారిపోతివే
మల్లా- ఏం పిల్లా! కతయేందే పిల్లా

ఆమె ; ఇంతలోనే- ఇంట్లోనే- ఎంతపని జరిగిందో
ఓ మామా చెప్పేదెట్టా మామా

అతడు : ఎట్టెట్లా! ఏందాకత! చెప్పుచెప్పు
ఏం జరిగిందో చెప్పవే

ఆమె : ఒకరిమీద కన్నేస్తిని!
ఒకరిమీద చెయ్యేస్తిని!

అతడు : ఎవరిమీద కన్నేస్తివే
ఎవరిమీద చెయ్యేస్తివే

ఆమె : అద్దంమీద కన్నేస్తిరా
కొప్పుమీద చెయ్యేస్తిరా

ఆమె : ఒకరికి చెంపలానిస్తిని
ఒకరికి పెదవులందిస్తిని

అతడు : ఎవరికీ చెంపలానిస్తివే
ఎవరికీ పెదవులందిస్తివే

ఆమె : దిండుకూ చెంపలానిస్తిరా
పంటుకూ పెదవులందిస్తిరా

ఆమె : ఒకరికీ ఒళ్ళిస్తినీ
ఒకరికీ వయసిస్తినీ

అతడు : ఎవరికీ ఒళ్ళిస్తివే
ఎవరికీ వయసిస్తివే

ఆమె : చల్లని నీటికి ఒళ్ళిస్తిరా
సన్నటి పైటకు వయసిస్తిరా

అతడు : అన్నిటికీ అన్నిస్తివి- మరి
నాకేమి మిగిలిస్తివీ

ఆమె : అన్నిటినీ కలబోసీ
వన్నెవలపూ జతచేసీ
నన్నే నీకిచ్చుకున్నానురా! ఒక
నాడైనా నిన్నిడిచి వుండలేనురా!

సాధారణంగా పొడుపుకథా గేయాల్లోని ముగింపుల్లో, ముఖ్యంగా జానపదుల యుగళగీతాల్లోని. పర్యవసాన స్థితిని పాఠకుడో- శ్రోతో ఊహించుకోవలసిందే. కాని సినీ గీతాల్లో పర్యవసానం చాలవరకు మోదాంతంగానే ఉంటుంది. ముగింపు (విడుపు) చెప్పకుండా ముగించడమనేది లేదు.

అండమాన్ అమ్మాయిలో 'వేస్తాను పొడుపుకథ వేస్తాను— చూస్తాను విప్పుకో చూస్తాను' అనే పాట. మూగమనసులులో 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా' అనే గీతం, గాలిపటాల్లో 'తందానా నందానా- అందాలా కథవేస్తా- దమ్ముంటే విప్పాలోయ్- అవునో కాదో చెప్పాలోయ్ అనే గేయం, ఇల్లరికంలో 'అడిగిందానికి చెప్పి- ఎదురాడక ప్రశ్నను విప్పి- నిలిచెదవా గెలిచెదవా- ఓహో చిన్నదానా' అనే పాట, ముగ్గురు మూర్ఖులులో 'విప్పాలి విప్పాలి ముడి విప్పాలి' అనే గేయం, బాలరాజు కథలో 'ఒకరికి చెయ్యినిచ్చి- ఒకరికి కాలునిచ్చి' అనే గీతం, 'అడిగానని అనుకోవద్దు చెప్పకుండ దాటేయొద్దు' అనే గేయం, పూజాఫలంలో 'వస్తావు పోతావు నాకోసం వచ్చి కూర్చున్నావు నీ కోసం' అనే పాట, నీతి నిజాయితీలో 'ఎప్పుడు గిరగిర తిరుగుతూ' అనే గేయం, పాత మంగమ్మ శపథంలో 'పువ్వుల్లో పుట్టి' అనే గీతం, సీతారామ కళ్యాణంలో 'జనకుండు సుతుడును జన్మంబు జేసిన వనిత వారేమి గావలయు నీకు' అనే పద్యం ... ఇవన్నీ పూర్తిగా పొడుపుకథల గుణాల్ని పుణికి పుచ్చుకొన్నాయి. ఇవేగాక ప్రహేళికల ఛాయలున్న గీతాలెన్నో చలన చిత్రాల్లో ఉన్నాయి.

పాటలేగాక సంభాషణల సందర్భంలోకూడా కొన్ని సినిమాల్లో పొడుపుకథలు ప్రవేశపెట్టారు. పాతాళ భైరవిలోని ఈ చిక్కులెక్క అచ్చంగా పొడుపుకథే.

* పిల్లికి ముందు రెండు పిల్లులు
పిల్లికి వెనుక రెండు పిల్లులు
పిల్లికి పిల్లికి మధ్య ఒక పిల్లి
మొత్తం పిల్లుల సంఖ్య ఎంత ?

సమాధానం మూడు పిల్లులే. కాని తొమ్మిదనో, ఏడనో భ్రమించడానికి అవకాశమున్నది. తూర్పు పడమర సినిమాలో కల్యాణి అనే పాత్ర మాటి

మాటికి ఒకే పొడుపుకథను ప్రయోగించి పొద్దుపోవానికి ఇది ఉపయోగిస్తూ కూచో మంటుంది.

* మా నాన్నగారు ఎవరికి మామగారో
వారి కోడలు నాన్నగారు నా కొడుకు మామగారు'
(కూతురు తండ్రి అతని వియ్యంకుడు).

పై పొడుపుకథ కూతురు తండ్రితో అంటున్నది. కూతురు భర్తకు ఆమె తండ్రి మామగారవుతారు. ఆయన కోడలు తండ్రి అతనికి వియ్యంకుడవు తాడు. ఆ వియ్యంకుని కూతురు ఈ పొడుపుకథ పొడిచిన కూతురు పుత్రునికి భార్య అవుతుంది. అంటే ఆ కూతురు పుత్రునికి ఆ కూతురు తండ్రి వియ్యంకుడు మామే అవుతాడు గద! మొత్తంమీద బీరకాయ పీచువలె అనిపించినా మెదడుకు మేత ఈ పొడుపుకథ. ఈ సినిమాలో ఇది విప్పలేక అతను సతమత మవుతాడు.

కొన్ని చలన చిత్రాల్లో విద్యారంగాన్ని అపహసించే చమత్కార సంభాషణలున్నాయి. హాస్యపాత్రలనేక సందర్భాల్లో చమత్కారాల్ని సంధించాయి. వాటిలో కొన్ని ప్రహేళికా భాసాలనిపిస్తాయి.

ఈ చలనచిత్ర గేయాల్లో కొన్ని లక్షణాలకనుగుణంగా ఉండగా, కొన్నిట్లో ఆ ఛాయలు మాత్రమే ఉన్నాయి. ఈ పాటల్ని చలనచిత్రాల కెక్కించిన కవులందరూ, కవితా ధర్మాల్ని- సాహిత్య శిల్ప మర్మాల్ని తెలిసినవారే. ఆ కారణంగానే 'సినీ పొడుపుకథ' మరెన్నో అందచందాల్ని సంతరించుకొంది. భావార్థాల సౌందర్యాలే గాక నుడికారాల ఒంపుసొంపుల్ని ఇది రంగరించుకొంది.

"కారుమబ్బులు కమ్మడం, కాకులు గూటికి చేరడం, ఒడిసిపట్టడం, అల్లాడిపోవడం, కొంప మునగడం, ముద్దుగ మెరియడం, అందం చిందడం, మత్తుగ ఉండడం, ఆకలి కమ్ముడువోవడం, చెక్కిలి వన్నెలు చెరగడం, నింగిలోన నిలువడం, వీథిలోన పడిఉండడం, పలుగాకుల బొజ్జలు పెంచడం, చేతులెత్తుకొని మొక్కడం, తలవాకిట రమియించడం, పెదవులపై ముద్రలు వేయడం సందుజూచుకొని కూల్చడం...." ఇవన్నీ పొడుపుకథ పోడిమిని మరీ పెంచాయి.

"పగడాల చక్రాం పచ్చనితేవ, పుట్టినిల్లు మెట్టనిల్లు ఒక్కటి, కాయైనా పండైనా తీయనిది, ఊరిమీదపడి చందాలు, వారి వరుసలు గణియించు, ఆకాశమే ఇల్లు-లోకమే వాకిలి, ఎత్తిన ఎవరినో ఎత్తుకొనె, పళ్ళు పదారు వాయిసు, కళ్లులేని ఒక కబోది, చేతిలో కీలుబొమ్మ, అద్దంమీద కన్ను, కొప్పుమీద పెయ్యి, పెదవుల దాగిన చిరునవ్వు"... ఇవన్నీ తెలుగు సాహిత్యంలో పలుకుబళ్లుగా, పదబంధాలుగా, జాతీయాలుగా స్థిరపడ్డాయి. చలనచిత్ర ప్రహేళికలు పొదుగుకొన్న ఈ నుడులూ-నానుడులు సాహిత్య సుందరి అందచందాల కేతాములెత్తాయి.

## 6-6 : ప్రభావం

రకరకాల రంగులతో, అన్నిరకాల హంగులతో సినిమాలీనాడు అందరినీ ఆకట్టుకొంటున్నాయి. అందులో అక్కడక్కడ మెరుపుల్లా మెరిసే ప్రహేళికలు తెలుగు పిల్లల మనస్సులలో ఆలోచనా తరంగాలు రేకెత్తిస్తున్నాయి. ఈ సినీ పొడుపుకథా గేయాలన్నీ జానపద సాహిత్యానికి తోబుట్టువులే. వచన ప్రహేళికలనో ఇవి అనుసరించి నడచినవే గేయానికి జంత్ర వాయిద్య సంగీతాల మేళవింపుల కారణంగా స్వల్ప సమయంలోనే వీటికెంతో ప్రాధాన్యం వచ్చింది.

ఇది ఆధునిక సాహిత్యమనే ప్రకరణం. ఆధునిక సాహిత్య ప్రచార ప్రసార సాధనాలైన పత్రికలు, ఆకాశవాణి, చలన చిత్రాలు పొడుపుకథలకు సముచితమైన స్థానాన్నే ఇస్తున్నాయి. తాము ఆశించిన ప్రయోజనాన్ని సాధిస్తున్నాయి. సాహిత్యంలో కూడా వేగం పెరిగిన ఈ కాలంలో పొడుపు పద్యాలు, సమస్యాపూరణ పద్యాలు అవిర్భవిస్తూనే ఉన్నాయని ఈ ప్రకరణ ప్రారంభంలో నిరూపించటం జరిగింది. అధునిక గేయాల్లో పొడుపుకథల ఛాయలెలా ఉన్నాయో ప్రస్తావించాను. వచన కవిత్వాన్ని సమీక్షించాను. చమత్కార సంభాషణల్ని స్పృశించాను. కథనూ- నవలనూ పరామర్శించాను. పత్రికలు ప్రహేళికలనెలా అదరించాయో వివరించాను. ఆకాశవాణి పొడుపుకథల నందించిన తీరుతెన్నుల్ని సమీక్షించాను. చలనచిత్రాలి విషయంలో ప్రదర్శించిన వన్నెచిన్నెల్ని ఒలకబోశాను. వీటన్నిటిపై జానపద సాహిత్య ప్రభావం ఉందనీ ఇంకా ఈ విషయంపై విజ్ఞులు పరిశీలించాలనీ ముక్తాయింపుగా అంటున్నాను.



## పొడుపు కథలు

# చిత్ర కవిత్వం

### 7-1 : వికృతి విచిత్రం

ప్రకృతి వికృతి అవుతుంది. ప్రకృతి ఆకృతిలోని మార్పే వికృతి. వికృతి ఎప్పుడూ ఉండేది కాదు. అది మళ్లీ ప్రకృతి అవుతుంది. వికృతి అప్పుడప్పుడుండేది. ప్రకృతి ఎప్పుడూ ఉండేది. అప్పుడప్పుడుండేది అప్పుడప్పుడు విచిత్రంగా భాసిస్తుంది. చిత్ర విచిత్రంగా భాసించే వికృతి ప్రకృతి అంశమేగాని అదే ప్రకృతి కాదు. వివిధ చిత్ర విచిత్ర సంశోభితమైన వికృతి వినీలాకాశంలోని ఓ మెరుపు. మెరుపెప్పుడూ ఉండదు; అది కాలోచితంగా కనిపిస్తుంది; మురిపిస్తుంది; మాయమవుతుంది. కవిత్వంలో చిత్ర కవిత్వం దాదాపుగా అలాంటిదే. అయితే అది అక్షరాకృతి ధరించింది; అక్షరం ఎప్పటికీ ఉండేదే. అక్షరాకృతి ధరించిన చిత్ర కవిత్వమూ ఎప్పటికీ ఉండేదే. కాని కవితా శారద పాద మంజీరాల ప్రవలి ధ్వనులు వినిపించి నప్పుడెల్ల ఈ చిత్రధ్వని వినిపించదు. కాబట్టి చిత్ర కవిత్వం కొంత వరకే పరిమితమై పోయింది. సాఫీగా సాగుతున్న నడక వంటిది కవిత్వమైతే సర్కసులో వేసే గంతుల వంటిది చిత్ర కవిత్వం.

మనిషి నేర్చే అక్షరాలు, శబ్దాలు, ధ్వనులు, ఉచ్చారణలు ఇవి అన్నీ ముడి సరుకే. కాని వీటి ప్రదర్శనలో కళామ తల్లి తొంగి చూస్తే, సౌందర్యాలంకారాలు సంభావిత మైతే, ఆ ముడిసరుకే కళాఖండ మవుతుంది; శిల్పారామణీయకతా నిలయమవుంది; కవిత్వమవుతుంది. అలాంటి కవిత్వంలో అర్థ ప్రాధాన్యం తగ్గి శబ్దవిన్యాస ధోరణి మితి మీరితే అది చిత్ర కవిత్వ మవుతుంది.

ప్రకృతి ఎప్పుడు పుట్టిందో వికృతి అప్పుడే పుట్టింది. మనిషి నడక నేర్చినప్పుడే కుప్పిగంతులు వేయడం కూడా నేర్చాడు. అక్షరాలు నేరుస్తూనే సమున్నత భావాల్ని సమకూర్చాడు. కవిత్వాన్ని అల్లుతూనే చిత్రకవిత్వం వైపు దృష్టిసారించాడు.

* నూరు రూపాయల కల్లడు
[1]ముడె కాయలకొల్లడు (పిట్ట గూడు)

* ఏ కాన కొల్లడు
ఎయి రూపాయలకల్లడు (పిట్టగూడు)

'వంద ఒస్తాం గూడు అల్లు' అని పిట్టనెవ్వరడగరు. అది తన రక్షణకు తన పిల్లల రక్షణకు గూడు అల్లు కొంటుంది దాన్ని ముడెకాయలక్కూడా ఎవరూ కొనరు: చిత్ర కవిత్వం విలువ కూడా అంతే. పిట్ట గూడు నల్లడం పిట్టకే సాధ్య మవుతుంది; చిత్ర కవిత్వమల్లడం చిత్రకవులకే సాధ్యమవుతుంది. తెలుగులో చిత్ర కవులని ప్రఖ్యాతి గాంచిన వారొకరిద్దరే ఉన్నారు; అయితే చిత్రకవిత్వం తమతమ కావ్యాల్లో చాలామంది వ్రాశారు బిల్హణీయాన్ని వ్రాసిన కవి 'చిత్రకవి వంశదుగ్ధాబ్ధి శీత భానుడు;'[2] మరొక లాక్షణికుడు చిత్రకవి పెద్దన; చరిగొండ ధర్మన్న చిత్ర భారత కర్త. వారి చిత్ర కవితా సృష్టి కారణంగా కొంత మందికి వారి ఇంటి పేరుకూడా అదే అయ్యింది.

## 7-2 : చిత్ర కవిత్వం విశిష్ట లక్షణాలు

పొడుపు కథలు చిత్ర కవిత్వాంతర్భాగాలే అని కొందరి మతం. "కావ్య ప్రకాశ కారుడు యమకశ్లేషాదులను తెల్పుచు 'యచ్చిత్రం యత్ర వర్ణానాం ఖడ్గాద్యా కృతి హేతుతా౽ష్టం వాచ్యమేతక్' ఇత్యాది రూపమున చిత్ర కవిత్వము కావ్యము నకు కడు భూత మని నాడు. ఆచార్య హేమచంద్రుడు ప్రహేళికలను వివరించుచు 'స్వర వ్యంజన స్థానగత్యాకార నియమచ్యుత గూఢాది చిత్రమ్' స్వరా దీనాం నియమః, చ్యుత గూఢాదిశ్చ చిత్రం, సాదృశ్యాత్ ఆశ్చర్య హేతుత్వాద్వా చిత్రం

---

1. ముడె కాయలంటే మూడుడుడ్లు; దుడ్డు అంటే పైస; పైసల్లో పైస తూటు పైస; తూటు పైసకు రంధ్రముంటుంది. ముడెకాయలంటే మూడు తూటు పైసలని అర్థం. తెలంగాణ నైజాం పాలనలో ఉన్నప్పుడున్న సిక్కాను హాలి అనేవారు. ఆ కాలంలోదే ఈ తూటు పైస; దీన్నే చిల్లి (ల్లు) పైస అనేవారు

2. బిల్హణీయము, ఆ-1 ప ; 6.

గూఢార్థ్యాది పదేన ప్రశ్నోత్తర ప్రహేళికా దుర్వాచకాపి ప్రగ్రహః అని ప్రశ్నోత్తర ప్రహేళికా దుర్వాచకాదులను సైతము ఆపి పదము వలన గ్రహించ వలయునని ఇది యంతయు చిత్ర కవిత్వమగునని తన కావ్యాను శాసనమున తెల్పెను."[1]

ఇంతేగాక చిత్రోత్తరాలంకారం సంపూర్ణంగా ప్రహేళికా లక్షణాల్నే పుణికి పుచ్చుకొన్నది. అందువల్ల కూడా పొడుపు కథల్ని చిత్ర కవిత్వమన్నారు. "చిత్రమనగా ఆశ్చర్యము గనుక పరమాశ్చర్యకరములుగా ఈ పద్యములు రచింప బడుట చేత చిత్ర కవిత లైనవి కావచ్చును. కాక బంధ కవిత్వ మంతయును బొమ్మలు వేసి వ్రాయ వలసినవే గనుకను చిత్ర కవిత్వమన్న పేరు వచ్చియుండ వచ్చును.[2]" ఆశు, మధుర, చిత్ర, విస్తరాలని తెలుగు కవిత్వాన్ని నాలుగు విధాలుగా (చతుర్విధ కవితలుగా) లక్షణ దీపిక కర్త వివరించారు. చిత్ర కవిత్వంలోకి వచ్చేవి అంటూ ఆయన ఇలా తెలిపారు.

"పాదగోపనంబును, పద్య భ్రమకంబును, పాద భ్రమకంబును, నామ గోపనంబును, అనులోమ విలోమ గతిపద్యంబులు, కంద గీత గర్భిత వృత్తంబును, కంద ద్వయ గర్భిత మణిగణనికరంబును, క్రౌంచ పద గర్భిత కంద ద్వయంబును, ద్విపద, చౌపద లాలి సువ్వాల మంగళ హారతి ధవళంబులు శోభనార్థ. చంద్రికాది పద దర్వులాది లయ గర్భిత సీసంబును, కంక పటహమండూక తురంగ నటభేరీనినాద నాటక రంప వృత్తంబులును, ఓష్ఠ్య నిరోష్ఠ్య, సంకర జిహ్వా అచల జిహ్వా వృత్తంబులును, తాళగతులును దండక వృత్తంబులును నవావరణ ద్వాదశావరణ చక్ర బంధంబులును గోమూత్రికా, పుష్పమాలికా, పుష్ప గుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల, కంకణ సర్వతోభద్ర, కవి కల్పిత కల్పవల్లరి నిపి యాదిగల్గు బహు విధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుట జేసిన నిది చిత్ర కవిత్వము.[3]

పై రక రకాల రచనలన్నీ చిత్ర కవిత్వమే అని లక్షణ దీపిక కర్త వార్తాకవి రాఘవయ్య చెప్పారు. అప్పకవి మతం ప్రకారంగా ఇందులోనివి చాలా

---

1. ప్రహేళికలు, ద్వి, అనుసంహిత -పు : 8
2. ఆశుకవితలు అవధానములు-చాటువులు, పు : 4
3. లక్షణ దీపిక, ఉదాహరణ వాఙ్మయ చరిత్ర నుండి ఉద్ధృతం, పు : 15.

వరకు గర్భ బంధ కవిత్వాలే. "అప్పకవి (క్రీ. శ : 1656) నాటి నుండి యీ సంప్రదాయము మరుగుపడి ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వమను మత భేద మేర్పడినది."[1] అయినా ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వాల్నే చతుర్విధ కవితలుగా పాటించే సంప్రదాయం రూఢి కెక్కింది. నిజానికి అప్పకవి చెప్పిన బంధ గర్భ కవిత్వాలు చిత్ర కవిత్వాంతర్భాగాలే. అయితే అప్పకవి చిత్ర కవిత్వ భేదాలు చెప్పారు. ఆ భేదాల్ని అనుశీలిస్తూ తెలుగు పొడుపు కథల ఛాయలెక్కడెక్కడ ఉన్నాయో పరిశీలిద్దాం

## 7-3 : చిత్ర కవిత్వం

* అనులోమము విలోమము నిరోష్ఠ్యమునుదం
కట్టుడు గుడుయు శృంగములు నక్ష
రవిలోపమును బద భ్రమకంబు పద్య భ్ర
మకమును నల్లెంట్లు మఱియునేక
పదియు ద్విపదియు త్రి పదియునునేక వ
ర్ణంబును ద్వ్యక్షరి త్ర్యక్షరియును
సరవినిచ్చావాక్య సంఘట్టనంబును
నాదిగా గొన్ని పద్యంబులెల్ల
క్షితిని చిత్రకవిత్వ ప్రసిద్ధనామ
ధేయములచేత బెంపొంది తెలిపి మీఱు
వాని దెలియగ వచియింతు వాసుదేవ
నంద గోపాంగనా పుత్ర నరక జైత్ర[2]

పొడుపుకథల్లో ఈ లక్షణాలన్నీ లేవు. కొన్ని మాత్రమే ఉన్నాయి, ఆ కొన్నిట్లోనూ లక్షణాంశాలే ఉంటాయిగాని లక్షణం సమగ్రంగా లేదు. లక్షణాలన్నీ చిత్ర కవిత్వానికే వర్తిస్తాయి గాని పొడుపు కథలకు వర్తించవు. అందువల్లనే కొన్ని పొడుపుకథలకే లక్షణాలు కనిపిస్తాయి; అంశిక లక్షణాలు కనిపిస్తాయి.

---

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, పు: 13.
2. అప్పకవీయము, 4- ఆ - ప : 549

**3-1, 3-2 : అనులోమం-విలోమం :-** ఓ పద్యముంటుంది; అది ముందునుండి వెనక్కి చదవవచ్చు; వెనుకనుండి ముందుకు చదువవచ్చు. రెండు వేర్వేరు పద్యాలుగా కనిపిస్తాయి కాని అది ఒకటే పద్యం. ముందునుండి వెనక్కి చదివితే అది అనులోమం అవుతుంది; వెనుకనుండి ముందుకు చదివితే విలోమమవుతుంది. ఆ పద్యంలో విలోమం లేకపోతే అనులోమం కాదు; అది సాధారణ పద్యమే అవుతుంది. అప్పకవి ఉదాహరణలు సాహిత్యలోకంలో ఇప్పటికే ప్రాశస్త్యాన్ని పొందాయి.

* దామోదర సామ తన ధ
రామా సరసాకర దశరథ హరి రాధా
కామా సదయాతి పరమ
ధామా వర యాదవకుల దారక రాసా.[1]

* సారాకర దాలకు వద
యారవ మాధామరపతి యాద సమాకా
ధారారి హధర శదకర
సార సమారాధన తమ సార దమోదా.[2]

అనులోమ విలోమ పద్యాలు కష్టసాధ్యాలే. రహస్య గోపనం చేసే ప్రహేళికా లక్షణాలిందులో ఉన్నాయి. తెలుగు పొడుపు పద్యాల్లో ఇవి లేవు. కాని సీసపద్య పూర్వార్థ పాదపాదానికి ఉత్తరార్ధ పాదపాదం విడుపుల్లో అనులోమ విలోమాలున్నాయి. అవి కేవలం పదాలే; అనులోమ విలోమ పద్యాలనడానికి వీల్లేదు. అనులోమ విలోమాల విడుపుల పదాలనవచ్చు.

| | |
|---|---|
| * కరవాల చేతిలో కలుగు నాయుధమేది! | (కలము) |
| కాసకు గుణమీయ గలుగునేది! | (ములక) |
| బాలుండు వ్రాతకై పట్టుకొనెడిదేది! | (పలక) |
| వర గృహంబున కేది వరలు కప్పు! | (కలప) |

1, 2, అప్పకవీయము, 4 ఆ-వ : 550, 551.

ఇంటిలోపలకేగ నేమి దాటగవలె (కడప)
ధర్త కై యిల్లాలు ఐరచునేమి (పడ
శర్కరి నేమని జనులు వాకొందురు (గులక)
చెలగి మూషకమేమి చేయుచుండు (కలుగు)

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
ఈవలావలగన సరిపోలవలయు
చిత్త భవభంగ శివలింగ చిన్మయాంగ
వృష తురంగ శుభాంగ గౌరీశలింగ.[1]

ప్రతి పాదంలోని రెండు విసువులు ఈవలినుండే చూడాలి. అయితే ఒక విడుపే వ్రాసుకొని ఆవలినుండి కూడా చూడాలి. రెండు వ్రాసి చూసుకోడం అర్థ స్పష్టతకే.

పొడుపుకథల్లో అనులోమ విలోమ పద్యాలు లేకున్నా ఒకటి రెండు ఇలాంటి వాక్యాలు వ్రాస్తుంటారు; కూస్తుంటారు. ఓ విద్యార్థి నల్లబల్లమీద కొంటెమాటలు వ్రాస్తాడు మరో విద్యార్థికి కోపం వస్తుంది. ఆ కోపాన్ని ఇలా వెల్లడి జేస్తాడు.

* దడిగాడు వానసిరా.
-ఇది కిందినుండి చదవాలి.

'రాసినవాడు గాడిద' అని వస్తుంది. పైనుండి చదివినప్పుడు అర్థం తెలియక, సమన్వయం కుదరక ఏర్పడ్డ తికమక కిందినుండి చదవగానే తేలిపోయింది. అనులోమార్థంకూడా తీసేవారున్నారు. దడి అంటే తడక అని తడక గాడు వానవంటి వాడనీ సిరా వంటి వాడని అర్థం చెప్పవచ్చు ఇలాంటి వాక్యాల్లో పొడుపు కథాంశాలు అంతంత మాత్రంగా కనిపిస్తాయి

**3-3 : నిరోష్ఠ్యం** :_ ఓష్ఠ్యాలు (పఫబభమ) లేకుండా చేసిన రచన నిరోష్ఠ్యమవుతుంది. తెలుగులో నిరోష్ఠ్య కావ్యాలు, అచ్చ తెనుగు నిరోష్ఠ్య కావ్యాలూ

1. పొడుపు పద్యాలు, పు : 37

వెల్వడ్డాయి. ఆసూరి మరిగంటి సింగరాచార్యః శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణం రచించారు. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలో చిత్రకవిత్వం కుమ్మరించారు.

* జయజయ నగజా నాయక
జయజయ ఘనశేషహార జగదాధారా!
జయజయ శైలశరాసన
జయజయ కాశీనిశాంత శాంతస్వాంతా![1]

తెలుగు పొడుపుపద్యాల్లో కావాలని నిరోష్ఠ్యా లెవరూ రచించలేదు. జానపదుల పొడుపుకథల్లో నిరోష్ఠ్యాలు కొన్ని ఉన్నాయి, ఇవికూడా అనుకోకుండా రూపు దిద్దుకొన్నవేగాని కావాలని కల్పించినవి గావు.

* కొండనిండ ఎలక్కాయలు (చుక్కలు)

* దోసెడు నీళ్ళల్లో
దొరసాని జలకాలాడుతుంది (వెన్నముద్ద)

* రుచిలేని నాకుడ (పుటలు త్రిప్పడం)

* సిన్న యింట్ల
సిలుకు సెక్కలు (అగ్గిపుల్లలు)

* ఈ ఊరికల్లుగాదు ఈతకల్లుగాదు
తాడూరి కల్లుగాదు తాటికల్లుగాదు
కల్లుగాని కల్లేం కల్లు (ఉప్పుగల్లు)

నిరోష్ఠ్యాలైన ఇలాంటి పొడుపుకథలన్నీ అప్రయత్న సిద్ధాలే. ఇవి చిన్నచిన్న పొడుపుకథలు; అకారణంగా వ్యవహర్తా, శ్రోతా వీటిలో ఓష్ఠ్యాలు లేవని గ్రహించలేకపోతారు. అందువల్ల జనం దృష్టిలో ఇదో విచిత్రం కాదు; చిత్రకవిత్వమసలే కాదు.

---

1. షట్చక్రవర్తి చరిత్ర, ఆ-3, ప : 105.

**3-4 : తలకట్లు :-** పద్యంనిండా తలకట్లే ఉండాలి. అవసానంలో గురువుండే కందం తదితర పద్యాల చివర తలకట్టు దీర్ఘం మాత్రమే రావాలి.

* హరభవ హర ధరధరశర
వరపర్వత సదన పంచవదన ఘనమరు
ద్వరద దరముడుగ దయదగ
సరసతమము మనుపవయ్య సతతము కడకన్[1]

ఈ పద్యం తలకట్టు పైకివచ్చే 'ఉ'కారయుక్త హల్లుల్నికూడా స్వీకరించింది. పొడుపుకథల్లో ఇలాంటి చిత్ర ప్రక్రియలు లేవు.

**3-5 : గుడులు :-** పద్యంనిండా గుడులే ఉండాలి. చివర గురువున్న పద్యాలకు గుడిదీర్ఘం మాత్రమే చెప్పాలి.

* గిరిగిరి చిరిగితి వినికితి
విరిగితి విడిచితి నిరికితి విధికిరి కిమీ
విరివి విని నిగిడి నిలిచితి
సిరియిడి నిల్పితివి నిల్పిక్షిలిమిలినిమ్మీ [2]

కేవలం గుడులే ఉన్న పొడుపుకథలు తెలుగులో లేవు. ఈ నిర్మాణ దృష్టి పొడుపుకథకు లేదు.

**3-6 : కొమ్ములు :-** పద్యంలో అన్నీ కొమ్ములే ఉండాలి; గురువు లున్నచోట కొమ్ము దీర్ఘాలుండాలి

* గురుడును శుక్రుడు సుగ్రుడు
పురుహూతుండును శుకుండు బుధుడును గుహుడున్
బురుకుత్సుండును గుత్సుడు
గురునుతులొనరించి రనగ కొమ్ములు కృష్ణా![3]

1. షట్చక్రవర్తి చరిత్ర, ఆ-3, ప : 112
2. షట్చక్రవర్తి చరిత్ర, ఆ-3, ప : 114
3. అప్పకవీయము, ఆ-4, ప : 556.

ఇవి కూడా తెలుగు పొడుపుకథల్లో లేవు. అప్పకవి ఏత్వాలు, ఓత్వాలు చెప్పుకున్నా వాటిని తెలుగు కవులుమాత్రం వదలిపెట్టలేదు.

**3-7 : అక్షర విలోపం :-** ఇచ్చిన పదంలోగానీ, పాదంలోగానీ, పద్యంలోగానీ అక్షరలోపం చేసి చదవాలి. అయినా స్వరైన అర్థమే రావాలి సంస్కృతంలో చ్యుతాక్షర దత్తాక్షర ప్రహేళిక లిటువంటివే.

"కూజంతి కోకిలాస్సాలే"....[1] సాలంపై కోకిలలు కూస్తున్నాయని అర్థం. రసాలంపై మాత్రమే కోకిలల కూజితాలు ప్రసిద్ధం. ఇక్కడ రసాల శబ్దంలోనీ 'ర' చ్యుతమైంది కాబట్టి ఇది చ్యుతాక్షర.

"యౌవనేపుల్ల మంచుజమ్ ..."[2] యౌవనంలో వికసించిన అంబుజం అని అర్థం. ఇక్కడ 'యౌ' అనే అక్షరం అధికం. 'వనే పుల్ల మంబుజమ్'.... అని గ్రహించాలి. అప్పుడు దానికి నీటిలో వికసించిన అంబుజం అని అర్థం వస్తుంది. ఇది దత్తాక్షర.

"కింకరోతు కురంగాక్షి వదనేననిపీడితా"[3] వదనంతో బాగా పీడిత అయిన యువతి ఏం చేస్తుంది అని అర్థం. ఇక్కడ 'మ' వర్ణం చ్యుతంచేసి 'వ' వర్ణమివ్వడం జరిగింది. మదనునివల్ల పీడిత అయిన యువతి ఎంచేస్తుంది అని ఆశించిన అర్థం వస్తుంది ఇది చ్యుత దత్తాక్షర.

ఈ మూడింటిలోనూ అక్షర విలోపమే ఉంది. అయితే చ్యుతాక్షరలో అక్షరమసలే కనిపించదు. అర్థాన్నిబట్టి అక్షరాన్ని ఊహించి తెచ్చిపెట్టాలి. దత్తాక్షరలో అక్షరముంది. కాని ఆ అక్షరాన్ని తొలగిస్తేనే స్పష్టార్థం వస్తుంది. చ్యుత దత్తాక్షరలో అక్షరముంది; కాని ఆ అక్షరాన్ని తొలగించి ఆ స్థానంలో మరొక సమర్థాక్షరాన్ని ఉంచి నప్పుడు మాత్రమే ఆశించిన అర్థం వస్తుంది

తెలుగు పొడుపు పద్యాల్లో ఈ చిత్రాలున్నాయి; మరీ విచిత్రాలున్నాయి. ఈ క్రింది పద్యాల్లో అక్షరమున్నప్పుడూ, అక్షరం తొలగించినప్పుడూ అర్థ స్పష్టతకు భంగం కలుగకుండా స్పష్టార్థమే వస్తున్నది.

---

1, 2, 3 : పొడుపుకథలు, పు.: 63

* అక్షరత్రయంబు నలరారు పువ్వంబు
నడిమి యక్షరంబు విడిచి పలుక
ముదము నిచ్చు పులుగు మూర్తి నామంబొప్పు
దీనే భావమేమి తిరుమలేశ![1] (కేతకి-కేకి)

* అక్షరత్రయంబు నలరు వాహనమొండు
మధ్య యక్కరంబు మలపి, చూడ
బాలబాలికలకు భాగ్యాధి దేవత
దీని భావమేమి తిరుమలేశ![2] (బండి-బడి)

* పెట్టుకు నాల్గక్షరములు
తొట్టతొలుత యక్షరంబు త్రోసిన త్రాడౌ
పెట్టెయ్యది! త్రాడెట్లగు!
పట్టుగ దెలుపుటకు గడువు పదినెలలిత్తున్[3]

బండి—బడి అనే విడుపుల్లో సున్నకు అక్షర ప్రతిపత్తి ఉంది. సుందారంలో లేదు. ఆయా పొడుపు పద్యాల నిర్మాతల అభీష్టాల మేరకే ఇలాంటివి జరుగుతుంటాయి. ఒక పొడుపు పద్యం విడుపునకు నాల్గక్షరాలున్నాయి. ఒకటి, రెండు, మూడూ చ్యుతం చేస్తూ అలా వెళ్ళితే మూడు విడుపులూ వస్తాయి.

* అరయ నాల్గక్షరముల శివాఖ్య యొప్పు
వాని తలగొట్ట ఇందిరా వల్లభుడగు
వాని తలగొట్ట నర్థంబు భర్త యగును
అట్టి పదమేదొ? పేర్కొనుడార్యులార![4] (ఉమాపతి)

---

1. తిరుమలేశ శతకము, ప : 13.
2. తిరుమలేశ శతకము, ప : 62.
3. పొడుపుకథలు, పు : 20.
4. పొడుపుకథలు, పు : 19.

శివుడు ఉమాపతి. తెలుగు నుడికారం తలగొట్టడం; అంటే మొదటి అక్షరాన్ని తీసివేయడమనే అర్థం అప్పుడు మా (లక్ష్మి) పతి అవుతుంది. దాని మొదటి అక్షరం తీసివేస్తే పతి (భర్త) అవుతుంది.

పొడుపు పద్యం చిత్రాతి చిత్రాల్ని ప్రదర్శించింది. నాలుగు పాదాలకు నాల్గు విడుపులు వస్తాయి. ఒక్కో విడుపునకు మూడు పర్యాయాలు అక్షర విలోపం చేస్తే మూడు మూడు విడుపులు వస్తాయి. అప్పుడు మొత్తం పన్నెండు విడుపుల్ని సాధించడం జరుగుతుంది.

* ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
తేటి రక్కసి రాజు తెలియతల్లి
ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
శివునిల్లు వరిచేను క్షీరధార
ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
భార్యయు ఖడ్గంబు బరగపెట్టు
ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
మారువన్నెయు నీటె మంటజోడు
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
మొదలు తుదలను, నడితుద, మొదలు నడుమ
ప్రాణరక్షణ తలలందు పాదపముల
పరికరములందు నీయర్థ మరయవలయు.[1]

తేటగీతిలో ఇచ్చిన సూచనలవల్ల పదాల్ని కనుగోడం సాధ్యమే అయినా, ఇది సామాన్యమయిందేం కాదని శ్రీ జి. శంకరరావు భావిస్తున్నారు. మూడేసి అక్షరాలున్న (1, 2, 3) పదాలలో, ఆద్యంతాలతో (1-3 ఒక అర్థాన్ని, మధ్య

1. పొడుపుకథలు, పు : 34.

మాంతిమాక్షరాలతో (2-3)మరియొక అర్థాన్ని, ఆది మధ్యాక్షరాలతో(1-2) ఇంకొక అర్థాన్ని సాధించాలి.

ప్రథమ పాదం — అంబలి (1-2-3)
1-3 : లేటి-ఆలి: 2-3 : రక్కసిరాజు-బలి; 1-2 : తల్లి-అంబ

ద్వితీయ పాదం — గుమ్మడి (1-2-3)
1-3 : శివునిల్లు-గుడి; 2-3 : వరిచేను-మడి; 1-2 : క్షీరధార-గుమ్మడి.

తృతీయ పాదం — ఆవాలు (1-2-3)
1-3 : భార్య-ఆలు; 2-3 : ఖడ్గం-వాలు; 1-2 : పెట్టు-ఆవ.

చతుర్థ పాదం — పొగడ (1-2-3)
1—3 : మారువన్నె-పొడ; 2-3 : ఈపె-గడ; 1—2 : మంటజోడు-పొగ

ఇలా అక్షర విలోపాల చిత్రవిచిత్రాల ద్వార తెలుగు పొడుపుపద్యాలు చిత్రకవిత్వాంతర్భాగాలే అన్న మాటను సార్థకం చేశాయి. జానపదుల పొడుపు కథల్లో ఒకటి రెండు లక్షణాలను ప్రమింగి ప్రయోగించిన పొడుపులున్నాయి.

* పిసుకుతడు - నాకుతడు (మామిడి పండు)

ఈ పొడుపుకథలో ముడ్డి-మూతి అనే రెండు పదాలు లోపించాయి ఇలాంటివాటిని బహ్యాక్షర విలోపాలనవచ్చు.

* మాటకాని మాట (టమాట)

* దోని కాని దోని (ఆదోని)

* పాలు కాని పాలు (దీపాలు, పాపాలు, నేరాలు)

* కీలు గాని కీలు (వకీలు)

* కట్టు గాని కట్టు (తాకట్టు)

* పురం గాని పురం (కాపురం)

* తాళం గాని తాళం (పాతాళం)

* గడ గాని గడ (మీగడ)

ఇలా అక్షర విలోపంచేసి అడిగేవి వందలకొలది ఉన్నాయి అతి ప్రాచీన విషయాలూ, ఆధునికాంశాలూ ఈ విధంగా అడిగే అవకాశముంది. అప్పటికప్పుడే కొన్ని కొత్తవికూడా సృష్టిస్తున్నారు. ఇవన్నీ పిల్లలు పుట్టించినవే. వీటిని చ్యుతాక్షరాలుగానే పరిగణించాలి.

**3-8-పాదభ్రమకం :-** ముందు నుండి చదివినా వెనుక నుండి చదివినా ఒకే విధంగా ఉండాలి పద్యపాదం. పద్యంలో ఏ పాదాని కా పాదమే భ్రమకమవుతుంది. భ్రమకంగా ఒక్క పదం చెప్పడమే కష్టం. పాదపాదం భ్రమకంగా చెప్పడం పరిశ్రమ ద్వారానే సాధ్యం.

* ధీరా నానా రాధీ
ధారా కరతా తర రత తారక రాధా
ధారాసుత త సురాధా
ధారిత తరి ధావనారి ఐదభ్రమకమగున్.[1]

భ్రమకం పొడుపు కథల్లో ఒక శైలీ విభాగం. సంస్కృత ప్రహేళికల్లో ఇలాంటివెన్నో ఉన్నాయి. ఈ క్రిందిది అర్ధ పాదానులోమ ప్రతిలోమము. ప్రతిపాదం సగభాగం నుండి కిందికి, కింది నుండి పైకి చదవాలి. రెండూ ఒకే తీరుగా ఉంటాయి.

* కాశీనానన నాశీకా-రాధితాహి హితాధిరా
మాయాహామ మహాయామా-కాపిదీప్ర ప్రదీపికా [2]

---

1. అప్పకవీయము, ఆ-4, ప: 458.
2. ప్రహేళికలు, ప్ర-పు : 94, శ్లో : 168.

తెలుగు పొడుపు పద్యాల్లోని కొన్ని విడుపులు పద భ్రమకాలే. రెండు వైపుల నుండి ఒకే విధంగా వచ్చే పదాలున్న విడుపుల పద్యాలెన్నో ఉన్నాయి. ఈ క్రింది సీసం పొడుపులన్నీ మూడక్షరాల పద భ్రమకాలే.

* శ్రీరామునకు సీత చెలగి యెచ్చట నుండు -డాకడా
నా రాముడేటికి నడవి కేగె కైకకై
ఏగిన మారీచుడేది దాల్చుచు వచ్చె మెకమె
నెసగి దైత్యుని రాముడెచట చంపె -నేలనే
సుగ్రీవుడా ర్రాము జూచి ఏమని పల్కె -సంతసం
వాలి రాముని చేత నేల చచ్చె -కనక
లంక నేరీతిని పొంకమడంచెను -కలంక
ప్రజల నేటిక తండు ప్రబలజేసె -కేళికే

అన్నిటికిజూడ మూడేసి యక్షరంబు
లీవలావల జూడంగ నేక విధము
సన్నుతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్ని నగవు.[1]

చమత్కార చంద్రికలో చిత్రాతి చిత్రాలెన్నో గుప్పించిన శ్రీ మంగిపూడి వారు రెండక్షరాల పద భ్రమకాల్ని అర్థయుక్తంగా ఈ క్రింది పద్యంలో అనుసంధించారు. అవీ విడుపులే.

* వినతికి వేల్పునకును నొప్పు పేరేది -జేజే
కలిగెను దేనికై కంకణంబు -కైకై
బొట్టెల దీవించునట్టి మాటెయ్యది -జోజో
వద్దు వద్దను మాట కుద్దియేది -మామా
అరుదైన గంధర్వ వరుని పేరెయ్యది -హాహా లేక హూహూ

---

1. పొడుపు పద్యాలు, పు : 43.

అశ్వరాజంబున కాఖ్యయేది -బాబా
యవన భామినికి సొంపారు నామంబేది -బీబీ
జనకు మ్లేచ్ఛులు పిల్చు సంజ్ఞ యేది -దాదా
భూమి యందున్న మధికమౌ ధామమేది -లోలో
అన్నిటికి గూడ రెండేసి యక్షరములు
రెండు నెటు చూచినను నర్థ ముండవలయు
దీని చిత్రంబు దెలియుడీ! ధీరులారా![1]

రెండు మూడక్షరాల పదభ్రమకాలే గాక అయిదక్షరాల పదభ్రమకా లున్నాయి. కట్టకట్టక, కేళికాళికే, కిటికోటికి, వికటకవి, సురసరసు, చేతనతచే, కులస్త్రీలకు, నేతచేతనే, వెలగలవె, నెలరలనె, నెలనెలనె, కెలసలకె అనే విడుపు లున్న పత్రభ్రమకాల పొడుపు పద్యాలు కొన్ని కనిపిస్తున్నాయి. ఒకటి రెండు ఉదాహరిస్తా.

* రామునెవ్వరి గూడి రావణు మర్దించె (తోకమూకతో)
వరవాసు దేవుని పట్నమేది (రంగనగరం)
రాజ మన్నారుచే రంజిల్లు శరమేది (లకోరికోల)
వెలయ గానుక వంటి విత్తదేది (జంబీరబీజం)
సీతను జేకొన చెరచిన దనువేది (పంచాస్త్రచాపం)
సభవారి నవ్వించు జాణ యెవడు (వికటకవి)
అలరంభ తురుములో నలరు మాలికయేది (మందారదామం)
శ్రీకృష్ణుడే యింట జెలగుచుండె (నందసదనం)
అన్నిటికి జూడ నైదేసి యక్షరములు
ఒనర నిరుదెస చదివిన నొక్కతీరె
చెప్పగల్గిన నేనిత్తు చిన్నిమాడ
చెప్పలేకున్న నగదురే చిన్ననగవు [2]

---

1. చమత్కార చంద్రిక, పు ; 4.
2. పొడుపు పద్యాలు, పు : 34.

తోకమూకతో, రంగనగరం.... ఇవన్నీ పద భ్రమకాలే, రెండు ప్రశ్నలకు ఒకే సమాధానమున్న పద భ్రమకాల విరుపుల సొగసు పద్యాలు కూడా ఉన్నాయి. ఇలా రెండు సొదుపులకు ఒకే విడుపుండడం వల్ల చిత్రోత్త రాలంకారం లోని ఒక భేదమైన ఉత్తరాంతరాభిన్నోత్తరంగా అదిభాసిస్తుంది. అయితే ఆ అలంకారంలో పదభ్రమకముండాలనే నియమం లేదు. పదం విడుపులో మరో అర్థం వస్తున్న కారణంగా శ్లేషకుకూడా ఇందులో తావున్నదనాలి. వ్యవహారంలో ఉన్న ఈ పద్యం గమనించండి.

* రాజులకెటువంటి రత్నముల్ ప్రియమయ్యే
కాయలే చెట్లవి కరులు ద్రింగు (వెంగలవె)

ఈశ్వరుండెవ్వాని నెచ్చోట ధరియించె
నారుదెవ్వారి వెసంగ గోరు (నెలతలనె)

ఎన్నెన్ని దినముల కేతెంచు పున్నమి
జనయిత్రి పుత్రునే జాడమోసె (నెలనెలనె)

బంధువులెయ్యెడ బలిసి యేతెంతురు
ఈతకాడెందున భీతిజెందు (కెలకులకె)

అన్నిటికిజూడ నైదేసి యక్షరములు
ఈవలావల జూడంగ నేక విధము
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్నినగవు.

పదభ్రమకాలే, పాదభ్రమకాలుగా, పాదభ్రమకాలే పద్య భ్రమకాలుగా క్రమంగా పరిణతి చెందాయి. * అయితే, అన్నీ సంస్కృత సంప్రదాయాన్నే అనుసరించాయి.

**3-9 : పద్యభ్రమకం :-** పద్యం మెత్తం ముందు నుండి వెనుకకు, వెనుక నుండి ముందుకు చదివితే ఒకే విధంగా ఉండాలి. కావ్యం మొత్తం ఇలా వ్రాయడం కష్టం అయితే సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో ఇలాంటి పద్యాలు అక్కడక్కడ కనిపిస్తున్నాయి.

* రాధా నాథా తరళిత
సాధక రథతా వరనుత సరస నిధానా!
నాధా నిసరత దురవ
తాధరకథ సాంతళి రత థానాధారా![1]

* రాదసారస గోసారస మానానఘ కాశికా
కాశికాఘన నామాసరసా గోసర సాదరా॥[2]

* కాళిదాసశిదాయోమా చంద్రదంతే రిపురంజకమ్
కంజరం పురితేంద్రదంచ మాయోదాశి సదాశికా॥[3]

పొడుపు పద్యాల్లో పద్యభ్రమకాలు లేవు. అయితే పదభ్రమకమే పద్య భ్రమకంగా పరిణతి చెందడానికి అవకాశముంది.

**3-10 : నల్లెంట్లు :-** పద్య పాదాలన్నీ ఉంటాయి. ప్రారంభంలో కొన్ని అక్షరాలుండవు. ఆ అక్షరాల్ని అర్థానుగుణంగా పూరించుకోవాలి. రిక్త స్థలాలు పూరించే పద్ధతి వంటిదే ఇది. అయితే పద్య ప్రారంభంలోనే రిక్తస్థల ముంటుంది. అప్పకవి ఉదాహరణమిలా ఉంది.

* <u>నారదముని</u> శార్దూలము
కూరిమి నలినంబు గప్పకొని వేడుకతో
నారాయణ వాసమున క
నారత మేతెంచు ననగి నల్లెంటులగున్[4]

తెలుగు పొడుపు కథల్లో నల్లెంట్లులేవు. అక్షర విలోపాలైన మాటకాని మాటల్లో, ఏకాక్షర విలోపాలేగాక బహ్వాక్షర విలోపాలు ఉన్నాయి. అవి ఆద్యాక్షర విలోపాలే. అయితే వీటిని బహ్వాక్షర విలోపాలుగా పరిగణించాలి.

---

1. అప్పకవీయము, ఆ—4, ప : 559
2. భద్రాయు రభ్యుదయము, ఆ-1, శ్లో : 83
3. ప్రహేళికలు, ప్ర, పు-95, శ్లో : 169.
4. అప్పకవీయము, ఆ-4, ప : 560

* రాళ్లగాని రాళ్లు (కీచు రాళ్లు)
* బొట్టుగాని బొట్టు (తాళి బొట్టు)

**3-11 : ఏకపాది :-** ఒకే పాదం అన్ని పాదాల్లో అర్థ భేదంతో ఉంటుంది. సీస పద్యంలో నాలుగు పాదాలొకవిధంగా, గీతం లేదా ఆట వెలది పాదాలింకో విధంగాఉంటాయి. ఇవన్నీ అర్థ కాఠిన్యాలే. ఇవి వినోద ప్రహేళికల కిందికే వస్తాయి. అంతే గాక దుర్బోధార్థ పదావళీ లక్షణం కూడా వీటికి సరిపోతుంది. సంస్కృతంలో వీటినే ప్రముషితా ప్రహేళికలంటారు. అప్పకవి ఏకపాదికిచ్చిన ఉదాహరణ మటువంటిదే. నాలుగు పాదాలిలాగే ఉంటాయి.

* మతివినాయక భరిత సమ్మదుడనంగ[1]

ఈ క్రింది తెలుగు చాటువు లచ్చంగా ఏకపాది కిందికే వస్తుంది. తెనాలి రామకృష్ణుని కథకురక్తి దెచ్చిన పద్యమిది.

* రాజనందన రాజరాజాత్మజులుసాటి
  తలపనన్నయవేమ ధరణి పతికి....(1 + 3 పాదాలు)
  భావభవభోగ సత్కళాభావములను....(1 + 3 పాదాలు)

రాయల దర్శనానికి ఒక పండితుడు వచ్చాడు. అన్నయవేమ రాజుపై తానీ పద్యం వ్రాశానన్నాడు. అర్థం చెప్పేవారుంటే అడుగు ముందుకు వేయం డన్నాడు. అప్పుడు రామకృష్ణుడు "మేకతోకకు...." అనే ప్రసిద్ధ పద్యాన్ని కల్పించాడు.[2] రామకృష్ణుని వినోద పద్యం సంగతి అటుంచి, ఆ పండితుని పద్యానికి పండితులర్థాలు దీసి పెట్టారు.

"అన్నయ వేమ ధరణి పతికి = అన్నయ వేముడనుమహారాజునకు, తలపన్ — ఆలోచించగా—

---

1. అప్పకవీయము, ఆ - 4, ప : 561
2. తెనాలి రామకృష్ణకవి హాస్య కథలు, పు : 20

భావ : బుద్ధియందు, భవ : ఐశ్వర్యమునందు, భోగ = విభవము నందు, సత్కాళా : శ్రేష్ఠమైన విద్యల యొక్క, భావ : అతిశయమందు, రాజ నందన . చంద్రుని కుమారుడైన బుధుడును, ర : సమర్థుడైన, అజ : ఈశ్వరు డును, రాజ = దేవేంద్రుడును, ఆత్మజ : బ్రహ్మదేవుడును- సాటియగుదురు

భావ : క్రియ యందు, భవ : ధనమందు, భోగ: పాలనయందు, సత్కళా : యోగ్యమైన కాంతి యొక్క, భావ : బృందమందు, రాజనందన: మనోహరమైన శివునికి కుమారుడైన కుమార స్వామి, రాజ : కుబేరుడును, రాజ (ర + అజ) శ్రేష్ఠమైన అజ మహారాజును, ఆత్మజ: చంద్రుడును- సాటియగుదురు.

భావ: ఆత్మ జ్ఞానమందు, భవ: జననమందు, భోగ: అనుభవమందు. సత్కళా: అభివృద్ధి పొందునట్టి, భావ: పద్ధతి యందు, ర: బంగారము వంటి దీప్తి కలిగిన, అజ: బ్రహ్మకు, నందన : పుత్రుడైన సనత్కుమారుడును. రాజ: క్షత్రియుండును, రాజ: శ్రేష్ఠుడైన బ్రహ్మకు, జ : పుట్టిన వశిష్ఠుడును, ఆత్మ : బృహస్పతి యందు. జః పుట్టిన కచుడును- సాటియగుదురు.

భావ : అకాశమందును, భవ: సంసారమందును, భోగ: సంభోగమందును, సత్కళా: సౌందర్యముయొక్క, భావ : రతియందు, ర + అజ + నందన : శ్రేష్ఠమైన మన్మథునికి కుమారుడైన అని రుద్ధుడును, ర : అంతట వ్యాపకుడైన అజ : విష్ణువును. రాజ : యక్షుడును, ఆత్మజ : మన్మథుడును- సాటి యగుదురు.

అన్నయ వేమ భూపాలునకు - బుద్ధియందు బుధుడును, ఐశ్వర్యము నందు ఈశ్వరుడును, విభవమునందు దేవేంద్రుడును విద్యాతిశయమున బ్రహ్మ దేవుడును, క్రియయందు కుమార స్వామియు, ధనమందు కుబేరుడును, పాలన యందు అజమహారాజును, కాంతియందు చంద్రుడును, ఆత్మజ్ఞానమందు సనత్కు మారుడును, జననమందు క్షత్రియుడును, అనుభవమునందు వశిష్ఠుడును, అభివృద్ధి యందు కచుడును, ఆకాశమందు అనిరుద్ధుడును, సంసారమందు విష్ణువును, సంభోగమందు యక్షుడును, సౌందర్యమునందు మన్మథుడునుసాటి."[1]

---

1. శ్రీ కపిలవాయి లింగమూర్తి వ్రాత ప్రతి నుంచి కృతజ్ఞతలతో గ్రహీతం.

**3-12 : ద్విపద :** పూర్వోత్తరార్థాలు సమానంగా ఉండే పద్యం ద్విపద. వేరే ఛందస్సులోని ద్విపదకు దీనికి సంబంధం లేదు. ఇది అప్పకవి చెప్పిన చిత్రకవిత్వంలోనిది. మొదటి రెండు పాదాలు మూడు నాలుగు పాదాలుగా మళ్ళీ వస్తాయి. ఏకపాదిలో ఒక పాదమే ఆవృతమైతే, ఇందులో రెండు పాదాలూ ఆవృతమవుతాయి.

* శరవృషవనాబ్జ పుష్కర హరిరసాభ
శుచి శరీర ప్రవర్ధిత సుమశరాంగ
శరవృషవనాబ్జ పుష్కర హరిరసాభ
శుచి శరీర ప్రవర్ధిత సుమశరాంగ.[1]

**3-13 : త్రిపద :** మూడు పాదాలు వేరువేరుగా వ్రాసి, నాలుగవ పాదంలో ఇదే లక్షణ మన్నాడప్పకవి. అప్పుడది మామూలు పద్యమే అయ్యింది. ఇది చిత్రకవిత్వంలోకి రాదు. ఐది ఇందులో చెప్పాల్సిన అవసరం లేదు. ద్విపద, త్రిపదలు రెండూ పొడుపు పద్యాల్లో కనిపించడం లేదు. అయితే అప్పకవి త్రిపద లక్షణం సరైనదనుకొంటే మాత్రం అన్ని పద్యాలు త్రిపదలే అవుతాయి.

**3-14 : ఏకాక్షరి :** పద్యమంతా ఒకే హల్లుతో నడవాలి. పొడుపు కథల్లో ఇలాంటివి లేకున్నా కొన్ని చమత్కార పదాలు, వాక్యాలు, పద్యాలు ఒకే హల్లుతో నడిచినవి కనిపిస్తున్నాయి

* నీ నూనె నా నూనని నేనన్నానా
* కాకీక కాకికి కాక కేకికా

ఇవి పెద్దలకోట ఎప్పుడు వెళ్ళిపోయాయో! ఇప్పుడుమాత్రం పిల్లలనోట ఆడుతున్నాయి అప్పకవి మూడు పాదాల పైచిలుకు ఒకే హల్లుతో నడిపించి చివర ఇదే లక్ష్యమన్నాడు.

1. భద్రాయురభ్యుదయము, ఆ-1, ప : 83.

* "నానానన నానున్నన
నూనను నిన్ననెను నేను నున్ను నినిననై
నానీనను నానానును
నాన్నూన యనంగా" నొంటి యక్షరమయ్యెన్.[1]

కామినేని మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలో ఇలాంటి కందముంది.

* నానాన నేన నిన్నే
నేనెన్నిన నెన్ననున్న నేనానైనా
నానో నానన నేనను
నానన నీనాన ననిన నానున్నేనీ![2]

ఏకతవ్యంజనాదులను సంస్కృతంలో చిత్రప్రహేళిక లంటున్నారు. చిత్రప్రహేళిక చిత్రకవిత్వంలో అంతర్భాగమే.

* రరో రరే రరరురో రురూరూరు రురోరరే
రేరే రీరా రరరే రారే రారిరి రారిరా॥[3]

* మామా మమా మమే మమేమామా
మామూ మామే మమే మమే
మామా మేమి మిమే మామ
మమో మామ మమా మమీ॥[4]

పిల్లల మాటల్లో ఇలాంటి కొన్ని చమత్కారాలు వినిపిస్తుయి. "నేనిన్న నను, నిన్ననన్నా, నన్నన్ననూ నిన్ననను, మామామమీమామ, మా మమ్మీ మీ మమ్మీ, చిచ్చ చిచ్చే చీచా, చిచ్చు చొచ్చె, కుక్క కుక్కే కొక్కు కొక్కే (పందికొక్కు), కాకి కాకే కేకి కేకే, క్కక్కా (కాకా = చిన్నాన్న) కుక్క కక్కి

---

1. అప్పకవీయము, ఆ-4, ప : 564.
2. షట్చక్రవర్తి చరిత్ర, ఆ-3, ప : 105.
3, 4. ప్రహేళికలు, ప్ర, పు : 92, 93

కక్కి కుక్కె (చచ్చె)"…. ఇలాంటి ఏకాక్షర వాక్యాలే పరిణతి చెంది, ఏకాక్షరి పద్యనిర్మాణానికి మూలాలైనాయి.

**3-15 : ద్వ్యక్షరి :** పద్యంనిండా రెండే హల్లులుంటాయి. అవే మాటి మాటికి వస్తూంటాయి. ఇలాంటి పదాల్ని వాక్యాల్ని, పద్యాల్ని చిత్రప్రహేళిక లుగా, వినోద ప్రహేళికలుగా పరిగణించవచ్చు.

* కొలకులలో కలికి కులాల కలకలలు కిలకిలలు
* కేశా కూళులలో కేళుల కలకలలు

ఇవన్నీ వినోదం కొరకుపయోగించేవే. అప్పకవి ద్ర్యక్షరికి ఈ పద్యాన్ని ఉదాహరించాడు.

* మునినామా మమ్మును మన
  మన నూనిన నేమమునను మొన మాననను
  న్మనుమని మననము మన్నన
  ననుమానా నామునినయనం ద్వ్యర్ణమగున్.[1]

షట్చక్రవర్తి చరిత్రంలోని ఈ కింది పద్యం ద్వ్యక్షరే; చిత్రప్రహేళికే.

* వేదపదా వదవాద వి
  వేదే దేవాదిదేవ విద్వద్వేదీ
  వాదీ దేవీ దేవ వి
  వేదే వేదుద్దు విద్దివే వేదావే [2]

పారిజాతాపహరణాది ఆంధ్ర కావ్యాల్లోనూ ద్వ్యక్షరి పద్యాలున్నాయి

* మనమున ననుమానము నూ
  నను నీ నామమును మననమును నేమ

1. అప్పకవీయము, ఆ-15, ప : 565.
2. షట్చక్రవర్తి చరిత్ర, ఆ-3, ప : 107.

మ్మన మాన నన్ను మన్నన
మనుమను నానామము నీన మానానూనా.[1]

సంస్కృతంలోనూ ద్వ్యక్షరులున్నాయి. వాటిలో వాటిని చిత్రప్రహేళి కలంటూనే ఉన్నారు.

* కాలే కిలా లొకి కైక కోల కాలాల కేలల
కలికాకోల కల్లోలాకుల లోకాలి లాలికా[2]

పిల్లలకు వినోదాన్ని పంచాలని, భాషా పాటవాన్ని పెంచాలని కొన్ని తెలుగు పత్రికలు, కొన్ని చిత్రపదాల్ని చిత్రప్రహేళికల్ని సృష్టిస్తున్నాయి

**3-16 : త్ర్యక్షరి :** పద్యంలో కేవలం మూడు హల్లులే ఉంటాయి అప్పకవి త్ర్యక్షరి లక్ష్యలక్షణాలకి కింది పద్యాన్నిచ్చాడు.

* మానిత మతితో మమతను
నీ నామము నేమమునను నేనుమనమునన్
నూనమున మతము మానను
దానకముగ దలతుననగ త్ర్యక్షరి యయ్యెన్[3]

తెనాలి రామకృష్ణ కవిదిగా బహుళ ప్రచారంలో ఉన్న ఈ చాటువు త్ర్యక్షరే. ఇది సీసం. మొదటి పాదంలాగా మిగతా మూడు పాదాలు, గీతం ప్రథమపాదంలాగా మిగతా మూడు పాదాలూ ఉన్నాయి. అందువల్ల ఆ రెండు పాదాల్నే ఇస్తున్నాను.

* మేక తోకకు మేక తోక మేకకు తోక
మేక తోకా మేక తోక మేక (1 + 3 పాదాలు)
మేక తోక తోక మెకమేక తోక మేక[4] (1 + 3 పాదాలు)

---

1. పారిజాతాపహరణము, ఆ-౫, ప : 67.
2. ప్రహేళికలు, ప, పు : 94
3. అప్పకవీయము, ఆ-4, ప : 566
4. తెనాలి రామకృష్ణకవి హాస్య కథలు, పు : 20

ఇది ఏక పాదే; అర్థభేదం లేదు. మేకల గుంపును తెలువుతున్నది; త్ర్యక్షరబద్ధం; అందువల్ల త్ర్యక్షరికిది ఉదాహరణంగా స్వీకరించడం జరిగింది.

**3-17 : ఇచ్ఛావాక్య సంఘట్టనం :-** అప్పకవి చెప్పిన చిత్ర కవిత్వం పేర్లల్లో ఇది చివరిది. ఇచ్చిన పద్యాల్ని అర్థవంతంగా కూర్చి చెప్పడం దీని ప్రత్యేకత. అప్పకవి తోట, తాట, పేట, ఆట అనే పదాల్ని ఒక పద్యంలో కూర్చాడు. అవధానాల్లోని దత్తపదికి దీనికి భేదం లేదు.

* తోటలు లెస్సెయున్నవి
తాటాదూటములు గాపు తాపసులుండన్
బేటలు దామోదరు చె
ల్లాటలపు న్నెళవులు మధురాపురి చెంతన్.[1]

ఇచ్చిన పదాలు చెదరకుండా కోరిన విషయాన్ని కోరిన పద్యంలో చెప్పడం దత్తపది ప్రత్యేకత. "గోలకొండ, పూలదండ, కొత్తకుండ, మాలముండ" అనే ఈ పదాల భారతార్థంలో ప్రాచీనాంధ్ర కవులు, రామాయణార్థంలో ఆధునికులు కూర్చిన తీరు పరిశీలిద్దాం.

* ఓయి కురు రాజ[2] నీ కొడుకెత్తు గోల
కొండవలెనుండు వినుమాల ముండదికను
ఖండ నంబున గెల్పించు పాండు సుతుల
ఉరమునను[3] పూలదండ రేకొత్త కుండ[4]

* నీనాథుండన గోలకొండపగిదిన్నెంతేనుండు న వ్వారితో,
నీ నాడంబుధి దాటవచ్చు వెఱుగండే మందునా రాఘవో
ర్వీనుండిప్డెద పూలదండపయి పై రే కొత్త కుండంగగె
ట్టానన్‌రా మన మాల ముండ దనువెట్లో తెల్పు మండోదరీ.[5]

---

1. అప్ప కవీయమే, ఆ-4, ప : 567
2, 3. (పా) ధృతరాష్ట్ర, ఉదరమున
4, 5. కొప్పరపు సోదర కవుల చరిత్ర, పు : 61

అప్పకవి చెప్పిన చిత్ర కవిత్వ లక్షణాలన్నీ పొడుపు కథల్లోలేవు. కొన్ని లక్షణాలు పొడుపు కథలకు పనుతున్నాయి కొన్ని లక్షణాలకు ఛాయా మాత్రంగా లక్ష్యాలున్నాయి. కొన్నిటికి అటు నిటుగా తలో తోకో పెరిగి ఉన్నాయి. పొడుపు కథే చిత్రాతి చిత్రమైనదైనప్పుడు సర్వం అప్పకవి లక్షణాలకే కట్టుపడి ఉండాలనే నియమమేమీ లేదు సంస్కృత ప్రహేళికలననుసరించిన కొన్ని తెలుగు పొడుపు కథల్ని కూడా చిత్ర కవిత్వం కింద సమీక్షించే అవకాశముంది.

## 7-4 : ప్రహేళికలు

దండికావ్యా దర్శంలో ప్రహేళికలు పదహారన్నారు; ఈ పదహారు భేదాల్ని చెప్పి వారు ప్రయోజనాల్ని కూడా వివరించారు. అందులో కొన్ని అలంకారాల కిందికే వస్తాయి. మరికొన్ని సంస్కృత మర్యాద ననుసరించి తెలుగులో కుదురుకోక కుదురుకొన్న కొన్నిటిని ఈ ప్రహేళికల శీర్షిక కింద పరిశీలిద్దాం.

**4 1-: సమాహిత :-** పద సంధివల్ల గూఢార్థం వస్తుంది; ప్రకృతార్థ గ్రహణానికి దానివల్ల ఆటంకం కలుగుతుంది. సంధి విచ్ఛేదం జరిగాక అర్థం సులభంగా తెలిసి పోతుంది.

* ఒగాయన అంగడి కెళ్లిండు
ముప్పయి మూడు కొబ్బరి కాయలు కొన్నడు
ముప్పయిమూడు పోగోట్టుకొన్నడు
ముప్పయితో ఇంటికొచ్చిండు

ముప్పయిమూడు పోగోట్టుకొన్నాడు; ముప్పయితో ఇంటికి వచ్చాడు; లెక్కలో ఏదో తప్పుందనిపిస్తుంది. అయితే ముప్పు + అయి అని సంధి విచ్ఛేదం చేసుకోవాలి అప్పుడు ప్రమాదం జరిగి మూడు పోగా ముప్పయితో ఇంటికి వెళ్లాడని తేలుతుంది. ఇలా సంధి విచ్ఛేదం వల్ల సాధించిన తెలుగు సమస్యా పూరణాలన్నీ ఈసమాహిత కిందికే వస్తాయి.

"గరుడుడు గణపతికి తండ్రి గావలెజుమ్మీ!"[1] సాగరుడు + ఉడుగణ పతికి తండ్రి గావలెజుమ్మీ!.... అని చెప్పుకోవాలి. నక్షత్ర గణాలకధిపతి చంద్రుడు. ఆ చంద్రుడునికి సాగరుడు తండ్రి.

"మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియన్ దేగదే!"[2] నీళ్లు వేవేగ తెమ్మం + అంచు + ఆలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియన్ దేగదే![2] .... సంధి విడదీయడం వల్ల గుంజల కాపులను బిగియించెననే అర్థం వచ్చింది. ఇటు వంటి వాటిలో పద సంధి కారణంగానే అర్థ గూఢత్వ మేర్పడు తుంది. అందు వల్ల వీటని సమాహిత ప్రహేళికలనవచ్చును.

**4-2 : ప్రముషిత :-** దుర్బోధార్థ పదావళి ఉంటే అది ప్రముషిత ప్రహేళిక. అప్పకవి చెప్పిన ఏకపాది కూడా ఈ కోవలోకే వస్తుంది. అయితే ప్రముషితలో ఏక పాది ఉండాలనే నియమమేమీ లేదు. విపుల పాండితీ ప్రకర్షకు మాత్రమే సాధ్యమయ్యే శబ్దాల కూర్పు ఈ పద్యాల్లో ఉంటుంది. తెలుగు సాహిత్యంలో ప్రముషిత ప్రహేళికల లక్షణాలున్న పద్యాలు కోకొల్లలుగా పుట్టినై. ఇవి ఎక్కువగా ప్రబంధాల్లోనూ, చాటు పద్యాల్లోనూ ఉన్నాయి.

---

1. హరుడు గణపతికి బోలెన్
సరసీ జాక్షుండు నాభి జన్మునికి బలెన్
గురు కీర్తి గన్నయా సా
గరుడుడు గణ పతికి తండ్రి గావలె జుమ్మీ!

—కొప్పరపు సోదరకవుల చరిత్ర, పు : 26

2. కుంచాలన్ గొలిపించి యిచ్చిలినిగా గుగ్గిళ్లకై యుల్వలన్
గంచాలందిడబోకు మన్నమిపు డెక్కన్ బోదు సంహార పా
వంచాలండిగి దప్పిగొన్న విర, సుబ్బా! నీళ్లు వేవేగ దె
మ్మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మాబిందియన్దేగదే!

— శతావధానసారము, పు : 139

* నరసింహ కృష్ణరాయని
కరమరుదగు కీర్తి వెలసె కరిభిద్గిరిభిత్
కరికరి భిద్గిరిగిరి భిత్
కరిభిద్గిరిభిత్తురంగ కమనీయంబై [1]

ఈ పద్యానికో కథఉంది. రాయల ఆస్థానంలోని పండితులనోడించాలని కుంభకోణం కవి వచ్చాడు. రామకృష్ణుడేమో అసలే వికటకవి. సేవకుని వేషంతో వెళ్లి కుంభకోణం విడిది చేసిన ఇంటి ఆరుగుమీద కూచొని ఓ పద్యం చదివాడు. తాను రామకృష్ణుని సేవకుణ్ణన్నాడు. మరో పద్యం చదవాల్సిందని కుంభకోణం కోరాడు అప్పుడి పై పద్యం చదివాడు. అర్థ వివరణం కూడా చేశాడు. సేవకునికే ఇంత పాండిత్యం ఉంటే ఆ మహాకవికి ఇంకెంత ఉండాలని రాత్రికి రాత్రే ఎవరికీ చెప్పా పెట్టకుండా ఉడాయించాడు ఇంతకూ ఆ పద్యానికి రామకృష్ణుని అర్థం ఇది.

"నరసింహ కృష్ణరాయల: తుళువ నరసింహ రాయలయొక్క కుమారుడైన శ్రీకృష్ణ దేవరాయల, కీర్తి-కీర్తి, కరిభిత్: గజాసురుని సంహరించిన శివుని వలెను, గిరిభిత్కరి = పర్వతములను పిండి పిండి చేసిన ఇంద్రుని వాహనమైన ఏనుగయగు ఐరావతమువలెను, గిరిభిత్కరిభిత్తురంగ: ఈశ్వరుని యొక్కయు, ఇంద్రుని యొక్కయు వాహనములగు గోవృషభ ఉచ్చైశ్రవముల వలెను, కమనీయంబై వెలసె మిక్కిలి తెల్లని కాంతి కలిగియున్నది."[2]

చాటువుల్లోనూ, కావ్య ప్రబంధాది గ్రంథాల్లోనూ ఇంత మాత్రం అర్థకాఠిన్యమున్న పద్యాలు కనిపిస్తూనే ఉన్నాయి. ఒకటి రెండు మాత్రం ఉదాహరిస్తా.

* అబ్జముఖీ మనోజ! నరసాధిపనందన కృష్ణ! నీయశం
బబ్జకరాట్ట నయనాబ్జ విలాసము, నీ పరాక్రమం

---

1. 2. తెనాలి రామకృష్ణకవి హాస్య కథలు, పు : 81

బజ్జకరాబ్జ జాబ్జ నయనాబ్జ విలాసము, నీ గుణాధికం
బజ్జకరాబ్జ జాబ్జ నయనాబ్జ విలాసము చిత్రమారయన్[1]

* శ్రీ కమనీయ పుణ్యశబరీ కబరీ నివిరీస మాలికా
శీకబళీ కృతాంఘ్రి యుగళీ యుగళీ యుగవేదలోకపా
శీక బలానిలాస్థ కదళీ కదళీ కదళీక వైఖసే
నాకుల రుద్ధనాక రఘునాయక భక్తవర ప్రదాయకా[2]

* వీర రసాతిరేక రణవిశ్రుత వేమ నరేంద్ర! నీ యశం
బారభమాన తారకరహార విలాసము, నీ భుజామహం
బారభమాన తారకరహార విలాసము, నీ బలాధికం
బారభమాన తారకరహార విలాసము చిత్రమిద్ధరన్[3]

**4 3 : సంఖ్యాత :** ఒకటి రెండు మూడంటూ సంఖ్యావాచకాలద్వారా అక్షరాల్ని నిర్దేశించాలి; వర్ణగణనముండాలి. సంఖ్యలద్వారా సిద్ధించిన పదాలకూర్పు విడుపుగా భాసిస్తుంది.

* ఒక్కపురము పేరొప్పు నైదక్కరముల
మొదటి మూడును వత్సరమునకు పేరు
చివరి రెండును వీథికి జెల్లు, వేణి
యగు ద్వితీయాంతముల జెప్పుడాపురంబు[4]

విజయవాడ పురం పేరు; అయిదక్షరాలున్నాయి; మొదటి మూడు విజయ సంవత్సరం; చివరి రెండు 'వాడ' వీథి పేరు; ద్వితీయాంతములు జడ-

1, 2, 3. పొడుపుకథలు. పు : 50

4. పొడుపుకథలు, పు : 19

వేశికి తెలుపు పేరు. ఇందులో వర్ణ గణనముంది. వర్ణగణనం ద్వారానే సమాధానాలు వచ్చినై. పూర్తిగ సంఖ్యలే చెప్పి ఒకే ఒక్క సమాధానాన్ని ఈ క్రింది పద్యం సాధించింది.

* పదిపదములారు కన్నులు
వదనంబులు మూడు, మూడు వాలంబులతో
చదునైనచోట దిరిగెడు
నెదొ చెప్పెడివాడు జాణ యిమ్మహిలోనన్[1]

దీనికి నాగలి విడుపు. నాగలికి కట్టిన రెండు పశువులవి, మనిషివి కలిపి పది పాదాలు; మూడు ముఖాలు; పశువులవి రెండు తోకలు నాగలి మేడితోక ఒకటి మొత్తం మూడు తోకలు. ఈ క్రింది పొడుపు పద్యాలుకూడా సంఖ్యాత ప్రహేళికలే.

* ఒక్క ఉద్యోగి పేరు నాల్గక్షరములు
మొదటి వర్ణంబు తెలిపిన కదనమగును
మూడవది తెలుపగ హస్తమునకు తెల్లు
అట్టి యుద్యోగి ఎవ్వడో అరసి చెపుడు[2] (కరణము)

* అక్షరత్రయంబు నలరారు భార్యగా
నడమి యక్షరంబు విడచి చదువ
భర్తయగుచు నలరె భళిభళీ చిత్రంబు
దీని భావమేమి తిరుమలేశ![3] (పడతి)

చిత్రమే మరి! అందువల్లనే ఈ సంఖ్యాత ప్రహేళికలు చిత్రకవిత్వంలో చేరినై.

1. వయోజన విద్య, మూడవ వాచకము, పు : 26
2. పొడుపుకథలు, పు : 19
3. తిరుమలేశ శతకము, ప ; 12.

**4-4 : నామాంతరిత :** ఏదైనా ఒక నామ విశేషాన్ని ప్రకటించాలి; దానిద్వారా ఓ పేరు విడుపుగా బహిర్గతం కావాలి; అదీ నామాంతరిత.

* ఆలినొల్లక యున్న వానమ్మ-మగని
నందు లోపలనున్న వానక్క మగని
నమ్మినాతని జెరుచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్ల కరుణతోడ[1]
(సిరులు దయచేసి మిమ్ము రక్షించుగాక)

ఆలినొల్లనివాడు భీష్ముడు, భీష్ముని అమ్మ గంగ; గంగ భర్త సముద్రుడు; సముద్రంలో ఉన్నవాడు మైనాకుడు. మైనాకుని అక్క పార్వతి; పార్వతి మగడు శివుడు; శివుని నమ్మినవాడు రావణుడు: రావణుణ్ని చెరచినది సీతాదేవి; సీతాదేవి తల్లి భూమి; భూమి సవతి లక్ష్మి; ఆ లక్ష్మీదేవి మీకు సంపదలిచ్చుగాక. లక్ష్మీదేవి నామమును అంతర్హితం చేసి ఇన్ని వివరాలిచ్చింది కాబట్టి ఇది నామాంతరిత.

* తండ్రికొడుకులొక్క తరుణిని రమియింప
పుత్రులిద్దరొంది పోరుగలుగ
నొకనిజంపి రాజ్యమొకనికిచ్చిన ప్రభు
వాతడిచ్చు మాకు నఖిల సిరులు[2]

సూర్యుడు యముడు తండ్రి కొడుకులు. వీరు కుంతీదేవిని పొందారు, అందువల్ల కర్ణుడు ధర్మరాజు కలిగారు. కర్ణుని చంపి ధర్మరాజుకు రాజ్యమిచ్చిన ప్రభువు శ్రీకృష్ణుడు. ఆ ప్రభువు మాకు అఖిల సంపదలిస్తాడు. ఇక్కడ శ్రీకృష్ణుని నామ ప్రకటన నిమిత్తం కొన్ని సంఘటనల్ని సంయోజించడం జరిగింది. "మామను సంహరించి ..., మనసిజు మామ మామ " లాంటి పద్యాలు నామాంత

1. పెద్ద బాలశిక్ష, పు : 90
2. పొడుపుకథలు, పు ; 21

ఠిత ప్రహేళిక కి అయితే విడుపుల శృంఖలాల వల్ల ఇవి పరిహారికలని భావించే అవకాశం ఎక్కువ.

**4-5 : నిభృత :** ప్రకృతా ప్రకృతాలతుల్యధర్మ ప్రతిపాదనంచేయాలి. ఆ చేసే శబ్దం (వాణి) ప్రకృతార్థగోపనం చేయాలి. అంటే ప్రకృతమున్నా అప్రకృతార్థాన్నే వెలగక్కాలి. పొడుపుకథకున్న ప్రధాన లక్షణమే ఇది.

* ఒక్కచోటనుండి యొకచోట కెగురును
పక్షియంచు మదిని భ్రాంతిపడకు,
దాన, కష్టముండె దండి సుఖంబుండె
దీని భావమేమి తిరుమలేశ![1]

ఒకచోట నుండి మరోచోటు కెగిరేది పక్షి, కాని అది అని భ్రాంతిపడకు, కష్టసుఖాలున్నాయి అందులో అంటూ మార్గ నిర్దేశం చేయటం జరిగింది. దానితో విడుపు "ధనం" అని తెలింది.

* రెండు వాడి కొమ్ములుండు నెద్దునుగాదు
అన్నమడుగబోదు ఆర్తిగనదు
మనము చెప్పినట్లు మంచిగా బరుగెత్తు
దీని భావమేమి తిరుమలేశ![2]

వాడికొమ్ములనగానే ఎద్దు అనుకొంటాం. కాని అన్నమడుగదు - ఆర్తి గనదు అనగానే మరేమిటో ఉంది అనుకొంటాం. మనము చెప్పినట్లు.... అని పాదార్థంతో అది సైకిలు" అని తెలిసిపోతుంది.

ఈ రెండు పొడుపు పద్యాల్లో ధనానికి తుల్యధర్మం పక్షిలో, వాడి కొమ్ములకు ఎద్దులో ఉందని గ్రహిస్తాం. కాని అవి కావని తెలిసి అన్యార్థంచేత, ప్రకృతార్థ గోపనం జరిగిందని భావించి ప్రకృతార్థాలైన విడుపులవైపు పరుగెత్తడం జరుగుతుంది.

---

1, 2. తిరుమలేశ శతకము, ప : 4, 3.

**4-6 : పరిహారిక :** ప్రహేళికకు పరిహారికకు ఆకార సామ్యముంది; అర్థసామ్యముంది. యౌగిక శబ్దాల పరం పరనుండి విడుపు పుట్టి ఆశించిన అర్థాన్ని సిద్ధింప జేస్తాయి. నామాంతరిత ప్రహేళికలోనూ అనేకార్థ ప్రకల్పనమున్నా అక్కడ విడుపులు శృంఖలవలె రావాల్సిన అవసరంలేదు. ఇందులో మాత్రం యోగరూఢ శబ్దాల నుండి సిద్ధించిన పరిహారం తప్పనిసరి. అయితే తెలుగు పద్యాలనిండా యౌగిక శబ్దాల శృంఖల కనిపించదు; కథార్థం అన్యశబ్దాలు కూడా అందులో చోటు చేసుకొంటాయి. కొంత శృంఖల మాత్రం ఉంటుంది. పరిహాసం నిండిన ఈ క్రింది పొడుపు పద్యాలన్నీ పరిహారికా ప్రహేళికలే.

ఓ మహా పండితుడు తన పాండిత్య ప్రగల్భంతో ఇతరుల్ని హేళన చేసేవాడు. ఓ రోజు ప్రయాణం చేసి అలసిపోయి ఓ యింటి అరుగుమీద కూచున్నాడు. తన తమలపాకుల సంచిలోని వక్కలాకులు తీశాడు. సున్నం లేదు; ఆ యింటిలోని యువతిని చూస్తూ తన సహజ ధోరణిలో ఇలా అడిగాడు.

* పర్వత శ్రేష్ఠ పుత్రికా పతి విరోధి
అన్న పెండ్లాము అత్తనుగన్న తండ్రి
పేర్మి మీఁరిన ముద్దుల పెద్ద బిడ్డ!
సున్నమించుక తేగదే సుందరాంగి![1]

పర్వత శ్రేష్ఠుడు హిమవంతుడు; అతని పుత్రిక పార్వతి; ఆమెపతి ఈశ్వరుడు; అతనికి విరోధి మన్మథుడు. అతనియన్న బ్రహ్మ; ఆయన పెళ్లాం సరస్వతి; ఆమె అత్త లక్ష్మి; ఆమె తండ్రి సముద్రుడు; సముద్రుని పెద్ద బిడ్డ పెద్దమ్మ, అంటే దరిద్ర దేవత.

'ఓసి పెద్దమ్మా! సున్నంతేవే!' అన్నాడతను. ఆ యువతి కూడా తక్కువేం తినలేదు; పండిత కుటుంబంలో పుట్టింది; అందుకే ఇలా చురకలు పెట్టింది.

---

1, పొడుపు కథలు, పు : 53,

* శత ప తంబుల మిత్రుని
సుతుజంపిన వాని బావ సూనుని మామన్
సతతము దాల్చెడు నాతని
సుతువాహన వైరి వైరి! సున్నంబిదిగో![1]

శతపత్రాల మిత్రుడు సూర్యుడు; అతని సుతుడు కర్ణుడు; వాణ్ని చంపినవాడు అర్జునుడు; అతని బావ కృష్ణుడు; అతని సూనుడు మన్మథుడు; వాని మామ చంద్రుడు; అతనిని దాల్చిన వాడు శివుడు; అతని కొడుకు వినాయకుడు; వినాయకుని వాహనం ఎలుక; దాని వైరి పిల్లి; దాని వైరి కుక్క:

ఇంతకూ ఆమె ఏమంది! "ఓరి కుక్కా! ఇదిగో సున్నం" అంది.

తెలుగు సాహిత్యంలో లెక్కలేనన్ని పరిహాస కాంకురాలు పుట్టినై; పెరిగినై; వికసించినై. ఆ విషయాలు ఉత్పత్తి - వికాస ప్రకరణంలో కొంత మేరకు ప్రస్తావించడం జరిగింది. ఇప్పుడు పొడుపు విడుపుల్లో కొన్ని విచిత్రాలు పరిశీలిద్దాం.

## 7-5 : పొడుపులు విడుపులు విచిత్రాలు

ఇంతవరకు అప్పకవి చెప్పిన చిత్ర కవిత్వ లక్షణాల్ని అనుసరించి కొన్ని పొడుపు కథల్ని, సంస్కృత ప్రహేళికల్ని అనుసరించి మరికొన్నిటిని అనుశీలించడం జరిగింది. ఈ శీర్షిక క్రింద పొడుపుల్లో విడుపుల్లో సర్వసాధారణంగా కనిపించే విచిత్రాల్ని పరిశీలిద్దాం. సంస్కృతంలో ఈ విచిత్రాలన్నీ శ్లోకాల్లోనే కనిపిస్తున్నాయి. అచ్చుకునోచుకొన్న శ్లోకాలే దొరుకుతుండడం కూడా దానికి కారణం కావచ్చు. దైనందిన జీవితంలో ఆ భాష వ్యవహారంలో ఎక్కువగా లేక పోవడం కూడా కారణం కావచ్చు. తెలుగు పొడుపు పద్యాల్లో, విడుపుల్లో వినూత్న విచిత్రాలు కనిపిస్తున్నాయి. సంస్కృత లక్షణానికి కొన్ని తెలుగు పొడుపులు పట్టక పోవచ్చు; కొన్ని వినూత్నంగా కనిపించవచ్చు. అవన్నీ ఈ శీర్షిక కింద విశ్లేషించే ప్రయత్నం చేస్తాను.

---

1. పొడుపు కథలు, పు : 54

**5-1 : అద్యుత్తరం :** రెండు మూడు ప్రశ్నలకు ఒకే ఉత్తర ముండడం, అది కూడా శ్లోక ప్రారంభంలోనే ఉండడం సంస్కృత మర్యాద. తెలుగులో అలా గాక విడుపుల్లోని ఆది పద్యాల్లో, పొడుపు పద్యంలోని పదం ప్రారంభంలో, పద్య పాదాది శబ్దంలో ఉండడం, అలా ఉండాలని నిర్దేశించడం సర్వసాధారణంగా కనిపిస్తుంది. ఉత్తరం ఎక్కడ ఉన్నా ప్రారంభంలోనే ఉంటుంది కాబట్టి దీన్ని అద్యుత్తర ప్రహేళిక అనడం సమంజసం.

| | |
|---|---|
| * వానర బలమెల్ల వార్ధి యేమిట గట్టె | (గుండ్లు) |
| వైరులు పై కెత్తు వడువు నేది | (డాలు) |
| అంబుధి దరువగా నందు బుట్టినదేమి | (లక్ష్మి) |
| అవని యహల్య నేమగుచు బడియె | (రాయి) |
| హరి పవ్వళించిన ఆకు వృక్షంబేమి | (మఱ్ఱి) |
| పశుపతినేతీరు ప్రజలు గనిరి | (లింగం) |
| శంభుని జడలోన చెలగినిలచినదేమి | (గంగ) |
| ఆననంబునకేమీ అందమయ్యె | (ముక్కు) |

అన్నిటికి జూడ రెండేసి యక్షరములు
ఆది మాత్రం యందున హర్షముగను
కలుగ గుండాల రాముంతు కరుణతోడ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు![1]

విడుపుల అద్యంరాల ద్వారా సమాధానం సాధించడం జరిగింది. పద్యంలోని కొన్ని పదాల అద్యంరాల ద్వారా ఉత్తరం సాధించడం ఈ క్రింది పద్యంలోని విశేషం.

---

1. శ్రీ కపిలవాయి లింగమూర్తి వ్రాత ప్రతి.

* గంటమందునుండె గంధంబులో నుండె
గండ మందునుండె గంట నుండె
గంట నున్న మూర్తి గడియారమున లేదు
దీనిభావమేమి తిరుమలేశ![1] (గం)

ఈ కింది సీస పద్యంలోని ప్రతి అర్ధ పాదానికీ, అంటే పాదంలో రెండు పర్యాయాలు ఆద్యుత్తరాలు కనిపిస్తాయి. తర్వాత రెండు గీత పాదాల్లోనూ ఇదే స్థితి ఉంది. ఆదిలోనూ, పాదం మధ్యలోనూ ఉత్తర ముండడం వల్ల దీన్ని ఆది మధ్యోత్తరమని కూడా పిలవ్వచ్చు.

* తులలేని ధనముచే తులదూగినదియేది —తుల
గిరిజామనోహరు గేహమేది -గిరి
విరివిగా తుమ్మెద విహరించుతావేది -విరి
ఓదకంబుధి దాటుచుండునేది -ఓద
కలకాల మొకరాతి కల్లయౌనదియేది -కల
శ్యామలకచలలో జాణయేదీ -శ్యామ
దివిషద్గణము నడతెంచు మార్గంబేది -దివి
కరివేల్పుగన్న మృగంబునేది -కరి
వలపుదొర టెక్కముల బట్టగలుగునేవి -వల
పలుకుదురులేక లెస్సగా జెలగదేది -పలుకు
ప్రశ్నలన్నిటికిని తొలిపదములందె
ఉత్తరములున్నవని చూచి యుల్లసిలుడు[2]

**5-2 : మధ్యోత్తరం :** ఉత్తరం మధ్యలో ఉంటుంది. విడుపులమధ్య, పాదంలోని పదాల మధ్య, పద్యంలోని పాదాల మధ్య ఉత్తరాలుంటాయి. శ్లోక మధ్యంలో రెండు మూడు ప్రశ్నలకొకే ఉత్తరముండడం సంస్కృతంలో కని పిస్తుంది. ఈ కింది తెలుగు పద్యంలో పదాలు, ఆ పదాల మధ్య విడుపు; అందుకే ఇది మధ్యోత్తర.

---

1. తిరుమలేశ శతకము, ప : 48
2. పొడుపు పద్యాలు పు : 35
(ఈ పద్యానికి చమత్కార- చంద్రికే మూలం) పు : 2.

* మమతను తానునొక్క చెలిమానిని! నీ విభునామమేనన్
కమలజగంధి బల్కె—కరి కంధి, ప్రజాపతి, చంద్రికాత ప
త్రమును ద్రివర్ణ యుక్తముగ వ్రాసిన నందుల మధ్యవర్ణముల్
క్రమముగ వ్రాసిచూడు గజ గామిని! నా విభునామమేర్పడున్ 1

'ఓ మానినీ! నీ విభుని పేరేంటని ఓ చిన్నదానిని ఒ చిన్నది అడిగింది. ఆమె మానిని; సూటిగా చెప్పడానికి అభిమానం అడ్డం వచ్చింది. చెప్పింది గాని మర్మం గప్పి చెప్పింది; విప్పుకొమ్మంది. 'ఏనుగు, సముద్రం, బ్రహ్మ, వెన్నెల, ఛత్రం' ఇవి మూడక్షరాలతో వ్రాయాలి అంది. మధ్య మూడక్షరాల్ని చూసుకొమ్మంది, అదే తన మగని పేరంది.

సారంగం - సాగరం - విధాత - కౌముది - గొడుగు
(రంగధాముడు)

ఇలా విడుపుల్లోని మధ్యాక్షరాల ద్వారా ఆశించిన సమాధానాల్ని సాధించిన పద్యాలెన్నో ఉన్నాయి. ఈ కింది పొడుపు పద్యం విడుపుల మధ్యకు తిర్మల వెంకట్రమణుడు వచ్చి చేరాడు.

* పొంచుండి రాముడు ద్రుంచెను దేనిని (కోతిని)
శంభుడు గప్పిన శాలువేది (చర్మము)
పూతనయై వచ్చి పొలియించె నెవ్వరి (బాలల)
పెద్ద రాతికి మారుపేరు నేది (గ్రావేంద్రం)
చందురుడేతీరు ముందుగా గనిపించు (వంకర)
జలజాక్షు చక్రమే చలువనుండు (వట్రము)
ఫాలాక్షు తనయుని పక్షి వాహనమేది (నెమలి)
హరియేమియై పురాలవని గూల్చె (బాణమై)

1. పొడుపు కథలు, పు : 21

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయముగాను
తిరుమలేశుండు నెప్పుడు స్థిరముతోడ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు [1]

విడుపుల మధ్య సమాధానమే కాకుండా పద్యంలోని పదాలన్నిటి మధ్య నున్న అక్షరాలన్నీ విడుపులే అవుతాయి. ఈ కింది పద్యం గమనించండి.

* పొలము హలమునందు బలములో కలములో
జలము చలములోన వెలసియున్న
మధ్యమూర్తి మనకు మహిలోన కనరాదు
దీని భావమేమి తిరుమలేశ![2]

ఇలా మధ్యోత్తరాలు విడుపుల్లోనూ, పద్యాల్లోని పదాల్లోనూ, పద్య మధ్యంలోనూ ఉన్నాయి. అదేవిధంగా అంత్యోత్తరాలూ కనిపిస్తున్నాయి.

**5-3 : అంత్యోత్తరం :-** ఉత్తరం పదం చివరగాని, పాదాంతంలో గాని, పద్యం చివరగాని ఉంటుంది. సంస్కృత లక్షణాన్ని అనుసరించి అనేక ప్రశ్నలకు శ్లోకాంతంలోనే ఉత్తరముండాలి. తెలుగు పొడుపుకథల్లో అంత్యోత్త రాలు పదాంతాల్లోనే ఉన్నాయి సమస్యాపూరణలన్నీ పద్యాంతాలుగానే పరిగణించవచ్చు.

* పైడి, లేడి, వెండి, కాడి, మేడి, పకోడి
బండి, మొండి, కోడి, దండి, రండి
వీని చివరనున్నదే జ్ఞానిలో లేదు!
దీని భావమేమి తిరుమలేశ![3] (డి)

---

1. శ్రీ కపిలవాయి లింగమూర్తి వ్రాతపతి
2. తిరుమలేశ శతకము, పు : 73
3. తిరుమలేశ శతకము, ప : 86.

పదాంతంలోని 'డి' అనే వర్ణమే అంతోత్తరం. ఇక పద్యాంతంలోని ఉత్తరానికొక సమస్యను స్వీకరిద్దాం.

—'రాథేయుడు నందినెక్కి గావణు గెలిచెన్'.... ఈ అవక తవక సమస్యను సరిచేయాలి సరిచేయడానికి క్రమాలంకారంలో ఉత్తరమిచ్చుకోవాల్సిందే!

* యోధుడెవడు కురుబలమున?
మాధవ సఖుడేమి యెక్కి మఱి తిరుగాడున్?
సాధించె రాముడెవ్వని?
రాధేయుడు, నందినెక్కి, రావణు గెలిచెన్.[1]

ప్రశ్నలకు సమస్యలోని సమాధానాల్ని వరుసగా గ్రహించాలి. యోధుడెవడు కురుబలమున అనే ప్రశ్నకు 'రాధేయు'డనాలి; 'మాధవ సఖుడేమి యెక్కి మఱి తిరుగాడెన్' అనే ప్రశ్నకు 'నంది నెక్కి' అనే సమాధానం చెప్పాలి; 'సాధించె రాముడెవ్వని' అనే ప్రశ్నకు 'రావణు గెలిచెన్' గ్రహించాలి. పద్యాంతంలోనే సమాధానాలన్నీ ఉన్నాయి. అందువల్ల ఇది అంతోత్తరమయింది.

## 5-4 : వ్యస్త సమస్తోత్తరం :- సంస్కృత లక్షణం ప్రకారం

అనేక ప్రశ్నలకు ఒకే ఉత్తరం పద్యంలోనే కూర్చాలి. అలా కూర్చినదానిని సంస్కృతంలో అంతరాలాప మంటారు. తెలుగులో అంతరాలాపాలు తక్కువే. అయితే అనేక ప్రశ్నలకు పద్యం వెలుపల ఒకే సమాధానమున్న పద్యాలెన్నో కనిపిస్తున్నాయి.

* వాయుదేవుని వహియించు వాహమేది?
వాన చినుకుల గ్రోలెడు పక్షియేది?
చంపక పరిమళంబు సహింపనేది?
తలను ముత్యాలు గల మృగ తిలకమేది?
అన్నిటికి నొక్క యుత్తరంబమరవలయు [1]

---

1. పొడుపుకథలు, పు : 55.
1, చమత్కార చంద్రిక, పు : 9, 5

"సారంగము. ఈ శబ్దము లేడియందును, వానకోయిల యందును, తుమ్మెద యందును, ఏనుగునందును వర్తించును. వానకోయిల యనగా చాతక పక్షి, వాన చినుకులను మాత్రమే త్రాగి జీవించునుగాని నేలపడిన నీరు త్రాగదనియు, చంపకము అనగా సంపెంగయొక్క సువాసన తుమ్మెదకు సరిపడదనియు, కరికుంభములయందు ముత్యములుండుననియు చెప్పుదురు."[1]

అనేక ప్రశ్నలకు పద్యం వెలుపల పొడుపులున్నవెన్నో ఉన్నాయి. ఇవి చిత్రోత్తరాలంకారంలో ఒక భేదమైన ఉత్తరాంతరాభిన్నోత్తరం కిందికే వస్తాయి. అటు అంతరాలాపానికి, ఉత్తరాంతరాభిన్నోత్తరానికి చెందని పద్యాలు కొన్ని ఉన్నాయి. ఇందులో మూడు నాలుగు వ్యస్త ప్రశ్నలకు, మూడు నాలుగు వ్యస్తోత్తరాలుంటాయి. ఆ వ్యస్తోత్తరాలన్నీ కలిసి ఒకే ఒక్క సమస్తోత్తరంగా రూపు దిద్దుకొంటుంది. ఆ సమస్తోత్తరమూ అర్థయుక్తంగా ఉంటుంది. అందువల్ల దీనిని వ్యస్త సమస్తోత్తరమనడం సమంజసం.

* ఏనుగు సింహంబు నెలనాగయునుగూడి
యొకమాట లోపల నుండవలయు
పక్షియు వస్త్రంబు పాషాణమును గూడి
యొకమాట లోపల నుండవలయు
ఫణిరాజు, ఫణివైరి, ఫణిభూషణుడు గూడి
యొకమాట లోపల నుండవలయు
రారాజు, రతిరాజు, రాజరాజును గూడి
యొకమాట లోపల నుండవలయు
దీని యర్థంబు చెప్పగాధీనిధులకు
నెలలు పన్నెండు గడువిత్తు నేర్పుగాను
చెప్పునాతడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర![2]

1, చమత్కార చంద్రిక, పు : 58.
2. పెద్ద బాలశిక్ష : 84.

పొడుపు విప్పడానికి ఒక సం॥ం గడువు. మరిదీనిధులే విప్పాలి. ఏమగు-సింహము-ఎలనాగ (నాగ-కేసరి-ఆలు = నాగకేసరాలు) నాగకేసరాలు ఓషధి. దేనికదే వ్యస్తం, అన్నీ కలిసి సమస్తోత్తరం. పక్షి-వస్త్రం-పాషాణం (కాకి-బొంత-రాయి = కాకిబొంతరాయి) నల్లగా తెరిపెలుగా ఉండే ఒకరకమైన రాయి. ఫణిరాజు-ఫణివైరి-ఫణిభూషణుడు (నాగ-గరుడ-ఈశ్వర = నాగ గరుడేశ్వరము) నాగ గరుడేశ్వరమనేది ఒక దివ్యక్షేత్రం. రారాజు-రతిరాజు-రాజరాజు (రాజ-మదన-కుబేరము = రాజమదన కుబేరము) ఇది ఆయుర్వేద ఔషధం. మొత్తంమీద నాలుగు పాదాల్లో పండ్రెండు వ్యస్తోత్తరాలు కాగా నాలుగు సమస్తోత్తరాలు. ఇలాంటి పద్యాలు కొన్ని జనవ్యవహారంలో నేటికీ ఉన్నాయి.

**5-5 : ప్రకీర్ణకోత్తరం :–** పద్యంలో విడుపును తెలిపే అక్షరాలు పద్యంనిండా వెదజల్లబడి ఉంటాయి. అక్కడక్కడ పారవేసినట్లున్న ఈ అక్షరాలు ఒకదగ్గరికి చేర్చడం వల్ల ఉత్తరం సిద్ధిస్తుంది.

* రాఘవా! మహీ పుత్రికా రమణ! రావ
ణారి! జుహురాణప సుతావనా! యన, ప్రథ
మాక్షరావళి, యేఘనునాఖ్య యౌనొ
అట్టి మత్పతి దైవంబె యగును నాకు.[1] (రామరాజు)

శ్రీకృష్ణదేవరాయల కూతురు మోహనాంగి, మారీచి పరిణయ కావ్యం వ్రాసింది; ఆ కావ్యం అసమగ్రంగా దొరికింది. ఆమె తన భర్తనుగూర్చి చెప్పుకొన్న పద్యమే ఇది. కొన్ని పదాలు కూర్చి వాటి ప్రథమాక్షరాలు కలిపితే తన భర్త పేరు వస్తుందన్నది. ప్రకీర్ణకాలైన ఆయక్షరాల్ని కలుపగా 'రామరాజు' అనే సమాధానం వచ్చింది.

సిద్ధేంద్రయోగి భామకలాపంలోని పద్యం ఇలాగేఉంది. మాధవితో సత్యభామ ప్రాణనాథుని పేరిలా చెప్పింది.

---

1. మారీచి పరిణయము, పీఠికలోని పద్యం.

* కాకు వ్రటువ సుడిని చొక్కముగ నిల్పి
వరషవర్ణము క్రింద ణవర్ణ మెలమి
వ్రాసి తుది స్వామి పదము చేర్పంగనాదు
ప్రాణనాథుని నామ మేర్పడునె చెలియ[1]. (కృష్ణస్వామి)

**5-6 : మణి ప్రవాళం :** మణి ప్రవాళం కూడా చిత్ర కవిత్వం కిందికే వస్తుంది. ఒక అంశాన్ని స్వీకరించి రెండు భాషల పదాలతో చేసే రచన మణిప్రవాళం. తెలుగు పొడుపు కథల్లో అక్కడక్కడ ఈ శైలీ రచన కనిపిస్తుంది అయితే సంస్కృతాంధ్ర, ఆంధ్రాంగ్ల మణి ప్రవాళ శైలీ పద్యాలు తెలుగులో కొన్ని లభిస్తున్నాయి. పాల్కురికి సోమనాథుడు తెలుగువారికీ శైలిని మొదట రుచి చూపించాడు. విభిన్న భాషలతో పరిచయమున్న నేటి తెలుగు సోదరుల్లో చాలామంది మణి ప్రవాళ శైలినే అనుసరిస్తున్నారు. ఈ శైలికి రెండు ఉదాహరణ లిచ్చి పొడుపు కథల విషయం ప్రస్తావిస్తా.

* తండులాని గృహమందు వసంతి
తిండికైతే బహుమంది వసంతి
కుండలెల్ల పరితోపిలు రంతి
ముండనా కొడుకు లెల్లరుదంతి.[2]

* పోస్టాఫీసున పోస్టుచేయుటొక కార్డున్ రేపె నామాటలన్
బెస్టున్ జేయగవచ్చు స్టాప్టిమిడి యట్టీయంచు వైగిచ్చుచే
బెస్టన్నింటను వైరుమాచుకొనుచున్ వేవేగమేల్ ట్రైనులో
సేస్టార్టైనతడారణాలెకద మీకేమైన వేస్టయినచోన్[3]

పొడుపు కథే చిత్రాతి చిత్రాలకు నిలయం; మణి ప్రవాళ ప్రహేళిక మరీ విచిత్రం.

---

1. భామాకలాపము, పు : 20
2. ప్రహేళికలు, ప్ర, అనుసంహిత, పు : 15.
3. మ .... హా .... పు : 73.

* ఏకేక్ కానా - పచ్చీస్‌కానా
గూట్లో వెడ్తే - గులాబికాన (దీపం)

ఇది తెలుగు ఉర్దూ పదాల సమ్మిశ్రమ ప్రహేళిక. దీపం బుడ్డిమీద గడ్డ ఉంటుంది; గడ్డ చుట్టూ రంధ్రాలుంటాయి. ఇలా రంధ్రాలుండడాన్నే ఏకేక్ కానా (ఒక్కొక్క రంధ్రం, పచ్చీస్ కానా (ఇరవై అయిదు రంధ్రాలు లేదా ఎన్నో రంధ్రాలు) అని చెప్పడం జరిగింది. గూటిలో పెట్టినట్లయితే గులాబిలా ఉంటుందని భావించడం జరిగింది. అక్కడక్కడ అన్యభాషాపదాలు కనిపిస్తున్నాయి. ఉద్దేశ పూర్వకంగా మణి ప్రవాళశైలి పొడుపు కథల్లోకి రాలేదు. అందువల్ల ఆపదాల్ని అన్యదేశ్యాలుగానే భావించి భాషావైభవమనే ప్రకరణంలో విశ్లేషించడం జరిగింది. పూర్తి హిందీ ఉర్దు పదాలున్న ఓ పొడుపు కథ తెలుగువారి నోళ్లల్లో నానుతున్నది.

* లటు పటు సట్‌గం
తీన్‌ముండి దస్ పాంవ్ (మోట)

సట్‌గం అంటే మొత్తం; మొత్తం 'లటుపటు' అంటుందనీ, మూడు ముఖాలు పదికాళ్లు ఎద్దులవీ మనిషివీ అని భావించాలి ఇవి పద్యాలు కావు; చిత్ర కవిత్వం కోవలోకిరావు పొడుపు కథల్లో మణి ప్రవాళంగూర్చి ఆలోచించినప్పుడు ఇవే ఉదాహరణలుగా ముందునిలిచినై.

ఇంత వరకు చిత్ర కవిత్వ లక్షణాల్ని, ప్రహేళికల్లో చిత్రాల్ని, పొడుపు - విడుపుల్లో విచిత్రాల్ని అనుశీలించడం జరిగింది. చిత్ర విచిత్రాల వెనుక వినోదముందనీ భాషా వికాసముందనీ విశ్లేషించడం జరిగింది.

"ప్రౌఢ సాహిత్య విద్యా తత్త్వ వేత్తలు చిత్ర కవిత్వమును శబ్దాలంకార ప్రాయమునుండి పైకెదిగి రానీయలేదు చిత్ర కవితా ప్రధానములయిన కృతులను అధమ కావ్యములుగానే ఆలంకారికులు జమకట్టిరి. చిత్ర కవిత్వమునకు పెద్ద ప్రయోజనము నెవరును చూచినట్లు లేదు."[1]

---

1. ఆశుకవితలు అవధానములు—చాటువులు, పు : 7

నిజమే! ఎవరూ కాదనలేని సత్యాలే. కాని పొడుపు కథలు విజ్ఞాన ప్రసారానికి, మానసిక వికాసానికి తోడ్పడ్డాయి. మనసులో సంచలనాన్ని సృష్టించాయి; ఏకాగ్రత దిశను పయనించేట్టు చేశాయి.

"చిత్ర కవిత్వము చమత్కారాపాదకమగు కావ్యరచనా శిల్పము. ఇది బుద్ధి సంబంధి. సామాన్యులకును అంతగా సరసులకును సంబంధించినదికాదు. పాండితీ శౌండీర్యమును ప్రకటించు పండిత ప్రకాండుల గమ్మత్తయిన గారడీ కసరత్తుల సాముగరిడీలు ఈ చిత్రకవితారీతులు."

నిజమే పొడుపు కథల్లో గమ్మత్తులున్నాయి; కసరత్తులున్నాయి. అక్షరాకృతులున్నాయి; చమత్కృతులున్నాయి. కవుల పాండితీ శౌండిర్య ప్రదర్శనముంది. బుద్ధికి బృహస్పతులకే అందే విషయాలున్నాయి: అమాయకుణ్ణి అలరించే అంశాలున్నాయి. చిత్ర కవిత్వంతో పాటు బంధ గర్భాశుకవిత్వాలూ ఉన్నాయి.

## 7-6 : బంధ గర్భ ఆశుకవిత్వాలు

అప్పకవి చెప్పిన కవిత్వ భేదాల్ని, చిత్ర కవిత్వ లక్షణాల్ని, అన్య కవుల నియమాల్ని ఆధారంగా గ్రహించి ఇంత వరకు పొడుపు కథల్లోని వైశిష్ట్యాన్ని అనుశీలించడం జరిగింది ఇంకా బంధ గర్భ ఆశు కవిత్వాల ఛాయలు ఇందులో ఉన్నాయేమో పరిశీలించాల్సి ఉంది. బంధ-గర్భ కవిత్వాలు రెండూ చిత్రకవిత్వాంతర్భాగాలే అని చెప్పుకొన్నాం లక్షణ దీపికా కారుడు కూడా బంధ గర్భాదుల్ని చిత్ర కవిత్వంలో చేర్చాడు.

"అష్టదళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మ బంధంబులును, నవావరణ ద్వాదశావరణ చక్ర బంధంబులును, రథనాగ-ద్వినాగ-కులాల చక్ర-అందోళికా ఛత్ర బంధంబులును, గోమూత్రికా – పుష్పమాలికా- పుష్పగుచ్ఛ - మృదంగ డమరు - ఖడ్గ – త్రిశూల కంకణ, సర్వతో భద్ర, కవికల్పిత, కల్పవల్లరి నివియాదిగాగల్గు బహువిధ చమత్కారంబులు[1]" ....

1. ఆశు కవితలు అవధానములు–చాటువులు, పు : 7
2. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, పు : 15

అప్పకవికూడా బంధ కవిత్వం, గోమూత్రికా, ఛత్ర, గుచ్ఛ, కుండలి నాగ. కంకణ, మర్దల, ఖడ్గ, చక్ర, అష్టదళ పద్మాది బంధాలకన్నింటికి లక్ష్య లక్షణాలు విరచించాడు. ఎవరు చెప్పినా బంధాలన్నింటికి చిత్రాలు వేయాల్సిందే పొడుపు కథల్లో ఈ ఛాయలున్నాయేమో పరిశీలిద్దాం.

**6-1 : పొడుపుకథా బంధాలు :-** బంధ కవిత్వాన్ని చిత్రాలు వేసి చూపించాల్సిందే; అందువల్లకూడా ఇది చిత్రకవిత్వంలో భాగమనవచ్చు పొడుపుకథల్లోనూ చిత్రాలు వేసే పద్ధతి ఉంది, భావాన్ని బంధించే పద్ధతి ఉంది.

ప్రారంభ దశలోని పిల్లల పత్రికల్లోనూ, ఇప్పటి పత్రికల్లోనూ పొడుపు కథల్ని పొదుగుకొన్న చిత్రాలున్నాయి. ఓ మనిషి బొమ్మ వేస్తారు. అది కింది నుండి చూస్తే బాలునిలాగా, పైనుండి చూస్తే వృద్ధునిలాగా కనిపిస్తుంది. అట్లే మరోటి : ఒక వైపునుండి నవ్వుతున్నట్లు, మరో వైపునుండి ఏడుస్తున్నట్లు ఉంటుంది ఒకే చిత్రాన్ని భిన్నరూపాలుగా కనిపించేట్లు వేస్తారు. ఓ చెట్టుంటుంది; దాని కాండందగ్గర రెండు కన్నులుంటాయి; ఆ కన్నుల్ని ఒకదాని తర్వాత ఒకటి మూయాలి. రెండు పర్యాయాలు భిన్న దృశ్యాలు కనిపిస్తాయి. ఇవన్నీ విచిత్రాలే-వినోదాలే—మనస్సుకు వికాసాలే.

బొమ్మల ఆధారంగా పిల్లలకు విజ్ఞానాన్ని అందించే పద్ధతి ఒకటి ఉంది. కోటల్లో, పేటల్లో దాగిన మనుషుల్ని. జంతువుల్ని, వస్తువుల్ని సూక్ష్మ పరిశీలనతో తెలుసుకోవాలి. అవన్నీ తెలుసుకొంటే ఆ సంబంధి కథా పరిజ్ఞానం కలుగుతుంది. ఆసక్తితో పాటు అభిరుచి పెరుగుతుంది. బొమ్మల్లో బంధించిన కథ తెలిసిపోతుంది.

ఓ చెట్టుంది: దానికి కొన్ని ఆకులున్నాయి; ఆ ఆకులమీద కొన్ని అక్షరాలున్నాయి. ఆ అక్షరాల్లో దాగినవారిని కనుక్కోవాలి. ఈ చెట్టుబొమ్మ అలాంటిదే.



న ర

— కా

ధే ను

— సురుడు

శ క టా

బా ణా

రా వ ణా

ఈ చెట్టు ఆకుల్లో కొన్ని అక్షరాలున్నాయి; అవి అయిదుగురు రాక్షసుల పేర్లు. మొత్తం 29 అక్షరాలు. కాని సు,రు,డు,కా,ణా, అనే అక్షరాలు బహుళ ప్రయోజనాన్ని సాధించిపెట్టాయి. ఇవి బంధ కవిత్వంలోని గోమూత్రికాది బంధాల్లో మూడు, నాలుగు పాదాలకుపకరించే ఒకే అక్షరాలవంటివి. అక్షరాల సామాన్యీకరణం కారణంగా 29 అక్షరాలకుగాను 15 అక్షరాల్లోనే సమాధానాలు

వచ్చేశాయి. చిత్రకవిత్వం ఛాయతో ఉన్న ఇలాంటి వాటిని పొడుపుకథా బంధాలనవచ్చు.

చాలాకాలం నుండి కొన్ని పత్రికలు ఈ పదాల దాగుడుమూత లాటలు కొనసాగిస్తున్నాయి. పదావళుల్ని (ఫజిల్సును) ప్రచురిస్తున్నాయి. నిర్దిష్టంగా కూర్చుకొన్న గళ్లల్లో కొన్ని అక్షరాలిచ్చి, అడ్డం నిలువు ఆధారాలిచ్చి సమాధానాల్ని ఆశిస్తారు. ఒక పదావళి మాత్రముదాహరిస్తా.

| | | | | |
|---|---|---|---|---|
| 1 అ | డ | వి | | 2 శ |
| | | జ | | |
| 3 వి | సా | య | క | ట |
| | | వా | | |
| | * | డ 4 | | |

ఈ ఒకటి, రెండు, మూడు, నాలుగు సంఖ్యలకు అడ్డం, నిలువు, మధ్య నిలువు (ఉంటే) అని ఆధారాలిస్తారు. ఈ పై గళ్ళకట్టుకు ఆధారాలిలా ఉన్నాయి.
1 అడ్డం : దట్టంగా చెట్లుండే పిలువబడుతుంది (అడవి), మధ్య నిలువుకు ఆదొక ఆంధ్ర నగరం (విజయవాడ , ఈ ఆధారాల్ని బట్టి పాఠకులు సమాధానాలు వ్రాసి పంపిస్తారు. ఆ తర్వాత నిర్ణీత సమయానికి పత్రిక నిర్వాహకులు వీటిని ప్రచురిస్తారు. ఈ సమాధానాలతో గళ్లు నిండిపోతాయి.

* బాలభారతి, మాసపత్రిక, 1980 ఆగష్టు.

పై గళ్ళ సమాధానాలు : 1 అడ్డం-అడవి; 3 అడ్డం-వినాయకుడు; 4 అడ్డం-దబ్బులు, 2 నిలువు-శివుడు, 3 నిలువు-విషము, మధ్య నిలువు-విజయవాడ.

ఈ పద్ధతుల్ని చాలా పత్రికలనుసరిస్తున్నాయి, కొన్ని కొత్తపుంతలు తొక్కుతున్నాయి. కొన్ని పత్రికలైతే బొమ్మలిస్తున్నాయి, వాటి పక్కనే పొడుపు కథలనిస్తున్నాయి. ఈ పొడుపులకు విడుపులా బొమ్మల్లో ఉన్నాయి-వెతుక్కోమంటున్నాయి. మరికొన్ని పత్రికలు అక్షర జ్ఞానవిభాగం పేరిట ప్రతిమాసం కలగాపులగంగా ఎన్నో చిత్రాల నిస్తున్నాయి. ఆ చిత్రాల పేర్లను 'తి'కారాంతంగా వ్రాసి పంపండంటున్నాయి, లేదా ఏదో ఒక అంతిమాక్షరాన్ని నిర్ణయిస్తున్నాయి. ఇటువంటి వాటిని పొడుపు బొమ్మలనవచ్చు. పొడుపు పద్యాలు' పొడుపు లెక్కలన్నట్లు గానే ఈ పొడుపు బొమ్మల్ని ప్రత్యేకంగా పరిశీలించవచ్చు. అన్ని బొమ్మల్ని చూసి అన్ని పదాలు వ్రాసి పంపించడంవల్ల వినూత్న శబ్దాలు మనస్సులో నిలిచే అవకాశాలున్నాయి. ఒక నెలలోని చిత్రాలకు వచ్చిన పదాలు చూడండి!

* బంతి, కోతి, చేమంతి, పతి, శ్రీపతి,
జ్యోతి. హారతి, పార్వతి, మూతి, సరస్వతి,
గర్భవతి, న్యాయాధిపతి. కుండల దొంతి,
దంతి, భూపతి, గణపతి, చితి, నాతి,
తంతి, మారుతి.[1]

అన్ని భాషా పత్రికలీ పద్ధతుల్ని ఈనాడు అనుసరిస్తున్నాయి. పొడుపు చిత్రాలుగా (బొమ్మలుగా) వీటిని పరిశీలించినా. రేఖలకూ అక్షరాలకు, బొమ్మలకూ పదాలకూ అంతర్గతంగా ఒకానొక భావ బంధమున్నట్టు తెలుస్తుంది. ఆ దృష్ట్యా కూడా పొడుపు కథా బంధాలనింకా పరిశీలించాల్సి ఉంది. మరికొన్ని సూక్ష్మ భేదాల్ని ఈ విజ్ఞానానికి జత చేయాల్సిఉంది.

1. 1980 జులై బాల మిత్రకు ఆగష్టులోని సమాధానాలు

**6-2 : పొడుపుకథా గర్భాలు :-** పొడుపుల్లో బంధాలేవో పరిశీలించాం. పొడుపు కథల్లో గర్భకవిత్వం కూడా ఉంటుందా! పరిశీలించాలి. పొడుపు కథలకూ గర్భకవిత్వానికి పొంతనేలేదు, ఒక పద్య గర్భంలో మరో పద్యముంటుంది; ఆ పద్యంతో మరోటి మరోటి ఉండవచ్చు పొడుపు కథల్లోని పదాల గర్భంలో కొన్ని విడుపులున్నాయి. అవి ఈ గర్భకవిత్వం ఛాయల్లోకి రావు. సమాధానాలు పదాల గర్భంలో, పాదాల గర్భంలో, పద్యం గర్భంలో ఉంటాయి. అవన్నీ మధ్యోత్తరాల కిందికే వస్తాయి. సుదీర్ఘ కథా సాపేక్షకాలైన కొన్ని పొడుపు కథలున్నాయి అవన్నీ పొడుపు కథ గర్భంలో దాగినకథలే; వాటిని కథాత్మకాలనే ప్రకరణంలో విపులంగా చర్చించడం జరిగింది.

గర్భ కవిత్వానికి సంబంధించి అప్పకవి కందగీత గర్భచంపక మాలాది అనేక పద్యాలనుదాహరించాడు. అవన్నీ విపుల వివరణాన్ని ఆశిస్తాయి. అవధాన సరస్వతి గ్రంథంలోని ఒక వృత్త కందగర్భ సీసాన్ని మాత్రముదాహరిస్తాను.

* వి"జయమిప్పించితివే సభాసదులు మె
చ్చన్ సావధానమ్మునన్ సరసత
వినయ భావోచిత వృత్త్యను ప్రసర దా
నందంబునం దించినావు తల్లి!
మృదుయశస్సులు పొలిమేరనిండ బలుకుం
దోడై రవా ప్రేమతోడ జనని!
హృదయ సంసిద్ధి ననేక భంగిమలనా
తారార్కమున్ నిల్పితా"రయనగ

"కరధృత సుధాఢ్య కలశవు వరమునడుగు
వాడ దానివార్చెదవౌకొ? వాక్ సరసత
రసన దనియగా-బరమేశ్వరి! సమయమిదె
శుభము నొసగుటకై" మనస్సున వసించి.[1]

---

1. అవధాన సరస్వతి, పు: 39.

ఇందులో 'జయమిప్పించితివితే' ... నుండి ...'నిల్చితా' వరకు మత్తేభ విక్రీడితం. 'కరధృత సుధాఢ్య కలశవు'...నుండి ...'శుభమునొసగుటకై' వరకు కందం గర్భితమై ఉన్నాయి.

గర్భకవిత్వంలో ఒక పద్యంలో మరోపద్యం గర్భితమై ఉన్నట్లే పొడుపు కథల్లో కొన్ని విడుపులు గర్భితమై ఉంటాయి; విడుపుల్లో ఆశించిన అక్షరాలూ- అర్థాలూ గర్భితమై ఉంటాయి. సంఖ్యాత, నామాంతరిత, పరిహారికాది ప్రహేళికలన్నీ విడుపులను దాచుకొన్నవే! కేవల కథల్లో కొన్ని పొడుపులు కథల్ని గర్భీకరించుకొన్నవే! గుప్త కథలుగా కథాత్మకాలుగా వ్యవహారంలో ఉన్నవే. అంతకు మించి గర్భ కవిత్వ లక్షణాలు పొడుపు కథల్లో కనిపించవు. ఇక పొడుపు కథల్లో ఆశుకవిత్వాన్ని గూర్చి ఆలోచిద్దాం.

**6-3 : పొడుపు కథలూ - ఆశువులు :** నాడైనా నేడైనా రేపైనా భావ వినిమయానికి వాగ్వ్యాపారం తప్పదు. ఆ వాగ్వ్యాపారం ఛందోబద్ధమైతే ఆశువవుతుంది; అది ఆశువుగా అలాగే కొనసాగేపద్ధతి ఈ అచ్చు యంత్రాలు రానికాలంలో ఉన్నది. ఇవాల్టికి నిరంతరం ఆశువు నడుస్తూనే ఉంది. అప్పటికప్పుడే అనర్గళంగా ఆశువు నడపేవారున్నరు. కొన్ని రోజులుగా ఆలోచించుకొని వాటికోరూపమిచ్చి ఆశువుగా చెప్పేవారున్నారు. ప్రశ్నకూ ఆలోచనకూ ఎడం లేని విధంగా ఆశువు కొనసాగించి తలలూపించిన వారుతెలుగునాట మొదటి నుండి ఉన్నట్టుగా ఆంధ్ర సాహిత్య గ్రంథాలెన్నో చెప్పినై.

వాల్మీకి శోకార్తుడయ్యాడు; ఆ శోకమే శ్లోకమయింది. అది పాదబద్ధం; అక్షరసమం; తంత్రీలయ సమన్వితం, ఛందస్సు సాక్షాత్కరించింది. ఈ ఆశువే కవిత్వానికి మొదటి మెట్టు; జీవునిలోని ఆర్తి - ఆవేదన — ఛందోబద్ధంగా అక్షరాకృతి ధరించడమే ఆశువు. వ్యాస వాల్మీకాది మహాకవులందరూ ఆశువునే ఆశ్రయించారు; వారి శిష్యులవి వ్రాశారు. ఆంధ్ర కవుల్లో నన్నయ్య ఆశు కవితా ధారకు అక్షరాకృతినిచ్చినవాడు నారాయణభట్టు. తిక్కనకు గురునాథుడు. తంత్రీలయ సమన్వితంగా భావాల బహిర్గమనం జరిగి, అది అక్షరా కృతి ధరించినప్పుడే తర్వాతి తరాలవారికి ఆశువంటే ఏంటో తెలుస్తుంది. ఆశుకవిత్వం విషయంలో లక్షణ దీపికాకారుని మతమిలా ఉంది

"ఏకపాద త్రిపాద కఠిన ప్రాస విషమ సమస్యా పూర్తులు వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబులును, ఇష్టార్థ దేవతా వర ప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, అష్టావధానంబులు, ఘటికా శత గ్రంథ కల్పనయు, ఆశా పురాణంబులని తత్కాలోచితాతి త్వరిత గతిని రచియింప బడునది యాశు కవిత్వంబగు ..."[1]

వీనిలోనివి కొన్ని అప్పకవి చెప్పిన చిత్రకవిత్వంలోనే కలిసిపోయినై. ఇక సమస్య వ్యస్తాక్షరి, ఆశాపురాణాలు అష్టావధానంలోని అంశాలే. అయితే ఇవి ఒక్కొక్కటి సాధించడం ఒక్కొక్కరు ప్రారంభిస్తే, ఆ తర్వాత ఎనిమిదింటి నెన్నుకొని ఒక్కరే సాధించడం మొదలు పెట్టారు. అందువల్ల అష్టావధానం జన రంజక ప్రక్రియగా పరిణమించింది.

ఒక పొడుపు కథల్లోని పద్యాలన్నీ ప్రయత్న సాధ్యాలే; ఏదో ఒక ఛందస్సును అనుసరించినవే. ఛందోబద్ధం కానిది ఆశువు కాదనే నియమాన్నే గ్రహిస్తే, ఆశువుగా చెప్పిన పొడుపు పద్యాలేవో పరిశీలించాల్సి ఉంటుంది. అది తేగేది ముడి పడేది కాదు. అందువల్ల జానపదుని నోట పుట్టిన పొడుపు కథలన్నీ పరిశీలిస్తే అవి ఆశువులే అనిపిస్తాయి. పైగా వాటిలో చాలా వరకు మాత్రాబద్ధమై వివిధ గతులతో నడుస్తున్నవే ఉన్నాయి. ఈ విషయం ఛంద శ్శిల్పమనే ప్రకరణంలో చర్చించడం జరిగింది. కొన్ని పద్యాలుకూడా ఎవరెప్పుడు చెప్పారో గాని మౌఖిక ప్రచారంలో నేటికీ ఉన్నాయి.

* శిలవృక్షం తలబుట్టిన
చెలువలు ముప్వురును గూడి చిడి ముడి పడుచున్
దలవాకిట రమియింతురు
సలలితముగ దీని నెరుగు సరసులుగలరే?

(సున్నం, వక్క, ఆకు)

ఇలాంటి పొడుపు పద్యాలన్నీ ఒకప్పుడు ఆశువుగా ఆవిర్భవించినవే. జానపదుల పొడుపు కథలన్నీ ఆశువులే.

---

1. ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, పు : 14.

* కొండలో పుట్టింది-కొండలో పెరిగింది
నట్టింటికొచ్చింది - నాట్యమాడింది (కవ్వం)

పొడుపులు పొడుచుకొనేప్పుడు ఇది ఎవరినోట ఎప్పుడు వచ్చిందో చెప్పేదెవరు! అనుభవసారం. పరిసరాల విజ్ఞానం మూటగట్టబడింది. పద్యంలో గణపూరణార్థం వ్యర్థాక్షరాలు రావచ్చుగాని జానపదుల పొడుపు కథల్లో అలాంటివి కనిపించవు. పైది పెద్దల ఆశువు కావచ్చు కాని కిందిదయితే అచ్చంగా పిల్లల ఆశువే.

* మాతాతబోడి - మీతాత బోడి
శివలింగం బోడి - సిద్ధప్పబోడి (మంచంకోళ్ళు)

* కిటకిట మంచం - కిటారి మంచం
ఎందరు ఎక్కిన - ఇరగదు మంచం (భూమి)

పెద్దలూ - పిల్లలూఎవరు నిర్మించినా, ఎవరు ఆశువుగా పలికినా వీటిలో సాహిత్య శిల్పం కూడా కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది, ఒక్కొక్క పొడుపు ఒక్కొక్క ముక్తకమే. జానపద సాహిత్య ప్రకరణంలో ఉదాహరించిన పదిమంది పాడే ఈ కోలాటం పాటకూడా ఆశువే.

* ఏసేది ఏందిరా - ఎక్కేది ఏందిరా
కారేది ఏందిరా — కట్టేది ఏందిరా
ఏసేది నిచ్చనా - ఎక్కేది మనిషిరా
కారేది కల్లురా - కట్టేది లొట్టిరా
నిలబడ్డదేందిరా - కూసున్న దేందిరా
కాళ్లసందుదేందిరా - కారేది ఏందిరా
నిలబడ్డది బట్టెరా - కూసుంది మన్నిరా
కాళ్లసందుది సెంబురా - కారేది పాయిరా!

వృత్తి-ప్రవృత్తి ప్రతి వ్యక్తికీ ఉంటాయి. వృత్తి ఉత్పత్తి నంది స్తుంది; ప్రవృత్తి ప్రవర్తనను చూపిస్తుంది. వీటిల్లో పాల్గొన్నప్పుడు భావం

తోసుకు వస్తే. భాష బహిర్గతమైతే ఇలాంటి ఆశువులు లోకం మీదికి ఎక్తాయి. ఆశుధారతో పుట్టుకొని వచ్చిన పొడుపు కథలకు కూడా ఈ మాటలు వర్తిస్తాయి.

## 7-7 : సమస్యా పూరణాలు

సమస్యా పూరణాలు పొడుపు పద్యాల్లోని అంత్యోత్తరాలే. లక్షణ దీపికాకారుడు సమస్యల్ని ఆశుకవిత్వంలో చేర్చాడు. అష్టావధానంలో ఇవి ఆశువులుగానే వస్తున్నా, ఆకాశవాణిలోనూ, పత్రికల్లోనూ ప్రసారమయ్యేవి మాత్రం ఇంటిదగ్గర పొందుగా కూచొని వ్రాస్తున్నవే. అష్టావధానంలో ఇదొక అంశమే అయినా సాహిత్యంలో సమస్యలదొక ప్రత్యేక ప్రక్రియ అయ్యింది. అపార్థ కల్పనం చేసి అపమార్గం పట్టించే లక్షణం పొడుపు కథల కెలాఉందో, సమస్యలకట్లేఉంది. అసందర్భమూ, అర్థరహితమూ అయిన పద్య పాదాన్ని సందర్భశుద్ధితో, సమయస్ఫూర్తితో సార్థకంగా పూరించడమే సమస్యా పూరణం అవుతుంది.

"సమర్థుడైన కవి సందర్భమును వెంటనే గ్రహించి అక్షర వంచనను పూరించియో, శ్లేషార్థము వచ్చునట్లుగనో, ప్రశ్నార్థముగనో లేక సంధి రూపమున పదము నిలిపియో సమస్యను పూరించును."[1]

"సాధారణముగ సమస్యయను మాట లోక వ్యవహారమున పరీక్షాత్మకమగు పరిస్థితియను నర్థమున రూఢమైనది. సాహిత్యమున సమస్యా పూరణలో నున్న పరీక్షాత్మకత దీనికి కారణము కావచ్చును.[2]"

ఎలా అయినా సమస్య సమస్యగానే ఉండాలని ఎవరూ అనుకోరు! సమస్య విడి పోవాలి; సందేశ మందాలి సమస్య ఎంత విరసంగా ఉంటుందో పూరణ మంత సరసంగా ఉండాలి. పరిష్కారమొక్కోసారి అందరికీ ఆమోద యోగ్యం కాకున్నా అందులోని చమత్కారం సహృదయుల శిరః కంపనం

---

1. సమస్యా పూరణములు, నివేదన. పు : 1
2. సమస్యా పూరణములు, సమాలోచనము, పు : 11

చేయిస్తుంది. పొడుపు కథాలక్షణాల ఛాయలున్న అలాంటి కొన్ని సమస్యల్ని పరిశీలిద్దాం.

సమస్య పద్యంలో ఒక పాదం; కాకపోతే పద్యాంశం. ప్రారంభంలో అవే పొడుపు; పూరణానంతరం అదే విడుపు. ఇదే సమస్య కున్న వైలక్షణ్యం ప్రశ్నార్థకంగా ముందు నిలిచిందే, పాదాల పూరణానంతరం సమాధానమై పోతుందన్నమాట!

* భార్యలిద్దరు శ్రీ రామభద్రునకును

శ్రీరామచంద్రునికిద్దరు భార్యలా! పొడుపు కథ కలిగించే అపార్థ కల్పనే ఇందులో ఉంది. సమస్యే ప్రశ్నగా భాసించింది; పూరణమిలా ఉంది.

* రావణుని సంహరించియు రాజ్యమునకు
అంగనను గూడి అభిషిక్తుడై వెలుంగ
హారతిచ్చిరి ప్రేమతో హరుని ముద్దు
భార్యలిద్దరు, శ్రీరామ భద్రునకును[1]

పై పాదాల్లోని కొన్ని పదాలు కలిశాయి. శివుని ముద్దు భార్యలిద్దరు శ్రీ రామభద్రునికి హారతిచ్చారనడంతో సమస్యే సమాధానమై పోయింది ఈ క్రింది సమస్య అయిదు సమాధానాలుగా విడిపోయింది.

* అలరుగణింప పంక్తిరథునాత్మజులెవ్వరు! మైథిలుండునే
లలనకు దండ్రి? మన్మథుని లావుశరంబులు నెవ్వి? కాశికా
వెలుపుని నామమెద్ది? మఱి సీఱియు శాఁకినేమి గావలెన్
వెలువుగ రామలక్ష్మణులు, సీతకు, తమ్ములు, శంభుడన్నయున్.[2]

చివరి పాదమే సమస్య; అది పద్యంలో వేసిన క్రమాలంకారంతో విడిపోయింది. దశరథుని పుత్రులెవరు-రామలక్ష్మణులు; జనకుడు ఎవరికి తండ్రి-

1. పెద్దబాలశిక్ష, పు ; 89
2. పొడుపుకథలు, పు : 56

సీతకు; మన్మథుని బాణములేవి - తమ్ములు ; కాశికా చెలువుని పేరేమిటి — శంభుడు; బలరాముడు శ్రీకృష్ణునికేం కావాలి— అన్న. ఇలా ప్రశ్నోత్తర రూపంలో పరిష్కృత మయింది. సమస్య ప్రారంభంలో ఒక అక్షరాన్ని చేర్చి సమాధానాన్ని సాధించవచ్చు. అయితే మీది పదాలవల్ల, పాదాలవల్ల ఏదో సన్నివేశం బొమ్మగట్టి పూరణం రక్తి కడుతుంది.

* ప్రకటతర కప్పగంతుల
సుకులోదధి పూర్ణచంద్ర! సూరిజనేంద్రా!
సుకరముగ మక్షికా శా
బకమున్ వడిమ్రింగు చున్న బల్లింగనుమా![1]

ఇది తిరుపతి వేంకటకవుల పూరణం; బకాన్ని మక్షికా శాబకంగా మార్చివేశారు. చ్యుతాక్షరాలు చేరాయనవచ్చు. కింది పద్యంలో ఒకే అక్షరంతో అర్థస్ఫూర్తి వచ్చింది.

* రంగు మెయి హారాలు లందలు
బొంగుచు వందల కొలంది 'బోయర్సు' పయిన్
సంగతముగ గాల్పించు ఫి
రంగులు ఘోషించె మేఘరావము పోల్కిన్.[2]

తెలుగు సాహిత్యంలో సమస్యా పూరణాలు ప్రబంధ యుగం కన్న పూర్వంనుండే ఉన్నాయి. మధ్యమాక్షరాన్ని లుప్తంచేసి సమాధానాన్ని సాధించిన ఈ కింది పద్యం రఘునాథ రాయలవారి కాలానిది.

* ఓవిద్వన్మణి నను సు
గ్రీవుని యన్నకును బేరె జింగింపుము రూ
పేవితమనియెదు మధ్యము
వావిలిలో ద్రోయ గ్రోతివలెనే యుండెన్.

1, శతావధాన సారము పు ; 8
2. " " పు : 74

మధ్యమము వావిలిలో ద్రోయ అంటే వావిలిలో ఉన్న మధ్యమాక్షరాన్ని తోసి వేయగా అని అర్థం; అప్పుడది వాలి అవుతుంది. ఇది దత్తాక్షర వంటిది. అక్షరాన్ని తొలగించడం ద్వారా సమాధానాన్ని సాధించడం జరిగింది. చ్యుతాక్షరలో అక్షరాన్ని చేర్చాలి: దత్తాక్షరలో తొలగించాలి. అప్పుడే సమాధానాలు వస్తాయి.

సమాహిత ప్రహేళికల్లో సంధి విచ్ఛేదంతో అర్థం సాధింపబడుతుంది. ఇలాంటి సమస్యలెన్నో ఉన్నాయి. శతావధాన సారంలో ఉదాహరించిన తిరుపతి వెంకట కవుల పూరణం చూద్దాం.

* వింధ్యాద్రి ప్రభనొప్పుబల్ కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పగ లేక వెఱ్ఱివలె నేలా మంచి యీ రాత్రిరిన్
వంధ్యం జేసెదు? కాముకేళియనగా బాండిత్యమా? లేక నీ
సంధ్యా వందనమా? చరింపవలదా? చౌశీతి బంధమ్ములన్.[1]

కామకేళీ బంధాలు ఎనబైనాలుగు. వాటితో సంధ్యావందన మాచరించేదెలా! నైష్ఠికుని సంధ్యా వందనానికి కామకేళికి సంబంధం పొసగించేదెలా! దానిని ప్రశ్నగా మార్చి పూర్వార్థాన్ని పరిమార్చేశారు తిరుపతి వెంకట కవులు

ఇంతవరకు జనం నోళ్ళలోనే నానుతు, అక్షర బద్ధం కాని సమస్య పూరణాలెన్నో ఉన్నాయి. ఇందులో ఒకటి రెండు అచ్చయినా ఈ నాలుగూ నేను పద్య ప్రియుల నోట విన్నవే!

* గోపిక యొక్కతె కృష్ణున
కేపున తలదువ్వుచుండు నెడ వీక్షింపన్
గోపాల కృష్ణమూర్తికి
వీపున చనులుండె గోళ్ళ వెంట్రుకలుండెన్[2]

---

1. తిరుపతి వెంకట కవుల పూరణం
2. గద్వాల ఆస్థాన కవి బ్రహ్మశ్రీ పోకూరి కాశీ సత్యావధాని (కాశీపతి) వి.

* తాడూరి నుండి బ్రాహ్మణ
కోడూరుత్సవము జేరె క్షుద్బాధితుడై
పాడి దలంపక వేడి ప
కోడిని గొని బ్రాహ్మణుంతు కూర్మి భుజించెన్.[1]

* మనుపుస్ రాత్రిచరుల్ విమానములపై మోదమ్ముగానెక్కి మా
ఘనమున్ జూడు మటంచు నా ఘనము పైగాసేపు పర్గెత్తి యా
వెనుకన్ నేలకు వ్రాలి యూళ్ల నణపన్ పిల్లందు కొన్నట్టి యీ
శునకమ్మయ్యెను విష్ణుదేవుడహహా! చోద్యంబుగా నత్తఱిన్.[2]

* సర్దారుల్ ధిషణా ప్రధాన సరస స్వచ్ఛందులై యుండి, యం
తర్దార్ఢ్య స్థితులుల్లసిల్ల పులి జూదమ్మాడుచో నొక్కచో
సర్దారుండుట తప్పియాడగని యిచ్చన్ మిత్రుడొక్కడండనెన్
శార్దూలంబుల మేక పిల్లలివిగో చంపం బ్రయత్నించెడున్.[3]

ఇలా ఎన్నయినా ఉదాహరించవచ్చు ఈ సమస్యల్ని సరసంగా సాధికారికంగా పూరించిన వారిలో అవధానులే ఎక్కువున్నారు: అష్టావధాన-శతావధానాల్లో సమస్యల్ని పూరించడం తప్పనిసరి అయినందువల్ల, సమస్యాపూరణం జనరంజకం వినోదాత్మకం అయినందువల్ల సమస్యా పూరణ ప్రక్రియకెంతో ప్రాధాన్యం పెరిగింది. లక్షణ దీపికా కారుడు అష్టావధానాన్ని ఆశుకవిత్వం కిందికే చేర్చినా, చమత్కారాలు, చిత్రాతిచిత్రాలు రంగరించుకొన్న ఈ సాహిత్య ప్రక్రియ చిత్ర కవిత్వాంతర్భాగంగానే అలరారుతోంది.

## 7-8 : అవధానాలు

"అష్టావధానమున నెనిమిది మంది పృచ్ఛకులు సమస్య సద్యోవర్ణనము, నిషిద్ధాక్షరి, దత్తపది, వ్యస్తాక్షరి, ఘంటా గణనము, చతురంగము, ఆకాశపురాణము,

---

1. అష్టావధాని శ్రీ దోర్కూరి బాలబ్రహ్మచారిది.
2. రాష్ట్రకవి శ్రీ తుమ్మల సీత రామమూర్తిది.
3. అవధాన సరస్వతి శ్రీ గుమ్మన్న గారి లక్ష్మీనరసింహ శర్మది.

అప్రస్తుత ప్రశంస, ఛందోభాషణము మున్నగు వానిలో ఒక్కొక్కరొక్కొక్క విషయమున పృచ్ఛకులుగా నుందురు. సమస్య మొదలగు నాలుగైదంశాలను గూర్చి ఒక్కొక్క పృచ్ఛకున కొక్కొక్క పాదమును జెప్పి, మరల వరుసగ తక్కిన పాదముల నొక్కొక్క దాని వంతున పూరించును. నాలుగు పాదములును ముగిసిన వెనుక నాయాపృచ్ఛకులకు జెప్పిన పూర్తి పద్యముల నొప్పగించును. ఈ ప్రక్రియ సాగుచుండగా నవధాని ఏకాగ్రతను భంగపరచుటకై అప్రస్తుత ప్రాసంగికాదులు తక్కిన పృచ్ఛకులు యత్నించుచుందురు. శతావధానమున నూరు మంది పృచ్ఛకులుందురు. వారు తలకొకటి చొప్పున సమస్యను గాని, వర్ణనగాని, సంస్కృతశ్లోకమును కోరిన పద్యమున నాంధ్రీకరించుటగాని, తెలుగు పద్యమును సంస్కృతీకరించుటగాని, పద్యాంతరమున చెప్పుటనుగాని గ్రహించి ప్రశ్నింతురు వందమందికిని ఒక్కొక్క వరుసలో నొక్కొక్క పాదము వంతున నాలుగు వరుసలలో మూరు పద్యములను పూర్తి చేసి చివరకన్నింటిని ఒప్పగింపవలెను."[1]

అష్టావధాన ప్రక్రియలో సద్యోవర్ణన, నిషిద్ధాక్షరి, ఘంటాగణనం, ఆకాశ పురాణం తదితరాంశాలలో పొడుపుకథల ఛాయలేమీ కనిపించవు. సమస్య, దత్తపది, న్యస్తాక్షరి (దత్తాక్షరి), వ్యస్తాక్షరి, అప్రస్తుత ప్రశంస, ఛందోభాషణ మనే వీటిలో పొడుపు కథల ఛాయలు కనపిస్తాయి. సమస్యలంత్యోత్తర ప్రహేళికలే అని ఇంతకు పూర్వమే వ్యాఖ్యానించడం జరిగింది అప్పకవి చెప్పిన చిత్ర కవిత్వ లక్ష్య లక్షణాలలో ఇచ్ఛావాఖ్య సంఘటనానికి, అష్టావధానాలలోని దత్తపదికి భేదమెంతమాత్రంలేదు. ఇకన్యస్తాక్షరిలో అవధానికిపాదపాదానికి రెండక్షరాలిస్తారు. వాటిని నిర్దిష్ట స్థానంలో న్యస్తం చేయాలి (ఉపయోగించాలి), కోరిన విషయాన్ని కోరిన వృత్తంలో వర్ణించాలి. పొడుపు కథల ఛాయలు ఈ న్యస్తాక్షరిలో కనిపిస్తాయి.

ఇక వ్యస్తాక్షరి : అవధానం జరిగే సమయంలో ఆపృచ్ఛకుడు అడపాదడపా ఓ.పాదంలోని పదాలను గాని, అక్షరాలను గాని వాటి సంఖ్యతో పాటు క్రమం దప్పించి చెబుతూ ఉంటాడు. అవధాని చివరకు అవన్నీ గుర్తుంచుకొని ఆ పాదాన్ని-ఆ పద్యాన్ని క్రమంగా అప్పగించాలి. సాధారణంగా ఒక్క పాదమే

1. సమస్యా పూరణములు, సమాలోచనము, పు : 7

అడిగే సాంప్రదాయముంది. అప్రస్తుత ప్రశంస అవధాని ఏకాగ్రతను భంగపరచ డానికి నడిపించే ప్రక్రియ. ఇందులో ప్రచ్ఛకుడు ప్రస్తుతం గాని అనేక ప్రశ్నల్ని మాటి మాటికి గుప్పిస్తాడు. ఆవకాయ నుండి ఐక్యరాజ్య సమితి వరకు ఏ ప్రశ్నలైనా అడుగుతాడు. అవధాని యుక్తి యుక్తంగా సమాధానాలు చెబు తాడు. ఛందోభాషణం కూడా అప్రస్తుత ప్రశంస వంటిదే అయినా ప్రశ్నో త్తరాలు మాత్రం పద్యాల్లో సాగుతాయి. ఈ ప్రశ్నోత్తరాల్లో పొడుపుకథల్లోని చమత్కార చారుత భాసిస్తుంది. తేదీలకు వారాలు చెప్పడం కొందరు స్వీకరించారు; చతురంగాన్నీ, పేకాటనూ, పుష్పగణనాన్నీ, ఘంటాగణనాన్నీ ఇలా వివిధాంశాలలో ఏదో ఒకటి స్వీకరించడమూ ఉంది. ఆధునిక కాలంలో కథాకథనం కూడా ప్రవేశపెట్టే ప్రయత్నాలు కొందరు చేశారు. వచన కవిత కూడా చెప్పించే ప్రయత్నం మరికొందరు చేశారు.

మొత్తం మీద అవధాన ప్రక్రియ చిత్ర కవిత్వం కోవకు చెందిందే. పృచ్ఛకుల ప్రశ్నల్లో పొడుపులు భాసిస్తాయి; అవధాని సమాధానాల్లో విడుపులు భాసిస్తాయి. ప్రేక్షకులూ ప్రశ్నలు పొడుస్తారు; అవధాని స్వాగతించి వాటివి కూడా విప్పుతారు. పొడుపు కథల ఛాయలీ ప్రక్రియలో ఉన్నందువల్ల కేవలం స్పృశించడం జరిగింది. సమస్య, దత్తపదుల విషయంలో ఇంతకు పూర్వమే ప్రస్తావించడం జరిగింది. ఇక చాటు పద్యాల్లో పొడుపు కథల ఛాయలెలా ఉన్నాయో ప్రస్తావిస్తా.

## 7-9 : చాటు పద్యాలు

ఈ ప్రకరణంలోనే కొన్ని చాటువుల్ని చిత్ర కవిత్వానికుదాహ రించాను. అంత మాత్రంలో చాటువులన్నీ పొడుపు కథలు కావు. అనేక సంద ర్భాల్లో, అనేక కాలాల్లో, అనేకుల చేత అవి చెప్పబడ్డాయి చీమ నుండి శివుని వరకు చాటువు స్పృశించని కవితా వస్తువు లేదు. చాటు కవిత్వానికి లక్షణా లెందరో చెప్పారు.

అవి ముక్తకాలు, కవుల వివాదాలు, హాస్య ప్రసంగాలు, వీరుల గాథలు ధాజుల చరిత్రలు, మంత్రుల తంత్రాలు-కుతంత్రాలు; దాతృప్రశంసలు, లోభి

నిరసనాలు, ఆశు కవితా ప్రాగల్భ్య నిదర్శనాలు, కవితారసికుల రసజ్ఞతా ద్యోతకాలు, క్రీడా వినోద గోష్ఠులు, బిరుదుగద్యలు, ప్రబంధాలు, ముక్తకాది పంచదశ సంఖ్యాన్వితాలు, గద్యరగడద్విపద దండకాలు, మంజరులు మొదలైనవన్నీ చాటువులుగా పరిగణనలోకి వస్తాయి. అయితే ఓ కథను గర్భీకరించుకొన్న కథాత్మక ప్రహేళికల లక్షణాలు కొన్ని చాటు పద్యాల్లో ఉంటాయి. చాటువులకివిధంగా భిన్న లక్షణాలున్న కారణంగా అందరిపీ సమీక్షించిన ఓ గ్రంథంలోని మాటల్ని మాత్రం ఉట్టంకిస్తాను.

"1. ఆశు రచనలై యుండుట. 2. దూషణ భూషణ రూపమున నుండుట. 3. సమస్యా పూరణ రూపమున నుండుట. 4 ముక్తక లక్షణ లక్షితములై యుండుట. 5. చమత్కార ప్రయోజనము కలిగియుండుట. 6. పొడుపు కథలుగా నుండుట. 7. వర్ణనగా నుండుట. 8. దైనందిన కష్ట సుఖములతోడి దిన చర్యారచన లట్లుండుట. 9 పేరడీ రచనలుగా నుండుట. 10. గాథలుగా నుండుట. మఱియునిట్లు పైన చూపబడిన వివిధములుగా నున్న అర్థచ్ఛాయలను గూడ అవసరమునుబట్టి సంగ్రహించుకొనవచ్చును."[1]

ఈ విషయమే ఉండాలనే నియమమేంలేదు; ఏదైనా ఉంటుంది; ఎట్లయినా ఉంటుంది అని ఈ గ్రంథకర్తే అంటున్నారు.

చాటు పద్యాల్ని ఏరి కుప్పలు వోసి చాటు పద్య మణి మంజరుల (1, 2 భాగాలు) పేరిట తెలుగువారి కందించిన సర్వజ్ఞులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. శృంగార శ్రీనాథము, చాటు పద్యరత్నాకరము, తెలుగులో చిట్టు కవిత్వము, తెనాలి రామకృష్ణుని హాస్య కథలు, భోజ కాళిదాస కథలు, ఆంధ్ర జాతి అంతరంగకారువు తెలుగు చాటువు పుట్టుపూర్వోత్తరాలు .... ఇలా ఎన్నో గ్రంథాలు వెల్వడ్డాయి- అవన్నీ ప్రత్యేకంగా పరిశీలించాలి. పొడుపు కథలై ఉండడం ముక్తక లక్షణ లక్షితములై ఉండడం, సమస్యా పూరణ రూపంలో ఉండడం అన్న డా॥ కేతవరపు వారి మాటలే ఇక్కడ చాటువులకు పట్టించాలి. అందులో పొడుపు కథల ఛాయలేవిధంగా ఉన్నాయో పరిశీలించాలి. పాలమూరు జిల్లాలో ఈనాటికి కొందరి నోట ఆడుతున్న ఈ చాటువు చూడండి.

---

1, ఆశు కవితలు అవధానములు-చాటువులు, పు; 65.

* జూపల్లి రామ రాయడు
ఏపాటి ధనమ్మునిచ్చె నెల్లప రాయా!
ఆ పాపాత్మ్మం డెవరికి
చూపనిదే చూపినాడు సూరపరాయా!

జూపల్లి రామరాయడో దేశ్‌ముఖ్; ఓ చిన్న పాటి సంస్థానానికి అధిపతి. ఎల్లపరాయ డతని దగ్గరికి వెళ్లి యాచించాడు; ఇంటికి తిరిగివచ్చాడు. తిరిగి వచ్చిన తన మిత్రుడేం తెచ్చుకొన్నాడో అని సూరపరాయడు ప్రశ్నించాడు, కందం ప్రథమార్ధంలో ఉన్న ప్రశ్న అదే! ద్వితీయార్ధం ఎల్లప రాయని సమాధానం. వినోద ప్రహేళికల ప్రశ్నోత్తరాల ఛాయలీ పద్యంలో ఉన్నాయి. ఇంతకూ సమాధాన మేంటి అంటే చూపనిదే చూపడం!

చాటు పద్య రత్నాకరంలోని ఈ కింది చాటువు పొడుపు పద్యమే. ఇది జన వ్యవహారంలో కూడా ఉంది.

* వండిన దెండిన దొక్కటి
ఖండించిన పచ్చిదొకటి, కాలినదొకటై
తిండికి రుచియై యుండును
ఖండితముగ దీని దెల్పు కవియుం గలడే![1]

వండిం తర్వాత ఎండింది వక్క; ఖండించిన పచ్చిది తమలపాకు; కాలింది సున్నం. ఈ కింది చాటువు చిత్ర కవిత్వంలోని అక్షర విలోపలక్షణంతోపాటు, సంఖ్యాత, నామాంతరిత ప్రహేళికల లక్షణాలకు లక్ష్యంగా ఉంది.

* నగ తనయన్ ధరన్ సిరిని నాలుగు వర్ణములన్ లిఖించియా
చిగురున (రా) నక్షరంబిడిన చొప్పున నైదగు నక్షరంబగున్
అగును గజాననుండు, నొకటాడిగ (దీ)జేయ చతుర్ముఖుండు, రెం
డుగనటుదీయ షణ్ముఖుడు, వెంటనె పంచశరుండు వహ్నియున్.[2]

1. ఆశు కవితలు అవధానములు - చాటువులు, : 67.
2. చాటు పద్య పద్యమణి మంజరి, ప్ర - పు : 118,

నగతనయ : ఉమా, ధర : కు, సిరి : మా, 'ఉమాకుమా' ...నాలుగు వర్ణాలయ్యాయి. చిగురున 'ర' చేర్చగా అయిదక్షరాలయ్యాయి. వీటికర్థం వినాయకుడు. అద్యక్షరం తొలగిస్తే మా కు మా ర: బ్రహ్మ అవుతుంది. రెండక్షరాలు తొలగిస్తే కుమార: కుమారస్వామి అవుతుంది. మూడిటిని తీస్తే మార = మన్మథుడవుతులది. నాల్గిటిని తొలగిస్తే 'ర': అగ్ని అవుతుంది. సంఖ్యాతను అనుసరించి, నామాంతరితం చేసి అక్షర విలోప లక్షణాల్ని పుణికి పుచ్చుకొన్న ఈ చాటువు అచ్చంగా పొడుపు పద్యమే.

మల్కిభరామ భూవరునితో కందుకూరి రుద్రకవి పల్కిన "కళా, విభూతి, మహిమ, ఆయువు, బుద్ధి ... ఇవన్నీ క్రమాలంకార పరిశోభితంగా కూర్చిన ఈ కింది చాటువు ముక్త పద గ్రస్తాలంకారంతో శోభించిన పొడుపు పద్యమే.

* పొలువుగ నంతరాళమున పూచిన పువ్వును, పువ్వులోన పెం
పలరిన చెట్టు, చెట్టుచిగురాకున పండినపంట, పండునన్
కొలకొలపిందె. పిందెగల కొమ్మయు; నీకు కళావిభూతి ని
శ్చల మహిమాయువున్, మతి, నొసంగుత మల్కిభ రామ భూవరా![1]

అంతరాళంలో పూచిన పూవు చంద్రుడు కళాకాంతుల నిస్తాడు. పువ్వులో పెంపలరిన చెట్టు లక్ష్మి విభూతి నిస్తుంది. చెట్టు చిగురాకున పండిన పండు శ్రీ మహా విష్ణువు నిశ్చల మహిమ నిస్తాడు. పండున కొలకొల పిందె బ్రహ్మ ఆయుష్షు నిస్తాడు. పిందె ఉన్న కొమ్మ సరస్వతి మతినిస్తుంది.

ఇవేగాక పాండిత్య ప్రకర్షను ప్రదర్శించే ప్రౌఢ పద సంయోజితాలైన చాటువులెన్నో ఉన్నాయి. అవన్నీ ప్రముషితా ప్రహేళికల కిందికే వస్తాయి. చాటు పద్య మణి మంజరిలోని ఒకటి రెండు పద్యాల్ని చూడండి.

* కానీన కాకోక కానీన కాకోక
కానీన కాకోక కాద్రవేయ

1. చాటు-పద్యమణిమంజరి, ప్ర - పు : 118.

కాద్రవేయాధర్మ కాద్రవేయాధర్మ
కాద్రవేయాధర్మ కాలకాల
కాలకాలప్రాంగ కాలకాలప్రాంగ
కాలకాల ప్రాంగ కారకార
కారకార గ్రాహ కారకార గ్రాహ
కారకారగ్రాహ గ్రాహగ్రాహ
గాహగాహను గాహనుకైనధామ
ధామనాటిక నాటిక దురభిమాన
రమ్యగుణలోల! సంగడి రక్షపాల!
అమిత గుణధామ పెదకోమటన్న వేమ![1]

ఈ చాటువు పెదకోమటి వేమారెడ్డిని గూర్చి చెప్పింది. ఈ కింది చాటువు ఆ మహారాజే మనుతుల్యుడని శ్రీనాథుడు ప్రశంసించింది.

* మానుషదానమాన బలమానిత ధర్మరమా మనోజ్ఞ రే
ఖానుత భూతి విత్తముల గాటయ వేమన బోల్తు వాసవిన్
వాని విరోధి వాని విభు వాని విపక్షుని వాని యగ్రజున్
వాని మఱంది వాని సుతు వాని యమిత్రుని వాని మిత్రునిన్.[2]

మైలమ భీమనను గూర్చి వేములవాడ భీమకవి చెప్పినట్లుగా ప్రచారంలో ఉన్న ఈ కింది చాటువు కూడా ప్రముషిత ప్రహేళిక కోవలోకే వస్తుంది.

* ఖండన భీమ నీ యెదుర బాఱక నిల్చిన శాత్రవుల్ బృహ
న్మండల పుండరీకపుర నాకనివాసులు నోర్చినన్ బృహ
న్మండల పుండరీకపుర నాకనివాసులు చచ్చినన్ బృహ
న్మండల పుండరీకపుర నాకనివాసులు చిత్రమిద్ధరన్.[3]

"ప్రౌఢ దేవేంద్రదాయభూపాల వరుని, సమ్ముఖంబున దయజూడు ముమ్మసుకవి", "నన్ను బిలిపింపు మాస్థాన సన్నిధికిని, లక్షణోపేంద్ర! ప్రౌఢ

1, 2, 3 చాటు పద్యమణిమంజరి, ద్వి - పు : 192, 194, 180.

రాయక్షితీంద్ర!" అనే సీస పద్యాంగాలున్న చాటువులు కొన్ని లభిస్తున్నాయి. ఇవి శ్రీనాథుడే చెప్పాడనే ప్రతీతి ఉంది. శ్రీ మంగిపూడివార్ పొడుపు పద్యాలకు కూడా ఈ మకుటాలు తగిలించి పాడుకొంటున్నారు.

"—వానిగను గొనరయ్య! సుజ్ఞానులారా!
—ఉత్తరములున్నయవి చూచి యుల్లసిల్లుడు
—దీని చిత్రంబు దెలియుడీ! ధీరులారా!
—భవ్యమగుదాని దెలియుడీ! భావ విదులు
—దీని భావంబు గనరయ్య! ధీరులార!
—దీని భావమేమి! తెలుపరయ్య!
—తెలియజేయురయ్య! ధీరులార!
—ఎవరో తెల్పుడీ! సుధీంద్రులార!
—అట్టివానిని దెల్పుడీ! అయ్యలార!
—దీని భావమేమి ధీరులార!
—వివరముగ జెప్పగదరయ్య! విబుధులార!
—తెలుపగదరయ్య! భావజ్ఞతిలకులార!
—చతురమతులార! చూడుడీ జాణతనము.
—తెలిసికొనరయ్య! బుద్ధికౌశలము మెఱయ.

చమత్కార చంద్రికలోని పద్యాంతాల్లో వారీ విధంగా ప్రశ్నించిన పద్ధతి, ప్రయోగించిన విశేషణాలు ప్రత్యేకంగా పరిశీలించాల్సి ఉంది. ప్రౌఢ రాయక్షితీంద్రుణ్ని ప్రశ్నించిన ఈ కింది సీస పద్యం బహుళ ప్రచారంలో ఉంది.

* నక్షత్ర వీథికి నాయకుడెవ్వడు — శశి
రంగగు గుడిలోని లింగమేది — శిల
వాహనంబులమీది వన్నెకు మొదలేది - లక్క
దేవతా ఋషులకు తిండియేది - కంద
నరకాసురునిగన్న నాతినామంబేది - ధర
పొలతి చక్కదనాన బోల్చనేది - రంభ

తల్లికి కడగొట్టు తనయుని పైనేది - భ్రమ
కమలాప్త బింబంబు గప్పునేది - మబ్బు.
అన్నిటికి జూడ రెండేసి యక్షరములు
ఆదులుడుపంగ తుదలెల్ల నాదులగును
చెప్పునాతడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయ క్షితీంద్ర.[1]

చాటు పద్య నిర్మాతలెవరైనా వారు తొక్కని తోవలేదు; చేయని చమత్కారం లేదు; చమత్కార చారుత్వానికి, సమస్యాత్మకత నిర్మాణానికి, ప్రతీకాత్మకత పటుత్వానికి, దూషణ-భూషణల స్వైర విహారానికి, వారికి చాటువు రంగ స్థలమైంది; సాహిత్యాహవ రంగ స్థలమైంది. వారు పొడుపు కథల్ని సమాదరించారు; ఆ లక్షణాలు తమ చాటువుల్లో రంగరించుకొన్నారు. చాటు పద్యమంటే పొడుపు పద్యమే అన్నంతగా చాటించారు.

పొడుపు కథలు చిత్రకవిత్వమనే ఈ ప్రకరణంలో పొడుపు పద్య విరాట్స్వరూప సందర్శనం జరిగిందని చెప్పలేను. ఇంకా జన క్షేత్రాల్లో ఏరుకోవలసినవి, కుప్పలు పోయవలసినవి, గాదెలు నింపవలసినవి ఉన్నాయి. తెలుగు పొడుపు కథలనే ఈ సువిశాల భిత్తిక మీద ఈ చిన్న చిత్రం చాలు. మరెవరైనా పూనుకొంటే ఇదే ఓ పెద్ద బొమ్మ కావచ్చు.

ఈ ప్రకరణ ప్రారంభంలో వికృతే చిత్రమన్నాను. చిత్రకవిత్వ వివిధ లక్ష్యలక్షణాల్ని పరామర్శించాను పొడుపు కథల్లోని చిత్రకవిత్వాన్ని అప్పకవి లక్షణాల నాధారంగ గ్రహించి అనుశీలించాను. ఆ తర్వాత కొన్ని ప్రహేళికల్ని పరిశీలించాను. ఇంకా మిగిలిపోయిన పొడుపుల-విడుపుల విచిత్రాల్ని విశ్లేషించాను. బంధ గర్భాశు కవిత్వాల్ని స్పృశించాను. సమస్యా పూరణాల్ని, అవధానాల్ని, చాటువుల్ని సమీక్షించాను. చిత్రకవిత్వంలోని పొడుపు కథా విరాట్స్వరూపాన్ని ఇంక బాగా సందర్శించాల్సిన అవసరముందంటున్నాను.

---

1. పొడుపు పద్యాలు, పు: 39.

# పొడుపు కథలు

# అలంకారాలు - ప్రతీకలు

## 8-1 : అలంకారం

ప్రకృతిలో పరిణామం సహజం ఋతుధర్మాన్ని అనుసరించి ఈ పరిణామం అనాదిగా జరుగుతూనే ఉంది. ఆ పరిణామం కారణంగా ప్రకృతిలో నిత్య నూతనత్వం భాసిస్తుంది. మాటి మాటికి ఆ కొత్తదనాన్ని దర్శించేవారు ప్రకృతి అలంకరించుకొన్నదంటారు; ఋతు సంబంధి పరిణామాలే భౌతిక ప్రపంచంలో అలంకారాలుగా భాసిస్తుంటే, కల్పిత ప్రపంచంలో కావ్యాంతర్గతాలైన అక్షర పద వాక్య విన్యాసాలు అలంకారాలుగా ప్రకాశించడం అసహజం గానీ అనౌచిత్యం గానీ కాదు.

ప్రపంచంలో బ్రతికి బట్టగట్టి నిల్చిన సర్వభాషావాఙ్మయాల్లోని విశిష్ట గ్రంథాలనిండా అలంకారాలున్నాయి. మనిషిలోని అలంకారిక ధర్మాభిరుచే కావ్యాలకెక్కికూచుంది. అడవి మనిషి ఆధునిక మానవుడైన శతాబ్దాల సహస్రాబ్దాల చరిత్రలో అతని ఒక్కో మెట్టు ఒక అలంకారమే. మనిషి శీత వాతాత పాదుల నుండి సంరక్షించుకోవాలని ఆకులు కట్టుకొన్నాడు. అంతటితో ఊరుకొనక పూలు పెట్టుకొన్నాడు. మాలికలల్లుకొని అలంకరించుకొన్నాడు. వనాల్లో బతికేవాడు గృహాల్లోకి వచ్చాడు. ఆ గృహాన్ని రకరకాలుగా తీర్చిదిద్దుకొన్నాడు. మాటలు నేర్చాడు; వాటిని ప్రయోగించడంలో మెళకువలు నేర్చాడు; బట్టలు కట్టాడు; వాటిని కత్తిరించి చిత్రాతి చిత్రంగా ప్రదర్శించాడు. పచ్చిపచ్చి ఆహారాన్ని మానాడు; కాల్చివండి తినడం ప్రారంభించాడు. అంతటితో ఊరుకోలేదు. ఆహారం తయారీలో కంటికింపైన పద్ధతినే అనుసరించాడు. గృహ ప్రాంగణాన్ని పరిశుభ్రంగా ఉంచడమేగాక రంగులువేశాడు; రంగవల్లులతో అలంకరించాడు. ఇవన్నీ చేశాడు; ఇంకా చేస్తున్నాడు. నాగరికత పెరుగుతున్నా

కొద్ది అలంకరణ కౌశల్యం మరీ పెరిగింది. ఈ పెరుగుదల క్రమ పరిణామంలో అంతర్గతంగా, బహిరంగంగా అడుగడుగునా అలంకారాలు అందాలు చిందించాయి; అపురూపంగా అద్భుతాలెన్నో ప్రకటించాయి.

## 8-2 : అణువణువున అలంకారాలు

ప్రకృతిలో - జీవజగత్తులో అడుగడుగునా అలంకారాలే అగుపిస్తున్నాయి. మానవుడిందులో నిత్య చైతన్య శీలి. ఆకారణంగా అవతరించిన అలంకారాల సంఖ్యకంతూపొంతూ లేదు. అలా అవతరించిన వాటిలో కొన్నిటికి మాత్రమే రూపురేఖలు దిద్దుకొన్నాయి. ఆకొన్నే ఇప్పుడెన్నో అనిపిస్తున్నాయి.

ప్రపంచ వాఙ్మయంలోని విశిష్ట గ్రంథాలన్నీ అలంకారాలకు నిలయాలే. ఆంధ్ర వాఙ్మయ ప్రాదుర్భావ కాలంనుండి ప్రశస్తినందుకొన్న అన్ని కావ్యాల్లో అలంకారాలకు సముచితస్థానం లభించింది. కొన్నిట మోతాదు మించి పోయింది. అదే విధంగా శిష్ట వ్యవహారాలైన ఆంధ్ర ప్రహేళికల్లోనూ, జానపద వ్యవహారాలైన తెలుగు పొడుపు కథల్లోనూ అలంకారాలు అతివేలంగా ఉన్నాయి. అలంకారంలేని పొడుపు కథే లేదంటే అతిశయోక్తి కాదు. ఆ అలంకారాలు శబ్దార్థగతులేగాక, అక్షర పద వాక్య విన్యాస జనిత చమత్కారాలుగా సాక్షాత్కరిస్తున్నాయి:

పొడుపు కథకు కొన్ని లక్షణాలున్నాయి. ఆలక్షణాలూ లక్షణాంశాలున్న ప్రతి పొడుపు కథ అతి వేలంగా ఉన్న అలంకారాల్లో ఏదో ఒక అలంకారం కిందికి వస్తుంది;లేదా ఆ అంశగా భాసిస్తుంది. అందు వల్ల ఉపమానోపేయ సంయోజితాలై అర్థ చమత్కార సంభావితాలైన అర్థాలంకారాలు, అంత్య ప్రాసానుప్రాస శబ్ద విన్యాస సంధుక్షితాలైన శబ్దాలంకారాలు, తెలుగు పొడుపు కథల్లో తిష్ఠ వేసుకొన్నాయి; కొన్ని పొడుపు కథలు రెండు మూడు అలంకారాలను సింగారించుకొన్నాయి; వాటిలో ప్రప్రథమంగా శబ్దాలంకారాల్ని స్పృశిద్దాం.

## 8-3 : శబ్దాలంకారాలు

ఈ అలంకారాలు శబ్దాన్ని ఆశ్రయించి ఉంటాయి. పొడుపు కథల్ని

ఈ శబ్దదృష్టితో పరిశీలించాలి. ప్రాచీనాలంకారికులు చెప్పిన శబ్దాలంకారాలన్నీ అందులో కనిపిస్తాయి. శబ్దదృష్టి పరిశీలన అన్నంత మాత్రంలో అర్థరహితశబ్ద మనే అర్థంచేసుకోరాదు. అర్థయుక్త శబ్దాల సంయోజనం వల్లనే ఆ అలంకారం అలంకారంగా భాసిస్తుంది. అది వృత్త్యనుప్రాసో ఛేకానుప్రాసో వెంటనే తెలిసి పోతుంది.

**3-1 : వృత్త్యనుప్రాసం :-** ఒక హల్లు అనేక పర్యాయాలు ఆవృతం కావచ్చు; అంతకు మించి కూడా రెండు మూడు నాలుగు హల్లులు అనేక పర్యాయాలు ఆవృతం కావచ్చు; అదే వృత్త్యనుప్రాస మవుతుంది.

* పట్నముల మాయక్కుంది
  పక్కిలె తొల్కొస్తె
  పక్కకుంటే తోల్కరాను (సీతాఫలం)

* అరసేరల గులగుల
  లంగల గలగల (మిరపకాయ)

* గుట్ట సుట్టు ముట్టు
  గంగెద్దు పుట్టుగొట్టె (పసుజ్జాయి—పెండి)

పై పొడుపు కథల్లోని మొదటిదానిలో సంయుక్త 'క్క' అనేక పర్యాయాలు ఆవృత మయింది. రెండో దానిలో 'గ' కారం, 'ల' కారం చాలా సార్లు వచ్చినై. మూడో దానిలో ద్విత్వటకారావృత్తి కనిపిస్తూనే ఉంది. పొడుపు కథల్లో ఇలాంటివెన్నో ఉన్నాయి. కేవలం రెండు పర్యాయాలే ఆవృతి అయినవి కోకొల్లలుగ ఉన్నాయి. 'ఆడవాయెకోల-ఈడవాయె కోల,ఎఱ్ఱ గొఱ్ఱె అబ్బర బొబ్బ ఇంకా ఎన్నో. ఈ క్రింది వాటిలో వృత్త్యను ప్రాసాంశాలున్నాయి.

* గింతంత పిట్ట సెట్టుగొట్టె (గొడ్డలి)

* అబ్బనంగ అమ్మనంగ
  అమ్మమ్మనంగ (పెట్టె) (గాజులు)

* ఎంతారం వాడ చెట్టు గొడ్డె
అంతపుదాకె బాలెంతపు దాకె (పసుపు)

**3-2 : ఛేకాను ప్రాసం :-** రెండ్రెండు హల్లుల జంటలు అర్థభేదంతో వెంట వెంట రావాలి. ఆ జంటల మధ్య అవ్యవధానం ఉండాలి అర్థభేదం ఉండి అవ్యవధానం ఉంటే అది ఛేకాను ప్రాసమవుతుంది.

* కీసు కీసు పిట్ట నేలకేసి కొట్ట (చీమిడి)

ఇందులో 'కీచు కీచు' అనే రెండు పదాలు అవ్యవధానంగా వచ్చినయి. కీచు అంటూ ధ్వని చేసే కీచు పిట్ట అని అర్థం. హల్లుల జంటలో అవ్యవధానమూ ఉంది; అర్థభేదమూ ఉంది.

* సుట్ల సుట్ల బాయికాడ-సుందరమ్మతోట కాడ...

* ఓయి ఓయి అనంగ—ఒత్తొత్తి పెట్టంగ...

చుట్లున్న, వలయాకారరూపం అని అర్థం. గాజులు పెట్టేప్పుడు అన్న రెండు ఓయిల్లో ఒకటి బాధను వ్యక్తం చేసేది కాగా రెండోది సంబోధన. అర్థభేదముండి వెంట వెంటనే వచ్చే హల్లుల జంటలు పొడుపు కథల్లో తక్కువే అర్థభేదం లేకుండా వచ్చినవెన్నో ఉన్నాయి.

'....రెండులొట లొట, రెండు మిట మిట, శాస్త్రం శాస్త్రం శర్నాటకం, బుడుగు బుడుగు మంటుంది, ముట్టకు ముట్టకు ఓ సెల్లె, కర కర కోస్తే'....' ఇలాంటి వ్యంజనాల జంటలు వ్యవధానం లేకుండా ఉన్నా అర్థభేదం లేని కారణంగా ఇవి ఛేకాను ప్రాసం కిందికి రావు. 'దీని కుట్టు దాని కుట్టు, దీని ఆట బోగమాట దీనిచావు పెంటచావు'... ఇలా వ్యవధానాలున్న హల్లుల జంటలు కొన్ని కనిపిస్తున్నాయి. ఇవి ఛేకాను ప్రాసాలు కావు.

**3-3 : లాటాను ప్రాసం :-** ఒకే అర్థమున్న పదాల్ని తాత్పర్య భేదం కలిగే విధంగా మళ్లీ మళ్లీ చెబితే లాటాను ప్రాస అవుతుంది.

* అంగల్ల ఒడ్డోడు సెంగ సెంగెగిరె (పేలాలు)
* వడేసి వడేసి ....పడేసె (సూది, దారం)
* హోళ హోళ మా తాత హొక్కాల సేతి వెట్టె (జకముక సంచి)

చెంగున ఇంకా చెంగున అనీ, వడి వేసి మరీ బాగా వడి వేసి అనీ వచ్చే అర్థాల్లో కనిపించే తాత్పర్య భేదం సుస్పష్టం అర్థంలో అభేదమున్నా ద్వితీయ శబ్ద ప్రయోగ సామర్థ్యం వల్ల ఒక ఉత్కృష్ట విలక్షణ తాత్పర్యం స్ఫురిస్తుంది. ఇది పొడుపు కథా వ్యవహర్త శబ్ద ప్రయోగ సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. ఈ కింది వి కూడా లాటాను ప్రాసాలే.

* నిప్పునిప్పేస్తే, దగ్గు బొగ్గేస్తే...
* కట్టె కట్టే ఉంటది....
* కాయలు కాయలు తింటారంట ....
  పాళం పాళం తింటారంట...
  బాజా బాజా మోగేనంట....

పదాదిలోనో, పదాంతంలోనో మరోపదం కలియడం వల్ల అర్థ తాత్పర్యాది భేదాలగుపడుతున్నాయి. 'కాయగాని కాయ-తలకాయ, పండుగాని పండు తలపండు, మాటగాని మాట - టమాట, ... ఇలాంటివి లాటాను ప్రాసల కిందికి రావు.

**3-4 : అంత్య ప్రాసం (అనుప్రాసం) :-** పాదాంతంలో గాని, సమాసాంతంలో గాని వరుసగా ప్రాసాక్షరాలున్నట్లయితే (సమానాక్షరాలున్నట్లయితే) అది అంత్య ప్రాసమవుతుంది.

* గోల్కొండ గొట్టం
  సూర్యాపేట సుట్టం
  మూడు పెడ్తే మట్టం (చుట్టాకు, పొగాకు, ఇంగలం)
* వేస్తురు, తీస్తురు, తగిలిస్తురు. (రవిక)

* అమనగల్లు గుట్ట - బాదేపల్లి మిట్ట
ఒకడు గట్ట పది మంది పుట్ట (మంగళ సూత్రం)

సమాసాంత పాదాంతాల్లో ప్రాసాక్షరాలే కనిపించేవి తక్కువ. అయితే పాదాంతాల్లో ఎక్కువగా సమానాక్షరాలే ఉన్నాయి. పైన ఉదాహరించిన 'వేస్తురు ఓస్తురు'లో ప్రాసాక్షరాలే వరుసగా వచ్చినై. మిగిలిన రెండింటిలో సమానాక్షరాలే ఉన్న అంత్య ప్రాసలే వచ్చినై. ఈ కింది పొడుపు కథల్లో కూడా పాదాంతాల్లో సమానాక్షరాలే ఉన్నాయి.

* గుడి ముంగల నల్లనా
గుడి వెన్క తెల్లనా (కుడక)

* అర సేతుల మచ్చ
అనుమంతుడు మెచ్చ (చీరపోతు)

* అంగిని దిన్నా - భంగిని దిన్నా
సింగారమున్న - కోతిని దిన్నా .... (ఊరపంది)

**3-5 : యమకం :-** వచ్చిన పదాలే అర్థ భేదంతో మళ్ళీ మళ్ళీ వస్తే యమక మవుతుంది. ఇందులో అక్షరాల సమూహము మళ్ళీ మళ్ళీ రావడంలో వ్యవధానముండవచ్చు.

జానపదుల పొడుపు కథల్లో యమకాలు పృగ్యం. ప్రహేళికల ఛాయలున్న పద్యాల్లో మాత్రమే యమకం కనిపిస్తుంది. అర్థభేదంతో తాత్పర్య భేదంతో వెంట వెంట జంట హల్లుల ప్రయోగాలున్న ఛేకాను ప్రాస లాటాను ప్రాసలు గూడ తెలుగు పొడుపు కథల్లో అక్కడక్కడే కనిపిస్తున్నాయి.

* నక్షత్రముగల చిన్నది
నక్షత్రము చేత బట్టి నక్షత్ర ప్రభున్
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రముపైన వేసి నాథుని బిలిచెన్[1]

1. పొడుపు కథలు, పు : 51

అభిమన్యుడు యుద్ధానికి బయలు దేరుతున్నాడు. ఉత్తర వీర తిలకం ద్దడానికి భర్తను పిలిచింది. ఇరవై ఏడు నక్షత్రాల్లో ఉత్తర, భరణి, మూల, స్తలనే నాలుగు నక్షత్రాలతో చేసిన చిత్రమిది. నక్షత్రమున్న చిన్నది ఉత్తర; ర తిలకం దిద్దడానికై భరణి (నక్షత్రం), చేత బట్టి నక్షత్ర ప్రభువైన నాథుని మూల (నక్షత్రానికి)కు రమ్మని చేయి. (హస్తనక్షత్రం) పైనవేసి పిలిచింది.

జానపద గేయ సాహిత్యంలో అక్కడక్కడ యమకాలు కనిపిస్తున్నాయి; డుపు కథల్లో ఇవిలేవు. శబ్దంమీద అధికారమున్న మహాకవుల సృష్టే యమకం. ంధ్ర సాహిత్యంలో పాదాలకు పాదాలే యమకాలు సృష్టించిన మహాకవులున్నారు; టు కవులున్నారు; చాటు పద్యాలున్నాయి. ఇవన్నీ చిత్ర కవిత్వం కిందికే స్తాయి.

-6 : ముక్తపద గ్రస్తం :- ఒకపాదం చివరగానీ, వాక్యం చివర నీ ఉచ్చరించి విడిచిన పదాన్నే, అవ్యవధానంగా రెండవ పాదం మొదటగాని, క్యం మొదట గానీ ప్రయోగిస్తే ముక్తపద గ్రస్తమవుతుంది.

* గుండు మీద గుండు పదారు గుండ్లు
పదారు గుండ్లల్ల పండ్లిగుల వట్టె (దానిమ్మకాయ)

* చుట్టు ముట్టు కంప - కంపలో పెంక
పెంకలో శంఖు - శంఖులో తీర్థం (కొబ్బరికాయ, నీళ్ళు)

* రెండు స్తంభాలు
స్తంభాల నడుమ కుంభాలు
కుంభాల మీద కుడి తొట్టె
కుడి తొట్టె మీద గవ్వల గురిగి
గవ్వల గురిగి మీద అద్దాల మాలు
అద్దాల మాలు మీద గరిక పోసలు
గరిక పోసల మీద గాడిదలు పొర్లాడుతవి (మనిషి)

పై మూడు పొడుపు కథల్లో పాదాంతంలో ప్రయోగించిన పదాలు అవ్యవధానంగా పాదాదిలో గ్రహించడం జరిగింది. పొడుపు కథల్లో ఇలాంటి

ప్రయోగాలు అర్థ స్పష్టతకే చేశారు. శబ్ద సౌందర్యం మీద జానపదులకున్న మక్కువే ఇది. పొడుపు కథా లక్షణాలు సమగ్రంగా ఉన్న కొన్ని పద్యాల్లో ముక్తాక్షర గ్రస్తాలు కనిపిస్తున్నాయి. అవి కూడ విడుపుల్లో ఉన్నాయి.

* ఉపమాన కోదండుడైన రాజెవ్వడు (శ్రీరామ)
రాజు పేరిట గల రత్నమేది (మౌక్తిక)
రత్నంబు పేరిట రంజిల్లు ఋతువేది (కర్కాశ)
ఋతువు పేరిట గల రుద్రుడెవడు (శంభువు)
రుద్రుని పేరిట రూపెల్లు జగమేది (వసుధ)
జగము పేరిట గల జంతువేది (ధేనువు)
జంతువు పేరిట జన్మించు పక్షేది (వాయసం)
పక్షి పేరిట గల వృక్షమేది (సంపెంగ)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
ఆదులుడుపంగ తుదలెల్ల నాదులగును
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగదునే చిన్ని నగవు[1]

విడుపులోని చివరి హల్లు మాత్రమే గ్రహించి తరువాతి పదానికి మొదట చేర్చడం జరిగింది. అందువల్లనే వ కు-వ, ధ కు-ధే ప్రారంభంలో కనిపిస్తున్నాయి ఇలా అన్నిట్లోను నిబంధనల్ని కొంత మేరకు సడలించుకొని చూడాలి. లేకపోతే పొడుపు కథల్లోని ప్రత్యేకాంశాలుగా వీటిని పరిశీలించాల్సి ఉంది.

వ్యాకరణాలంకారాది శాస్త్రాలేవి అధ్యయనం చేయకున్నా అలంకార ప్రహేళికల్లో విశృంఖల ప్రయోగాలేవీ కనిపించవు జానపదులు శబ్దాలంకారాల్ని సహజ సుందరంగా ప్రయోగించారు. కవి కల్పిత ప్రహేళికల్లోనూ ప్రయోగించిన అలంకారాలు పొడుపు కథా లక్షణాల మర్యాదకు లొంగే ఉన్నాయి. అందువల్ల ప్రహేళికా సౌందర్యం ఇబ్బడి ముబ్బడిగా పెరిగింది. అర్థాలంకారాలు కూడా పొడుపు కథల్లో అతి సహజంగా కుదురు కొన్నాయి. వాటిని పరిశీలిద్దాం.

---

1. పొడుపు పద్యాలు, పు : 42

## 8-4 : అర్థాలంకారాలు

అర్థాన్ని ఆశ్రయించి ఉండేవి అర్థాలంకారాలు. పొడుపు కథల్ని ఆలంకారిక దృష్టితో పరిశీలిస్తే ఇంచు మించుగా అన్నిట్లోనూ ఉపమానోపమేయాలు వాచ్య సూచ్యాలుగా ఉండే ఒక సాధారణ లక్షణం కనిపిస్తుంది. వాచ్యమైన ఉపమాన సహాయంతో, సూచ్యమైన ఉపమేయాన్ని తెలుసుకోవాలి. ఈ ఉపమానోపమేయాలు కూడా దైనందిన జీవితంతో అంటి పెట్టుకొని ఉన్నవే అధికం. పొడుపు కథాకారులు శబ్దార్థాలంకారాల్ని సంతరించడంలో నేల విడిచి సాముచేయలేదు. అర్థసిద్ధికి, సముచిత ప్రయోజనాన్ని ఆశించే ప్రయోగాలు చేశారు. ఆ కారణంగానే అలంకారాలన్నీ పరమ రమణీయంగా కనిపిస్తున్నాయి; ఆశించిన ప్రయోజనాన్ని నెరవేరుస్తున్నాయి.

### 4-1 : ఉపమ :-

ఉపమానోపమేయాలకు మనోహర సాదృశ్యం చెప్పడమే ఉపమ లక్షణం.

* మిసమిసపు పువ్వంత మిండెడ్వేసుకొని
అల్లారం బల్లారం తెల్లారవాయె. (కందిలి)

ఇందులోని మిసమిసపు పువ్వు ఉపమానం; మిండెడు - ఉపమేయం; వేసుకొనిపోవడం - సాధర్మ్యం; అంత — ఉపమావాచకం.

సాధారణంగా ఉండే అట్లు, పోలె, వలె, రీతి, భంగి, కైవడి, విధం అనే ఉపమావాచకాలు పొడుపు కథల్లో అంతగా కనిపించవు. 'అంత' ప్రయోగమే ఎక్కువ. 'వంటి, లాగ, లా ...' అక్కడక్కడ ఉన్నాయి. ప్రకృతార్థంగా వ్యవహృతమయ్యే ఉపమేయం కూడా విషయవశాన ఉపమానంగానే భాసిస్తుంది ఈ పొడుపు కథలో మిండెడు - ఉపమేయమే అయినా అది విడుపైన కందిలికి ఉపమానమే కద!

* చింపిరి చింపిరి గుడ్డలు కట్టుకొని
ముత్యాల వంటి బిడ్డల్ని కన్నది (మొక్కజొన్న)

ఈ పొడుపులో పుక్కజొన్న ఉపమేయం. అది తెలిస్తేగాని ఇది పూర్ణోపమ గాదు. ఉపమానం - ముత్యాలు; పిడ్డల్ని కనడం-సమానధర్మం: వంటి-ఉపమావాచకం. ఇలాంటి వాటిలో లుప్తోపమలే అధికం. వీటినిధర్మలుప్త లుగా, వాచక లుప్తగా, ధర్మవాచక లుప్తలుగా, వాచకోపమేయ లుప్తలుగా, ఉపమానలుప్తలుగా అనేక విధాల విభజించడానికి వీలుంది. ఆ వివరాలన్నిటిలోకి వెళ్లకుండా కొన్నిటిని మాత్రం ఉదాహరిస్తా.

* గడంతసానికి ముంతంత కొప్పు (జొన్నకంకి)
* చెప్పంత పోరికి చెప్పన్ని గున్నాలు (సెనక్కాయలు)
* పోకంత పొట్టోడు – గుమ్మంత కడవ మోస్తడు (పొయ్యి)
* ఎలక్కాయంత సద్ది ఎంత మందిదిన్నా దం(ఖ)గదు (తల్లిపాలు)
* పట్నమంత మట్టి పడ్తే లేవదు (ముగ్గు)
* సూపకాయంత దేవునికి
  వచ్చిపోయే వాండ్లంత దండం పెట్టిరి (దీపం)

సర్వాలంకారాలకు ఉపమ బీజం; అది ఉత్కృష్టాలంకారం; అది అన్నిటికి కేంద్ర బిందువు. పొడుపు కథా సాహిత్యంలో ఉపమ స్థానం ఉపమది. అయితే రూపకాలంకారానిది మాత్రం అగ్రస్థానమనే చెప్పాలి. రూపకం రూపు దిద్దుకొన్నట్టుగా మరో అలంకారం పొడుపు కథల్లో రూపు దిద్దుకోలేదు.

**4-2 : రూపకం :-** ఉపమేయంపై ఉపమాన రూపాన్ని ఆరోపించడమే రూపకం. "ప్రకృతిలోని సాదృశ్య సారూప్యాలను వ్యక్తం చేస్తూ పొడుపు కథలు రూపాలంకారాలకు సన్నిహితంగా ఉంటాయని ఆర్ట్స్ట్రాటెల్ పేర్కొన్నారు."[1] "రూపకమై ఉండడం పొడుపు కథ ప్రధాన లక్షణాలలో ఒకటి."[2] "అర్థ స్పష్టత

---

1. వినోదంతో పాటు విజ్ఞానం అందించే పసందైన పొడుపు కథలు,(వ్యాసం)
2. జానపద సాహిత్య స్వరూపం, పు : 80

లేని రూపకం లేక రూపక సముదాయం పొడుపు కథ అనడం కూడా ఆలంకారిక మైన పొడుపు కథ గుణాన్ని తెలుపు తున్నది."[1]

ఈ పై అభిప్రాయాలవల్ల పొడుపు కథల్లో రూపకానికున్న ప్రాముఖ్యం తెలుస్తుంది. ముఖ్యంగా జానపదుల పొడుపు కథల్లో సగానికి పైగా రూపకాలున్నాయి. సంస్కృతాంధ్రాది సర్వ భారతీయ సాహిత్యాల్లో ఉపమాలంకారమే స్వల్పభేదం వల్ల, మిగతా అలంకారాలుగా పరివర్తన చెందిందనే అభిప్రాయం సర్వజన సమ్మతమైంది. ప్రధానంగా ఈ అభిప్రాయం అర్థాలంకారాల విషయంలో వర్తిస్తుంది. అట్లే విశ్వ సాహిత్యంలోని ప్రహేళికలకు అలంకారాల విషయంలో రూపకం బీజంగా నిలిచింది.

* నల్లమొద్దుకు నాలుగు తలకాయలు (లవంగం)

లవంగంపై నాలుగంటే నాలుగే పుల్లలుంటాయి. లవంగం నల్లగా ఉంటుంది. ఉపమేయమైన లవంగం పై నల్లమొద్దు అనే ఉపమానాన్ని, లవంగం పుల్లలపై తలకాయలనే ఉపమానాన్ని, ఆరోపించడం జరిగింది.

* పల్గు రాళ్లల్ల పాము పొర్లాడే (నాలుక)

దంతాలు పల్గురాళ్లు; నాలుక పాము దంతాలపై పల్గురాళ్లనూ, నాలుక పై పామునూ ఆరోపించడం జరిగింది.

* రాజావారి తోటలో రోజాపూలు
చూసే వారే కాని కోసేవారు లేరు (నక్షత్రాలు)

ఆకాశం రాజావారి తోట; నక్షత్రాలు రోజా పూలు. ఉపమేయాలు ఆకాశ నక్షత్రాలు, ఉపమానాలు రాజా వారి తోట, రోజాపూలు. ఉపమానోప మేయాలకు అభేదాన్నీ తాద్రూప్యాన్నీ తెలిపినా రూపకాలంకారమే అవుతుంది.

* రూకలెంచలేం చాప చుట్టలేం (నక్షత్రాలు-ఆకాశం)

నక్షత్రాలు రూకలు, ఆకాశం చాప. గణించడం చాప చుట్టడం ... సాధ్యం కాదు. రూకలూచాపలూ దైనందిన జీవితోపకరణాలు. నక్షత్రాలూఆకాశం

1. Encyclo Pacdia of Religion andethics, P : 765.
నుండి పై గ్రంథంలో ఉద్ధృతం, పు : 80

నిత్య సత్యాలు. నక్షత్రాలు పూసకాయలుగా అభేదం చెప్పడం, ఆకాశాన్ని చాపతో అభేదం చెప్పడం జానపదుల దృష్టిలో సహజాతి సహజం. కానీ ఆలంకారికుల దృష్టిలోనూ సాహిత్య ధర్మ మర్మజ్ఞుల దృష్టిలోనూ నక్షత్రాలేఉపమానాలుగా చెప్పబడతాయి. ప్రసిద్ధోపమానాల్ని ఉపమానాలుగా చెప్పక, వాటిని ఉపమేయాలుగా చెబితే అది ప్రతీపాలంకారమవుతుంది.

**4-3 : ప్రతీపం :-** "లోకంలో ప్రసిద్ధమై ఉన్న ఉపమానాన్ని ఉపమేయంగా చెప్పడం, ఉపమానాన్ని ఉపమేయంగా గ్రహించి ఉపమేయాన్ని తిరస్కరించడం, ఉపమేయ ప్రాశస్త్యాన్ని బట్టి ఉపమానాన్ని నిరసించడం, ఉపమానం వల్ల కలిగే ప్రయోజనం ఉపమేయం వల్లనే కలుగుతున్న కారణంగా, ఉపమానంతో పని లేదని చెప్పడం, ఉపమేయానికి ఉపమానం సాటిరాదనడం..." ఈ లక్షణాలన్నీ ప్రతీపాలంకారానివే.

* కిట కిట మంచం - కిటారు మంచం
ఎందరు ఎక్కినా . విరుగదు మంచం (భూమి)

క్షమకు ప్రతీక ధరిత్రి. భూమికి భారమనేదేలేదు. అలాంటి భూమిని ఎందరెక్కినా విరగని మంచంగా జానపదుడారోపించాడు. ఆరోపాన్ని బట్టి దీన్ని రూపకమే అనాలి కాని లోకంలో ప్రసిద్ధమైఉన్న ఉపమానం భూమి; దాన్ని ఉపమేయంగా భావించడం వల్ల ఇది ప్రతీపాలంకారంగా భాసిస్తుంది, ఇక్కడ ప్రతీపం రూపక సాహచర్యం వల్లనే స్ఫురించినదనాలి; ఇదె పద్ధతి అతిశయోక్తి కూడా అనుసరించింది.

**4-4 : అతిశయోక్తి :-** ఉపమానం మాత్రమె చెప్పి వర్ణ్యమైన ఉపమేయాన్ని మరుగు పరచినట్లయితే అది రూపకాతిశయోక్తి అవుతుంది. సాపహ్నవ, భేదక, సంబంధం, అసంబంధాది భేదాలెన్నో అతిశయోక్తి అలంకారంలో ఉన్నాయి.

* రాజునల్లన - పత్తాని పచ్చన
కనుగుడ్డు తెల్లన-కలిపుల్లన (తాటిచెట్టు, ఆకు, లుంజ–కల్లు)

నల్లనిరాజు, పచ్చని ప్రధానమంత్రి, తెల్లని కనుగడ్డు, పుల్లని కలి అన్నీ ఉపమానాలే. ఉపమేయాలన్నీ తెరవెనుకే (మరుగున్నే) ఉన్నాయి, ఆ తెర వెనుక వాటిని విడుపు తెరమీదికి తెస్తుంది. ఈ లెక్కన పొడుపు కథల్లో రూపకాతిశయోక్తుల సంఖ్య అధికంగా కనిపిస్తుంది. వాచ్యమైన రాజు, ప్రధాని, కనుగుడ్డు, కలి ఉపమానాల ద్వారా, ఉపమేయ సూచ్యాలైన నల్లన పచ్చన, తెల్లన, పుల్లన అనే గుణ శబ్దాల ద్వారా, ఉపమేయాలూ విడుపు కథలూ అయిన తాటి చెట్టు, తాటి ఆకు, తాటి ముంజ, తాటి కల్లు తదితరాంశాల్ని కనుగొనాలి. ఒక విషయాన్ని ఇంత లింతలు చేసి చెప్పడం కూడా అతిశయోక్తే అవుతుందని లోక వ్యవహారంలో ఉన్నా, ఇక్కడ మాత్రం రూపకాతిశయోక్తి లక్షణాన్నే పట్టించి పరిశీలించాల్సి ఉంది.

* ములుకోల కట్టె మీద మున్నూరిండ్లు
మున్నూరిండ్లకు నన్నూరు తలుపులు
నన్నూరు తలుపులకు ఒకటే గొళ్లెం (తేనెపట్టు)

కర్షకుని ప్రధాన పరికరాల్లో ములుకోల కట్టె ఒకటి. బండి తోలినా, నాగలి నడిపినా, పొలంలో తిరిగినా, గడ్డి తిరగ వేసినా, పశువుల నదలించినా ముల్లుగర్రే కావలసిందే. దానిమీద మున్నూరిండ్లనడం ఇంతలింతలుగా చెప్పడమే. ఆ యిండ్లకు నన్నూరు తలుపులనడం, ఆ తలుపులకు ఒకటే గొళ్లెమనడం ఇంతలింతలుగా చేసి చెప్పడమే. కానీ వీటికన్నిటికి విడుపు తేనెపట్టు అని తెలిసిన వెంటనే భావించిన అతిశయానికి సంబంధం ఏర్పడినట్లనిపిస్తుంది. సంబంధ మున్నదే అయినా అనుబంధంగా గోచరించిందైందది.

**4-5 : శ్లేష :-** పదాల విరుపువల్లో, అర్థ భేదంవల్లో నానార్థాలు వస్తాయి. అదే శ్లేష అంటాం, పొడుపు కథల్లో శ్లేష తక్కువే. ప్రయోగింపబడిన శబ్దాల్లోనే అనేకార్థాలు ద్యోతకమైతే శ్లేష అని లక్షణం.

* రాముడు కృష్ణుడు పోతూ ఉంటారు
వాడికి మూడు కొబ్బరికాయలు దొరికాయి
పగలగొట్టకుండా పంచుకోవాలి! ఎలా!
(రాత్రికొట్టి) (రాముడు, కృష్ణుడు, పోతు)

రాముడు కృష్ణుడిద్దరే పోతున్నారనీ, వారికి మూడు కొబ్బరికాయలు దొరికాయనీ, వాటిని సరిసమానంగా పగల గొట్టకుండా అనే పదాలకు పగటి వేళ కొట్టకుండా అనే అన్యార్థ ప్రకల్పనంతో రాత్రి కొట్టి అని విడుపు తీసుకోడం జరిగింది. రాముడు కృష్ణుడు పోతున్నారనే దానికి ఇద్దరే వెళుతున్నారనే అర్థం వస్తుంది "పోతు" అనే మనిషి రాముడూ కృష్ణుడు ముగ్గురక్కడ ఉన్నారని అర్థం తీసుకోవాలి. దాంతో మూడు కొబ్బరి కాయలను ముగ్గురు పగల గొట్టకుండా పంచుకోడం జరుగుతుంది, ఇందులో పగల గొట్టకుండా, రాముడు కృష్ణుడు పోతు అనే పదాలకు ఒక అర్థాన్ని మించి అర్థాలు చెప్పడం జరిగింది అందువల్ల ఇది శ్లేషాలంకారమైంది. ఈ క్రింది పొడుపు పద్యంలో చాలా వరకు శ్లేష సాధింప బడింది.

* కొమ్ములు కలవనికోపించిపొడవదు
కట్టి బంధించిన కదలకుండు
ఈనదు పొర్లదు ఎన్నాళ్లకైనను
బంధంబు వేసిన పాలొసంగు
మేత కాసించదు మేఘంబులో నీళ్లు
కావలెనను చుండు కడుపు నిండ
దాని కడుపు నిండ దారిద్ర్యములు బాపు
బహుజీవరాశులు బ్రతుక వచ్చు.
దీని యర్థంబు తెలియగదవిరినరులు
మది విచారించి పదునైదు మాసములను
సమ్మతిగజెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగదునే చిన్ని నగవు.[1] (చెరువు, పశువు,)

ఈ పద్యంలోని ప్రథమ-చతుర్థ పాదాల్లో శ్లేష ఉంది. విడుపులైన చెరువుకు, పశువుకు ఈ రెండు పాదాలు సరిపోయినై. చెరువుకూ పశువుకూ కొమ్ములుంటాయి. అవి కోపించి పొడవవు. నీటికై కట్టవేస్తారు; అది చెరువు కట్ట; అది కదలకుండానే ఉంటుంది. పశువును కట్టివేస్తే అదీ కదలకుండానే ఉంటుంది. చెరువు కడుపు నిండడం అంటే నీరు నిండా ఉండడం: ఆ నీరే దారిద్ర్యాన్ని

1. పొడుపు పద్యాలు, పు : 42

దూరం చేస్తుంది. అందువల్ల అనేక జీవ రాశులు బతుకుతాయి. అట్లే పశువు కడుపు నిండినట్లయితే దారిద్ర్యం దూరమవుతుంది. దాని పాలవల్ల తుష్టి పుష్టి చేకూరు తుంది. జీవరాశుల ప్రాణరక్షణం కూడ జరుగుతుంది. ఈ విధంగా ఈ రెండు పాదాల్లో శ్లేష సరిపోయింది.

రెండవ పాదంలోని ఉత్తరార్థం "కట్టకట్టిన నీరు నిచ్చు"నని చెరువుకు చనుకట్టు కట్టినట్లయితే (వెనుక కాళ్లకు బంధం వేసినట్లయితే) పాలనిస్తుందనే అర్థం పశువుకు సరిపోయింది. పూర్వార్థమైన "ఈనదు పొర్లదు ఎన్నాళ్ళకైనను" అనేది కేవలం చెరువుకే కుదిరింది, 'ఈనది పొర్లదు' అని మార్చి వేసినట్లయితే 'ఈను + అది పొర్లదు' అనే పదవిభాగం వల్ల సభంగ శ్లేషమేర్పడు తుంది. అర్థం పశువు పక్షంలోనూ కుదురుకొనేది. ఇక తృతీయ పాదం ఉత్తరార్థం రావలెనను చుండు కడుపు నిండ" అనేది చెరువుకూ పశువుకు సరిపోయింది. పూర్వార్థంలోని 'మేతకాసించవు' అనేది పశువుకు కుదరదు. "మేఘంలో నీళ్ళు" పశువుకూ చెరువు కూ కావాలి. ఈ విధంగా ప్రతి పాదంలో చెరువుకూ పశువుకూ అర్థం వచ్చేట్లు ఈ పొడుపు పద్యంలో శ్లేష సాధించే అవకాశముంది.

## 4-6 : ఉత్తరం (చిత్రోత్తరం + గూఢోత్తరం)

తెలుగు సాహిత్యంలో ఉన్న అలంకారాలన్నీ పొడుపు కథలు కాక పోవచ్చుగాని, చిత్రోత్తరాలంకారమెక్కడ ఉన్నా అది పొడుపు కథే అవుతుంది. పొడుపు కథకున్న ఒక లక్షణం సంపూర్ణంగా అందులో ఉంది.

"ప్రశ్నకు ఉత్తరానికి అంతరం అభిన్నంగా ఉండే అది చిత్రోత్త రాలంకారమవుతుంది." ఒకరడిగిన ప్రశ్నకు ఆ ప్రశ్న రూపవాక్యంతోనే జవాబు చెప్పడం ఇందులోని ప్రత్యేకత.

సూరకవి ఆంధ్ర చంద్రాలోకంలో "ఎద్దీశ్వర వాహనం" అనేది ఉదాహరిం చారు.[1] ఎద్ది ఈశ్వర వాహనమనేది ప్రశ్న. ఎద్దు ఈశ్వర వాహనమనేది

1. పరగు కృతులందు ప్రశ్నో
త్తరమనగ నలంక్రియావతంసము ప్రశ్నో
త్తరము లొకటయిన నెద్దీ
శ్వరవాహన మనగ సరససమ్మత మగుచున్
-ఆంధ్ర చంద్రాలోకము, పు : ౩౫.

సమాధానం. సంధి కారణంగా రెండు భిన్న పదాలు ఒకే పదంగా (ఎద్ది, ఎద్దు) భాసించి భిన్నార్థాలను ఇచ్చాయి. కాబట్టి ప్రశ్నోత్తరాలొకటే అని పించినై.

* ఏ పయిమూడు దూలాలు
కోయకుండా ముగ్గురికి పంచాలి (వేపవి మూడు)

ఏబై మూడు దూలాలు ఏ మాత్రం కోయకుండా ముగ్గురు సమంగా పంచుకొనేదెలా అనిపిస్తుంది. కానీ 'వేప' శబ్దం జానపదుల నోళ్లల్లో 'ఏప' గా మారింది. అవి ఏబై మూడు కావు. వేపవి మూడు. మూడు దూలాలు ముగ్గురూ పంచుకొంటారు. ప్రశ్నలోనే ఉత్తర ముంది. ఈ కింది పొడుపు కథ ఇంకా బాగా కుదిరిన చిత్రోత్తరం.

* గుట్టంత సెట్టు
గుమ్మంత పూత
సాపంత ఆకు (విడుపులు కూడ ఆవే)

గుట్టంత చెట్టుండదు; గుమ్మంత పూత ఉండదు; చాపంత వెడల్పుగా ఆకుండదు. కానీ గుట్టనిండా చెట్లే ఉన్నాయనీ, గుమ్మంతాపూతే ఉన్నదనీ, చాప నిండుగా ఆకే ఉందనీ అర్థాలు గ్రహించాలి. ఈ కింది పొడుపు పద్యం చిత్రోత్తరాలంకారమే.

* వంగతోట నుండు వరిమళ్ల లో నుండు
జొన్న చేలనుండు చోద్యముగను
తలుపుమూల నుండు తలమీదనుండును
దీని భావమేమి తిరుమలేశ![1]

వంగతోటలో ఉండేది; వరి-మళ్లల్లో ఉండేది; జొన్న చేలల్లో ఉండేది, తలుపు మూలకుండేది; తలమీద ఉండేది. ఇవే విడుపులు. పద్యం విన్నవెంటనే వాటి వాటి మీద ఏదేదో ఉంటుందని కలిగిన భావన వెంటనే సమసి పోతుంది. ఈ కింది పద్యాన్ని అర్థయుక్తంగా ఎక్కడికక్కడికి విరుచుకోవడం వల్ల సమాధానాలు లభించినై

1. పొడుపు కథలు, పు ; 17

* కొండనుండు నెమలి, కోరిన పాలిచ్చు
పశువు, శిశువుతోడ పలుక నేర్చు
వనిత, వేదములను వల్లించుచుండును
బ్రాహ్మణుండు. కాకి పలలమదిను.[1]

కొండనున్న నెమలి కోరిన పాలివ్వడం, పశువు శిశువుతో పలకడం, వనిత వేదాల్ని వల్లించడం,[2] బ్రాహ్మణుడు కాకి మాంసం తినడం అసంభవాలనే అభిప్రాయాలున్నాయి. పాద పాదానికర్థం కుదరదు. వాక్యాన్ని, పద్యపాదంలోని శబ్దాల్ని క్రమనిరపేక్షంగా ప్రయోగించవచ్చు. వాటిని అర్థయుక్తంగా సమన్వయించాలంటే అర్థయుక్తమైన విడుపులతో సమస్య పరిష్కరించాల్సి ఉంటుంది.

"కొండనుండు నెమలి; కోరిన పాలిచ్చు పశువు; శిశువుతోడ పలుకనేర్చు వనిత; వేదములను వల్లించు చుండును బ్రాహ్మణుండు; కాకి పలలముతిను"···· ఇక అర్థానికై ఆరాటపడాల్సిన అవసరం లేదు. పొడుపులోనే విడుపుంది. పాద ప్రారంభంలో, అర్ధపాద ప్రారంభంలోని ఒకటి రెండు అక్షరాలలో విడుపులు నిక్షిప్తం చేసి రచించిన పొడుపు పద్యాలు కొన్ని లభిస్తున్నాయి.

* తులలేని ధనముచే తుల దూగునది యేది
గిరిజా మనోహరు గేహమేది
విరివిగా తుమ్మెద విహరించు తావేది
ఓడకంబుధి దాటుచుండునేది
కల కాల మొకరీతి కల్లయౌనది యేది
శ్యామలక చీలలో జాణయేది
దివి షద్గణము నడతెంచు మార్గంబేది
కరి వేల్పుగన్న మృగంబునేది

1. పొడుపు కథలు, పు : 17
2. "వేదపఠనమున కందరునర్హులే అని వేదమే చెప్పుచున్నది; స్త్రీశూద్ర భేదము పాటింపక ఎల్లరకు నధికారమున్నది'- అపశూద్రాధికరణము? పు : 23.

వలపుదొర పెక్కముల బట్టగలుగునేది
పలుకుచుదులేక లెస్సగా జెలగదేది
పక్షులన్నిటికిని తొలిపదములందె
ఉత్తరములున్నవని చూచి యట్లసిలుడు.[1]

పొడుపు పద్య నిర్మాత పద్యం చివర మార్గాన్ని ఉపదేశించి ఉత్తరాన్ని సులభంగా అందుకొనేట్టు చేశారు. చిత్రోత్తరాలంకారాన్ని దృష్టిలో పెట్టుకొనే రచయిత పద్యంలోని చివరి రెండు పాదాల్లో ప్రశ్నోత్తర శబ్దాల్ని ప్రయోగించారు. లోక వ్యవహారంలో చిత్రోత్తరాలంకారాలే అనిపించే వాక్యాలు కొన్ని వినిపిస్తున్నాయి.

'నాతి దూరమే ఇల్లు; అడుగులారె'...' ఓ కాంతా ఇల్లు దూరముందా! అడుగులారుతున్నాయి (కాల్లు కాలుతున్నాయి) అడిగాడో యువకుడు. ఇల్లు దూరం కాదుఆరడుగుల దూరమే అనే అర్థం ఆ వాక్యంలోనే ఉంది. ప్రశ్నోత్తరాలు రెండూ ఒకే వాక్యంలో కనిపిస్తున్నాయి.

'నీవు ఏ సెక్షన్లో ఉన్నా'వని ప్రశ్నిస్తే 'ఏ సెక్షన్లో' అని సమాధానం వస్తే, 'వాట్ అంటే ఏమిటి' అని ప్రశ్నిస్తే 'ఏమిటి' అని సమాధానం వస్తే ఆ మాటల్లోనే చిత్రోత్తరాలున్నాయని భావించాలి.

"బొబ్బిలి రాజు గారు మీకు ఊరిస్తా (ఊరు + ఇస్తా) మనుచున్నారని తదాస్థానోద్యోగి యగు తన మిత్రుడొకడు నడిమింటి సంగమేశ్వరశాస్త్రిగారికి చెప్పగా దాని తత్త్వమెరిగిన యాయన యిట్లు బదులు చెప్పెను. 'మీరాజు గారెప్పుడూ ఊరిస్తూనే ఉంటారులెండి[2]".... మరి మాటల్లో కూడా చిత్రోత్తరాలంకారాలీ విధంగా ఉంటాయి. ఉత్తరాలంకారంలో కూడా మరోభేదముంది. చంద్రాలోకసమున్మేషంలో ఈ విషయాన్ని ఇలా వివరించారు.

---

1. పొడుపు పద్యాలు, పు : 35 (చమత్కార చంద్రికలోని 7వ పద్యాన్నే ఇది అనుసరించింది.)
2. చాటుపద్య మణి మంజరి, ద్వి, పు : 99.

"భిన్న విషయాలున్న రెండు ప్రశ్నలకు ఒక్క వాక్యం (పదం)తో జవాబు చెప్పిన విధంగా వర్ణించినట్లయితే అది ఉత్తరాంతరాభిన్నోత్తర ఉప చిత్రోత్తరాలంకారమవుతుంది. 'నిలువ పీటికి పేరేమి! చెలువ చేతికెక్కి రాణించు భూషణంబేమి' అనే రెండు ప్రశ్నలకు 'మురుగు' సమాధానమైంది."[1]

'సోమయాజి స్వర్గమున నెవ్వతెను గవయగోరును! మంగళ కార్యము లందు స్తంభముల కేమికట్టుదురు!' అనే రెండు ప్రశ్నలకు 'రంభను' అని ఒకే సమాధానం. 'రైతులు సర్వదా దేనిని కోరుదురు? తములమును నరుడు దేనితో కొరుకును?' అనే రెండు ప్రశ్నలకు 'పంటన్' అని ఒకే సమాధానం.[2] ఇవన్నీ ఉత్తరాలంకారంలోని ఒక భేదమైన ఉత్తరాంతరాభిన్నోత్తర రూపాలే తెలుగు పొడుపు కథల్లో ఇలాంటివి పద్యాలకు పద్యాలే పుట్టినై.

* రజక కవాటముల్ రహిదప్పియుండుట
కేమి హేతువా? దాని నెరుగ వలయు
ఇల్లును శేషువు హీనమై యుండుట
కేమి హేతువా? దాని నెరుగవలయు
పాలిచ్చు మొదవును ఒక పక్షిహీనమై
యేమిట నుండెనో? ఎరుగ వలయు
సస్యంబుకుమ్మరి సంతోషవర్జమై
యేమిట నుండెనో! ఎరుగవలయు

---

1. ఉత్తరాంతరాభిన్నమౌ నుత్తరమగు
నొకబదులె భిన్న ప్రశ్నల కొప్పునేని
నిలువ నీటికి పేరేమి? చెలువ చేతి
కెక్కి రాణించు భూషణంబేమి? మురుగు
-చంద్రాలోక సమున్మేషము. పు : 23.

2. విద్యార్థి కల్పతరువు, ద్వి, పు : 49

దీని యర్థంబు చెప్పిన దేశికుంకు
నెలలు పండ్రెండు పురసతు నేర్పుతోడ
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్ప లేకున్న నగుదునే చిన్ని నగవు.

ఇలాంటి పద్యాలెన్నో ఉన్నాయి. వాటికి శ్రీ భోగ పట్టణం వెంక టప్పయ్య పంతులు అర్థవివరణం చేశారని లోక వ్యవహారం.[1]

-రజకుడు (చాకలి) రహిదప్పాడు; కవాటాలు (తలుపులు) రహి దప్పాయి... కారణమేంటి! సమాధానం 'ఉతకలేక'. చాకలి ఉతకలేకపోవడం చేత అర్థహీనుడవుతాడు. చేతకానివాడు పైగా అర్థరహితుడు. అందుకే రహిదప్పాడు. తలుపు వెనుక భాగంలో ఇనుపకమ్మి బిగిస్తారు; ఓ కన్నాన్ని (రంధ్రాన్ని) ఉంచుతారు. ఈ కన్నం ఉతక మీద ఉంటుంది. ఉతకలుగా ఇనుప కమ్మీల్ని వేస్తారు. ఈ ఉతక (పరికరం) కవాటాల పటిష్ఠతకు దోహదం చేస్తుంది. ఉతక లేక పోతే తలుపులు కూడా రహిదప్పుతాయి. రెండు ప్రశ్నలకు ఒకే సమాధానం సరిపోయింది.

-ఇల్లు హీనంగా ఉండటానికి, పాము బలహీనమై పోవడానికి కారణ మేంటి? అనే రెండు ప్రశ్నలకు 'కప్పలేక' అని సమాధానం. ఇంటిని కప్పలేక పోతే ఇల్లు ఇల్లుగా ఉండదు. పాముకు ఆహారమైన కప్ప లేక పోతే పాము బలహీనమవుతుంది.

—పాలిచ్చే ఆవూ, కొంగ ఎందుకు హీనంగా ఉన్నాయి? అనే ప్రశ్న లకు 'చేపలేక' అని సమాధానం. పాలు చేప లేని ఆవుకు సరిగా గడ్డి వేయరు. మేత లేని ఆవు చేపలేక మరీ హీనమై పోతుంది. కొంగకు చేపలే ఆహారం. చేపలేక పోవడంతో అదీ హీనమై (చేతగానిదై —చేవలేనిదై) పోతుంది.

-సస్యంకళకళలాడ్డం లేదు; కుమ్మరి సంతోషంగా లేడు;కారణమేంటి? అనే రెండు ప్రశ్నలకు 'వాన లేక' అని సమాధానం. వానలేకపోతే సస్యం

---

1. పొడుపుకథలు, పు : 23

కళ కళ లాడదు; పైగా ఎండి పోతుంది. 'వానదం' కుమ్మరివృత్తి; వృత్తి కార్యక్రమంలో పాల్గొనని వానికి కడుపునిండా అన్నం దొరకదు. ఇక అతనికి సంతోషమెక్కడిది! రెండింటికి వానలేక అనే ఒక సమాధానమే సరిపోయింది.

పొడుపు పద్యాల్లో ఇలా రెండు ప్రశ్నలకే గాక, మూడు ప్రశ్నలకూ, నాలుగు ప్రశ్నలకూ ఒకే సమాధానం కల్పించి చెప్పినవీ కనిపిస్తున్నాయి. అవి కూడా చిత్రోత్తరాలు గానే భావించ వచ్చు. పొడుపు కథల్లో రూపకాలంకార లక్షణా లెంతగా భాసిస్తున్నా, చిత్రోత్తరాలంకారం మాత్రం అసలు సిసలైన పొడుపు కథ అనే చెప్పాలి.

**4-7 : సూక్ష్మ :–** అభిప్రాయ ప్రకటవానికి మనిషి శబ్దంతోపాటు కరచరణాద్యవయవాల్ని కదిలిస్తూనే ఉన్నాడు. భావ ప్రకటనానికి ఆదిలో అంగ విన్యాసమే ఉన్నదని, ఆ తర్వాతే శబ్దం ఆవిర్భవించిందని, శబ్దం ఆవిర్భవించినా నిత్యజీవితంలో ఆంగికాభినయం అలాగే నిలిచి పోయిందని నృత్యశాస్త్రం నిరూపిస్తోంది. ఈ అభినయంలో సంజ్ఞకే ప్రాధాన్యముంటుంది. సంజ్ఞ అనేది ఒక సంకేతం. ఆధునిక కాలంలో టెలిగ్రాఫిక్ ప్రపంచంలో 'మోర్సుకోడ్' ధ్వని సంకేతాల వంటివే చేష్టాగత సంకేతాలు. ఈ చేష్టాగత సంకేతాలు సాహిత్యంలో నిక్షిప్తమై ఉంటే వాటిని సూక్ష్మాలంకారాలంటారు.

'నేత్రాది అవయవాల చేష్టల ఆధారంగా ఒకరుతమ అభిప్రాయాన్ని తెలియజేస్తారు. అది అందుకొన్న వారు వారి అభిప్రాయాన్ని చేష్టలతోనే వెల్లడిస్తారు. అదే సూక్ష్మాలంకారమవుతుంది.'

* ఎలనాగ నీదేశ మేదేశ మన్నను
చెలివంగ మానొక్క చేత జూపె
భామరో! నీ వున్న పట్టణం బేదన్న
చంద్రుని గూడి పాషాణ మనియె
ఇందీవరాక్షి! నీ యిల్లెక్కడన్నను
తలనీరుమోసె నత్తరువు క్రింద
నేజాతి కోమలి! ఎఱిగింపు మన్నను
ఏటిలో రెణ్ణెళ్ల ఇసుగ పుచ్చె

నింతి నీకు విలువ ఎంతని అడిగిన
చుక్కచూపి సుదతి సున్నజుట్టె
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగదునే చిన్నినగవు[1]

పురుషుడు ప్రశ్నలడిగాడు; స్త్రీ సైగలు చేసింది; ఆ సైగల్లో సమాధానం లభించింది. సూక్ష్మాలంకారం ప్రకారంగా ఇద్దరి అభిప్రాయాలు కూడా చేష్టల్లో ప్రకటింపబడాలి. ఈ పై పద్యంలో ఒకరడిగారు; మరొకరు సైగలు చేశారు. ఇతనామెకు దూరంగా ఉండాలి: దగ్గర్లోనే ఉంటే ఆమె కూడా నోటనే చెప్పేది; లేదా ఆమె సమీపంలో చెలికత్తెలుండాలి. అప్పుడతని ప్రశ్నలు కూడా చేష్టలే అనుకొంటే సరిపోతుంది

వంగమానుచూపించడం వల్ల ఆ యువతిది వంగదేశం. ఆమె నివాసం చంద్రశిలానగరం. తలనీరుమోసే తరువంటే కొబ్బరి చెట్టు; కొబ్బరి చెట్టుకింద ఆమె ఇల్లు. ఏటిలో రెణ్నెళ్ళు ఇసుక పుచ్చుడ మంటే సంవత్సరంలో రెండు మాసాలు మాకు ఇసుకేగతి అని అర్థం. గంగపుత్రులు రెండు నెలలు సముద్రం మీదికే పోరు. అప్పుడు వారికి ఇసుకే గతి మరి! ఆ యువతి బెస్త అని భావించ వచ్చు. నక్షత్రాలు 27; ఆ యువతి చుక్కచూపి సున్న జుట్టింది. ఆమె విలువ 270 అన్నమాట ఇంత విప్పిచెప్పిన వాడు భావజ్ఞ చక్రవర్తే అవుతాడు.

ఈ క్రింది పద్యం బహుళ ప్రచారంలో ఉంది; ఇది చమత్కార చంద్రిక లోనిదే.

* నారీలలామ! నీ పేరేమి చెపుమన్న
తమి మీఱ నెడమ నేత్రమును జూపె
మత్తే భయాన! నీ మగని పేరేమన్న
తన చేతి జీర్ణవస్త్రమును జూపె
వెలది! నీకేమైన బిడ్డలా చెపుమన్న
కరమొప్పమింటి చుక్కలను జూపె

1. పొడుపు కథలు, పు : 26.

కుటిలకుంతల! నీదు కులము నామంబన్న
పంజరంబున నున్న పక్షి జూపె
ప్రభువు మీకెవ్వరన్న గోపకుని జూపె
ధవుని వ్యాపార మేమన్న దండమిడియె
చతుర మతులార! ఈ ప్రౌఢ జాణ తనము
తెలిసి కొనరయ్య బుద్ధి కౌశలము మెఱయ.[1]

వరుసగా వామాక్షి, కుచేలుడు, ఇరువదియేడు, ద్విజకులం, కృష్ణుడు, తపస్సు అనే సమాధానాలు వస్తాయి. ఈ పద్యంలో కూడా ప్రశ్న సంకేతంగానే భావించాలి. ప్రశ్నకు మూకాభినియ ప్రదర్శన లాంటిదిగా కూడా భావించడానికి అవకాశముంది. పొడుపు కథల్లోని సూక్ష్మాలంకారంలో ప్రశ్నలన్నీ పద వాక్య శబ్ద రూపాలుగా ఉంటాయనీ, సమాధానాలన్నీ సంకేత రూపంలో ఉంటాయనీ నియమాన్ని సడలించుకొన్నా ఇవి ఈ అలంకారం కిందికే వస్తాయి.

**4-8 : సమాసోక్తి** :– ప్రస్తుతాన్ని వర్ణిస్తోంటే అప్రస్తుతం స్ఫురిస్తే అది సమాసోక్తి అవుతుంది.

పొడుపు కథల్లో సాధారణంగా దీనికి భిన్నంగా జరుగుతుంది. అప్రస్తుతం వాచ్యమవుతుంది; ప్రస్తుతం స్ఫురిస్తుంది. స్ఫురించడమేకాదు. అదే సరైన సమాధానమవుతుంది. అయినా ప్రశ్నోత్తర గేయ ప్రహేళికల్లో కేవలం ఉత్తర భాగాన్నే పరిశీలించినప్పుడు వర్ణిత విషయానికి సంబంధంలేని అప్రస్తుతం స్ఫురిస్తుంది

* ఒకరికి చెయ్యినిచ్చీ - ఒకరికి కాలునిచ్చీ
ఒకరికి నడుమునిచ్చీ - కూకున్నానోయ్ రాజా! కూకున్నానోయ్.

* ఒకణ్ణి లోపల బెట్టి-ఒకణ్ణి బయట పెట్టి
ఒకణ్ణి పట్టుకోని కూకున్నానోయ్ రాజా! కూకున్నానోయ్.

---

1. చమత్కార చంద్రిక, పు : 18.

ఈ పొడుపుల్ని విన్న వెంటనే ఓ స్వైరిణి స్వేచ్ఛా విలాస విహార కేళీ వినోదాలు స్ఫురిస్తాయి. అవి ఇక్కడ ప్రస్తుతం కావు; అవసరమేలేదు. అర్థం వేరే ఉంది. ఆ విడుపుల్ని విన్న తర్వాత కూడా ఆ భావన పోక పోవచ్చు. వీటికి విడుపులిలా ఉన్నాయి.

* గాజుల్కి చేయినిచ్చి-అందెల్కి కాలునిచ్చి
వడ్డాణాన్కి నడుమునిచ్చి-కూకున్నానోయ్ రాజా! కూర్చున్నానోయ్

* కాటుక లోపలబెట్టి-బొట్టూసు బయట పెట్టి
అద్దమును పట్టుకోని - కూర్చున్నానోయ్‌రాజా! కూర్చున్నానోయ్.

ఈ విడుపుల్లోని స్వైరవిహారమంతా అప్రస్తుత మయిందే. అపార్థాన్ని కలిగించి, మరోదృశ్యం కళ్లముందు మెదలించే ప్రతి సన్నివేశం అప్రస్తుతం కిందికే వస్తుంది. గేయ ప్రహేళికలే గాక మామూలు పొడుపు కథల్లో అప్రస్తుతాలు స్ఫురిస్తాయి.

* బుడ్డోడు బొడ్డాన పెట్టె (పల్లేరుగాయ)
* ఒకటె పట్టుకొంటె-రెండాడాపలాడె (తక్కెడ)
* మూడు దమ్మీసలు-రెండు దిమ్మీసలు
ఓ నూకపడు కట్టె-ఓ గెల్కాడు కట్టె. (పొయిరాళ్ళు, కుండలు కట్టె, తెడ్డు)
* కాళ్ళు పంగటెంచి — కమ్మలగడించి
ఎత్తెత్తి కొటంగ ఏరులై పారంగ (ఏతం)
* కిందబొచ్చు-మీద బొచ్చు
పగలదీసి పెట్టవచ్చు (కాటుక పెట్టడం)

వీటికి వివరణం అవసరం లేదు; స్ఫురించే అప్రస్తుతాలను వదలి, గుప్తం తెలిపే ప్రస్తుతాల్ని పట్టుకోవాలి; విడుపుల్నే మూట గట్టుకోవాలి.

**4-9 : గూఢోక్తి :-** ఒక విషయం ఒక్కరికే చెప్పాలి; ఆ సంగతి ఇరుగు పొరుగుకు తెలియ కూడదు ఆ ఒక్కరి పక్కన ఉన్న వారికి కూడా అర్థం కాకూడదు. ఎవరినో సంబోధిస్తూ, ఎవరితోనో అంటున్నట్టుండాలి. ఎవరికీ తెలియకుండా ఒకరికే తెలిసేట్టు (తెలవాల్సిన వారికి తెలిసేట్టు) గూఢంగా పలికేది అయినందు వల్ల ఇది గూఢోక్తి అయ్యింది.

* వస్తావు పోతావు నాకొరకు
వచ్చి కూకున్నాడు నీ కొరకు
సగం సస్తది నా పానం
సొంతం బోతది నీ పానం,

గాలానికి కుచ్చిన ఎఱ్ఱను తినడానికి వస్తూ పోతూ ఉన్న చేపతో అంటుంది. నిన్ను పట్టుకోడానికి గాలం గాడు వచ్చాడు. నేనిప్పటికి సగం చచ్చాను నీవు గాలాన్ని మింగితే నీ ప్రాణం పూర్తి పోతుంది.

తన మీద అనుమానం వచ్చి ఇంటికి వచ్చాడు భర్త. అదివరకే ప్రియుడు వచ్చి ఇంటి వెనుక సంకేత స్థలంలో ఉన్నాడు. భర్త వచ్చిన సంగతి అతనికి తెలియాలి. ప్రమాదమని హెచ్చరించాలి. పట్టు పడితే నీవు చస్తావు, తాను సగం చస్తుందని చెప్పాలి. అందుకే గట్టిగా ఈ పొడుపు పాట ఎత్తుకొంది. ఏంటి అని భర్త అడిగితే గాలం, చేప-ఎఱ్ఱన కథ చెప్పింది. తాను చెప్పా లనుకొన్నది భర్తకు తెలియకుండా ప్రియునికి చెప్పింది కాబట్టి ఇది గూఢోక్తి అలంకారం కిందికి వచ్చింది. రంగారెడ్డి జిల్లాలో నేటికీ వ్యవహారంలో ఉన్న ఈ కింది పొడుపు పద్యం కూడా గూఢోక్తికి ఉదాహరణం,

* వచ్చెను చెచ్చెర భ్రమరమ!
మచ్చికతో మీరలిపుడు మరుగుకు జనకన్
హెచ్చేల, కదలకుండిన
చెచ్చెర భూతంబు జొచ్చు, చెడుకార్యములున్.

రాజూ మంత్రి కలిసి వేటకు వెళ్లారు. మధ్యనుండే మంత్రిని చంద్ర హాసం తేవలసిందని వెనక్కు పంపించాడు రాజు. చంద్రహాసం అంతః

పురంలో ఉంది. మంత్రి రాజాంతఃపురానికి వచ్చాడు. మంత్రిమీద మరులు గొంది రాజు భార్య. మంత్రి సంశయించాడు. కానీ చివరికి మన్మథుడే జయించాడు. ద్వారం దగ్గర చెలికత్తెను కావలి ఉంచారు. రాజుకేదో అనుమానం వచ్చి మంత్రి వెనుకనే అంతః పురానికి వచ్చాడు కావలికత్తె రాజును అల్లంత దూరాన్నుండే చూచింది. రాణికీ మంత్రికీ తెలిసేట్టుగా మరుగు ప్రదేశానికి వెళ్లవలసిందని మాట మరుగున పెట్టి చెప్పింది.

రాజు భూతం; రాణి భ్రమరం; భ్రమరమే ఇక్కడ అన్యుడు. రాజు గారు వింటే దాసి భ్రమరాన్ని సంబోధిస్తుందనుకొంటాడు. వినాల్సిన వారువినాలి. దయ్యం వస్తుంది; గదిలోకి ప్రవేశిస్తుంది. మీరు మరుగు ప్రదేశానికి వెళ్లక పోతే కార్యం చెడిపోతుంది కావలికత్తె ఈ పొడుపు పద్యంలోనిగూఢంగా భావాన్ని నిక్షిప్తం చేసింది; అందువల్ల ఇది గూఢోక్తి అయ్యింది.

**4-10 : లోకోక్తి :-** ఒక విషయాన్ని చెప్పేటప్పుడు అందులో లోకోక్తు లుండాలి. ఆలోకోక్తులు ఆ విషయానికి వన్నె తేవాలి. అప్పుడది లోకోక్త్యలంకార మవుతుంది.

పొడుపు కథ జనవ్యవహారంలో నలిగి నలిగీ సామెతగా పర్యవసిస్తుందని నిరూపిస్తూ పొడుపు కథలు-సామెతలనే ప్రకరణమే కేటాయించడం జరిగింది. ఆ ప్రకరణంలో నిరూపించిన పొడుపు సామెతలన్నీ లోకోక్త్యలంకారం కిందికి వస్తాయి. అయితే పైకి కనిపించని కథను వాటి ద్వారా అల్లుకోవాల్సి ఉంటుంది. అప్పుడే ఆ లోకోక్తికి మరీ బలం వస్తుంది; ఆ కథకు వన్నె వస్తుంది.

* బంగారం కన్న సింగారమైందొకటి
చక్కెరకన్న సబబైంగొ దొకటి
సంసారానికి సంశేదొకటి

భార్య ఇవి కావాలని భర్తతో అంది బంగారం కన్నా సింగారమైంది- కుంకుమ; చక్కెరకన్నా మేలైంది ఉప్పు: సంసారానికి సరిపోయేది రోలూరోకలి.

ఈ మూడు పాదాలు జానపదుల్లో లోకోక్తులే. విషయముంది. లోకోక్తులున్నాయి. కాబట్టిఇది లోకోక్త్యలంకారం.

* అత్తకాలం కొన్నాళ్లు
కోడలుకాలం కొన్నాళ్ళు (గొంగడి, రుమాలు)

వర్షాకాలంలో గొంగడి ఉపయోగమెక్కువ; వేసవి కాలంలో రుమాలు వాడకమెక్కువ. ఒకప్పుడది పొడుపు కథే; ఆ తర్వాత సామెతగా పరిణమించింది. అందరి మాటలు అన్ని రోజులూ చెల్లవు; ఈ రోజొకరిది; రేపింకొకరిది. ఇదికూడా జానపదుం ప్రయోగంలోనే ఉంది.

కన్య - పురుషుడు విడుపులుగా వచ్చిన 'ముల్లుమీద ఆరిటాకు పడ్డా, ఆరిటాకు మీద ముల్లుపడ్డా. ఆరిటాకురే ప్రమాదం" అనే పొడుపు సామెత కూడా లోకోక్త్యలంకారమే.

**4-11 : వక్రోక్తి :-** శ్లేషతోగాని కాకుస్వరంతోగాని అర్థాంతరాన్ని కల్పించి చెబితే అది వక్రోక్తి అలంకారం అవుతుంది. ఈ కింది కాకుస్వర ధ్వని ప్రహేళికను ఈ అలంకారానికి అన్వయించవచ్చు.

* నేనన్నా సంసారిని కానా!
దీప సంవరుకన్నా దేనా!

తాను సంసారిగానే లోక దృష్టిలో ఉంటాననీ, ఎక్కువగా లేకున్నా కనీసం దీపం చమురుకైనా అంతో ఇంతో తెస్తానని అర్థాంతరం ధ్వనిస్తుంది. 'కానా! తేనా' అనే కాకువుల వల్లనే ఇది సాధ్యమయింది.

సిద్ధేంద్ర యోగికృత భామాకలాపంలో మాధవి సత్యను ఎన్నో ప్రశ్నలడుగుతుంది. "నీ నాథుని పేరేమి? రూపురేఖావిలాసము లెట్టివి? వివరించి చెప్పమంటుంది. సత్య ఎంత చెప్పినా ఆ మాటలకున్న అన్యార్థాలవల్ల మాధవి వక్రభాష్యమే చేస్తుంది. ఆ సంభాషణంతా పొడుపు కథా లక్షణాల్ని పుణికి పుచ్చుకున్నదనలేం గాని పొడుపు కథల ఛాయలున్నాయని చెప్పవచ్చు.

* సత్య : విక్రమమెసగగక్షోణి
చక్రము రక్షించు కొఱకు సమరమునందున్
శక్రారుల దునుమాడిన
చక్రధరుండంద్రుడు వాని సామజనయ్యనా!
—చక్రము ధరించినాడమ్మా సఖీ !

మాధవి : చక్రము ధరించినవాడు కుమ్మరి వారి చిన్నవాడు
గాదటమ్మా?

సత్య : నానాథుడు కులాలుడందువేమే-శంఖముధరించినవాడే.

మాధవి : శంఖము ధరించెడు జంగము దేవరా నీ పతి? సుదతీ.

సత్య : కాదే, నెమలిఫింఛము ధరించు కమలాక్షు నెరుగవటే!

మాధవి : నెమలి ఫించము ధరించువాడు చెంచువారి చిన్న వాడు
గాదా సఖీ!... ..."[1]

"చక్రము ధరించు వాడు గాని కుమ్మరికాడు
శంఖము ధరించు వాడు గాని జంగమ దేవరకాడు
నెమలి పింఛము ధరించువాడు గాని చెంచువారి చిన్న
వాడు కాడు"

-అనే విధంగా పై భావాన్ని తీర్చిదిద్దితే ఓ పొడుపు కథ అయ్యేది. ఇలా వచ్చిన పొడుపు కథలన్నీ వక్రోక్తి అలంకార లక్షణానికి పూర్తిగా కట్టువడినాయనలేం.

* ఆకసమున దిరుగు నదిపక్షియాకాదు
తోకకలిగియుండు మేకకాదు
త్రాడు కలిగియుండు తలప యెద్దునుగాదు
దీని భావమేమి తిరుమలేశ![2] (గాలి పటం)

---

1. భామా కలాపము, పు : 17, 18.
2. తిరుమలేశ శతకము. పద్యం : 1.

* కిరీటం ఉంది రాజుకాని రాజును నేను
వాలముండి కోతిని కాను
నాట్యం చేస్తానుకాని మయూరిని కాను
నేనెవరినో? (నాగుపాము)

ఇందులో విధినిషేధాలతో ఉపమానవస్తు గుణాన్ని వాచ్యం చేయడం జరిగింది. ఉపమేయాన్ని సూచ్యం చేసి పతితనూత్రోతను విడుపు వైపుగా లాక్కొనిపోయే తత్త్వమే కనిపిస్తుంది. పూర్తి వక్రోక్తి కాదుగాని ఆయలంకారానికి సన్నిహితంగా ఉందనిపిస్తుంది.

**4-12 : వ్యాజోక్తి :-** కారణాంతరాన్ని చెప్పి ఆకార గోపనం చేయాలి. వ్యాజోక్తి అంటేనే కపట వాక్యం. నిజాన్ని దాచడానికి అసత్యాన్ని ఆధారంగా స్వీకరించడం జరుగుతుంది.

* ....కొప్పునున్నాపూలు ఎక్కడివెభామా? నీ
కొప్పునున్నాపూలు ఎక్కడివె భామా?
ఆత్తెరిపూలు ఎక్కడివె భామా?
ధూత్తెరి పూలు ఎక్కడివె భామా

గాలిధూళీ వచ్చి గంపంత మబ్బొచ్చి
కొమ్మ ఊగి కొప్పు నిండింది మగడా
కొమ్మ ఊగీ కొప్పు నిండింది మగడా!
నా తోడు రంకాడలేదుt అబ్బతోడు రంకాడలేదు
నీ తోడు రంకాడ లేదు। అమ్మతోడు రంకాడలేదు...[1]"

జానపదగేయ సాహిత్యంలో ప్రసిద్ధినందుకొన్న ఈ గేయమంతా వ్యాజోక్తి మయమే. కారణాంతరం సంగతి ఎట్లున్నా ఆకార గోపనం చేయడమే. పొడుపు కథలో ప్రధాన విషయం. అయితే గోపనం చేయబడ్డ ఆకారం విడుపు వల్ల బట్టబయలవుతుంది. కల్పిత కారణాంతరం అసత్యమని తేలుతుంది.

---

1. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి, పు : 79.

అయితే అలా కల్పించడం పొడుపు కథ పుట్టుకలోనే ఉన్నది; అందువల్ల అది అసత్యమనిపించదు.

* ఆకాశాన అరవై గదులు
గదికొక్క సిపాయి
సిపాయికొక్క తుపాకి (తేనెపట్టు)

తేనెపట్టు ఆకాశంలో ఉండదు. చెట్టుమీద, గట్టుమీద, కొండకోనల్లో, కంపల్లో ఉంటుంది. ఆ పట్టులోని రంధ్రాలు తేనెటీగల పిల్లలకూ తేనెటీగలకూ నివాసయోగ్యాలు; కానీ అవి గదులుకావు, తేనెటీగ సిపాయికాదు. ఇలా ఆకార గోపనాలున్న పొడుపుకథలెన్నో ఉన్నాయి. కొన్ని ప్రతీకలే చెప్పడం, కేవలం ఉపమానాలే చెప్పడం పొడుపు కథల సహజ లక్షణం. అయితే ఇవన్నీ వ్యాజోక్తులు కావు. రూపక ధర్మమే వీటిలో ఉందనాలి.

**4-13 : విరోధాభాస :–** విరోధానికి ఆభాసత్వముండాలి. ఆభాసత్వమంటే విరోధం ఉన్నట్లనిపిస్తుంది; కాని ఉండదు. అది తొలగిపోతుంది. అలాంటిది విరోధాభాసాలంకారమవుతుంది.

* బోడబండమీద సుగులెండబోస్తే
నాలుకలేని పిట్ట నాకిపాయె (మంగలికత్తి)

నాలికలేని పిట్ట రావచ్చుగాని నాకేదెలాగ! అది కుదరదు; లోక వ్యవహారానికిది విరుద్ధం. అయితే విడుపు మంగలికత్తి అని తేలేవరకు విరోధానికి ఆభాసత్వమేర్పడుతుంది. ఇలాంటి పద్యాలెన్నో లభిస్తున్నాయి.

* మనుజుడేమి కాడు మాటలాడగనేర్చు
పాటగాడు కాడు పాడనేర్చు
కథలు పెక్కు నుడువు కాడు జేజయ్యయు
దీనిభావమేమి తిరుమలేశ! (రేడియో)

* చలన శక్తి గలదు జంతువు గాదది
చేతులెపుడు త్రిప్పు శిశువుగాదు
కాళ్లులేవు సర్వకాలంబు నడుచును
దీని భావమేమి తిరుమలేశ! (గడియారము)

విరోధాభాసమున్న పద్యాలెన్నో తిరుమలేశ శతకంలో ఉన్నాయి. పై రెండు పద్యాల్లోని విరోధం విడుపులు తెలిసిన తర్వాత దూరమవుతుంది; అంటే విరోధ పరిహార సిద్ధి కలుగుతుంది. తెలుగు పొడుపు కథల్లోని విరోధాభాసాలంకారాల్లో విడుపు తెలిసిన తర్వాతనే విరోధాభాసత్వ మేర్పడడ మనేది సర్వ సాధారణాంశం.

**4-14 : ముద్ర :-** ప్రస్తుతార్థాన్ని ప్రతి పాదించే పదాలతో సూచించ వలసిన అప్రస్తుతార్థం సూచించడం జరిగితే అది ముద్రాలంకారమవుతుంది.

'ఆమెతరుణీ నితంబ గుర్విద్దృగ్యుగ్మ విపుల'....[1] అని వర్ణిస్తూ తాను రచించే వృత్త యుగ్మ విపులను సంస్కృత చంద్రాలోకకర్త సూచించారు. చంద్రాలోక సమున్మేషకర్త తేట గీతిని రచిస్తూ పద్యం పేరును అర్థయుక్తంగా అందులోనే నిక్షిప్తం చేశారు.[2]

తెలుగు పొడుపు కథల్లో ఈ ముద్రాలంకారం కొద్దిభేదంతో కనిపిస్తుంది. పొడుపు కథల్ని తట్లనీ, శాస్త్రాలనీ, కతలనీ, మారుకతలనీ, పొడుపులనీ తెలుగునాట వివిధ ప్రదేశాల్లో పిలుచుకొంటున్నారు. ఆపేర్లే పొడుపు

---

1. సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థ పరైః పదైః నితంబగుర్వీతరుణీ దృక్ యుగ్మ విపులాచసా॥

2. పరగు ప్రకృతార్థ పరమైన పదచయంబు
చేత సూచ్యార్థ సూచన చేయముద్ర;
మేటి శిలలైన గరగించు తేటగీతి
భక్త మానస సరసున బయలు వడదె.
-చంద్రాలోక సమున్మేషము-పు : 186.

కథల్లో కనిపిస్తున్నాయి. అంటే విడుపు సూచితంగాకుండా తట్టనో విడుపనో సూచితమవుతుందన్నమాట. ముద్రాలంకారంలో అప్రస్తుత వృత్తం పేరో, పద్యం పేరో ఆసందర్భానికి సరిగా కుదురుకొంటుంది.

* తట్టుకు మారు తట్టు
నీ పక్కలున్న దేంది! (నీడ)

తెలంగాణాలోని పాలమూరు, నల్లగొండ, రంగారెడ్డి తదితర జిల్లాల్లో పొడుపు కథల్ని తట్లంటారు. ఒకరిపై ఒకరు తట్లు తట్టుకొనేప్పుడు వేసిన మారు తట్టిది. తట్టు వాచ్యమయింది; సందర్భానికి అర్థం కుదిరింది; అందువల్ల ముద్రాలంకారమయ్యింది.

* శాస్త్రం సెన్నప్ప - నేలగీరప్ప (పార)

వరంగల్లు, కరీంనగర్, ఇందూరు, మెదక్ జిల్లాలోని కొన్ని ప్రదేశాల్లో వీటిని శాస్త్రాలంటారు. ఈ పొడుపులో శాస్త్రమనే మాట ఉన్నందువల్ల ఇదీ ముద్రాలంకారమే. "కతలన్ని వెతలాయె... అనే కథాత్మక ప్రహేళికలో 'కత' అంటే వారి ప్రేమ వ్యవహారమనీ, పొడుపుకథ అనీ అర్థాలు. అందువల్ల అది కూడా ముద్రే అవుతుంది.

* మారుకత మారుకత మంకెన్నా
మామ కొంకెన్నా
మళ్లా వస్తే కంకన్నా
నీకు నాకు లంకెన్నా (తలుపు గొళ్లెం)

రాయలసీమలోని కొన్ని జిల్లాల్లోని కొన్నిచోట్ల పొడుపుకథల్ని మారు కతలంటారు. అందువల్ల ఈ పొడుపుకథల్లో మారుకత ప్రయోగింపబడింది. ఇది కూడా ముద్రే. ఇక పొడుపుకథ పేరున్నవి మాత్రం చలనచిత్ర గేయాల్లోనే కనిపిస్తున్నాయి.

* వేస్తాను పొడుపుకథ వేస్తాను
సూస్తాను విప్పుకో సూస్తాను...

ఈ గేయంలో పొడుపుకథ పేరుంది. వీటి అన్నిటిలో, తట్టు, మారు తట్టు, కత, మారుకత, పొడుపు ఎదుపు అనే శబ్దాలు ప్రయోగించక పోయినా ప్రహేళికార్థంలో మార్పేమీ ఉండదు. వీటిని వాటిలోనే నిబద్ధించడంవల్ల, నిక్షిప్తం చేయడంవల్ల ముద్రాలంకార లక్షణాలకివి లక్ష్యాలయ్యాయి.

## 8-5 : అలంకార సాంకర్యం

పురాణ ప్రబంధ కావ్య యక్షగానాది సాహిత్య గ్రంథాల్లోని అనేక పద్యాల్లో ఒకటికి మించి అలంకారాలు కనిపిస్తాయి. ఒకే అలంకారమున్న పద్యా లున్నాయి. ఇలా ఉండడాన్నే సంకరాలంకారాలంటారు. పొడుపు కథల్లో శబ్దార్థాలంకారాల సాంకర్యం అక్కడక్కడ కనిపిస్తూనే ఉంది.

* జోడు నిట్టాళ్లు
నిట్టాళ్ల మీద కుడితి గోళెం
కుడితి గోళెంపై పొన్నకాయ
పొన్నకాయ మీద గరిక పోచలు
గరిక పోచల పైన గాడిద పిల్లలు
నాట్యమాడుతున్నాయి.
(కాళ్ళు-పొట్ట-తల-జుట్టు-పేలు)

పాదాంతంలోని పదాలు, పాదాదిలో గ్రహించడం జరిగింది. ఇది ముక్తపదగ్రస్తం. ఇది ఏ పాదానికా పాదమే పరిశీలిస్తే పాదపాదానికి ఓ రూపకం కనిపిస్తుంది. నిట్టాళ్ళకు కాళ్ళకు, కుడితి గోళానికి పొట్టకు, పొన్న కాయకు తలకు, గరిక పోచలకు జుట్టుకు, గాడిద పిల్లలకు పేలకు తాద్రూప్యాన్ని అభేదాన్ని పాటించడం జరిగింది. ఈ అభేదం గాని తాద్రూప్యం గాని విషయులను జోడించుకొని చూసినప్పుడే తెలుస్తుంది. అలా జోడించుకోక కేవలం ఉపమానాల్నే చూస్తే అది రూపకాతిశయోక్తి అవుతుంది. ఈ కారణంగా ఈ పొడుపుకథలో రూపక, ముక్తపదగ్రస్త, అతిశయోక్తి తదితర అలంకారాల సాంకర్యముందనాలి.

* చినతాంబాలం - పెద తాంబాలం
  నూకల బువ్వ - నూనె ధార
  (భూమి - ఆకాశం — చుక్కలు - వర్షం)

పొడుపుల్నీ విడుపుల్నీ అనుసంధించుకొని పరిశీలిస్తే ఈ పొడుపుకథ నిండా రూపకాలంకారాలే కనిపిస్తాయి. చిన తాంబాలానికి భూమికి, పెద తాంబాలానికి ఆకాశానికి, నూకల బువ్వకు చుక్కలకు, నూనెధారకు వర్షానికి అభేదం చెప్పబడింది. అయితే ప్రసిద్ధోపమానాలుగా పరిగణితమయ్యే భూమినీ చుక్కల్నీ ఉపమేయాలుగా చెప్పడం వల్ల ప్రతీపాలాంకార మవుతుంది. అందు వల్ల ఇందులో రూపక ప్రతీపాల సాంకర్యం జరిగిందనాలి. అయితే ఆలంకారజ్ఞుల మతం ప్రకారంగా సాంకర్యం దోషమేమీ కాదు. అది శాస్త్ర సమ్మత విషయమే.

ఇంతవరకు పరిశీలించిన ఈ అలంకారాలే గాక మరీ సూక్ష్మ శోధనం వల్ల మరిన్ని ఉదాహరించే అవకాశముంది. ఉపమేయోపమ, ఉత్ప్రేక్ష, దీపిక, ఆవృత్తి దీపిక, దృష్టాంత, నిదర్శన, వ్యతిరేకత, అప్రస్తుత ప్రశంస, వ్యాజస్తుతి, వ్యాజనింద, అసంగతి, చిత్ర, కారకదీప, లలిత, లేశ, మీలన, సామాన్య, పిహిత, వివృతోక్తి, ఛేకోక్తి తదితరాలంకారాలెన్నో సూక్ష్మాతిసూక్ష్మ శోధనవల్ల వెలికి వస్తాయి. అయితే ఇవన్నీ పూర్ణాలంకారాలుగా కనిపిస్తాయనలేం! ఆయలంకారాల ఛాయలే ప్రధానంగా కనిపిస్తాయి; అంతేగాక వినూత్నాలంకారాలు, అపూర్వాలంకారాలుకూడా ప్రాదుర్భవించే అవకాశముంది. జానపద సాహిత్యంలోని అలంకారాలన్నింటినీ పరిశీలించేప్పుడు ఈ అపూర్వాలంకారాల్ని సాహితీలోకానికి అందించే ప్రయత్నం జరగాల్సి ఉంది.

ఈ ప్రకరణ ప్రారంభంలో పొడుపు కథల అణువణువున అలంకారాలున్నాయన్నాను. వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస, లాటానుప్రాస, అంత్యప్రాస, యమక, ముక్తపదగ్రస్తాది శబ్దాలంకారాలన్నీ తెలుగు పొడుపు కథల్లో సముచిత స్థానంలో ఉన్నాయని నిరూపించడం జరిగింది. ఉపమ,రూపకం, ప్రతీప, అతిశయోక్తి, శ్లేష, చిత్రోత్తర, సూక్ష్మ, సమాసోక్తి, గూఢోక్తి, లోకోక్తి, వక్రోక్తి, వ్యాజోక్తి, విరోధాభాస, ముద్రాద్యలంకారాలన్నీ పొడుపు కథల్లో

ఉన్నాయని ప్రదర్శించడం జరిగింది. సంకరాలంకారాలు కూడా పొడుపు కథల్లో పొదురుకొన్నాయనీ, సూక్ష్మ పరిశీలనంవల్ల కొన్ని అపూర్వాలంకారాల్ని కనుగొనే అవకాశముందని ఆశించడం జరిగింది.

ఈ అలంకారాల ప్రకరణం ఇంకా విస్తారాంశాల్ని ఆశిస్తుంది. అయినా సంగ్రహంగానే చెప్పడం జరిగింది. కాని ఈ అలంకారాలన్నిటికి మూలమనిపించే మరొక అంశాన్ని ఇక్కడ ప్రస్తావించాల్సి ఉంది. ఆధునిక సాహిత్యంలో ఈ విషయం మీద సిద్ధాంత రాద్ధాంతాలింకా జరుగుతూనే ఉన్నాయి. సాహితీ గవేష కులెందరో ఈ వాదం కొమ్ము కాస్తూనే ఉన్నారు. కళా రంగంలో, జానపద విజ్ఞాన రంగంలో, పారమార్థిక ప్రపంచంలో ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు జరుగుతున్నాయి. అతి ప్రాచీన కాలం నుండి దైనందిన జీవితంలోనూ, కళా రంగంలోనూ, గ్రంథాల్లోనూ ఏదో ప్రయోగం జరుగుతూనే ఉంది. పొడుపు కథలకూ, అందులోని సర్వాలంకారాలకు మూలమైన ఆ ప్రతీక వాదాన్ని పరి శీలిద్దాం.

## 8-6 : ప్రతీక వాదం

ఈ మనిషి ఓ మృత్పిండం; ఇతను అమృత తుల్యుడు కావాలి. అందు కని పట్టిన కాలమెంతో, జరిగిన పరిణామాలెన్నో ఊహించాల్సిందే. రెండు లక్షల మిలియన్ల కింది శిలాజాలే లభిస్తున్నాయంటే ఈ మానవ నాగరికతా సంస్కృతుల ఆద్యంతాలెక్కడో ఇదమిత్థమని యథార్థంగా చెప్పడం, చెప్పి ఒప్పించడం సాధ్యం కాదు. ఈ సుదీర్ఘకాల ఖండంలో మానవ చరిత్రకే ప్రాధాన్యం వచ్చింది. ఆ మానవ చరిత్రలోనే భాష పుట్టింది; పెరిగింది. భావం వికసించింది. ఒక వస్తువు తత్త్వాన్ని నిరూపించి సిద్ధాంతీకరించడానికి అనేక పద్ధతులావిర్భ వించినై. వస్తు పరిచయం, వస్తువు అంతరంగం తెలియజేయడమే ప్రధానాంశ మైనా ప్రకటనకు కూడా ప్రాముఖ్యం లభించింది. ఏ విషయాన్ని ఎలా ప్రక టించాలి అనే విషయంతో భిన్న మార్గాలు కనిపించినై. ఈ భిన్న మార్గాలు సృష్టించింది మనిషే ఏ మార్గం నిలిచిందో అది దర్శనమైంది. సాహిత్యం లోనూ ఈ మార్గాలే అలంకారాలుగా, వక్రోక్తులుగా, రీతులుగా, ధ్వనులుగా స్థిర పడ్డాయి.

సాదృశ్యాలూ, సారూప్యాలూ, ఊహా లోకాలూ, అత్యుక్తులూ అన్నీ వేర్వేరే అనిపించినా ఒక ఏక సూత్రత మాత్రం కనిపిస్తుంది. వీటన్నిటిలో వస్తువులకు - వస్తువులకు, జీవులకు - జీవులకు, వస్తువులకు - జీవులకు, జీవులకు - వస్తువులకు అంతస్సూత్ర సంబంధమనేది ఒకటి ఉంది. అలా లేకపోతే అన్వయం ఉండదు; అనుబంధం కుదరదు. అంతేగాక ఈ ప్రకృతి ఉంది; ఇది పరిణామం చెందుతుంది. ఇది నాశనమయ్యేది కాదు. అందుకే ఈ పరిణామమనేది ఓ మాయలా అనిపిస్తుంది. ఈ జీవుడున్నాడు; ఇతనూ పరిణామం చెందుతున్నాడు; ఇతనికీ నాశనం లేదు. ఇదీ మాయలానే కనిపిస్తుంది. ఈ ప్రకృతినీ - ఈ జీవుణ్ని నడిపించే విశ్వశక్తి ఒకటి ఈ గాలిలో, నీటిలో, నిప్పులో, నేలలో, శూన్యంలో దాగి ఉంది. ఆదే సమస్త విశ్వాన్ని బంధిస్తుంది. అది విశ్వాత్మ (Universal Soul). అది ఉంది కాబట్టే వేర్వేరుగా కనిపించే ఇవన్నీ అతుక్కొంటున్నాయి. అనురాగ బంధాల్ని మరీ బిగించుకొంటున్నాయి.

సాహిత్యంలో కూడా దానినే 'ధ్వని' అన్నారు. అది పెద్దమాట అయ్యింది. ఈ ప్రపంచంలో అది కనిపించకుండానే కనిపిస్తుంది. అది లోనా బయటా అంతటా ఉంటుంది. ఇదిగాక శబ్దార్థాల అనుబంధంతో పైన చెప్పిన జీవప్రపంచాన్ని, పదార్థ ప్రపంచాన్ని అనుసంధిస్తూ వెళ్లే ఓ సంకేత శక్తి ఉంది. అదే ప్రతీక.

ఈ ప్రతీక విషయంలో ప్రాచీన భారతీయ కావ్య శాస్త్రాలంకార మర్మజ్ఞులెవ్వరూ పట్టించుకోలేదు. అయితే వారు ప్రతీకల విషయం ప్రస్తావించలేదుగాని వీటిని లక్షణార్థాల కింద గ్రహించారు. ప్రతీకలన్నీ ఏదో ఒక అలంకారంలో అంతర్భవిస్తాయి. ఓ చోట ఉపమగా మరోచోట రూపకంగా భాసిస్తాయి.

భగవంతుడు విశ్వవ్యాపి. ఓంకార ధ్వని అంతటా వినిపిస్తుంది. పశుపక్ష్యాదులు కూడా ఆ ధ్వని చేస్తాయి. శబ్దబ్రహ్మగా అక్షర పరబ్రహ్మగా భగవంతునికి ఓంకారం (ॐ) ప్రతీకగా నిలచింది. స్థాణువైన పరమేశ్వరునికి స్థూపాకార లింగం ప్రతీక అయ్యింది. సర్వమంగళ అయిన జగన్మాత పానవట్టంగా నిలచింది. అంతరాలయం, బహిరాలయం, మంటపం, స్తంభాలతో నిలిచిన దేవాలయం దేహానికే ప్రతీకగా నిలిచింది. వికసించిన పద్మం హృదయానికి,

పద్మంలో సృష్టికర్త వికాసానికి ప్రతీకగా నిలిచారు. కొన్ని కారణాలవల్ల లౌకిక జగత్తునుండి దూరమైనట్లు మనకనిపిస్తున్నా, అధ్యయన శీలురైన వారికి ఈ వికాస జగత్తులో ఇవన్నీ మైలురాళ్లుగానే కనిపిస్తాయి. ఆధునిక కాలంలో పాశ్చాత్య సాహిత్య విజ్ఞాన ప్రపంచానికి ఈ ప్రతీకలే కేంద్ర బిందువులుగా నిలిచి, శాస్త్ర వేత్తల్ని తమచుట్టూ తిప్పుకొన్నాయి. ప్రతీకకు స్థిరబిందు శక్తి కాదు; విషయ చర్చలోకి దిగినప్పుడు విస్ఫోటన శక్తి కూడా ఉన్నట్టు భావిస్తాం. అందుకే అది చర్చనీయాంశమైంది.

పాశ్చాత్య పండితులు ప్రతీకలకొక ప్రత్యేకత కల్పించారు. ప్రతీక వాదాన్ని (Symbolism) పరిపోషించారు ఫ్రెంచి రచయితల్లో డికడెంట్స్ (A group of writers) తమను తాము ప్రతీకవాదులుగా ప్రకటించుకొన్నారు. సంకేతాలు-ప్రతీకలు లేకుండా భావప్రకటనం సాధ్యంకాదని వీరిలో కొందరు అభిప్రాయ పడ్డారు. పాశ్చాత్య రచయితల్లో ఈ ఉద్యమాన్ని పెంచి పరిపోషించిన వారిలో మెలార్మా, బాడ్లెర్, వెర్లేన్, బౌరా తదితరులు ముఖ్యులు. అమెరికాలో ఎమర్సన్, హెచ్ డి. థోరు, హెర్మెన్ మెల్‌విల్, ఎడ్గెలరన్‌పో తదితరులు ప్రతీక వాదోద్యమం వికసించే అమూల్యాభిప్రాయాలు సాహిత్యలోకానికందించారు. ఆంగ్లకవుల్లో ఆర్థర్ సైమన్స్, ఆస్కార్ వైల్డ్, ఎజ్రా పౌండ్, టి ఎస్ ఇలియట్, డబ్ల్యు బి ఏడ్స్ తదితరులు ప్రతీకవాద పరిపోషకులే. ఈ రచయితల అభిప్రాయాల సారాంశమిది.

"కవితా వస్తువు వాచ్యంకారాదు; అది సూచ్యం కావాలి. సాధారణ జీవితమే ఒక ప్రతీక. ప్రతి విషయం ప్రతీక మాధ్యంగానే వ్యక్తం కావాలి. కవి అనుభూతుల అభివ్యక్తీకరణానికి ప్రతీకలుపయోగించుకోడం తప్పనిసరి. క్షణక్షణం మారే అనుభూతుల్ని వ్యక్తం చేయాలంటే కొన్ని గుర్తులు కావాలి; అవే ప్రతీకలు. భావచిత్రాల అనుక్రమణిక ద్వారా అధ్యయనశీలురీ ప్రతీకల్ని అర్థం చేసుకొంటారు అతి పురాతన కాలానికి సంబంధించిన ఒకానొక విషయం స్మృతిలో స్పష్టాస్పష్టంగా ఉన్నప్పుడు సంపూర్ణావగాహన కలగడానికి ప్రతీకలే సహకరిస్తాయి "... ఈ అభిప్రాయాలందరివి. ఒకదగ్గర జోడిస్తే ఈ రూపు దిద్దు కొన్నాయి. ప్రత్యేకంగా మరికొందరి అభిప్రాయాల్ని ప్రస్తావిస్తా.

"అసదృశమూ వ్యక్తిగతమూ అయిన అనుభూతుల్ని అభివ్యక్తం చేయడానికై రూపకాల (ప్రతీకల) కలగలుపుద్వారా చేసే ప్రయత్నమే సింబాలిజం" అని ఎడ్మండ్ విల్సన్ నిర్వచనం.[1]

"పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగంలో సహజత్వానికి వ్యతిరేకంగా పుట్టి, అస్పష్ట సంకేతాలద్వారా, ఆధ్యాత్మిక మూల్యాన్ని అభివ్యక్తం చేయడానికై జరిగిన ప్రయత్నం కారణంగా ఆవిర్భవించిన కళాసంబంధి ఉద్యమమే సింబాలిజం" అని పరిశోధకులంటున్నారు.[2] ఇంతేగాక ప్రతీకవాదానికున్న పరమావధిని ఇలా తెలియజేస్తున్నారు.

"సంగీతంలో ఉపయుక్తం గాని పదార్థానికి స్థానం లేదు. ప్రక్రియ (రూపం), పదార్థం ఒకదానితో ఒకటి విడివడని స్థితిలో సమ్మిశ్రితాలై ఉంటాయి. కవిత్వంలో కూడా ఈ సంపూర్ణత్వాన్ని సంసిద్ధింపజేయడమే సింబాలిస్ట్ కవితకున్న పరమావధి."[3]

---

1. Edmund Wilson defines symbolism as "an attempt by carefully studied means - a complicated association of ideas represented by a medly of metaphors - to communicate unique personal feelings." —The Axels Castle.

2. Symbolism has been defined as an artistey movement flourishing at the end of the nineteenth Century, in reaction to faith in nature, and endeavouring to represent spiritual vaiues by means of obstract signs.
—Practical Criticism, P : 114.

3. In music, there is no dross, no inert residue. Form and content coalesca. It was to they purified wholeness that symbolist poetry aspired. Valery remarks in his essay on Baudelaire that poe.
—Literary Criticism : A short History, p : 595.

ఈ విధంగా నిర్వచనాల్ని లక్షణాల్ని నిర్దేశించి, పరమావధుల్ని ప్రకటించి ప్రతీకవాదాన్ని ఒక ఉద్యమంగా పాశ్చాత్య రచయితలు నడిపించినా, ప్రజల దైనందిన జీవన సమస్యలకు ఈ ఉద్యమం దూరంగా ఉన్నందువల్ల దీనికి ప్రజాదరణ లభించలేదు.

ఇక భారతీయ సాహిత్యంలోని వేదాల్లో ఉపనిషత్తుల్లో, పురాణాల్లో, కావ్యాల్లో ప్రతీకలెన్నో ఉన్నాయి. వేదోపనిషత్తుల్లోని అర్థాలు అందనప్పుడు ప్రతీకార్థాల్ని ప్రక్కకు నెట్టి పురాణాలు కథా సాహిత్యాన్ని అందించాయి. దానితో సరైన అర్థం పోయింది; వేదార్థం మరీ దురవగాహమైంది. సాయణుల భాష్యం కూడా వేదాన్ని సమగ్రంగా స్పృశించలేదు. ఇక పాశ్చాత్యుల వ్యాఖ్యానాలు భారతీయుల్ని అనేక భ్రమ ప్రమాదాలకు గురిజేశాయి. వేదోపనిషత్తుల్లోని ప్రతీకల్ని ఆధునిక యుగంలో కొంతవరకైనా సరే సమగ్రంగా అందించి స్పష్టార్థాన్ని బయల్పరచినవారు శ్రీ అరవిందులు, శ్రీ దయానందులు.

ఋగ్వేదంలో అదో వృక్షం. ఆ వృక్షంమీద రెండు పక్షులు. కింది కొమ్మమీది పక్షి చేదుగా-తీయగా ఉన్న పండ్లను తింటూ దుఃఖిస్తుంది; సుఖిస్తుంది; పై కొమ్మమీది పక్షి శాంతంగా ఉంది; గంభీరంగా ఉంది; సుఖదుఃఖానుభూతులకు అతీతంగా ఉంది. కింది కొమ్మమీది పక్షి జీవునికి ప్రతీక; పై కొమ్మమీది పక్షి దేవునికి ప్రతీక.[1]

ఛాందోగ్యోపనిషత్తులో కేవల 'సామ' శబ్దానికే పృథివి అగ్నులనీ, అంతరిక్ష వాయువులనీ, ద్యులోకాదిత్యులనీ, నక్షత్ర చంద్రులనీ అనేకార్థాలు సంకేతింపబడ్డాయి.[2] ఇవన్నీ ప్రతీకలే.

ఇక మన పండుగలూ-పబ్బాల వెనుక కూడా ప్రతీకలే కనిపిస్తున్నాయి. వినాయక చవితి, నాగుల చవితి, నాగుల పంచమి, మహాలయ అమావాస్య, విజయదశమి, సంక్రాంతి, మహాశివరాత్రి, రథసప్తమి, ముక్కోటి ఏకాదశి, హోళి తదితర పర్వదినాలకు పండితులు ప్రతీకార్థాలు ప్రవచిస్తున్నారు.

---

1. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత 1-164-20, పు : 525.
2. ఛాందోగ్యోపనిషత్తు (1-6-1, 1-6-2, 1-6-3, 1-6-4)

అంతేగాక పురాణ గాథల్లోని ప్రతి సన్నివేశానికి ప్రతీకార్థాలున్నాయనీ, ప్రతీకల మీదనే పురాగాథా నిర్మాణం జరిగిందనే ఒక వాదం బలంగా వినిపిస్తోంది.

ఇలా భారతీయ సాహిత్యంలో అడుగడుగునా కనిపించే ప్రతీకలు పొడుపుకథల అణువణువును స్పృశించాయి. ఈ ప్రతీకలు మనిషి పుట్టినప్పటి నుండి దర్శిస్తూనే ఉన్నాడు. అక్షరాలన్నీ ప్రతికలే! చైనీయుల బొమ్మల భాష ప్రతీకాత్మకమే విగ్రహాలన్నీ ప్రతీకలే. గుర్తుకొరకు ఏర్పడ్డ పేర్లన్నీ ప్రతీకలే. గుణం రూపుగట్టి ఆకారంగా నిలిచిన ప్రత్యంశం ప్రతీకే. ఇలా జీవజగత్తు సర్వే సర్వత్ర స్పృశించిన ప్రతీకలు భావ ప్రకటన సౌందర్యాన్ని పెంచాయి; వికాసశీల సమాజానికి స్మృతుల సోపానాలుగా అవి మిగిలాయి; భావసౌధ నిర్మాణానికి అవి పునాదులుగా నిలిచాయి.

పొడుపు కథా కారుడు ఈ ప్రతీకల్ని పట్టుకొన్నాడు. ప్రకృతి చిత్రాల్ని హృదయ ఫలకాన ముద్రించుకొన్నాడు తన భావాలకు సామ్యాన్ని గుర్తించి వాటిని బహిర్గతం చేశాడు. భావం మరుగున పడింది; భావానికి అనుగుణంగా ఉన్న ప్రతీక మాత్రమే బహిర్గతమయింది. వీటిని శ్రోత విన్నాడు; పఠిత చదివాడు. పొడుపు కథాకారుని భావాన్ని అందుకొనే యత్నంలో ఆ భావాల్లోకి వెళ్ళే ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో సాఫల్యాన్ని సాధించినప్పుడు మాత్రమే సరియైన అర్థాన్ని సమాదరించిన వాడయ్యాడు.

ప్రతీక ఎప్పుడూ సూచ్యమే. అంతరార్థం సూచితం కాదు. ఆ అంతరార్థాన్ని దర్శించాలి. పొడుపుకథల్లో నూటికి తొంబదింటి సూచ్య వాచ్యార్థాల్ని పరిశ్రమ ద్వారానే పట్టుకోవాల్సి ఉంటుంది. సూచ్య వాచ్యాల వైవిధ్యం కారణంగా ఒకే ప్రతీక "సహస్ర బాహూదర వక్త్రనేత్ర" అయ్యింది. అందుకే అన్ని అలంకారాలకు అవకాశం కలిగింది.

శబ్ద చిత్రాలుగా, అర్థ ప్రయోజనాలుగా పొడుపు కథల్లోని ఆయా అలంకారాల వైవిధ్యాన్ని ఇంతవరకు స్థూలంగా పరిశీలించడం జరిగింది. ఇప్పుడలా గాక వస్తువులకు — వస్తువులకు, జీవులకు - జీవులకు, వస్తువులకు జీవులకు వాటి వాటికున్న సామ్యాల్ని బట్టి, ధర్మాన్ని బట్టి ప్రయోగించిన ప్రతీకల్ని పరిశీలిద్దాం. ఇందులో స్థిర ప్రతీకల్ని అస్థిర ప్రతీకల్ని కూడా సమీక్షిద్దాం;

**6-1 : స్థిరాస్థిర ప్రతీకలు :-** పురాగాధా సాహిత్యంలో కొన్ని కథలు విన్న వెంటనే కొన్ని పాత్రలు గుర్తుకు వస్తాయి. ఆ పాత్రలు పొడుపుకథలో ప్రస్తావింపబడతాయి. అయితే ఆ ప్రస్తావన ఆ పాత్రల కొరకు గాదు. వాటి పేరిట విడుపును రాబట్టే ప్రయత్నమే ఇది 'మూడు కన్నులుండు ముక్కంటియా కాదు'... అనే పద్య పాదంలో మూడు కన్నులుండు అనే మాట ముక్కంటికి ప్రతీక. ఇది స్థిర ప్రతీక; అయినా టెంకాయకు వాడడం జరిగింది. ఇదే విధంగా దేవేంద్రునికి సంబంధించి వేయి కన్నులుండు 'వేల్పురేడును గాదు' ... జల్లెడ రంధ్రాల్ని తెలుపుతోంది.

* పడతి మోసె నొకడు, పడతి మేసె నొకడు
పడతి నెదను బెట్టి బ్రతికె నొకడు...

వేమన ఈ అర్ధ పద్యంలో శివ బ్రహ్మ విష్ణువులకు వేసిన ఈ పదాలు రూఢి పడ్డ భావ ప్రతీకలే. మరొకరికి ఇవి వేయరు.

* ఇంతింతాకు - బ్రహ్మంతాకు
పెద్దలు పెట్టిన పేరంటాకు (మంగళసూత్రం)

ఇందులో పేరంటాకు అనేమాట మరొక దానికి వేయరు. మంగళ సూత్రానికే వేస్తారు. ఇది సామాజిక జీవనంలో స్థిరపడ్డ ప్రతీక. పౌరాణిక సాంప్రదాయక, తాత్త్విక సంబంధులైన కొన్ని అంశాలు ఇలా స్థిరప్రతీకలుగా వెలుగుతాయి. కవి సమయాలను బట్టి ప్రయోగించే అలంకారాల్లో కొన్ని స్థిర ప్రతీకలున్నాయి; కొన్ని అస్థిర ప్రతీకలున్నాయి. ఉదాహరణానికి శంఖాన్ని గళానికీ స్వచ్ఛతకూ ప్రతీకలుగా వేయవచ్చు. అరటి స్తంభాల్ని పిక్కలకు మరో బలహీనమైన వస్తువుకూ పోల్చవచ్చు. పద్మాన్ని ముఖానికీ కన్నులకూ ప్రతీకగా ప్రయోగించ వచ్చు అందంగా ఉన్న ఎవరినైనా మన్మథుడనవచ్చు. ఏ సర్వజ్ఞుణ్ని అయినా శంకరునితో చెప్పవచ్చు. ఏ ధనవంతుణ్ని అయినా కుబేరునితో పోల్చవచ్చు. ఈ ఆత్మలన్నింటిని పరమాత్మతో సరిపోల్చవచ్చు. ఇవి ఒకసారి స్థిర ప్రతీకలుగా, మరోసారి అస్థిర ప్రతీకలుగా కనిపిస్తాయి.

ఇక పొడుపు కథల్లో వస్తు, గుణ, రూప సామ్యాన్ని బట్టి వేసిన ప్రతీకల్లో అస్థిరాలే ఎక్కువ. ఇవి తప్పని సరిగా దానికే వేయాలనే నిర్దేశమేమీ ఉండదు; అయితే నిర్మాణాన్ని బట్టి ఆశించిన విడుపే వస్తుందనేది గుర్తుంచుకోవాల్సి ఉంది.

* రాజావారి తోటలో రోజా పూలు
  చూచే వారే కాని కోసేవారు లేరు.

రాజావారి తోట ఆకాశం; రోజాపూలు నక్షత్రాలు. ఆకాశానికి తోట ప్రతీక. నక్షత్రాలకు రోజా పూలు ప్రతీకలు. ఇవి అస్థిర ప్రతీకలు. రాజా వారి తోట ఎప్పుడూ ఆకాశానికే ప్రతీక కాదు; రోజాపూలు ఎప్పుడూ నక్షత్రాలకే ప్రతీకలు కావు.

* నోరులేని పిట్ట - తోకతో నీళ్ళు తాగుతుంది.

నోరులేని పిట్ట దీపం; తోక వత్తి; నీళ్ళు నూనె. దీపానికి పిట్ట, వత్తికి తోక, నూనెకు నీళ్ళు నిత్యంవేసే ప్రతీకలు కావు. అవి ఆయా వస్తు గుణ ధర్మాలను బట్టి వేటికైనా ప్రతీకలుగా వేయవచ్చు. పొడుపు కథల్లో రూఢిపడ్డ శబ్ద ప్రయోగాలు జరిగిన పౌరాణిక, సాంప్రదాయకాంశాలు స్థిర ప్రతీకలుగా, మిగతావి అస్థిర ప్రతీకలుగా పరిగణించే అవకాశముంది. ఈ స్థిరాస్థిరాల్ని సాహిత్య ప్రపంచానికి పట్టిచూస్తే కొన్ని అపూర్వాంశాలు వెలుగులోకివచ్చే అవకాశం కూడా ఉంది. ఇక వస్తు ప్రపంచానికి, జీవ ప్రపంచానికి వేసిన ప్రతీకల్ని పరిశీలిద్దాం.

**6-2 : వస్తువులు + వస్తువులు :-** జీవం లేని వన్నీ పదార్థాలుగా ద్రవ్యాలుగా వస్తువులుగా వ్యవహృత మవుతాయి. అయితే భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం ఇందుకు బాధకంగా ఉన్నాయి. ఈ పంచ భూతాలతో జీవుని రూపుదిద్దుకొంది. ప్రకృతి పంచభూతాత్మకమైంది. ప్రకృతి జీవుల అవసరాలను తీర్చే కొన్ని పరికరాలే వస్తువులు. పొడుపు కథల్లో ఆ వస్తువులకు వస్తువులనే ప్రతీకలుగా వాడిన వెన్నో ఉన్నాయి

* సిన్న యింట్ల - సిల్కు సెక్కలు (అగ్గిపుల్లలు)

మట్టి మిద్దెల పై కప్పులకు దూలాలు, వాట్లు, చిలుకు చెక్కలు వాడతారు. గది గోడలపై దూలాలుంచుతారు. దూలాలకు జోడించి వాట్లు పెడతారు. వాట్లపై చిలుకు చెక్కలు పేరుస్తారు. వాటిపై వేపాకు పరచి, బురదవేసి, చౌడు మట్టిని పోసి దిమ్మిస వేస్తారు. అప్పుడు వర్షం పడ్డా ఇంట్లోకి నీరుకారక పక్కకే జారిపోతుంది. ఎంత చిన్న పొడుపు కథకైనా ఎంతో కొంత సామాజిక జీవన మిళ్లే ఉంటుంది. ఇక్కడ మట్టి మిద్దె కావిధంగా ఉపకరించే చిలుకు చెక్కలు అగ్గిపుల్లలకు ప్రతీకలు - చిన్న ఇల్లు అగ్గి పెట్టెకు ప్రతీక. ఇక్కడ కేవలం ప్రతీకలే సూచింపబడ్డాయి; వీటిని పొడుపుకథల్లో పొడుపులంటారు. అగ్గి పెట్టె- అగ్గిపుల్లలు ఆశించిన అర్థాలు; వీటినే విడుపులంటారు.

* పట్టు సంచిలో - బంగారం గుండ్లు (ఎఱ్ఱ మిరపకాయలు)

పచ్చి మిరప పండు మిరప అయినప్పుడు అది పట్టు (ఎఱ్ఱ) సంచివలె కనిపిస్తుంది. అందుకే పండు మిరపకు పట్టు సంచి ప్రతీక అయ్యింది ఆ పండు మిరప నిండా గింజలుంటాయి, అవి బంగారు రంగులో ఉంటాయి. అందువల్లనే మిరప గింజలకు బంగారు గుండ్లు ప్రతీకలయినై.

* బంగారు సెంబుల
ఎండి క(గ)చ్చకాయలు (పొప్పడి పండు)

బొప్పాయి పండుగా మారి స్వర్ణవర్ణ సంశోభిత మవుతుంది. అందుకే బొప్పాయికి బంగారు చెంబు ప్రతీకగా చెప్పడం జరిగింది. ఆ పండులోని ధాన్యం తెలుపు బూడిదల సమ్మిశ్రిత వర్ణంలో ఉంటుంది. సరిగా అది గచ్చకాయ రంగే. కాని ఇక్కడ వెం(ఎం)డి శబ్దాన్ని వేయడంలో తెలుపునే ఎక్కువగా సూచించినట్లయింది. పొప్పడి గింజలకు ఎండి గచ్చకాయలు ప్రతీకలైనై.

* ఒక్కటే గుంతలో — రెండు పీనుగలు (వేరుశెనగ)

* సీకటింట్ల - సింతపండు (జీవిలి)

* నల్లని చెరువుల - ఎఱ్ఱని తామర (దీపం)

* గట్టుకాలంగ - బట్టలెండేస్సి (రొట్టెలు)

ఈ పై పొడుపు కథల్లో వేరుసెనగ పొట్టుకు గుంత, వేరుసెనగ గింజలకు పీనుగలు, చెవికి చీకటిల్లు. జీవిలి (గుబిలి) కి చింతపండు, చమురున్న దీపం బుద్ధికి నల్లని చెరువు, జ్యోతికి ఎఱ్ఱని తామర, పెనం వేడెక్కడానికి గట్టుకాలడం, రొట్టెలు చేయడానికి బట్టలు ఎండ వేయడం ప్రతీకలుగా ప్రయోగించడం జరిగింది. ఈ విధంగా పశు పక్ష్యాది జీవ జంతురాశికి పనికివచ్చే వస్తువులకు వస్తువులనే ప్రతీకలుగా ప్రయోగించినవి లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి.

**6-3 : జీవులు + జీవులు :-** ప్రాణాలున్నవన్నీ జీవుల కిందికే వస్తాయి. పిపీలికాది బ్రహ్మపర్యంతం ఉన్న జీవరాశి అనంతమైందే. అలాంటి జీవులకు జీవులనే ప్రతీకలుగా పొడుపు కథలు స్వీకరించాయి. జీవుల అంగాంగాలకు జీవులుగానీ అంగాంగాలు గానీ ప్రతీకలుగా కనిపిస్తున్నాయి. సామ్యధర్మంలోని సమగ్రతగానీ పూర్ణతగానీ అక్కరలేదు. ఆంశికమాత్ర సాదృశ్యముంటే చాలు; జీవికి జీవి ప్రతీక అయ్యింది.

* ఎద్దు పండంగ - మోకు సాగంగ (గుమ్మడి)

వ్యవసాయదారుడు మోట కొడతాడు; మోటకు మోకుంటుంది; మోకుకాడికి ఎద్దుల్ని కడతారు. ఎద్దు కదలకుండా పండుకొంటే మోకు సాగదు- అంటే మోకు ఆడదు- నడవదు. మోకు ఆడడాన్నే సాగడం అంటారు. మోకు సాగితేనే మోట నడిచినట్లు. ఎద్దు పండుకొన్నా మోకు సాగిందని ఈ పొడుపుకథ అంటున్నది. కేవల ప్రతీకలనే పరిశీలనలోకి తీసుకొన్నట్లయితే అది అసంగతమనిపిస్తుంది. అసంగతాన్ని సంగతం చేయడమే పొడుపుకథ లక్షణం.

గుమ్మడి తీగకు పూత పూస్తుంది; పిందె పడుతుంది; కాత అవుతుంది; కాయ కదలదు. అది అక్కడ్నే ఉంటుంది. అక్కడే పంటవుతుంది. పూత, పిందె, కాయ, పండు అయిన క్రమ పరిణామ వికాసకాలంలో గుమ్మడికాయ ఉన్నచోట ఉండగా తీగ మాత్రం కొనసాగుతూనే ఉన్నది. మూలబలం, వాతావరణానుకూల్యంమీద తీగ అభివృద్ధి ఆధారపడి ఉంటుంది. గుమ్మడికాయకు పండుకొన్న ఎద్దు ప్రతీక అయ్యింది. గుమ్మడి తీగకు మోట మోకు ప్రతీక అయ్యింది.

* సూస్తే సిన్నవాడు
సురుకు దెబ్బలవాడు
రాజుగాని తమ్ముడు భోజగాడు (తేలు)

చిన్నవాడైనా చురుకు దెబ్బలు కొట్టేవాడిందులో ప్రతీక. ఇలాంటి ప్రతీకల్ని విశేషణ మూలాలనాలి. విశేష్య మేదో తెలువదు. గుణవర్ణన వైశిష్ట్యాన్ని బట్టే విడుపు కనుక్కోవాలి. రాజుగాడు పాము, పాము తమ్ముడు తేలు. రాజు తమ్ముడు భోజగాడు తేలుకు ప్రతీక అయ్యింది.

* వేయిగోవుల మంద - ఒకటిగా చేరింది
వేసిందొక పెద్ద - తియ్యని ముద్ద (తేనెపట్టు)

తేనె టీగలకు వేయిగోవుల మంద ప్రతీక. తేనెపట్టుకు తియ్యని పెద్ద ముద్ద ప్రతీక.

* ఆలూరు భోగంది
అధిక సక్కంది (కోడి)

* ఇస్తారెన్క బెస్తోడు వాయె (కుక్క)

* జివం జివం బండకింద జింకపోతులాట
తొంగితొంగి సూసెనమ్మ దొంగ రాములక్క (తోడేలు)

* వాగులున్న వన్నెకాడు (చేప)

ఈ పై పొడుపు కథల్లో కోడికి అధిక సక్కంది, కుక్కకు బెస్తోడు, తోడేలుకు దొంగ రాములక్క, చేపకు వన్నెకాడు మొదలైనవి ప్రతీకలు. ఈ పొడుపు కథలన్నిట్లో జీవులకు జీవులే ప్రతీకలైనై.

**6-4 : వస్తువులు + జీవులు :-** జీవుడు లేని వస్తువుకర్థం లేదు. వస్తువులేని జీవునికి సుఖం లేదు. జీవుడూ జీవన సుఖసాధనాలు పరస్పరాధారాలు- పరస్పర పరిపోషకాలు. ఆ కారణాన్నే సాధర్మ్య సారూప్యాల్నిబట్టి వస్తువుకు జీవునికి ప్రతీకలుగా ప్రయోగించడం జరిగింది.

* బట్ట (క్క.) కుక్కకు - బండెడు పేగులు (మంచం)

తెల్ల పొదలుండే కుక్కను బట్ట కుక్క అంటారు; కోడెను బట్టకోడె అంటారు. నవారు మంచానికి కావాలనే వదలిన క్రంతలుంటాయి. నవారు అల్లికలో ఆ విధంగా క్రంతలేర్పడతాయి. అందువల్ల తెల్ల పొదల జంతువు అనడం సమంజసమే. నవారుకు పేగులు ప్రతీక; నవారున్న మంచానికి బట్ట ప్రతీక. ఇందులో మంచం వస్తువు. వస్తువుకు జీవుడు ప్రతీక అయ్యాడు.

* చీకటింట్లకోరాదు - చీకు ముల్లు తొక్కరాదు
బారి పగ్గమెయ్యరాదు - బట్ట కోడెను పట్టరాదు
(తేలు, పాము, పెద్దపులి)

ఈ పొడుపు కథలోని ప్రతీకల్లో జీవులు, వస్తువులూ ఉన్నాయి. ప్రతీకలైన పొడుపుల్లోనూ, సమాధానాలైన విడుపుల్లోనూ వాస్తవం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. గాఢాంధకారబంధురమైన జగత్తుకు చీకటిల్లు ప్రతీక. తేలుకు చివికి పోయిన ముల్లు ప్రతీక: పాముకు పొడుగు పగ్గం ప్రతీక; పెద్దపులికి బట్టకోడె ప్రతీక. ఒకే పొడుపు కథలో జీవులకు వస్తువులకు, జీవులకు జీవులకు ప్రతీకలున్నాయి.

* జింక ఉరుకంగ - పాలు కారంగ (విసుర్రాయి)

పల్లె పల్లెలకు ఇప్పుడు పిండి గిర్నీలు వచ్చినై. ఇవి రాక పూర్వం ప్రజలకుపకరించిన సాధనం తిరగలి (విసుర్రాయి) ఆ తిరగలిని తిప్పే పద్ధతి జింక ఉరకడంగా చెప్పబడింది. పిండి పడడానికి పాలు కారడంగా సంకేతించడం జరిగింది. ప్రహేళికలోని ప్రతీకలు రెండు, ఒకటి జీవుడు, మరొకటి వస్తువు. విడుపు వస్తువు.

* తల్లి దయ్యం పిల్ల పగడం (రేగు చెట్టు - రేగు పండు)

రేగు చెట్టు తల్లి, రేగుపండు పిల్ల. తల్లికి దయ్యం ప్రతీక, పిల్లకు పగడం ప్రతీక. రేగు చెట్టును ముట్టుకొంటే ముండ్ల దయ్యంలా పట్టుకొంటుంది. రేగుపండు పగడంలా అందంగా ఉంటుంది. అందుకే వాటికవి ప్రతీకలుగా ప్రయోగింపబడ్డాయి.

* మా ఇంటెనుక బట్టె
బట్టెతో బొట్టె (పిడుకల గూడు)

* గుట్ట వెనుక రొట్టె బిల్ల
(గుడెనుక రొట్టెబిల్ల) (బ సి డి)

* ఇంటి దగ్గరదాక - ఇనుప సంకెళ్ళు (చీమల బారు)

* కండ్లోడు - సీతాఫలం
పుండ్లోడు - కాకరకాయ
చెవులోడు - జీడి పండు
నారా (నరా) లోడు - బీరకాయ
నామాలోడు - పొట్లకాయ.

ఈ పై పొడుపు కథల్లో పిడకల గూడుకు ఇంటివెనుక బట్టె, బిసిడికి రొట్టెబిల్ల, చీమల బారుకు ఇనుప సంకెళ్ళు, సీతాఫలానికి కండ్లోడు, కాకరకాయకు పుండ్లోడు, జీడి పండుకు చెవులోడు, బీరకాయకు నారాలోడు, పొట్లకాయకు నామాలోడు ప్రతీకలయ్యాయి. అనంతకోటి జీవరాశి, అసంఖ్యాక పదార్థరాశి, ఒక్కొక్క దానికి ఎన్నో సామ్యాలుంటాయి; ఎన్నెన్నో సాదృశ్యాలుంటాయి. అవి అన్నీ అనుభవాల వల్ల అవగతమవుతాయి; అనుభూతుల వల్ల లిపి గుర్తులుగా మిగిలి పోతాయి.

ప్రతీకవాదం అనే ఈ శీర్షిక కింద వస్తువులు + జీవులు అనే ఈ వింగడింపు స్థూలంగానే చేయడం జరిగింది. సంపూర్ణ ప్రతీకలు, అసంపూర్ణ ప్రతీకలు, రూప ప్రతీకలు, గుణ ప్రతీకలు విశేష్య ప్రతీకలు, విశేషణ ప్రతీకలు, తత్త్వ ప్రతీకలు, శబ్ద ప్రతీకలు ధ్వని ప్రతీకలు, పురాణ ప్రతీకలు, చారిత్రక ప్రతీకలు, వృత్తి ప్రతీకలు, వ్యవహార్య ప్రతీకలు . ఇంకా అనేక విధాలుగా విశ్లేషించి పరిశీలించే అవకాశముంది.

నిజానికి ఈ మనిషి బుద్ధి ఎదిగినా కొద్ది తనతో సర్వాన్నీ, సర్వస్వాన్ని తనతో ఉపమించుకోసం ప్రారంభించాడు. ఈ పోల్చుకోడంలో ఈ

మనిషి నాటి నుండి నేటి వరకు ప్రయోగించిన ఉపమానాలు, సాధర్మ్యాలు. సారూప్యాలు, సోత్ప్రేక్షలు అన్నీ ప్రతీకలే. అన్నిటికీ ప్రతీకలే మూలం కాగా శబ్దార్థాల విరుపుల వల్ల, విశేషాల వల్ల అలంకారాల విరాట్స్వరూపం సాక్షాత్కరించడం ప్రారంభమై అదో శాస్త్రంగా రూపుదిద్దుకొంది. అయితే ఆ శాస్త్రానికి మూల బీజం ప్రతీక. ఆ బీజాంకుర వికాసం సాలంకృత వృక్షం. సాలంకృత మహావృక్ష ప్రహేళికకు బీజం ప్రతీక.

సాహిత్యంలోని ప్రతీకల్ని ఈ దృష్టితో పరిశీలిస్తే మరిన్ని వినూత్నాంశాలు బహిర్గతమవుతాయి. ఈ సిద్ధాంత గ్రంథంలో ఇంత మాత్రం చాలనిపించింది. ముమ్ముందీ అంశం మీద ఒక ఉద్యమ దృష్టిని నిలపాల్సి ఉంది.

పొడుపు కథలు

# రసం - ధ్వని

## 9-1 : వివిధ రసాలు

జగత్తు రసమయం; జగన్నాథుడు రస స్వరూపుడు, రసం అనుభవైకవేద్యం; ఆ అనుభవానికి సంస్కారమవసరం; సంస్కార విస్తారానికి కేంద్ర బిందువు వాసన. వాసన—సంస్కారానుభవాలు ఒక్క స్థాయికెక్కినప్పుడు రసాధిదేవత సాక్షాత్కరిస్తుంది.

"ఆత్మ రసస్వరూపుడు ఆ సచ్చిదానందుడు; ఆస్వాద్యుడు ఆ ఆత్మ రసాన్ని పొంది పరమానందరూపుడే అవుతాడని ఉపనిషత్తులుద్ఘోషిస్తున్నాయి."[1] (రసో వై సః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీభవతి.... తైత్తిరీయం)

రసానందం పరమాత్మ సాక్షాత్కారమనడం జీవ దేవతాదాత్మ్యాన్నీ అద్వైతాన్నీ ప్రతిపాదించడమే అవుతుంది. ఇలాంటి అభేద స్థితి సాహిత్య శాస్త్రాలంగీకరించాయి.

"ఆత్మయానంద స్వరూపము. దాని నజ్ఞాన మావరించి యుండును. ఆ యజ్ఞానము తొలగినచో ఆనందము స్వరూపముతో భాసిల్లును. కావ్యమున విభావాదులా యజ్ఞానావరణమును తొలగించును. అపుడుదన్నంటి పట్టికొన్న రత్యాది వాసనలతో నాత్మానందము భాసిల్లును. ఆయానందముతో సంవలితమైన రత్యాదులకు రసములని పేరు."[1]

కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యాత ఈ అభిప్రాయానికి ప్రాచీనాలంకారికుల సిద్ధాంతాలే ఆధారమైనా, "విభావానుభావ వ్యభిచారాది భావాల

1. కావ్యాలంకార సంగ్రహము, పు : 288.

సంయోగం కారణంగా రసం నిష్పన్నమవుతుంది." (విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః ..నాట్యశాస్త్రము) సూత్రస్థ సంయోగ పదానికి వ్యంగ్య వ్యంజక భావమని, నిష్పత్తి పదానికి అభివ్యక్తి అనీ అభినవగుప్తుని అర్థం. "వ్యంజకాలైన విభావానుభావ సంచారుల వల్ల స్థాయి భావం వ్యంగ్యమై రసమవుతుంది." (విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసః స్మృతః ...దశ రూపకమ్)

"పండ చక్కెర కలుపగా జలము పానకమగు విధమున విభావానుభావ సంచారి భావములచే పరిపుష్టమై అధికముగ నాస్వాద్యమైన స్థాయిభావము రసము"[1] అని కావ్యాలంకార సంగ్రహకర్త అభిప్రాయం. ఈ రసాన్ని సామాజికుడు వాసన కారణంగా నాయకా భేదాన్ని పొందినవాడై సాక్షాన్నాయక రసానుభవాన్ని అందుకొంటాడనీ అభినవ గుప్తుని మతం ఈ అభిప్రాయం అందరి మన్ననలనందుకొంది. అతని సిద్ధాంతం ప్రకారంగా రసలోక వాతావరణ మిలా ఉంటుంది.

"లోకములో రత్యాదులకు శకుంతాలా దుష్యంతాదు లాలంబన కారణములు. మలయానిల చంద్రికాదులుద్దీపన కారణములు. అశ్రుపాతాదులు కార్యములు. చింతాదులు సహకారులు ఇవియే కావ్యపరిభాషలో కారణకార్య సహకారి నామములను విడిచి విభావ, అనుభావ, వ్యభిచారి నామములను వహించును. అనగా కావ్యము నందలి నాయికా నాయకులగు శకుంతలా దుష్యంతాదు లాలంబన విభావములు. మలయానిల చంద్రికాదులుద్దీపన విభావములు. అశ్రుపాతాదులనుభావములు. చింతాదులు వ్యభిచారి భావములు అని వ్యవహారము"[2]

ఇలాంటి భావాలతో ఆస్వాద్యమానమైన స్థాయి భావం రసమని సారాంశం మరి ఆ రసం సామాజిక నిష్ఠమని తేలింది. ఇక రస సంఖ్య

---

1 పుండ్రకండంబులు గలిపిన - నలువగు సలిలము రసాయనంబగు పగి-స
లలిత విభావాదులచే - నంఘుతర స్థాయి భావమును రసమై
(కావ్యాలంకార సంగ్రహము, ఆ-3, ప : 4)

2. కావ్యాలంకార సంగ్రహము, పు : 286.

విషయంలో లెక్కలేనన్ని చర్చలు జరిగాయి. చివరికి నవవిధ రసాల్ని, నవవిధ స్థాయీ భావాల్ని ఆలంకారికులంగీకరించారు. అవే శృంగార హాస్యకరుణ రౌద్ర వీరభయానక బీభత్సాద్భుతశాంతాలు. వాటికేమో రతిహాస శోకక్రోధ ఉత్సాహ భయజుగుప్స విస్మయశమాలు స్థాయిభావాలు [1]

## 9-2 : ఆవిర్భావం

ఈ నవ విధ రసాల్లో ఒక రసం అంగిరసంగా, మిగిలిన రసాల్లో కొన్ని కథానుగుణంగా అంగ రసాలుగా తెలుగులో ఎన్నో కావ్యాలావిర్భవించాయి. తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో ఈ రసపోషణం జరిగింది. కొన్నిచోట్ల మోతాదు మించవచ్చు; మరికొన్ని సన్నివేశాల్లో రసాభాసం జరగవచ్చు. జానపాద సాహిత్యంలో కూడా ఆయా కథా సన్నివేశాల కనుగుణంగా ఈ రసాలన్నీ పోషించబడ్డాయి. అటు శిష్టసాహిత్యం ముద్దుబిడ్డగా, ఇటు జానపద సాహిత్య వృక్షం 'చిటారు కొమ్మలోని మిఠాయి పొట్లం'గా (తేనె పట్టుగా) పొడుపు కథల్లో కూడా రసపోషణం జరిగింది.

లక్షణ శాస్త్రాధ్యేతలైన మహాకవులు రస దృష్టితో కావ్యాలు రచించారు. అందువల్ల వారికావ్యాలు రసాలంకారాలనే చట్రంలో చక్కగా అమరిన బొమ్మలయ్యాయి; శుద్ధ సువర్ణహారంలో పొదిగిన ముత్యాలయ్యాయి. ఈ భేషజాలేమీ తెలియని ప్రహేళికాకర్తల నిసర్గరమణీయ ప్రహేళికలు కొన్ని శాస్త్రాల కందుతున్నాయి; కొన్ని లక్షణాల్ని మీరుతున్నాయి; మహాకవులు కూడా లక్షణాలను దాటి రచనలు చేశారు కాని వారుశాస్త్రాన్ని మన్నిస్తూనే దాటారు. జానపద ప్రహేళికా కర్తలు, పండితులైన పొడుపు కథా కర్తలు కూడా 'నిరంకుశాః కవయః' అనే ఉక్తికి సార్థక్యాన్ని కలిగించారు.

---

1. శృంగార హాస్యకరుణ రౌద్ర వీరభయానకాః
బీభత్సాద్భుత శాంతశ్చ నవనాట్యే రసాః స్మృతాః॥
రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సావిస్మయ శమాః స్థాయిభావాః ప్రకీర్తితాః॥ (నాట్యశాస్త్రమ్)

పొడుపు కదలు రమ్యంగానే ఉన్నాయి. అయితే అందులో అధిక భాగం కథారహితాలే. ఆ కారణంగా పొడుపు కథ రసగర్భకాదు. కథలేని చోట నాయికా నాయకులు లేనిచోట, ఉద్దీపనాలంబనాదులు లేనిచోట రసం స్థాయి నందుకొనే ప్రకాశం లేదు. అందువల్ల కథారహిత ప్రహేళికలు అంతగా రస పరిపోషకాలు కావు. అవి కేవలం ఓ వస్తువును స్మరింప జేస్తాయి. సామాజికుని లేదా శ్రోత వాసనా సంస్కారాల్ని బట్టి పూర్వాపరాల్ని గుర్తుచేసుకొనేట్టు చేస్తాయి. ఓ హాసరేఖ పెదవుల మీద విరియిస్తాయి. మెదడుకు మేత పెడతాయి. అయితే కథా సహిత ప్రహేళికలను ఈ విషయానికి పట్టించి చూడాల్సి ఉంది. ఇందులో కూడా విడుపు కథ విన్నప్పుడు మాత్రమే రసం పరిపుష్టమవుతుంది.

కథారహిత ప్రహేళికల్లో కేవలం శబ్దాల కారణంగా శృంగారం భాసిస్తుంది. అటువంటి వాటిని శృంగార ప్రహేళికలని పిలుస్తున్నారు. రతి స్థాయికి అందుకోని ఇటువంటి వాటిలో శృంగార రసమున్నదనడం కుదరదు. అదీగాక ఆ రసం అనుభవించే తాదాత్మ్యస్థితి సామాజికునిలో కనిపించదు. ఆ భావన మెరుపువలె పుట్టిగిట్టుతుంది; అంతే. అలాంటి అంశాన్ని ఏదో ఒక వ్యభిచారి భావంగా పరిగణించాల్సి ఉంది; లేదా రస శబ్దాన్ని ప్రయోగించకుండానే పొడుపు కథల్లోని ఆయా అంశాల్ని దృష్టిలో పెట్టుకొని శృంగార సంబంధులుగా, చమత్కార హాస్య సంబంధులుగా, కరుణాత్మకాలుగా, ఆశ్చర్యాత్మకాలుగా పరిశీలించాల్సి ఉంది.

పొడుపు కథల్ని రసదృష్టితో పరిశీలించేప్పుడు ఇవన్నీ సాహితీ గవేషకుని మనస్సులో పరిభ్రమిస్తాయి. కథారహిత ప్రహేళికల ద్వారా సామాజికునిలో నిష్ఠం కాని రసం, కథాత్మక ప్రహేళికల ద్వారా నిష్ఠమవుతుందా! అందులో లీనం అయితే నిష్ఠం అవుతుందా! లీనం కాకున్నా అవుతుందా! ఈ లీనం కూడా 'వాసన' ఉన్నవానికే సాధ్యమవుతుందా! అందరికీ సాధ్యమవుతుందా! అందరికీ సాధ్యమైనా ఆ నైకాగ్రత వల్ల రస విచ్ఛిత్తి జరుగుతుందా! జరిగే స్థితిలో కూడా దాన్ని మళ్ళీ నిలుపుకోవచ్చునా! తల్లీన స్థితి నుండి మనస్సును వెలుపలికి లాగే బాహ్య పరిస్థితుల్ని జయించవచ్చునా!

అన్నీ ప్రశ్నలే! అందుకే ప్రాచీనా లంకారికు లెవ్వరూ లేవనెత్తని ఒక ప్రశ్న ఇక్కడ వేయాల్సి వస్తుంది. దానిని పొడుపు కథా సాహిత్యానికీ సర్వ సాహిత్య ప్రక్రియలకు అన్వయించుకోవాల్సి వస్తుంది.

కథ ఉంది; నాయకుడున్నాడు; నాయిక ఉంది; ఆలంబన ఉద్దీపనాది విభావాదులున్నాయి. అయితే రసం పరిపుష్టం కావడానికి సమయమెంత పడు తుంది అనేదే ఆ ప్రశ్న!

శ్రవ్య కావ్య దృశ్య కావ్యాల మీదనే దృష్టి పెట్టిన ప్రాచీనాలం కారిక శాస్త్రవేత్త లెవరి దృష్టి ఇటువైపు ప్రసరించలేదు. కాని చిటుకలో పొడవ బడి, త్రుటిలో విడువబడుతున్న పొడుపు కథల్ని రస దృష్టితో పరిశీలించే వారి కెవరికైనా ఈ సందేహం కలుగుతుంది. రతి, హాసం, శోకం ఇవన్నీ స్థాయికి చేరుకొనే భావాలు. ఇవి స్థాయికి చేరుకోడానికి ఎంత కాలం పడుతుంది!

ఈ ప్రశ్నకు సమాధానాన్ని సమకూర్చేప్పుడు సామాజికుణ్ణే స్వీక రించాలి. ఇక్కడ సామాజికుణ్ణి ప్రేక్షకుడనీ, పఠిత అనీ, శ్రోత అనీ పిల వొచ్చు. అయితే ఆ సామాజికునికీ వాసన ఉండాలి; సహృదయం ఉండాలి. ఈ సంగతి లక్షణ శాస్త్రవేత్తలే చెప్పారు. అవి లేనప్పుడిక ఈ ప్రశ్నలేవీ ఉదయించవు. వ్యక్తి సృష్టిలో లీనం కాడు; సృష్టి వ్యక్తిలో లీనం కాదు. కాబట్టి వాసన, సహృదయం సర్వత్రా ప్రధానమని భావించాలి.

పొడుపుకథనొకడు పొడుస్తాడు; మరొకడు విప్పుతాడు. తెలియకపోతే పొడిచేవాడే విప్పుతాడు. అక్కడ వినేవారు కొందరుంటారు. వీరికెవ్వరికీ తెలియక పోతే పొడిచేవాడే విప్పుతాడు. పొడిచేవాడైనా, వినేవాడైనా, పఠిత అయినా అందరూ సామాజికుల కిందకే వస్తారు. ఈ సామాజికులకు ఆ విషయ సంబంధి సంస్కారముండాలి. ఆంతరికమైన 'వాసన' ఉండాలి. సహృదయముండాలి. ఆలాంటి సామాజికులకే రత్యాదిభావాలు స్థాయికెక్కి రసపుష్టిని పొందుతాయి.

అయితే ఈ స్థాయికెక్కడానికి, రసపరిపుష్టిని పొందడానికి ఒక లిప్త కాలం చాలు. వాసనా సంస్కార పరిశోభితమైన సామాజిక క్షేత్రంలో రసం పరి

పుష్టినందుకోడానికి ఒక లిప్త చాలునని తేలింది. ఈ లిప్తే చిటికెన వ్రేలుకాలం; కనురెప్ప పాటు.

ఇది ఎంతసేపు నిలిచి ఉంటుంది అనేది మరో ప్రశ్న. ఇదీకూడా లిప్తే. అయితే సామాజికుని వాసనా సంస్కారాల స్థితప్రజ్ఞత్వం కారణంగా లిప్తనుండి అనంతకాలం వరకు ఇది నిలిచిఉండే అవకాశం ఉంది. ఈ స్థితిని నిరూపించ డానికి సామాజికుల్ని వర్గాలుగా విభజించి పరిశీలించాల్సి ఉంటుంది.

రస ప్రహేళికల పర్యాలోచనలో ఇంత పెద్ద పని అక్కర లేదు. కథా రహిత ప్రహేళికల్లోని గుణాల్ని బట్టి శృంగారాదు లందులో ఉన్నాయనవచ్చు. అవి సామాజికునిలో ఓ సంస్కార రేఖను ఉజ్వలం చేస్తాయి

కథాసహిత ప్రహేళికల విషయమిలా కాదు ఆ పొడుపుల్ని విప్పిచెప్పి నప్పుడు, అంటే కథాకథనం కొనసాగించినప్పుడు అంగిరసం అంగరసం కొట్టి వచ్చినట్లు కనిపిస్తుంది. దృశ్యకావ్యంలో ప్రేక్షకుడు, శ్రవ్యకావ్యంలో పఠిత లేదా శ్రోత అనే సామాజికుడు ఎలాంటి రసానందాన్ని అనుభవిస్తాడో పొడుపు కథా శ్రవణ పఠన అనుశీలనం కారణంగా శ్రోత-పఠిత-సామాజికుడు అలాంటి ఆనందాన్నే అనుభవిస్తాడు. ఆ ఆనందంతో సంవలితాలైన రత్యాదులకే రసాలనీ పేరుకదా! అలాంటి రసాత్మకాంధ్ర ప్రహేళికల్లో కొన్నిటిని స్థూలంగా ప్రస్తా విస్తా, పొడుపుకథల్లో రసమంటే ఏంటో కొద్దిగా వివరిస్తా.

## 9-3 : శృంగారం

ఈ సృష్టి శృంగారమయం; సమస్త ప్రాణులూ శృంగార బంధితాలే. సృష్టే శృంగారమయమైనప్పుడు ఆ సృష్టిలో పుట్టింది శృంగారమయం కాకుండా ఎలా ఉంటుంది. అందువల్ల దృశ్యశ్రవ్యాది సర్వసాహిత్య ప్రక్రియలు ప్రధా నంగా శృంగారాన్నే పరిపోషించాయి. కాబట్టే ప్రాచీనాలంకారికుల్లో భోజుడు శృంగారమొక్కటే రసం (శృంగార ఏవా ఏకోరసః, సరస్వతీ కంఠాభరణమ్) అని సిద్ధాంతీకరించాడు. సంభోగ శృంగారమనీ, విప్రలంభ శృంగారమనీ శృంగారం రెండు విధాలు. అందులో సంభోగ శృంగారం సురత రూపంలోనేగాక

పరస్పర దర్శనం, ఆలింగనం, చుంబనం, వనజల విహారం... ఇలా అనంత రూపాల్లో ఉండి, నిర్వచించడం సాధ్యంకానందువల్ల సంభోగ శృంగారం ఒకే విధ మన్నారు. కాని జగన్నాథుడు రాగానంతర సంభోగం, మానానంతర సంభోగం, ఈర్ష్యానంతర సంభోగం, ప్రవాసానంతర సంభోగం అని నాలుగుప్రధాన భేదాలు చెప్పాడు. అదేవిధంగా విప్రలంభ శృంగారంలో అభిలాష, ఈర్ష్య, విరహ ప్రవాసాది చతుర్విధ భేదాన్ని ఆలంకారికులనేకులు వివరించారు.

"ఎందు రతి సంయోగ కాలావచ్ఛిన్నమగునేని—సంయుక్తులము అను బుద్ధి రూపాంతఃకరణ వృత్తివిశేషము సంయుక్తులకు సంయోగ కాలమున నియతముగ అనుభవగోచరమగుచుండునేని - అది సంయో(భో)గ శృంగారము"... "రతివియోగ కాలావిచ్ఛిన్నమగునేని - వియుక్తులము అనుజ్ఞాన విశేషము వియోగి కాలవ్యాప్తమై వియుక్తులకు నియతముగ నుండునేని - అది విప్రలంభ శృంగారము."[1]

* పాదముల కొరిగె నొకడును
పరిరంభణ చేసెనొకడు బాహుబలంబున్
ఇలముద్దు బెట్టెనొకడును
సలలితముగ రాత్రివేళ సలిపెనొకండున్[2].

ఇదో పొడుపు పద్యం. ప్రియురాలు ప్రియునితో అంటున్నది. అదీ రాత్రివేళ తన మంచాన్ని సమీపించిన ప్రియునితో అంటున్నది. ఈ పొడుపు పదిమందిలో పొడపబడ్డప్పుడు అందరూ ఆలోచనల్లో పడిపోతారు; ఎవరో ఒకరు పొడుపు విప్పుతారు.

* పాదముల కొరిగె శిరమును
పరిరంభణ చేసినవియె బాహుద్వయముల్
ఇలముద్దుపెట్టె అధరము
సలలితముగ రాత్రివేళ సలిపిన దదియే.

---

1. రసగంగాధరము - వరివస్య, పు : 194.
2 సేకరణ : ఇందూరు జిల్లా, జులై-1977.

ఈ విడుపువినగానే కొందరిలో రసం చిప్పిల్లుతుంది. మరికొందరు లిప్తలో తేరుకొని మందహాసం చేస్తారు. ఇంకొందరు పెద్దగానే నవ్వుతారు. ఈ గుంపు బాహ్య జగత్తులోకి రాకపూర్వం వారి మనస్సులో పట్టెమంచం. ప్రియుడు, ప్రియురాలు నిల్చిపోయి ఉన్నారు. ఇక్కడ ప్రియుడూ ప్రియురాలూ ఆలంబన విభావాలు; పట్టెమంచం, పొడుపుకథ రెండూ ఉద్దీపన విభావాలు. చివరకు పొడుపు కథలో సంభోగం వాచ్యమే అయింది. ఆ ప్రియుడు కూడా పైవిధంగానే విడుపు విప్పుతాడు. శ్రోతలిట్టే సమాధానిస్తారు. కానీ ఆ యువతి అంతరంగంలో మరో అర్థముంది. ఆ మాటనే పొడుపుకథా వ్యవహర్త అంటాడు. అందరూ సమాధానం చెప్పాల్సిందే అని అతణ్ని వేధిస్తారు. చివరకు సమాధానాన్ని సాధిస్తారు. ఆ ప్రియునికి కూడా ఆమె ఇలాగే చెప్పిందని అతను విప్పిచెబుతాడు

* పాదముల కొరిగె పసపును
పరిరంభణ చేసె పిండి బాహుబలంబున్
ఒల ముద్దుపుట్టె విడియము
సలలితముగ రాత్రివేళ సలిపెను దీపం[1]

ఈ విడుపు విన్న ప్రియుడు ప్రియురాలిని గాఢాలింగనంలో ముంచెత్తుతాడు. శ్రోతలు కూడా ఈ చమత్కారానికి హసన్ముఖులవుతారు. కాని తత్పూర్వ శృంగార భావనావిముక్తులు మాత్రం కారు. ఆ పొడుపూ- ఆ విడుపూ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా శృంగార రసంలో ఓలలాడుతుంటారు.

ఈ పై పొడుపు విడుపు పద్యాల్లో ప్రాస నియమం లేదు. ఈ పొడుపు పద్య స్రష్టకు వ్యాకరణం తెలుసు; ఛందస్సు తెలుసు; అయితే జన వ్యవహారంలో ఈ ఛందోబంధాలు శిథిలములయినయి. ఈ క్రింది రెండు పొడుపు కథలు సంభోగ శృంగారానికుదాహరణాలు. విడుపుల్లో లోక వ్యవహారార్థమే భాసిల్లింది. పొడుపుల్లో మాత్రం శృంగారం పూర్తిగా వాచ్యమై ఇవి అశ్లీలాలు అని కొందరు భావించే స్థితి ఏర్పడింది.

* ఆలుమగలు పండుకుంటే
అండ్ల కొరెంది అంబరాయె (విసుర్రాయి, పిండి)

1 సేకరణ : ఇందూరు జిల్లా, జులై-1977.

* కాల్లు పంగటిచ్చి - కామసేతపట్టి
సేటుగ సూసి - సూటిగ వేసి
ఉగ్రగమొచ్చిందాక ఊగులాడె (కుమ్మరి సారె)

ఇందులో నాయికా నాయకులు లేరు విభావాది రస సంపోషక సామాగ్రి లేదు. అందువల్ల రతి స్థాయికి చేరే ప్రసక్తి లేదు. కాని పొడుపుల్లో ఆభాసమాత్రంగా కనిపించే నాయికా నాయకుల వల్ల శృంగార చమత్కార భావన మాత్రం కలుగుతుంది. ఇక ఈ క్రింది పొడుపుకథ విప్రలంభ శృంగారాని కుదాహరణ

* ముగ్గురు భోగమోళ్ళు
ఒగామె టెంకాయ కట్టుకుంది
ఒగామె బొట్టు పెట్టుకుంది
ఒగామె పూలదండ వేసుకుంది
ఎవరి దగ్గరికి రావాలె!

(గర్భిణి, ముత్తైత, సురతాభిలాష)

పిల్లలు కానివారు దేవాలయాల్లో కొబ్బరికాయలు ముడుపు కడతారు. గర్భవతులైనవారు కొబ్బరికాయను చేతపట్టుకొని ప్రయాణం చేసే ఆచారం అక్కడక్కడా కనిపిస్తుంది ఇక్కడి వారవనిత తన దగ్గరికెవ్వరూ రాకూడదని ఒంటికి టెంకాయనే కట్టుకొన్నది మరో వారాంగన నొసట బొట్టు పెట్టుకున్నది. వెలయాలు బొట్టు పెట్టుకోడం దూరమవడానికి గుర్తు. పూలమాల ధరించిన మరో వనిత మాత్రం సురతాభిలాష మూడవ యువతి కారణంగానే ఈ పొడుపుకథలో అభిలాష విప్రలంభ భావన ఉన్నదని చెప్పడం జరిగింది "విప్రలంభం లేక పోతే సంభోగానికి పుష్టి లేదు" ... (నవినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే, సాహిత్య దర్పణమ్) అన్న ప్రాచీనాలంకారికోక్తి సత్యం.

ఇవి సంభోగం, విప్రలంభ శృంగార భావాల కుదాహరణలు మచ్చు కోటి రసాభాసం కూడా ప్రస్తావిస్తా.

* ఎనిమిది పాదాలు రెండుతోకలు
ఉత్తర దక్షిణాలుగా రెండు ముఖాలు
దేవత కాదు రాక్షసి కాదు
ఎవ్వరు వీరలు?

తిర్యగ్రతి రసాభాసమే; రసాభాసంకూడా రసమే. రసాన్ని రసాభాసం అనడంలో తప్పేమీ లేదనీ, రసాభాసాన్ని వర్ణించరాదనే దోషం ఎక్కడా కనబడలేదనీ పండితుల అభిప్రాయం.[1]

అందువల్ల పై పొడుపుకథను ఇలా సమన్వయించుకోవాలి. ఇది కుక్కల రతి; లోకధర్మం, ప్రకృతి ధర్మం తెలిసినవారు సంధించిన పొడుపు కథ ఇది. ఈ కుక్కలు సురతి క్రీడలో ఉన్నాయి. అవి ఉత్తర దక్షిణ ముఖాలతో ఉన్నాయి. తూర్పుపడమరలుగా ముఖాలుంటే సూర్యోదయాస్తమయాల కారణంగా ఏదో ఒక కుక్కకు అసౌకర్యం తప్పదు. ఆ కారణంగానే అవి పొద్దు వైపు తిరగవు. ఉత్తరదక్షిణాలుగా ముఖాలుండటం ఇందువల్లనే.

## 9-4 : హాస్యం

వికృతాకారం, వికృతభాష, వికృతవేషం, వికృతచేష్ట... ఇవన్నీ ఉన్న నర్తకునివల్ల హాసం స్థాయీభావాన్నందుకుని హాస్య రసావిర్భావం జరుగుతుంది. (వికృతాకార వాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్ హాస్యోహాస స్థాయిభావ కావ్యాలంకార సంగ్రహము, పు : 432) దృశ్యకావ్యంలో అయితే నవ్వుతున్న నాయకుణ్ని జూచి, రసోత్పన్న సామాగ్రిని సందర్శించి, దృశ్యంలో లీనమై సామాజికుడు హాస్యరసాస్వాదనం చేస్తాడు పొడుపుకథ విషయంలో అయితే శ్రోత విన్నవెంటనే భాషలోని చమత్కారంవల్ల, భావనలోని అస్తవ్యస్తం వల్ల ఓ విధమైన బొమ్మ రూపుగడుతుంది. అదే రసాస్వాదనకు మూలమవుతుంది.

హాస్యరసం ఆత్మస్థమనీ పరస్థమనీ రెండువిధాలుగా ఉంటుంది. ఆ విషయాన్ని రసగంగాధర పరివాహ్య ఇలా నిర్వచించింది. "...ద్రష్టకు ఆలంబన

1. కావ్యాలంకార సంగ్రహము, పు : 418.

దర్శనము నంజేసి స్వయముగ నుదయించు హాస్యము ఆత్మస్థము. నవ్వుచున్న వానిని జూచిన నుదయించు హాసము అది పరస్థము ఈ రెండవదానికి విభావము నవ్వుచున్న పరకీయుని హాస్యము....”[1]

పొడుపుకథ విన్న శ్రోతలు ఈ రెండురకాలుగా హాస్యంలో మునిగే అవకాశముంది. తమంతట తామే తెలిసికొన్నవారి హాస్యం ఆత్మస్థమవుతుంది. ఒకరు చెప్పి నవ్వగా ఉదయించే హాస్యం పరస్థమవుతుంది.

* ఏం చేస్తున్నావే కోడలా
అంది అత్తగారు,
అత్తయ్యా! ఒక చేత్తో పట్టుకుంటూ
రెండోచేత్తో పెట్టుకుంటున్నాను అంది
(పట్టుకున్నది అద్దం, పెట్టుకొన్నది బొట్టు)

ఒక్కడే అత్తాకోడళ్ల ఆలంబనం కోడలు నిస్సందేహ సమాధానం చెప్పినం. సంతాన వేదనలు, అనుభవాలు సంతాన అంశాలు ప్రతిభావాలు. ఇది అతి సులభంగా అందరికీ అర్థమయ్యే పొడుపుకథ; ఆత్మస్థ హాస్యానికుదాహరణం. ఇది పొడిచినవారిని నటులనిభావించే పక్షంలో, అర్థాభివ్యక్తీకరణంవల్ల, ఆ భావ నాలంబిత మానసిక వికారంవల్ల నవ్వుకొనే అవకాశముంది. అప్రకాశార్థ బహిర్గతానంతరం అందరూ హాస్యంలో ఓలలాడుతారు.

* అతన్ని పోనీకుండా పట్టుకోండి
వెన్నెముక విరిచేయండి
ఆ తర్వాత ఒంటికి వెన్న పూయండి
ఆ పిదప గదిలో భద్రంగా ఉంచండి (తమలపాకు)

ఇవన్నీ వికృతాలనిపిస్తాయి. అయితే ఈ అనుభవం కొందరికి ఉంటుంది. కొందరు విని ఉంటారు; అయినా చేష్టాగత వికృతం కారణంగా అందరూ నవ్వుతారు.

---

1. రసగంగాధరము వరివస్య, పు : 226.

* సంగూరు సాలోడు
సవు నేతకాడు
సన్న బియ్యం గుమ్మరిచ్చి
సంచుడ్క వెట్కతినె (ములక్కాయ)

ఇది అమాయకత, అజ్ఞానం అనిపిస్తుంది. అందువల్లనే ఈ వికృతచేష్టలు జరిగాయి అనిపిస్తుంది. అయితే ప్రకాశితార్థానికి మాత్రమే హాస్య మావిష్కృత మవుతుంది. అప్రకాశితార్థ బహిర్గతానంతరం కూడా అపూర్వ భావన దార ణంగా హాస్యం అలాగే నిలిచి ఉంటుంది.

పొడుపు వల్ల అపార్థద్యోతకత, విడుపు వల్ల యథార్థ విషయద్యోతకత సర్వసాధారణంగా జరిగేదే. ఈరసావిర్భావానికి అపార్థమాధారం కావచ్చు; యథార్థమే ఆలంబనం కావచ్చు. రెండింటిలో ఏదో ఒకటి, లేదా రెండూ రస భావన వైపు లాక్కొని వెళ్ళవచ్చు.

పొడుపు కథల ద్వారా హాస్య రసావిర్భావం పూర్తిగా జరుగుతుందని నిరూపించలేం. నవ్వు రావచ్చు; నవ్వురాక ఓ లిప్తమునుగ వచ్చు. అందుచే హాస్య రస ప్రహేళికలన్నిటినీ చమత్కారాల పేరుతో పిలువడముంది: పొడుపు కథ లక్షణాల్లో చమత్కార చారుత కూడా ఒకటి.

## 9-5 : కరుణం

"ఇష్ట బంధువులు మొదలగువారి నాశము వలనను అనిష్టము ప్రాప్తించుట వలనను కరుణ రసము కలుగును."[1] ఇష్టనాశాదనిష్టాప్తేః కరుణాఖ్యో రసోభవేత్, కావ్యాలంకార సంగ్రహము, పు : 435) కరుణ రసానికి శోకం స్థాయీ భావం. నాయికా నాయకుల్లో ఒకరు మరణించినా, లేదా ఇద్దరు జీవించే ఉన్నా నిరపేక్షభావమనేది ఉంటే చాలు అది కరుణంగా పిలవడం జరుగుతుంది.

తెలుగు పొడుపు కథల్లో కథాత్మక ప్రహేళికలన్నీ (పొడుపు గాథలన్నీ) కరుణ రసాత్మకాలే. కథాత్మకాల్లో ఉదాహరించిన ఈ కింది పొడుపు కథ పరిశీలనార్హం.

* కతలన్ని ఎతలాయె
కాపురాలు రెండాయె
ఆడుసచ్చి ఆర్నెల్లాయె
ఆడేసిన కుంచేలు
ఇయ్యాల్ల మాపటి కూరకాయె
సచ్చిన మగడు సండ్లమీద
మనున్న మగడు మంచంమీద.[1]

ఓ యువతి ప్రేమించిన వాణ్ని గాక మరొకణ్ని కట్టుకోవాల్సి వచ్చింది. ఆమె ప్రియుడాత్మహత్య చేసుకొన్నాడు లేదా హత్య చేయబడ్డాడు. ఆమె గత స్మృతులతో ప్రతిరోజు వారి సంకేత స్థలానికి వెళ్లేది. ప్రియుడు చనిపోయిందక్కడే. ఆమె ఆరు నెలలుగా ఆ శవం పాదాల కింద నీరుపోస్తుంది. ఆరోజు త్రాడు తెగింది; అస్థిపంజరం కిందపడింది. కింద పచ్చ గడ్డిలో కుంచేలుంది. అది చనిపోయింది. ఆమె ఆ కుందేలును తెచ్చి కూర వండింది మాపటి వేళ మంచమెక్కినప్పుడు భర్త కూర సంగతి అడిగాడు. అప్పుడామె పై పొడుపు కథ **పొడిచింది**

ఈ కథలో **మరణించిన** ప్రియుడే ఆలంబనం. వండుకొని తిన్న కుంచేటి కూర ఉద్దీపనం. దుఃఖం, ఆవేదన అనుభవాలు; దైన్యాదులు సంచారీ భావాలు. శోకస్థాయియే కరుణ రసం అభివ్యక్తి.

మనసుపడ్డవాణ్ని మనువాడక, మనువాడిన వాడికి మనసివ్వలేక, మరణించినవాని మీద మరులు చంపుకోలేక మనుగడ కొనసాగిస్తున్న ఈ మగువ మలిన హృదయ కాదా! వంచకి కాదా! అని ఎవరన్నా ప్రశ్నించవచ్చు. అది వారి వారి మానసిక స్థితి. అయినా పొడుపుకథ పొడుపుకథే! ఇది కరుణ రసాభాసానికి కూడా ఉదాహరణం కావచ్చు. ఇందులో మరణించిన వానిమీద మమకారం కారణంగా, కుంచేటికూర ఉద్దీపనం వల్ల, శోకం స్థాయికి చేరి కరుణం ప్రాదుర్భవిస్తున్నది. రస దృష్టితో ఈ పొడుపుకథ పరిశీలించేప్పుడు సామాజిక నియమాల గురించి ఆలోచించాల్సిన అవసరం లేదు.

1. వివరాలకు ఈ గ్రంథంలోనే పు : 290.

* సీతారాముల కడుపుల పుట్టి
ఏమయి పుట్టి ఏం సుఖ పడ్డి
ఆడవాండ్లతో దెబ్బలు దింటి
ఆగకుంట వోయి అగ్గిల వడ్డి (పిడక)

జానపద సాహిత్య ప్రకరణంలో ఈ పొడుపుకథకు వివరణ ఇవ్వడం జరిగింది. విడుపు పిడకే అయినా బాహిరార్థంవల్ల ఎవరిదో వేదన రోదన అభివ్యక్తమవుతోంది. శోకం స్థాయినందుకొని కరుణం పరిపుష్టి చెందుతుంది. నాయికా నాయకులు లేకున్నా అనేక ప్రహేళికల వెనుక బాధామయజగత్తు కనిపిస్తుంది. పొడుపు కథల్ని రసదృష్టితో పరిశీలించేప్పుడు అందులో నాయికా నాయకుల్ని విభావానుభావాల్ని అన్వేషించడమేగాక అర్థస్ఫూర్తి వల్ల కనిపించే సమాజాన్ని కూడా దృష్టికి దూరం కానివ్వరాదు

## 9-6 : రౌద్రం

శృంగారహాస్య కరుణ రసాలకు సంబంధించిన పొడుపుకథలెన్నో ఉన్నాయి రౌద్ర వీర భయానక బీభత్సాలున్న పొడుపుకథలు లేవు. అందువల్ల వాటిని కేవలం పరామర్శిస్తాను.

రౌద్రానికి క్రోధం స్థాయీభావం. ఈ కింది పొడుపుకథలో క్రోధం ఒక భావనగానే భావించాలి.

* నల్లటి పొదల్ల పుట్టింది
పరరాజు కల్లల్ల పడింది
అర సేతి పట్నాని కొచ్చింది
గోరెంక పట్నాన సచ్చింది (పేను)

నల్లని పొదలు వెంట్రుకలు; పగరాజు మనిషి; పట్టణం అరచేయి; గోరుచచ్చే ప్రదేశం. కీడు కలిగించే క్రిమికీటకాల్ని కోధంతో చంపడం సహజంగా జరిగేదే. కేవలమా కారణంగానే ఇది రౌద్రానికి ఉదాహరణగా ఇవ్వడం జరిగింది.

## 9-7 : వీరం

దానధర్మ యుద్ధ దయా వీరాలని వీరరసం నాలుగు విధాలు. వీరానికి స్థాయీభావం ఉత్సాహం. ఇక్కడ కూడా రసావిర్భావం శ్రోతలో జరిగే ప్రసక్తి లేదు. అందుకే ఉత్సాహమనేది ఒక భావనగానే భావించాలి.

* మలనపుట్టి మలన పెరిగి
మలపాకులకెడ వాసి
ఎల్లారెడ్డి ఇంటికాడ
పుల్లారెడ్డి బిడ్డ - బిడ్డ పెండ్లికాడ
సగమయ్యొస్తి వోయి సాయిరెడ్డి (గంధం చెక్క)

ఇందులో గంధంచెక్క తన శరీరాన్ని అర్పించింది. మరొకరి సుఖం కొరకు తననే త్యాగం చేసుకొంది. పరహితార్థం శిబి చక్రవర్తిలా వ్యవహరించింది. కొంత ఇలా వివరిస్తే శ్రోతలో పఠితలో దానవీరమనే భావన ఉద్బుద్ధమయ్యే అవకాశం ఉంది.

## 9-8 : భయానకం

భయానక రసానికి భయం స్థాయీభావం. దేనివల్ల భయం కలగుతుందో అది ఆలంబన విభావమవుతుంది. ఇందులోకూడా భయం ఒక స్థాయికి రాదు. అందువల్ల అదికూడా భావన అనే చెప్పాలి.

* నిన్ను చూస్తే నాకు భయమాయె
నీ దాంట్లో నాదూగులాడె (బావి, చేతాడు)

ఈ మాట అంటున్నది చేతాడు. భయపడ్డ చేతాడే బావిలో ఊగులాడింది. ఈతరానివాళ్ళు, నీళ్ళంటే వెనుకడుగు వేసేవాళ్లు బావిని చూస్తే భయపడతారు. అయితే నీళ్ళ అవసరం ఉంది. భయపడుతూనే చేతాడు బొక్కెనలతో నీళ్ళు చేదుకొంటారు. భయమనేమాట అన్నది చేతాడే అయినా ఇది మనిషి భావనే.

## 9-9 : బీభత్సం

రౌద్ర వీర భయానకాల్లాగానే పొడుపుకథల్లో బీభత్సానికి కూడా రస పుష్టిలేదు, బీభత్సానికి స్థాయీభావం జుగుప్స.

* తోలు తుపాకి
మైనం గుండు
ఏడేసినా ముక్కే తాకుతది (పిత్తు)

దుర్గంధం జుగుప్స హేతువు. అసహనంతో కూసుకొన్న ఒక అసహ్య వాతావరణానికి సాధనమవుతుంది. దీనిని కూడా భావనకిందనే జమకట్టాలి.

## 9-10 : అద్భుతం

అద్భుత రసానికి స్థాయీభావం విస్మయం. దీనికి లోకోత్తర విలక్షణ వస్తువు ఆలంబనమవుతుంది తెలుగు పొడుపుకథల్లో కథాత్మక కాల్పనిక ప్రహేళికలు (Novella Riddles) చాలావరకు అద్భుత రసనిధులనే చెప్పాలి.

కథారహిత ప్రహేళికలెన్నో విస్మయంలో ముంచెత్తుతాయి. ఈ కథల్లో నాయికానాయకుల కొరకు, విభావానుభావాదుల కొరకు చూడరాదు. కథన చమత్కృతి, సంఘటనా చమత్కృతి అద్భుత రసావిర్భావానికి కారణమవుతుంది.

* ...సందకాడ లగ్గమాయె
సాని పొత్తున గర్భిణాయె
తెల్లవారిన పిల్లతల్లి
పొద్దు పొడువ పేరుకొచ్చ

—ఎంత చెప్పిన వేదశాస్త్రం
తెలియదాయె దానిభావం
దాని భావం బట్టబయలు
దాని పేరే చల్లకుండ...

సంధ్యాకాలంలో వివాహం కావడం, అరాత్రే సెని పొత్తువేళ గర్భిణ వడం, తెల్లారేవరకు బిడ్డ పుట్టడం, పొద్దు పొడిచేవరకు పేరు పెట్టడం ఈ పొడుపు కథలోని విలక్షణత. ఇది చల్లకుండ అని విడుపు తెలిసేంతవరకు విస్మయంలో ఉండక తప్పదు. ఆ విస్మయమే స్థాయీభావాన్ని పొంది అద్భుత రసావిర్భావా నికి దోహదం చేస్తుంది. ఈ సిద్ధాంత గ్రంథంలోని కథాత్మకాల్లో ఉదాహరించిన ఈ పొడుపుకథ విస్మయాల పుట్ట.

* కొడుకా కొడుకా
మగనికి తమ్ముడా
సక్కన్న పండయ్యా
సన్నిస్త లేవయ్యా.[1]

రాకుమారి అశ్వశాలా రహస్య ప్రణయం కారణంగా పుట్టిన పిల్లాడు పూటకూళ్ళ పెద్దమ్మ ఇంట్లో పెరిగాడు. కాలం కర్మం కాలి రాకుమారికి ఆమె కొడుక్కే పెళ్ళయింది. శోభనం గదిలో అడుగుపెట్టిన కొడుకునుద్దేశించి రాజ పుత్రి పై పొడుపుకథ పొడిచించి.

కొడుకెలా! తమ్ముడెలా! మగడెలా! అక్కడికి రావడమెలా! ఇవన్నీ విస్మయ విషయాలే. ఈ అద్భుతాన్ని కథలోని పాత్ర అయిన కొడుకు కూడా అనుభవిస్తాడు. ఇందులో తల్లి కొడుకులు ఆలంబనాలు; పొడుపుకథే ఉద్దీపనం; రోమాంచం నయనాది వికాసాలు అనుభావాలు; శంకాదులు వ్యభిచారీ భావాలు. విస్మయం స్థాయిపొంది అద్భుతరసం ఆస్వాద్య మానమవుతుంది.

## 9-11 : శాంతం

శాంతానికి స్థాయీభావం శమం. వైరాగ్యం కారణంగా చిత్తం నిర్వి కారమవుతుంది; అదే శమమవుతుంది; నిత్యానిత్య విచారంవల్ల పుట్టే విషయ విరా గాఖ్య చిత్తవృత్తి విశేషమే శమమని రసగంగాధర మంటున్నది

---

1. వివరణ కథాత్మకాలు ప్రకరణంలో....

పొడుపు కథల ఛాయలున్న అనేక తాత్త్విక గేయాల్లో వైరాగ్య భావాలు నిండి ఉన్నాయి. అది వినడంవల్ల శమం స్థాయి నందుకొంటుంది.

* పెమిదల నూనే ఉన్నంతసేపే
దివ్వె వెలుగులంతా - ఆ
పెమిదల నూనె అయిపోగానే
దీపమారునంటా.[1]

ఇక్కడ ప్రమిద దేహమే; నూనె ఆత్మ; దివ్వెవెలుగు పరమాత్మ ప్రకాశం. పొడుపు కథల ఛాయలున్న ఇలాంటి గేయాలు వినడంవల్ల వైరాగ్యం కలుగుతుంది ఆ వైరాగ్యంవల్ల **శమం** స్థాయినందుకొంటుంది. అప్పుడు నిర్వేదం పరిపుష్టమై శాంతరస మావిర్భవిస్తుంది. ఇందులో గాయకుడే ఆలంబనం; గేయమే ఉద్దీపనం; నిర్వేదాదులు వ్యభిచారి భావాలు. కథా సహితాలైన పొడుపు కథలు శాంతరస జనకాలు కావు. కేవలం పారమార్థిక ప్రహేళికలే శాంతరస సంజన కాలుగా ఉన్నాయి.

## 9-12 : భక్తి

భక్తికి భగవదాకార చిత్తవృత్తే స్థాయీభావం. భగవంతుడే ఆలంబనం; భగవంతుని చరిత్రాదులే ఉద్దీపనాలు. ప్రాచీనాలంకారికు లనేకులు భక్తిని భావం గానే పరిగణించారు. కానీ 'ఉజ్జ్వలనీలమణి' కర్త రూప గోస్వామి, 'హరిభక్తి రసాయన' గ్రంథకర్త మధుసూదన సరస్వతి తమ గ్రంథాల్లో భక్తి రసమనే ప్రస్తావించారు అయితే భక్తిరసం కాదనీ, అది భావమే ననే చాలామంది అభి ప్రాయం.[2]

తెలుగు పొడుపుకథల్లో భగవంతుణ్ని వర్ణించే పద్యాలెన్నో ఉన్నాయి. 'తిరుమలేశ' మకుటంతో, 'దీని భావమేమి తిరుమలేశ' మకుటంతో, 'నాగఫణీశా'

---

1 పల్లెపదాలలో ప్రజా జీవనం, పు : 193

2. కావ్యాలంకార సంగ్రహము, పు : 307,

మకుటంతో కొన్ని పద్యాలు కనిపిస్తున్నాయి. శ్రీ పాపిశెట్టి సీతారామకవికృత, శ్రీ కపిలవాయి లింగమూర్తి పరిష్కృత అముద్రిత సీస పద్య అసమగ్ర శతక మొకటి లభించింది.[1] ఈ కింది పద్యం అందులోనిదే. (పు : 15)

* పద్మనాభుని ప్రక్కబాయని దేవ్వరు (శ్రీలక్ష్మి)
పంక్తి ముఖుండేపే బలిమి గూడె (రంభను)
భాగీరథుండేమి పాటించి తెచ్చెను (గంగను)
భావజ జనకుని పానుపేది (నాగము)
గృహ రాజు సూనుని ఘనమైన పేరేమి (యముడు)
మహిలోన భూపతి మన్ననేమి (కరుణ)
ముత్యమే కార్తిలో ముందు జన్మించును (స్వాతిని)
సోమకుడేమియై స్వామి దునిమె (మీనమై)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
ఆది పంక్తిని జూచిన యలరుచుండు
నట్టి శ్రీరంగ నాయకుడనుదినంబు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.
(శ్రీరంగ నాయక స్వామి)

శ్రీలక్ష్మి తదితర ఆది పదాక్షరాల వల్ల శ్రీరంగనాయక స్వామి అని ఆశించిన సమాధానం వచ్చింది. ఈ క్రింది పొడుపు పద్యం నిండా భక్తి ఉంది.

* మామను సంహరించి, యొక మామను గర్వమడంచి, యన్నిశా
మామను రాజు చేసి, యొక మామ తనూజున కాత్మబంధుపై
మామకు గన్నులిచ్చి, సుతుమన్మథు నింతికి దారె మామయై
మామకు మామయైన పరమాత్ముడు మీకు ప్రసన్నుడయ్యెడున్.[2]

---

1. పీటికి కొన్ని కలిపి 1988లో 'పొడుపు పద్యాలు' పేరిట 54 పుటల పుస్తకం ప్రచురించాను.
2. పెద్ద బాలశిక్ష, పు : 86

కంసుణ్ని చంపి, సేతువు కట్టి, సముద్రం గర్వం అణచివేసి, చంద మామను రాజును జేసి (రాజు అనే పేరిచ్చి) మామ కొడుకు అర్జునుని కాత్మ బంధువై మామ అయిన ధృతరాష్ట్రునికి కన్నులిచ్చి, కుమారుడైన మన్మథుని భార్య రతికి మామయై, లక్ష్మి నివ్వడం వల్ల మామ అయిన సముద్రునికే మామ అయిన (గంగ నివ్వడం వల్ల) శ్రీమన్నారాయణుడు మిమ్మల్ని అనుగ్రహించు గాక!

ఈ పద్యంలో శ్రీమన్నారాయణుడే ఆలంబనం. ఆయన చరిత్రను తెలిపే సంఘటనలన్నీ ఉద్దీపనాలే. రోమాంచాదులు అనుభావాలు; స్మృతి ధృత్యాదులు వ్యభిచారులు. ఇవి అన్నీ కలిసి భక్తిరసంగా పరిణమించే అవకాశముంది.

## 9-13 : పొడుపు కథా ప్రకృతి – రస ప్రకృతి

– చమత్కారం పొడుపుకథ సర్వసాధారణ ప్రకృతి. పొడుపు కథల్లో ఉన్న సర్వ రసాలకనుసంధించుకొనే ఈ చమత్కార ముంటుంది. అయితే ఇది సర్వ రసాలకు మూలం మాత్రం కాదు. చమత్కారం వల్ల సర్వ సాధారణంగా హాస్యమే ప్రాదుర్భవిస్తుంది; కాని ఏస్థాయీ భావానికనుగుణంగా ఆ రసమే పుడుతుంది.

ప్రాచీనాలంకారికుల్లో రస సమీకరణ వాదమొకటుంది. ఇది అందరి ఆమోదం పొందలేదు. అయితే జరిగిన చర్చలు సిద్ధాంతాలు సాహిత్య లోకంలో ప్రశంసలందుకొన్నాయి సర్వరసాలకు ప్రకృతి రసమొక్కటే అని ఈ సిద్ధాంతాల సారభూతాంశం శాంతమే ప్రకృతి రసమని వాసుకి, భక్తి ఒక్కటే రసమని మధుసూదన సరస్వతి, శృంగారమొక్కటే రసమని భోజుడు, అద్భుతమే ప్రకృతి రసమని నారాయణుడు, ఆనందం స్థాయి భావంగా ఉన్న 'రసం' ఒక్కటే ఉందని కవికర్ణ పూరగోస్వామి, కరుణమొక్కటే రసమని భవభూతి ప్రభృతులెందరో తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఒక్కొక్కరూ ఒక్కొక్క "కొమ్ము వచ్చి"నట్లు అనిపించినా వారు వారు ఆయా రసాల ప్రాముఖ్యాన్నే ప్రపంచం ముందుంచారని భావించాలి.

రసాత్మక వాక్యం కావ్యమని (వాక్యం రసాత్మకం కావ్యమ్, సాహిత్య దర్పణం, 1. పరి-3 శ్లో) విశ్వనాథుని మతం. రసాత్మకమైన ఒక పొడుపుకథ కూడా కావ్యమే. కావ్యాలన్నీ ఒకే రసానికి చెందని విధంగానే పొడుపుకథలు కూడా ఒకే రసానికిలోనై లేవు. చమత్కారం ప్రధానంగా వీటిలో కొన్ని ఏదో ఒక రసాన్ని అందిస్తాయి. కేవలం చమత్కారమే ఉండి రసస్థాయికి చేరనివెన్నో ఉన్నాయి. పొడుపు కథలు సర్వరసాల్ని సమాదరించాయి. మానవ ప్రకృతిని బట్టి పొడుపు కథల రస ప్రకృతి కూడా కొన్నిట ఎక్కువ, కొన్నిట తక్కువ కనిపిస్తుంది. అయితే రసం అనుభవైక వేద్యమే గాని పొడుపుకథా నిష్ఠం కాదు. వాసనా సంస్కార విలసితుడైన శ్రోత-పరిత-సామాజికులు పొడుపు కథను భావించి, అనుభవించి ఆయా రసాల్లో ఓలలాడాల్సిందే తప్ప దీనివల్ల ఈ రసం ఉద్భవమవుతుందని చెప్పడం ఊహే అవుతుంది. అందువల్ల పొడుపు కథలన్నీ ఫలానా భావాల్ని ప్రకటిస్తున్నాయనడం సముచితంగా ఉంటుంది. అందుకే శృంగార, హాస్య, కరుణ రసాలు తప్ప మిగతావన్నీ భావాలనే చెప్పడం జరిగింది. మానవ దృక్పథాన్ని అనుసరించే సాహిత్య సృష్టి జరుగుతుంది. రసం కూడా ఆ దృక్పథానికి అనుగుణంగానే ఆవిష్కృతమవుతుంది.

ఈ రస ధ్వని ప్రకరణంలో అన్నీ భావాల క్రిందనే వస్తాయంటూనే, సంప్రదాయ అధ్యయనానువర్తినై కథాసహిత-కథా రహిత ప్రహేళికలు రసనిధులన్నాను. వాసన, సహృదయం, సంస్కారమున్న శ్రోత రసానందమందుకోడానికి ఓ లిప్తకాలం చాలునన్నాను. శృంగార, హాస్య, కరుణాద్భుతాలున్న పొడుపు కథలు వాసిలోనూ రాశిలోనూ అధికంగా ఉన్నాయన్నాను. రౌద్ర, వీర, భయానక, శాంత, బీభత్సాలు కేవలం భావాలుగానే భావించాలన్నాను భక్తి రస ప్రహేళికలు ముఖ్యంగా పద్యాల్లో ఉన్నాయన్నాను. ఒకే ఒక్క ప్రకృతి రసం గాక సర్వరసాలకు పొడుపు కథలు నిలయాలయ్యాయనీ, అయినా ఇవన్నీ, భావాల కిందనే పరిగణించాలనీ భావించాను.

## 9-14 : ధ్వని

తన బాహువుల్లో నదిని సముద్రుడు బంధించాడు; అది ప్రణయ బంధం; ఆ సముద్రుని హృదయం నదికే తెలుసు. ఉరకలతో పరుగులతో

సముద్రం వైపుగా వచ్చే ప్రవంతిక గుండె చప్పుడు సముద్రునికే అర్థమవు తుంది.

కోకిల కుహూనాదంలోని అంతరార్థం వసంతునికే తెలుసు. వసంతుని పరిమళ భరిత సమాహ్వానంలోని ప్రణయ సూక్ష్మం కోకిలకే తెలుసు.

సముద్రునికీ-నదికీ, కోకిలకూ-వసంతునికీ పరమార్థాలు తెలిసినట్టుగావే లోకంలోని కొన్ని విలక్షణార్థాలు కొందరికే తెలుస్తాయి. ప్రకాశితార్థం అంత రంగంలోని ఆ చైతన్యం అంతటా ప్రాణభూతంగా ఉంటుంది. అలాంటిదే సాహిత్య ప్రపంచంలో ఉంటుంది. సాహిత్య ప్రపంచంలోని అది ధ్వనిగా పిలువబడు తుంది విశ్వాత్మ విశ్వమంతటా ఉంటుంది. ఆయాత్మ స్వరూపం ఇప్పటికీ దుర్గ్రాహ్యంగానే ఉంది. అందుకే అదేదో పరానికి సంబంధించిన విషయమని కొందరు వదలివేస్తున్నారు.

ఇహంలో జీవుడున్నాడు; జీవునిలో జీవాత్మ ఉంది; అది చైతన్యంగా ప్రాణంగా పిలువబడుతుంది. జీవుడంటే దేహధారి ఈ దేహంలో ఆత్మ ఉన్నంత కాలం జీవుడుంటాడు. ఆత్మ ఎప్పుడో ఒకప్పుడు ఈ దేహం నుండి వెళ్ళిపోతుంది. అప్పుడీ దేహాన్ని శవమంటారు శవం, ఆ శవానికున్న నఖాలూ కేశాలూ ఒకప్పుడందంగా కనిపించినై. అందులోని జీవాత్మ ఉన్నందువల్లనే ఆ విధంగా భాసించినై. ఆత్మ ఆ దేహాన్ని వీడిపోయింది. ఆ తర్వాత శవం కూడా రూపాంతరం పొందుతుంది. అది మట్టిగా మారిపోతుంది కాని అనశ్వ రాత్మ దేహంలేకున్నా విశ్వాత్మలో లీనమై ఉంటుంది.

## 9-15 : కావ్యాత్మ

ఆ ఆత్మ కావ్యానికీ ఉంది. 'విద్వాంసులు కావ్యాత్మను ధ్వనిగా' అంగీకరించారు. (కావ్యస్యాత్మాధ్వనిః, ధ్వన్యాలోకమ్, (ప్ర- శ్లో : 1) కావ్య శరీరానికి ఆత్మ ధ్వని అని నిర్ధారింపబడక పూర్వం ఈ విషయం పై ఎన్నో తర్జన భర్జనలు జరిగాయి. ఆ తర్వాత కూడా అనేకానేక వాదోపవాదాలు జరిగాయి. ఇందులో పాల్గొని ఖండించినవారూ ఉన్నారు; ప్రశంసించినవారూ

ఉన్నారు సిద్ధాంత రాద్ధాంతాలేవి ఎట్లున్నా అందరూ సాహిత్య సౌందర్యోపాసకులుగా కీర్తిగడించారు

కావ్య శరీరానికి అలంకార ప్రాముఖ్యాన్ని ఆపాదించినవాడు భామహుడు. గుణ ప్రాధాన్యవాది దండి. ప్రప్రథమంగా కావ్యంలో ఆత్మను గుర్తించి అది రీతి అన్నవాడు వామనుడు. అలంకారాన్ని రసాన్ని అంగీకరించాడు ఉద్భటుడు. మొట్టమొదటి సారిగా కావ్య శరీరానికి ఆత్మ ధ్వని అని సిద్ధాంతీకరించిన వారు ఆనంద వర్ధనులు. అది వస్తు రసాలంకార ధ్వన్యాత్మకమై మూడు విధాలుగా ఉంటుందని నిరూపించిందీ అతనే ఆనంద వర్ధనుని ధ్వన్యాలోకానికి లోచన మనే వ్యాఖ్య అభినవగుప్తులు వ్రాశారు. అతనూ ధ్వని ప్రాధాన్యవాదే. అయినా ఎక్కువగా రస ధ్వని వైపే మొగ్గ చూపారు. ఆ పిదప వచ్చిన మహిమభట్టు ధ్వని నంగీకరించలేదు; అతను అనుమితివాది అయ్యాడు. కావ్యాలంకారానికి వ్యాఖ్య వ్రాసిన ప్రతిహారేందురాజు అలంకార ప్రాధాన్యాన్ని ఉట్టంకిస్తూ ధ్వని కూడా అలంకారమే అన్నాడు. భట్టనాయకుడేమో ధ్వనికి పూర్తిగా వ్యతిరేకి. ధనికుడు ముఖ్యంగా రసవాది అయినా ధ్వనిని వ్యంగ్య వ్యంజకంగా గాక భావ్య భావక సంబంధంగా భావించారు. కుంతకుడు పూర్తిగా వక్రోక్తి ప్రాధాన్య వాది. క్షేమేంద్రుడు రససిద్ధ కావ్యానికి ఔచిత్యమే జీవితమన్నారు ఆ తర్వాత వచ్చిన విశ్వనాథ, విద్యానాథ, జగన్నాథాది కావ్యాలంకార శాస్త్ర మర్మజ్ఞులు ధ్వని సిద్ధాంతాన్నే అంగీకరించి పోషించారు. అందువల్ల ధ్వని సర్వజన సమ్మతమయింది. ప్రతి పాదిత సిద్ధాంతాలన్నిటిలోనూ మకుటాయమాన మయింది.

ఈ విశ్వ ప్రకృతినీ, ఈ సువిశాల భావభౌతిక సమూహాన్ని గ్రంథాలకెక్కించిన కవులందరూ ధ్వనిని ఉపాసించారు ఆ ఉపాసనా ఫలితాల వల్ల కావ్యాలు అమరమూర్తులైనై. అగాధ సంస్కృత సాహితీ సముద్రాన్ని మథించి, అమృతోపమాన ధ్వనిని సాహితీ లోకానికందించిన విద్వాంసులు సంస్కృత కవులే. భారతీయ భాషలన్నీ వారి మార్గాన్నే అనుసరించాయి. ప్రాచ్య పాశ్చాత్య దేశ భాషలన్నీ ఆ భావాల్ని సముచితంగా సమాదరించాయి.

అదే విధంగా తెలుగూ అందుకొన్నంత అందుకొంది; పరిపుష్టితో సమగ్రతను సంతరించుకొంది. ఆంధ్రీకృత పురాణాల్లోనూ, కావ్యాల్లోనూ,

మౌళిక సృజనాత్మక మహాకావ్యాల్లోనూ, ఖండ కావ్యాల్లోనూ, విభిన్న సాహిత్య ప్రక్రియల్లోనూ సంస్కృత లాక్షణికులు ప్రపచించిన మర్యాదలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి.

## 9-16 : ధ్వని సహృదయైక వేద్యం

తెలుగు పొడుపు కథలు కూడా ధ్వనిని సమాదరించాయి. కొన్నయితే ధ్వనుల గనులుగా నిలిచాయి. పొడుపులు పొడుచుకొనే వారి హృదయపర్మ విచ్ఛేదకాలయ్యాయి శ్రోతల్ని పఠితల్ని ఆనంద తరంగాలపై తెప్పలు గట్టించాయి; పూల పడవలు నడిపించాయి.

ధ్వని కావ్యాశ్రయం; కావ్య సదృశ ప్రహేళికాశ్రయం. కావ్యాశ్రయ ప్రహేళికాశ్రయమైన ఆ ధ్వని స్త్రీలావణ్యం వంటిది. "స్త్రీల కవయవాలకన్న భిన్నంగా లావణ్యం భాసిల్లుతుంది అదే విధంగా మహాకవుల కావ్యాల్లో వాచ్యార్థాలకన్న భిన్నంగా వ్యంగ్యార్థం భాసిస్తుంది."[1] "లావణ్య మనగా అవయవములుండవలసి నట్లుండుటయు నగలు అలంకరించుకొనుటయు గాక దానికన్న నతిరిక్తమును, దాని వలన స్ఫురించునదియగు నొక ధర్మము అని స్పష్టము."[2] స్త్రీ లావణ్య సదృశం ధ్వని అని అలంకార శాస్త్రవేత్తల అభిప్రాయం. ఆంధ్ర ధ్వన్యాలోకం ధ్వనినిలా నిర్వచించింది.

"ఎచ్చట శబ్దము తనయర్థమును, అర్థము తన్నును అప్రధానముగాజేసి యర్థాంతరమును బోధించునో యది ధ్వని."[3]

---

1. ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహా కవీనాం।
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్య మివాంగనాసు" – ధ్వన్యాలోకమ్, ప్ర. శ్లో : 4
2. ఆంధ్ర ధ్వన్యాలోకము, ప్ర, పు : 16.
3. యత్రార్థశ్శబ్దోవా తమర్థముపసర్జనీకృత స్వార్థౌ
వ్యక్తం కావ్య విశేషః సధ్వనిరితి సూరిభిః కథితః॥
అర్థమేన్ శబ్దమేనియు స్వార్థములన
ముఖ్యములు జేసి యాయర్థమును నెచటను
వ్యంజన మొనర్చుచున్నవో ధ్వని యటంచు
నట్టికావ్య విశేషమ్ము ననిరి బుధులు
— ఆంధ్ర ధ్వన్యా లోకము, ప్ర. పు : 52,

ఈ ధ్వనికి సంబంధించి అనేకుల అభిప్రాయాల్ని అధ్యయనం చేసిన కావ్యాలంకార సంగ్రహం వ్యాఖ్యాత ఇలా క్రోడీకరించారు.

"వాచ్యార్థము శబ్ద మాత్రము నాశ్రయించి యుండును. వ్యంగ్యార్థము శబ్దము, శబ్దైక దేశము, అర్థము, వర్ణములు, రీతి అనువాని నెల్లను నాశ్రయించి యుండును."[1]

వాచ్యార్థము ముగిసిన పిమ్మట ప్రకరణాది వశమున నర్థాంతరము దోచుచున్నది. ఆయర్థమొకచో వస్తురూపముగా నొకచో నలంకార రూపముగా, నొకచో రసభావాది రూపముగా దోచును. అదియే ధ్వన్యర్థము "[2]

"కావ్యమున చమత్కారమున్ననే సహృదయులు తలనాడించును. కనుక 'చమత్కారవత్త్వం కావ్యత్త్వం' అనగా చమత్కారము కలిగి యుండు టయే కావ్యమని నిష్కృష్టార్థము. ఈ చమత్కారము వస్త్వలంకార రసాది ధ్వనుల వలన నేర్పడునని యభిప్రాయము."[3]

వాచ్యార్థానంతరమే అర్థాంతరం స్ఫురిస్తుంది. ఈ అర్థాంతరమే ధ్వన్యర్థం. ఇదే రమణీయార్థం. ఈ రమణీయార్థమే చమత్కారాన్ని కలిగించే అర్థం.

పొడుపు కథకున్న ప్రధాన లక్షణాల్లో ఒకటి చమత్కార చారుత. అలాంటి చమత్కారం ధ్వనివల్ల ఏర్పడుతుందని లక్షణవేత్తల అభిప్రాయం. ఈ ధ్వనినే వ్యంగ్యమని అంటారు.

"వ్యంగ్య ప్రధానమగు కావ్యము ధ్వని కావ్యమనియు, వ్యంగ్యమ ప్రధానముగా నున్న కావ్యము గుణీభూత వ్యంగ్యమనియు, వ్యంగ్య స్ఫూర్తిలేని కావ్యము చిత్రమని వ్యవహరింతురు."[4]

---

1,2,3, కావ్యాలంకార సంగ్రహము, పుటలు : 153, 149, 110.

4. వ్యంగ్యము ప్రధానమైనను. నప్రధాన
మైన, నస్ఫుటమైన కావ్యము త్రి సంఖ్య
నమరు నుత్తమ మధ్యమాధమత, ధ్వని, గు
ణీకృత వ్యంగ్యమును, జిత్రమై గడంగి.
— కావ్యాలంకార సంగ్రహము, ఆ :2, ప : 91.

కావ్యాలు వ్యంగ్య ప్రధానాలుగా, వ్యంగ్యమ ప్రధానాలుగా వ్యంగ్య మస్ఫుటాలుగా కనిపిస్తాయన్నమాట. పొడుపు కథయు కూడా వ్యంగ్య ప్రధానాలుగా - అప్రధానాలుగా - అస్ఫుటాలుగా కనిపిస్తున్నాయి. అయితే సాహితీ ప్రపంచంలోని ఈ ధ్వనే శబ్ద శాస్త్రం, అర్థశాస్త్రం అధ్యయనం చేసినంత మాత్రంలో బోధపడదనీ, ధ్వని సహృదయైక వేద్యమనీ లాక్షణికుల అభిప్రాయం.[1]"

ఈ అభిప్రాయం పొడుపుకథలకు వర్తిస్తుంది. శబ్ద శాసనం తెలిసినా అర్థశాసనం తెలిసినా ధ్వని అర్థంకాదు. ధ్వని అర్థం కావాలంటే సహృదయ ముండాలి. ప్రహేళికా శబ్దార్థ తత్త్వవేత్తలైనా సహృదయం లేకుంటే ధ్వని అర్థంకాదు. ఇంతకూ ధ్వని సహృదయైక వేద్యం అని తేలింది.

## 9-17 : ధ్వని-భేదాలు

లాక్షణికులూ ధ్వనిశాస్త్ర మర్మజ్ఞులు ధ్వనిలో వస్తు రసాలంకారాది త్రివిధ ప్రధాన భేదాల్ని ప్రవచించారు. అంతేగాక కవిప్రౌఢోక్తి తదితర సహ ప్రాధిక భేదాల్ని ప్రకటించి, శతాధిక ఉదాహరణల్ని అందించారు. శతాధిక లక్ష్యాలున్న ధ్వనుల కన్నిటికి తెలుగు పొడుపుకథల్లో లక్షణాల్ని ఎత్తి చూపించడం కష్టసాధ్యం. వేలాది ధ్వనులకు (5304) కావ్య ప్రపంచంలోనూ లక్ష్య లక్షణ నిర్దేశం జరుగలేదు. పొడుపుకథల్లోని ధ్వనులన్నీ సమగ్రంగా అందించాలనే ఉద్దేశంకూడా ఈ సిద్ధాంత గ్రంథానికి లేదు అది ప్రత్యేకంగా పరిశీలించదగిన పెద్ద విషయం. అందువల్ల పొడుపుకథల్లో ధ్వనిని స్థూలంగా స్పృశించడం మాత్రమే జరిగింది. శబ్దార్థాలు అప్రధానాలై ఎక్కడ అర్థాంతరం ద్యోతమానమవుతుందో అది ధ్వని అని ఇదివరకే చెప్పడం జరిగింది. సహప్రాధిక భేదాలున్న ఆ ధ్వనిలో కేవలం వస్తు రసాలంకారిక ధ్వనుల్ని, గుణీభూత వ్యంగ్యాన్ని పొడుపుకథల్లో చూపించేందుకు ప్రయత్నిస్తాను

1. శబ్దశాసన మర్థశాసనము గూడ
నెఱిగియున్నంత మాత్రాన నిద్దివేద్య
మగుటలేదెప్పుడొక కావ్యార్థ తత్త్వ
వేత్తలగు వారికే సుడి వేద్యమగును
— ఆంధ్ర ధ్వన్యాలోకము, ప్ర. పు : 48.

**17-1 : వస్తుధ్వని :-** "అలంకార రూపము లేక, యుపలక్షిత మగు నది వస్తుమాత్ర మనబడును."[1] మాత్రమనడంవల్ల మరో రూపం దీనికి లేదనీ, నిరాకరింపబడిందనీ ఆంధ్ర ధ్వన్యాలోక కర్త అభిప్రాయం. ఈ వస్తురూపాన్ని వివరిస్తూ వారే ఇంకా ఇలా అన్నారు .. "లోకమున నొకపుడు శబ్దములచే జెప్ప దగి, విధి నిషేధాది రూపముల ననేక ప్రకారముల నుండి వస్తువని పేర్కొన బడును."[2]

వస్తుధ్వని అనేక విధాలుగా విభజింప బడింది. వాచ్యార్థంకన్నా వ్యంగ్యార్థం ఎంతో భిన్నంగా ఉంటుంది. వాచ్యార్థం నిషేధ రూపంగా వ్యంగ్యార్థం అనుభయరూపంగా ఉంటుంది. వాచ్యార్థం నిషేధరూపంగా వ్యంగ్యార్థం విధి రూపంగా ఉంటుంది. వాచ్యార్థం విధిరూపంగా వ్యంగ్యార్థం నిషేధరూపంగా ఉంటుంది.

వాచ్యార్థంకన్నా వ్యంగ్యార్థం ఎంతో భిన్నంగా ఉన్న ఈ కింది గేయ ప్రహేళిక పరిశీలనార్థం గేయం చివరి పాదాలుమాత్రం ఉదాహరిస్తాను,

* ... .... ..

భర్త : ఎవాన్ని సేతపట్టి - ఎవాన్ని నోటపట్టి
ఎవానికొరకు నీవు వోయుంటివే;
భామ వోయుంటివే!

భార్య : సంచీని సేతపట్టి - వాకూను నోటపట్టి
సున్నాము కొరకు - నేను వాయుంటిరో!
నేను వోయుంటిరో!
వడ్లా బియ్యాన్ని కోడె - వారుజిమ్ముల ఒల్లికొనె
కోడెందోలురోరి మొగడ - కోడెందోలురా!
నీవు దోలిన తోల్కానికి - ఎదురు జిమ్ములు జిమ్ముతాడి
పిల్లను వట్టురోరి మొగడ - నేను దోలుతా![3]

---

1, 2. ఆంధ్రధ్వన్యాలోకము, ప్ర. పు : 17.

3. వివనాలకు ఇదే గ్రంథం పుట : 137.

భర్త అడిగే ప్రశ్నలకు భార్య నర్మగర్భంగా సమాధానం చెప్పింది. గూఢార్థాలతో పొడిచి సుస్పష్టంగానె తన మనోభావాల్ని ప్రకటించింది. చివరికి పదును కొమ్ములున్న బొల్లికోడె బియ్యాన్ని చిమ్ముతుందనీ, దానిని తరిమెయ్య వలసిందనీ అన్నది. భర్త ఆ కోడెను తరిమివేశాడు. అయితే అది దూరంగా పోలేదు; పైగా ఎదుకు తిరిగింది. తానే తరుముతానంటూ సందు చేసుకొని భర్త కదలకుండా, చంక పిల్లను అతని చేతికిచ్చి ఇక బయల్దేరింది.

ఇందులో బియ్యమంటే ఆమె మనస్సే; చిమ్మడం అంటే మనస్సును కలచివేయడం. వాచ్యార్థమైన కోడె వాస్తవానికి ఉంది. కోడెకు వ్యంగ్యార్థం ఆమె ప్రియుడు. బియ్యాన్ని కోడులుంటే (వేగే పద్దలి). ఆమెకు ప్రియుడు కని పించి మనస్సును కెలికాడు. తన ప్రియుణ్ణి కలవాలి. అందుకే కోడెను తోలవల సిందని భర్తను పురమాయించింది. భర్త తోలాడు. అది దూరంపోక పోవడమే గాక ఎదురుకూడా తిరిగింది భర్త ఇంకా దాన్ని అదలించేవాడే. దాన్ని అద లించి ఇంకా ముందుకు వెడితే ఆమె ప్రియుడు కనిపిస్తాడు. అప్పుడు గుట్టు రట్టవు తుంది. అందువల్ల భర్త చంకకు పిల్లనిచ్చి తానే దానిని తోలడానికి బయలు దేరింది. అలా తన ప్రియుణ్ణి కలిసింది.

ఇందులో వాచ్యార్థం కోడె బియ్యాన్ని చిమ్మడం, భర్త కోడెను తోలడం, అది ఎదురు తిరగడం, భార్యే కోడెను తోలడానికి బయలుదేరడం.

వ్యంగ్యార్థం ప్రియుడామె మనస్సును కెలకడం, గుట్టు రట్టవుతుందని ఆమె భయపడడం, తానే కోడె మిషతో అభిసరించడం.

ఈ పొడుపుకథలో వాచ్యార్థంకన్నా వ్యంగ్యార్థం ఎంతో భిన్నంగా ఉంది. ధ్వని గేయమంతటా గాక గేయాంశంలోనే ఉంది. ఇక ఈ కింది పొడుపు కథలో వాచ్యార్థం నిషేధ విధి రూపాలతో వ్యంగ్యార్థం విధినిషేధ రూపాలతో కని పిస్తుంది. ఇది ఇదివరకే ఉదాహరించినా ధ్వని నిరూపణార్థం ఇక్కడ తీసుకోడం జరిగింది.

* లోతొడల సందల్లదానా
మోకాటి కండ్లదానా
నీ మొగడేడికోయిందే!

అడ్డం దొడ్డం ఆరుగాల్లోడా!
నడీపున గుద్దోడా
నా మొగదేటపతల
ముల్లుకు ముల్లు ఆనియ్యవోయింసు
వస్తే రాడు - రాకుంటే వస్తడు

ఈ కథాత్మక గేయ ప్రహేళికలోని చివరి పాదంలో మాత్రమే ధ్వని ఉంది. స్నానం చేస్తూన్న సందర్భంలో పరపురుషుని కంటబడ్డ కారణంగా ఆమె కుంచించుకుపోయింది. ఆమె ఉన్న రూపును అభివర్ణిస్తూ అతనామె మగని విషయ మడిగాడు. ఎంత పూర్వప్రియుడైనా అతనలా అడగడంలో ఆమెకు పారుష్యమే ధ్వనించింది. అందువల్ల తానుకూడా పారుష్యాన్నే సమాశ్రయించింది. అయినా అతనడిగిన మాట లోగుట్టు గుర్తించి మనసులోని కాంక్షను చంపుకోలేక 'వస్తే రాడు—రాకుంటే వస్తడు' అన్నది.

ఇందులో వాచ్యార్థం ఏరువస్తే భర్త రాడనీ, ఏరు రాకుంటే భర్త వస్తా డనీ; భర్త రాడనే నిషేధార్థంలో, నీవు రావలసింది అనే వ్యంగ్యార్థం ద్యోతక మవుతోంది. భర్త వస్తాడనే విధ్యర్థంవల్ల నీవు రావద్దనే నిషేధరూప వ్యంగ్యార్థం స్ఫురిస్తోంది. ఈ పొడుపుకథలో మాటకు మాట మోటున్నా మోహనాస్త్రం వంటి ధ్వని గర్భితమై ఉంది. ఇక ఈ కింది పొడుపుకథలో వాచ్యార్థం విధిరూపంగా గానీ నిషేధ రూపంగా గానీ లేదు-

* అంతెదిగిన కోడల్ని దెస్తే
అత్తకాపురం గుత్తగ్గొన్నది.

అక్కడా ఇక్కడా ఇచ్చారచ్చా లిరిగి ఇల్లును వెలిగిస్తున్న అత్తగారు ఎదిగిన కోడల్ని తెచ్చుకొంది. ఎదిగిన కోడల్ని తేచ్చుకోడంలో అత్తగారేం ఊహించిందో ఏమో! కోడలు మాత్రం అత్తగారి కాపురాన్ని గుత్తకు తీసుకొంది. ఇదీ ఇందులోని వాచ్యార్థం, అత్తగారంతకు పూర్వం ఏయే పనులు చేసేదో కోడలాయా పనుల్ని ఇప్పుడు చేస్తుందన్నమాట. కానీ విచిత్రమేంటంటే ఆ కోడలు అత్తకాపురాన్నే గుత్తకు తీసుకుంది. గుత్తకు తీసుకోడమంటే అత్తకింకేం

మిగల్చకుండా అంతా తానే తీసుకొంది అని అర్థం. ఏదైనా భూమిని మరొకరికి దున్నుకోడానికి గుత్తకిచ్చే సంప్రదాయం తెలంగాణాలో ఉంది ఆ భూమిని రైతు దున్ని యజమానికి మొత్తంమీద పందుంవడ్లో (దాదాపు 5 1/2 బస్తాలు) ఎని మిది వందల రూ॥లో ఇస్తానని ఒప్పుకొని కాగితం వ్రాసిస్తాడు. గుత్తకు తీసుకోడమంటే ఇదే! ఎక్కువ పంట పండితే ఎక్కువ ఇవ్వమని యజమాని అడగడు; తక్కువ పండితే తాను నష్టపోయాను కాబట్టి ఇవ్వలేను అని రైతు అనడు. ఇదీ గుత్త అంటే! ఇక్కడ అత్త కాపురాన్ని గుత్తగొనడం అంటే మామగారినే వశపరచుకొందని అర్థం ఇదీ ఈ పొడుపుకథలోని వ్యంగ్యార్థం.

**17-2 : రసధ్వని :-** "ఏదికంలోనైనను స్వశబ్దముచే వాచ్యము కాదో, లౌకిక వ్యవహారమునకు లోబడదో, మరియు మనసునకు నచ్చునట్లు శబ్దములు విభావానుభావముల సమర్పింపగనే - ఇదివరలో సంస్కార రూపమున నాత్మనిష్ఠములగు రత్యాదులుద్బుద్ధములై చర్వ్యమాణము లగునపుడు, ఆ రత్యాది వాసనల ననురంజితమైనది కావున సుకుమారమగునే స్వాత్మానుభవము పై జెప్పిన చర్వణా వ్యాపారమున నానంద రూపముతో నాస్వాద్యమగునో - అదియే రసము. అది కావ్య వ్యాపారముననే వేద్యము. అదియే రసధ్వనియని పేర్కొనబడును."[1]

స్వశబ్దం ద్వారా ఇది రసమని వాచ్యం కారాదు. కథా కథనంలో విభావానుభావాలతో ఆత్మనిష్ఠాలైన రత్యాదులుద్బుద్ధాలై రసం ఆస్వాద్యమానమవుతుంది. రసం పరిపుష్టమయ్యే అలాంటి కావ్యంలో శబ్దార్థాలప్రధానాలై అర్థాంతరం ప్రకాశించినప్పుడే అది రసధ్వని అవుతుంది.

తెలుగు పొడుపు కథల్లో రసధ్వని సామగ్ర్యం కొన్నిటిలోనే ఉంది. ప్రహేళికా చమత్కారం వల్ల రసమాస్వాద్యమవడమే కష్టం. కథాత్మక ప్రహేళికల్లోని ఒకటి రెండింట మాత్రమే ఇది సాధ్యమవుతుంది. అందువల్ల ఇదివరకే ఒకటి రెండు పర్యాయాలు ప్రస్తావించిన పొడుపుకథనే ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

---

1. ఆంధ్ర ధ్వన్యాలోకము, ప్ర, పు : 17

* కతలన్ని ఎతలాయె
కాపురాలు రెండాయె
ఆడుసచ్చి ఆర్నెల్లాయె
ఆడేసిన కుంపేలు
ఇయ్యాల్ల మాపటి కూరకాయె
సచ్చిన మగడు సండ్లమీద
మనున్న మగడు మంచంమీద

మనసుపడ్డ వాణ్ని మనువాడలేదు; మనువాడిన వానికి మనసివ్వలేదు: మరణించిన వానిమీది మరులు చంపుకోలేదు. అలా ఆలా బతుకునీడుస్తున్న ఈ మగువ జీవితం కరుణరస భరితం. ఆ రసానికి తోడు వాచ్యార్థంకన్నా వ్యంగ్యార్థమే ప్రధానమై ఉండడం; ఇక్కడ కాపురాలు రెండాయెనన్న వాచ్యార్థానికి తన మనస్సులోని ప్రియునితో జరుపుతున్న భావనాత్మకమైన కాపురమొకటనీ, భౌతిక శరీరానికి మాత్రమే తాళిగట్టిన భర్త కల్పించడంవల్ల సాగుతున్న కాపురమింకొకటనీ వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది అదేవిధంగా "సచ్చిన మగడు సండ్లమీద-మనున్న మగడు మంచంమీద" అనే వాచ్యార్థానికి ఆ చనిపోయినవాడు తన హృదయంలో ఉన్నాడనీ వ్యంగ్య సుందరంగా చెప్పినట్లయింది. అట్లే తన భర్త ఈ మంచానికి ఈ దేహానికి మాత్రమే అధికారిఅనీ తన హృదయాధినాథుడు కాడనీ మర్మగర్భితంగా పలికినట్లయింది.

ఈ పొడుపు కథలో ఒక విడుపు కథాంతరం గర్భితమై ఉందని కొంత మంది జానపదులంటున్నారు. "సచ్చిన మగడు సండ్లమీద" అనే పాదానికి వారు చెబుతున్న కథ ఇది.

—వివాహానంతరం కూడా ఆ యువతి మనస్సు మరొకరిమీద ఉండడం ఆమె భర్త గమనించాడు. ఆ మరొకరెవరో గుర్తించాడు. అతణ్ని రహస్యంగా చంపించాడు. ఆతని శరీరంమీది తోలు ఒలిపించి తెచ్చి ఇంటిలో ఆరవేయించాడు. అతని మెడకురిపెట్టి అరణ్యంలో వ్రేలాడదీయించాడు. ఇదంతా తెలుసుకొన్న ఈ యువతి కుమిలి కుమిలి ఏడ్చింది. చచ్చిన ప్రియునిమీది మమకారాన్నీ కాంక్షనూ చంపుకోలేకపోయింది. ఇంటిలో ఆరవేయించిన ఆ తోలుతో రవిక కుట్టుకొంది.

ఈ భర్త ఇదేదో పిచ్చిపని అనుకొన్నాడు; ఆ విషయం అంతగా పట్టించుకోలేదు కూడ. ఆ రవికనే అప్పుడామె తొడుక్కొంది

ఈ విడుపు కథాంతరమే సత్యమైతే 'చచ్చిన మగడు సండ్లమీద' అనే వాక్యం వాచ్యార్థమే తెలుపుతుంది కానీ వ్యంగ్యార్థ ద్యోతకం కాదు. జానపదుల గాథలు అద్భుత నిలయాలైనందువల్ల ఈ కల్పన చోటు చేసుకొంది. లేకపోతే మనిషి చర్మాన్ని ఒలిపించటం, ఆచ్ఛాదనోపయోగంగా పట్టుకోడం, అదే ధరించడం అనేవి అసాధ్యాలు. అందువల్ల ఆ విధానికి కొంతరి కల్పనగానే భావించాలి. ఇందులోని వ్యంగ్యార్థాన్ని బహిర్గతం చేసినప్పుడు మాత్రమే వాస్తవికతకు అర్థం పట్టినట్లుంటుంది. మొత్తంమీద ఆ యువతి జీవనం దుఃఖాశ్రితమైంది; ఆవేదనా సంభరితమైంది; పతిత్యశోత్స సామాజిక సందోహానికి కరుణ రసావిర్భావ కారకమైంది. ఆ రసానికి ధ్వనిగర్భిత వాక్యాలు మరీ పరిపోషకాలైనై. అందువల్లనే ఇది రసధ్వని కుదాహృతమైంది.

**17-3 : అలంకార ధ్వని :-** వాచ్య వాచకాల వైచిత్ర్యం వల్ల పరిణతాలయ్యేవి అలంకారాలు. అలాంటి అలంకారాలు ఆత్మ అయ్యే ధ్వనిరూపాలు కావు. అవి ధ్వనికి అంగాలుగానే పరిగణింపబడతాయి. ఆంధ్రధ్వన్యాలోక అభిప్రాయమే ఇది[1]. సాధారణంగా అలంకారాలు వాచ్యార్థాన్ని అలంకరించి ఉంటాయి. వాచ్యార్థం వ్యంగ్యాన్ని వ్యంజనం చేస్తుంది. బ్రాహ్మణ శ్రమణ న్యాయంవల్ల అది అలంకార ధ్వని అనబడుతుంది.

తెలుగు పొడుపు కథల్లో అనేక అలంకారాల ఛాయలు కనిపిస్తున్నాయి. ఈ విషయం అలంకారాలు ప్రతీకలు అనే ప్రకరణంలో ప్రస్తావించడం జరిగింది. ఇక్కడ అలంకార ధ్వనికి ఒకటి మాత్రముదాహరిస్తాను

* వేయి కనులు కలిగి వెలయు నింద్రుడుగాదు
కాళ్లు నాల్గు కలిగి కాదు పశువు
నరుడు పట్టుకున్న నడువగా జాలదు
దీని భావమేమి? తిరుమలేశ![2]

1. ఆంధ్ర ధ్వన్యాలోకము, ప్ర, పు : 54
2. పొడుపు కథలు, పు : 17

వేయి కన్నులున్నవాడు ఇంద్రుడు, కాని అతడు కాడు; నాల్గు కాళ్లున్నది పశువు, కాని పశువు కాదు. ఇలా ఉండడం అలంకారికంగా విరోధాభాస మవుతుంది. సన్నిహిత వాక్యాల్లో విరోధమున్నట్లు అనిపిస్తుంది. కానీ అది విరోధం కాదు. విరోధానికి ఆభాసత్వం సిద్ధించడమే విరోధాభాసాలంకార మవుతుంది.[1]

ఇందులో వాచ్యార్థంవల్ల విరోధం స్ఫురించినా, వ్యంగ్యార్థం వల్ల వేయి కన్నులున్నది నులకమంచం అనీ, నాల్గు కాళ్లు మంచంకోళ్లు అని తెలుస్తున్నాయి. మూడోపదంతో దాని స్వరూపం బట్టబయలవుతుంది. ఇక్కడ విరోధాభాసాలంకారం వాచ్యార్థంతో అలంకృతమై వ్యంగ్యార్థం ఆధారంగా పరిహారసిద్ధి పొందింది. చివరికి అలంకార స్పృహ తగ్గి ధ్వనిమాత్రమే మిగిలింది; అందువల్ల ఇది అలంకార ధ్వనికి గ్రహించడం జరిగింది. "అభిప్రాయాత్మకమును, అనభిప్రాయాత్మకమును అగువస్త్వలంకార - రసాత్మక త్రివిధ వ్యంగ్యమును తాత్పర్య శక్తిచే ద్యోతమానమై"[2] కావ్యాల్లో ఉన్న విధంగానే, తెలుగు పొడుపు కథల్లో కూడా ధ్వని పేరుతో వ్యవహృతమవుతుందని చెప్పవచ్చును.

**17-4 : గుణీభూత వ్యంగ్యం :-** "గుణీభూతమనగా నప్రధానము. వ్యంగ్యార్థ మప్రధానమై వాచ్యార్థమే ప్రధానముగా గల కావ్యము గుణీభూత వ్యంగ్య కావ్యము."[3] దీనేనే మధ్యమ కావ్యమంటారు. ఇది అగూఢం, అపరాంగం, అస్ఫుటం (అప్రకాశం), సందిగ్ధం, తుల్య ప్రాధాన్యం, వాచ్యాక్షిప్తం, అరుచిరం (అసుందరం) అని ఎనిమిది విధాలుగా ఉంటుంది [4]

తెలుగు పొడుపు కథల్లో గుణీభూత వ్యంగ్యానికి సంబంధించినవెన్నో లభిస్తున్నాయి. ఈ గుణీభూత వ్యంగ్యంకూడా ద్వితీయమైన ధ్వని నివ్యందమే అని, అందువల్ల ఇవి అతి రమణీయమైనవే అనీ, మహాకవులు దీనిని అకారణం

---

1. చంద్రలోక సమున్మేషము. పు : 110.
2. ఆంధ్ర ధ్వన్యాలోకము, తృ, పు : 529.
3. కావ్యాలంకార సంగ్రహము, పు : 223.
4. I bid ఆ : 2, ప : 147.

గానే ఆదరించారనీ పండితులభిప్రాయ పడుతున్నారు,[1] పరిశీలనలవల్ల ఈ అభిప్రాయంలోని యథార్థం నిశ్చల నిశ్చితమని తేలుతుంది.

* నేనన్నా సంసారిని కానా!
దీప సంవరు కన్నా దేనా!

ఈ పై సంఘటనాత్మక ప్రహేళికలో కాక్వాక్షిప్తమనే గుణీభూత వ్యంగ్యముంది. కాకువు ఉన్నప్పుడు వ్యంగ్యం వాచ్యార్థానంతరం గాక వాచ్యార్థం వెంబడే స్ఫురించడం జరుగుతుంది. పై రెండు వాక్యాల్లో "కానా - తేనా" అనేవి కాకు స్వరాలు. కాకు స్వరంతో ఆక్షిప్తమైంది కాక్వాక్షిప్తం. శోక క్రోధ విస్మయాదుల వల్ల కలిగే స్వర భేదం కాకువని లాక్షణికుల అభిప్రాయం.[2]

'నేనన్నా సంసారిని కానా' అన్నప్పుడు 'కానా' అనే కాకు స్వరంవల్ల 'కాను' అని ధ్వనిస్తోంది. ఇది వాచ్యార్థం; అయితే వాచ్యార్థంతో బాటు వ్యంగ్యార్థం నేను వ్యభిచారినే అని స్ఫురిస్తోంది. 'దీపసంవరుకన్నాదేనా' అన్నప్పుడు విటులవల్ల కనీసం దీపం చమురుకు సరిపోయే డబ్బయినా తెస్తాగదా అనే అంతరార్థం ధ్వనిస్తుంది ఇక్కడ 'దీపసంవరు' అంటే దీపమనే శరీరానికి కావల్సిన చమురనే ఆహారంగా భావించాలి. కాకువు కారణంగా వాచ్యార్థం తరువాతనే వ్యంగ్యార్థం స్ఫురించినట్లయితే అది ఉత్తమమైన ధ్వనే కాని గుణీభూత వ్యంగ్యం కాదు.

* మోకాళ్ల మంటి నీళ్లల్ల
మొండోడు మొత్తుకొనె (బొక్కెన)

ఈ పై పొడుపు కథల్లో వ్యంగ్యార్థం కంటే వాచ్యార్థమే సుందరమై భాసించింది. గుణీభూత వ్యంగ్యంలో అసుందరమేదొకటి సుందరం కానిద సుందరం. 'బావిలో నీరు తక్కువ ఉన్నది; మోటగొట్టేప్పుడు బొక్కెన నేలను గీరుకొంటున్నది'... ఇదీ ఈ పొడుపు కథలోని వ్యంగ్యార్థం. మొండి వాడంటే కాళ్లూ చేతులు లేని వాడనీ, లేదా ఈ రెండింటిలో ఏదో ఒక అంగం లేని వాడినీ

1. ఆంధ్ర ధ్వన్యాలోకము, పు : 579.
2. కావ్యాలంకార సంగ్రహము, పు : 230.

అర్థం. కాళ్ళూ చేతులు లేని వాడికి తన ఆవేదన తెలియజేయడానికి ఇక మిగిలింది నోరొక్కటే. మోకాళ్లమంటి (బంటి) నీళ్ళను దాటబోయిన మొండివాడు సహాయాన్ని ఆపేక్షించే మొత్తుకొన్నాడనే వాచ్యార్థమే పరమ సుందరంగా ఉంది. అందువల్లనే ఇది గుణీభూత వ్యంగ్యాని కుదాహరణమైంది.

అయితే ఈ వాచ్యార్థ-వ్యంగ్యార్థాలకు భిన్నంగా పరమార్థమొకటి ఇందులో ధ్వనిస్తోంది. — ఇది వ్యవసాయదారుని మోట బొక్కెన ఆ బావిలో మోకాటిలోతే నీళ్ళున్నాయి. ఆ నీళ్ళకు తాకిన బొక్కెన నేలను గీరుతుంది. అప్పుడు వచ్చిన చప్పుడే మొత్తుకోడమైంది. బావిలో నీళ్ళు సరిగా లేకపోతే పంటచేను ఎండిపోతుంది. పంటచేను ఎండిపోతే కాళ్ళూ చేతులు లేని మొండివాడవుతాడు రైతన్న. అప్పుడా మొత్తుకోలు రైతన్నదే అవుతుంది. గుణీభూత వ్యంగ్యం ఒక దశలో, ఉత్తమోత్తమ ధ్వని మరొక దశలో బహిర్గతమైనట్లుగా భావించాల్సి ఉంది.

**17-5 : ధ్వని నిర్వాహణం** :- తెలుగు పొడుపుకథలు చాలా వరకు వ్యంగ్య ప్రధానాలుగానే ఉన్నాయి. విడుపుం వల్ల ఆశించిన అర్థం వాచ్యమవుతుంది. అలా ఉన్నవన్నీ గుణీభూత వ్యంగ్యానికుదాహరణాలే అవుతాయి. వ్యంగ్యార్థ ప్రధానాలైన తెలుగు పొడుపు కథలన్నీ ఉత్తమ ధ్వని కావ్య సదృశాలై వెలుగుతాయి.

కావ్యాల్లో ఉత్తమ మధ్యమాధమ భేదాలున్న విధంగానే పొడుపుకథల్ని అలా విభజించడానికి అవకాశముంది. సంస్కృతలాక్షణికులు పొడుపుకథలు రసానికి శత్రువులని భావించి వీటిని అధమ (చిత్ర) కావ్యాలుగా పరిగణించారు. కాని పొడుపుకథల్లోని రసాలంకార వస్తు ధ్వనుల్ని పరిశీలించినపుడు వాటని కేవల చిత్ర కావ్యాలనడం సముచితమనిపించదు. అర్థాన్ని బట్టి పరిశీలించేప్పుడు పొడుపు కథలు ఉత్తమ మధ్యమాధమాలుగా వర్గీకరించే అవకాశముంది.

కావ్యాల్లో ధ్వని నిర్వహించేది కవే. పొడుపు కథల్లో ప్రహేళికా కర్త - ప్రహేళికావ్య వహర్త ధ్వని నిర్వాహకుడు. తెలుగు పొడుపు కథలు ఆనోట ఈనోట వెల్వడి, ఆ చెవిని ఈ చెవిని పడిలోకంలో వ్యవహృతమవు

టున్నాయి. మనసున పుట్టి, నోట వెల్వడి, చెవిలో పడిన పొడుపుకథ నిరంతర సంచలనమయింది. ఈ పరిణామాల్లో ధ్వని ఏ మనసున పుట్టిందో, ఏనోట వెల్వడిందో, ఏ చెవిని పడిందో చెప్పడం కష్టం. అందువల్ల ఎవరు ధ్వని నిర్వాహకుడు అనే ప్రశ్నకు సమాధానం పొడుపుకథా కర్త-వ్యవహర్త అని భావించడం జరిగింది.

''వ్యంగ్య వ్యంజక భావమర్థముల యానంత్యమునకు హేతువు కావున నది విచిత్రమును నానా విధమును అయినను మహాకవి పదము నొందదలచిన బుద్ధిమంతుడీ వ్యంగ్య వ్యంజక భావమెన్ని విధముల నున్నను రసాదిమయమగు నొకదాని యందే మిక్కిలి ప్రయత్నముతో జాగ్రత్త పడుట మంచిది.''[1]... అని చెబుతూ కవి రసధ్వని నిర్వాహకుడు కావాలని ఆంధ్రధ్వన్యాలోకకర్త నొక్కి చెప్పారు. అతి గంభీరమైన ధ్వని తత్త్వాన్ని విశ్వసాహిత్యాని కందించిన ఆనంద వర్ధనాభినవ గుప్తులను అనుసరించి ఇంకా ఎంతో మంది ధ్వని వైభవ ప్రాశస్త్యాన్ని వివరించడం ప్రశంసనీయం.

ఈ సిద్ధాంత గ్రంథంలోని ఈ ప్రకరణాంశంలో ప్రారంభంలో కావ్యాత్మ ఏదో వివరించాను. ధ్వని సహృదయైక వేద్యమని పెద్దల సుద్దులనే క్రోడీకరించాను ధ్వని భేదాల్ని అవసరమున్నంత వరకు ప్రస్తావించాను. తెలుగు పొడుపు కథల్లోని వస్తు ధ్వనిని విశ్లేషించాను. రస ధ్వనిని సూచించాను. అలంకార ధ్వనిని స్పృశించాను. గుణీభూత వ్యంగ్యాన్ని పైపైగా చూపించాను. చివరలో పొడుపు కథాకర్త - వ్యవహర్త ధ్వని నిర్వాహకులవుతారని భావించాను.

---

1. వేనవేల విధంబుల వెలయు వ్యంగ్య
వ్యంజకత్వంబులైనను నందు రస సు
ధామయంబగు నొక దివ్యధామ మందె
యవహితుండయి యుండంగ నగును కవికి

— ఆంధ్ర ధ్వన్యాలోకము, చ-పు : 661.

## పొడుపు కథలు

# ఛందశ్శిల్పం

## 10-1 : ఛందస్సు - ప్రయోజనం

ఛందస్సుల్లో నేను గాయత్రిని అని శ్రీ భగవానువాచ. ప్రపంచంలోని పరమ విశిష్ట పదార్థాల్లోని తన విభూతిని తెలియజేస్తూ భగవంతుడలా అన్నాడు. ఛందః ప్రపంచంలో ఆయన గాయత్రీ ఛందస్సు. ఈ మాటవల్ల భగవంతుని విభూతుల వైశిష్ట్యంతోపాటు ఛందస్సు ప్రాధాన్యం తెలుస్తుంది.

పద్యగద్యోభయ సాహిత్యంలో పద్య విద్యకు ఛందస్సే పట్టుగొమ్మ. నిబద్ధమైంది పద్యం; అనిబద్ధమయింది గద్యం. రెండూ అర్థాపేక్షగల పదబంధాలే అయినా పద్యం రాగలయతాళాలతో విలక్షణమై వెలుగుతోంది. భరతముని "ఛందస్సునకు కట్టుబడని శబ్దముండదని శబ్దము లేకున్న ఛందస్సుండ"[2]దని వచించాడు. ఛందస్సుకూ భాషకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని ఈ వాక్యం సూచిస్తోంది. "భాషములకు ఛందస్సు తొడుగువంటి"దని యాస్కాచార్యుల నిర్వచనం.[3]

---

1. గాయత్రీ ఛందసామహమ్-శ్రీ భగవద్గీత అ : 10, శ్లో : 35.
2. ఛందోహీనో నశబ్దోఽస్తి నచ్ఛంద శబ్ద వర్జితమ్- తెలుగులో ఛందోరీతులు' నుండి ఉద్ధృతం-పు : 1.
3. ఛందాంసి ఛాదనాత్ - తెలుగులో ఛందోరీతులు నుండి పు : 1.

"వేద పురుషునికి ఛందస్సు చరణయుగం, అందువల్ల ఛందమన్నిట అవశ్యంగదా"[1] అని అప్పకవి విరచించాడు. ఈ భావంకూడా సాహిత్యశాస్త్రాల్లో పద్య లక్షణం తెలిపే ఛందశ్శాస్త్రం ప్రాధాన్యాన్ని మరీ బలపరుస్తోంది.

సంస్కృతాంధ్రాల్లోనూ తదితర భాషల్లోనూ చందశ్శాస్త్రాల్ని విరచించిన కవులందరూ ఆ శాస్త్ర ప్రాధాన్యాన్ని ప్రయోజనాన్ని నొక్కి చెప్పారు. సాహిత్య స్వరూపం బహుళాతి బహుళంగా విభజింపబడడానికి, విభిన్న ప్రక్రియలేర్పడడానికి ముఖ్య కారణం ఛందస్సు. వృత్తాలు, జాతులు, ఉపజాతులు, గేయాలు, వచన గేయాలు, మొదలైనవన్నీ పద్య స్వరూపంలోని అంగాలే, పద్య వృక్షశాఖలే వీటికున్న గతివైవిధ్యం అనంతం అందువల్లనే అనంతకోటి భావాలకు అనంతకోటి పద్యాలు ప్రాదుర్భవించాయి. అవి ఊరకే పుట్టలేదు. భావానుగుణంగా గతులతో అవతరించాయి. ఆ కారణాన్నే ఛంస్సు-భావం-భాష ముప్పురి తాడులాగా పెనవేసుకొనిపోయాయి.

## 10-3 : దేశి ఛందస్సు - పొడుపుకథలు

ఛందశ్శాస్త్రంలో రాగలయతాళాల వైశిష్ట్యం ఎంతటిదైనా గణాలు ఛందశ్శరీరానికి ఎముకల వంటివి తెలుగు పద్యాల్లోని వృత్తాలన్నీ సంస్కృత సంప్రదాయాన్ని అనుసరించినవే అయినా యతిప్రాసల విషయంలో తెలుగుదనాన్ని నిలుపుకొన్నాయి వృత్తాలన్నీ సమగణాలకు ఆకరాలు కాగా, జాతులు-ఉపజాతులు - గేయాలు-వచన గేయాలన్నీ మాత్రగణబద్ధాలై ఉన్నాయి. ఇందులో జాతులు ఉపజాతులు సూర్యేంద్ర చంద్ర గణాలచేత విరచింపబడుతున్నా సునిశిత పరిశీలన చేసినప్పుడు అవి అన్నీ మాత్రానిబద్ధాలైన గణాలనే తేలుతుంది. ఈ విషయాన్ని "తెలుగులో ఛందోరీతులు" అనే గ్రంథం సోదాహరణంగా సాధికారికంగా వ్యాఖ్యానించింది. అందువల్లనే ఆ గ్రంథ రచయిత "దేశిచ్ఛందమునకు

---

1. వేదమునకు పాదంబులై వెలయుకతన
ఛందమన్నిటిలో నవశ్యంబు గాదె
పురుషుడఖిలాంగ యుతుడయ్యు చరణ యుగము
లేక నడవ సమర్థుడే లోకమునను -అప్పకవీయము-ఆ : 4, ప : 10.

కావలసిన గణములు మాత్రానిబద్ధములయిన గణములే కాని త్రికములు కావు" [1] అంటున్నారు.

ఈ విషయాన్ని బలపరచే ఈ క్రింది పద్యం గమనార్హం

"కమనీయ వృత్తములు గణ
సమక నిబద్ధములు, శేషజాతులు మాత్రా
సమక నిబద్ధములగు; నే
కమాత్ర లఘువై ద్విమాత్రకము గురువయ్యేన్ [2]

వృత్తాలు సమవర్ణ గణాలైన మ,భ,జ,స,న,య,ర,త లతో నిర్మాణమైనవి. జాతులు మాత్రాగణ సమూహాలు. మాత్రాగణాలు మాత్రల సంఖ్యననుసరించి ఏర్పడుతాయి. ఇవి త్ర్యస్ర చతురస్రాది నామాలతో వ్యవహృతాలవుతున్నాయి. లఘువును ఒక మాత్రగాను, గురువును రెండు మాత్రలుగాను పరిగణించాలి.

దేశి ఛందస్సులోని జాత్యుపజాతుల్లో ప్రయోగింపబడే సూర్యేంద్ర చంద్ర గణాలన్నీ మాత్రానిబద్ధాలైన గణాలే అని "తెలుగులో ఛందోరీతులు" అనే గ్రంథం వాటిని ఈ విధంగా వివరించింది [3] ఈ సూర్యేంద్ర చంద్ర గణాలేవో ప్రస్తారం వేసి తెలుసుకోవచ్చు. లేదా ఛందో గ్రంథాలందలి పద్యాల్ని బట్టి గ్రహించవచ్చు. [4]

---

1. తెలుగులో ఛందోరీతులు - పు : 242.
2 కవిజనాశ్రయము, సం-ప : 14.
3. తెలుగులో ఛందోరీతులు-పు : 164
4. నల, నగ, సల, భ, ర, తలు నా
నెలమిని నీయాఱు గణములింద్ర గణంబుల్
గల, నగణము ల రెండును
జలజాప్త గణంబులయ్యె జగదాధారా.
[సులక్షణ సారము-సం-ప : 20]—>

1. సూర్యగణాలు : 2

| | | |
|---|---|---|
| హగణము (గలము) | VI-మాత్రలు : | 3 |
| నగణము | III-మాత్రలు : | 3 |

2. ఇంద్రగణాలు : 6

| | | |
|---|---|---|
| భగణము | VII-మాత్రలు : | 4 |
| రగణము | VIU- ,, | 5 |
| తగణము | UVI- ,, | 5 |
| నగము | IIIV- ,, | 5 |
| నలము | IIII- ,, | 4 |
| సలము | IIVI- ,, | 5 |

3. చంద్రగణాలు : 14

| | | |
|---|---|---|
| నగగము | IIIUV-మాత్రలు : | 7 |
| నహము | IIIUI- ,, | 6 |
| సలలము | IIVII- ,, | 6 |
| భలము | VIII- ,, | 5 |
| భగము | VIIU- ,, | 6 |
| మలము | VVVI- ,, | 7 |
| సవము | IIVIV- ,, | 7 |
| సహము | IIVVI- ,, | 7 |
| తలము | VVII- ,, | 6 |
| రలము | VIVI- ,, | 6 |

---

గల నగణము లిను డింద్రుడు
నల, నగ, సల, భ, ర, త; లింక ననగ, నహ, సలా,
భల, భగురు, మలఘు, సవ, సహ
తల, రల. నవ, నలల, రగురు, తగలిందుడజా!

[ఛందోదర్పణము - పు : 19]

| | | | |
|---|---|---|---|
| నవము | IIIIV- | మాత్రలు : | 6 |
| నలలము | IIIII- | ,, | 5 |
| రగము | VIVV- | ,, | 7 |
| తగము | VVIV- | ,, | 7 |

ఈ సూర్యేంద్ర చంద్ర గణాల్ని ప్రయోగించడానికి కూడుగా ఆయా పద్యాల్లో ఆయా గణాల మాత్రల్ని నిబద్ధం చేసినా రాగలయతాళాలేమీ ఒదవు. కాని అలా రాసినవారు, రాయడానికి యత్నించిన వారు లేరనే చెప్పాలి.

జాత్యుపజాతి పద్యాల్లో కొన్నింట పొడుపు కథలు ఆ ఛాయలు కనబడు తున్నాయి. వాటిని వివరించేప్పుడు అవి ఉదాహరింపబడుతాయి. ఇప్పుడు పద్యాలకు మూలమైన మాత్రాగణబద్ధాలైన గేయ ప్రహేళికల్లోని ఛందోవైవి ధ్యాన్ని గమనిద్దాం.

## 10-3 : గేయాలు

కోడి కూతలో, ఆవు అరపులో, బెబ్బులి గాండ్రింపులో, శిశువుఏడ్పులో గేయముంది. ఆకలిలో, ఆవేదనలో, ఆవేశంలో మనిషి భావాలలో కొంతకందని వేగమొకటి ఉంటుంది. ఆ వేగం నుండే గేయం పుడుతుంది. ఈనాడు మనకు కనిపించే పద్యాలకు పూర్వరూపం గేయమే. ఆ ప్రారంభ గేయాలు గ్రంథాలకు ఎక్కలేదు గాని కుప్పలు కుప్పలుగా రాశులు పోయబడేవి. "ఏ దేశమందైనను ఏ భాషలోనైనను పద్యరచనకు పూర్వము చాలా కాలము గేయ రచనయే యుండె"[1] నని విమర్శకుల అభిప్రాయం.

గేయానికి స్వరగతులు సహజ ధర్మాలు. స్వరం అర్థ ప్రాధాన్యాన్ని గతిగమన ప్రాధాన్యాన్ని వ్యక్తీకరిస్తుంది. ఈ రెండూ నిలదొక్కు కోవాలంటే లయ ఉండాలి. లయకాధారం మాత్రలు ఈ మాత్రల సంయోజనంతో రాగ తాళలయగతుల్ని పాటించినప్పుడు ఆ గేయం సొగసుల దీవియై, లావణ్య పయో ధియై, రమణీయమై అనశ్వరమవుతుంది, అజరమవుతుంది, అమరమవుతుంది.

1. తెలుగులో ఛందోరీతులు, పు : 156

## 3-1 : అర్థసమ విషమ గేయం :-

* రాచ వారికి నచ్చే చిన్నదీ! — 17
రాజ్యాలల్లా మెచ్చేనన్నదీ! — 17
జంగారు వారింటి కోడలూ — 15
పట్టు మంచే రాదు బేశలూ — 15
చేంతాడుతో తోడకుండా — 14
చెంబులాతో ముంచకుండా — 14
నీటుగానూ కుల్కుతున్నదీ — 15
నీళ్ళు తెస్తానంటు వున్నదీ! — 15
(కొబ్బరిరాయ)

ఎనిమిది పాదాలున్న ఈ గేయాన్ని రెండు సగాలుగా విభజించుకొని పరిశీలించాలి. గేయానికి వృత్తాల వలె పాద నియమం లేదు. మొత్తం గేయాన్ని పరిశీలించినప్పుడు కొన్ని పాదాల్లో 17 మాత్రలు, కొన్నిటికి 15 మాత్రలు, కొన్నిటికి 14 మాత్రలు కన్పిస్తాయి. గేయాన్ని ప్రథమార్థ ద్వితీయార్థాలుగా విభజించి పరిశీలిస్తే, ప్రథమార్థంలోని పూర్వార్థపాద ద్వయం 17 మాత్రలు గలదిగాను, ఉత్తరార్థ పాదద్వయం 15 మాత్రలు కలదిగాను గమనిస్తాం అల్లే ద్వితీయార్థంలోని పూర్వార్థ పాదద్వయం 14 మాత్రలు గలదిగానూ, ఉత్తరార్థ పాదద్వయం 15 మాత్రలున్నదిగాను తేలి పోతుంది. అప్పుడు ప్రథమార్ధమొక అర్ధసమ విషమ గేయానికి, ద్వితీయార్ధ మొక అర్ధసమ విషమ గేయానికి ఉదాహరణలవుతాయి.

**3-2 : విషమ గేయం :-** గేయ పాదాలన్నిట్లోను వేర్వేరు మాత్ర లున్నప్పుడు అది విషమ గేయమనబడుతుంది.

* గోడ మీది బొమ్మ — 9
గొలుసుల బొమ్మ — 7
వచ్చిపోయే వారికి — 11
వడ్డించు బొమ్మ — 8 (తేలు)

నాలుగు పాదాలు గల ప్రసిద్ధమైన పై గేయ ప్రహేళికలో ప్రథమ పాదానికి 9, ద్వితీయ పాదానికి 7, తృతీయ పాదానికి 11, చతుర్థ పాదానికి 8 మాత్రలున్నాయి. అందువల్ల ఇది విషమ గేయానికి ఉదాహరణమయింది. గేయాల యొక్క పాద సంఖ్యల్ని బట్టి వీటనింకా సూక్ష్మ సూక్ష్మాలుగా విభజించ డానికి అవకాశాలున్నాయి. ఈ ప్రకరణం ప్రధానంగా అందుకొరకేకాదు కాబట్టి గేయ రచనల్లోని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాది భేదాల్ని మాత్రం గమనిద్దాం

**3-3 : త్ర్యస్ర** :-మూడు మాత్రలున్న గణాలన్నీ త్ర్యస్రాలు. నగణము- III, గలము - UI, లగము - IV, ఇవి త్ర్యస్రాలు. ఒకే గేయ పాదంలో పద పదానికి త్ర్యస్రమే ప్రయోగింపబడ్డా, లేదా మూడుతో భాగింపబడేవైన ఆరో, తొమ్మిదో, పండ్రెండో మాత్రలు కలిగియున్నా అది త్ర్యస్రమే అనబడుతుంది.

* ఊరులేని పాటి మీద
పేరులేని గరిక మొలచె
నోరులేని లేడి మేసెరా
ఓరి తమ్మి ఓరి అన్న
నీనిలోని మాయ యేందిరా !

* ఊరులేని పాటి తోలు
పేరులేని గరక బాలు
నోరులేని లేడి వాలు
ఓరి తమ్మి ఓరి అన్న
నీనిలోని మాయ ఇదేరా!

ఈ గేయంలోని ప్రథమార్థం పొడుపు, ద్వితీయార్థం విడుపు. ప్రథమార్థంలోని మేసెరా, యేందిరా అనే పదాలు, ద్వితీయార్థంలోని ఇదేరా అనే పదం తప్ప మగిలిన పన్నీ త్ర్యస్రాలే. 'నోరులేని లేడి మేసెరా' అనే పాదంలోని 'మేసెరా' అనేది ఉచ్చరించేప్పుడు కొందరు 'సె' దీర్ఘంగా ఉచ్చరిస్తారు. లేదా 'రా' నే ప్లుతంగా పలుకుతారు. అప్పుడా పాదం 15 మాత్రలవుతుంది. అదే

విధంగా 'దీనిలోని మాయ యేంపిరా' అనే పాదంలోని 'ది' ని దీర్ఘంగా పలకడమో 'రా' ను ప్లుతంగా ఉచ్చరించడమో చేస్తారు. 'దీనిలోని మాయ ఇదేరా' అనే పాదం విషయంలోనూ అంతే. అప్పుడు ప్రథమార్థంలో మూడు, అయిదు పాదాలు' ద్వితీయార్థంలోని పంచమ పాదం 15 మాత్రలు అవుతాయి. మిగిలినవన్నీ త్ర్యస్రాలే.

ఈ గేయ ప్రహేళిక నడకలో ఎక్కడా కుంటడం అనేదేలేదు. నీళ్ళు గడగడ త్రాగిన విధంగా గతి ఉంది. రాగలయ తాళాలు కూడా సాఫీగా సాగుతాయి. త్ర్యస్ర గతి పద సంయోజనం వల్ల, అధికంగా సమ విభక్తాలైన పాదాలు కూర్చడం వల్ల, ఈ గేయ ప్రహేళిక రమణీయ శిల్ప సౌందర్యాన్ని సంతరించుకొంది.

**3-4 : చతురస్ర** :- నాలుగు గణాల మాత్రలు చతురస్రాలు. నలము IIII, భగణము VII, సగణము IIV, జగణము IVI, ఇవి చతురస్రాలు. వీటికి తోడు గగము VV ను చేర్చవచ్చు. గేయ పాదాల్లో పదపదానికి చతురస్రమే ప్రయోగింపబడ్డా లేదా ఎనిమిది, పన్నెండు, పదహారు, ఇరవై మాత్రలు ఉన్నా చతురస్రమే అనాలి.

* వంకర టింకర మానూ
వయ్యారి మానూ
రాజు లెక్కే మాను
మావూరొచ్చే గూనూ
కాపు లెక్కే మానూ
కష్ట జీవుల మానూ
ఎత్తుకు ఎదిగే మానూ
ఇంతుల పెండ్లీ కౌనూ (పల్లకి)

ఇందులోని మొదటి పాదంలో చతురస్రాలైన మూడు గణాల సంయోజనంతో 12 మాత్రలున్నాయి రెండవ పాదంలో 'రి' అనే అక్షరం వల్ల 9 మాత్రలైనందున చతురస్రానికి ఒక మాత్ర మించింది. ఒకటి రెండు మాత్రలు

ఎక్కువ తక్కువ కావడమనేది సర్వసాధారణం. మూడవ పాదంలో 'రాజు', ఐదవ పాదంలో 'కాపు', ఆరవ పాదంలో 'కష్ట' అనే పదాలలోని అంత్యాక్షరాల్ని దీర్ఘంగా ఉచ్చరించాలి; జానపదుల్లో కొందరిట్లే ఉచ్చరిస్తారు అప్పుడు ఈ 8 పాదాలకు వరుసగా మాత్రలీ విధంగా ఏర్పడతాయి.

12, 9 (-1), 12, 12, 12, 12, 12, 12

ఇందులో ఒక్క రెండవ పాదం తప్ప మిగిలినవన్నీ సమమాత్రా నిబద్ధ పాదాలు. రెండవ పాదాన్ని "వయ్యారమైనా మామా" అని మార్చినప్పుడు అన్ని పాదాల్లోని మాత్రలు సమానమవుతాయి. కొందరు 'వ్యయం' శబ్దంలోని 'య్య' ను అద్విరుక్తంగా ఉచ్చరిస్తారు.

ఈ గేయం చతురస్ర గతిలో నడచి రాగ లయ తాళాలు సాఫీగా సాగ డానికుపకరించింది. ఇందులో పద చతురస్రం, పాద చతురస్రం కారణంగా గతి ఎక్కడా కుంటడం లేదు.

**3-5:** ఖండ :- ఐదు మాత్రలున్నవన్నీ ఖండ గణాలు నలలము IIII, భలము VII, తగణము VVI, రగణము VIU, నగము IIIV, సలము IIVI, జలము IUII, యగణము IUV— ఇవి ఖండ గతి గణాలు. పొడుపు పాటల పాదాల్లో పదపదానికి అయిదు మాత్రలుండినా, లేదా పాదానికి అయిదు, పది, పది హేను, ఇరవై మాత్రలుండినా అది ఖండమే అవుతుంది.

* ఏసేది యేందిరా
ఎక్కేది యేందిరా
కారేది యేందిరా
కట్టేది యేందిరా

ఏసేది నిచ్చెనా
ఎక్కేది మనిషిరా
కారేది కల్లురా
కట్టేది లొట్టిరా

నిలబడ్డ దేంఏరా
కూసున్న దేంచిరా
కాళ్ళ సందు దేం దిరా
కారేది యేందిరా

నిలబడ్డది బట్టెరా
కూసున్నది మన్నిరా
కాళ్ళ సందుది సెంబురా
కారేది పాలురా

ఈ గేయం ప్రథమార్ధంలోని పొడువు విడుపుల్లో పంచమాత్రా నిబద్ధ ఖండగతి గణాలున్నాయి. మొత్తం ఎనిమిది పాదాల్లో పాదపాదానికి 10 మాత్రలున్నాయి. ద్వితీయార్ధంలోని తృతీయ పాదానికి ఒక మాత్ర, పంచమ పాదానికి ఒక మాత్ర ఎక్కువగా ఉన్నాయి అట్లే ఏడవ పాదానికి రెండు మాత్రల ఆధిక్యత ఉంది. జానపదులు ఈ అక్షరాల్ని మ్రింగివేయడం వల్లనో ఆ యక్షర ఉచ్చారణ సందర్భంలో పఠన వేగాన్ని పెంచడం వల్లనో రాగలయ తాళగతుల్ని పాటిస్తారు.

'కాళ్ళ సందు దేందిరా' అనడానికి మారుగా 'కాళ్ళ సందేందిరా' అనీ, 'నిలబడ్డది బట్టెరా' అనడానికి బదులుగా 'నిల్సుంది బట్టెరా' అనీ, 'కాళ్ళ సందుది సెంబురా' అనడానికి ప్రతిగా 'కాళ్ళల్ల సెంబురా' అని సవరిస్తే అన్ని పాదాలు దశమాత్రాకాలవుతాయి. మొదటి రెండు సవరణల్లో అర్థం, అర్థాంతరం చెడదు గాని తృతీయ సవరణలో అర్థాంతరం చెడడానికి అవకాశముంది. అందువల్ల జానపదుల నోటి మాట తరగని మాటగా భద్రపరచాల్సిందే.

**3-6 : మిశ్ర** :- ఏడు మాత్రలున్న వన్నీ మిశ్ర గణాలు. ఇవి 3+4 గాను లేదా 2+5గాను విభక్తమవుతాయి. 4+3గాను 5+2గాను కూడా విభక్తంగా వచ్చు. కాని ఈ రెండవ విభజన వల్ల పేరుకు 7 మాత్రల గణాలనవచ్చు గాని అవి శ్రుతికి ఇంపు నింపేవి గావు. ఈ మిశ్రగతి గణాల సంఖ్య మొత్తం 21

అవుతుంది.[1] ప్రాచీనాంధ్ర కవులు హరిణగతి, వృషభగతి రగడల్ని మిశ్రగతి లోనే నడిపించారు.[2] "గుమ్మ డేడే గోపిదేవీ-గుమ్మ డేడే కన్నతల్లి" మొదలైన జానపద గేయాలెన్నో మిశ్రగతి గణాల వల్లనే సౌందర్యాన్ని సంతరించు కొన్నాయి. గురజాడ వారి ముత్యాల సరాలు మిశ్ర మాత్రా గణాలు. అదే విధంగా తెలుగు పొడుపు కథా గేయాల్లోనూ మిశ్రమాత్రా గణబద్ధాలున్నాయి.

* కుంట నిండే - కుంట యెండే
కుంట యెనుకా — పంట పండే
పంటగోసీ కుప్ప వెట్టి
కుప్పగాలే అప్పుదేరే (కుమ్మరావం)

ఈ ప్రహేళికలోని ప్రతి పాదంలో 3 + 4, 3 + 4 = 14 మాత్ర లున్నాయి. ఒక త్ర్యస్రం, ఒక చతురస్రం ఒకదాని వెనుక ఒకటి ఉన్నాయి. ఈ నడక శ్రుతి సుభగమే అయినా లయతాళానుగుణంగా మాటల పొందిక ఉండడమే ప్రధానం. వాటి జీవనాడుల్ని పరిశీలించిన గవేషకునికే అది సాధ్య మవుతుంది. చతురస్ర త్ర్యస్రాల వరుసలున్న ఈ కింది మిశ్రగతి ప్రహేళిక పరిశీలనార్హం.

* కాటుక రంగు
కమలం హంగు
విప్పిన పొంగు
ముడిచిన కృంగు

చివరి పదంలోని చివరి అక్షరం దీర్ఘంగా పలికితే (రంగూ) ఇవన్నీ చతురస్రాల కోవలోకే వస్తాయి. చివరి అక్షరాన్ని దీర్ఘంగా పలకడం గేయ ధర్మం.

---

1. తెలుగులో ఛందో రీతులు, పు : 244, 245.
2. బాలబాల రసాల మిది పిక - పాలి పాలిట యమరసాలము.
-వసు చరిత్ర, ఆ : 3 - ప : 149

ఇక ఈ గేయంలోని ప్రతి పాదంలో 4 + 3 = 7 మాత్ర లున్నాయి. ఈ విధంగా ఉన్న ప్రహేళికల్లోని గతిలో దూకుడు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ కింది పొడుపు కథల్లో గేయ మాధుర్యం లేకున్నా మిశ్రగతి ఉంది. ఒక పొడుపు కథలో 4 + 3 మాత్రలు గమనిస్తాం. కొన్నిట్లో 5 + 2 మాత్రలున్నాయి.

* సిన సిన్నింట్లు — 4 + 3
సిట్టాపంట్లు — 4 + 3
దేవారింట్లు — 4 + 3
డెబ్బయ్యిండ్లు — 4 + 3 (జల్లెడ)

* రస చుసులు దిన్న — 4 (-1) + 3
రాజు కడుపుల — 3 + 4
పేగులు లేవు — 4 + 3
గుండెలు లేవు — 4 + 3 (తల)

మిశ్రగతి గణాల్లో మాత్రలు పడవలసినట్లు పడకపోతే నడక చెడడానికి అవకాశముంది. ఇక సంకీర్ణగతి గణాలున్న గేయ ప్రహేళికల్ని పరిశీలిద్దాం.

**3 – 7: సంకీర్ణ** :– తొమ్మిది మాత్రలున్నవన్నీ సంకీర్ణ గణాలవుతాయి. ఇవి 3 + 3 + 3 = 9 గాను, 2 + 7 = 9 గాను, 4 + 5 = 9 గాను, 5 + 4 = 9 గాను విభజించవచ్చు. 3 + 3 + 3 మాత్రలున్నప్పుడు దానిని త్ర్యస్ర నడకానికి వీలుంది. కాని సంకీర్ణగతి గణాలు 9 మాత్రలే అయినందువల్ల సంకీర్ణమనడమే కుదురుగా ఉంటుంది. కేవల మిటువంటివే తెలుగు గేయ రచనల్లోనూ, జానపద గేయ సాహిత్యంలోనూ సకృత్తుగా కనిపిస్తున్నాయి.

* కాయ నడిచి వచ్చె
కంచె నడచి వచ్చె
పువ్వు ఎగిరి వచ్చె
చెప్పుకోర పిల్లగా
చెప్పకుంటె తప్పుకోర మెల్లగా

పాద పాదానికి 9 మాత్రలున్న ఈ గేయ ప్రహేళికల్లోని చివరి రెండు పాదాల్లో వరుసగా 11, 17, మాత్రలున్నాయి. మొదటి మూడు పాదాలు మాత్రం సంకీర్ణగతి నడిచాయి. ఈ పొడుపుకున్న విడుపు పాటలోని రెండు పాదాల్లో 12, 12 మాత్రలు, చివరి పాదానికి 13 మాత్రలున్నాయి. ఇదీ త్ర్యస్రమే అవుతుంది.

(ఎండ్రకాయ నడచి వచ్చె
నీరు కంటె నడచి వచ్చె
మిణుగురు పువ్వు ఎగిరి వచ్చె)

సంకీర్ణ గతికే చెందిన ఈ కింది గేయ ప్రహేళికలో 1, 3 పాదాలు 9 మాత్రలతోనూ 2, 4 పాదాలు 8 మాత్రలతోనూ ఉన్నాయి. రెండు నాల్గు పాదాల అంత్యాక్షరాల్ని దీర్ఘంగా ఉచ్చరిస్తే అవి కూడా 9 మాత్రలవుతాయి. అంతేగాక "సంస్కృత పద్యములందు చరణాంతమున గల లఘువుకూడవలసి నప్పుడు గురువుగా నుచ్చరించవచ్చును"[1] అనేది అంతటా వర్తిస్తుందనేది గుర్తించాలి.

* పొడల పొడల గువ్వ
పొన్నారి గువ్వ
రాజు మెచ్చ గువ్వ
రంజోరి గువ్వ (పల్లకి)

తెలుగు పొడుపు కథల్లో త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాది మాత్రా భేదాలే గాక 6, 8, 10 మాత్రలవి కూడా ఉన్నాయి. కాని 6 మాత్ర లవి త్ర్యస్రలోనూ 8 మాత్రలవి చతురస్రలోనూ, 10 మాత్రలవి ఖండలోనూ అంత ర్లీనమవుతాయి. అందువల్ల వాటిని ప్రత్యేకంగా వివరించలేదు. అంతేగాక అక్షర సము దాయం 10 మాత్రలకు మించి ఉండవచ్చు. అది ఏకపద మోసమాస పదమోగావచ్చు.

1. తెలుగులో ఛందోరీతులు - పు : 24
"పాదాంతా లఘోర్గురుత్వంచ సర్వత్ర"
- కావ్యాలంకార సూత్రవృత్తి.

అందువల్ల 10 మాత్రలే చివరి మెట్టు అనడానికి వీలులేదు. పదాల విషయ మెట్లున్నా పాదపాదానికి 20 మాత్రల పైచిలుకు కూడా ఉండవచ్చు. కాబట్టే "మాత్రాబద్ధముగ వివిధ గీతులలో విశ్వరూపము దాల్చగల యిటువంటి దేశిచ్ఛందో రీతులను వివరింపబూనుట సర్వసామాన్యమైన విషయముగాదు"[1] అని వర్ణమూడి గోపాలకృష్ణయ్యగారి అభిప్రాయం.

## 10-4 : వచన గేయాలు

మాత్రాబద్ధత కేవలం గేయాల్లోనే గాక వచనాల్లోనూ కనిపిస్తుంది. అటువంటి వచనాల్ని వచన గేయాలని పిలుస్తుంటారు. ఆధునికాంధ్ర కవిత్వంలో వచన గేయమనేది ఒక ప్రక్రియగా స్థిరపడిపోయింది. కేవల వచనమో కేవల గేయమో ఉంటుందిగాని వచన గేయమనేది ఉండదనే వాదనకూడా ఉంది. వచన కవితలోను, వచనగేయంలోను లయ అనేది ఉందని అది వాని ప్రధాన లక్షణాల్లో ఒకటనే అభిప్రాయముంది. ఈ విషయంలో విమర్శకులింకా తమతమ అభిప్రాయాల్ని పత్రికాముఖంగా ప్రకటిస్తూనే ఉన్నారు.

తెలుగు పొడుపుకథల్లో సగానికి పైగా వచనగేయాలే. అవి మాత్రానిబద్ధ ప్రహేళికలే అయినా గతిలో లయలో రాగంలో సంపూర్ణత్వం సిద్ధించనందు వల్ల వచన గేయాలయ్యాయి. అంతేగాక సంపూర్ణత సిద్ధించే సామగ్రి ఆ పొడుపు కథకు లభ్యంకాదు. సంపూర్ణ గేయరూపాన్ని పొందే లక్షణాలు సర్వసాధారణంగా చిట్టిపొట్టి పొడుపుకథల కుండనే ఉండవు. అందువల్ల గేయంగా మారక అవి వచనగేయ రూపాన్ని పొందాయి.

గేయరూపాన్ని పొంది, ఆనోట ఈనోటపడి కొన్ని పాదాల్లో మాత్రలు లుప్తమై, కొన్ని పాదాల్లో మాత్రలు అధికమై ఎన్నో తెలుగు పొడుపు కథలు వచనగేయ రూపాన్ని సంతరించుకొన్నాయి. గేయరూపాన్ని పొందనివి, గేయ రూపం పొంది భ్రష్టమైనవి లేదా శిథిలమైనవీ, సహజ సిద్ధంగా వచనగేయమైనవి అనే మూడు రకాలైన వచన గేయాలు పొడుపు కథల్లో కనిపిస్తున్నాయి. అవి ఎలా రూపు సంతరించుకొన్నా వచన గేయాలే అవుతాయి.

---

1. తెలుగులో ఛందోరీతులు - గ్రంథపరిచయము, పు : 28.

## 4-1 : గేయరూపాన్ని పొందనివి :-

* చలిలేక నిప్పుకాగేవాడు
తాపంలేక చెరువులో నానేవాడు
బతికుండీ గోతిలో కూర్చుండేవాడు
ఏ ఊళ్లోబడితే - ఆ ఊళ్లోనే ఉన్నాడు
(కంసాలి—చాపలి—పద్మశాలి)

పాదపాదానికి విభిన్న మాత్రలు గల విషమ గేయస్థితి ఈ పొడుపు కథలో ఉంది. గేయ సామగ్ర్యత సిద్ధించని రీతి పొడుపుకథ గతిలో, లయలో కనిపిస్తుంది. 1,2,3,4 పాదాలకు వరుసగా 15, 19, 20, 23 మాత్రలున్నాయి.

* పిఠాపురం చిన్నవాడా! పిట్టల వేటకాడా!
బతికిన పిట్టను కొట్టావద్దు
చచ్చిన పిట్టను తేనూవద్దు
కూరకు తేకుండా రానూవద్దు - అందిట (కోడిగుడ్డు)

ఇందులో రెండు మూడు పాదాలు 15 మాత్రలు, ప్రథమ పాదం 24 మాత్రలు, చతుర్థ పాదం 21 మాత్రలు ఉన్నాయి. ప్రథమ చతుర్థ పాదాల్లో ఒక విధమైన లయసామ్యం కుదురుకోబోయి కూలిపోయిన స్థితి ఉంది. ద్వితీయ తృతీయ పాదాల్లో ఆలయ కుదురుకొంది మొత్తంమీద గేయంగా పాడరాదు, వచనంగా చదువరాదు-అందువల్ల అది వచన గేయమైంది.

**4-2: భ్రష్ట గేయాలు :-** గేయరూపం పొందని పొడుపు కథకు, గేయ రూపం పొంది ఆ స్థితిని కోల్పోయిన పొడుపు కథలకు పెద్ద అంతరమేమీ కనిపించదు. ఒకటి నిచ్చెనను ఎక్కలేకపోయింది; మరొకటి నిచ్చెన ఎక్కి కూలిపోయింది.

* మొదట నల్లగా ఉంటాను
  రంగుమారి ఎఱ్ఱనవుతాను
  మళ్ళీ తెల్లగా మారతాను
  అయితే ఊసరవిల్లిని గాను—
  నే నెవరిని ? (బొగ్గు)

ఇందులో ప్రథమ పాదంలో 13, ద్వితీయ పాదంలో 14, తృతీయ పాదంలో 15, చతుర్ధ పాదంలో 15 +6 మాత్రలున్నాయి. ప్రథమవాక్య ప్రారంభంలో 'నేను' చేర్చడంవల్ల, ద్వితీయ పాదంలో రంగుమారి అను పదాల తర్వాత 'మరి' చేర్చడంవల్ల పాడడానికి అనుకూలమైన లయ-గతి ఎర్పడుతుంది. ఈ పదాలో లేక మరింకేవో ఆ పాదాలనుండి తొలగడంవల్ల అది వచనగేయ మయింది.

* జిలుగు జిలుగు నీళ్ళలో జిలుగు పుట్టి
  ఆకుపుట్టి అంతరాల కొడుకు పుట్టె
  కొడుకు తలగొట్టి కోడలు ముండమోసె (అరటి చెట్టు)

ఇందులో వరుసగా 17, 18, 18 మాత్రలున్నాయి. మొదటి పాదం లోని 'నీళ్ళలో' పదం తర్వాత 'న' యుక్తమైనట్లనిపిస్తుంది. రెండవ పాదం సాఫీగా సాగుతుంది. మూడవ పాదంలో త్ర్యస్రగతి తప్పింది, మాత్రలున్నవి గాని లయ చెడింది. ఇటువంటివన్నీ వచనగేయాలకు ఉదాహరణలవుతాయి.

## 4-3 : సిద్ధ వచన గేయాలు :

* దాని మొదలు చెరకు మొదలు
  దాని ఆకు దామెరాకు
  దాని పూత మేడిపూత
  దాని కాత గజ్జికాత. (ఆముదము చెట్టు)

ద్వాదశ మాత్రాగణ నిబద్ధమైన ఈ పొడుపుకథ పాదపాదానికి మాత్రల సామ్యం సిద్ధించినా, నిండుగా త్ర్యస్రగతిని పొటంచినా రాగరహితమై ఉన్నందు వల్ల పొడుపు పాట రూపు సంతరించుకోలేకపోయింది.

* నాకు కాళ్లు లేవు — చేతుల్లేవు
ఎముకల్లేవు - మెడలేదు
చెవుల్లేవు - ముక్కులేదు
కళ్ళు లేవుగాని పానమున్నది (జలగ)

ఈ ప్రహేళికను పైవిధంగా వ్రాస్తే నాల్గు పాదాలవుతుంది. అర్థ యుక్తంగా ప్రతి పాదాన్ని విరచి వ్రాస్తే ఎనిమిది పాదాలవుతుంది. అప్పుడు వరుసగా 9,6,7,5,6,6,9,7 మాత్రలుంటాయి. ఈ పొడుపుకథ మాటాడిన విధంగానే ఉన్నా కొంత లయ లేకపోలేదు.

సిద్ధవచన గేయాలకు ఉదాహరించిన పై రెండింటిలో ఒక అక్షరాన్ని కలిపినా తేడా తీసివేసినా ఏదో ఒక లోపం కనబడుతుంది ఈ విధంగా ఉండడం వల్లనే వచన గేయానికి సంపూర్ణత్వం సిద్ధించింది. అక్షరలోపం గాని అక్షరాధి క్యతను గాని సహించని అసహిష్ణుతతో అలరారుతున్నాయి ఈ పొడుపు కథలు.

గేయ ప్రహేళికల కుండిన మాత్రా నిబద్ధత వచన గేయాలకు లేదు. ఒకమాట, ఒకపాట సమ్మిశ్రమమైనట్లు అనిపించే ఒకానొక విలక్షణత-లయ ప్రాధాన్యం వచన గేయ ప్రహేళికకుంది పాదాల అనిబద్ధత వల్ల మాత్రల అనిబద్ధత వల్ల ఇందులో అనంతంగా పొడుగు పొడుపులు, పొట్టి పొడుపులు ఏర్పడ్డాయి.

మాత్రాగణబద్ధాలైన గేయాలు, వచన గేయాలు పూర్తిగా జానపదుల సొత్తు. అవి నేడు అందరి నోళ్ళకెక్కాయి. చేశి ఛందస్సు కోవకే చెందే పద్యాల్లో కూడా పొడుపు కథలెన్నో ఉన్నాయి. ఆ పద్యాల్లో శిల్పం కొరవడ్డా ప్రహేళికా వైశాల్యాన్ని అవి తెలుపుతున్నాయి. ఇక జాత్యుపజాతి పద్యాల్లో ప్రయుక్తాలైన కొన్ని పొడుపు కథల్ని పరిశీలిద్దాం.

## 10-5 : జాత్యుపజాతులు

జాత్యుపజాతి పద్యాలన్ని త్ర్యక్షర గణ నిబద్ధాలు గావు. త్ర్యక్షర గణాలైన సమగణాలు వృత్తాల్లోనే ఎక్కువగా ప్రయుక్తాలవుతున్నాయి. సూర్యేంద్ర చంద్ర గణాలు జాత్యుపజాతి పద్యరచనకు దోహదకారులవుతున్నాయి. సమగణాలకు లఘు గురువులు చివర చేరడం వల్ల కొన్ని ఇంద్ర గణాలు చంద్రగణాలుగా మారుతున్నాయి. సమగణాల్లోని భ, ర, త లు ఇంద్ర గణాల్లోనూ, నగణం సూర్యగణంలోనూ చేరాయి. గురువును రెండు మాత్రలుగా, లఘువును ఒక మాత్రగా ఈ సూర్య చంద్ర గణాల్లో పరిశీలించడానికి వీలుంది. అప్పుడు సమస్త గణాలకు మాత్రాగణాలే మూలమనీ, అందులో నుండే గణాలన్నీ ప్రాదుర్భవించాయని నిరూపించడానికి అవకాశముంది. ఈ విషయాన్నే సోదాహరణంగా "తెలుగు ఛందో రీతులు" గ్రంథంలో డా॥ గిడుగు వెంకట సీతాపతి చర్చించారు.

జాత్యుపజాతి పోకడపు పద్యాలు వ్రాసిన వాళ్ళు పండితులే అయినా వాటిని గ్రామీణులు నిరాఘాటంగా ఉపయోగిస్తున్నారు. పద్యాల్లో కొన్ని గ్రంథాల కెక్కిన కారణంగా వాటిలో మార్పులు, చేర్పులు, పాఠాంతరాలు అంతగా చేరలేదు కందం, ద్విపద, తరువోజ, అక్కర, ఉత్సాహ మొదలైనవి జాతులనబడుతున్నాయి తేటగీతి, ఆటవెలది, సీసం మొదలైనవి ఉపజాతులని పిలవబడుతున్నాయి.

**5-1 : కందం** - నాగఫణీశా మకుటంతో కొన్ని కంద పద్యాలు లభిస్తున్నాయి. ఆ మకుటంలో ప్రహేళికా శతకమొకటి ఉన్న ఆధారాలు మాత్రం లభ్యం కాలేదు లభించిన ఆ కొన్ని పద్యాలకు కూడా కర్త ఎవరో తెలియదు.

* ఈకలు లేవట దానికి
కాకి రూపంబు నుండు కాళ్ళును రెండున్
చేకొని పట్టితె కరచును
నాకి భావంబు దెలుపు నాగఫణీశా ! (పటకార)

పూర్వార్ధంలోని ఆరవ గణ స్థానంలో జగణం పాటించడం వల్ల వచ్చిన సొగసు ఉత్తరార్ధంలో లేదు. ప్రథమ భాగంలోని 3 భగణాలకు 12 మాత్రలు, ద్వితీయ పాదంలోని రెండు గణాలకు, జగణానికి, భగణ గగాలకు 20 మాత్రలు, అవే విధంగా తృతీయ పాదానికి 12 మాత్రలు, చతుర్థానికి 20 మాత్రలున్నాయి. కందానికి ప్రయుక్తమయ్యే గగము, భగణము, జగణము, సగణము, నలము అనే అయిదు గణాలు చతుర్మాత్రా గణాలే. అందువల్ల ఏ విధంగా వ్రాసినా 1, 3 పాదాల్లో 12 మాత్రలు, 2, 4 పాదాల్లో 20 మాత్రలుంటాయి.

* పండగ నెండిన దొక్కటి
ఖండించిన పచ్చి దొకటి; కాలిన దొకటై
తిండికి రుచియై యుండును
ఖండితముగ దీనిఁదెల్పు కవియుం గలడే?[1]
(వక్క - ఆకు - సున్నం)

కందం చెప్పినవాడే కవి అనీ, తిక్కన్న కవి చౌడప్పలే కందాన్ని అందంగా చెప్పారని అంటారు. కందం సొగసంతా దాని నడకలోనే ఉంది.

**5_2 : ద్విపద** :- ద్విపద పాదపాదానికి 3 ఇంద్ర గణాలు, 1 సూర్య గణం ఉంటాయి రెండు పాదాలొక పద్యం. ప్రాసనియమముంది. తృతీయ గణ ప్రథమాక్షరం యతి. ద్విపదలో తెలుగు పొడుపు కథలులేవు. కాని ద్విపదకు కొద్ది అటునిటుగా ఉన్న పొడుపు కథలు కొన్ని కనిపిస్తున్నాయి. ఎప్పుడో ద్విపదలో నిర్మాణమైన పొడుపు కథల్లోని కొన్ని అక్షరాలు శిథిలం కావడంవల్ల ఈ రూపం వచ్చిందేమో! జానపదుల నోటి రోకటి పాట దరువుల్ని పుణికి పుచ్చుకొని ఇవి సిద్ధ మయ్యాయేమో!

* ఇంతంత గుడిగాదు ఈశ్వరుని గుడిగాదు
కంచు గోత్రము కాదు కదిలించ రాదు (ఆకాశం)

ప్రాస నియమం తప్పినా యతి నియమం పాటింపబడింది. మంజరీ ద్విపదకు ప్రాస నియమం లేదు. ప్రథమ పాదంలో వరుసగా 3 ఇంద్రగణాల

పైన 2 సూర్య గణాలున్నాయి. రెండవ పాదం సరిగా ఉంది. మొదటిపాదం చివర రెండు సూర్యగణాలకు మారుగా ఒకే సూర్యగణం ఉన్నట్లయితే ఇది నిర్దుష్టమైన ద్విపద అయ్యేది. ఇంద్ర గణాల్లోని భ, ర, త, నగ, నల, సలాల్లో భగణము నలము చతురస్రాలు మిగిలినవి ఖండాలు. సూర్యగణాలు రెండు కూడా త్ర్యస్రాలు. ద్విపద పాదానికి తక్కువలో తక్కువ 15 మాత్రలు, ఎక్కువలో ఎక్కువ 18 మాత్రలు ఉంటాయి. అక్కడక్కడ యతి ఉండి ఈ మాత్రల పరిధికి కట్టుబడ్డ పొడుపు కథలెన్నో కనిపిస్తున్నాయి.

ఆకాశ సందున జేకాకు సందున - 18
ఏమయ్యా పంతులు పైనిండ బెందులు - 18
(సీతాఫలం)

* దిగ దిగ ఉరికి దిక్కులు సూసే - 15
మోకాల్లిరిసే మొకం పిండే - 15
తొడిమలేని పండు తొపుక్కున పడె - 16
(మలము)

* ఆడ తల్కుమనె ఈడ తల్కుమనె - 16
మద్దూరు గుట్టల్ల మరింత తల్కు మనె - 19
(మెరుపు)

పై పొడుపు కథలన్నీ ద్విపద కతి సన్నిహితంగా ఉన్నాయి. తెనుగు నాట ద్విపద రోకటి పాటగా ప్రసిద్ధి పొందింది. రోకటి దంపుడులో ఈ పొడుపు కథలు నలిగాయి; కొన్ని ఎగిరి పక్కకు పడ్డాయి.

**5-3 : తరువోజ :-** రెండు ద్విపద పాదాలు ఒక తరువోజ పాదం. అలాంటి నాలుగు పాదాలు ఒక పద్యం. ఈ కింది పొడుపుకథలో తరువోజ ఛాయలున్నాయి.

* ఆకాశమంతా అల్లుకుపోగా, లడ్డెడు బియ్యం చల్లుతురాగా - 32
కడివెడు నీళ్ళు తాగుతురాగా, చాటెడు చెక్కులు చెక్కుకురాగా - 32
అందులో ఒక రాజు అల్లల్లాడాడూ ... ... .. . ?
చెప్పితే నీ కోరు గప్పుమంటుందీ! తప్పితే నీనోరు చప్పుగుంటుంది 37
(గానుగ)

తరువోజ పాదానికి తక్కువలో తక్కువ 30 మాత్రలు, ఎక్కువలో ఎక్కువ 36 మాత్రలుంటాయి. ద్విపదకు తగిలిన విధంగానే తరువోజకు కూడా జానపదుల దంపుడు ముంపు నిగిలింది.

**5-4 :** అక్కర - మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర అని అక్కరలు అయిదు రకాలు. అక్కరలో పొడుపుకథలెవరూ రచించకున్నా జానపదుల గీతాల్లో అక్కరల ఛాయలు లెక్కకు మిక్కిలి ఉన్నాయి. ఒక మధ్యాక్కరను మాత్రం ఉదాహరిస్తాను.

* దిబదిబలాడేవి రెండు దిబ్బెక్కిచూసేవి రెండు -25
ఆలకించేవైన రెండు అంది పుచ్చుకొనేవి రెండు -26
ఆరగించే దొకటి .... .... .... .... ....
............ ............ ............... .........
(కాళ్ళు, కళ్ళు, చెవులు, చేతులు, నోరు)

అసంపూర్ణమైనా మధ్యాక్కర లక్షణాల్ని ఇది పుణికి పుచ్చుకొంది. పాద పాదానికి రెండింద్రగణాలు, ఒక సూర్యగణం, రెండింద్రగణాలు ఒక సూర్య గణం ఉంటాయి. ఇందులో ప్రాస నియమం పాటింపబడకున్నా యతి నియమం పాటింపబడింది. పాదానికి తక్కువలో తక్కువ 22 మాత్రలు, ఎక్కువలో ఎక్కువ 26 మాత్రల ంటాయి. ఆంధ్ర సాహిత్యంలో నాటినుండి నేటివరకు అక్కరలెక్కువ అక్కరపడ్డవి విశ్వనాథ సత్యనారాయణ గారికే, ఇక ఉప జాతులని పిలువబడుతున్న తేటగీతి, ఆటవెలది, సీసాలను గమనిద్దాం.

**5-5 : తేటగీతి :-** పొడుపు కథలతో కొన్ని తేటగీతి పద్యాలు లభిస్తు న్నాయి. ఇవి శిష్టజన వ్యవహృతాలే అయినా జానపదులు తలను నరికి తోకను త్రెంచి పిటిని చదువుతూనే ఉన్నారు. చాలావరకీ పద్యాలు గ్రంథాలకు ఎక్కాయి.

* ఒక్క ఉద్యోగి పేరు నాల్గక్కరములు
మొదటి వర్ణంబు తెలిపిన కదనమగును
మూడవది తెలుపగ హస్తమునకు జెల్లు
నట్టి యుద్యోగి ఎవ్వడో అరసి చెపుడు. (కరణము)

ఇందులో నాలుగక్షరాలున్నాయి. 'క' తీస్తే రణము (కదనం) అవు తుంది. 'ణ' తీస్తే కరము (హస్తం) అవుతుంది. తేటగీతి లక్షణాలన్నీ ఈ పద్యంలో ఉన్నాయి. ఒక సూర్యగణం రెండింద్రగణాలు, ఒక సూర్యగణం పాదపాదానికి ఉంటాయి. చతుర్థగణ ప్రథమాక్షరం యతి. పాదానికి తక్కువలో తక్కువ 17 మాత్రలు, ఎక్కువలో ఎక్కువ 19 మాత్రలుంటాయి,

**5-6 : ఆటవెలది :-** 'దీని భావమేమి తిరుమలేశ' అనే మకుటంలో ఆట వెలది శతకాలు ఒకటి రెండు వెల్వడ్డాయి. ఒకటి ప్రాచీన కాలానికి చెందింది మరొకటి ఆధునికులు రచించింది. ఆధునిక శతకం శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తి రచించారు. 1958లో కొండా శంకరయ్య ప్రకాశకులు వెల్వరించారు. ఒక ప్రాచీన పద్యం, ఒక ఆధునిక పద్యం పరిశీలిద్దాం.

* వంగతోటనుండు వరిమళ్ళలో నుండు
జొన్న చేలనుండు చోద్యముగను
తలుపు మూలనుండు తలమీదనుండును
దీని భావమేమి తిరుమలేశ ?[1]

ఈ పద్యం విన్నవెంటనే ఆ వస్తువెక్కడెక్కడో ఉన్నదని అను కొంటాం. కాని అవి అక్కడక్కడే ఉన్నాయని భ్రమ తొలగిన తర్వాత గాని

1. పొడుపు కథలు, పు : 17

తెలియదు. దేని సమాధానం పాటలోనే ఇమిడి ఉంది. ప్రజ్ఞా పాటవాల్ని పరిశీలించే నిమిత్తమే ఈ శతకం రచింపబడింది.

ఆటవెలదికి తక్కువలో తక్కువ ప్రథమ తృతీయ పాదాలకు 17 మాత్రలు, ఎక్కువలో ఎక్కువ 19 మాత్రలుంటాయి. ద్వితీయ చతుర్థ పాదాలకు 15 మాత్రలుంటాయి.

* బాపబ్రపుల్ పెక్కుండు బాణాసురుడు కాడు?
కలదు జన్నిదంబు కాదు ద్విజుడు
చెవులు తోకనుండు జీవంబు లేకుండు
దీని భావమేమి తిరుమలేశ?[1] (రాట్నం)

మొదటి పాదంలో గణభంగం జరిగింది. ఒక మాత్రకూడా పెరిగింది. అయినా "బాపబ్రపు" అన్నప్పుడు ఒక మాత్ర మింగబడి మాత్రాధిక్యత ఉందన్న విషయం బయటపడదు.

**5-7 : సీసం :-** కేవలం పొడుపు కథల్ని కూర్చిన సీస పద్యాలే ఒక శతకానికి సరిపడా లభిస్తున్నాయి. సీసం పాద పాదానికి ఆరు ఇంద్రగణాలు రెండు సూర్యగణాలుంటాయి. పాదానికి తక్కువలో తక్కువ 30 మాత్రలు ఎక్కువలో ఎక్కువ 36 మాత్రలుంటాయి.

* ఏమి చేయక వృథా యేటి నీరేగును
భూపాలు డేటికి పుట్టువొందు
తుంగముస్తెల ప్రీతి తొలకాషు దేనికి
సభవారి నవ్వించు జాణ యెవడు
కలహంస నివసించు కాసార మెయ్యది
వీరుడెద్దానిచే విజయమందు
లజ్జ యెవ్వరి కమూల్యపు టలంకారంబు
దేవాంగులకు దేన జీవనంబు

1. తిరుమలేశ శతకము, ప : 26.

అన్నిటికి జూడ నై దేసి యక్షరములు
ఒనర నిరుదెస చదివిన నొక్కటిరె
ఒప్పగల్గిన నేనిత్తు చిన్నపూడ
చెప్పలేకున్న నవ్వుదు చిన్ని నవ్వు.[1]

ఈ పద్యంలోని ప్రతి అర్థ పాదానికొక ఎడుపుంది. కట్టకట్టక, నేల నేలనే, కిటికోటికి, వికటకవి, సురసరసు, చేతిహేతిచే, కులస్త్రీలకు, నేతచేతనే.

సీసపద్యంలోని రాగప్రధానమైన నడకవల్ల అది ఆంధ్రజనత మనో హారిణి అయింది. పండిత పామర రంజకంగా లయగతుబుండడంవల్ల గూఢార్థ తత్త్వ ప్రబోధకమైన ప్రహేళిక అయినా అది సర్వ జనాదరణీయముయింది.

ఈ విధంగా హొయపు కథల్ని అందించిన జాత్యుపజాతి పద్యాలన్నీ గేయాల లాగానే త్ర్యస్రగణ, చతురస్ర గణ, ఖండగతి గణ, మిశ్రగతి గణాల గతులను పోలినవే అని చెప్పాలి. సూర్యేంద్ర గణాలకన్నా ఈ మాత్రా గణాల వల్లనే పద్యాలకు పొందిక కుదురుతుంది. మాత్రాగణాల నడక పద్యశిల్ప రామ ణీయకానికి వన్నె తెస్తుంది. అటువంటి నడక లేనప్పుడు ఆ పద్యం ముడిపదార్థ మవుతుంది. ఒక సీసపద్యాన్ని మాత్రముదాహరించి జాత్యుపజాతుల చర్చ ఇంత టితో ముగిస్తాను.

| | |
|---|---|
| * పార్వతీ రమణుని పట్టణంబెక్కడ | (ఈశాన్యం) |
| పరమేష్ఠి సతిపేరు పలుకు దేమి | (శారద) |
| ఖడ్గంబునకు వాడి గలిగి ఏమిట నిలుచు | (పదను) |
| కాంతల ముఖమందు కలుగు దేమి | (తిలకం) |
| వక్షమందున నేమి వైకుంఠుడునిచెను | (లక్ష్మిని) |
| వసుమతీశుల యొద్ద వ్రాతకెవరు | (వ్యాపార్లు) |
| కాంతలలో మేలు గణుతింప నెవ్వతె | (ఊర్వశి) |
| పరమాత్మ దేమిట పడతి జేసె | (రాతిని) |

1. పెద్దబాలశిక్ష, పు : 84.

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు ఎంచిన నయముగాను
శారదా లక్ష్మి పార్వతి శాశ్వతముగ
మనల కరుణా విధేయులై మనచుచుండు.[1]

## 10_6 : వృత్తాలు

"వృత్తము ఒక ప్రత్యేక లక్షణము గల పద్యము. ఇందు అక్షర సంఖ్యా నియమము ప్రధానమైనది. దానితోపాటు గురులఘువ్యక్షర నియమము కూడా కలదు...... ప్రతి వృత్తమందును నాలుగు పాదములు గలవు."[2]

తెలుగులో ప్రసిద్ధిగాంచిన వృత్తాలు ఉత్పల చంపక శార్దూల మత్తేభ విక్రీడితాలు. పొడుపుకథా లక్షణాలున్న వృత్తాలు కొన్ని లభిస్తున్నాయి. ఒకటి రెండు మాత్రముదాహరిస్తాను.

* మనసిజు మామ మామ యభిమాన మడంచిన వానిమామ నం
దనుని విరోధి నందనుని నందను సుందరి మేనమామ జం
పిన జగజెట్టి పట్టి బొడిచేసిన శూరుని తండ్రి గన్నుగన్
గొనిన సురాధినాథుని తనూభవు నాయువు మీకు నయ్యెడున్.[3]

మనసిజుడు మన్మథుడు. మన్మథుని మామ చంద్రుడు, చంద్రుని మామ దక్షుడు, దక్షుని అభిమానాన్ని అణచినవాడు ఈశ్వరుడు, ఈశ్వరుని మామ హిమవంతుడు, హిమవంతుని కొడుకు మైనాకుడు. మైనాకుని విరోధి ఇంద్రుడు, ఇంద్రుని కొడుకు అర్జునుడు, అర్జునుని కొడుకు అభిమన్యుడు, అభిమన్యుని భార్య ఉత్తర, ఉత్తర మేనమామ కీచకుడు, కీచకుని చంపినవాడు భీముడు, భీముని కొడుకు ఘటోత్కచుడు, ఘటోత్కచుని చంపినవాడు కర్ణుడు, కర్ణుని తండ్రి

---

1. శ్రీ పాపిశెట్టి సీతారామ కవి వ్రాతప్రతి
2. తెలుగులో ఛందోరీతులు, పు : 2.
3. పెద్ద బాలశిక్ష - పు : 89

సూర్యుడు, సూర్యుని కన్నుగా గొన్నవాడు విష్ణువు, విష్ణువు కొడుకు బ్రహ్మ, ఆ బ్రహ్మ ఆయుస్సు మీకూ కలగాలని ఆశీర్వాదం.

ముడుపులు కట్టిన పొడుపుల మూట ఈ చంపకమాల వృత్తం. లక్షణ వేత్తలు, ప్రతిభావంతులైన మహాకవులు మాత్రమే ఇటువంటి పొడుపు పద్యాలు వ్రాయడానికి అర్హులు. ఇటువంటి పద్యాల్ని శిల్ప దృష్టితో సమీక్షించరాదు.అయినా నడక విషయంలో ప్రహేళికాకర్త పాటించిన పదసంయోజనంవల్ల పద్యానికి ఇతోధికమైన సౌందర్యం సంతరించిపెట్టె నట్లయింది. డా॥ గిడుగు వెంకటసీతాపతి వృత్త గమనంలోనూ మాత్రబద్ధత వల్లనే సొగసైన నడక ఏర్పడుతుందన్నారు. ఈవిధంగా పరిశీలించినప్పుడు ఈపద్యమంతా మిశ్రగతి గణాల్ని అనుసరించి నట్లనిపిస్తుంది. ప్రతి పాదానికి 28 మాత్రలుంటాయి. ఉత్పలమాలకు కూడా ఇదే విధంగా మాత్రలుంటాయి. మహాకవులు పొడుపు కథల ఛాయలున్న సమస్యలను కూడా పరమ రమణీయంగా చిత్రించారు

* ప్ల[illegible]గమున శారద సుందర సుందరీమణీ
పల్లవితాంత రంగ కవి బాంధవి శారద నీరదాంగ సం
పల్లలితాంగి సర్వనుత మానసిక క్రియనాగ నొప్పు న
త్తల్లి మగండు తండ్రియని తల్చక( గూడియు సాధ్వియయ్యెగా

అటు జానపదుల నోట గేయమై, వచనగేయమై, శిష్టుల [illegible]క్కి[illegible] పొడుపు కథ. ఇటు శిష్యుల నోట జాతులై వృత్తాలై జానపదుల నోటికెక్కింది పొడుపుకథ.ఇవిఏవీగాక కేవలవచనాలుగాఉన్న పొడుపుకధలు వేలాదిగా ఉన్నాయి.

## 10-7 : యతులు

పద్య నిర్మాణానికి,పద్యగతికి చందస్సెంత సౌందర్యాన్ని సమకూర్చిందో యతులు కూడా అలాంటి అందాన్నే సంతరించి పెట్టాయి. ఒకపాదంలో నిర్దేశింప బడ్డ ఒకచోట లేదా కొన్నిచోట్ల పాద ప్రథమాక్షరానికి అనుగుణమైన (సవర్ణమైన)

అక్షరం చేర్చబడుతుంది. వాటిని యతులంటారు. ఒక పాదంలోని ఉత్తరభాగంలో రెండుమూడు నిర్దేశిత స్థలాలుంటే అర్ధపాద ప్రథమాక్షరానికి అనుగుణమైన అక్షరాన్ని చేర్చవచ్చు.

సంస్కృత భాషలో యతిస్థానమున్న చోట పాదం విరుగుతుంది. తెలుగులో పాదం విరిగినా విరగకున్నా అనుగుణాక్షరం తప్పక ఉండాలి. వడి (వళి)కి నవవిధ నామాలున్నాయని అవి "విరతి, విశ్రాంతి, విశ్రామ, విశ్రమ, శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతు"లని[1], "చరణ చరణానికి ఆద్యక్షరాలు వళులయ్యె" యని లక్షణ గ్రంథాలు చెబుతున్నాయి [2] తెలుగులో వడి అనే పదమే ఎక్కువగా వ్యాపించడానికి చెప్పిన కారణాల్లో ఇది హేతుబద్ధంగా కనిపిస్తుంది.

"వడు అంటే మార్గమని యర్థము. పద్యపాదము విశ్రాంతి ననుసరించి రెండు భాగములు కాగా, ఆ రెండు భాగముల మొదటి యక్షరములను పాద భాగములకు మార్గము చూపించు నట్లుండుట వలనను, మొదటి భాగముయొక్క మొదటి యక్షరములో (అనగా పాదాద్యక్షరముతో) రెండవ భాగముయొక్క మొదటి యక్షరము మైత్రి గలదిగా ఉండవలెనను నియమము కలదు కనుకను, వడి (వళి) యను పదము వాడుట అవసరమయినదని నా యభిప్రాయము.[3]

---

1. విరతి, విశ్రాంతి, విశ్రమ విశ్రమములు
శ్రాంతి, విరమణ, విరమ, విరామ, యతులు
ననగ నివి తొమ్మిదియు వళికాఖ్యలయ్యె
భవ్యసక్తు ఫలాయామ్య భాగగేహ. [అప్పకవీయము, ఆ-3, ప: 6]

2. వాసనగల మొదటి వ్రాయి వడియన బరగున్.
[ఛందోదర్పణము. ప-ప: 29]
చరణ చరణమున కాద్య
క్షరములు వళులయ్యె నవియె క్రమ్మఱ దత్త
చ్చరణముల లోన జెప్పిన
యిరవుల బొందింపవలయు నెల్ల కృతులలోన్
[అప్పకవీయము. ఆ-3, ప: 5]

3. తెలుగులో ఛందోరీతులు, పు: 216.

ఈ ఆవసరం పద్యంలో ఎంత ఆవశ్యకమో గేయానికీ వచన గేయానికీ అంతే ఆవశ్యకం. పొడుపు కథల్లోని జాత్యుపజాతుల్లోను వృత్తాల్లోను లక్షణ నిర్దేశితమై ఇవి కనిపిస్తున్నాయి. కాని గేయాలకు వచన గేయాలకు నిర్దేశించిన స్థలమనేది లేకున్నా సహజంగా కుదిరిన యతులెన్నో ఉన్నాయి. కేవల వచన ప్రహేళికల్లోనూ అక్కడక్కడ ఈ యతులు కనిపిస్తున్నాయి. కొన్నిటిలో అక్షరమైత్రి లేకున్నా విరామం పాటించారు. లాక్షణికులు చెప్పిన అన్నిరకాల అక్షర మైత్రి తెలుగు పొడుపు కథల్లో కనిపిస్తుంది. మాత్రాగణ నిబద్ధాలైన గేయ ప్రహేళికల్లోనూ, వచన గేయ ప్రహేళికల్లోనూ, కేవల వచనాల్లోనూ యతులున్నాయి

విషమ అర్ధసమ విషమ, త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాది మాత్రానిబద్ధ గేయాలకు ఒకటి రెండు ఉదాహరణలిచ్చినా, వచన గేయాల్లోని యతిస్థానాన్ని నిర్దేశించినా, కేవల వచనాల్లో యతి పాటింపబడిన విధానాన్ని తెలియజేసినా, జాత్యుపజాతుల్లోనూ ఉన్న యతుల రకాల్ని వివరించినా, గ్రంథం పెరగడం తప్ప పెద్ద ప్రయోజన ముంటుందని అనిపించడం లేదు. అందువల్ల కేవలం కొన్ని పొడుపు కథల్ని పరామర్శిస్తాను.

* సుట్ల సుట్ల పాయ - సుందరాల పాయ
రాజు మెచ్చిన పాయ - రతనాల పాయ [గారె]

* సుట్ల సుట్ల పొట్లకాయ - సూసిరా పొట్లకాయ
మళ్లి రా పొట్ల కాయ - మాటదే పొట్ల కాయ [ఉత్తరం]

* సుట్ల సుట్ల బావికాడ - సుందరమ్మ తోటకాడ
ఆకు పుట్టె పోక పుట్టె- ..........................................
కొడుకును కొట్టేసి - కోడలు ముందామోసె [అరటిచెట్టు]

* చూస్తె చూపులు
నవ్వితె నవ్వులు
గుద్దితె గుద్దులు అద్దం]

* చక్కాని స్తంభం - చేతి కందదూ
పెయ్యాని కుండా - పొయ్యాని నీళ్ళు
వెయ్యాని సున్నం - తియ్యంగా.......[1] [కొబ్బరి]

* అచ్చయ్య కట్టిచ్చిన - గచ్చు గదికోట
సోమయ్య గుజ్జాలు - సొచ్చి సొట్టాడె [పందికొక్కులు]

* ఆకులోడు గాదమ్మ - ఆకులుంటవి
పోకలోడు గాదమ్మ - పోకలుంటవి
బాలెంత గాదమ్మ - పాలుంటవి
సన్నాసోడు గాదమ్మ - జడలుంటవి [మర్రిచెట్టు]

* బుడబుడ వంకాయ — బుడ్డో నొంకాయ
మద్యాహ్నం వచ్చేవరకు - మాయమైపోయె [చాన్పు]

* ఓరోరి పాపడ - ఒ(పొ)ల్లెల్ల బొగ్గులు
కాయాకు పచ్చన - నీ - కండ తియ్యన [సీతాఫలం]

* పైన చూస్తె పండు - పగలగొడితె బొచ్చు [పత్తికాయ]

* తోకలేని పిట్ట - తొంబయి యామడ వాయె. [ఉత్తరం]

ఈవిధంగా వందల కొద్దీ పొడుపు కథల్ని ఉదాహరించవచ్చు. మొదట చెప్పినట్లుగానే ఇవన్నీ మాత్రాగణ నిబద్ధాలు. వీటిలో ఎక్కడో ఒకచోట యతో, ప్రాసయతో పాటింపబడింది. ఇన్ని మాత్రల పొడుపుకథకు ఇక్కడే యతి పాటించాలనె నిర్దిష్టమైన నియమమేదీ కనిపించదు. కాని యెక్కడ అర్థయుక్తంగా పాదం విరుగుతుందో అక్కడ "వడి" పాటించడ మనేది అన్నిట్లోనూ ఉన్న సాధారణ నియమం.

1. పెయ్యాని కుండా - పొయ్యాని నీళ్లు
వెయ్యాని సున్నం - తియ్యాగ నుండు

పాదానికి రెండంటే రెండే పదాలుండి మూడు పాదాల్లో ఆ నియమం పాటించడం గమనిస్తే జానపదుడొక మహాకవియై మనముందు నిలుస్తాడు. "చూస్తే చూపులు, నవ్వితే నవ్వులు, గుద్దితే గుద్దులు" అనే పొడుపుకథ దీనికి నిదర్శనం. అర్థయుక్తంగా విరువబడ్డ పదాల్ని, పాదాల్ని, సహజసిద్ధంగా పడినట్లు అనిపించే యతుల్ని - ధార చెడని పదాల పొందికనూ, మాత్రగణ నిబద్ధతవల్ల నడకలో కలిగిన సొగసుల్ని ఈ ప్రహేళికల్లో దర్శించినప్పుడు "ఆశుకవిత్వము చెప్పువానికి అప్పకవీయమేలా" అన్న ఆధునిక కవి కుమారుని మాట యదార్థ మనిపిస్తుంది.

ఈ క్రింది పొడుపు కథల్లో అక్షరమైత్రి గాక విరామం మాత్రమే పాటింపబడింది. అర్థయుక్తంగా విరగడం అందువల్లనే.

* చింపిరి చింపిరి గడ్డలు
- ముత్యాల వంటి బిడ్డలు. [మొక్కజొన్న కంకి]

* పిడికెడు పిచుకకు - మూరెడు తాడు [గరిటె]

* గడంత సానికి - ముంతంత కొప్పు [కంకి]

* జోడు గుఱ్ఱాలపైన - ఒకడే రాజు [చెప్పులు]

* ఒకటి వచ్చింది -
పదహారింటిని తాకింది
నూరయి వెలసింది -
రెండయి పోయింది [పలుదోముపుల్ల]

* చిటుకు పటుకులాడి
- గోడయెక్కి దుముకులాడి.[1] [విస్తరాకు]

* ఆడంగ పోతున్నోణ్ణి - ఏంటోడవంటే
మూడువందల అరవైకి - అరవై తక్కువోణ్ణి అనె
[మున్నూరోడు]

* పొద్దున్న లేచి - నల్లకుక్క - బాయిలపడె [బొక్కెన]

1. చిటుకు పొటుకులాడు - గోడ దుంకులాడు.

సంస్కృతంలో విశ్రాంతి కేవలం శ్రావ్యత్వానికే పాటుపడింది. అక్షర మైత్రి పాటించని పై పొడుపుకథలు విరిగిన స్థానాల్ని పరిశీలిస్తే శ్రావ్యతకే అలా విరిచారనిపిస్తుంది. అంతేగాక అర్థానికి ప్రాధాన్యమిచ్చి అలా పాడుతున్నారని పిస్తుంది. ఆంధ్ర సాహిత్యంలో యతులెన్ని ప్రయోజనాలు సాధించాయో, అన్ని ప్రయోజనాలు తెలుగు పొడుపు కథల విషయంలోనూ సమకూరినవనే చెప్పవచ్చు. ఇక ప్రాసల్ని పరిశీలిద్దాం.

## 10-8 : ప్రాసలు

పద్యపాదానికి తొలి అక్షరం యతి కాగా మలి అక్షరం ప్రాసమయింది.[1] తెలుగు ఛందస్సులో యతి ప్రాసం కొక వైశిష్ట్యముంది. దీనివల్ల పద్యాలకు మాధుర్యం వచ్చింది; శ్రవణ సుభగత్వ మేర్పడింది.

అప్పకవి పదిహేడు రకాల ప్రాసల్ని చెప్పాడు. అంతేగాక శబ్దాలం కారాల కోవకు చెందిన అనుప్రాస-అంత్యప్రాసల్ని కూడా వివరించాడు.

తెలుగు పొడుపు కథల్లోని పద్యాల్లో కొన్ని ఈ ప్రాస భేదాల్ని పరిశీలించవచ్చు. పద్యాల్లోని అత్యంత ప్రాసల నిబద్ధతవల్ల నడకకు సొగసు వస్తుంది. పొడుపు కథా పద్యాల్లోని ప్రాసల్లో విలక్షణతకాని విశేషంకాని ఏమీలేదు. అందువల్ల వాటినిక్కడ స్పృశించడంలేదు. జానపదుల పొడుపుకథల్లోని ప్రాసల్నిమాత్రమే పరిశీలిద్దాం.

* దానాడు దామెరాడు
దానిపూత తేనెపూత
దాని మొదలు సెరుకు మొదలు[2] [ఆముదం చెట్టు]

---

1. "ఆద్యో వర్ణద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు" - ఆంధ్రశబ్దచింతామణి. ప్రథమపాద ద్వితీయాక్షరంబు ప్రాసమయ్యె.
-అప్పకవీయము ఆ: 3, ప: 281.

2. దాని మొదలు చెరకు మొదలు
దాని ఆకు దామరాకు
దానిపూత మేడిపూత
దానికాత గిజ్జికాత

ఇందులో ప్రాసాక్షరం అప్రయత్నంగానే తన స్థానంలో పడింది. అవ్వకవి ఇటువంటి వాటినే సుకర ప్రాసలన్నాడు.

* గంపెడు సెట్టుకు
గుంపెడు దయ్యాలు [మిరపచెట్టు]

* ఇంటి సుట్టు తిరిగి
ఇంట్ల కూసునె [అలుకు కుండ]

* మీ యమ్మను పండ వెట్టి
మా యమ్మ దాటి పాయె [కడప]

* పొట్టన వ్రేలు
మిట్టన రాయి [ఉంగరం]

* చెయ్యని కుండ
పొయ్యని నీళ్లు
వెయ్యని సున్నం
తియ్యగ నుంటు. [కొబ్బరికాయ]

* బుర్రుడె కొంబడితె
పుట్టెల్ల గొట్టె [పిండి]

* గట్టు తగలడుతుంటె
గుడ్డలు ఎండేస్తారు [పెనంమీద అట్లు]

* అరచేతి విస్తీర్ణం
అరువదాకుల పొట్లం
తలలోని పేనులను
తరిమిగొట్టె పొట్లం [దువ్వెన]

* తలకాయ కిందికి
కాల్లు మీదికి [ఆముదం కాయ]

* తెల్లచీర కట్టుకొని
తొజ్జ వేప్పు పెట్టి [పుట్టకొక్కు]

* ఎటి పొడుగాత
ఏడు అంగళ్లు (ఎంప్రకాయ రంధ్రాలు)

* ఒకే ఇంట్లో ముగ్గురు యాదాంద్రు
ఒగిరి మొగం ఒగరికి కనిపించదు (ఆముదం కాయ)

* బొట్ల బొట్ల కుంప - దోనాల కుంద
మెల్లంగ దించండి - బెల్లాల కుంద (సీతాఫలం)

* బుడుగపు బుడుగులాడె
బుడ్డాటలాడె
మధ్యాన్నపు యాళకు
మాయమై పాయె (చానిపి)

* సండ్లులేని ఆడదాన్ని
కాళ్ళులేని మగోడేసుక పోతుంటే
తలకాయ లేనోడు కాపలి గాసె (కప్ప-పాము-ఎంద్రకాయ)

* ఇంతంతాకు - ఇస్తారాకు
కానుగాకు - కస్తూరాకు
ఏనుగు తొక్కితే పలపల (ఈర్పెన)

* కడవల నీల్లు
కదలని పాము
పడిగ ఆర్తించి. (దీపం)

* ఆకులేని గడె
సుంకులేని బియ్యం
శోకంలేని ఆడది (గడ్డపార - ఉప్పు - నీళ్లు)

ఇలా చూపిస్తూ పోతే కొద్ది కొద్ది బేధాలున్న ప్రాసలెన్నో కనిపిస్తాయి. ఈ పొడుపు కథల్లో పెక్కింటికి నాల్గు పాదాలు లేవు. మాత్రా నిబద్ధత కూడా లేదు లాక్షణికులెవ్వరూ "వీటిని ప్రాసలని అంగీకరించలేదు ఇంతవరకు దేశి ఛందస్సుపై పరిశోధనలు చేసిన వారెవ్వరూ వీటిని పట్టి చూళ్ళేదు అటువంటి సమయంలో వీటిని ప్రాసలనడం అసమంజసమని కొందరనవచ్చు. కాని దేశి ఛందస్సు కింద జానపదుల పొడుపు కథల్ని పరిశీలించినవారు వీటిని ప్రాసల కిందికి తెచ్చి లక్షణాన్ని నిర్దేశించాల్సిన అవసరం ఉందని భావించడంలో అసామంజస్య మేమీలేదు.

వృత్తాలకు జాతులకు ఉపజాతులకు వర్తించిన యతులకు ఇవి కట్టుబడక పోవచ్చు అందుకే వీటిని దేశదృష్టితో చూడాలి అనడం.

అప్పుడే చెప్పిన సుకర ప్రాసకు, పూర్ణబిందు ప్రాసకు కొన్ని ఉదాహరణల్ని చూపించడం జరిగింది ఈ ప్రాసల విషయంలో లక్షణకారులు మరింత నిశిత పరిశీలన చెయ్యాల్సిన అవసరం ఉంది.

బిందు పూర్వక టకారానికి - బిందుపూర్వక ట్లకారానికి - (ంట-ంట్ల) ద్విత్వ టకారాలకు (ట్ట-ట్ట), సంయుక్తాక్షరమైన 'ర్ద' కు - ద్విత్వ రేఫానికి (ర్ద-ర్ర). ద్విత్వ టకారానికి-ద్విత్వ డకారానికి (ట్ట-డ్డ). రేఫానికి-లకారానికి (ర-ల), లకారానికి-ద్విత్వ లకారానికి (ల-ల్ల), ద్విత్వ లకారానికి-ద్విత్వ రేఫానికి (ల్ల-ర్ర), టకార డకారాలకు (ట-డ), కకార గకారాలకు (క-గ) సంయుక్త 'ట్ల' కారానికి-ద్విత్వలకారానికి (ట్ల-ల్ల), డకారానికి - ద్విత్వ డకారానికి (డ-డ్డ), సంయుక్త 'ధ్య' కారానికి - యకారానికి (ధ్య-య), బిందుపూర్వక సంయుక్త 'డ్ల'కారానికి- ద్విత్వ లకారానికి - లకారానికి (డ్ల-ల్ల-ల , బిందుపూర్వక తకారానికి - నకారానికి (ంత-న), తదలకు (త-ద), కకారానికి- బిందుపూర్వక కకారానికి (క-ంక) ప్రాసలు చెల్లినవి.

పై ప్రాసల్లో ఒకటి రెండు కొందరు లాక్షణికులు అంగీకరించినా దేశి జానపద సాహిత్యాన్ని దృష్టిలో ఉంచుకొని అంగీకరించినవి కావు. మున్ముందు ఇటువంటి ప్రయత్నాలు జరుగవలసి ఉంది

యతుల స్థానంలో ప్రాసల స్థానంలో సహజాతి సహజంగా నిలిచి పోయిన ఇటువంటి అక్షరాలన్నీ జానపద సరస్వతికి శాశ్వత కాలం పాటు ఉండే వెలుగుల్ని-జిలుగుల్ని సంతరించి పెట్టాయి. తెలుగు పొడుపు పొలంతికి యతి ప్రాసలు నయనతారకలై నిలిచాయి.

"తెలుగు ఛందస్సునకే కాదు తెలుగు కవితకే కాదు తెలుగు భాషకే వడి ప్రాసలు పుంస్త్రీకి మంగళ సూత్రముల వంటివి"[1] అని విజ్ఞులచేత ప్రశంసించబడ్డాయి. దేశి ఛందస్సుకు పొడుపుకథలు అందిస్తున్న ఛందస్సు వైవిధ్యం అల్పమేం కాదు! అది అపూర్వమయినది; అగణితమయినది.

పొడుపు కథలు - ఛంద శ్శిల్పమనే ఈ ప్రకరణంలో ఛందస్సు ప్రయోజనాల్ని సంగ్రహించాను. దేశి ఛందస్సును గురించి తెలిపి, పొడుపు కథా గేయాల్లో త్ర్యస్రాది మాత్రాగణ నిబద్ధాలైన పొడుపుల్ని వివరించాను. వచన గేయాల్ని వ్యాఖ్యానించి, జాతుల్ని ఉపజాతుల్ని సమీక్షించాను వృత్తాలను వివరించి యతుల సౌందర్యాన్ని ప్రస్తావించాను ప్రాసల ప్రాభవాన్ని ఎగ్గడించి తెలుగు పొడుపు కథా ఛందస్సు శిల్ప ప్రభల్ని విరజిమ్మడంలో చిన్నదైనా ఆంధ్ర భాషా సరస్వతికది అమూల్యాలంకారమని భావిస్తూ, ఈ విషయంలో పరిశోధకులింకా ముందుకు చొచ్చుకు పోవాల్సిన అవసరం ఉందనీ. ఆ అవసరం ముమ్మందు తీరగలదని ఆశించాను.



1. తెలుగులో ఛందోరీతులు, పీఠిక, పు : 20, పీఠిక : శ్రీ వడ్లమూడి గోపాల కృష్ణయ్య.

## పొడుపు కథలు

# భాషా వైభవం

### 11-1 : పరిశీలనం

మనిషిని పశువునుండి వేరుచేసి చూపేది వాక్కు. ఈ వాక్కు మనుష్యుల పరస్పర భావప్రసార సాధనం. హృదయం స్పందిస్తే, మనస్సు చైతన్యవంత మైతే భావం బహిర్గత మవుతుంది. ఆంతరికమైన స్పందనకూ- చైతన్యానికీ, బహిర్గతమైన భావానికి బాహ్యప్రేరణ లుపకరణాలవుతాయి.

ఒక పక్క 'ఒంయ్' అన్నా, 'గుర్' అన్నా, 'బొబొ' అన్నా బాహ్య ప్రేరణతే కారణమని భావించాలి. ఈ శబ్దాలు వాత్సల్య క్రోధోత్సాహాల్ని తెలియజేస్తున్నాయి. పశుపక్ష్యాదులెన్నో తమ పరిసరాల్లోని బాహ్య ప్రకృతికి ప్రేరణ పొంది, ఒకానొక ఆంతరిక స్పందనకూ- చైతన్యానికీ—సంఘర్షణకూగురై వివిధ శబ్దాల్ని చేస్తాయి. ఆ శబ్దాల్లో ఒక్కొక్క దానికి ఒక్కొక్క అర్థముంటుంది.

ఈ విషయాన్ని మనిషికీ అన్వయించుకోవాలి అలా మనిషి నోట వచ్చిన ఆ శబ్దానికి (చప్పుడుకు) అనేక అర్థాలేర్పడ్డాయి. ఆ శబ్దంలో ఓ అర్థం ధ్వనించడం ప్రారంభమయింది. నిజానికి అది అర్థయుక్తమైందే. అనే వాక్కు అయ్యింది. ఆ వాక్కుల సమూహమే భాష అయ్యింది. ఆ భాషకు లిపి ఒక సంకేతమయ్యింది. సమాజ వ్యవహారాన్ని బట్టి ఒక్కొక్క సంకేతాన్ని ఇలా ఉచ్చరించాలని నిర్ధారణ జరిగింది. అలా నిర్ధారించినదాన్నే శబ్దశాస్త్రమన్నారు; అర్థశాస్త్రమన్నారు; భాషా శాస్త్రమన్నారు; వ్యాకరణ శాస్త్రమన్నారు.

ఈనాడు మనం వింటున్న ఈశబ్దాలు, చదువుతున్న పదాలు- వాక్యాలు పరిణామ వికాసంలో స్థిరపడ్డాయి. ఇవి ఇలాగే ఉంటాయనీ, ఉండాలనీ నియమ

మేంలేదు. జీవద్భాషలో మార్పు సహజం. ఒక వేళ కొన్ని నియమాలున్నా మార్పునుబట్టి కొత్త నియమాలు కూడా ప్రాదుర్భవిస్తుంటాయి.

పదం ఒక ముడిపదార్థం; ఆ పదాలు వాక్యాల్లో పొందికగా పొదుగు కొంటాయి; అందాల్ని చిందిస్తాయి; ఆకర్షణల్ని ఒలికిస్తాయి. అప్పుడా భాష నుడి కారాల నిధి అవుతుంది; జాతీయాల నిలయమవుతుంది; పలుకుబళ్ళ పూలపందిరి అవుతుంది. సంపూర్ణంగా వాక్యం ఆకృతి దాల్చకుండానే అర్థసిద్ధి కలుగుతుంది. అస్పష్ట పదాలుకూడా అర్థవాహకాలవుతాయి. ధ్వనుల్లోనూ మార్పు లేర్పడతాయి. పదసంయోగంలో వైలక్షణ్యం చోటుచేసుకొంటుంది. నియమాలు శిథిలమవుతాయి. సంధిబంధాల కీళ్ళు సళ్ళిపోతాయి వర్ణ వర్గ వృత్తి కులంనామాలు ప్రత్యేకతను సంతరించుకొంటాయి. మాండలిక భేదాలు మనోహరంగా వచ్చేస్తాయి. అన్య దేశ్యాలు తొంగిచూస్తాయి. ఈ జన వ్యవహారమంతా గ్రంథాల కెక్కుతుంది. గ్రంథగత విజ్ఞానం జన హృదయాల కెక్కుతుంది కాలచక్రం లాగానే భాషా చక్రం నిరంతరం పరిభ్రమిస్తుంటుంది.

ప్రపంచంలోని అన్ని భాషా సాహిత్యాలకు ఈవిషయాలు అన్వ యిస్తాయి తెలుగు కూడా దీనికి అపవాదం కాదు ఆంధ్ర భాషా సాహిత్యాల ఆవిర్భావకాలంనుండి పైన చెప్పిన భాషా గతాంశాలన్నీ అందులో చోటు చేసు కొన్నాయి ప్రాఙ్నన్నయ యుగంనుండి నిన్న మొన్నటివరకున్న భాషా సంబంధి అంశాలెన్నో పరిశోధకులెందరో ప్రకటించారు.

తెలుగు పొడుపు కథ కూడా వీటికి దూరంగాలేదు. అందులో నానుడు లున్నాయి; పలుకుబళ్ళు-పదబంధాలున్నాయి. సంధి విశేషాలున్నాయి; ధ్వనుల మార్పులున్నాయి; విలక్షణ ప్రయోగాలూ మాండలికాలూ ఉన్నాయి; అన్య దేశ్యా లున్నాయి; అద్భుతాంశాలు ఉన్నాయి. అవన్నీ స్థాలీపులాక న్యాయంగానైనా పరిశీలించడమే ఈ ప్రకరణ ఉద్దేశం.

## 11-2: నానుడులు

అలజడులుండనీ, ఆందోళనలుండనీ, ప్రశాంత వాతావరణముండనీ ఎలాఉన్నా భాషావికాసం ఆగదు. నుడులూ-నానుడులూ, జాతీయాలూ, సామెతలూ

పుడుతూనే ఉంటాయి; తరంనుంచి తరంలోకి ప్రవేశిస్తూనే ఉంటాయి. కాబట్టి ఇవి జీవనాడులు; అందువల్లనే పొడుపు కథల్లోనూ పొందుగా ఒదుగుకొన్నాయి. ఇంతకు పూర్వం ఒక ప్రకరణంలో పొడుపుకథల- సామెతల తులనాత్మక పరిశీలనం చేయడం జరిగింది. ఇప్పుడు పొడుపు కథల్లోని నానుడుల సదృశాంశాల్ని ప్రస్తావిస్తాను.

జాతీయం ఒక విశిష్టార్థాన్నిస్తుంది; సామెత జీవనానుభవసారంగా ఉంటుంది. నానుడి ఆ ప్రక్రియలో బాగా నలిగి ఉంటుంది. ఇంకా జాతీయంగా రూపు దిద్దుకోనివి, సామెతగా నిండా పండనివెన్నో నానుడులుగా చక్ సదృశాలుగా పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి. ఒక వ్యవహర్త ఎవరితో దృష్టితో పెట్టుకొని 'దాని చావు పెంట చావు' అంటారు. ఎంత తిన్నా ఎన్ని సుఖాలనుభవించినా చివరికి మట్టిలో కలియవలసిందే కదా అని దీని అర్థం. అంటే ఈ పొడుపు కథకు విడుపు విస్తరాకు వ్యవహర్త దృష్టిలో ఈ విడుపుకూడా ఉంది ఈ విడుపు గుప్తమైపోయినా వర్తమానార్థ స్ఫూర్తికి ఆటంకమేమీ కలుగదు. అర్థాభివ్యక్తీకరణంలో సుస్పష్టంగా నిలిచిన కొన్ని పొడుపు కథల్లోని నానుడుల సదృశాల్ని పరిశీలిద్దాం

"పచ్చ నీటిలో ఎఱ్ఱ తామర (దీపం), ఊరికి సింహాల లాంటివి. (కుక్క), గుడ్డ కాలుతుంటే బట్టలు ఎండేస్తారు (రొట్టెలు), రసరుసులు దిన్న రాజు కడుపుల పేసల్లేవు (తలె), సుక్కలు సుర బొమ్మలు (జింకలు), గచ్చు మిద్దెద్దు గనుమల్లేవు (కోడిగుడ్డు), పచ్చని పెట్టెలో విచ్చుకోనుంది (మొగలిపువ్వు), ముని మాపు ముట్టవు (తోడుపెట్టుట), ఆకసాన కాయగాసె పర్వతాన పండు పండె (చంద్రుడు), కుప్పగాలె అప్పుదేరె (కుమ్మరి ఆవం), గచ్చుగచ్చుల బండ ఘనమైన బండ (రూపాయి), పడ్తే పిడికెడు ఇడిస్తే మూరెడు (సగురం), ఆమానీ మాను తసలాడే (తాళం గొళ్లెం), ఇంచెన్క ఇడ్సికట్లోడు (కట్టెలు), సిల్కా సిల్కాడు సిట్టెడు బియ్యం (నువ్వులు), అన్ని సోకుల కంటె ఒక సోకెక్కువ (నిద్ర), పచ్చని రవికది – పదహారు పండ్లది (సీతాఫలం), నవ్వుతే చెస్తాము నవ్వకుంటే లేము (సీతాఫలం), గడెత్తు లంజకు గంపెడంత సిగ (జొన్న గడె), కాశికి పోతది గయాకు పోతది (బాట), మొద్దు మానుకు మోపెడు తీగలు (వెంట్రుకలు), బట్టి కుక్కకు బండెడు పేగులు (మంచం), ఆకులేని పంట

లకవై పుట్లు (ఉప్పు), సుందరి ముఖము అందరు సూసిరి (అద్దం), ఆకు బారెడు తోక మూరెడు (మొగలి పువ్వు), కొడుకును కొట్టేసి కోడలు ముండమోసె (అరటి చెట్టు), పల్లు రాల్లల్ల పాము పొర్లాడె (నాలుక), పిడికెడు పిచికకు మూరెడు తోక (తెడ్డు), పుట్టెడు సెనిగల్లో ఒకటే ఉసికరాయి (చంద్రుడు), ఏడాకుల మట్టి ఎక్కరాదు దిగరాదు (జొన్నగడె), చిటారి కొమ్మన మిఠాయి పొట్లం (తేనెపట్టె), రెండెడ్లల కొకటే మూలం (ముక్కు), నీల్లు లేని బాయిల బోగమోల్లాడిరి (పేలాలు), తల్లి దయ్యం పిల్ల పగడం (రేగువెట్టు-పండు), ఇంటెనుక ఇగులు వంల్లోడు (దానిమ్మ కాయ), నేలనాకె మూల కూసుండె (పొరకట్ట), మీ యమ్మ మాయమ్మ ఒకటే (ముత్యాలమ్మ), దేవరేనెద్దు లెంక గొట్టె (ఇంజన్), చీకటింట్ల జడల దయ్యం (ఉట్టి) తెల్ల నిరెగట్ల నల్లని గీతలు (కాగితం-వ్రాత) ...."

ఇవన్నీ పొడుపు కథలుగా వ్యవహారంలో ఉన్నాయి. కొన్ని లర్థ ప్రహేళికలుగా ఉన్నాయి. మరికొన్ని ప్రహేళికాంశిక పదాలుగా ఉన్నాయి. ఇవన్నీ నానుడులే: లేదా నానుడుల సదృశాలే.

"గండం కడతేరింది. రెండు లొటలొటలె రెండు మిటమిట. కొనేవారే కాని ఈనేవారులేరు, సెప్పునవట్టదు సెంపన వట్టదు, లడుముడు పిట్టల లచ్చవరాలు, గుండన్న దెబ్బ గోల్కొండ అబ్బ, ఉరుము లేదు మెరుపు లేదు, మొగులు లేదు సోడంలేదు, కాకి ముక్కుపోయి గద్ద ముట్టపాయె"

ఇవన్నీ నానుడులే; ఇందులో కొన్ని జాతీయాలుగా కూడా స్థిరపడ్డాయి. తెలుగు భాషకు జవాన్ని జీవాన్ని ప్రసాదించాయి ఇలాంటివి ఏ సాహిత్య ప్రక్రియలో ప్రయోగించబడ్డా ఆ ప్రక్రియ సౌందర్య నిలయమవుతుంది. రస నిర్ఝరి అవుతుంది; ధ్వనికి కేంద్రమవుతుంది; అలంకారాలకు ఆలయమవుతుంది. భాషా సుందరికివన్నీ శిరోభూషణాలు కాగా శ్రోతలందరికీ కర్ణపేయాలయ్యాయి; పఠితలందరికీ పూల పందిరులయ్యాయి.

## 11-3: పలుకుబళ్లు-పదబంధాలు

నానుడుల్లాగే పలుకుబళ్ళు - పదబంధాలు భాషకలంకారాలు. పదాల పొందిక వల్ల ఏర్పడ్డ ప్రత్యేకార్థం వల్ల, అవి స్థిరపడి ప్రసిద్ధిని పొందడం

వల్ల అవి పలుకుబడి అవుతుంది; పదబంధమవుతుంది. ఆ అర్థాన్ని ఆశించో లేక పోతే అసంకల్పితంగానో జానపదుడైనా భాషా మర్మజ్ఞుడైనా వీటిని మాటలమధ్య ప్రయోగిస్తాడు విశిష్టార్థాన్ని, లక్షణార్థాన్ని, విపరీతార్థాన్ని ఆశించి ఇవి ప్రయోగింప బడుతున్నాయి. ప్రయోగార్హాలైన పలుకుబళ్ళెన్నో తెలుగు పొడుపు కథల్లో కని పిస్తున్నాయి.

"కర కర కోయు, కడుపంతా కోసి, నోరు పెట్టు చేయు, మూడు మూరల తోట. ఆరు మూరల కాయ, శాస్త్రం సశ్లోకం, తీగ గుంజు, గుండు మీద ఎన్న రావ, కంచెల కిట్టద్దు, వేయి కండ్ల పులి, నూకల బువ్వ, నూనెధార, నూరాకుల నూను సెట్టు, నాగవెండ్రి సిత్తారం. అచ్చం మచ్చు, గంపంత ముత్యం, రెండు కాళ్ల పిట్ట. ఆసగింజపు తొలి, పూరిగచ్చ మగడు, మసిపూసి కరిచె, మిద్దె మీది మిరప, కాలె కాలె బండ, చెప్పేను పిసిక, కొండంచలంజ, ఆకచేతి పట్నం, పగడాల బిడ్డలు, నడింట్ల కూసోను, ఎలిక్యాయంత సద్ది, చెప్పంత పోరి, రచ్చబండ రాజు, చేయిపట్టె గంజు, అందం సందం దప్పు, కొంటె ముండా కొడుకు, కొంగుపట్టే గుంజు, అందతప్పల మొగోడు, మూడు కాళ్ళ ముసలమ్మ, అడవిలో అక్కమ్మ, ఇల్లెక్కి పిండి కొట్టు, ఎలుగుల ఎంపలి పెట్టు, ముగ్గురు ముచ్చటపెట్టు…"

ఇలా పదబంధాలు, పలుకుబళ్లు వినూత్న విధంగా నిర్మితమైనే. ప్రాచీనాంధ్ర సాహిత్యంలోనూ, జానపద గేయ వచన సాహిత్యంలోనూ ఇవి కనిపిస్తున్నాయి. అయితే పొడుపు కథల్లో వీటికి పలుకుబళ్ళ రూపు సమగ్రంగా సిద్ధించిందని మాత్రం చెప్పలేం. కొన్ని పలుకుబళ్ళు సదృశాలుగా కనిపిస్తాయి.

## 11-4 : వృత్తి గ్రామ సంజ్ఞా నామాలు

వృత్తుల పేర్లు, గ్రామాల పేర్లు, వ్యక్తుల పేర్లు వ్యవహారంలో రావడం సహజాతి సహజం. పొడుపు కథా నిర్మాణంలో ఇవన్నీ చదువుకొన్నాయి. ఇందులో వృత్తుల పేర్లున్నాయి ఇప్పుడైనా వృత్తులన్నీ కులాలుగా పరిగణింప బడుతున్నాయి ఒక వ్యక్తి గొర్రెల్ని కాస్తున్నాడు అతణ్ని గొల్లవాడను కొంటారు. ఆతనా వృత్తి మీదే ఆధారపడ్డ ఇంటిలో పుట్టినా పుట్టకున్నా చేస్తున్న

పనిని బట్టి పలానా అని గుర్తించడమే కులమయ్యింది. ఇవన్నీ కులవృత్తు లయ్యాయి. అలాంటి కుల వృత్తుల్ని కొన్ని పొడుపు కథలు సూచిస్తున్నాయి. పొడుపుకథా నిర్మాణ పరిశీలనానికి ఈ వృత్తుల పేర్లు దోహదం చేస్తాయి.

"కుమ్మరోడు, కోంటోడు, సాలోడు, బోగమోళ్లు, పట్లోడు, గొల్లోడు, బయిరూపులోళ్లు, గాండ్లోడు, మాదిగోడు, ఎరుకలోడు, కంచరోడు, కాపోడు, అమీన్ సాబ్, పోలీసు జవాన్, బుడ్డర ఖాన్, పంతులయ్య... "

ఇవన్నీ వారి వారి వృత్తిపరంగానూ, విశేషణాలుగానూ ప్రహేళికల్లో ప్రయోగించారు. పరిశీలనలో ఇలాంటివే మరికొన్ని లభిస్తాయి. అదే విధంగా గ్రామ నామాలు కూడా పొడుపు కథల్లో ప్రసక్తాను ప్రసక్తంగా కనిపిస్తున్నాయి. పొడుపు కథల్ని పొడిచే వారు తమ తమ గల్లీల నుండి ఢిల్లీ వరకున్న ఏ గ్రామాన్నీ వదల్లేదు. "ఈడేసిన కోల ఇంజమూరు వాయె" అంటే పాట. వారు తమ ఇంటి నుండి ఇంద్రప్రస్థం వరకున్న దేనినీ వదల్లేదు. పొడుపుకథల్లోని ఆయా ప్రాంత బేదాల్ని గుర్తించడానికి, ఆయా గ్రామాల వైశిష్ట్యాన్ని అర్థం చేసుకోడానికి ఈ గ్రామ నామాలుపకరిస్తాయి. అయితే ఏ జిల్లాలో, ఏ ప్రాంతంలో పొడుపు కథలు లభిస్తాయో, ఆ జిల్లా-ఆ ప్రాంత గ్రామ నామాలే పొడుపుకథల్లో అధికంగా రావడం సహజంగా కనిపించే అంశం.

"కొల్లూరికివాయె, శంసబాదుల సెట్టు, ఢిల్లీల సుండు, చంద్రగిరిలసెట్టు, తిరుపతిల తిగే, సంగూప సాలోడు, పట్నమంత రక్తం, ఇంజమూరువాయె, మాడ్గుల గాడ్దులు, నల్లజెర్వు సేను, షాద్‌నగర్ కట్ట, గోల్కొండ అబ్బ, తాహూరి కల్లు, లస్కర్ పువ్వు, కాశీకి పోతది, గయాకు పోతది, ఆదోని అరటాకు, బళ్లారి బానకట్టె, గుత్తి ముత్యాల చెండు, ఆమనగల్లు గుట్ట, బాదేపల్లిమిట్ట, గద్వాల శంకరయ్య, యాదారపు చెరువు, ఔరంగబాదు పండు, కందునూరమ్మ, కుందు నూరమ్మ, హనుమకొండ జాగీరు, మానుకోట మాన్యం, కొత్తపేటంగడి, దేవర కొండోల్లు, అల్లారం-బొల్లారం, నల్లగొండల పుంటు. మున్న నూరు గొల్లది, లంకాపురి పట్నం, చంద్రగిరి పట్నం, ఈరపట్నం, అయిదరబాదు, అమ్రా బాదు, గోల్కొండ గొట్టం, సూర్యపేట సుట్టం, కల్వకుర్తికాడ కట్ట..."

ఈ గ్రామనామాల్ని పిల్లలూ పెద్దలూ అందరూ పొడుపుకథల్లో బంధించారు. అక్కడక్కడ ఇవి ప్రాసార్థమో యతి నిమిత్తమో ప్రయోగించబడి నట్లనిపించినా వారి విశాల దృక్పథానికి నిదర్శనంగానే నిలిచాయి. నేటి పల్లెలూ పట్టణాలు జన వ్యవహారంలో ఎన్ని మార్పులు పొందాయో వీటి మూలంగా తెలుసుకొనే అవకాశముంది. పట్టణం పట్నంగా, ఏంజమూరు - ఇంజమూరుగా, వేదగిరి - యాదగిరిగా, మాడవరం-మాదారంగా, వీరపట్టణం-ఈరపట్నంగా మారాయి. సికింద్రాబాదును పూర్వం లస్కరు అనడం, కర్నూలును కందనూలు అనడం, నిజామాబాదును ఇందూరు అనడం ఇప్పటికీ ఉన్న విషయమే. ఏ రాజకీయ చారిత్రక పరిస్థితుల్లో నామాంతరీకరణం జరిగినా పూర్వ వాసనలు వదలని ప్రజలెందరో ఇంకా ఉన్నారు.

కొన్ని పొడుపుకథల్లో వ్యక్తుల నామాలున్నాయి; కొన్నింటిలో ఆయా ప్రదేశాల పేర్లున్నాయి. ఇవి యాదృచ్ఛికంగా ప్రహేళికల్లో చేరవచ్చు; లేదా కావాలనే చేర్పించవచ్చు. ఒకే పొడుపుకథలో ఒక పేరే రెండు విధాలుగా రూపాంతరం చెంది వినిపించవచ్చు, ఇలా పొడుపుకథలో వ్యవహృతాలవుతున్న పేర్లు నిన్నటివో, మొన్నటివో, ఏనాటివో పరిశీలించే అవకాశం కలుగుతుంది.

"చార్‌కమానుకట్ట, చార్మినార్ గుట్ట, నర్సింహరాయుడు, తిరుమలరాయ, సాయిరెడ్డి, అప్పన్న, దుప్పన్న, ముద్దప్ప, రుద్దప్ప, రంగడు-పింగడు, నక్కోడు. ముత్యాలమ్మ, అప్పయ్య, సోమయ్య, లక్ష్మణ, నారమ్మ రోటు, శాస్త్రం సెన్నప్ప, నేల గీరప్ప, వడ్డా లెంకయ్య, కుమ్మరి కుళ్లయ్య, ఆముదాల అప్పయ్య, వట్టి పాపయ్య, మంకెన్న-లంకెన్న, సీతారాములు, బయ్యప్ప పట్టం, పిస్తడు-గున్నడు-పోతడు గున్నడు"

ఈ పేర్లల్లో దుప్పన్న, రుద్దప్ప, గీరప్ప, పింగడు, కుళ్లయ్య, గున్నడు మొదలైనవన్నీ ఆయా పొడుపుకథల్లోని పూర్వార్థాలతో వచ్చిన నామాలను అతిశయార్థాన్నివ్వడానికి సృష్టింపబడ్డాయి. ఓ ప్రత్యేకార్థాన్ని, ఓ విశిష్టార్థాన్ని, ఓ అధిక్షేపార్థాన్ని ఇవి ఇస్తున్నాయి. ఇవిగాక మిగిలినవన్నీ వస్తువుల్ని, స్థలాల్ని, వ్యక్తుల్ని పొడుపుకథ దృష్టితో పరిచయం చేస్తున్నాయి.

ఇలా పొడుపుకథల్లోని వృత్తినామాలవల్ల వృత్తివై విధ్యం తెలుస్తున్నది. వికృత పదాల స్వస్వరూపం పరిశీలించే అవకాశం కలుగుతున్నది. గ్రామ నామాలవల్ల జానపదుని విశాల మనస్తత్వం అవగతమవుతున్నది. రూపాంతరాల నిర్మాణానికి కారణం బోధపడుతున్నది. సంజ్ఞానామాలవల్ల విశిష్టార్థం బహిర్గత మవుతున్నది; విసూత్న పదప్రయోగ వైలక్షణ్యం తెలియవస్తున్నది. ఇన్ని తెలియడానికి మూలమైన పదాల కూర్పుల్ని-మార్పుల్ని ఇక పరిశీలిద్దాం.

## 11-5 : సంధులు

భావసిద్ధికి ఆలోచనలు కూర్చాలి; అర్థసిద్ధికి పదాలు కలపాలి. ఆలోచనలు కూర్చితే వాక్యం ఏర్పడుతుంది; పదాలు కలిపితే పదబంధా లేర్పడతాయి; అర్థం సిద్ధిస్తే అప్పుడప్పుడు సంధులు సంధించుకొంటాయి ఈ సంధులు సర్వ సాధారణంగా పూర్వపదాంత్య భాగానికి, పర పదాది భాగానికి జరుగుతాయి.

అచ్చు కచ్చు. హల్లుకు హల్లు, అచ్చుకు హల్లు, హల్లుకు అచ్చు కలియ డంవల్ల సంధి జరుగుతుంది. ఇవి నిత్యాలనీ, వైకల్పికాలనీ, బహుళాలనీ వైయా కరణుల మతం. తెలుగు పొడుపు పద్యాల్లోని చాలా పదాలు వ్యాకరణాన్ని అనుస రించాయి. అక్కడక్కడ మాండలికాలు కూడా చోటు చేసుకొన్నాయి. కొన్ని గేయాల్లో, వచన గేయాల్లో, వచనాల్లోని పదాల్లో మాండలికాలెన్నో ఉన్నాయి. వ్యాకరణాన్ని మీరి జనం నాడిని పట్టించినవెన్నో ఉన్నాయి.

జానపదులైనా, భాషాభిజ్ఞులైనా భాషను అర్థదృష్టితో ప్రయోగిస్తారే కాని వ్యాకరణం కొలతలతో ప్రయోగించరు. వ్యాకరణానికే కట్టుపడాలనే నియ మంకూడా లేదు. వ్యవహార భాషకు కూడా కొన్ని నియమా లేర్పడ్డా అర్థదృష్టి ప్రయోగానికి ఆయా ప్రాంత భేదాలనుసరించడంవల్ల దీన్నికూడా మీరడం కనిపిస్తూనే ఉంది. ప్రామాణిక మాండలికం శిష్ట వ్యావహారికం అనే పదాలు ఇప్పుడు పాటి దప్పిపోయినై. అచ్చం మాండలికం వాడినా కాదన్నవాడే ఇప్పుడు భాషాప్రయోగ దృష్టి తెలియనివాడై పోతున్నాడు.

అందుకే జన వ్యవహారానుగుణంగానే జానపదుల పొడుపుకథలు నిర్మిత మైనై. అవి ఎలా లభిస్తున్నాయో అలాగే అక్షరబద్ధం చేయడం, పరిశీలించడం పరిశోధకుని ప్రథమ కర్తవ్యం. అక్కడక్కడ సంధిబంధాలు శిథిలాలైనట్లని

పిస్తాయి. ఆ ప్రయోగమే అట్లా ఉంటుంది; శిథిలమనే ప్రశ్నే లేదు. వ్యవహర్త తన పక్కవాడి కర్థమయ్యేట్లు ప్రయోగిస్తున్నాడు అవి పరిశీలకులు తప్పకుండా సహరించాల్సిన అంశం. ఈ అంశాన్ని గుర్తిస్తూనే, వ్యాకరణానికి ఒదగనివాటిని, ఒదిగినా విలక్షణంగా ఉన్నవాటిని పరిశీలించడమే ఈ ఆంశిక ప్రకరణోద్దేశం.

**5-1 : అత్వసంధి:-** అకారానికి సంధి బహుళమని వ్యాకర్తల మతం. శ్రేష్ఠతా వాచకాలైన అంవాదులకు సంధి నిత్యమని, క్రియావాచక తత్సమ సంబోధనాంతాలకు సంధిలేదనీ, అత్వసంధి విషయంలోనే చెప్పబడింది. అయితే పొడుపు కథల్లోని పదాల కూర్పులో చాలాచోట్ల నిత్యసంధి కనిపిస్తున్నది.

సట్టి + అంతసెట్టు > సట్టంతసెట్టు
ఆప + అంతఆకు > ఆపంత ఆకు
సేత + ఏస్తరు > సేతేస్తరు
నోట + ఏర్తరు > నోటేర్తరు
కమ్మగ + ఉంటది < కమ్మగుంటది.

ఎందుకో 'చేత వేయుదురు' అనే రూపం 'సేతేస్తరు' అయింది. 'వే' లోని హల్లు లోపించి, అచ్చుతో సంధి జరిగింది. మిగిలినవన్నీ శ్రేష్ఠతా వాచకాలు కాకున్నా అవి నిత్య వ్యవహార సంధులుగానే ప్రయోగింపబడుతున్నాయి.

**5-2:- ఇత్వసంధి :** ఇకార సంధి విషయంలో నిత్య వైకల్పిక నిషేధాలున్నాయి ఈ విధి నిషేధాల్ని అనుసరించిన ప్రయోగాలున్నాయి; మీరినవీ పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి. కొన్ని క్త్వార్థకేకార సంధులూ ఉన్నాయి.

సగమయ్యి + ఒస్తివి + ఓయి > సగమయ్యొస్తివోయి
సంచి + ఉడకవెట్టి > సంచుడకవెట్టి
నావి + ఊపులాడె > నావూపులాడె
ఆరసేరి + అంత < ఆరసేతంత

ఇందులోని 'సగమయ్యి వస్తివి ఓయి' లో రెండూ క్త్వార్థకేకార సంధులే. 'వ-ఒ'గా ఉచ్చరింపబడి సంధి జరిగింది. అట్లే వస్తివి+ఓయి> వస్తి వోయి రూపమయ్యింది, కవి సంశయ విచ్ఛేదకారుడు క్త్వార్థకేకార సంధి నంగీకరించాడు.

**5-3 : గసడదవాదేశం :-** ఇది ప్రథమమీదా ద్వంద్వ సమాసంలోనూ వచ్చే సంధి. ప్రథమమీద బహుళం; ద్వంద్వంలో కొన్నిట నిత్యం. పొడుపు కథల్లోని "తొంగి+సూస్తే, మట్టి+సెట్టు మీద తుమ్మ+సెట్టు" వగైరా ప్రయో గాల్లో అక్షర సావర్ణ్యంవల్ల, ఉచ్చారణవేగంలో అతి సహజంగా 'చ' కారం సకారంగా మారినట్లనిపిస్తుంది. కాని పదమధ్యంలో 'క' కారం 'గ' కారంగా, 'చ' కారం 'స' కారంగా మారిన రూపాలు కోకొల్లలుగా కనిపిస్తున్నాయి.

ఒ>గవాలు బువ్వ వెట్టి
ఒ>గవాలు కోక్కులేసి ....
ఒ > గన్ని ఎండవెట్టి
ఒ > పండవెట్టి
ఒ > గని కోసరం నేను వో తుంటిరా !. .
ఒ > గాన్ని సేతవట్టి
ఒ > గాన్ని నోటవట్టి
ఒ > గాని కొరకు నేను వో యుంటిరో

కూ > సోన వెట్టి ...
పూ > సింది ఏందిరా ....

పైన ఉదాహరించిన వాటిలో ఒక - 'ఒగ'గా, 'ఒగన్ని' 'ఒగానిగా' ప్రయోగించడం జరిగింది. ఇక్కడ 'క'కారం 'గ'కారంగా మారడాన్ని వ్యాక రణం నిర్దేశించలేదు కాక్షర సామ్యం 'గ'; అందుకే 'గ'కారం వచ్చింది. అలాగే 'కూసోన, పూసింది' లోని 'స'కారాలు 'చ'కార సావర్ణ్యాలు పైగా ఇవన్నీ ఉచ్చారణ వేగంవల్లా, ప్రాంతీయతా భేదంవల్ల అనూచానంగా వస్తున్నవే.

**5-4 : ద్రుతంమీద వాగమం :** దకారం ద్రుతం; ద్రుతాంతాలు ద్రుతప్రకృతికాలు. ద్రుతంమీద వచ్చే పవర్ణం సరళమవుతుందని వ్యాకర్తల అభిప్రాయం లక్షణాన్ని అనుసరించిన సాహిత్యంలో ఈ పాటింపున్నది. కాని తెలుగు పొడుపు కథల్లో ద్రుతంమీద వచ్చిన కొన్ని పవర్ణాలకు వాగమాలు వచ్చినై.

మాను + పుట్టి > మానువుట్టి
తొప్పున + పడె > తొప్పున వడె
పట్టుకోను + పోతె > పట్టుకోను వోతె
నిలు + పడదు > నిలవడదు
సెవున + పట్టదు > సెవునపట్టదు
నేను + పోతుంటెరా > నేను వోతుంటెరా

ఇందులో నేను పదమొక్కటి తప్ప మిగిలినవన్నీ ద్రుతాంతాలే. నేను కూడా ఇప్పుడు ద్రుతప్రకృతికంగా పిలువబడుతుంది. కాని ప్రాచీనకాలంలో 'తాను-నేను' లను కళలుగానే భావించారు. భారతంలో 'నేను విదపడిగియెద' అనే ప్రయోగముంది.జానపదుల గీతాల్లోనూ, పొడుపు కథల్లోనూ ద్రుతంమీద వాగమం శాతమెక్కువే 'ప'వర్ణ సామ్యం 'వ' వర్ణమైనందువల్లనే ఇలాంటి ప్రయోగాలకు అవకాశం కలిగింది.

**5-5 : ద్రుత ద్విత్వం:-** ద్రుతాంతాలైన పదాలకు అచ్చు పరమైనపుడు కొన్ని సందర్భాల్లో ద్విత్వం రావడాన్ని కొందరు లాక్షణికు లంగీకరించారు. అందుకొరకు భావగతాది గ్రంథాల్లోని "సర్వమున్నతసి" వంటి ప్రయోగాల్ని ఉదాహరించారు. కానీ పొడుపుకథల్లో అక్కడక్కడ ద్రుతాంతాలు కాని శబ్దాల మీద కూడా ద్రుత ద్విత్వం కనిపిస్తున్నది.

* గవ్వ > న్నర గడ్డము
ఎంటిక > న్నర కెంత !
పండ్ల > న్నర కెంత తసుద్దది !

జానపదుల వ్యవహారంలోనూ, భాషా సంప్రదాయం తెలిసినవారి వ్యవహారంలోనూ "రూపాయిన్నర, ఒకటన్నర, రెండున్నర, మూడన్నర" అనే పదాలున్నాయి. రూపాయయున్నూ అర్థ లేదా అర, ఒకటియున్నూ (ఒకటి న్నూ) అర యని వ్యవహృతమయ్యే పదాల్లో 'యు' లోపించి ఆ రూపం సిద్ధించింది. అట్లే గవ్వయున్నూ అర, ఎంటికయున్నూ అర, పల్లియున్నూ అర (పల్లిన్నూ) అని ప్రయోగింపబడ్డ శబ్దాల్లో ఉచ్చారణ వేగంవల్ల 'యు' లోపించి గవ్వన్నర, ఎంటికన్నర, పల్లిన్నర రూపాలేర్పడ్డాయి గవ్వ,ఎంటిక(వెంట్రుక) పల్లి అనే శబ్దాలు కళలేగాని ద్రుతాలు గావు. వ్యవహార వేగంవల్ల, అక్షర లోపం వల్ల అలాంటి రూపాలు సిద్ధించాయి.

## 6-6 : ద్రుతంమీద యడాగమం :- ద్రుతంమీద అచ్చు వస్తే సాధారణంగా కలిసిపోతుంది; లేకుంటే రూపం అలాగే ఉంటుంది. ద్రుతాంతాలపై యడాగమం రాదు. అయితే కొన్ని పొడుపు కథల్లో ద్రుతాంతాలమీద యడాగమం కనిపిస్తున్నవి.

* అక్కతో + అక్కడికి > అక్కతో యక్కడికి
 అన్నతో + ఆడింది > అన్నతో యాడింది
 అక్కడ + ఉన్నకోల > అక్కడయున్న కోల
 ఇక్కడ + ఎవరుండిరి > ఇక్కడ యెవరుండిరి.

అక్కతో, అన్నతో, అక్కడ, ఇక్కడ అనే ఈ శబ్దాలన్నీ ద్రుతాంతాలు. వాటిమీద వచ్చిన అక్కడికి, ఆడింది, ఉన్న, ఎవరు అనే పదాదిస్వరాలకు యడాగమం వచ్చింది.

## 5-7 : వ లోప అచ్సంధి :- జానపదుల పొడుపుకథల్లో ఉత్తర పదాద్యక్షరం 'వ' లోపించి, ఆ స్థానంలో 'ఒ, ఎ' స్వరాలు వచ్చి సంధిజరగడం తరచు సంభవిస్తుంది. ఇది ఇవాళ వ్యవహారంలో కూడా సర్వ సాధారణమై పోయింది.

* ఇంటి + వెనుక నామాల + వాడు
 (ఇం > ఎెనుక నామా> లోడు)

* సూసెటి + వాళ్ళగాని కాసెటి + వాళ్ళు పేరు
(సూసె < టోళ్ళగాని కాసె < టోళ్ళు పేరు)

'ఇంటి వెనుక' శబ్దాల్లోని, ఉత్తరాది పదం 'వె' లోపించింది ఆ స్థానంలో 'ఎ' వచ్చింది. 'ఇంటెనుక' రూపం సిద్ధించింది. అట్లే 'నామాలవాడు' లోని 'వ' లోపించి ఆ స్థానంలో 'ఒ' వచ్చి 'నామలోడు' రూపమేర్పడింది. చూచువాడు - చూచెడువారు - చూసెడువారు - చూసెడువాళ్ళు - సూసెడువాళ్ళు - సూసెటి వాళ్ళు అనే రూపాలేర్పడి 'ఓ' వచ్చి సంధి జరిగింది. అట్లే 'కాచువారు - కాచెడి వారు - కాసెడువాళ్ళు - కాసెటివాళ్ళు' అనే రూపాలేర్పడి 'వ' లోపించి "ఓ" వచ్చి "కాసెటోళ్ళు" అనేవి సిద్ధించింది. "తెల్లారి, పట్టేసిరి, విడిచేసిరి, పుంట్లోడు, అప్పలోడు, నగాలోడు, బస్తోడు, కుమ్మరోడు, అన్నేసిపోయాడు, నన్నేసిచూడు, పెండొటసలు...." ఆలా ఎన్నో పదాలు "వ" లోప అచ్చంధి కిందకేవస్తాయి.

జానపదుల పొడుపు కథల్ని జానపద సాహిత్యంలో అంతర్భాగంగా తీసుకొని భాషాపరిశీలన చేసినప్పుడు ఇంకా అనేక విషయాలు బహిర్గతమయ్యే అవకాశముంది. వ్యాకరణ నియమాల్ని మీరాయనే దృష్టితోగాక, సహజసిద్ధమైన జన వ్యవహారంలోని సంబంధాలిట్లే ఉంటాయనే దృష్టితో వీటిని పరిశీలించి "దేశి"ని సుసంపన్నం చేయాల్సిన అవసరముంది. ఇక సంధికి కుడిఎడమలుగా కనిపించే ధ్వనుల మార్పుల్ని పరిశీలిద్దాం.

## 11-6 : ధ్వనుల మార్పులు -

అర్థ నౌష్ఠవ నిర్మాణానికి ఒక పదానికి మరొకపదం, ఒక అక్షరానికి మరొక అక్షరం సన్నిహిత మవుతాయి. ఆ పదాలు ఆ అక్షరాలు విభక్తుల్లో, విశేష ణాల్లో, విశేష్యాల్లో, క్రియల్లో ఎవైనా కావచ్చు అలా సన్నిహితాలైన పదాక్షరాల్లో ఏదో ఒకటి మారవచ్చు లేదా రెండూ మారవచ్చు. మారినవి అక్షరాలే అయినా అవి ఉచ్చారణవల్ల కలిగిన ధ్వని కారణంగానే మారాయని గ్రహించాలి. ఒక్కోసారి సందర్భంలో పదాక్షరాల సాన్నిహిత్యం లేకున్నా, జానపదుల పలుకుబడి లోని వైశిష్ట్యంవల్ల, వైలక్షణ్యంవల్ల, వికృత రూపంవల్ల ధ్వని పరిణామం చెంద డానికి అవకాశముంది. ఆ పరిణామాల్ని స్పృశించే ప్రయత్నం మాత్రం చేస్తాను.

**6-1 : అచ్చు 'ఒ'కు హల్లు 'వ-వొ' :-** అచ్చు "ఒ"రావాల్సిన కొన్ని పదాల్లో హల్లు "వ" గాని, "వొ"గాని ఉచ్చరిస్తున్నారు.

* నా> వల్లంత కర్సిపాయె (వల్లు)
  > వొల్లెలన్ని మల్లెలాయె (వల్లెలు, వొల్లెలు)

ఒడలు-ఒళ్ళు-ఎల్లు అయింది. ఒల్లె, వల్లె - వొల్లెగా మారింది. కేవల ఉచ్చారణే కాకుండా లభిస్తున్న పొడుపుకథల పుస్తకాల్లో ఇలాంటివి అచ్చులో కనిపిస్తున్నాయి.

**6-2 : ఏ కు బదులు య :-** అచ్చు ఎ-ఎలు వచ్చిన కొన్ని పదాలు "య-యా"లుగా ఉచ్చరించడముంది. ఇలా ఉచ్చరించడం మాండలిక భేదం కూడా కావచ్చు.

* > యాడ సూసిన రాజ కచీరు,
  > యాడాదికి నిల్చింది
  సూనె > యాడంగ యత్తిది
  > యాలకికాయ.

ఏడ (ఎక్కడ), ఏడాదికి, ఏడంగ, (ఎక్కడంగ), ఎత్తిద (వస్కృతడి-వెత్తిద), ఏలకికాయ అనే పదాల్లో "ఏ"-"య"గా ఉచ్చారణలో వినిపిస్తున్నవి.

**6-3 : పద మధ్య స్వర లోపం :-** ఈ లోపాన్ని లక్షణశాస్త్రాలు అంగీకరించాయి. పదాల మధ్యన ఉన్న కొన్ని అక్షరాల్లోని అచ్చులు లోపిస్తాయి. హల్లు పైవర్ణంతో కలిసి సంయుక్తాక్షర మవుతుంది

* దాహ్నా కొ> త్తము, అవే మే> ద్వదు
  సెడ గ> ర్సి పాయె,
  తీ> స్క రావాలె,
  అ> ర్క, ఇ> ర్క, కొ> ర్క, కొ> డ్క

కొడుతము, ఏడువదు పదాల్లోని "తు"లోని ఉ, "కరచి" పదంలోని రేఫంలోని అ, ఓసుః శబ్దంలో ఉన్న "సు"లోని ఉ, "అరక, ఇరుక, కొరుక, కొడుక" శబ్దాల్లోని అకార ఉకారాలు లోపించాయి. అందువల్లనే ఆ పదాల్లోని ఆయా అక్షరాలు సంయుక్తాక్షరాలైనై.

**6-4 : ఆ ఈలకు గాగీ :-** అకార ఇకారాలకు బదులు గీయి వినిపిస్తు న్నాయి జానపదుల వ్యవహారంలోనూ భాష తెలిసిన కొంతమంది ఉచ్చారణ లోనూ ఉన్న ఈ మార్పు పరిశీలనార్హం.

* > గింతంత పిట్టను గొస్తే, పబ్బమంత రక్తమాయె
  > గింతం పొట్టోడు ఎగిరెగిరి కొట్టె (కొట్టె),
  > గీడ గలగల- > గాడ గలగల

గింతంత (ఇంతంత) గీడ (ఈడ-ఇక్కడ), గాడ (ఆడ-అక్కడ), అనే పదాల్లోని గాగీయి ఆ ఈల స్థానంలో వచ్చినై.

**6-5 : అయి-ఐల వినిమయం :-** అయి-ఐల ఉచ్చారణ సాదృశ్యాన్ని గుర్తించి, అటు వ్యాకర్తలు ఇటు భాషా శాస్త్రజ్ఞులు వీటి వినిమయాన్ని అంగీకరిం చారు.

* > అయిదు రూపాయల సుద్ద
  సెర్ల > అయిదు గుంజలు
  పాటిచ్చి దూకెరా > పయిడి కంటె

వీటిలో అయిదు-ఐదుగానూ, పయిడి-పైడిగానూ ఉచ్చరించినా ధ్వని విషయంలో మార్పేమీ రాదు. అయితే పొడుపుకథల్లో "య" కారానికి ద్విత్వం రావడం కూడా ఉంది "నాపై (శరీరం) అంత ఈగ కర్సింది"- "నా పయ్యంత ఈగ కర్సింది" అనే వాక్యంలో యకార ద్విత్వం కారణంగా ధ్వనిలో మార్పు వచ్చింది.

**6-6 : అ-ఎ గా మార్పు :-** ఆయా మండలాల్లోని ఉచ్చారణా భేదాల కారణంగా, పొడుపు కథల్లోని కొన్ని పదాల మధ్య "అ"కారాలు, పదాంత "ఆ" కారాలు, "ఎ"కారంగా వినిపిస్తున్నాయి.

* దానాకు తా> మెరాకు,
మొగకు తీ > గె ...
తీ> గెకు ఈ> గె .

తామరాకు, తీగ, ఈగ వీటి రూపాలు. "మ-గ"లు "మె-గె"లుగా మారినై. ఇట్లై 'పచ్చ కెర్ర(క్క)ర"- కన్న సబబైందొకటి' అనే ఒక పొడుపు కథ పంక్తిలో చకార రకారాలు ఎకారంతో ఉచ్చరింపబడినై. ఇవి ఆయా మాండలిక ధ్వని భేదాల కారణంగా వచ్చినవే తప్ప అంతటా వినిపించవు

**6-7 : అద్విరుక్త ప్రయోగం :-** ద్విరుక్తాలకు లోపం వైకల్పికమని లాక్షణికుల అభిప్రాయం. కొన్ని పదాల్లో లోపం అసలే జరగదు కానిసహజంగా ద్విరుక్తమై ద్విరుక్తంలోని అచ్చు లోపిస్తే, అది పై అక్షరంతో కలిసిపోయి, అద్విరుక్తంగా వ్యవహృత మవుతున్నది

* నీల గట్టి కొ> ట్రా (కొట్టిరా)
ఎ> త్క పోయె (ఎత్తుక)
పొ> యి మీదకి కూర (పొయ్యి)

కొట్టిరా, ఎత్తుక, పొయ్యి అనెడి ద్విరుక్త ప్రయోగాలు అద్విరుక్తాలై "కొట్రా, ఎత్క, పొయి" అనే రూపాలుగా ప్రయుక్తాలయినై.

**5-8 : అల్ప ప్రాణానికి మహా ప్రాణం :-** మహా ప్రాణాలన్నీ సంస్కృతం నుండే తెలుగులోకి వచ్చినై. ఇవి భాషా ప్రౌఢిమను పెంచినై. పొడుపు కథల్లోని కొన్ని అల్ప ప్రాణాలు కొంత మంది వ్యవహర్తలు మహా ప్రాణాలుగా ఉచ్చరించారు. అయితే అందరిలాగే అంటారని చెప్పలేం వారివారి ఉచ్చారణా సామర్థ్యాన్ని, భాషా సంస్కృత చిత్తాన్ని ఈవిషయంలో పరిగణనలోకి తీసుకోవాల్సి వస్తుంది.

* లె > క్ష వెట్టినా పక్కల కొడతా!
ఆకాశాన ప <శము ..

ఇందులోని 'లక్ష, పసము' లోని క్ష-శలు సహజంగా అల్పప్రాణాలే వీటిని మహా ప్రాణాలుగా ఉచ్చరించడం వారివారి అలవాటుగానే భావించాలి.

**6-9 : చసశల మార్పు** :- సంస్కృతాంధ్రాల్లోని సంధి సంబంధి వివయాల్లో "చసశల" మార్పు లక్షణ శాస్త్రాలు అంగీకరించాయి. సంస్కృతంలో జశ్త్వ, శ్చుత్వ, ష్టుత్వ సంధుల వల్ల, తెలుగులో సరళాదేశ, గసడదవాదేశ సంధుల వల్ల ఈ మార్పులు వచ్చినై. అయితే వీటి మధ్యన ఉన్న ఉచ్చారణ సామ్యం కారణంగానే పరస్పర విరామం జరుగుతున్నది.

* > సం (చ) క జాడిస్తే, > సా (చా) రెడు పిల్లలు,
అంగల్ల బుడ్డోడు సెం (చెం) గ సెం (చెం) గెగిరె,
గుప్పెడు పి> సి (చి) క
> సెం > శలు (చెంచాలు) తోమరు
ఊరపి > శ్క (పిచ్చుక-పిచిక) ఉర్కులాడ్తది

చకారం సకారం గానూ, శకారంగానూ మారింది. తెలంగాణాలోని చాలా మండలాల్లో చకారాన్ని, సకారం గానూ శకారం గానూ ఉచ్చరిస్తారు. "సా (చా)లమ్మ, చా (శారు) రు, చే (సే)ను, చాల (శాన), చా (సా) పు, దోచుక (స్క) పోయిండు, పి (సి) చి పోయింది, పయ్యంత పూ (సిం) చింది..." ఇలాంటి మార్పులెన్నో వ్యవహారంలో ఉన్నాయి.

**6-10 : డ-కు-ట** :- వ్యాకరణ మర్యాదననుసరించి "ట-డ"గా మారుతుంది. డ-ట గా మారడం కొన్ని పొడుపు కథల్లో కనిపిస్తుంది.

* కావ > ు కుండలు (డి)
వెం >టి కంత (ఎంటి కంత, వెంట్రుకంత)

నేటి పత్రికలు టకార డకారాల్ని నియమ రహితంగానే ప్రయోగిస్తున్నాయి. పరుషం సరళం కావడం సహజమే గానీ ఈ పదాల్లో సరళమే పరుషమైంది. వ్యవహారంలో కూడా రెండు ప్రయోగాలున్నాయి.

**6-11 : హ-కు-అ** :- వ్యవహారంలో "హ" కారం, అకారంగా వినిపిస్తోంది. రెండింటికి ఉచ్చారణ సామ్యమే దీనికి మూలమనాలి.

* > అరిశ్చంద్రుని బిడ్డ
అరచేతిల> అనుమంతుడు (హ)

"అస్త (హస్త) ఆయి (హాయి), అంతకుడు (హంతకుడు), అవుజు (హౌజు), ఆరం (హారం) .. " వ్యవహారంలో ఇలా హకారాది పదాలెన్నో అకారాదులుగా ఉచ్చరింపబడుతున్నాయి

**6-12 : హ-య, వ-య, య-వ** :- హకారం యకారంగా, వకారం యకారంగా, యకారం వకారంగా మారిన రూపాలు కొన్ని ఉన్నాయి.

* బహుబూపు రోళ్ళు - బ> యిబూపులోళ్లు
బావిల దుంకుతది - బా> యిల దుంకుతది
యాపచి గుంజలు - > వేప> యి గుంజలు.

ఉచ్చారణ సాదృశ్యం ఉన్నప్పుడు అక్షరాలిలా మారడం సహజమే. ఇదే ధ్వని పరిణామంగా భాషా శాస్త్రంలోనూ భాషా వికాసంలోను ఒక ప్రత్యేకాంశంగా అధ్యయనానికి దోహదం చేస్తున్నది. పొడుపు కథల్ని ఈ దృష్టితో ఇంకా సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలన చేయాల్సి ఉంది. ఈ బృహద్గ్రంథంలో ఇది స్థూల పరిచయమే. క్రియల్ని కూడా స్థూలంగా పరిచయం చేస్తాను.

**11-7 : క్రియలు**

సంపూర్ణార్థక బోధమైన అఖండ వాక్యమే భాషకు మూలం. అర్థసిద్ధికై ఖండికలైన పదాలు అఖండ వాక్యంగా పరిణామం చెందినై. అఖండాన్ని నరికి

ఖండాలుగా మార్చడం, ఖండాల్ని కలిపి అఖండంగా మార్చడం అనేది సృష్టి అంతటా జరుగుతూనే ఉంది. ఏదెట్లైనా అర్థం ప్రస్ఫుటం కావడమే ప్రధానం. అలా అర్థాన్ని ప్రస్ఫుటీకరించే శక్తి ప్రధానంగా వాక్యంలోని క్రియకే ఉంటుంది. క్రియకెంత ప్రాధాన్యమున్నా క్రియా రహిత వాక్యాలకూ అర్థ సిద్ధి కలుగుతూనే ఉంది. క్రియలు ఉన్నవీ, క్రియలు లేనివీ పొడుపు కథల్లో ఉన్నాయి. రెండింటికీ అర్థ స్పష్టత సమానంగానే ఉంది.

**7-1 : క్రియా సహిత వాక్యాలు :-** వాక్యంలో క్రియ స్పష్టంగా ఉంటుంది. కొన్ని పొడుపు కథల్లో పాదపాదానికి ఓ క్రియ కనిపిస్తుంది. అలా క్రియ వేయడం అర్థ స్పష్టతకూ, లయకూ అని అర్థమవుతూనే ఉంది.

* చిన్న పిట్టమ్మ కమ్మగా ఉండును (నువ్వులు)

* అయిదు మంది దొబ్బుతుంటే
పదహారు మంది ఆగవట్రె (చేతి వ్రేళ్లు, పండ్లు)

ఈ రెండు పొడుపు కథలు విధి వాక్యాలకు నిదర్శనాలు. రెండో పొడుపు కథలో "దొబ్బుతుంటే" అనే అసంపూర్ణ క్రియ, "ఆగవట్రె" అనే సంపూర్ణక్రియ కూడా అర్థ సిద్ధికి దోహదం చేశాయి.

* తెల్లటి మిద్దెకు మూతలేదు (కోడిగుడ్డు)

* చక్కని చెట్టును చెక్కలే లేవు (గడ్డపార)

ఈ రెండు పొడుపు కథలు నిషేధ వాక్యాలకు నిదర్శనాలు. ఈ పై నాలుగు పొడుపు కథల్లోనూ "ఉండును, ఆగవట్రె, లేదు, లేవు" అనే క్రియలు సంపూర్ణార్థ బోధకాలై వాక్యానికి స్పష్టతను సమకూర్చి పెట్టినై. క్రియారహిత ప్రహేళికలు కూడా స్పష్టార్థ ప్రతిబోధకాలుగా ఉన్నాయి.

**7-2 : క్రియా రహిత వాక్యాలు -:** పొడుపు కథలెన్నో క్రియా రహితాలుగా కనిపిస్తున్నాయి. క్రియ లేకుండానే నిర్మాణమయ్యే స్థితి ఒకటి పొడుపు కథకుంది.

* మెడ సన్న చాయ (కల్లుసీస)
జిల్కారంత జీవం (చెదలు)
బాటకు బంధం (చీమల బారు)
చీమకు చిచ్చు (అగ్గి)
గవాసిల గడ్డపార (ముక్కుపుల్ల)

ఈ అయిదు పొడుపు కథల్లో క్రియలేకున్నా అర్థ స్పష్టత హాటంకమేమీ కలుగలేదు. శబ్దార్థాల సంయోజనం తెలిసి ఏర్చి కూర్చిన పద బంధాలుగా ఇవి కనిపిస్తున్నాయి. ఓ మహాకవి చేయి పడిందన్న విధంగా ఇవి కుదురుకొన్నాయి. ఇలాంటివే ప్రకటించే కొన్ని పత్రికలు "అంటే ఏంటి, ఏంటో చెప్పు" అనే ప్రశ్నార్థక వాక్యాల్ని వీటి చివర జోడిస్తున్నాయి. కాని అలాంటి ప్రశ్నార్థక వాక్యాలు లేకుండానే జానపదులు వీటిని పొడుస్తున్నారు. ఆ పొడవడంలో బహిర్గతమయ్యే ఒకానొక ఉచ్చారణ వల్లనే ప్రశ్నార్థకత ధ్వనిస్తుంది. ఆ ధ్వనిని గుర్తించే వారికి ఇక ప్రశ్నార్థక క్రియ అక్కరలేదు.

## 7-3 : క్రియా ప్రయోగాలు

పొడుపు కథల్లో క్రియలేకున్నా అర్థసిద్ధి అవుతుందని తెలుసుకొన్నాం. అయినా సమస్త పదాలు ధాతుజన్యాలే అనే వాదన ఒకటి ఉంది. ధాతువు మూలమూ, ప్రాథమికమైనదీ. అందువల్ల క్రియకంత ప్రాధాన్యం వచ్చింది. సమాపక క్రియారూపం సమాసం వంటిదని, అసమాపక క్రియారూపాలు భావార్థకాల వంటివని భాషా శాస్త్రవేత్తల అభిప్రాయం.

జానపద సాహిత్యంలో ధాతురూపాలే విధంగా ప్రయోగింపబడ్డాయో పొడుపు కథల్లోనూ అలాంటి ప్రయోగాలున్నాయి. స్థాలీపులాక న్యాయాన్ని అనుసరించి ఒకటి రెండింటిని ఉదాహరిస్తాను.

**7-3-1: చువర్ణాంత ధాతువులు :-** ఇచ్చు, ఒచ్చు, ఎచ్చు, బూచు మొదలైనవి చువర్ణాంత ధాతువులు. ఇవి వాక్యార్థాన్ని అనుసరించి మారుతాయి.

ఇచ్చు > ఇచ్చె— ఇచ్చి- ఇస్తివి—ఇస్తిరి—ఇస్తి—ఇస్తిని- ఇస్తిమి-ఇస్తది-ఇచ్చింది-ఇస్తుంది-ఇస్తరు; చచు > సచ్చె-సచ్చి-సస్తివి-సస్తిరి-సస్తి-సస్తిని-సస్తిమి-సస్తది-సస్తుంది- సచ్చింది-సస్తరు; వచ్చు> వచ్చె - వచ్చి-వస్తివి-వస్తిరి-వస్తి-వస్తిని-వస్తిమి-వస్తది- వచ్చింది - వస్తుంది - వస్తరు; చూచు > సూసె-సూస్తి -సూస్తివి-సూస్తిరి-సూస్తి-సూస్తిని- సూస్తిమి -సూస్తది—సూసింది—సూస్తుంది-సూస్తరు.

వీటిలోనే ఇంకా స్వల్ప స్వర పరిణామంలో కొన్ని భేదాలు కనిపిస్తున్నాయి. ఈ విభేదాల స్వరూపం తెలియడానికి విభిన్న ప్రహేళికల్లోని ఒక్కొక్క పాదాన్ని ఉదాహరిస్తాను.

* అరవై మందికి నీడిచ్చె....
దినాం బుడ్డెడు పాలిస్తది ...
అరికాలితో సన్నిస్తది....
సావిట్ల సస్తి ...
రోసానికి వస్తి ...
కుక్కలా గొస్తది ..
కండ్లులేనివాడు సూసెరా ..
కుతిగల్ల మగడు కుడుక పచ్చ ఇచ్చిండు...

పైన ఉదాహరించిన ప్రతి పాదాంతంలో ధాతువు పొందిన పరిణామాలెన్నో విశదమవుతున్నాయి. ఇంకా ఎన్నో మార్పులున్న ప్రహేళికలెన్నో ఉన్నాయి.

**7—3-2 : యువర్ణాంత ధాతువులు:**- చేయు, తీయు, వేయు, కోయు తదితర యువర్ణాంత ధాతువులెన్నో భిన్న భిన్న పరిణామాల్ని పొంది పొడుపు కథల్లో కనిపిస్తున్నాయి

చేయు > చేసె-చేసి-చేస్తివి-చేస్తిరి-చేస్తి-చేస్తిని-చేస్తిమి-చేసింది-చేస్తుంది-చేస్తవి; తీయు> తీసె-తీసి-తీస్తివి-తీస్తిరి-తీస్తి- తీస్తిని- తీస్తిమి -తీసింది-తీస్తుంది-తీస్తది; వేయు> ఏసె-ఏసి- ఏస్తివి- ఏస్తిరి-ఏస్తి-ఏస్తిని -

ఏ_స్తిమి-ఎసింది-ఏస్తుంది-ఎ_స్తది; కోయు > కోసె-కోృసి-కో_స్తివి-కో_స్తిరి- కో_స్తి-కో_స్తిని-కో_స్తిమి-కోసింది-కోస్తుంది-కో_స్తది… ..

* ఎసింది ఏందిరా…
తీసింది ఏందిరా….
ఇర్సి కట్టేృసి(రి)…
ఏ_స్తరు-తీ_స్తరు,
ఆంబోతు రంకె వేస్తుంది…

స్వల్ప పరిణామాలతో ఇలాంటివే మరికొన్ని భేదాలు లభిస్తున్నాయి. ఇవేగాక 'చే_స్తరు, కో_స్తరు, చేతురు, కోతురు' అనే రూపాలు కూడా ఉన్నాయి.

**7-3-3 : టువర్ణాంత ధాతువులు :-** కొట్టు, పెట్టు, పుట్టు తదితర ధాతువులు పొడుపుకథల్లో పొందిన పరిణామాలెన్నో ఉన్నాయి.

కొట్టు > కొట్టె-కొృటి-కొ_ట్టివి-కొ_ట్టిరి- కొ_ట్టి- కొ_ట్టిని - కొ_ట్టిమి - కొ_ట్టది-కొడ్తుంది; పెట్టు > పెట్టె-పెృటి-పె_ట్టివి-పె_ట్టిరి-పె_ట్టి-పె_ట్టిని-పె_ట్టిమి-పె_ట్టది-పెడ్తుంది; పుట్టు > పుట్టె-పుృటి-పు_ట్టివి-పు_ట్టిరి-పు_ట్టి-పు_ట్టిని-పు_ట్టిమి-పు_ట్టది-పుడ్తుంది-పుట్టింది.

* గంగెద్దు పుట్టు గొట్టె…
తూరుపూన తుమ్మ పుట్టె…
తొలి గొట్టిరి…
నిట్టాడికి నీలగట్టి కొృటా…
పట్టుకుంటె గిచ్చి పెట్టె…

పరిశీలనలో ఇంకా కొన్ని మార్పులు కనిపించే అవకాశముంది. పెృటి-కొృటి-తిృటి వంటి రూపాలు కూడా ఉన్నాయి.

**7-3-4 : వు వర్ణాంత ధాతువులు :-** పోవు, మొదలైనవి 'వు' వర్ణాంత ధాతువులు. ఇవి పొడుపు కథల్లో తక్కువగానే ఉన్నాయి. పరిణామంలో మిగతావాటికేం తీసిపోవు.

* తొక్కిలే తొంబయి యామపవాకపె..
జింక దెంక పాయె...
చెరు వెండుక పాయె ..
కట్టమీన వొతుంటిరా ..
ఆడంగవోయేటోక్లైవరంచె ..
తీసక్కరా పో

పోవు > పోయె-పోయి-పోతివి-పోతిరి- పోతి- పోరిని - పోతిమి - పోతడ-పోయింది-పోతుంది... ఈ పోవు ధాతువు 'పోయె' అనే రూపంగా మారి, 'పాయె' అనే రూపాంతరం చెంది ఏ-వ గా మారి వాయె అని ఎక్కువగా వ్యవహారంలో వినిపిస్తుంది. పొడుపు కథల్లోనూ జానపద సాహిత్యంలోనూ ఈ రూపాలే ఎక్కువ. భూత భవిష్యద్వర్తమాన కాలాల్ని తెలుపుతూ ధాతువులీ విధంగా అనేక ఆకరాలాలెత్తినై.

**7-3-5 : ప-వ కారాది క్రియల లోపం :–** 'వ' లోప అచ్చంధి లాగానే, ప-వ కారాది ధాతువుల తొలి హల్లు లోపించి సంధి జరిగే ప్రయోగా లెన్నో పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి.

* కట్టి+వేస్తే >కట్టి+ఏస్తె >కట్టేస్తె
కొట్టి+వేస్రి> కొట్టి+ఏస్రి> కొట్టేస్రి
పేరు+పెట్టె > పేరు+ఏట్టె >పేరెట్టె
మూలకు+పడ్తది > మూలకు + అడ్తది > మూల కడ్తది
పాలికి+వచ్చింది > పాలికి + ఒచ్చింధి > పాలికొచ్చింది.

ఏస్రి, సూస్రి, ఆడ్తది, అచ్చింది, ఒచ్చింది, అంటడు (అన్నాడు)అన్రి, కొన్రి, తిన్రి, ఆడింన్రడు, పాడింన్రడు, దుంకింన్రడు, వచ్చింన్రడు, ఉసేస్రి, పారేస్రి, నూకె, నీల్గె, ముంచె, దంచె, పంచె, బలిసింన్రడు, పర్సింది, ఒడ్సింది, తినింది, బల్సింది... ఇలాంటి క్రియా ప్రయోగాల్లోని వైవిధ్యాల్ని ఇంకా సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించాల్సి ఉంది. ఈ క్రియల తర్వాత పొడుపు కథల్లోని కొన్ని విశేషణాల్ని పరిశీలిద్దాం.

## 11-8 : విశేషణాలు

విశేషించి అర్థాన్ని తెలిపేవి విశేషణాలు. ఇవి వస్తు స్వభావాన్ని తెలియజేస్తాయి. విశేష్య రూపాలు విశేషణా లవుతాయి క్రియల అర్థాల్ని విశేషించి తెలిపేవి క్రియా విశేషణా లనబడతాయి.

తెలుగు పొడుపుకథల్లో విశేషణాలకెంతో ప్రాధాన్యముంది. పొడుపుకథ ఏదో ఒక వస్తు స్వరూపాన్ని ఇంతలింతలు చేసి చెబుతుంది. ఈ స్వరూప స్వభావాలు వస్తువుకు సంబంధించి రంగు రుచి వాసన, తదితర ధర్మాల్ని తెలియజేసేవై ఉంటాయి ఈ యింతలింతలు చేసి చెప్పడంలో సామ్యం. సంతులనం, సాధర్మ్యం, సారూప్యం చింతాకంత అటునిటు అయ్యే ప్రమాదమూ ఉంది. ఉపమానాదులన్నీ విశేషణాల కిందికే వస్తాయి. స్థూలంగా వీటిని పూర్వపద విశేషణాలనీ ఉత్తర పద విశేషణాలనీ విభజించుకొంటే సరిపోతుంది.

**11-8-1: పూర్వపదాలు :-** విశేషణాలు పూర్వ పదాలుగా ఉన్నవన్నీ ఈ కోవలోకి వస్తాయి. జానపద సాహిత్యంలో కొన్ని విశేష్యాల్ని విశేషణాంశాలుగా విశేషణ సదృశాలుగా భావించాలి. ఈ కింది పూర్వపద విశేషణాల్లో కొన్నిటిని ఆ దృష్టితోనే చూడాలి

"ముత్తెమంత పోరడు, పచ్చని రవికది, బొట్ల బొట్ల కుండ, బుడ్డర ఖాను, పందిరెత్తు బట్ట, గడెత్తు లంజె, గంపెడంత సిగ, చెప్పంత కట్టోడు, ఆవగింజంత తొలి, తీపి పండు, గంపెడు నీళ్లు, పొట్టి ముండాకొడుకు, దమ్మిడి గుజ్జం. ఇనుపగట్టు, కాలెకాలె బండ, కట్టెద్దు, పచ్చని భవనం, తెల్లటి గదులు, నల్లటి రాజులు, వంకర తాటిచెట్టు, అరచేతంత పట్నం, నల్లని దొర, పచ్చటి పొగ, దోరావు, బూరావు, ములక్కాయంత పగడం, ఎలక్కాయంత బంగారం, చారచారలపాము, ఎఱ్ఱని ఆకు, చిత్తారాకు, కస్తూరాకు, కొత్త కుండ, పొత్తి పంచ, జానెడు ముండ, ఒళ్లంత కళ్లు, ఎఱ్ఱ బెరువు, వంకలొంకల పాము, నేల జోతికాయ, కొండంత లంజ, ముంతంత కొప్పు, పసుపు గుడ్డలు, గుప్పెడు పిశిక, చింపిరి గుడ్డలు, పగడాల వంటి బిడ్డలు, చీకు ముళ్లు, సింగారెడ్లు, పెద్ద గౌడీలు,

చెక్కమేడ, పింగాణి మేడ, మొట్టి కుండ, గుట్టంత సెట్టు, గుమ్మంత పూత, సాపంత ఆకు, పొడల పొడల గువ్వ, పొన్నారి గువ్వ, దండి పండితులు, తెల్లటి భూమి, నల్లటి ఇత్తనం, గమ్మ మిద్దె, కట్టె పిట్ట, ఎట్టి గొట్టె, డిబ్బికుట్టు, భోగ మాట, పెంట చావు, గొలుసుల బొమ్మ, సుట్లసుట్ల పాము, సురంగి పాము, కిట కిట తలుపులు, పసుపు చొక్క, ఎఱ్ఱతామెర, గరకు గరకు బండి, చిన్న పిపత కమ్మని కూర, నల్ల కిటకీలు, ఎల్ల పోలీసు, నల్లటోపి, ఎండి గజ్జెం, సిప్పెడు నీళ్లు. తేనెపూత, జిల్కరంత జివం, గంపెడు సెట్టు, ఎండి కిచ్చకాయ, సిరిపొన్న సెట్టు, గజ నిమ్మపండు, అధిక సక్కంది, బిల్ల కొప్పులు, బీడి రైకలు, సన్నని సెట్టు, జుంటితేనె, మూడు మూరల తోట, అరు మూరల కాయ, ఈలపీట, ఆవ గింజంత ఇత్తు, గుడ్డెలుగు, సన్న బియ్యం, పెద్ద బండ, ఎఱ్ఱెద్దు, వంకెద్దు, బింగి దయ్యం, వెండి సీల, బంగారు పువ్వు, సెరువంత గొంగడి. వేయికండ్లపులి. సిన తాంబాలం, కొనాగొమ్మ, నూకల బువ్వ, సిన సిన ఇండ్లు, సిత్రాలిండ్లు, ఎంద్రప కాయంత ఎన్నరావ, పిడికెడు సూదులు, లేకి పిట్ట, బెల్లపు కుండ, కావలి పిల్ల, పిండోలె ఎన్నెల, అచ్చం ఎన్నెల, పంటసేను, లకుముకు పిట్ట, నువ్వు గింజంత ఆకు• మోకాటి నీళ్ళు, లోతొడల సండ్లు, మోకాటి కండ్లు, మొలకొడ్ల బుప్ప మోదుగుల నీడ, అట్టల బంక, తొట్టల బెల్లం, సక్కటి మేడ, సరావుమేక, గొరు టిత్తనం, వెండిపిడి, అసువు లేని జీవరాశి, జలజల ముత్యం, వరాల తురాయి: ముత్యాల పాన్పు, సిరి పాదాలు, మొలలేని పెళ్ళాం, వయ్యారి మాను... "

**11-8-2 : ఉత్తర పదాలు :-** పొడుపు కథల్లో విశేషణ పూర్వపదాలు సహస్రాధికంగా కనిపిస్తాయి. ఉత్తర పదాలు మాత్రం కొన్నే ఉన్నాయి.

"చింతాకు పులుపు, కుందేలు పిల్ల, పూల బంతి, గుళ్లో నల్లగ, గుడెన్క తెల్లగ, రత్నాల కుప్ప, సీసకు రెండు రంగులు, నోరు ఎఱ్ఱగ, వరి పచ్చగ, సిల్క పచ్చన, మూతికి బంగారం, కడుపంతా తీపి, మసుగుల లొడుగు "

పూర్వోత్తర పదాలు విశేషణాలుగా ఉన్న వీటిలో చాలా పదాలు సమాసాల కోవలోకే వస్తాయి. "వన్నెకాడు, జానెకాడు, పొట్టివాడు, జుట్టువాడు, గడ్డపోడు, పిడికెడు ఘుమఘుమలు, నటంగి... " తదితర పదాలు కేవల విశేషణా

లనిపిస్తున్నాయి. అయితే ఇవి కూడా పదాలకు పూర్వోత్తరాలుగా నిలిచినప్పుడే పూర్ణార్థ స్ఫూర్తి కలుగుతుంది. మొత్తంమీద పొడుపు కథలు ఈ విశేషణాలన్నీ అలంకార సౌందర్యాన్ని సంతరించి పెట్టాయి.

పొడుపు కథల్లో విశేషణాలు కొంత ప్రత్యేకతను సంతరించుకొన్నట్లే ఔపవిభక్తికాలు కూడా కొంత వైవిధ్యంతో కనిపిస్తున్నాయి. అవి కూడా సంగ్రహంగా ప్రస్తావిస్తా.

## 11-9: ఔప విభక్తికాలు

తెలుగులో ఔప విభక్తికాలు బహుళాలిబహుళం. విభక్తి నిమిత్తమై వచ్చే "ఇటితి" వర్ణాలే ఔప విభక్తికాలు. తెలుగు పొడుపు కథల్లో కనిపించే కొన్ని ఔప విభక్తాలపై 'ల-ట'ల సంయుక్తాక్షరం కొన్ని మండలాల్లో వినిపిస్తున్నవి.

* ఇంట సుట్టు తిరిగి ఇం>ట్ల కూసునె (పిడచ)

* గూ>ట్ల మైసమ్మ మెరిగి మెరిగి సూసె (నిప్పు)

ఈ పొడుపు కథల్లోని 'ఇంట్ల - గూట్ల' అనే పదాల ఔప విభక్తికాలైన 'ఇంటి-గూటి'-కి 'లో' చేరి 'ఇంటిలో - గూటిలో' రూపాలు సిద్ధించాయి. ఉచ్చారణ వేగం కారణంగా 'ఇంట్ల - గూట్ల' అనే రూపాలు ఏర్పడ్డాయి ఈ కింవివన్నీ ఇలా ఏర్పడ్డ రూపాలే.

ఇల్లు > ఇంటి - ఇంటిలో - ఇంట్ల; గూడు > గూటి-గూటిలో- గూట్ల; అంగడి > అంగటి - అంగటిలో - అంగట్ల - అంగల్ల; తాడు > తాటి - తాటిలో - తాట్ల; తూటు> తూటి-తూటిలో- తూట్ల; మోకాలు > మోకాటి - మోకాటిలో - మోకాట్ల - మోకాల్ల; కాడు > కాటి-కాటిలో-కాట్ల, రోలు > రోటి-రోటిలో-రోట్ల; పన్ను > పంటి-పంటిలో-పంట్ల; రేగడి > రే(ర్యా)గటి-ర్యాగటిలో- ర్యాగట్ల - ర్యాగల్ల.

రూపసాధన ఎలా జరిగినా చివరివన్నీ పొడుపుకథల్లోని రూపాలే. "ఇంట్లకూసునె, గూట్ల మైసమ్మ, అంగట్ల(ల్ల) బుల్లోడు, మోకాట్ల(ల్ల)నొప్పి, తూట్ల సూసి, కాట్లకాత్తి, రోట్ల పోతేసి, పంట్ల ఇర్కిన పదారు పచ్చులు, ర్యాగట్ల (ల్ల)

మాఙట్ట్రె కొమ్ములాడిచ్చె...." ఇలాటి వైవిధ్య పూర్ణప్రయోగాలెన్నో కనిపిస్తు న్నాయి. వీటినిబట్టి 'ట్ల' కూడా ఔపవిభక్తిక సదృశంగానే భావించాల్సి ఉంటుంది ఇక పొడుపుకథల్లోని కొన్ని విలక్షణ ప్రయోగాల్ని పరిశీలిద్దాం.

## 11-10 : విలక్షణ ప్రయోగాలు

పొడుపుకథా వ్యవహర్తలైన జానపదుల వ్యవహారంలో కొన్నివిలక్షణ పదాలు వినిపిస్తున్నాయి. కొందరు వీటిని అలాక్షణికాలనో, అప్రామాణికాలనో అనవచ్చు. ఇవి జానపదుల వ్యవహారాలైనందువల్ల వీటిని లక్షణ గ్రంథాలతో పరిశీలించాల్సిన అవసరంలేదు. భాషా చారిత్రక సామాజిక దృష్టితోనే వీటిని పరిశోధించాలి. పొడుపుకథల్లో అలాంటి విలక్షణ ప్రయోగాల్లో కొన్నిటిని ప్రస్తా విస్తా.

"అందోసకాయ (అందంగా ఉన్న దోసకాయ), బొందోసకాయ (బొద్దు దోసకాయ), పొద్దు గింతల (ప్రొద్దు కుంకినవేళ), సేపిచ్చుకొంటి (చేయించు కొంటి), మోకాల్ల మంటి (మోకాలి బంటి), కొట్టాలా్న-తిట్టాలా్న (కొట్టవలెనా-తిట్టవలెనా, ఆడవాయె-ఈడవాయె (అక్కడికిపోయె-ఇక్కడికి పోయె), ఉసుకాన ఇల్లుగట్టి (ఇసుకలో ఇల్లుగట్టి, ఉసుకాన అనే శబ్దం ఉపరితలం అనే అర్థంలో జాన పదులు వ్యవహరిస్తున్నారు), సంపుర్తయినప్పుడు (సమర్తాడినప్పుడు),ఇడ్సికట్లోడు (విడిచిన కట్లున్నవాడు), రంబ్యాకు (రంపనిచ్చే ఆకు), పైనుంచి డం (పైనుంచి 'డం' అని పడింది), ఇలాపురెడ్డి (విలాయతి రెడ్డి), కీసు పిల్లలు (కీసుమనే పిల్లలు), కసిందాల (కసిదైన బాల), శర్నాట్కం (చెరుపు నాటకం), మింగాట్కం (మింగేటువంటి ఆట), గాడ గలగల-గీడ గలగల (అక్కడ గలగల- ఇక్కడ గలగల), పబ్బతి వర్తి (ప్రణామం పట్టితి), లటుపటు (ధ్వన్యనుకరణం)!.

ఇలాంటి ప్రయోగాలు కేవలం పొడుపుకథల్లోనే గాక జానపదుల పదా ల్లోనూ, పాటల్లోనూ కథల్లోనూ లభిస్తున్నాయి. ఇక కొన్ని మాండలికాల్ని పరి శీలిద్దాం

## 11-11 : మాండలికాలు

భాషాశాస్త్రవేత్తలు తెలుగుభాష మాటాడే ప్రాంతాన్ని నాలుగుభాగాలుగా విభజించారు. వీటిని భాషామండలాలుగా పిలిచారు.

"(1) పూర్వ మండలం (కళింగదేశం : శ్రీకాకుళ, విశాఖపట్టణం జిల్లాలు), (2) దక్షిణ మండలం (రాయలసీమ : నెల్లూరు, ప్రకాశం జిల్లాలు), (3) ఉత్తరమండలం (తెలంగాణా : మహబూబ్‌నగర్, ఖమ్మంజిల్లాల్లో కోస్తా రాయలసీమలను ఆనుకొన్న తాలూకాలు ఆయా భాషా మండలాల్లో కలుస్తాయి), (4) మధ్యమండలం (ఉభయ గోదావరులు, గుంటూరు, కృష్ణాజిల్లాలు)".[1]

ఈ భేదాల కెన్నో కారణాలున్నాయి. ఇవేగాక ఇంకా అంతర్గత భేదాలున్నాయి. పాలకులు, పాలితులు, చదువు, సంస్కారం, వృత్తి, ఉద్యోగం, అన్యభాషా సాహచర్యం; వలసలు, చారిత్రక, రాజకీయ-సామాజిక పరిస్థితులు ... ఇలా ఎన్నో కారణాలు భాషలో మాండలికాలు చోటు చేసుకోడానికి కారణా లవుతాయి. ఒకే మండలంలో రెండుమూడు మాండలికాలు కూడా ఉన్నాయి. వీటిని వలసవాదంతో పరిశీలించి ఆ పదాల్ని ఉపమాండలికాలకింద చేర్చవలసిఉంటుంది. మండలాల్లో ప్రసిద్ధంగా వ్యవహృతమవుతోన్న మాండలిక పదాలందరికీ అర్థమవుతాయి. ఒకపదం అర్థం వెంటనే స్ఫురించకపోయినా వాక్యాన్నిబట్టి ఆ పదం అర్థమేంటో తెలిసిపోయే అవకాశముంది.

'మోట' - అనే పదం కళింగ, తెలంగాణా, కోస్తాజిల్లాల్లో ఉపయోగిస్తారు. రాయలసీమలో 'కపిల' అంటారు. రాయలసీమలోని కర్నూలు జిల్లాలో మళ్ళీ 'మోట' మాటనే వ్యవహారంలో ఉంది. 'కాడి—కాడిమాను' అనే మాటలు కళింగలో తప్ప మిగతా అన్ని ప్రదేశాల్లో వాడుతున్నారు. కళింగ- కోస్తాజిల్లాల్లో "గోంగూర" వాడకంలో ఉంటే, రాయలసీమలో గోగాకు, తెలంగాణాలో "పుంటికూర" వాడకంలో ఉంది. కళింగలో "గునపం" వాడుకలో ఉంటే మిగతా అన్ని మండలాల్లో "గడ్డపార" వ్యవహారంలో ఉంది.

---

1. తెలుగుభాషా చరిత్ర, పు : 308.

పొడుపుకథల్లో కూడా మాండలికాలున్నాయి. కథానిర్మాణం అంతటా ఒకేవిధంగా ఉంది. పదాల్లో, క్రియల్లో భేదం కనిపిస్తుంది. పదాల వాడకాన్ని బట్టి ఒకచోటునుండి మరోచోటుకు వెళ్ళే అవకాశముంది. ప్రధానంగా క్రియల్లోనే భేదం కనిపిస్తుంది.

తెలంగాణాలో "తట్టు"గా, కోస్తాలో "పొడుపుకథ"గా రాయలసీమలో "మారుకథ"గా ప్రసిద్ధమైన ఈ మూడు మండలాల్లోని మూడు పొడుపుకథల్ని పరిశీలిద్దాం.

* అడవిల పుట్టె
  అడవిల పెరిగె
  ఊర్ల కొచ్చె
  శివా లూగె (చల్ల కవ్వం)

* అడవిలో పుట్టింది-అడవిలో పెరిగింది
  మా యింటి కొచ్చింది - మాయమ్మ మెచ్చింది
  తాడేసి కట్టింది - తైతక్కలాడింది
  కడవలో దూరింది - గట్టుమన్నాది
  పెరుగులో మునిగింది - వెన్నింత తెచ్చింది
  నాకింత పెట్టింది (కవ్వం)

* కొండలో పుట్టింది
  కొండలో పెరిగింది
  నట్టింటి కొచ్చింది
  నాట్యమాడింది (చల్లకవ్వం)

ఇవి వరుసగా తెలంగాణా, కోస్తా, రాయలసీమ మండలాలవి తెలంగాణా తట్టులో "పుట్టె, పెరిగె" అనే ఎకారంత క్రియలున్నాయి. బిందుపూర్వక "ది" కోస్తా పొడుపుకథలో, రాయలసీమ మారుకథలో కనిపిస్తున్నది. ఈ మూడింట ఉన్న పదాలు ఏమండలం వారికైనా అర్థమవుతాయి,

తెలంగాణాలో పొడుపుకథను తట్టు అంటారనీ, శాస్త్రం అంటారనీ రాయలసీమలో "మారుకత" అంటారనీ పొడుపుకథలే చెబుతున్నాయి. కోస్తాలో "మారుకత" అనే మాట ఉన్న పొడుపుకథ ఉంది

* శాస్త్రం సెన్నప - నేల గీరప్ప (పార)

* మారుతట్టు మల్లయ్య
ముద్దిదేకయ్య (హార)

* మారుతట్టు మల్లప్పనీ
ముద్దిగిల్లప్ప (గోకరకాయ, గోరుచిక్కుడు)

* తట్టుస మారు తట్టు - సీ
పక్కనున్నవేంది (సీత)

ఇవన్నీ తెలంగాణాలోని పల్లెల్లో కట్టుకొనేవి. ఈ కిందిది కోస్తాలో పొడుగుకొనేది.

* మారూకథా మంకెన్నా
మామామా కొంకెన్నా
మన్నాపస్తే కుంకెన్నా
నీకూ నాకూ లంకెన్నా (గొళ్ళెం)

పొడుపుకథ అనేమాట తెలుగు చలనచిత్ర గీతాల్లో బాగా వాడుకొన్నారు. "వేస్తాను పొడుపు కథవేస్తాను .., లవపిల్లే పొడుపుకథ పొడవాలి ..". కోస్తాలోని చాలా పదాలు ప్రామాణికాలై అంతటా వ్యవహృతమవుతున్నట్లే ఈ పొడుపుకథ పదంకూడా ప్రామాణికమై వ్యవహృతమవుతున్నది "తట్టు" తెలంగాణా మాండలికం కాగా, "మారుకథ" రాయలసీమ మాండలికం కాగా పొడుపుకథ అందరిదయ్యింది రాయలసీమ పొడుపుకథలోని "మారుకత" పదం చూడండి

* మారుకత మారుకత మంకెన్నా
మామ కొంకెన్నా
మళ్ళావస్తే కంచన్నా
నీక్కూ నాకూ లంకెన్నా (తలుపు గొళ్ళెం)

ఆయా మండలాల పొడుపుకథ ఒకేలా క్రియలు పట్టిస్తాయి. అయితే విన్నవారు క్రియలు మార్చి పలుకోవడంవల్ల పొడుపుకథ సార్వత్రికమయింది.

సాధారణంగా తెలంగాణా పొడుపుకథల పాదాంతాలు హ్రస్వాలుగా ఉంటాయి కోస్తా-రాయలసీమల పాదాంతాలు దీర్ఘాలుగా ఉంటాయి అన్నది-అనెంకు-అంది-అనెంద్రు- అనే రూపాలు తెలంగాణాలో వినిపిస్తాయి. "అన్నాది-అన్నారు-అన్నది-అనింది" తదితర రూపాలు కోస్తాలోనూ రాయలసీమలోనూ వినిపిస్తాయి.

* గింతంత పొట్టోనికి
పుట్టె దంగీలు (ఉల్లిగడ్డ) - తెలంగాణ

* పొట్టివాణ్ణి పాతేస్తే
జుట్టు మొలిచింది (ఉల్లిపాయ) - కోస్తా

* ఇంత పిల్లోడు
ఎగిరెగిరి దుమాలుగట్టె (పేలాలు)-రాయలసీమ

ఈ మూడు పొడుపుకథల్లోని "పొట్టోడు-పొట్టివాడు-పిల్లోడు" ఆయా మండలాలకు చెందిన పదాలైనా అంతటా ప్రయోగంలో ఉన్నాయి, అయితే "వాడు" అనేది ప్రామాణికం బుడ్డోడు, పిలగాడు, పిల్లోడు అనే పదాలు కూడా అంతటా ఉన్నాయి "ఇంత, ఇంతంత" అని కోస్తా రాయలసీమల్లో వినిపిస్తాయి. ఆయర్థం లోనే వాటితోపాటు "గింత, గింతంత. గిత్తంత" అనే పదాలు తెలంగాణాలో అక్కడక్కడ వాడుకలో ఉన్నాయి.

* గచ్చు మిద్దెకు "గసుమ" లేదు (కోడిగుడ్డు) తెలంగాణ

* చుట్టింటికి "బొక్క" లేదు (కోడిగుడ్డు) కోస్తా

కసువుకు రూపాంతరం "గసుమ". "బొక్క" అంటే రంధ్రం. తెలంగాణాలో "పొక్క" అంటారు. తెలంగాణాలో "బొక్క" అంటే ఎముక (బొమిక). ఇలా స్వల్పభేదాలు కనిపిస్తాయి. మనిషి శరీరాన్ని వర్ణించే పొడుపు కథలు మూడు ప్రాంతాల్లోనూ లభించాయి. ఆ మూడింటిని వరుసగా ఉదాహరిస్తా. (తెలంగాణా, కోస్తా, రాయలసీమ).

| | |
|---|---|
| * రెండు స్తంభాలు | (కాళ్ళు) |
| స్తంభాల నడుమ కుంభాలు | (పిఱ్ఱలు) |
| కుంభాలమీద కుడితొట్టె | (కడుపు) |
| కుడితొట్టెమీద గవ్వల గురిగి | (నోరు) |
| గవ్వల గురిగిమీద అద్దాలమూలు | (కండ్లు) |
| అద్దాలమాలమీద గరికపోసలు | (వెండ్రుకలు) |
| గరికపోసలమీద గాడిదలు పొర్లాడుతవి | (పేలు) |

| | |
|---|---|
| * అంభాలమీద కుంభాలు | (పిరుదులు) |
| కుంభాలమీద కుడిత్తొట్టి | (కడుపు) |
| కుడిత్తొట్టిమీద గుండ్రాయి | (తల) |
| గుండ్రాయిమీద కోరింతా | (తలచిప్ప) |
| కోరింతమీద ఆరిక అపురూ | (వెండ్రుకలు) |
| అవురుగడ్డిలో ఆవులువేలూ | (తలలోని పేలు) |

| | |
|---|---|
| * జోడు నిట్రాళ్ళు | (కాళ్ళు) |
| నిట్రాళ్ళమీద కుడితిగోలెం | (పొట్ట) |
| కుడితిగోలెంపై పొన్నకాయ | (తల) |
| పొన్నకాయమీద గరికపోచలు | (జుట్టు) |
| గరికపోచలపైన గాడిద పిల్లలు— | |
| నాట్యమాడుతున్నాయి | (పేలు) |

కాళ్ళకు ప్రతీకలుగా వేసిన స్తంభాలు, అంభాలు, నిట్రాళ్ళు గుడిసె నిర్మాణాని కుపయోగించే పరికరాలే. "కుంభాలు" రెండింటిలో కనిపిస్తున్న పదం. "కుడితొట్టె, కుడిత్తొట్టి, కుడితిగోలెం" కడుపుకొరకు వేసిన ప్రతీకలు. "గుండ్రాయి-పొన్నకాయ" కోస్తా రాయలసీమ పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి. "గరికపోసలు-ఆవుర గడ్డి-గరికపోచలు" మూడింటిలో వెండ్రుకలకు వేసినపదాలు. "గాడిదలు-ఆవులు-గాడిదపిల్లలు" పేలకు వేయబడ్డాయి. ఈ పై ఉదాహరణలవల్ల మూడు మండలాల్లోనూ పదసామ్యం, భావసామ్యం, కొట్టవచ్చినట్టు కనిపిస్తూనే ఉంది. తెలంగాణాలోని చాలా పదాల్లో చకారం సకారంగా ఉచ్చరించడం ప్రధా

నంగా వినిపిస్తోంది. ఈ మండలం పదాల్లోని చివరి అక్షరాలు దీర్ఘాలుగానో ప్లుతంగానో ఉచ్చరింపబడక హ్రస్వాలుగా మారడం సర్వసాధారణంగా కనిపిస్తుంది.

కళింగ మండలంతోపాటు ఈమూడు మండలాల్లోని భాషాసామ్యాన్ని, భాషావైవిధ్య వైభవాన్ని సమగ్రంగా పరిశీలించవచ్చు. సంజ్ఞల్ని, సర్వనామాల్ని, క్రియల్ని, విశేషణాల్ని, ఊనికల్ని ధ్వని పరిణామాల్ని ప్రత్యేకంగా పరిశీలిస్తే వైవిధ్యం తెలుస్తుంది. సరిహద్దు ప్రాంతాలవారి పొడుపుకథలో చేరే అన్య భారతీయ భాషల పదాల్ని ప్రత్యేకంగా చూపించే అవకాశముంది. అంతేగాక నాలుగు ప్రాంతాల్లోని గృహిణుల పొడుపుకథల్ని, రైతుల పొడుపుకథల్ని, ఉద్యోగుల పొడుపుకథల్ని, బాలబాలికల పొడుపుకథల్ని వేరువేరుగా పరిశీలించడం వల్ల మాండలికాల భేదసాదృశ్యాలు స్పష్టంగా తెలిసే అవకాశముంది. ఈ ప్రకరణాంశంలో ఇదంత పెద్ద విషయంగా మారిపోతుందని కేవలం స్థూలంగా పరిశీలించడమే జరిగింది.

సామాజిక కారణాలవల్ల, అధ్యయనానికి అనుకూల వాతావరణం ఉన్నందువల్ల, అభిరుచి ఆసక్తులవల్ల భాషాసౌందర్యాన్ని సౌకుమార్యాన్ని పొడుపుకథల్లో చొప్పించిన ప్రజలెందరో ఉన్నారు. అవన్నీ శిష్ట వ్యవహారాలు అనే అంశం కింద పరిశీలిద్దాం.

## 11-12 : శిష్ట వ్యవహారాలు

పొడుపు పద్యాలు వ్రాసినవారూ, పొడుపు గద్యాలు పలికినవారూ. భాషాజ్ఞానంతో వాటిని వల్లెవేసినవారూ, ఆ జ్ఞానంతో అలాంటివే చెప్పినవారూ ఈ కోవలోకి వస్తారు. వారిని శిష్టులనడం భాషా వ్యవహార దృష్టి వల్లనే అని భావించాలి. వారు వ్యవహరించిన పొడుపుకథలన్నీ ఈ కోవలోకే వస్తాయి. పత్రికల్లో అచ్చయిన వాటిలో కొన్ని, ఆకాశవాణిలో ప్రసారమైన వాటిలో కొన్ని, చలనచిత్ర గీతాలుగా రూపు దిద్దుకొన్నవన్నీ భాషాదృష్టితో శిష్టవ్యవహారాలుగా చెప్పవచ్చు.

అటువంటివాటిలో పొడుపు పద్యాల్ని మొదట చెప్పాలి. వాటిలో ఏర్చి కూర్చిన సమాసాలు కనిపిస్తున్నాయి.

"శిలవృక్షలతలు, శుద్ధకుల జాతి, శతపత్రంబులు, బేసి కన్నులు, హఠయోగ ముద్ర, దైత్యారి, దివాంబ్జములు, పూజాప్రసూన పటలంబు, భావజ్ఞ శేఖరుండు, రాజమదన కుబేరము, నాగకేసరములు, నారీలలామ, మత్తేభయాన, కుటిలకుంతల, చతురమతులార, సోమశేఖరు పేనపాములు, ఆకువృక్షంబు, వనజ సంభవుడు .. "

"ముద్దుల యువరాజు, ముత్తెపాలరాణి, మల్లెలగుచ్ఛం...." తదితర పదాలు జానపదుల్లోనూ వినిపిస్తున్నాయి. ఇలా పద్యాల్లోని పదాలే సౌందర్యపాద కాలు కాక, పాదాలకు పాదాలే సామెతలుగా, జాతీయాలుగా ముద్రపడ్డవి ఉన్నాయి; ముఖ్యంగా పదాలకూర్పు పటిమను పట్టి నిలుపుతుంది అవి కొన్ని మాద్దాం.

"విప్పగలర ముడిని విజ్ఞులార, ఉత్తరమున భానుబింబ ముదయం బాయెన్, ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్, గణిత మెరిగినట్టి కరణాల పిలిపించి, సభవారి నవ్వించు జాణ ఎవడు? నక్షత్రపీఠికి నాయకుడెవ్వడు, నరకా సురుని గన్న నాతి నామంబేమి? కైక బుద్ధి దెరచు కాంత నామంబేమి, గోపాల కృష్ణుండు గోట నెత్తినదేమి, ధర్మరాజెన్నూళ్ళు తనకు నడిగె, మొసలిచేతను చిక్కి మొరపెట్టినది ఏది, కొట్టలేక యశోద పట్టె నేమిటగట్టె, కాంత కన్నులకేమి కప్పుకెట్టు, హరి పవ్వళించిన ఆకువృక్షంబేమి, ఆననంబున కేమి అందమొప్పు, వాయువునకు మంచి వాహనంబేమిటి, పుడమీసురులకెల్ల కడుప్రేమ ఎయ్యది, వెనకయ్య వాహనమనగ నేది, పాకంబు రుచి పండు పాండవు పేరేమి, కొంపక హనుమంతు లంక ఏమిట గూల్చె, చింతచిగురునకును చెలగిన రుచిఏది ..."

సీసపద్యాల్లోని పూర్వోత్తరార్థ పాదాలు సమంగా విరిగి రాగాని కొదగడం పొడుపు పద్యాల్లో ప్రత్యేకంగా కనిపిస్తుంది ఎక్కడి కక్కడనే ప్రశ్న అడగవలసిన పద్యనిర్మాణ స్థితివల్లనే ఇది సాధ్యమయింది. ఆనిర్మాణమే పొడుపు పద్యానికి అందచందాన్ని అమర్చింది. అయితే ఈపద్యాలన్నీ శిష్టులకే పరిమితమై లేవు; జానపదులుకూడా ఇవన్నీ నోట పట్టుకొన్నారు.

పొడుపుకథల ప్రచుర ప్రచారంవల్ల కొన్ని వినూత్న పదబంధాలు కూడా ఏర్పడ్డాయి. అవి పద్యగద్యాల్లో ఉన్నాయి; వ్యవహారంలో ఉన్నాయి;

పత్రికల్లో అచ్చయినాయి; చలనచిత్ర గీతాల్లో వినిపిస్తున్నాయి: ఇవన్నీ భాషకు సౌందర్యాన్ని సమకూర్చాయి.

"చుక్కనాతి, టక్కుటెక్కు గొప్ప, రాజావారి తోటలో రోజాపూలు, కొమ్మ కొమ్మకు కోటి కోతులు, పెదవెల్లి పొప్పాయి, కుంకుం సెరిరింది, పదును లేని కత్తి, తలవాకిట రమియించుట, బాపలుపులు పదహారు. నాదీ ఓ ఐరువైన జన్మ, పండగ నెండినది, పటపటలాడె, మిసమిసలాడె, హృదయము నిర్కాశ నిలయము, లోనఉన్న లొసుగు, కొమ్మకొమ్మలందు కోటి తాయలు గావె,కలహంస కనిపించు కాసారం, మామకు మామయైన పరమాత్ముడు, ఈ ప్రౌఢ జాణ తనము, అంతరాళమున పూచిన పువ్వు, చూపనిదే చూపినాడు, వేల్పులందున తొలి వేలుపు, బాంకృష్ణుండాతు భంగిప, గిరిరాజనందిని గిత్త, ముంజేతి కందము, ముద్దుగ మెరిసేదేదీ, అంతగా మనసయ్యేదేదీ, అల్లాడిపోయానూ, బుల్లిపెట్టెలో ఉన్నాడు, పగడాల చక్రాల పచ్చనీ తేరు, ఇల్లు వాకిలి లేనివాడు, కప్పలేని ఒక కబోది, చిక్కితే మాత్రం దుమాదుమా, గలిబిలిచేయును,మరలు దిప్పనిది పరుగిడ లేదు, చిలుకల్లు పెంచిన చినది, కలకల కింకిల విలవిల...."

శిష్టుల పొడుపుకథల్లోని వాక్య సౌందర్యానికి, పదసౌభాగ్యానికి ప్రధాన కారకులు చేయి దిరిగిన మహాకవులే. సమస్యలుగా చాటువులుగా చలామణిలో ఉన్న కొన్ని పద్యాలకు తప్ప అనేక పద్య ప్రహేళికలకు కర్తలెవ్వరో తెలియదు. వారెందుకు తమపేర్లు చెప్పుకొనలేరో తెలియదు. ఇప్పుడు వాటికి కర్తలెవ్వరని ఎవరిని అడగాలి! వారెందుకు తమపేరు చెప్పుకోలేదంటే ఎవరేం సమాధానం చెబుతారు! 'దీని భావమేమి తిరుమలేశ'! అని పొడుచుకోవాల్సిందే తప్ప మరో మార్గం లేదు! అయినా ఆ అజ్ఞాతకర్తలు భాషాసౌధాన్ని నిర్మించి అక్షరాలై పోయారు.

భాషావైభవమనే ఈ ప్రకరణం చివర పొడుపుకథల్లోని కొన్ని అన్య దేశ్యాల్ని ప్రస్తావిస్తా. పొడుపుకథను పూర్తిగా కాక కేవలం ఆ పదాంశాలున్న భాగాన్నే ఉదాహరిస్తా.

## 11-13 : అన్య దేశ్యాలు

ప్రతిభాషలో అన్యదేశ్యాలుంటాయి; అవి ప్రవేశించడానికి అనేక కారణాలుంటాయి. భాషా విస్తరణ వాదం, సామ్రాజ్య విస్తరణ వాదం ప్రధానకారణాలు కాగా అన్యదేశ్యాలు చోటు చేసుకొంటాయి. సాంస్కృతిక వ్యాపార సంబంధాలైన అంశాలు కూడా ఈ పదాల ప్రవేశానికి దోహదం చేస్తాయి.

తెలుగు పొడుపుకథల్లో ప్రవేశించిన అన్యదేశ్య పదాల్ని బట్టి ఆ పొడుపుకథలన్నీ ఆధునిక యుగానికి చెందినవనే అనిపిస్తాయి ఇంగ్లీషు, ఫ్రెంచి, పార్సీ, అరబ్బీ, ఉర్దూ పదాలు తెలుగుభాషలో అన్యదేశ్యాలుగా స్థిరపడ్డాయి. అయితే ఆధునిక యుగానికి చెందిన కొన్ని పొడుపుకథల్లో కనిపించే ఈ పదాలు ఇప్పటివే; అయినా, ప్రాచీనాంధ్ర శబ్దాల స్థానంలో ఈ కొత్తశబ్దాలు చేరాయని భావించడానికి అవకాశముంది 'పొయిలోకి జాప్' అనే పదాల్లో మొదట 'పొయిలోకి పో' అనే రూపమే ఉందనిపిస్తుంది. ఉర్దూ పెత్తనం కారణంగా 'పో'ను పోగొట్టి జాప్ చేరింది. పాలకుల భాషా సంప్రదాయాలు పాలితులమీద బలవంతంగా రుద్దిన మత విస్తార జాతులు చరిత్రలో కనిపిస్తూనే ఉన్నాయి. ఇది ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అంశం. ప్రస్తుతం కొన్ని అన్యదేశ్యాలు చూపిస్తా

"దర్వాజ దర్వాజకు పోలీసు, ఏకాన కొల్లడు, ఒక కరెంట్ ట్రయిన్ వెనుక పోతోంది, ఆ రైలుపొగ, రైలుస్టేషన్ నొక్కొంటికి, మందిరందగ్గరి ప్యూను, రూపాయల్లో బయల్దేరి, గచ్చుమిద్దె, కసీరులకు పోతె పసందు షసందు, కంచు కడీల్-పూల చడీల్, ఏకేక్ కానా - పచ్చీస్‌కానా, గులాబి కాన, ఫిరంగితోట్ల-ఫిరంగిపిట్ట, బుడ్డరఖాను, పైస వాపసు, ఇలాయి బంచిపువ్వు, ఇలాతిరెడ్డి, పొయి లోకి జాప్, దూంతడాఖ, బుడ్డజవాను, బజారు, సిన్నబీబమ్మ - పెద్ద బీబమ్మ, ఇమాం బీబమ్మ, చార్‌కమాన్‌కట్టి, చార్మినార్ గుట్ట, చురకోల్లు, అమీన్‌సాబ్, దుప్పం, తోలు తుపాకి, పాపోసుతోటకొద్దే, పెన్సిల్లుఖాను, అద్భుతమైన సిటి. ఒక సినిమా .."

* లటుపటు సట్‌గం
తీన్ ముండి దస్‌పాంవ్ (మోట)

(లటుపటు అనే శబ్దంతో మొత్తం
మూడు తలలు పది పాదాలు)

మోటగొట్టేప్పుడు వచ్చే ధ్వనీ, రెండెద్దులూ మనిషి తలల్నీ, పాదాల్నీ ఈ పొడుపుకథ సూచిస్తోంది. తెలంగాణా పొడుపుకథల్లోనే ఎక్కువగా ఉర్దూ పదాలున్నాయి. ఆ మండలం ప్రజల్లో కల్సిపోయిన పదాలైనందువల్ల అవి వాళ్ళకి వెంటనే అర్థమవుతాయి. అన్యదేశ్యాలవల్ల భాషలో వినూత్న శబ్దాలు చోటు చేసుకొంటాయి. ఆ పదాలు భాషా వికాసానికి దోహదం చేస్తాయి. భావాలమధ్య సాన్నిహిత్యాన్ని సమకూరుస్తాయి.

మొత్తంమీద తెలుగు పొడుపుకథలు తెలుగు భాషా సరస్వతికి అర్థవైభవాన్నీ, పదలాస్యాన్ని, శబ్ద సౌందర్యాన్నీ, నానుడుల జీవనాడుల్నీ, పదబంధాల్నీ-జాతీయాల్నీ ఆభరణాలుగా అలంకరించాయి. ఈ ప్రకరణ ప్రారంభంలో ఈ అంశాల్ని ప్రస్తావించి పొడుపుకథల్లోని వృత్తి గ్రామ సంజ్ఞానామాల్ని చూపించాను సంధుల్లోని వైవిధ్యాన్ని సంకలించాను ధ్వనుల మార్పుల్ని వివరించాను ఆయా పదాల ప్రాశస్త్యాన్ని విశ్లేషించాను. విశేషణాలు, సోపవిభక్తికాలు, విలక్షణ ప్రయోగాలు, మాండలికాలు, శిష్ట వ్యావహారికాలు, అన్యదేశ్యాలు స్థూలంగా ప్రస్తావించాను తెలుగు భాషా వైభవానికి, తెలుగు పొడుపుకథ చేసిన యోగదానాన్ని అద్దంలో చూపించే ప్రయత్నమే ఈ ప్రకరణం చేసింది; చేయాల్సింది ఇంకా ఎంతో ఉంది.



# వివిధ భాషలు

**12-0 :** భావ ప్రసారానికి భాషే మాధ్యమం. భాషే మనిషిని జంతువులనుండి వేరు పరుస్తున్నది. ప్రపంచంలో ఎన్నో భాషలున్నాయి. ఈ భాషల మధ్య పోలికలున్నాయి; ఒకదానిమీద మరొకదాని ప్రభావం ఉంది. ఈ ప్రభావానికి అనేక సాంస్కృతిక చారిత్రక రాజకీయ కారణాలున్నాయి. అందువల్ల అనేక విషయాల్లో సాదృశ్యం కనిపిస్తున్నది. మానవ మనస్తత్వంలోఉన్న సాదృశ్యమే సాహిత్యంలో ప్రతిబింబిస్తుంది. పొడుపుకథల్ని ఈదృష్టితోనే పరిశీలించాలి.

తెలుగు పొడుపుకథల్లోని పద్యాలపై సంస్కృత ప్రహేళికల ప్రభావం నిండుగా-దండిగా ఉంది. భారతీయ భాషలకు సంస్కృతం తల్లి. ఆ తల్లికి బిడ్డలా పొడుపు పద్యముంది. కన్నడ తమిళ-మలయాళాది భాషల ఛాయలు తెలుగు పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి. అట్లే హిందీ, ఉర్దూ, ఆంగ్లభాషల ఛాయలూ పోలికలూ తెలుగు పొడుపుకథల్లో ఉన్నాయి. ఈ భాషలతో తెలుగువాని కొన్ని పొడుపుకథల్ని పోల్చి చూడడమే ఈ ప్రకరణం ఉద్దేశం.

## 12-1 : సంస్కృతం

సంస్కృతంలో పొడుపుకథల్ని ప్రహేళికలనీ ప్రవహ్లికలనీ పిలుస్తారు. ప్రశ్న, ప్రత్యుత్తరకూట, బ్రహ్మోదయ, వివాద, సమస్యాగూఢ, హృదయమాలికా అనే పర్యాయపదాలూ ఉన్నాయి. ప్రాచీనకాలంనాటి వైదిక సంస్కృతంలో లౌకిక సంస్కృతంలో పొడుపుకథల ఛాయలేవిధంగా ఉన్నాయో వివరిస్తూ ఈ సిద్ధాంత గ్రంథ ప్రారంభంలోనే చర్చించడం జరిగింది. ఇప్పుడు ప్రభావదృష్టితో పరిశీలన కొనసాగిస్తాను.

* అశ్వశాలచకాప్రోక్తా - రోగార్తశ్చ బ్రవీతికిం ।
ఆంధ్ర గీర్వాణ భాషాభ్యాం -ఏకమేవోత్తరం వద॥[1]
(మందురా)

ఏది అశ్వశాల అని పిలువబడుతోంది! రోగార్తుడేమంటాడు? ఆంధ్ర గీర్వాణభాషకు సరిపోయే ఒకే సమాధానం చెప్పాలి. సమాధానం:మందురా.

సంస్కృతభాషా పాండిత్యమున్న తెలుగువాడీ శ్లోక నిర్మాత. దీనివల్ల సంస్కృతాంధ్రాల సాన్నిహిత్యం తెలుస్తున్నది. సంస్కృతంలో తెలుగ పదం కుదురుకొనిపోయే స్థితికూడా అర్థమవుతున్నది.

* నాదాని పాపం నాకేన యేమేనా మనపింగతే ।
తేషామితి రమానాథో భాషే మధురాంగిరమ్॥[2]

ఇందులో నాకేన, యేమేనా, మన అనే పదాలు తెలుగువే అనిపిస్తాయి. కాని 'నాకేన'కు దేవేంద్రా అనీ, 'యే' అంటే ఏమనుజులనీ, 'మే నామ' అంటే నా పేరు అనీ అర్థాలు ... "ఓ దేవేంద్రా ! ఏ మనుషులు నాపేరు నెరుగరో వారి పాపాన్ని తొలగించను, అని రమానాధుడు తీయనిమాట పలికాడు!"

* చేతులే గోతులే బాలే - కాకులే వానముక్కులే ।
రుచిం పశ్యామి సుశ్యామే - కచానాం తవమంజులామ్॥[3]

"ఓ బాలా! లక్ష్మి (చతులే), సరస్వతీ (గోతులే) సమానురాలవూ; యౌవనవతివీ అయిన నీవెంట్రుకలు సుందరమైన కాంతిని, జలదమాల (వాన ముక్కులే) లోనూ, కాకుల్లోనూ (కాకులేచ) చూస్తున్నాను. ఇందులోని చేతులే, గోతులే, కాకులే, వానముక్కులే అన్నవి అచ్చంగా తెలుగుపదాలే అనిపిస్తాయి ప్రహేళికాకర్త సంస్కృతాంధ్రాల్లోనూ నిష్ణాతుడై ఉండాలి.

అంతేగాక విడుపు తెలుగులో ఉండి, సంస్కృతంలో పొడవడంవింతగా - విశేషంగా ధ్వనిస్తుంది. ఈ పద్ధతి కూడా సంస్కృతాంధ్రాల ప్రగాఢ సంబంధాన్నే అభివ్యక్తీకరిస్తుంది. (ఇది ప్రజలనోట విన్నదే).

---

1. పొడుపుకథలు, పు : 86
2, 3 : ప్రహేళికలు, ప్ర, పుటలు : 103, 104.

* చింతపత్రం సమంవస్తుః - చతురాక్షర సంయుతం ।
అకారాది యికారాంత్యం - కిం వస్తుః? పండితోత్తమః ॥

పండితోత్తములారా ! అది చింతాకుతో సమానంగా ఉండే వస్తువు; నాలుగక్షరాలుండేవి; అకారాదితో యికారాంతంతో ముగిసేది. ఇంతకూ ఆవస్తువేది! జనవ్యవహారంలోని ఈశ్లోకం తెలుగుపై సంస్కృత ప్రభావాన్ని అంచనా వేయడానికి అవకాశమిస్తున్నది.

తెలుగు పొడుపుకథల్లోకి సంస్కృతంనుండి వచ్చిన వాటిలో యథాతథానువాదాలున్నాయి; ఛాయానువాదాలున్నాయి; అనుసరణాలున్నాయి.ఈదృష్టితో వీటిని పరిశీలిద్దాం.

**1-1 : అనువాదాలు :-** తెలుగు పొడుపు పద్య నిర్మాతల్లో కొంత మంది సంస్కృత ప్రహేళికల్ని అధ్యయనం చేశారు అలాంటివి తెలుగులో ఉండాలనుకొన్నారు. కొందరు మక్కికి మక్కి తెలుగు చేశారు. మరికొందరు ఛాయను పట్టుకొన్నారు; ఇంకా కొందరు అనుసరిస్తూనే మూలానికి మెరుగులద్దారు. అనువాదంలో ఎప్పుడూ కొత్తపుంతలు తొక్కేవారూ, ఒడిగొట్టేవారూ ఉంటునే ఉంటారు అందుకే అనువాదం కత్తిమీది సాము" అంటారు

* చతుర్ధజః పంచమగః - దృష్ట్వా ప్రథమ సంభవామ్
తృతీయం తత్ర నిక్షిప్య - ద్వితీయ మతరత్ పునః ॥[1]

ఈశ్లోకంలో సంఖ్యాక్రమంలో పంచభూతాల్ని తెలియజేస్తూ సుందర కాండార్థం నిక్షిప్తం చేయబడింది పృథ్వ్యప్తేజోవాయ్వాకాశాలు పంచభూతాలు "నాల్గవభూతమైన వాయువువల్ల పుట్టినవాడు హనుమంతుడు (చతుర్థజః), ఐదవ భూతం ఆకాశం, ఆ ఆకాశ (పంచమగః) మార్గంలో వెళ్ళాడు ప్రథమభూతమైన మట్టిలో పుట్టిన సీతమ్మను చూశాడు (దృష్ట్వా ప్రథమ సంభవామ్ ; మూడవ తేజోభూతం అంటే అగ్నిని ఉంచి (తృతీయం నిక్షిప్య). ద్వితీయమైన అప్పును

---

1, ప్రహేళికలు ప్ర, పు 9.

అంటే సముద్రాన్ని దాటేశాడు (ద్వితీయ మత్‌రత్ పునః)" ... జనవ్యవహారంతో ఈశ్లోకానికో తెలుగుపద్యం వినిపిస్తున్నది.

* అంచిత చతుర్థజాతుడు
పంచమ మార్గమున బోయి. ప్రథమ తనూజం
గాంచియు, నచట తృతీయం
బుంచి ద్వితీయంబు దాటి పొందెను రాజున్.

అనువాదం చేయిదిరిగిన పండితులదే; అది జనంనోట పట్టుకొన్నది. 'పొందెను రాజున్' అనేది అదనంగా ఉంది. ఈ పద్యంలో ఆంజనేయుడే కర్త. శ్రీరాముడే కర్తఅయిన ఈకింది పద్యం చూడండి.

* ప్రథముని పట్టికై చలముపట్టి చతుర్థునిపట్టి చెట్ట బ
ట్టి ధృతిదలిర్ప నేర్పున ద్వితీయుని గట్టిపెట్టి యా
ప్రథనమునన్ తృతీయు బలుబాసటచే నరిగొట్టి నట్టి యా
యధిపుడు పంచమున్ గడచు నచ్చపు గీర్తిని మీకొసంగుతన్[1].

"శ్రీరాముడు సీతాన్వేషణంలో హనుమంతుని సాహాయ్యాన్ని పొందాడు; సాగరాన్ని బంధించాడు; విభీషణునివల్ల రావణుని గర్భంలో ఉన్న అమృత కలశాన్ని తెలుసుకొన్నాడు; ఆగ్నేయాస్త్రంతో దానిని ఛేదించి రావణ సంహారం చేశాడు. అలాంటి రాముడు మీకు ఆకాశాన్ని మించే మంచి కీర్తిని ఇవ్వాలి!" .... ఇలా రామాయణ రమణీయార్థాన్నే పొడుపుకథల్లో పొదిగిన తెలుగువారికి అన్యార్థాలు నల్లేరుపై బండినడకలా సాగాయి.

* వృక్షాగ్రవాసీ నచపక్షిరాజః
చర్మాంగధారీ నచ సోమయాజీ-x-
త్రినేత్రధారీ నచశూలపాణి.
జలంచ బిభ్రన్న ఘటో నమేఘః

---

1. ప్రహేళికలు, ప్ర, పు: 10
-x- త్వగ్వస్త్రధారీ నచసిద్ధయోగీ

—చెట్టుచివర్లో ఉంటుందిగాని పక్షిరాజు కాదు. చర్మాంబరధారి కాని సిద్ధయోగికాదు. మూడు కనులుంటాయిగాని శివుడుకాదు. నీటని ధరిస్తుంది కుండ కాదు-మేఘంకాదు... ఇన్ని ఉండి అన్ని కానిది ఏమిటది? అది కొబ్బరికాయ. ఈ శ్లోకానికి మూడు నాలుగు అనువాదాలు లభిస్తున్నాయి,

* కనులు మూడు కలవు కాదు త్రినేత్రుండు
పక్షిగాదు చెట్టుపైన నుండు
జలము దాల్చియుండు నలమేఘుడును గాదు.[1]

* మూడు కన్నులుండు ముక్కంటియూ కాదు
గడ్డమలరు, మౌనిగాదు జూడ
వలసినపుడు మనకు విలిచిన దొరకును.[2]

* మూడుకన్నులుండు ముక్కేశ్వరుడు గాదు
చెట్టుమీదనుండు పిట్టగాదు
నీరులోన నున్న నీరు కాకియుగాదు.[3]

* నీరులోపల నుండు నీరు కాకియుగాదు
వృక్షమున వసించు పక్షిగాదు
కనులు మూడునుండు కాలకంఠుడుగాదు [4]

'దీనిభావమేమి తిరుమలేశ' మకుటంతో లభించిన ఈ నాల్గు పద్యాలు పద్యరచన తెలిసిన వారు చెప్పినవే. అందులోని మొదటి పద్యం మూలానికి సన్నిహితంగా ఉంది. రెండో పద్యంలోని 'వలసినపుడు మనకు విలిచిన దొరకును' అనే పాదం, 3, 4 పద్యాల్లోని చతుర్థ, ప్రథమపాదాలు మూలాన్ని అతిక్రమించాయి. పద్యరచన తెలిసినవారు తొక్కిన పుంతలిట్లుండగా ఇవి తెలియని జానపదులు స్వతంత్ర పద్ధతులనుసరించారు. వాటిలో కొన్నిటని చూడండి.

---

1. పొడుపుకథలు, పు: 0
2 తిరుమలేశ శతకము, పద్యం : 2
3, 4 : హిందూపురం మండలంలో సేకరణ జులై: 1977

* చెక్కని స్తంభం - చేతికందదూ
చెయ్యని కుండా - పొయ్యని నీళ్లా
వెయ్యని సున్నం - తియ్యంగా (కొబ్బరికాయ)

* రాచవారికీ నచ్చేచిన్నదీ
రాజ్యాలల్లా మెచ్చేనన్నదీ
బంగారు వారింటి కోడలూ
పట్టుమంటే రాదు బేడలూ
చేంతాడుతో తోడకుండా
చెంబుతో ముంచకుండా
నీటుగాను కుల్కుతున్నదీ
నీళ్లు తెస్తా నంటు ఉన్నదీ ,,

* సూర్యుడు చూడని మడుగు
చాకలి తాకని గంగ ,,

* ఆకాశంబులో చెంబు
చెంబులోన అంబు
అందులోన బుక్కెడు నీళ్లు. ,,

* చుట్టు ముట్టుకంప - కంపల పెంక
పెంకల శంఖు - శంఖులో తీర్థం ,,

* నిటారు నిలువులు - పటాసు బయల్లు
మజ్జిగ ముంతలు - మాణిక్యాలు
గుళ్లనీళ్లు - గుడిచుట్టు కప్పు. ,,

జానపదుని ఆలోచనాశక్తి, మౌలిక సృజనశక్తి ఈ పొడుపు కథల్లో స్పష్టంగా కనిపిస్తుంది. 'సూర్యుడు చూడని మడుగు - చాకలి తాకని గంగ' అనే పొడుపు కథలో మహాకావ్య లక్షణాలు భాసించి వాక్యం రసాత్మకం కావ్యమనే మాటకు బలం చేకూరుస్తున్నది. అనువాదానికి ఒదిగిన మరో ప్రహేళిక.

* అస్తి నాస్తి శిరోనాస్తి - బాహురస్తి నిరంగుళిః।
నాస్తి పాద ద్వయం గాఢం- అంగమాలింగతి స్వయమ్॥[1] (చాటు)

ఎముకలేదు: తలలేదు; చేతులుంటాయిగాని వ్రేళ్లుండవు. పాదాలుకూడా లేవు; అయితే శరీరాన్ని ఆలింగనం చేసుకొంటుంది

* కరయుగంబు గలదు చరణంబులాలేవు
కడుపు వీపు నడుము మెడయు గలవు
శిరము లేదుగాని నరుల బట్టుక్రమింగి
సుఖముగూర్చు దీని సొగసు గనుడి[2]

'బాహురస్తి', 'నాస్తి పాదద్వయమ్' అనే మాటలు 'కరయుగంబు గలదు చరణంబులా లేవు' అనే పాదంగా రూపొందినై 'శిరోనాస్తి, అంగమాలింగతి' అనే పాదాలు 'శిరము లేదుగాని నరుల బట్టుక్రమింగి సుఖముగూర్చు' అనే రీతిగా రూపు దిద్దుకొన్నాయి 'కడుపు వీపు నడుము మెడయు గలవు' అనే పాదం సంపూర్ణంగా పొడుపు పద్య రచయిత సృష్టే. వచనంలోని ఈ కింది పొడుపు కథలు సంస్కృత ప్రహేళికను అనుసరించాయి.

* మెడ ఉంది కాని తల లేదు
చేతులున్నాయి గాని వేళ్లులేవు - ఏమిటది!
* మామ కొడుక్కి తలలేదు - కాళ్లులేవు

ఇవి పూర్ణానువాదాలే; అయితే ప్రజల నోళ్లల్లో కొన్ని మాటలు జారి పోయినై. ఛందస్సులో బంధించిన పదాలుజారకుండా ఉంటై వచనంలోని పదాలు మౌఖిక వ్యవహారంలో జారిపోతై. ఈ కింది మూలానువాదాన్ని పరిశీలిస్తే ఈ విషయం తేటతెల్ల మవుతుంది.

---

1 ప్రహేళికలు, ప్ర, పు: 1
2. ప్రహేళికలు అనుసంహిత, పు: 14

* దివాంధోనా ప్యులూకస్యాత్ - అథశ్శీర్షః నతాపసః
ఫలభక్షీ నదీక్షావాన్ - యోజానాతి సపండితః॥[1]
(ఋషిపక్షి)

పగలు గ్రుడ్డిగా ఉంటుంది గాని గుడ్లగూబ గాదు. తల కిందుగా ఉంటుంది గాని తపసి గాదు. ఫలభక్షణ చేస్తుందిగాని వ్రతధారి కాదు. ఇది తెలిసిన వాడే పండితుడు,

* గ్రుడ్డివాడుగాను పగలు గుడ్లగూబయుగాదు
తలను వ్రేలవేయు తపసికాదు
ఫలము లారగించు పరమవ్రతుడుగాదు.
దీని భావమేమి తిరుమలేశ![2]

మరొకటి చూద్దాం; ఇదికూడా యథాతథానువాదమే.

* చతుర్ముఖో నచబ్రహ్మా — వృషారూఢో నశంకరః
నిర్జీవీచ నిరాహారీ - అజస్రంధా న్యభక్షకః॥[3]
(ఎద్దుమోసే గోనె)

* ఎద్దునెక్కి తిరుగు నీశ్వరుండును గాదు
నలు మొగములు గలుగు నలువగాదు
గర్భయుగము నెగడి కదుమ్రింగు ధాన్యంబు
దీని భావమేమి తిరుమలేశ ![4]

అనువాదంలో చిన్న చిన్న మార్పులూ చేర్పులూ ఉండటం సహజం. అయితే ఈ మార్పులూ చేర్పులూ మూలానికి వన్నె తేవాలి గాని మాసుచేయరాదు. కవితా శిల్ప మర్మాల్ని తెలిసిన వారి చేతిలో రచన పడ్డప్పుడే మూలానికి వన్నె వస్తుంది. మూలాన్ని అనుసరించే ఛాయానువాదాలే తెలుగు పొడుపుకథల్లో ఎక్కువగా కనిపిస్తున్నాయి

---

1. ప్రహేళికలు - ప్ర. పు: 11
2,4. తిరుమలేశ శతకము, ప: 14,17.
3. ప్రహేళికలు, ప్ర, పు: 1

## 1-2 చాయలు :

* వనేజాతావనేత్యక్తా - వనే తిష్ఠతి నిత్యశః।
పణ్యస్త్రీ నతు సావేశ్యా - యోజానాతి సపండితః॥[1]

-వనంలో (నీటిలో - అరణ్యంలో) పుడుతుంది. వనంలో విడువబడు తుంది. వనంలోనే ఉంటుంది. వెలయిచ్చి అనుభవిస్తారు గాని వేశ్య గాదు. ఇదేంటో తెలిసిన వాడే పండితుడు. ... నిజమే; ఓడకు సంబంధించిన కఱ్ఱ అరణ్యంలోనే పుడుతుంది. దానిని నీటిలోనే విడుస్తారు. అది నీటనే నిలిచి ఉంటుంది. వెలయిచ్చి దీన్ని ఉపయోగించుకొంటారు.

* నేలమీద నడువ జాలదు నీళ్లలో
పరుగులెత్తుచుండు వడిగ వడిగ
మొసలికాదు; మత్స్యమున్ కాదు చూడగా
దీని భావమేమి తిరుమలేశ!

'వనేత్యక్తా' అనేది 'నీళ్లలో పరుగులెత్తుచుండు వడిగ వడిగ' అని పూర్చబడింది. మిగిలిన దంతా తెలుగు హొడుపు పద్యకర్త సృష్టే. అందువల్ల ఇది సంస్కృతాన్ని ఛాయా మాత్రంగా అనుసరించిందనే చెప్పాలి. వచన ప్రహేళికల్లోకూడా ఒకటి రెండిలాంటివి ఉన్నాయి.

* నీటిపై పోవుచుండును గాని
నీడ మాత్రం అనదు
కనబడదు ఇదేమి.

* అపదో దూరగామీచ - సాక్షరోనచ పండితః।
అముఖః స్ఫుట వక్తాచ. యోజానాతి సపండితః॥
(జాబు - కార్డు)

పాదాలు లేకున్నా దూరంగా పోతాడు అక్షర సహితుడు కాని పండి తుడు కాడు. ముఖంలేని వాడు కాని స్పష్టంగా బోధించేవాడు. ఇది తెలిసిన వాడే పండితుడు.

---

1. ప్రహేళికలు, ప్ర, పు: 1.

* తోకలేని పిట్ట తొంబై ఆమడపోతది.

'ఉపదో దూరగామీచ' కు ఇది అనువాదం గాకున్నా ఆ ఛాయ లున్నాయి. పావురం పిట్టనాటి ఉత్తరం పిట్టే. ఇవాళ తోకలేని, పాదాలులేని 'కార్డు' ఎంత దూరమైనా పోతున్నది. హిందువుల పూర్వ సంప్రదాయాల్ని ధ్వనింప జేసేశక్తి తెలుగు పొడుపు కథకుంది.

* కాశికి పోతది - గయాకు పోతది
గంపెడు పిల్లకు జీవిడుస్తది

'కాశికి పోతది - గయాకు పోతది అనడం 'అపదో దూరాగామీచ' ఛాయయే. ఈ కింది పొడుపుకథ ఉత్తరాలను చుట్టిపంపే పూర్వకాలపు పద్ధతిని తెలుపుతున్నది.

* సుట్ల పొట్ల కాయ - సూసిరాపొట్లకాయ
మళ్ళిరా పొట్లకాయి - మాటవే పొట్లకాయ

* అనేక సుషిరం వాద్యం - కాంతంచ ఋషి సంజ్ఞితం ।
చక్రిణాచ సదారాధ్యం - యోజానాతిసపండితః ।[1]

అనేక రంధ్రాలున్నది; వాద్యం, సుందరమైంది; ఋషి పేరున్నది, చక్రిచేత (పాముచేత) ఎప్పుడూ ఆరాధింప బడేది; అది తెలిసినవాడే పండితుడు. వాద్యమంటే 'వా' ఆదిలో ఉన్నదనీ, కాంతంచ అంటే "క' కారం చివర ఉన్నది అని అర్థాలు

* ఎజ్జి గొజ్జెకు ఎనబై తూట్లు
(ఎజ్జిటి గొజ్జెకు ఎయ్యితూట్లు)
* సూనె గురిగికి నూటొక్క సిల్లి

అనేకసుషిరం' అనే పదానికి మాత్రమే ఇది ఛాయలనాలి మిగిలిన విషయం తెలుగు పొడుపుల్లోలేదు

---

1. పొడుపుకథలు, పు: 81

* ఏకచక్షుర్న కాకోఽసౌ - బిల మిచ్ఛన్న పన్నగః।
క్షీయతే వర్ధతే చైవ - న సముద్రో న చంద్రమాః॥[1]

(సూది)

ఒక కన్నున్నది గాని కాకికాదు; బిలాన్ని అభిలషిస్తుంది గాని సర్పం కాదు. క్షయ వృద్ధులున్నాయి గానీ సముద్రుడు; చంద్రుడు కాడు.

* ఒక్కొక్కడుగు పోయిన కొలది
తోక కొంచెం తగ్గుతుంది
దీని పేరేమి ?

క్షయ వృద్ధులు సూదికే అని సంస్కృత ప్రహేళిక తెలుపగా, దారానికే క్షయ మనేది తెలుగు పొడుపుకథ తెలుపుతున్నది.

సంస్కృత ప్రహేళిక ఏ విషయాలకై నిర్మింపబడిందో, ఆ విషయాల నిమిత్తమే తెలుగు పొడుపు కథలు నిర్మితమైనా ఆ సంస్కృత ఛాయలు పూర్తిగా పొడుపు కథల్లో కనిపిస్తున్నాయి. అందువల్లనే వీటిని అనువాదాల కిందచేర్చక ఆ ఛాయలనడం జరిగింది. ఇక సంస్కృతాన్ని అనుసరించిన కొన్ని పొడుపు కథల్ని పరిశీలిద్దాం.

**1-3 : అనుసరణం :-** విషయాల్లో విభేదాలున్నా తెలుగు పొడుపుకథా కారుడు సంస్కృత ప్రహేళికల్ని అనుసరించడానికియత్నించి సఫలీకృతుడయ్యాడు విడుపు వ్యస్త విభాగంవల్ల మూడు నాలుగు సమాధానాల్ని, సమస్త విభాగం వల్ల ఒకేఒక్క సమాధానం సాధించడమనేది సంస్కృతాంధ్రాల్లో కనిపిస్తుంది.

కేస్థిరాః కేప్రియా స్త్రీణాం కోఽన ప్రియో నక్త మాహ్వయః।
నృత్యభూః కీదృశీరమ్యా నదీకీదృక్ ఘనాగమే॥[2]

(అగాధవారి పూరజనిత తరంగా)

---

1. పొడుపుకథలు పు: 82
2. ప్రహేళికలు, ద్వి, పు: 49

కేస్థిరాః = కదలక ఉండేవేవి? అగాః — పర్వతాలు, కేస్త్రీణాం ప్రియాః — స్త్రీల ప్రేమకు పాత్రులగు వారెవరు? ధవాః = భర్తలు, కః అప్రియః = ఎవడహితుడగును? రిపుః — శత్రువు, నక్తం ఆహ్వాయ = రాత్రిని సంబోధించు? రజని = ఓ రాత్రి, కేదృశీనృత్యభూ రమ్యా = నృత్యస్థలంచే ఉంటే శోభిస్తుంది! తతరంగా తలా = విశాలమైన. రంగా = నర్తన మండపం ఉన్నదైతే నృత్యభూమి శోభిస్తుంది, ఘనాగమే నదీదృక్ భవతి = వర్షాకాలంలో నది ఏ విధంగా ఉంటుంది ? అగాధ వారిపూరజనిత తరంగా— అగాధ =లోతైన; వారిపూర = ప్రవాహంలో; జనిత = పుట్టిన, తరంగా = అలలు కలిగి ఉంటుంది.

అయిదు ప్రశ్నలకు వాస్తవ విభాగం వల్ల ఐదు సమాధానాలు వచ్చినై సమస్త విభాగం వల్ల ఒక్క ప్రశ్నకు ఒకే సమాధానం వచ్చింది. తెలుగు పొడుపు పద్యాల్లో కొన్ని ఇలాగే ఉన్నాయి.

* దశరథాగ్ర సుతుండు. శశియును పట్టణం
బొక మాటలోపల నుండ వలయు
దర్పకాంతకుడు, నేత్రంబును, మాలయు
నొక పేరులోపల నుండవలయు
వేల్పును, త్రోవయు, వెలయు ప్రసూనంబు
నొక పేరులోపల నుండవలయు
కనకంబు, కార్పాస, మొనర మహీజంబు
నొక పేరులోపల నుండవలయు
దీని యర్థంబు తెలియంగ బూనుకొనుచు
మది విచారించి పదునైదు మాసములను
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి.
చెప్పలేకున్న నగుదువే చిన్ని నగవు.[1]

1. పొడుపు పద్యాలు, పు: 41

ఈ పద్యంలోని ప్రతి పాదంలో వేసిన మూడు ప్రశ్నలకు ఒక సమస్త పద సమాధానం వస్తుంది. వ్యస్త విభాగం చేస్తే మూడింటికి మూడు సమాధానాలు వస్తాయి,

దశరథాగ్రసుతుండు = రామ, శశి = చంద్ర, పట్టణము = పురం రామ చంద్రపురం — ఇదొక పట్టణము.

దర్ప కాంతకుడు = రుద్ర, నేత్రము = అక్ష, మాల = మాల, రుద్రాక్షమాల — ఇది జపం చేసేవారి సాధనం.

వేల్పు = దేవ, త్రోవ = దారి, ప్రసూనము = పుష్పం, దేవదారి పుష్పం — ఇదొరకమైన పుష్పం.

కనకంబు = పైడి, కార్పాస = పత్తి, మహీజము = చెట్టు; పైడిపత్తి చెట్టు— ఇదో రకమైన వృక్షం.

మొత్తం మీద నాలుగు పాదాల్లో వ్యస్త విభాగం వల్ల పండ్రెండు సమాధానాలు, సమస్త విభాగంవల్ల నాలుగు సమాధానాలు వచ్చినై ఈ పద్ధతి అనుసరణమే అవుతుంది గాని అనువాదం గానీ ఛాయగానీ గాదు. ఇదేగాక రెండు ప్రశ్నలకు ఒకే సమాధానమిచ్చే పద్ధతి సంస్కృతాంధ్రాల్లో కనిపిస్తున్నది.

* గోకులే క్రీడతా భంగః కస్యాక్రియత చక్రిణా ।
ఖరాదయో వినేశుస్తే ప్రేషాం ప్రాప్యకుతోఽనసః ॥[1] (అనసః)

—గోకులే క్రీడతాకృష్ణేన — గోకులంలో క్రీడిస్తున్న కృష్ణునిచేత, కస్యభంగః అక్రియత — ఎవని వినాశనం చేయబడింది; అనసః = శకటాసురుని యొక్క, తేఖరాదయః కుతః ప్రేషాం ప్రాప్య వినేశుః = ఆ ఖరదూషణాదులు ఎవరినుండి ప్రేరణపొంది నశించారు, అనసః = శూర్పణఖనుండి. శూర్పణఖ లక్ష్మణచ్ఛిన్న నాసిక-అందుకే ముక్కుచేనిది.

1. ప్రహేళికలు, ప్ర- పు: 64

* మామిడేల పూచు మంచువేసంగిని
జాఎడేల వోప్పు పసుల వెంట
రాజుసేన నేల రహిజేస్పచుండును
మూటనొక్కమాట ముద్దుకృష్ణ.[1] (కాయనే)

సంస్కృతంలో శ్లోకంలోనే ఉత్తరమున్నది. తెలుగులో మూడుప్రశ్నల కొకే సమాధానమున్నది. రెండు ప్రశ్నలకు ఒకే సమాధానమున్న కొన్ని తెలుగు పద్యాలుకూడా సంస్కృతానుసరణాలే.

సంస్కృతంలో శ్లోకాలకు శ్లోకాలే అనులోమ విలోమాలై ఉన్నాయి. తెలుగు పొడుపుల్లో మాత్రమే ఈగుణం కనిపిస్తుంది. ఈవిషయం పొడుపుకథలు చిత్రకవిత్వమనే ప్రకరణంలో ప్రస్తావించడం జరిగింది. అదేవిధంగా అక్షర చమత్కారాల విషయంలో కూడా సంస్కృత ప్రహేళికలే తెలుగు పొడుపుకథలకు మార్గదర్శనం చేశాయనిపిస్తుంది,

* అపూర్వోయం మయాదృష్టః కాంతః కమలలోచనే ।
శోంతరం యోవిజానాతి సవిద్వాన్నాత్ర సంశయః[2]

—ఓకమలలోచనా! అపూర్వం కాంతమూ అయినదానిని చూశాను. ఇందులో శోంతర మెరిగినవాడే విద్వాంసుడు. అకారము ముందున్నది, కకారం చివర ఉన్నది, మధ్య 'శో' ఉన్నది అశోకః-అశోకం చూడబడింది అని అర్థం.

తెలుగులో ఆద్యక్షరాల, మధ్యమాక్షరాల, అంత్యాక్షరాలకు సంబంధించి చమత్కారాలు సృష్టిస్తూ పొడుపు పద్యాలెన్నో పుట్టినై.

* ప్రణవమందు కద్దు ప్రజలలోపల కద్దు
ప్రతిభయందు కద్దు ప్రభను కద్దు
ప్రతిమయందు కద్దు పరమేష్ఠిలో లేదు
దీని భావమేమి? తిరుమలేశ![3] (ప్ర)

---

1. పెద్దబాలశిక్ష, పు : 84
2. ప్రహేళికలు, ప్ర- పు: 7
3. తిరుమలేశ శతకము, పద్యాలు : 72,

ప్రతిపదం ఆద్యక్షరాన్నే ఈ పొడుపు పద్యం ప్రస్తావించింది ఇలాంటి వాటిని ఆద్యుత్తర ప్రహేళిక అంటాం. సంస్కృతంలో అర్థాక్షరాల సమన్వయ ముంది. తెలుగు పొడుపుల్లో కొన్ని అర్థాల్ని వదలి అక్షరాలకే పట్టంగట్టినై

* పొలము హలమునందు బలములో ఫలములో
జలము చలములోన వెలసియున్న
మధ్యమూర్తి మనకు మహిలోన కనరాదు
దీనిభావమేమి ? తిరుమలేశ![1] (ల)

ఈ పైపద్యం మధ్యోత్తరానికి ఉదాహరణం కాగా ఈక్రిందిది అంత్యోత్త రాన్ని ప్రదర్శిస్తున్నది.

* పైడి, లేడి, వెండి, కాడి, పేడి, పకోడి,
బండి, మొండి, కోడి, దండి, రండి,
వీనిచివర నున్నదే జ్ఞానిలో లేదు
దీనిభావమేమి? తిరుమలేశ![2] (డి)

సంస్కృతంలోని ఆదిమధ్యాంత్యోత్తరాలనే తెలుగు పొడుపు పద్యాలనుసరించాయి పద్యాల్ని, అర్థాల్ని, నిర్మాణాన్ని తెలుగు పొడుపులనుసరించాయి.

అయితే ఈవిషయంలో ఇంకా తులనాత్మకాధ్యయనం జరగవలసి ఉంది. ఇక్కడ అనువాదాల్ని, సంస్కృత ఛాయల్ని, అనుసరణాల్ని మాత్రమే పరిశీలించడం జరిగింది. మొత్తంమీద సంస్కృతం భారతీయ భాషలకు మహోపకారం చేసింది తన పదార్థ సంపదను పంచిపెట్టి భాషలన్నిటని సుసంపన్నం చేసింది. తెలుగు పొడుపుకథల్ని కూడా దర్శించింది, స్పృశించింది. ఆ దర్శన స్పర్శనానుభూతుల సారమే ఇక్కడ అందించడం జరిగింది. ఇంకా లోతుకు దిగి అధ్యయనం చేయాల్సిన అవసరముంది.

---

1, 2 : తిరుమలేశ శతకము' పద్యాలు ; 73, 86.

## 12-2 : కన్నడం

దాక్షిణాత్య భాషల్లోని కన్నడంలో పొడుపుకథలపై ప్రత్యేకంగా కృషి జరిగింది. శ్రీ'రాగౌ' సంకలించిన 'నమ్మ ఒగటు గళు' ప్రస్తావనలో పొడుపు కథ ఇలా నిర్వచింపబడింది.

"వాక్సంప్రదాయం యొక్క అనేక రూపాలలో జనసామాన్యుల ప్రతిభా సామర్థ్యాలకూ ఊహా శక్తికి అద్దం పట్టే అత్యుత్తమ రూపం పొడుపుకథ. పొడుపుకథ ప్రధాన లక్షణం అర్థ గోపనం." [1]

శ్రీజీ.శం పరమశివయ్య కన్నడ ఒగటుగళు అనే సంకలన గ్రంథాన్ని ప్రచురించారు. కన్నడంలో పొడుపుకథల్ని ఒగటుగళు అనీ విడుపుల్ని ఉత్తర గళు అనీ అంటారు. "ఒంట, ఒడగలె, ఒడ్డకతే, ఒగణు"అనే పేర్లుకూడా పొడుపు కథకున్నాయి. తెలుగు కన్నడాలకెంతో సాన్నిహిత్యముంది. దాక్షిణాత్య భాషల లిపులన్నీ ఒకే కుదుట పుట్టాయనే వాదమున్నా, తెలుగు కన్నడ లిపులొకే విధంగా కనిపించడం విశేషం. ఈ పొడుపుకథల్ని మానవ సంబంధులు, గృహసంబంధు లుగా, ప్రకృతి సంబంధులుగా ప్రకీర్ణకాలుగా తులనాత్మక పరిశీలన చేయవచ్చు.

**2-1: మానవ సంబంధులు:-** మనిషి శరీరావయవాలకు సంబంధించి కన్నడాంధ్రాల్లో ఎన్నో పొడుపు కథలు పుట్టినై. వీటికి మూలమేదా అన్నంత సాన్నిహిత్యముంది.

* కంబ- కంభదమేలె
గుంభ- గుంభదమేలె
పళ్లు - పళ్లునలి పళు

కంబం, కంబంమీద కుంభం, కుంభం మీద గడ్డి, గడ్డిలో పురుగు. మనిషి శరీరాన్నీ తలలోని పేలను వర్ణించే తెలుగు పొడుపుకథ అచ్చమిలాగే ఉంది.

---

1. తెలుగు కన్నడ జానపద గేయాలు, పు: 141.

* స్తంభాలు - స్తంభాలమీద కుంభాలు -కాళ్లు
కుంభాల మీద కుడితొట్టె. -పిరుదులు - కడుపు
కుడితొట్టె మీద గవ్వల గురిగి -నోరు
గవ్వల గురిగిమీద అద్దాలమాలు -కండ్లు
అద్దాల మాలుమీద గరికపోసలు -వెంట్రుకలు
గరిక పోసలమీద గాడిదలు పొర్లాడు తవి -పేలు

కన్నడాంధ్రాల్లో నాసికను తెలిపే ప్రహేళికలు ఒకే విధంగా ఉన్నాయి,

* ఎరెడు మనిగె - ఒందుతొలె
(రెండిండ్లకు ఒకటే దూలం) (ముక్కు)

* అక్కతంగీర మనిగే - ఒందె గోడె
(అక్క చెల్లెండ్ర ఇంటికి ఒకటే గోడ) ,,

* రెండళ్లల కొకటే దూలం ,,

* రెండు మిద్దెల కొకటే దూలం ,,

కన్నడంలో రెండు గృహాలన్నారు; తెలుగులోని ఒక పొడుపు కథలో గదులనే మాట ఉంది. గదులకే అర్థం సరిగా అతుక్కొంటుంది.

* చిక్క మనిగె — చెక్కెతుంబిదె (పలువరుస)

చిన్న ఇంట్ల చెక్కలు నిండా ఉంటాయి; తెలుగులో ఇది వినిపిస్తున్న తీరిలా ఉంది

* చిన్న ఇంటికి నిండా చెక్కలు (పండ్ల వరుస)
* చిన్న ఇంట్లో చిలకల బేరి ,,
* సిన్న ఇంట్ల సిరు సెక్కలు ,,

తెలుగు కన్నడాలకు ఎంతమాత్రం భేదం లేని స్థితి ఇలా చాలా పొడుపు కథల్లో కనిపిస్తుంది. ఇక గృహ సంబంధమైనవి కొన్ని పరిశీలిద్దాం.

**2-2: గృహసంబంధులు :-** గృహ జీవన సౌఖ్యానికెన్నో పరికరాలు కావాలి; ప్రశాంతతకు మనస్సులు నిష్కల్మషంగా ఉండాలి. భారతీయ గృహ జీవన వ్యవస్థలో ఉపకరించే పరికరాలించు మించు ఒకే విధంగా ఉన్నాయి. ఇక్కడ కన్నడాంధ్రాల్లోని పొడుపు కథలొక్క కుదుట పుట్టినవే.

* కంచినకబ - కుసుమే రాశి
ఐవరు ఆడ్తారె - ఇబ్బరు నూడ్తారె
ఒబ్బరు కాదిద్దారె
(పళ్లెం, అన్నం, వ్రేళ్లు, కళ్లు, నోరు)

- కంచుకబ; పూలరాశి; అయిదుగురు ఆడ్తారు; ఇద్దరు చూస్తారు; ఒక్కరు వేచి ఉంటారు. తెలుగు పొడుపుకథ చూడండి.

* మట్టికోట
మట్టికోట మీద కంచుకోట
కంచు కోటమీద పూలకోట
పూలకోటమీద అయిదుగురు దొంగలు
ఆడుతా పాడుతా ఉన్నారు.
(నేల, కంచం, అన్నం, వ్రేళ్లు)

* అప్ప అంద్రె బరోదిల్ల
అమ్మ అంద్రె బరోదిల్ల
కైహిడ్డ్ కర్దరె బర్తతె (తలుపు)

- అప్ప అంటే రాదు; అమ్మ అంటే రాదు, చెయిపట్టి పిలిస్తే వస్తది. తెలుగులో ఇది కొద్ది భేదంతో ఉంది.

* నిలబడ్డ రామక్క రావేమి అంటే
చెయివట్టి గుంజంది నేనెట్లవత్తు తలుపు)

* అంగ్డియింద తరోదు
మనేలి కూత్కొండ్ అళోదు ఉల్లిగడ్డ)

- దుకాణం నుండి తెచ్చేది; ఇంట్లో పెట్టుక ఏడ్చేది. తెలుగు పొడుపు కథ అచ్చంగా ఇట్లే ఉంది.

* అంగడి నుండి తెచ్చ
మొందల పెట్టుక ఏడ్చె (ఉల్లిగడ్డ)

* ఒబ్బణ్ణ ఇళి తనె - ఒబ్బణ్ణ హత్తతానె (రొట్టెలు)

- ఒకన్న దిగుతాడు; ఒకన్న ఎక్కుతాడు. అన్నదు మారుగా తెలుగులో రాజనే శబ్దం, పోలీస్ అనే శబ్దం ఉంది.

* మూడు గుణ్ణాలు - ఒకటే కోగిం
ఒగ రాజెక్కుతుంటే - ఒగరాజు దిగె
(పొయిరాళ్లు, పెంకు, రొట్టెలు)

* ఒక పోలీసు ఎక్కంగ
ఒక పోలీసు దిగంగ (రొట్టెలు)

బ్రతుకు తెరువొక్కటి, భావనలొక్కటి అయినప్పుడు బహిరంగంగా కనిపించేదంతా ఏకాత్మతనే భజిస్తుంది. ఇక కొన్ని ప్రకృతి సంబంధ ప్రహేళికల్ని పరిశీలిద్దాం.

**2-3: ప్రకృతి సంబంధాలు :-** మనిషికీ ప్రకృతికీ విడదీయరాని సంబంధముంది. మనిషి తనలో తనను, ప్రకృతిలో తనను చూసుకొంటాడు. మానసిక వికాసానికి విజ్ఞాన పరిచయానికి ప్రచారానికి అనేక ప్రకృతి సాదృశ్యాల్ని ప్రయోగిస్తాడు. ప్రహేళికల్ని కూడా కన్నడాంధ్రాల్లో అలాగే ప్రయోగించారు.

* అమ్మ హాసిగె - సుత్తక్కె ఆగోదిల్ల
అప్పన దుడ్డు ఎణిసొకా గోదిల్ల (ఆకాశం-చుక్కలు)

- అమ్మ పరుపు చుట్టరాదు, అప్ప డబ్బు ఎంచరాదు తెలుగు పొడుపు కథ కూడా ఇలాగే ఉంది.

* మాయమ్మకు చాప చుట్టరాదు
మా నాన్నకు పైస లెంచరాదు (ఆకాశం - చుక్కలు)

* ఒబ్బ హెంగసు ఒందె బారిగె
నూరు మక్కళ హెత్తు సాయ్తాళే (అరటిపెట్టు)

- ఒక ఆడది ఒకేసారి నూర్గుర్ని కని చస్తుంది. తల్లి కొడుకులను కని చనిపోవడం కన్నడం చెప్పింది. తల్లిని చంపి కొడుకు తరలి పోయాడని తెలుగు చెబుతున్నది.

* తల్లిని చంపి - తరలి పడుకుంటుంది. (అరటిగెల)
* దారి యెల్లి ముదుకి
తలెకెదిరి కొలడు కూతపుళె (ఈతచెట్టు)

- దారిలో ముసలిది తల విరబోసుకు కూర్చున్నది. ఇది కన్నడం కాగా తెలుగిట్లున్నది.

* అడవిలో అక్కమ్మ
తలవిరబోసుకుంది (ఈతచెట్టు)

కొబ్బరికాయ మనిషి కనేక విధాల ఉపయోగపడుతుంది. కొబ్బరిచెట్టు ప్రకృతికి అందాన్ని సమకూరుస్తుంది ఆంధ్ర కర్ణాటక భాషల్లో నారికేళాలపై అనేక ప్రహేళికలు పుట్టినై.

* ఒందు మడకె
మడకె యొళగొందు శంఖు
శంఖునాళ గొందు సముద్ర (కొబ్బరికాయ)

—ఒక కుండ, కుండలో ఒకపాత్ర, పాత్రలోపల శంఖం, శంఖంలో ఓ సముద్రం తెలుగు పొడుపుకథ చెట్టునుకూడా కలిపింది.

* చుట్టుముట్టు కంప - కంపల పెంక
పెంకల శంఖు - శంఖులో తీర్థం (కొబ్బరిచెట్టు-కాయ)

* అగసమాడిద మడియల్ల
కుందార మాడిద మడికె యల్ల
సూర్యన కణ్ణిగె కాణదపిల్ల (కొబ్బరికాయ)

—చాకలి చేసిన వానకాదు; కుమ్మరి చేసిన కుండకాదు; సూర్యుడు చూడని నీళ్ళున్నాయి. దెయిగులో కుమ్మరి విషయంలేదు.

* సూర్యుడు చూడని గంగ
చాకలి ఉతకని మడుగు (కొబ్బరికాయ)

ఇలా సాదృశ్యాలు మానవ సంబంధుల్లో, గృహ సంబంధుల్లో, ప్రకృతి సంబంధుల్లోనేగాక అనేక అంశాల్లో ఇంకా కనిపిస్తున్నాయి. వాటిలో ఒకటి రెండు ప్రకీర్ణకాల కింద చూద్దాం.

**2-4 : ప్రకీర్ణకాలు :-** ప్రశ్నోత్తరాలు పాటల్లోనే ఉండడం కన్నడాంధ్రాల్లో సాధారణాంశమే. భావ సాదృశ్యంతోపాటు ప్రయోగ సాదృశ్యం కూడా రెండింటిలో కనిపిస్తుంది.

* కెసరల్లి హుట్టోదు - కెసరల్లి బెళెయోదు
అమృందు గిడద — పరికార - ఎలెబాం
దారె నమ్మర్థ ఒడదే? ।
—తావరె బేర అరసోరు.

-పిల్లా! ఓపిల్లా! బురదలో పుట్టేది, బురదలో పెరిగేది, అదో పట్టుకు సంబంధించింది, విప్పిచెప్పు! అర్థంచెప్పు!- (ఓరాజా దాని పేరే తామర!)

తెలుగులో పాదపాదానికో పొడుపుకథ ఉన్న గేయాలున్నాయి.

* బోడోడు ఎవడురా-బొచ్చోడు ఎవడురా
సుట్టుముట్టు కత్తులుంపు - వానిపేరు ఏమిరా
-బోడోడు కోడిగుడ్డు-బొచ్చోడు టెంకాయ
సుట్టుముట్టు కత్తులుంపు - వానిపేరు వంకాయ.

ఇవేగాక ప్రశ్నోత్తర ప్రాధాన్యాలున్న మామా కోడళ్ళ పొడుపు కథలు కొన్ని తెలుగులో కనిపిస్తున్నాయి.

* ఏమేపిల్లా మదారిబాబూ - కుంకుం సెదిరిందే
అమిడీ కుంకుం సెదిరించే
-ఉడుకుడుకన్నం ఊపుకుతించే
కుంకుం సెదిరిందే మామా
కుంకుం సెదిరించే![1]

ప్రశ్నోత్తర ప్రహేళికా పద్ధతేగాక నేతి-నేతి (న + ఇతి, న + ఇతి, ఇదికాదు-ఇదికాదు) పద్ధతికూడా ఆంధ్ర కర్ణాటక భాషల్లో ఉంది

* చిప్పుంటు ఆమె యల్ల
జుట్టుంటు పూజారి యల్ల
మూరుకణ్ణుంటు హరనల్ల (టెంకాయ)

-చిప్ప ఉంటుంది తాబేలు కాదు; జుట్టుంటుంది కాని పూజారి కాదు; మూడు కళ్ళుంటాయిగాని శివుడుకాడు.

* కప్పుంటు కస్తూరియల్ల-బిళుపుంటు సుణ్ణవల్ల
జలవుంటు దావియల్ల - రెక్కెయుంటు పక్షియల్ల
హేగాదరే నాన్యారు ! (కన్నులు)

-నల్లగ ఉంటుంది కస్తూరికాదు; తెల్లగ ఉంటుంది సున్నంకాదు; నీళ్ళుంటాయి బావికాదు; రెక్కలుంటాయి పక్షిగాదు - అయితే నేనెవరిని? తెలుగులో ఇలాంటివి జానపదుల పొడుపుకథల్లోనూ-పద్యాల్లోనూ కనిపిస్తున్నాయి.

* ఆకులోడు గాడమ్మ ఆకులుంటవి
పోకలోడు గాడమ్మ పోకలుంటవి
బాలెంత గాడమ్మ పాలుంటవి
సన్నాసోడు గాడమ్మ జడలుంటవి (మఱ్ఱిచెట్టు)

---

1. జానపద కళాసంపద, పు: 11

* కోట్ల పేట్ల దాటు గుఱ్ఱమా మరిగాదు
మెడను నఱ్ఱ గలదు మృడుడు గాడు
ఇల్లునెల్ల దిరుగు ఇల్లాలుసుంగాదు
దీనిభావమేమి? తిరుమలేశ ![1] (పిచ్చుక)

ఇంతేగాక రెండు భాషల్లోనూ శబ్దార్థాలంకారాల నిర్మాణం ఒకేవిధంగా ఉంది. గొలుసు పొడుపుకథల్లో ఒక పాదానికి విడుపు చెప్పింతర్వాత, ఆ విడుపు తోనే మరో పొడుపును పొడిచే పద్ధతి రెండు భాషల్లో సమానంగానే ఉంది.

| | |
|---|---|
| * తంగ్డి గిడ్డల్లి లింగణ్ణ కుంతపునె | -మొల |
| మొలదోరప్ప తేలిహోద | -తట్టె |
| తట్టెరప్ప ముళిగి హోద | -తంబిగె |
| -తంగెడు చెట్టుల లింగన్న కూచును | -కుందేలు |
| కుందేలప్ప తేలిపోయిందు | -కంచం |
| కంచమప్ప మునిగిపోయిందు | -పంబు |

| | |
|---|---|
| * ఇంతముండ ఇల్లెక్కి పిండి కొట్టంది | -నుసిపురుగు |
| నుసిపురుగుకు నూరుకళ్ళు | -జల్లెడ |
| జల్లెడ జాతారం వెళ్ళింది | -ఉత్తరం |
| ఉత్తరం ఊరేగించి | -పల్లకి |
| పల్లకీ పరుగెత్తింది | -త్రోవ, దోవ |
| దోవలో దొంగను కాశారు | -నీడ[2] |

కన్నడాంధ్ర ప్రహేళికల్లో దేనినేది అనుసరించిందనేది నిరూపించడం కష్టమే. సోదరభాషల్లో సారూప్య సాదృశ్యాలిదేవిధంగా ఉంటాయి. రెండింటిలో ఏకకాలంలో ఇలాంటి పొడుపుకథలు పుట్టాయనడమే సరియైన నిర్ణయమనిపిస్తుంది.

## 12- 3 : తమిళం

దాక్షిణాత్య భాషల్లో కర్ణాటకాంధ్రాల కెంత సారూప్యముందో తెలుగు

1. తిరుమలేశ శతకము, ప : 15
2. రాయలసీమ మాటుకథలు, భారతి, 1968, జనవరి

తమిళాల కంత సాన్నిహిత్యముంది. "తెనుగు తేటె, కన్నడ కత్తురి, అరవ అప్పాన్న (అమృతాన్న)" మనే సామెత వినిపిస్తున్నా భాషా విషయంలో ఎక్కువ తక్కువల్ని నిర్ణయించడం సమంజసం కాదు. భాష భావ వాహకం కాని, ఒకటి మంచిదనీ, మరోటి చెడ్డదనీ ఉండదు. దాక్షిణాత్య భాషల కన్నింటికీ సామ్య మున్నట్లే తెలుగు తమిళాలకూ ఉంది. ఈ రెండు భాషల్లో పుట్టిన పొడుపుకథల కెన్నో పోలికలున్నాయి.

తమిళంలో పొడుపు కథల్ని "విడుకతై" అంటారు. రాయలసీమ వ్యవహారంలో వినిపిస్తోన్న "విచ్చుకథ" లకిది సన్నిహితంగా ఉంది. తెలుగులో కేవల సమాధానాల్ని విడుపులనడం తెలిసిందే. పిడికె. పుడుర్ అనే పేర్లు కూడా తమిళంలో వినిపిస్తున్నాయి. తమిళాంధ్ర భాషా భాషీయుల ప్రహేళికల పరిశీలనం వల్ల ధార్మిక సాంప్రదాయకాది విషయాల్లో వారికున్న అభినివేశాదులు అభివ్యక్త మవుతున్నాయి.

* అప్పన్ సొరియన్, ఆత్తాళ్ శడచ్చి
అవర్‌హళ్ పిళ్లై శర్కరై కుట్టి (పనసపండు)

తమిళులకీ పండు ఫలాహారాల్లో ప్రముఖమైంది. 'తండ్రి గర గర, తల్లి పీచు పీచు, వారి పిల్లలు తియ్యన' అని దీని అర్థం. తెలుగులో కొద్ది మార్పుతో ఇది వినిపిస్తున్నది.

* తండ్రి గర గర - తల్లి పీచు పీచు
బిడ్డలు రత్నమాణిక్యాలు
మనుమలు బొమ్మరాళ్ళు (పనసపండు)

* అయిరం తెచ్చలగూడి
అళగాన మండపం కట్టి
వొరువన్ కన్‌బట్టు పుడై్టంద
దా మండపం అది యెన్నె! (తేనెపట్టు)

- వేయి రంధ్రాలున్న అందమైన మండపం గట్టి, ఒక్కని కన్ను పడేవరకు, పగిలిన ఆ మండలం ఏది? ఈ కింది తెలుగు పొడుపుకథలో కొద్దిభేదం ఉంది.

* వేయి గోవుల మంద- ఒకచోగా చేరింది
వేసిందొక పెద్ద - తియ్యాని ముద్ద. (తేనెపట్టు)

* అరియకూడి పెరియత్త
ఆవరెగట్టి కారి పాలుపడాకాామె
పుళ్లై వళర్ప్పార్ పెరియ గట్టి రాపె అదియెన్నె! (కోడి)

- అరియకూడి పెద్దమ్మ చాల గట్టిగా, పిల్లలకు పాలివ్వకుండానే, కష్టపడి తిరుగుతూ పెంచుతది అదిఏది? తెలుగు పొడుపుకథ అచ్చుగుద్దినట్లే ఉంది.

* ఆలూరు భోగంది · అధికసక్కంది
సన్నియ్యాక బాలలకు - సైగతో నడిపె (కోడి)

* ఎంగమ్మా వీటి తోట్టిల్
మంజల్ కురివి ఊంచలాడదు అది యెన్నె (నిమ్మకాయ)

- మా అమ్మ వాదింటి తోటలో పచ్చని పిట్ట ఊయల ఊగుతది! అది ఏది! తెలుగు పొడుపు కథలో కూడా పచ్చదనం వచ్చినా, తెలుపునూ,పిత్తనాన్ని పులుపునూ వదంలేదు.

* పైపచ్చ - లో తెలుపు
గులక రాళ్లు - తేటనీరు (నిమ్మకాయ)

* ఇరుట్టు వీట్టు కుక్కాళై
ఎరుమై మాడు మేయుదు అదెన్న ! (పేను)

- చీకటింటిలో ఎనుబోతు మేస్తున్నది! అది ఏమిటి! తెలుగులో కొద్ది భేద సాదృశ్యాలతో పేనుకు సంబంధించిన ఎన్నో వినిపిస్తున్నాయి.

* కంచెల కట్టెదు (పేను)

* కానరాని గుట్టల్లో - కత్తె అవుమేయును ,,

* గుబ్బారి పొదల్ల - గుడ్డెలుగు మాయమాయె (పేను)

* రాజు గారి తోటలో ఆంబోతు మేస్తున్నది ,,

* కను విల్లార మరత్తల్
ఎలుంబిల్లా దవన్ ఎవిగిరాన్ ,,

- గణుపులేని చెట్టుమీద, ఎముకలేనివాడు ఎక్కుతున్నాడు. గణుపు (కనుపు - కణుపు), లేనిచెట్టు వెంట్రుక, ఎముక లేని వాడు పేను, ఇలా ఒకే వస్తువును ఎన్నో పొడుపు కథలుగా ఈ రెండు భాషలు తీర్చి దిద్దినై. అందువల్లనే భేద సాదృశ్య వైవిధ్యాలు స్పష్టంగా తెలుస్తున్నాయి.

* ఆయరం పిట్టున్ఒరేతాపాడ్ (సూర్యుడు)
— వెయ్యింట్లకు ఒకే బేడెం
* ఊరికొక్కటే ముల్లుగట్టె (సూర్యుడు)

అందరికొకే సూర్యుడని చెప్పాలి. తమిళం బేడెమంది; తెలుగు ముల్లుగట్టె అంది. ఒకటి గృహోపకరణం; మరోటి వ్యవసాయోపకరణం.

* అణ్ణనుక్కు ఎట్టాదు - తంబికి ఎట్టుదు (పెదవులు)

- అన్నకందవు, తమ్మునికందుతవి. తెలుగులో ఇలాంటివి రెండు మూడు కనిపిస్తున్నై.

* అన్నకు అందవు - అమ్మకు అందుతయి
తమ్ముడికి అందుతయి (పెదవులు)

* అమ్మ అంటే దగ్గరకి వస్తయి
అన్న అంటే దూరం పోతయి ,,

* అమ్మ అంటే మూసుకుంటయి
అన్న అంటే తెరుసుకుంటయి ,,

కోడిగుడ్డుకు సంబంధించిన పొడుపుకథల్లో సామ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది.

* ఒఱు సీసావిల్ ఇరండు తైలంగల్ (కోడిగుడ్డు)

- ఒక్క సీసాలో రెండు తైలాలు. తెలుగు పొడుపుకథ తైలాలకు మారుగా రంగులనే శబ్దం ప్రయోగించింది.

* ఒక్క సీసాల రెండు రంగులు (కోడిగుడ్డు)

చెప్పులు పొడుపులుగా వచ్చిన పొడుపుకథల్లోనూ సామ్యముంది. భిన్న కాలాల్లో పుట్టినవైనా భావసామ్యం పరిశీలనార్హం.

* కల్లుక్కుం ముళ్ళుక్కుం అంజాదవన్
పళ్ళనీరై కండు పదైక్కిరాన్ (చెప్పులు)

- రాయికీ ముల్లుకూ భయపడనివాడు నీళ్ల గుంతకు వెనుక ముందాడుతాడు.

* అక్కడ లిపసతపు ఇక్కగి లిపసతడు
నీళ్ళుంచుకొచ్చి నిల్చిపోతడు (చెప్పులు)

* అచ్చి కజ్జావు బుచ్చికజ్జావు
నీళ్ళుంచుకొచ్చి నిల్చె కజ్జావు "

"నేతి నేతి" పద్ధతికూడా తమిళాంధ్ర భాషల్లో సమానమే. అదికాదు ఇదికాదు అంటూ అది ఇది ఏదో నిర్దేశించడం పొడుపు కథా నిర్మాణంలోని ఒక పద్ధతిగానే భావించాలి.

* అందరత్తిల్ పఱందు వరుం పరుందే అంద్రు
అళగాన వాలుం ఉండు కురుంగుమ్ అంద్రు (గాలిపటం)

భూమిలోలేదు; ఆకాశంలో లేదు; ఎగిరివచ్చే గ్రద్దకాదు; అందమైన తోకఉంది; అది కోతికాదు.

* ఆకసమున ఉండు అది పక్షియాకాదు
తోక కలిగియుండు మేకకాదు

త్రాసు కలిగియుండు తలప ఎద్దును వాదు
దీని భావమేమి! తిరుమలేశ! (గాలిపటం)[1]

* కడుతు ఉండు తలై యిల్లై
కయ్యూండు విరళిల్లై
ఉడల్ ఉండు ఉయిర్ యిల్లై (చొక్కా)

-మెడఉంది తలలేదు; చేతులున్నవి వ్రేళ్లులేవు; ఒడలున్నది ఊపిరి లేదు.

* కరయుగంబు గలదు చరణంబులా లేవు
కడుపు వీపు నడుము మెడయు గలవు
శిరములేదుగాని నరుల బట్టుక మ్రింగి
సుఖము గూర్చు దీని సొగసు గనుడి.[2] (చొక్కా)

* మా మామ కొడుక్కు
తలలేదు కాళ్లులేవు (చొక్కా)

* మెడ ఉంటుంది తలలేదు
చేతులున్నాయి కాని వ్రేళ్ళులేవు

కేవలం ఇలాంటి పొడుపుకథలేగాక కథాత్మక ప్రహేళికలు తమిళం లోనూ ఉన్నాయి. తెలుగు పొడుపుకథ జనవ్యవహారంలో నలిగీ నలిగీ సామెతగా మారినట్లే తమిళంలోనూ మారింది. రామాయణ గాథలోని ఒక అంశాన్ని తెలిపే ఈకింది సామెత కథాత్మక ప్రహేళికే.

* వల్ల వనుక్కు పుల్లుమ్ ఆయుదమ్

- శక్తి ఉన్నవానికి గడ్డిపోచ కూడా ఆయుధమే .. పితృవాక్య పరిపాలన నిమిత్తం రాముడు అడవికి వెళ్ళాడు. ఓరోజు సీత తొడ తలగడగా నిద్ర పోతున్నాడు. ఓ కాకి సీతను బాధించింది. సీత రక్తం రాముణ్ని మేల్కొల్పింది.

---

1. తిరుమలేశ శతకము, ప: 1
2. ప్రహేళికలు, ప్ర, అనుసంహిత, పు: 14.

రాముడిది చూసి ఆగ్రహోదగ్రుడై చేతికందిన గడ్డిపోచను అభిమంత్రించి కాకిపై ప్రయోగించాడు. అదే ఇప్పుకపై బ్రహ్మాస్త్రంగా ప్రసిద్ధమైంది. ఆ మహాశక్తి సంపన్నుడైన రాముడికి గడ్డిపోచకూడా మహాయుధమైంది. ఈ సామెత వెనుక ఇంతకథ దాగివుంది; అందుకే కథాత్మక ప్రహేళిక కుదాహరణమయ్యింది.

తెలుగు పొడుపుకథల్లోని గతులూ, మాత్రలూ, గణాలూ, కవితా తత్త్వం, తమిళ ప్రహేళికల్లోనూ కనిపిస్తాయి. ఏ అంశంకింద వేటిని పరిశీలించవచ్చో చూడండి.

* ముదుగిలె మూట్టై కట్టి
మూన్రు మణిక్కు ముదం దూరం పోగుమ్ (నత్త)

-మూపున మూటపెట్టుకొని, మూడు గంటలకు మూరెడు దూరం పోతది.

* పోవాన్ వరువాన్ తిమ్మప్పన్
ఒరుకాలాలె నిప్పాన్ తిమ్మప్పన్ (తలుపు)

-వస్తాడు పోతాడు తిమ్మప్ప; ఒకకాల నిలుస్తాడు తిమ్మప్ప.

* ఎంగళ్ వీట్టుక్కిణత్తిలె - వెళ్ళిక్కిణ్ణం మిదక్కిరదు (చంద్రుడు)

-మా ఇంటి బావిలో వెండిగిన్నె తేలాడుతది.

* పొరిపొరిత్తెన్ - పెట్టియిల్ వైత్తెన్
పొళుదు విడిందాల్ కాణవిల్లై (నక్షత్రాలు)

-పేలాలు వేయించాను; పెట్టెలో పెట్టినాను; పొద్దు పొడిచేవరకు కనిపించలేదు.

తమిళుల నేటి రాజధాని; ఒకనాటి ఆంధ్రుల రాజధాని. తెలుగు పత్రికలకు చలనచిత్రాలకు ఒకప్పుడి కూడలి తమిళనాడు. రాజకీయ సాంస్కృతికాది రంగాల్లో ఆంధ్రులకూ తమిళులకు సంబంధాలున్నాయి దాక్షిణాత్య భాషలన్నీ ఒక్క కుదుట పుట్టినవైనందువల్ల ఏ సాహిత్య ప్రక్రియ పరిశీలించినా సారూ

హ్యాలు- సాదృశ్యాలు కనిపిస్తాయి. భారతీయ భాషలన్నిటిలోనూ భావసామ్య ముంది. ముఖ్యంగా దాక్షిణాత్య భాషలమధ్య భావసామ్యంతోపాటు భాషా సారూప్య ముంది. తమిళాంధ్ర ప్రహేళికల పరిశీలనంవల్ల ఆవిషయమింకా రూఢి పడింది. ఈ రెండుభాషల పొడుపుకథలు ఒకదానినొకటి అనుసరించవచ్చు; స్వతంత్రాలు కావచ్చు; రెండింట ఏకకాలంలో ఒకేవిధమైన పొడుపుకథలు పుట్టవచ్చు. అవి పుట్టిన కాలాన్ని పరిగణనలోకి తీసుకొని, ఉపరితల నిర్మాణాన్ని - ఆంతరిక తత్త్వాన్ని పరిశీలన చేసినప్పుడు కొన్ని వినూత్నాంశాలు వెలుగులోకి వచ్చే అవకాశ ముంది.

## 12-4 : మలయాళం

భారతీయ భాషల్లో మలయాళం బాగా అభివృద్ధి చెందింది. దేశమంతా విద్యా వైజ్ఞానికాది సర్వరంగాల్లో మలయాళీయు ముందున్నారు. మలయాళ జాన పద సాహిత్యంలో కూడా విశేషకృషి జరిగింది. వారి బాలసాహిత్యంలో పొడుపు కథలు చోటు చేసుకొన్నాయి. దాక్షిణాత్య భాషలన్నీ ఒకే పుదుట పుట్టినందువల్ల ఆంధ్ర మలయాళాలకు సామ్యం సాన్నిహిత్యం కనిపిస్తున్నవి. ఇక పొడుపు కథల్లో పదవాక్య భావ సామ్యాలున్న వెన్నో ఉన్నాయి.

మలయాళ 'విడికద' అచ్చంగా తెలుగు విడుపుకథే. 'కటకద- కటం కథ' అనే పదాలు మలయాళీలు పొడుపుకథల కుపయోగిస్తున్నారు. తెలుగు 'కట్టు కథ' అనే పదం ఈ పదాల కతి సన్నిహితంగా ఉంది. మలయాళంలో కూడా పొడుపుకథలు వేలకొలది లభించాయి. రాశిలోనేగాక రెండు భాషల్లోని పొడుపు కథలకు సూక్ష్మాతి సూక్ష్మ విషయాల్లోనూ సాన్నిహిత్యం కనిపిస్తుంది.

* రాశకిడక్కుం - కయిర్ ఓడుం (గుమ్మడికాయ-తీగ)

- ఎద్దు నిలబడే ఉంది, త్రాడు తిరుగుతోంది (పరుగెత్తుతోంది)గుమ్మడి కాయ ఎద్దు; తీగత్రాడు త్రాడు నిలబడి ఉండడం (కదలకుండా ఉండడం) ఎద్దు తిరగడం వ్యవహారం. ఎద్దు నిలబడడం త్రాడు తిరగడం లేదా పరుగెత్తడం విపరీతం. అసహజంతో సహజాన్ని ఊహింపజేసే శక్తి పొడుపుకథకుంది. ఈ తెలుగు పొడుపుకథ చూడండి

* ఎద్దు పండంగ - పోతుపొగంగ (గుమ్మడికాయ-తీగ)

నిలబడడం అనడంకన్నా 'పండంగ' అనడంలోనే అర్థ సారస్య ముంది. తిరుగడం-పరుగెత్తడం అనేకన్నా 'పొగంగ' అనడంతోనే వాస్తవికతకు అద్దం పట్టినట్లుగా ఉంది.

మనిషిని సిక్షిప్తం చేసుకొన్న పొడుపుకథల్లో తెలుగు-మలయాళాలకు సాన్నిహిత్యమెంతో ఉంది. వివిధ విధాల కాయగూరల పొడుపుకథలు రెండింటా కొద్దిభేదంతో కనిపిస్తున్నాయి.

* ముళ్ళుంట్ ముక్కెల్ల
మెయిపుంట్ కాస్యరం అల్ల (కాకరకాయ)

- ముళ్ళుంటవి కాని ముకికిట్టు రాదు. చేదుంటది గాని కాస్యరం పట్టు గాదు ...తెలుగు పొడుపుకథా వ్యవహర్త కాకరకాయను ఒంటినిండా పుండ్లున్న వాడనీ, గజ్జికిన్నవాడనీ అంటున్నాడు.

* ఒంటినిండా పుండ్లోడు (కాకరకాయ)

* ఈ పొట్టోడికి ఒంటినిండా గజ్జి
కాని ఆతడంటే అందరిష్టపడతారు ,,

కాకరకాయ కావాలని కొందరే ఇష్టపడతారు. ఇక కొబ్బరికాయ చూడండి.

* కాడువెట్టి పారకంటు
పారవెట్టి వెళ్ళంకంటు (కొబ్బరికాయ)

అడవి కోసేస్తే (పచ్చని చెట్లను తీసేస్తే) రాయి కనిపిస్తుంది. రాయి కోస్తే నీళ్ళు కనిపిస్తాయి. అడవికి మారుగా కంప, రాయికి మారుగా పెంక తెలుగు పొడుపుకథల్లో కనిపిస్తున్నాయి.

* చుట్టుముట్టు కంప - కంపల పెంక
పెంకల శంఖు - శంఖుల తీర్థం (కొబ్బరికాయ)

సామాజికాంశాల ప్రకటనంలో తెలుగు పొడుపుకథ ధరించిన పిరాట్న్య రూపం మలయాళ విడికథ కూడా ధరించింది వాచ్యం అయ్యే సామాజికవాస్తవం వెనుక దాగిన కప్ప-పాము విడుపుల్ని రెండు భాషలు బహిరంగంలోకి తెచ్చి పెట్టినై.

* నాలుకాలుళ్లరు నన్నేలిపెణ్ణినే
కోలునారాయణన్ కట్టోండు పోయి (కప్ప-పాము)

- నాలుగు కాళ్ళున్న నన్నేలి అనే స్త్రీని, పొడుగు నారాయణుడు దొంగతనంగా తీసుకుపోయాడు. ఏమరుపాటులో ఉన్న కప్పను పట్టుకొన్న పాము పరుగు నిజంగా చూడాల్సిందే. ఏదో తప్పు చేసినవానికుండే నిలకడలేని స్థితి ఆ పాములో కనిపిస్తుంది. తెలుగు పొడుపుకథలో కొద్ది భేదమున్నా భావసామ్యముంది.

* సండ్లులేని ఆడదాన్ని
కాళ్ళులేని దొంగ ఏసుకపాయె (కప్ప-పాము)

అన్నం ఉడికే విధానాన్ని మలయాళం ఎంత మృదువుగా చెప్పిందో తెలుగు అంత పరుషంగా చెప్పింది.

* ఇల్లత్తమ్మ కుడిచ్చు వరింపోళ్
వెళ్ళిక్కిన్నమ్ తుళ్లి త్తుళ్లి (అన్నం ఉడకడం)

—ఇల్లాలు స్నానం చేసివచ్చి, వెండిగిన్నెలో ఎగిరెగిరి పడుతుంది.

* గుడినిండా నిరుపోసి - సుడికి తాళంవేసి
లంక తగలబెట్టి - లంజ మొత్తుకుంది (అన్నం ఉడకడం)

గుడికుండ, తాళం వేయడం మూతెసరుకుండ పెట్టడం, లంకపొయ్యి, లంజ మొత్తుకోడం అన్నం ఉడకడం. కొన్ని వాస్తవ విషయాల్ని మలయాళం పొడుపుకథ కుండ బద్దలుకొట్టినట్లే ప్రస్తావిస్తుంది.

* న్యట్టిల్లా వొట్టయిల (పాపడ్)

-రాడలేదు, ఆకు సుంద్రందా ఉంది,
* ముట్టుత్తే పెప్పినె ఆటపిల్లి (వావి)

-ఇంటివెనుక డబ్బికి మూతలేదు

తెలుగులోకూడా ఇంత సూటిగా చెప్పే పొడుపు కథలెన్నో ఉన్నాయి. వాస్తవాలే అయినా ఆ అంశాల్ని కొట్టవచ్చినట్లుండే శబ్దాల్లో కూర్చడంతో పొడుపుకథా నిర్మాణస్థితిలో ఏదో భాగమనిపిస్తుంది.

* చెట్టుకింద లింగడు
ఎంత కొట్టినా వంగడు (నీడ)

* చుట్టింటికి వాకిలేదు (కోడిగుడ్డు)

ఏ ప్రాంతానికి చెందిన భారతీయులైనా, వారెక్కడ ఉన్నా, వారి ఆచార వ్యవహారాలు, వారి విశ్వాసాలు దేశంలోని సర్వ సాహిత్య ప్రక్రియల్లో ప్రతిబింబిస్తూనే ఉన్నాయి. అందుకే సాహిత్యం - సంస్కృతి వాటిలో ఏకతా నిర్మాణం చేస్తున్నట్లనిపిస్తుంది. అటు సంప్రదాయ సాహిత్యానికి, ఇటు జానపద విజ్ఞానానికి సన్నిహితంగా ఉన్న ఆంధ్ర మలయాళ ప్రహేళికలు ప్రతీకల ప్రయోగంతో, ఆచారాల ప్రకటనంలో, విశ్వాసాల అభివ్యక్తీకరణంలో, కథా నిర్మాణంలో పొడుపు కథల్లోకూడా ఏకతను పాటిస్తున్నాయి; సమాజానికి ఏకతా సందేశాన్ని అందిస్తున్నాయి.

## 12-5 మరాఠి :-

ఆంధ్రప్రాంతానికి మహారాష్ట్ర ప్రాంతానికి పూర్వం నుండి సంబంధ బాంధవ్యాలున్నాయి. పరిపాలనా రంగంలో సాంస్కృతిక రంగంలో పరస్పర సహకారం మొదటి నుంచీ కనిపిస్తుంది. అప్పటి రాష్ట్రకూటులు రెడ్డియి ఇక్కడ పరిపాలన కొనసాగించారని చరిత్ర చెబుతోంది. వ్యాపారం కారణంగా వారూ వీరూ కలిసి తిరుగుతున్నారు అందువల్లనే రెండు భాషల పొడుపుకథల్లో సామ్యం కని పిస్తుంది.

మరాఠీలో పొడుపు కథల్ని "ఉఖాణా, అహణా, ఉమాణా, కోహడా, కులం గాడె, బయాగా" తదితర నామాలతో పిలుస్తున్నారు. ఇన్ని పేర్లవల్లనే వాటికున్న ప్రచార ప్రాశస్త్యం తెలుస్తున్నది.

* పాన్ నహీ పానీనహీ రాన్‌కస హిర్వా
  కాత్ నహీ చునానహీ పాన్‌కస రంగ్‌లా (చిలుక)

- వానలేదు, నీళ్లులేవు, పొలం ఎట్లా పచ్చగుంది. కాచులేదు, సున్నం లేదు, పాన్ కెట్ల రంగుంది. తెలుగు పొడుపు కథ అచ్చంగా ఇట్లే ఉంది.

* ఆకులేదు, పోకలేదు, నోరు ఎఱ్ఱన
  వానలేదు, వరదలేదు, వరిపచ్చన (చిలుక)

* కాళికారిలేక్ లాతి
  వాక్‌తెపన్ మోడత్ నహీ (వెంట్రుకలు)

-నల్లకట్టె నూనెపెట్టు; వంగుగాని విరగదూ.

* నల్లకట్టె వంగుతదిగాని విడుగదు (వెంట్రుకలు)

నేతినేతి రీతి పొడుపుకథ లక్షణమా అనిపిస్తున్నది. సర్వ భారతీయ భాషల్లో ఈపద్ధతి కనిపిస్తున్నది. మరాఠి దీనికేమపవాదంగాదు.

* సర్‌సర్ చాలే సర్పనవే -మోట
  గడ్‌గడ్‌చాలే గాఢానవే -గిరక
  కానీముద్రికా జోగీనవే -మోటతాడు
  గళాల్‌జాన్వా బ్రహ్మణ్‌నవే -తొండపుతాడు
  నవేనవే ఇంద్రనవే చంద్రనవే
  శహానవగాట్ల ఉఖాణా మూర్ఖాలాపడ్ లాఫాన్.

-సరసర నడుస్తుందిగాని సర్పంగాదు; గడగడ అంటుంది గాని బండి గాదు: జడలుంటాయిగాని యోగికాదు; జంద్యముంటుందిగాని బ్రాహ్మణుడు గాదు;

ఇంద్రుడుకాడు-చంద్రుడుగాడు; ఈ పొడుపు విప్పిచెప్పినవారే విజ్ఞులు - చెప్పని వారే మూర్ఖులు.

తెలుగు పొడుపుకథల్లో ఇలాటివెన్నో ఉన్నాయి. గేయాలు, వచన గేయాలు, వచనాలు, పద్యాలు తదితర ఆంధ్ర మరాఠీ సర్వప్రహేళికలకు సామ్యం కనిపిస్తుంది. తెలుగునాట ఆదిలాబాదు జిల్లాలోని జాసర తదితర గ్రామాల్లోనూ, ఆదిలాబాదు నగరంలోనూ, హైదరాబాదులోని మహారాష్ట్ర గృహాల్లోనూ వినిపించే మరాఠీ ఉఖాణాలమీద తెలుగు పొడుపుకథల ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది.

## 12-6 : హిందీ

హిందూదేశం హిందీని రాష్ట్రీయభాషగా అనుసంధాన భాషగా అంగీకరించింది. దేశభాషలన్నీ రాష్ట్రీయభాషలుగా మన రాజ్యాంగం నిర్దేశిస్తుంది. హిందీ లిపి నాగరలిపే. హిందీ వ్యావహారికభాష సంస్కృత పదభూయిష్ఠంగాదు. శుద్ధ హిందీలో సంస్కృత పదాలధికంగా ఉంటాయి అనేక రాజకీయ చారిత్రక, సామాజిక కారణాలవల్ల దేశంలోని అన్ని ప్రాంతాల్లో అధిక సంఖ్యాకులకు హిందీ పరిచయముంది, మాతృభాష హిందీకాని ప్రాంతాల్లో కూడా మహాకవులు ప్రాదుర్భవించారు. హిందీకి అన్య భారతీయ భాషలకు ఆదాన ప్రదానాలు జరిగినై

ఈ ఆదాన ప్రదానాల కారణంగా తెలుగు పొడుపుకథలకు హిందీ పహేలిలకు సాదృశ్య సామీప్యాలు కనిపిస్తున్నాయి. సంస్కృత ప్రహేళికా శబ్దమే హిందీలో పహేలిగా పరిణమించింది పహేలి ఏకవచనం. పహేలియాం బహువచనం. హిందీ పహేలిలపై గణనీయంగా కృషి జరిగింది. ఆభాషలో ప్రజా బాహుళ్యం సమాదరించి వ్యవహరించే పొడుపుకథలూ, కవులు సృష్టించిన ప్రహేళికలు కోకొల్లలు. వీటిని ప్రజల పహేలీలుగా కవుల ప్రహేళికలుగా విశ్లేషించి, తెలుగు పొడుపుకథలతో తైపారువేసి పరిశీలిద్దాం.

**6-1 : ప్రజల పహేలీలు:-** హిందీలో మాండలికాలెన్నో ఉన్నాయి. ఆ మాండలికాలే లోక (జానపద) సాహిత్యంలో అంతర్భాగంగా గుర్తింపు

పొందినవే. ప్రజల పహేలీలు ప్రధానంగా లోక సాహిత్యంలో ఒకశాఖగా ప్రాశ
స్త్యాన్ని అందుకున్నాయి.

* ఇధర్‌గయా - ఉధర్‌గయా
నజానే కిధర్‌గయా (రోడ్డు)

-ఇక్కడికి పోతుంది-అక్కడికి పోతుంది- ఎక్కడికి పోతుందో - ఎవరికి తెలుసు.

* ఈడేసిన కోల - ఇంజమూరు వాయె (బాట)

రెండు భాషల్లోని భావసాన్నిహిత్యం తెలుస్తూనే ఉంది. ఈకిందిపొడుపు కథలలాంటివే.

* ఇధర్‌గయా - ఉధర్‌గయా
పేసేథర్ జగహ్‌మే బేఠ్‌గయా (చేతికర్ర)

-ఇక్కడికి వెళుతుంది; అక్కడికి వెళుతుంది: పైసంత చోట కూచుం టుంది.

* ఊరంత తిరిగొచ్చి - మూలకు నిలబడ్తది (ములుగర్ర)

* దుషాలా ఓఢ్‌కే -మూఛ్ సఫేద్ సఫేద్
లటకాయేబా -మోతీన్‌కామాలా పహ్‌నేబా (మక్కజొన్నకంకి)

-దుప్పటి కప్పుకొన్నాడు; తెలతెల్లని మీసాలు వ్రేలాడుతున్నాయి. కాని ముత్యాలహారం ధరించాడు.

* చింపిరి చింపిరి గుడ్డలు
ముత్యాలవంటి బిడ్డలు (మక్కజొన్నకంకి)

హిందీ తెలుగు పొడుపుకథలు రెండింటిలో సాదృశ్యం స్పష్టంగా కని పిస్తోంది, జానపదుల -భాషాభిజ్ఞుల ఇద్దరి వ్యవహారంలో ఇది ఉంది ఈ కిందిది మాత్రం కేవలం తెలుగు జానపదునిదే.

* గుండుమీద గుండ్లు
పదహారు గుండ్లు
పదహారు గుండ్లమీద పట్టుకుచ్చు (మక్కజొన్న కంకి)

అలవాట్లకు సంబంధించిన పొడుపుకథలు కొన్ని రెండు భాషల్లో ఒకే విధంగా కనిపిస్తున్నాయి.

* ఏక్ లే దో ఫేక్ దీ (పలుదోంపుల్ల)

-ఒకటి తీసుకొన్నా, రెండు పారేసిన. ఒక పుల్లను (వేప, ఉత్తరేణు, కానుగ, తంగేడు) తీసుకొని పళ్ళు తోముకొని (తోమడం పూర్తయిం తర్వాత) దానిని రెండుగా చీల్చి నాలిక గీచుకొని పారవేస్తారు. ఈ కింది రెండు తెలుగు పొడుపుకథల్లో కొద్దిభేదమున్నా భావమదే.

* మా తాత ఏటవతలకోయి
రెండెడ్లను దెస్తే
బాయి దగ్గరికి రాంగనే రెండయ్యే (పలుదోంపుల్ల)

* ఒకటి వచ్చింది. పదహారింటిని తాకింది
నూరయి వెలసింది - రెండయిపోయింది ,,

ఇంతగా భావసామ్యం అందరి ఆచారవ్యవహారాలు ఒకటిగా ఉన్నప్పుడే కుదురుకోడం జరుగుతుంది.

* ఏక్ థరా - రూప్యోంసే భరా (ఆకాశం, నక్షత్రాలు

- ఒకపాత్ర రూపాయలతో నిండిఉంది. ఆకాశాన్ని పాత్రగా నక్షత్రాల్ని రూపాయలుగా సంకేతించడం జరిగింది. తెలుగు పొడుపుకథ ఈ విషయాన్నే రూపకంతో సమ్మానించింది.

* రూకలెంచలేం - చాప చుట్టలేం (నక్షత్రాలు, ఆకాశం)

ప్రకృతిని మానవీకరించే ఇలాంటి పొడుపుకథలు హిందీ తెలుగు భాషల్లో ఎన్నో కనిపిస్తున్నాయి. హిందీలో మాందలికాలున్నట్లుగానే తెలుగులోనూ

మాండలికాలున్నాయి. అశ్లీలం అనిపించే 'తరాజు'కు సంబంధించిన పొడుపుకథ ఈ మాండలికాల్లో పుట్టిందే.

* దో లటక్‌తే - ఏక్ పకడ్‌తా ! క్యాహై! (తక్కెడ)

- రెండు వ్రేలాడుతాయి! ఒకడు పట్టుకొంటాడు! ఏమిటి!

* ఒకటి పట్టుకొంటే
రెండూగులాడుతున్నాయి. (తక్కెడ)

పొయ్యిమీద పెనం; ఆ పెనంకింద మంట; పెనంలో జొన్నలు; అవి వేగుతున్నాయి; చిటపటలాడుతున్నాయి; పేలాలవుతున్నాయి. వాటికి సంబంధించిన మాండలిక ప్రహేళిక చూడండి.

* సూఖీ నదీమే హిజడేనాచే! క్యాహై (పేలాలు)

- ఎండిన నదిలో కొజ్జాలు నృత్యం చేశారు! ఏంటి!

* ఎండిపోయిన బాయిల భోగమోల్లాడిరి (పేలాలు)

* అంగల్ల బుడ్డోడు సెంగ సెంగె గిరె ,,

తాంబూలాన్ని వివరించే పొడుపుకథలన్ని భాషల్లో ఒకేవిధంగా ఉన్నాయి.

* చార్ చిడియా చార్‌రంగ్‌కే
ఘర్‌మే ఆయేతో ఏక్‌రంగ్‌కే! క్యాహై! (తాంబూలం)

—నాలుగు పిట్టలూ నాలుగు రంగులవి; ఇంటిలోకి వస్తాయి; ఒకే రంగువిగా మారిపోతాయి.... తెలుగు పొడుపుకథల్లో ఆకూ సున్నం వక్క ఈ మూడే అనేక ప్రహేళికల్లో అనేక విధాలుగా ప్రయోగింపబడ్డాయి.

* చిట్టి పిడతలో మూడు కూరలు (తాంబూలం)

* నల్లనినాగి -తెల్లని తిమ్మి -పచ్చనిబావి
బావనోట్లో వసంతాలాడినారు (వక్క, సున్నం, ఆకు)

తెలుగు పద్యాల్లోనూ ఈ మూడింటినే పేర్కొన్నారు. హిందీ ప్రహేళికలో ఈ మూడింటికి మరో రెంటిని చేర్చడం జరిగింది. అయితే ఆ రెంటి పేరేంటో చెప్పలేదు.

* పాంచ్ కబూతర్ పాంచ్ రంగ్
మహల్ మే జాకే ఏక్ రంగ్ (తాంబూలం)

ఓ కుక్కనో, ఓ ఎద్దునో, మరే పశువునో సూచించేప్పుడు ప్రహేళికల్లో వ్యక్తిని, వ్యక్తి విశేషణాన్ని వాడడం ఉంది. కుక్కను గురించి 'ఇస్త్రా చెన్నా బెస్తోతువాయె' అనీ, 'వస్తువు గున్నాడు, పోతడు గున్నాడు, గున్నాని కాళ్ళకు చెప్పుల్లెవు' అనే ప్రయోగాలున్నాయి. అదేవిధంగా వ్యక్తులకూ, పశువులకూ వస్తువులపేరు వాడబడుతుంది

* ఆయా లూలా - జాయా లూలా
పానీకే డరాయ - లూలా (చెప్పులు)

-వచ్చింది లూలా; పోయింది లూలా; నీళ్ళను చూసి భయపెట్టింది లూలా ...ఇక్కడ లూలా అనేది తెలుగులో ఉన్న గున్నాడు లాంటదే. వస్తువులకు వ్యక్తుల్ని, వ్యక్తులకు వస్తువుల్ని ప్రతీకలుగా వేయడం ప్రహేళికల్లో సర్వసాధారణంగా కనిపించే అంశం.

* నీళ్ళను చూసి - ఎడ్లు ఆగుతాయి (చెప్పులు)

ఇలాగే ఎద్దులు చెప్పులవుతాయి; చెప్పు లెద్దులవుతాయి హిందీ తెలుగు భాషలకు లిపిసామ్యం, శబ్దసామ్యం తక్కువే అయినా, భావ సామ్యం మాత్రం అంతటా కనిపిస్తున్నది. ఇతర కవులు సృష్టించిన ప్రహేళికల్లోని సాదృశ్యాల్ని పరిశీలిద్దాం.

**6-2 : కవుల ప్రహేళికలు :-** ప్రహేళికా లక్షణాలూ, నిర్మాణం తెలిసి రచనచేసిన కవులు తెలుగులో ఉన్నట్లే హిందీలో ఉన్నారు హిందీలో అమీర్ ఖుస్రో[1] తదితరులు పహేలీల్ని నిర్మించారు తెలుగులో శ్రీ మరిగిపూడి,

1. కవుల ప్రహేళికల శీర్షిక క్రింద ఉదాహరించిన హిందీ రచనలన్నీ అమీర్ ఖుస్రోవే.

శ్రీ పాపిశెట్టి సీతారామకవి, శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి, శ్రీ ఉమ్మా నారాయణరెడ్డి, శ్రీ కసిరెడ్డి ప్రభృతులు పొడుపు పద్యాలు వ్రాశారు

* ఏక్ రాజాకి అనోఖీరాణీ
నీచేసే వహ్ పీవేపానీ (దీపం, వత్తి)

-ఓ రాజుగారి రాణి అమాయికం మనిషి. ఆమె కిందినుండి నీళ్ళు తాగుతున్నది. తెలుగు జానపదుడు కొద్ది భేదంతో తోకతో నీళ్లు తాగుతుందంటున్నాడు

* అద్దుమచెర్ల ముద్దుమపిట్ట
మూతికి బంగారం పెట్టుకొని
తోకతో నీళ్ళు తాగుతది (దీపంవత్తి)

సుప్రసిద్ధకవి ఆలోచన, జానపదుని ఆలోచన ఒకేవిధంగా ఉండడం మానవ మనస్తత్వంలోని ఏకతనే తెలియజేస్తుంది. తాంబూలానికి సంబంధించి హిందీలో సుదీర్ఘ ప్రహేళిక ఆవిర్భవించింది.

* హరారూప్‌హై నిజ్‌వహ్‌బాత్
ముఖమే ఘర్ దిఖావేజాత్॥
తీన్ వస్తుసే అధిక్ పియార్
జానిబ్‌హై సబ్‌సే నర్‌నార్
హరాఏక్ సభాకా రఖేమాన్
చతురాఈకీ రాట్ పహిచాన్ (తాంబూలం)

-నిజం చెప్పాలంటే పచ్చని రూపముంది. ముఖగృహం చూపిస్తే చాలు వెంటనే వెళ్ళతుంది, దానికి మూడు వస్తువులమీద ఎంతో ప్రేమ. స్త్రీలూ పురుషులూ దానికి ఆకర్షితులవుతారు. మరి ఆ పచ్చనిది సభాగౌరవం నిలుపుతుంది సుమా! చతురులెవ్వరైనా గుర్తించండి! . తెలుగులో ఇదివరకే ఉదాహరించిన ఈపద్యం చూడండి.

* శిల వృక్షలతల బుట్టిన
చెలువలు ముగ్గురను గూడి చిడిముడి పడుచున్
తలవాకిట రమియింతురు
సలలితముగ దీనినెరుగు సరసులు గలరె! (సున్నం, చెక్క, ఆకు)

ఈకింద పొడుపుకథ తిరుగలికి సంబంధించింది. నిర్మాణంలో కొంత వైవిధ్యముంది.

* ఏక్ నారీకే హై దో బాలక్
దోనోం ఏక్‌హీ రంగ్।
ఏక్ ఫిరే ఏక్ ఠాఢారహే
ఫిర్‌భీ దోనోం సంగ్॥ (విసుజ్ఞాయి)

-ఓ మహిళకు ఇద్దరు పిల్లలున్నారు. ఇద్దరికీ ఒకే రంగుంది. ఒకరు తిరుగుతారు; మరొకరు కదలకుండా ఉంటారు. అయినా ఇద్దరూ కలిసే ఉంటారు. తెలుగు పొడుపు పద్య నిర్మాత తిరుగలికి సంబంధించి ప్రయోగించిన పదాల్లో మృదుత్వం లేదు.

* పంగటించి కాళ్ళు పడతులు గూర్చుండి
కళ్ళు చేతబట్టి తొళ్ళుబెట్టి
త్రిప్పునపుడు కారుతీపియాసారంబు
దీని భావమేమి తిరుమలేశ![1]

జానపదుల పొడుపుకథ హిందీ పహేలికి కొంత సన్నిహితంగా ఉంది.

* మా ఇంట్లోకి ఇద్దరు భోగమోళ్ళు వచ్చింద్రు
ఒకటె ఆడుతది- ఒకతె ఆడదు (విసుజ్ఞాయి)

పదానికున్న రెండు మూడర్థాల్ని దృష్టిలో ఉంచుకొని, పద్యంలోనే సమాధానాన్ని కూర్చిన పద్ధతి హిందీలోనూ కనిపిస్తుంది.

* పౌన్‌చలత్ వహ్ దేహ్ బఢావే
జల్ పీవత్ వహ్ జీవగంవావే
హైవహ్ ప్యారీ సుందర్ నార్
నార్ నహ పర్‌హై వహ్‌నార్ (అగ్ని)

1. తిరుమలేశ శతకము, ప: 87.

-నార్ అనే పదానికి అగ్ని-అతివ అని రెండర్థాలు. గాలి కదలికకు అది దేహాన్ని పెంచుతుంది. నీళ్లు త్రాగిన వెంటనే ప్రాణాలు విసుస్తుంది. అది ప్రియమైంది సుందరమైంది అయిన నారీమణి. నారీమణి కాదు అది అగ్ని .... తెలుగు జానపద ప్రహేళికల్లో రెండే రెండు పాదాల్లో అగ్నిని అందంగా బంధిం చేశారు.

* అమ్మ నీకొడుకు ఎంత చక్కనివాడు
నన్నీళ్లు వోసెవరకు నచ్చిపాయె (నిప్పు)

రెండు ప్రశ్నలకొకే సమాధానమున్నవి రెండు భాషల్లోనూ కనిపిస్తు న్నాయి.

* దివార్ క్యోం టూటీ?
రాహ్ క్యోం లూటీ? (రాజు లేడు)

-గోడ ఎందుకు విరిగింది (పగిలింది)? దారి ఎందుకు దోయబడింది ? రాజులేడు అనే సమాధానంలో యజమాని లేకపోవడంవల్ల అనీ, రక్షకుడు లేక పోవడంవల్ల అనే అర్థాలు వస్తాయి. తెలుగులో ఈనిర్మాణపద్ధతి ననుసరించి ఎన్నో సీసపద్యాలు పుట్టినై. ఒక పాదం మాత్ర ముదాహరిస్తా.

* ... ఇల్లును శేషువు హీనమై యుండుట
కేమి హేతువా? దాని నెరుగవలయు! (కప్పలేక)

ఇల్లు హీనంగా ఉండడానికి కారణం పైకప్పు లేకపోవడం; పాము బల హీనంగా ఉండడానికి కారణం దానికి ఆహారమైన కప్పలేక-పోవడం

కొన్నిటిని నిషేధించి అనుకూలార్థంవైపు మనస్సును పరుగెత్తించే శక్తి హిందీ తెలుగు పొడుపుకథలకున్నది

* నంగే పాంవ్ ఫిరన నహిదేత్ ।
పాంవ్ సే మిట్టి లగన్ నహిదేత్।
పాంవ్‌కా మామా దేతే నిహూలా
ఖసఖీ సాజన్ నాసఖీ జూతా॥ (చెప్పులు)

-పట్టి కాళ్లతో తిరుగనివ్వదు. కాళ్ళకు మట్టి తగలనివ్వదు. కాళ్లను చుట్టుకొని ముద్దుపెట్టుకొంటుంది కాని పుత్రుడు కాదు. ఓ చెలీ! ప్రియతమా! కాదు చెలి ! చెప్పులు. తెలుగులో 'కేతి చేరి' పొడుపు పద్యాలన్నీ ఇటువంటివే.

స్వభావంలో స్వరూపంలో ఒకవిధంగా హిందీ తెలుగు భాషలకు పోలికలు కనిపిస్తున్నాయి. ఇది భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించడమే. సమాన సంస్కృతి, సమాన ఆచార వ్యవహార విధానం ఉన్న వారి మధ్య సాన్నిహిత్యం ఏర్పడినప్పుడు బహిర్గతమయ్యే ప్రత్యంశం ఇలాగే ఉంటుంది ఆదాన ప్రదానాల కారణంగా సాహిత్య బంధుత్వం మరీ బలపడుతుంది.

ఇక లిపి సాదృశ్యం లేకున్నా, హిందీ ఉచ్చారణకు అతిసన్నిహితంగా ఉన్న కొన్ని ఉర్దూ ప్రహేళికల్ని తెలుగుతో పోల్చి చూద్దాం.

## 12-7 : ఉర్దు

ఉర్దూలో పొడుపుకథల్ని 'చుట్కులే'లనీ, 'పహేలి' లని అంటారు. లతీఫాల్లో కవాలీల్లో పొడుపుకథల ఛాయలు సంపూర్ణంగా ఉన్నాయి. 'చుట్' అంటే దాచడమనీ, 'కులే' అంటే విప్పడమనీ అర్థం సూచితమవుతుంది. హిందీలో కూడా చుట్కులే' పదం వ్యవహారంలో ఉంది.

మహమ్మదీయ రాజులు ఈదేశంమీద ఉర్దూభాషను బలవంతంగారుద్దారు. తమ పరిపాలనలో దేశభాషల్ని అణగద్రొక్కి ఉర్దూకే పెద్దపీట వేశారు.అందువల్ల దేశభాషల్లో ఉర్దూ పదాలు ప్రవేశించాయి. ఆభాషలో వచ్చిన పొడుపుకథలకూ, తెలుగు పొడుపుకథలకున్న భావసామ్యం తెలియడానికి ఒకటి రెండు ప్రస్తావిస్తాను.

* పహాడ్ పే దరాస్తీ (చింతపండు)

-గుట్టమీద కొడవలి. "కొండకు కొడవండ్లు" అని తెలుగు పొడుపు కథ. ఈ రెండింటికి ఎంతమాత్రం భేదంలేదు.

* పహాడ్‌పే శత్‌రంజీ (పులితోలు)

-పులిని గుట్టగా, తోలును శతరంజీగా సంకేతించడం జరిగింది. తెలుగులో "గుట్టమీద బట్టలారేసి" అనే పొడుపుకథతో పెంకును గుట్టగా రొట్టెల్ని బట్టలుగా సంకేతించడం జరిగింది. పొడుపులో రెండింటికి భేదంలేదుగాని విడుపులకు ఉంది.

* తీన్ పాంవ్‌రా జాన్వర్
గన్నా ఖాతా - చున్నా హగ్తా (పొయ్యి-కట్టెలు-నిప్పు)

-మూడుకాళ్ల జంతువు; చెరుకు తింటుంది; సున్న పెడ్తుంది... నిత్య వ్యవహారంలో వినిపించే పొడుపుకథలిట్లే ఉంటాయి. పదప్రయోగం విషయంలో వ్యవహర్త సంశోచించే అవకాశమేలేదు. పిండి గిర్నీకి సంబంధించిన తెలుగు పొడుపుకథ కూడా "పందుం బుక్కుతది-పరపర ఉచ్చ పోస్తది" అంటున్నది. భావ వ్యక్తీకరణంలో వెనుకా ముందు చూడకపోడం అనేక ప్రహేళికల్లోనూ చూస్తాం.

దేశంలో ఉన్న ప్రజలు ఏభాషవారైనా, వారి జీవన పరిస్థితులు ఒకే విధంగా ఉన్నప్పుడు భాషలుకూడా ఒకేవిధంగా ఉంటాయి. ఇందువల్లనే తెలుగు ఉర్దూభాషల పొడుపుకథలకు సాదృశ్యాలు కనిపిస్తున్నాయి.

## 12-8 : ఇంగ్లీషు

అనేక చారిత్రక రాజకీయ కారణాలవల్ల ఇంగ్లీషు అంతర్జాతీయ భాషగా చలామణి అవుతున్నది. బ్రిటిషువారు సామ్రాజ్యవాద-విస్తరణవాద దృక్పథంతో దేశాలు ఆక్రమించారు; ఆదేశాల్లో తమభాష ప్రవేశపెట్టారు. హిందూదేశంలో కూడా ఈభాష ఈవిధంగానే ప్రవేశపెట్టడం జరిగింది అందువల్ల ఆంగ్ల భాషా సాహితీ సంస్కృతుల ప్రభావం అంతటా పడింది

ఇంగ్లీషువల్ల దేశ భాషల్లోని వివిధ సాహిత్య ప్రక్రియల్లో గణనీయమైన పరిణామాలు సంభవించినవి. ఆధునికాంధ్ర ప్రహేళికలపై ఆంగ్ల ప్రహేళికల ప్రభావం సుస్పష్టంగా కనిపిస్తోంది తెలుగులో ఉన్న విధంగానే ఇంగ్లీషురిడిల్స్‌లో గేయాలు-వచన గేయాలు- వచనాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి ఈ విభజనాన్నే ఆధారంగా గ్రహించి ఆంగ్లాంధ్రాల భావ సాదృశ్యాల్ని పరిశీలిద్దాం

**8-1 : గేయాలు :-** ఇంగ్లీషులోని పొడుపుకథల గేయాల్ని శిశుతరగతుల పిల్లలు పాడుతున్నారు. వర్ణన ప్రాధాన్యముండే ఇలాంటి గేయాలకు సాధారణంగా విడుపొక్కటే ఉంటుంది. ఇవే వర్ణనాత్మక సమస్యలుగా (Descriptive Riddles) పరిగణింపబడుతున్నాయి.

* Little Nancy Ethicoat
In a white petticoat
And a red nose
The larger she stands
The shorter she grows (క్రొవ్వొత్తి)

-తెల్లని రవిక తొడుక్కొని, ఎఱ్ఱని ముక్కుఉన్న, చిన్నినాన్సీ ఎది కోట్, నిలబడ్డా కొద్దీకురచగా అవుతుంది. ....ఈవర్ణనవల్ల కళ్లముందు మొదట ఒక అమ్మాయి కనిపిస్తుంది. అయితే నిలబడ్డా కొద్దీ అది కురచనై పోతుంది అన్నది విన్నప్పుడే అది క్రొవ్వొత్తి దీపమని తెలిసిపోతుంది. తెలుగులో ఇలాంటిదే ఒకటి దాదాపుగా అవతరించింది.

* తెల్లకోటు తొడుక్కొన్న ఎఱ్ఱముక్కు దొర
ఎంతసేపు నిల్చుంటే
అంత పొట్టివాడవుతాడు (క్రొవ్వొత్తి)

అపార్థ ద్యోతకమైన ఈకింది పొడుపుకథ కూడా వర్ణనాత్మకాల కోవ లోకే వచ్చే గేయం.

Humpty Dumpty sat on a wall
Hnmpty Dnmpty had a great fall
All the kings horses and all the Kings man
Couldn't put Humpty Dumpty in his place again
(కోడిగ్రుడ్డు)

-హంప్టీ డంప్టీ గోడమీద కూర్చున్నాడు; హంప్టీ డంప్టీ కింద పడ్డాకు రాజు గుఱ్ఱాలు, రాజుగారి మనుష్యులు హంప్టీ డంప్టీని ఉన్నచోట ఉంచలేకపోయారు .... ఈ

పొడుపుకథ వింటుంటే హంప్టీ డంప్టీ అనే వ్యక్తికి సంబంధించిన విషయమిది అనిపిస్తుంది. చివరి పాదంలోని అర్థంవల్ల అది పగిలిపోయిందనీ, దానిని యథా స్థానంలో ఉంచడం అసాధ్యమనీ తేలడంతో అది కోడిగుడ్డని స్ఫురించింది.

* తొడిమలేని **పండు** - కొప్పున్న పడె

కోడిగుడ్డుమీద తెలుగున ఎన్నో పొడుపుకథలు వచ్చినై. కాని ఈ పై పొడుపుకథ మాత్రం ఆంగ్ల ప్రహేళికకు అతి సన్నిహితంగా ఉంది

**8-2 : వచన గేయాలు :-** కేవల వచనం కానిది, కేవల గేయం కానిది వచనగేయం. ఆంధ్రాంగ్లాల్లోని వచన గేయాల్లో భావ సాదృశ్యా లున్నవెన్నో ఉన్నాయి. ఆవును సంకేతించిన ఈకింది పొడుపుకథ చూడండి.

* Two lookers
Two crookers
Two fly-flappers,
Four walrkers
Four hang-downess, and
one swithch about. (ఆవు)

-ఇద్దరు చూసేవారు (కళ్లు), ఇద్దరు వంకర కాళ్లవారు (కొమ్ములు), ఇద్దరు ఈగలు తోలేవారు (చెవులు) నలుగురు నడిచేవారు (కాళ్లు) నలుగురు వ్రేలాడేవారు (రొమ్ములు), ఒకడు అటూఇటూ ఊగేవాడు (తోక) పశువును తెలిపే తెలుగు జానపదుని పొడుపుకథ రమ్యంగా ఉంది.

* **నాలుగు పచ్చిబద్దలు - రెండు వట్టిబద్దలు**
**రెండు లొటలొట - రెండు మిటమిట** (పశువు)

నాలుగు పచ్చిబద్దలు పాదాలు, రెండు వట్టిబద్దలు కొమ్ములు, లొట లొట అనేవి రెండు చెవులు, మిటమిట అనేవి రెండు కన్నులు.

* A holy word
If you reverse it
It becomes unholy
What is it ? (God)

-అదో పవిత్ర పదం; దాన్ని కిందికి మీదికి చేసి చదివితే అపవిత్ర మవుతుంది. అది ఏమిటి! ఈపద్ధతిలో తెలుగున పద్యాలకు పద్యాలే పుట్టినై. తెలుగు వచనగేయాల్లో ఇది అంతగా కనిపించవు. అందువల్ల ఒక పద్యపాదాన్ని మాత్రం ఉదాహరిస్తా.

* బాలుండు ప్రాతకై పట్టుకొనెడి దేది
వర గృహంబున కేది వరలు కప్పు (పలక-కలప)

**8-3 : వచనాలు** :- ఆంధ్రాంగ్ల ప్రహేళికల్లో గేయాలుగా రూపు దిద్దుకొనివే ఎక్కువ ఉన్నాయి: వాటిలోనే శబ్ద చమత్కార మెక్కువగా కనిపిస్తుంది.

* It is meant to the sight,
You reverse it it it remains same,
what is it ? (Eye)

—దాని అర్థం చూపు. దాన్ని కింద మీదుగా చదివినా మళ్ళీ అదే అర్థం వస్తుంది. తెలుగులో ఇలాంటివి పద్యాలకు పద్యాలే అవతరించినై. విడుపు రెండు వైపులా ఒకే రకంగా ఉంటుంది. అర్థంలో మార్పుండదు. "వికటి, కిటికి, జలజ, కులుకు, కునుకు, నటన, మహిమ, వలువ, ముఖము, పులుపు. కటిక, కరక మొదలైనవి మూడక్షరాల పదాలు. "వికటకవి, రంగనగరం, లకోరికోల, తోక మూకతో, నందసదనం, మంధారదామం" మొదలైన అయిదక్షరాల పదాలు. ఇవన్నీ తెలుగు పొడుపుకథల విడుపులే.

"....వానచిన్కుల బుట్టు మానికంబది యేది
కాంచు పూనపుల నూరించు నేది ."[1] -పులుపు.

---

1. చమత్కార చంద్రిక, ప: 10

ప్రథమాక్షరమో, మధ్యాక్షరమో, అంత్యాక్షరమో లుప్తం చేసి ఆశించిన అర్థాన్ని సాధించే పద్ధతి ఇంగ్లీషులో ఉంది; తెలుగులో ఉంది.

* There is a five letter word
if you remove the first letter of that word
It will become that of first man
(MADAM)

- అది అయిదక్షరాల పదం. మొదటి అక్షరాన్ని తొలగిస్తే సృష్టిలోని మొదటి మానవుడవుతాడు ... ఆదమ్ (ADAM) ఆది మానవుడని బైబిల్ చెబుతున్నది.

* అక్షరాలన్నీ ఉంటే అందమైన దానినే
అందులో మధ్యాక్షరాన్ని తొలగిస్తే మాత్రం
జంతువుగా మారతాను. (మేనక)

ఇది ఈ మధ్యన పుట్టిన పొడుపు కథే. ప్రాచీన ప్రహేళికల్లో ఆది మధ్యాంత్యాక్షరాల్ని లుప్తం చేసి అనేక చమత్కారాలు సృష్టించారు పొడుపు పద్య నిర్మాతలు. ఉచ్చారణ మాధ్యంగా చమత్కారం సృష్టించడం రెండు భాషల్లోనూ కనిపిస్తున్నది.

* సిక్టీసిక్స్ వెంట్ టుది బాటిల్ ఫీల్డ్!
ఫైవ్ షాట్ డెడ్. హౌమెనీ ఆర్ దేర్?

అరవై ఆరుగురు వెళ్లారనీ, అందులో అయిదుగురు మరణించారనీ, అరవై ఒక్కరు ఉన్నారని వెంటనే స్ఫురిస్తుంది. కాని 'సిక్టీసిక్స్' అంటే అరవై మందిసిక్కులనే అర్థం గ్రహించాలి.

* ఏపయి నాలుగు దూలాల్లో

ఏబది శబ్దం 'ఏపయి'గా మారినట్లు భావిస్తాం, స్ఫురించిన అర్థంతో సాధారణంగా ఏబయి రెండు అంటారు. కాని ఏపయి- వేపవి అనే పదం వికృత

రూపం. మిగిలేవి రెండే అని చెప్పాలి. ఇక పిల్లల వ్యవహారంలో ఉన్న ఈ కింది ఇంగ్లీషు రిడిల్స్ తెలుగులోనూ ఉన్నాయి.

* Jumping, it moves along the path
  - దారిలో గెంతుతు వెళ్లేది (గోదురుగప్ప)
* It is stretched out in the path
  బాటలో సాగిలపడి ఉండేది (పాము)

* A tree with 12 limbs, 30 branches, and 365 leaves, each black on one side and white on the others

- 12 అంగాలు, 30 కొమ్మలు, 365 ఆకులు, ఓ వైపు నల్లగా మరో వైపు తెల్లగా ఉన్న చెట్టిది ఇవి వరుసగా మాసాల్ని, దినాల్ని, సంవత్సరాన్ని రేయింబగళ్లనూ తెలుపుతున్నాయి. తెలుగులో చెట్టుకు మారుగా పండు ప్రతీక అయ్యింది.

* ఒక పండు
  పండుకు విత్తులు ముప్పది
  వాటిలో తెలుపువి పదిహేను
  నలుపువి పదిహేను[1]

వరుసగా నెల, రోజులు. శుక్లపక్షం, కృష్ణ పక్షం అనే అర్థాలువస్తాయి, యతి ప్రాసలు లోపించినా ఈ భావమే ఉన్న పొడుపు పద్యమొకటి జన వ్యవహారంలో ఉంది.

---

1. పండుకు పన్నెండు పచ్చలు
   పచ్చకు ముప్పది విత్తులు
   పదిహేను తెల్లవి - పదిహేను నల్లవి

* ఫలమై వెలసెను భువిలో
ఫలముల లోలోన నుండు పండ్రెండజ్జల్
అజ్జకు ముప్పది విత్తులు
విత్తులలో సగము తెలుపు నలుపై ఉండున్

ఫలం సంవత్సరం, పండ్రెండజ్జలు మాసాలు, ముప్పది విత్తులు రోజులు, సగం తెలుపు శుక్ల పక్షం, సగం నలుపు కృష్ణపక్షం. ఇదీ భాషల బంధుత్వం; ఇదీ భాషల మధ్య భావ సామ్యం.

అది అంతర్జాతీయ భాష అయినా, ఆదిమ మానవుని భాష అయినా, లిపిలేనిదైనా ఉన్నదైనా భాషలమధ్య బంధుత్వముంటుంది. శబ్దాలు పరుగెత్తినా పరుగెత్తకున్నా భావం మాత్రం ప్రవాహమవుతుంది మనిషి కలిసి ఉండాలను కొంటాడు; ఎదలోని ఆత్మీయతానురాగాల్ని పంచుకోవాలనుకొంటాడు. భాషల మధ్య ప్రగాఢానుబంధం ఏర్పడడానికి కారణ మిదే. రాజకీయ, సాంస్కృతిక చారిత్రక సంబంధాలన్నీ ఉపాంశాలే. అయినా కాల చక్ర పరిభ్రమణంలో వేటి స్థానం వాటికుంది. అధ్యయన శీలురనూ, పరిశోధన పథికులనూ ఇవన్నీ పట్టి నిలుపుతాయి. సాహిత్య దేవతాంతరంగంలోని అమృతాన్ని పంచిపెడతాయి.

ఆ సాహిత్యంలో అంతర్భాగమైన పొడుపుకథ ప్రక్రియ చిన్నదే అయినా సర్వజ్ఞత్వాన్ని సంతరించుకొంది. ఆ పొడుపుకథ సాధకుల్ని, శోధకుల్ని సాహిత్య సమారాధకుల్ని ఆహ్వానించింది; గిలిగింతలు పెట్టింది; పులకింతలు కలిగించింది. పూర్ణత్వం దిశగా పురోగమింప జేసింది.

* ఓమ్ పూర్ణ మదః పూర్ణమిదం
పూర్ణా త్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావ శిష్యతే॥[1]

---

1. ఈశావాస్యోపనిషత్ [1]

- అది; అది పూర్ణం; ఇదీ పూర్ణమే. పూర్ణంలో నుండి పూర్ణముదయిస్తుంది. పూర్ణం పోయింతర్వాత పూర్ణమే మిగులుతుంది.

అవును ఈ పొడుపుకథల పరిశోధనపూర్ణం సంపూర్ణం. ఇది ఉదయించింది-వికసించింది. పూర్ణంగా వ్యాపించింది. పూర్ణంగానె మిగిలిపోయింది.

చెప్పింది ఇంత అనిపించినా అంతటా ఎంతో మిగిలిపోయిందనిపించింది. చివరి ప్రకరణంలో భాషల బంధుత్వం కేవల స్పర్శ. ఉపరితలాన్ని ముట్టలేదు; తలానికి తాకలేదు. సంస్కృత, కన్నడ, తమిళ, మలయాళ, మరాఠి, హిందీ ఉర్దూ, ఇంగ్లీషులు తెలుగులో కలిసినై. తెలుగు తనాన్ని పెంచినై. భాషలేవైనా భాషలన్నీ ఒకటే అని పలికినై. ఆ విషయాన్నే ఈ చివరి ప్రకరణంలో స్పృశించాను. ఇక చివరగా ఫలశ్రుతి పలుకుతాను.

## 12-9 : ఫలశ్రుతి

ఇదో పరిశ్రమ ప్రజలందరూ పారిశ్రామికులే. ఈ పారిశ్రామికులిప్పుడూ ఉన్నారు. మునుపున్నారు! ముందుంటారు మునుపు మున్నీరు; భవిష్యత్తు అక్షయపాత్ర. మున్నీటి లోతు కనుగోడం, అక్షయపాత్ర అందించిన వన్నీ అందుకోడం సాధ్యంగాని పని. అందుకే ఇదంతా పూర్ణమన్నాను. ఈ పూర్ణ ప్రహేళిక మానవుణ్ని తట్టుతుంది; పొడుస్తుంది; లేపుతుంది. పొడుపు వేడినీ వెలుగునూ వెదజల్లుతుంది; వెయిపుట్లు పండిస్తుంది.

ఈ అభ్యుదయం, ఈవికాసం ఇలాగే కొనసాగాలి చేవఉండి చేదుకొన్న వాళ్లకు చైతన్య లక్ష్మి సాక్షాత్కారం జరగాలి.

"ఆలినొల్లకయున్న వానమ్మ మగని
అందులోపల నున్న వానక్క మగని
నమ్మి నాతని జెరుచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్ల కరుణ తోడ"

*మంగళమ్*

# అనుబంధం-I

## పొడుపుకథలు-సంకలనాలు

జానపద విజ్ఞానంలో పొడుపుకథలు వచన సాహిత్యం కిందికివస్తాయి. అయితే నిర్మాణస్థితినిబట్టి వాటిలో కొన్ని గేయాల కిందికి వచ్చినై. జానపదుల భావాలే పద్యంగా రూపుదిద్దుకోడంతో పొడుపు పద్యాలు అవతరించినై. కొన్ని పొడుపుకథలు సామెతలుగా స్థిరపడ్డంతో పొడుపు సామెతలైనై. ఓ తరహా లెక్కలు ప్రత్యేకంగా వినిపిస్తుండడంతో పొడుపు లెక్కలైనై. ఈ సిద్ధాంత గ్రంథంలో ఈదృష్టితో వీటిని వివరించడం జరగలేదు. అయితే పొడుపు సామెతలు పొడుపు గాథల పేరిట (కథాత్మకాల పేరిట) ప్రత్యేక ప్రకరణాలు కూర్చడం జరిగింది. అందుకే పొడుపు కథా నిర్మాణాన్నిబట్టి ఈ కింది విధంగా విభజించు కొనే అవకాశముంది.

1. పొడుపు కథలు, 2. పొడుపు సామెతలు, 3. పొడుపు గాథలు, (కథాత్మకాలు-గుప్తకథలు), 4. పొడుపు పద్యాలు, 5. పొడుపు గేయాలు, 6. పొడుపు లెక్కలు, 7. పొడుపు బొమ్మలు, 8. పొడుపు గళ్ళు (గడికట్లు-నుడికట్లు).

సర్వసాధారణంగా ఇవన్నీ పొడుపుకథలే. ఆ మాటనుండి మిగతా వన్నీ పుట్టినై. సామెతలు, గాథలు, పద్యాలు, గేయాలు, లెక్కలు గుర్తింపు పొందినై. 1986 డిసెంబరులో పొడుపుకథలు ఒక పరిశీలన అనే పేరిట ఈ అంశాలపై నేను 172 పుటల గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది.

పొడుపు బొమ్మలు కొన్ని పదాల్ని, కొంతమంది వ్యక్తుల్ని, జీవుల్ని, వస్తువుల్ని బొమ్మల్లో దాచుకొంటై, అలాంటివాటిని పొడుపు బొమ్మల కింద పరిశీలించాలి.

ఆధునిక పత్రికా ప్రపంచంలో పదకేళీలు, గడికట్లు, నుడికట్లు, పద బంధాలు, ప్రహేళికలు, ఓ సముచిత స్థానంలో ఉన్నాయి శ్రీ మంగిపూడి వెంకటశర్మ 1920 లో తమ చమత్కారచంద్రికలోని చివరి పుటలో 'గళ్ల' నిచ్చారు. అయితే ఇవన్నీ అంకెలగళ్లు: అవే విధంగా పదాలగళ్ళు. ఈ దృష్టితో వీటిని పరిశీలించాల్సి ఉంది.

తెలుగులో పొడుపుకథల పరిశీలనకు ఇది ప్రారంభం మాత్రమే. ముమ్ముందింకా పంశోధనా వికాసానికి ఇది దోహదం చేస్తుంది.

ఇంత నిర్మాణ వైవిధ్యం కనిపిస్తున్న ఈ పొడుపుకథల్లో ఇంతవరకు అచ్చుకానివెన్నో ఉన్నాయి. అవీ, అచ్చయినవి ఒక పట్టికగా కింద ఇస్తున్నాను.

| | | |
|---|---|---|
| నేను సేకరించిన పొడుపుకథలు | 2250 | (అచ్చుకానివి) |
| పుస్తికల్లో (బుక్‌లెట్లలో) అచ్చయినవి | 660 | |
| అచ్చుకాని పద్యాలు | 64 | |
| చమత్కారచంద్రికలోని పద్యాలు | 250 | |
| తిరుమలేశ శతకాలు (రెండు) | 216 | |
| గోడమీది బొమ్మ (సం॥ వెలగా వెంకటప్పయ్య) | 330 | |
| పొడుపుకథలు (సం॥ చ.రా. శర్మ) | 205 | |
| పొడుపు పద్యాలు (ఉ.నా.రె) | 108 | |
| నేదునూరివారి వ్యాసాలలోనివి | 30 | |
| వివిధ పత్రికల్లోనివి (బాల, నీలిమ, ఆంధ్రభూమి, జానపదం, జానపద సరస్వతి మొ॥వి) | 200 | |
| వివిధ గ్రంథాల్లోనివి (పెద్దబాలశిక్ష, అభినవ వాచార్యకము, బాల వాఙ్మయం, జానపద సాహిత్య స్వరూపం పొడుపుకథలు (జి. శంకరరావు మొ॥వి) | 160 | |
| ఆకాశవాణిలో విన్నవి | 40 | |
| పొడుపుకథలు (సం॥ డా॥ వెలగా వెంకటప్పయ్య) | 2455 | |
| | 6968 | |

కీ.శే నందిరాజు చలపతిరావుగారు సేకరించి ప్రచురించిన వాటితో ఇవి ఏడువేలు దాటుతాయి. డా॥ వెలగా వెంకటప్పయ్య సంపాదకత్వంలో వెలువడిన గ్రంథంలో సేనందించినవి కొన్ని ఉన్నాయి. వారి గోడమీద బొమ్మ లోనివన్నీ వారి పొడుపు కథల్లో వచ్చాయి. ఆవిధంగా పైసంఖ్యలో ఓ వేయి తగ్గుతాయి. ఉదాహృత గ్రంథాల్లోకూడా వచ్చినవే వచ్చినై. అన్నిటినీ వడపోసి పాదసూచికల్లో ఇచ్చి పొడుపుకథా కోశాన్ని సంసిద్ధంచేస్తే కనీసం అయిదువేలైనా వస్తాయి. ఆంధ్రప్రదేశ్ అంతటా తిరిగి సేకరణచేస్తే ఈ సంఖ్య రెట్టింపయ్యే అవకాశముంది. నా సిద్ధాంత గ్రంథ సమర్పణానంతరం డా॥ వెలగా వెంకటప్పయ్య గ్రంథం వెల్వడింది. ముమ్ముందు సమగ్ర సంకలనాలు ఇంకా వెల్వడవలసి ఉంది.



# అనుబంధం-II

## కర్తలు - వ్యవహర్తలు

"వస్తాడు, పరుస్తాడు, పిసుకుతాడు పెడతాడు- ఏంది చెప్పు బావ గారూ.... వచ్చేది గాజులవాడు, పరిసేది చాప, పిసికేది చెయ్యి. పెట్టేవిగాజులూ! మరదలా! ఓ మరదలా!"

అతని వయస్సు అరవై; ఈపాట పాడుతున్నాడు; పాటగా పాడుతున్నాడు; ఐస్సెక్కుతున్నాడు; దిగుతున్నాడు; మధ్య మధ్య 'పోలీసు మల్లయ్య బీడీలనే వాడండి; అంటున్నాడు. తనచేతిలోని 20 పైసల పుస్తిక (డెమ్మి 1/8, 8 పుటలు) అమ్ముకొంటున్నాడు. ఉదయమో రెండు గంటలు, సాయంకాలమో రెంతు గంటలు అలా అమ్ముకొని ఓ అయిదు రూ॥లు జేబులో వేసుకొని శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్సుకు (ఇదే మొదట శ్రీ వెంకటేశ్వర ప్రెస్సు) వెళ్ళి పడుకొంటున్నాడు. ప్రెస్సు యజమాని శ్రీ ఎస్. రాములు, వారి సోదరుడు శ్రీ ఎస్. లక్ష్మణ్ నాకు ఆత్మీయులు. వారిని అడిగాను.

లారీమీద పనిచేసేప్పుడు చిన్న ప్రమాదంవల్ల కాలు ఏటెయ్యడం (వంకరగా ఎగరేసి నడవడం) మొదలయ్యిందనీ, అప్పటినుండి పోలీసు మల్లయ్య బీడీలవారు పదోపరక ఇస్తే, ఈ పొడుపుకథలు అచ్చువేసుకుంటున్నాడనీ, తాము కంపోజింగ్ ఛార్జీలు మాత్రమే తీసుకొని ప్రింటుచేసి ఇస్తున్నామనీ, ఒక్కోసారి అదికూడా తీసుకోడం లేదనీ అన్నారు. సాయంకాలం వరకు అలా అమ్ముకొని రాత్రి ప్రెస్సులోనే పడుకొంటాడనీ మిత్రులు చెప్పారు.

'పొడుపుకథలుకూడా తిండి పెడుతున్నాయన్న మాట'—అనుకొన్నాను. ఆతర్వాత మిత్రులడగడంతో నేను సేకరించిన కొన్ని పొడుపుకథలు కూడా ఆ పుస్తికలో చోటు చేసుకొన్నాయి.

ఇది 1976 ప్రాంతం. అప్పటికే నేను పరిశోధనా రంగంలో దిగాను. వ్యవహర్తల్ని కలుస్తున్నాను. కార్యక్షేత్రంలోని ఒడుదొడుకుల్ని - అనుభవాల్ని నెమరువేసుకొంటున్నాను. కంటకావృత మార్గాన్ని నిష్కంటకం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాను. ఈమార్గం పూలబాటే అయ్యింది. అలా కావడానికి దోహదం చేసిన వారే వీరు. కర్తలెవ్వరో తెలియదుకానీ వీరందరూ వ్యవహర్తలే. జానపద విజ్ఞానానికి వ్యవహర్తలే మూలస్తంభాలు. ఆ మూలస్తంభాల బాహిర పరిచయమే ఇది—

-ఎ. సవారన్న, (24) బి.ఎ. వార్డన్, మాడ్గుల మహబూబ్‌నగర్‌జిల్లా, 1973

-చి॥ శశికళ, సరళ, భారతి, 8-10 తరగతి విద్యార్థులు, మాడ్గుల,
అమంథర్, అమీరాల్య, అంజయ్య, మహబూబ్‌నగర్‌జిల్లా, 1973
లక్ష్మయ్య, జంగయ్య మొ॥ ,, ,,
విద్యార్థులు ,, ,,

-వగ్గు బాలయ్య (30) వ్యవసాయకూలి, పోలెపల్లి, మహబూబ్‌నగర్‌జిల్లా, 1976
-సిద్ధపు వెంటయ్య (32) ,, ,, ,,
-గుద్దటి ముత్తయ్య (24) ,, ,, ,,
-వగ్గు కాశయ్య (19) ,, ,, ,,
-కర్నాటి వెంకటరెడ్డి (20) రైతు ,, ,,
-కసిరెడ్డి లక్ష్మారెడ్డి (34) రైతు ,, ,,
-కసిరెడ్డి పర్వతరెడ్డి (20) ఇంటర్ ,, ,,

-కసిరెడ్డి శాంతమ్మ (55) గృహిణి, రైతు కుటుంబం, పోలెపల్లి, మహబూబు నగర్‌జిల్లా, 1976

-కసిరెడ్డి ద్రౌపదమ్మ (50) గృహిణి ,, ,,

-కసిరెడ్డి తారమ్మ (50) గృహిణి ,, ,,

-శ్రీపతి ఇందిర, జయమ్మ, యాదమ్మ, గృహిణులు, (30 to 50)

లక్ష్మీకాంతమ్మ, రత్నమ్మ, నర్సమ్మ, అజలపురం, మహబూబునగర్,1976

-కుందవరం వెంకటరెడ్డి (35), ఉపాధ్యాయుడు, అజలపురం, మహబూబ్‌నగర్, 1976

-కుందవరం పుల్లారెడ్డి (36) వ్యవసాయదారు, ,, ,,

-సూదిని బుచ్చిరెడ్డి (45) వ్యవసాయదారు, మాడ్గుల, మహబూబునగర్, 1976

-సూదిని రాధమ్మ (42) గృహిణి ,, ,,

-సూదిని నారాయణరెడ్డి (40) వ్యవసాయదారు,, ,,

-కె. ఖుస్నుద్దీన్ (34) ఎం.ఎ, లెక్చరర్, షక్తల్,మహబూబునగర్‌జిల్లా, 1977

-కపిలవాయి లింగమూర్తి (60) రిటైర్డు లెక్చరర్, నాగర్‌కర్నూల్, మహబూబు నగర్ జిల్లా, 1977

-పెనుగొండ శ్రీనివాసులు (34) తెలుగుపండిట్, బోర్లం,నిజామాబాదుజిల్లా,1977

-టి శ్రీహరి (20) బి.ఎస్‌సి, ఎల్లారెడ్డి, వ్యాపారం, నిజామాబాదుజిల్లా, 1977

-పి. నర్సింహులు (28) యుడిసి, కామారెడ్డి, నిజామాబాదుజిల్లా, 1977

-వగ్గు పెద్దయ్య (40) వ్యవసాయకూలి, పొలెపల్లి, మహబూబునగర్‌జిల్లా, 1977

-దార్ల రామమ్మ (45) ,, ,, ,,

-నలిమెల భాస్కర్ (19) బి.ఎస్‌సి,కామారెడ్డి, నిజామాబాదుజిల్లా, 1977

-నలిమెల శ్రీనివాస్ (17) ఇంటర్ ,, ,, ,,

-జి. అశోక్ (17), ఇంటర్, భీమునిమల్లారెడ్డిపేట, కరీంనగర్, 1977

-పోచెపల్లి శాయన్న (25) వ్యవసాయకూలి, బర్కత్‌పల్లి, రంగారెడ్డిజిల్లా, 1977

-కావలి చంద్రయ్య (22) ,, ,, ,, ,,

-నర్సయ్య (24) ,, ,, ,, ,,

-బ్రహ్మయ్య (60) అవుసలిపని ,, ,, ,,

-కొప్పుల శ్యాంసుందర్‌రెడ్డి (25) వ్యవసాయం ,, ,, ,,

-టి. శివరాజం (40) వ్యవసాయకూలి, మొగిలిగిద్ద, మహబూబునగర్‌జిల్లా, 1977

-అంజయ్య (34) ,, ,, ,, ,,

-వి. శ్రీశైలం (32) ఉపాధ్యాయుడు ,, ,, ,,

-బలిజ శరణప్ప (60) వ్యాపారం, బుచ్చిగూడెం ,, ,,

-చిన్నారెడ్డి (22) వ్యవసాయం ,, ,, ,,

-చంద్రమ్మ (25) వ్యవసాయకూలి ,, ,, ,,

-కిష్టమ్మ (40) ,, ,, ,, ,,

-హన్మంతరెడ్డి (24) వ్యవసాయం ,, ,, ,,

-నర్సింహారెడ్డి (28) ,, ,, ,, ,,

-చి॥ వెంకటరెడ్డి, ఆంజనేయులు 8 నుండి 10వ తరగతి విద్యార్థులు

శశిభూషణ్ రెడ్డి బుచ్చిగూడెం, మహబూబునగర్‌జిల్లా, 1977

-చి॥ రాములు (12) విద్యార్థులు, మల్లేపల్లి, మహబూబునగర్‌జిల్లా, 1977

ఆర్. నారాయణరెడ్డి (12) ,, ,, ,, ,,

మురళీధర్ రెడ్డి (11) ,, ,, ,, ,,

ఆర్. రవీంద్రరెడ్డి (10) ,, ,, ,, ,,

-జి. రాంచంద్రారెడ్డి (30) ఉపాధ్యాయుడు, ఖిల్లాగణపురం, మహబూబ్ 1977
నగర్ జిల్లా

-జి. విజయలక్ష్మి (22) గృహిణి, ,, ,, ,,

-రామకృష్ణ (16) విద్యార్థి, ,, ,, ,,

-వడ్ల నాగమ్మ (39) గృహిణి ,, ,, ,,

-వడ్ల శివప్ప (48) వడ్రంగం ,, ,, ,,

-బోయ నర్సిములు (45) పశుపాలనం ,, ,, ,,

-ఈశ్వరమ్మ (55) వ్యవసాయకూలి, శ్రీపురం ,, ,,

-కమ్మరి వేణమ్మ (52) గృహిణి, పాపకల్లు ,, ,,

-మధులేటయ్య (48) రైల్వేస్టేషన్‌మాస్టర్, కామారెడ్డి, నిజామాబాదు జిల్లా 1977

-శంకరయ్య (30) వ్యవసాయకూలి, కురుమిద్ద మహబూబ్ నగర్ జిల్లా 1977

-కాలె మద్దయ్య (34) ,, ,, ,, ,,

-వరుకాల గండయ్య (38) ,, ,, ,, ,,

-చాకలి జంగయ్య (48) వృత్తి, పాపకల్లు ,, ,,

-గుండాల వెంటమ్మ (54) గృహిణి ,, ,, ,,

-సర్వారు కాయమ్మ (50) ,, ,, ,, ,,

-లాలయ్య (24) వ్యవసాయకూలి, బరకతేపల్లి ,, ,,

-రామయ్య (28) ,, ,, ,, ,,

-బోగుల వెంకటయ్య (32) వ్యవసాయకూలి, మొగిలిగిద్ద ,, ,,

-బోగుల అంజయ్య (38) ,, ,, ,, ,,

-మరిపల్లి రాములు (40) ,, ,, ,, ,,

-ఆర్. శాయన్న (24) ,, మల్లెపల్లి, మహబూబునగర్‌జిల్లా 1977

-కురవ పూలమల్లయ్య (34) పశుపాలనం, పిల్లాగణపురం ,, ,,

-బయ్యాని చెన్నయ్య (36) కమ్మరం ,, ,, ,,

-హరిజన్ బుచ్చన్న (34) వ్యవసాయకూలి ,, ,, ,,

-రాసిక గంగపురి (32) ,, ,, ,, ,,

-మర్కంటి వెంకటయ్య (44) ,, ,, ,, ,,

-చింతలి వెంకటయ్య (45) ,, ,, ,, ,,

-కురవపల్లె సినోన్నడు (40) పశుపాలనం ,, ,, ,,

-శీకయ్య (40) పశుపాలనం, బొల్లారం ,, ,,

-నర్సింగరావు (61) పట్వారి, లింగంపేట, నిజామాబాదుజిల్లా 1977

-సుదర్శన్ దాశరథి (28) అధ్యాపకులు ,, ,, ,,

-శ్రీమతి సుదర్శన్ దాశరథి (24) గృహిణి ,, ,, ,,

-డి. రాంరెడ్డి (50) వ్యవసాయదారు, ఎల్లాపహాడ్, నిజామాబాదుజిల్లా ,,

-రాధాకిషన్ (19) డిగ్రీవిద్యార్థి ,, ,, ,,

-లక్ష్మీనరసింహస్వామి (17) ఇంటర్‌విద్యార్థి, లింగాపూర్ ,, ,,

యన్నంరెడ్డి వెంకటరెడ్డి (26) ఎలమంచిలి, విశాఖజిల్లా 1979

-టి.వి. రమణారావు (40) తేలప్రోలు, గుంటూరుజిల్లా ,,

-శ్రీమతి రమణారావు (36) ,, ,, ,,

-చిరంజీవి సుప్రసన్న (12) ,, ,, ,,

-మోహన్‌రావు (30) ఉద్యోగి, కామారెడ్డి, నిజామాబాదుజిల్లా ,,

-చి॥ లక్ష్మయ్య, నరసింహాచారి, నారాయణ, 8-10 తరగతుల విద్యార్థులు
ఎ. లాలయ్య, ఎన్. జంగయ్య, పెద్దింట హాస్టల్
ఈ.నర్సిములు, చంద్రయ్య, వి. రాంరెడ్డి మహబూబ్‌నగర్‌జిల్లా
జంగారెడ్డి 1980

-చి॥ జయలక్ష్మి, 8వ తరగతి, కామారెడ్డి, నిజామాబాదుజిల్లా, 1980

-చి॥ బాలమణి, 10వ తరగతి ,, ,, ,,

-కసిరెడ్డి కస్తూరి (32) గృహిణి, రామారెడ్డి, నిజామాబాదు జిల్లా, 1980

చి॥ మధుమతి 12, విద్యార్థిని, " " "

చి॥ ఇందుమతి 10, " " " "

  

# అనుబంధం-III

## ఉపయుక్త గ్రంథ సూచిక


అప్పకవీయము - అప్పకవి
అభినవాచార్యకము, గొడవర్తి సూర్యనారాయణ.
అవధాన సరస్వతి, గుమ్మన్నగారి లక్ష్మీనరసింహశర్మ
ఆంధ్ర చంద్రాలోకము, స్వామిశ్రీ సమున్మేష వ్యాఖ్యానం.
ఆంధ్ర ధ్వన్యాలోకము, వేదాల తిరువెంగళాచార్యులు.
ఆంధ్ర శబ్ద చింతామణి, అహోబల పండితీయం వ్యాఖ్య.
ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి.
ఆత్మలింగ శతకము, ఆకుల గురుమూర్తి.
ఆర్యా శతకము, కపిలవాయి లింగమూర్తి.
ఆశుకవితలు-అవధానములు-చాటువులు, కేశవపంతుల నరసింహశాస్త్రి.
ఉదాహరణ వాఙ్మయ చరిత్ర, నిడదవోలు వెంకటరావు
ఋగ్వేదము, సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత,
కవికర్ణ రసాయనము, సంకుసాల నృసింహకవి.
కవి జనాశ్రయము, మల్లియ రేచన
కాలజ్ఞాన తత్త్వములు, సి.వి. కృష్ణా బుక్‌డిపో, మద్రాసు.
కావ్యాలంకార సంగ్రహము, వ్యాఖ్యానం; సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
కాశీ మజిలీకథలు, మధిర సుబ్బన్న దీక్షితకవి.
కిరణాలు-కెరటాలు, తిరుమల శ్రీనివాసాచార్య
గతంలోకి, సంజీవదేవ్
గాథా సప్తశతిసారము, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.
గాంధీ లోహియా దీన దయాళ్, అను: కందర్ప రామచంద్రరావు
గోడమీదిబొమ్మ, సం: వెలగా వెంకటప్పయ్య.

ఛందోదర్పణము, అనంతామాత్యుడ.
చంద్రాలోక సముస్మేషము, సూర్యశ్రీ
చమత్కార పొడుపుకథలు, శ్రీ వెంకటేశ్వర ప్రింటర్స్, కామారెడ్డి
చమత్కార పొడుపుకథలు అను సామెతలు, శ్రీ వెంకటేశ్వర ప్రింటర్స్, కామరెడ్డి,
చమత్కార చంద్రిక, మంగిపూడి వేంకటశర్మ
చమత్కార పొడుపుకథలు, వెస్టువార్డు అండ్ కంపెనీ, మద్రాసు
చమత్కార పొడుపు కతలు అను తెలుగు సామెతలు, ఎన్.వి. గోపాల్ అండ్‌కో, మద్రాసు

చాటు పద్యమణి మంజరి I-II, వేటూరి ప్రభాకరశాస్త్రి.
చీకటినుంచి, నూతలపాటి గంగాధరం
జగన్నాటకం, నార్ల వెంకటేశ్వరరావు.
జానపదకళా సంపద, డా॥ తూమాటి దొణప్ప.
జానపదగేయ గాథలు, డా॥ నాయని కృష్ణకుమారి
జానపదగేయ వాఙ్మయ పరిచయము, హరి ఆదిశేషువు
జానపద గేయాలు-సాంఘిక చరిత్ర, డా॥ బి. రామరాజు, డా॥ నాయని కృష్ణ కుమారి.

జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి, నేదునూరి గంగాధరం
జానపద సాహిత్య స్వరూపం, డా॥ ఆర్వీయస్, సుందరం
జానపద విజ్ఞాన వ్యాసావళి, డా॥ జి ఎస్. మోహన్
తిక్కయ్యగారి తత్త్వాలు-కీర్తనలు, తిక్కయ్య
తిరుమలేశ శతకము, బూరెల సత్యనారాయణమూర్తి
తెనాలి రామలింగకవి హాస్యకథలు, వడ్డాది వీర్రాజు
తెలుగు జానపదగేయ సాహిత్యము, డా॥ బి. రామరాజు
తెలుగు భాషా చరిత్ర, సం॥ భద్రిరాజు కృష్ణమూర్తి
తెలుగు సామెతలు, సం॥ విశ్వనాథ, యశోదారెడ్డి, కోదండరామారెడ్డి
తెలంగాణా పల్లెపాటలు. డా॥ బి. రామరాజు
తెలుగులో కొత్త వెలుగులు, డా॥ తూమాటి దొణప్ప.
తెలుగు కన్నడ జానపదగేయాలు, డా॥ ఆర్వీయస్. సుందరం
తెలుగులో ఛందోరీతులు, డా॥ గిడుగు వెంకట సీతాపతి

నూతన చమత్కార పొడుపుకథలు, వెంకటేశ్వర ప్రింటర్స్. కామారెడ్డి
పదబంధ పారిజాతము I-II, సాహిత్య అకాడమి ప్రచురణ
పల్లె పదాలలో ప్రజాజీవనము, డా॥ యెల్దండ రఘుమారెడ్డి
ప్రహేళికలు I-II, శ్రీ భాష్యం విజయసారథి
ప్రజాసూక్తం, యువభారతి ప్రచురణ
పారిజాతాపహరణము, నందితిమ్మన్న
పిట్టకథలు, శ్రీ అయ్యగారి వీరభద్రరావు భాగవతారు
పెద్దబాల శిక్ష, ఎన్.ఎ. గోపాల్ అండ్ కంపెనీ, మద్రాసు
పెద్దబాల శిక్ష (శ్రీరామ, ఆరమె, స్వస్తిక్...ఇంకా వివిధ ప్రచురణలు)
పొడుపుకథ, కె పి.బాబు
పొడుపుకథలు, జి. శంకరరావు
పొడుపు పద్యాలు, డా॥ కసిరెడ్డి
పొడుపు పద్యాలు, ఉమ్మానారాయణరెడ్డి
బిల్హణీయము, పిండిపెద్ది కృష్ణస్వామి
బాలభాష, వేటూరి ప్రభాకరశాస్త్రి
బాలభారతి, సం॥ వెలగా వెంకటప్పయ్య
బాల వాఙ్మయం, బి.వి. నరసింహం
బ్రౌణ్య ఇంగ్లీషు తెలుగు నిఘంటువు, సి పి. బ్రౌన్
భట్టి విక్రమాదిత్యునికథ. మ॥ సుబ్బరాయలు నాయని
భాగవతము, పోతన
భామాకలాపము, సిద్ధేంద్రయోగి
మను చరిత్రము, పెద్దన
మృచ్ఛకటికము, అను; తిరుపతి వేంకటకవులు
మరోహరివిల్లు, డా॥ సి. నారాయణరెడ్డి
మహాభారతము, కవిత్రయము
మారీచీ పరిణయము, మోహనాంగి
మిన్నేరు, సం॥ నేదునూరి గంగాధరం
రవీంద్ర వ్యాసావళి, రవీంద్రుడు
రసగంగాధరము- వరివస్య, జమ్ములమడక మాధవరామశర్మ

వయోజనవిద్య, మూడవ వాచకము, నక్షావుల సుబ్బారావు
వసుచరిత్ర, భట్టుమూర్తి
వ్యవసాయ సామెతలు, నేదునూరి గంగాధరం
విక్రమార్క చరిత్రము, జక్కన
విజయభారతి, పైడిపాటి సుబ్బరామశాస్త్రి
విద్యార్థి కల్పతరువు I-II
వేమన పద్యములు, వేమన
వేయి శిరస్సులు ఖండించిన అపూర్వ చింతామణి, కొవ్వలి
శతావధానసారము, వేలూరి శివరామశాస్త్రి
శివరాత్రి మాహాత్మ్యము, శ్రీనాథుడు
శివధర్మోత్తరము, కామినేని మల్లారెడ్డి
శృంగార నైషధము, శ్రీనాథుడు
షట్చక్రవర్తి చరిత్ర, కామినేని మల్లారెడ్డి
సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర, ఆరుద్ర
సమస్యా పూరణములు, పెనుగొండ శ్రీనివాసులు
సిరిచుక్క మొగ్గ, తాడి వెంకటకృష్ణారావు.
సులక్షణసారము, తాతంభట్టు

## పత్రికలు

ఆంధ్ర పత్రిక, ఆంధ్రభూమి, నీలిమ, బాలభారతి, సాధన, జాగృతి, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, యువభారతి, జానపదం, జానపద సరస్వతి, స్రవంతి, బాలజ్యోతి.

## సంస్కృతం

రామాయణం, మహాభారతం, ధ్వన్యాలోకం, బిల్హణీయం, భరత నాట్యశాస్త్రం, కిరాతార్జునీయం, కావ్యానుశాసనం, కావ్యాదర్శం, కావ్యాలంకార సూత్రవృత్తి, అష్టాధ్యాయి, ఐతరేయం, సిద్ధాంతకౌముది, సాహిత్యదర్పణం, శ్రీ భగవద్గీత, ఈశావాస్యం, శ్వేతాశ్వతరం, ఛాందోగ్యం, తైత్తిరీయం, మాండూక్యం, బృహదారణ్యకం, హనుమన్నాటకం.

## వ్రాతప్రతులు


1. వ్రాతప్రతి, కపిలవాయి లింగమూర్తి, నాగర్ కర్నూలు, మహబూబు నగర్.
2. పాపిశెట్టి సీతారామప్ప (కపిలవాయి లింగమూర్తి పరిష్కృతం) నాగర్ కర్నూలు, మహబూబునగర్ జిల్లా
3. ఎ. నవారన్న, వ్రాతప్రతి, మాడ్గుల, మహబూబునగర్‌జిల్లా.
4. వ్రాతప్రతి - నేను సేకరించిన పొడుపుకథలు.
5. ఆకాశవాణిలో విని వ్రాసుకొన్నవి.
6. చలనచిత్రగీతాలు వ్రాతప్రతి.


## ఇతర భాషలు :


కన్నడ ఒగటుగళు ; జీ. శం. పరమశివయ్య (కన్నడం)
ఒగటు నమ్మగళు రాగౌ ,,
హిందీకే లోక ప్రియపహేలి అమీర్‌ఖుస్రో, సం॥ సుదర్శన్ చోపడా
ఛత్తీస్ గఢీలోక్ సాహిత్యకా అధ్యయన్, దయాశంకర్ శుక్ల
హిందీ శబ్దసాగర్, నలందా ప్రచురణ


## ఆంగ్లం :


A guide to Field study, American Folklore, Current Trends in Folk lore, Essays on Mythology and Folk lore, Encyclopedia Americana, Encyclopedia Britannica, Encyclopedia Religion and Ethics, English Telugu Dictionary. Folk lore of Bengal, Indian Riddles, Introducing Folk lore, New standard Encyclopedia, Literary criticism, A short History, Practical criticism Randam House Dictionary, standard Dictionary of Folk lore, The Axels castle he science of Folk lore, T The New populer Encyclopedia, The concise oxford Dictionary

# అనుబంధం-IV

## అచ్చు తప్పులు – సవరణలు

| పంక్తి | పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 48 | 17 | రూపమునకు | రూపకమునకు |
| 213 | 1 | స్వర్గంబు దొందజేసి, | స్వర్ణంబు పొందజేసి |
| 129 | 22 | మూలురెండైన | మూలాలు రెండైన |
| 284 | 11 | గుగ్గిళ్లరాగి | గుగ్గిళ్ళరగి |
| 286 | 3 | కటపట | పటకట |
| 286 | 8 | కవికి రాయల దర్శనం చేయించాడు | |
| 290 | 22 | 1983 | 1977 |
| 304 | 26 | కాపుహానికి | కాపురానికి |
| 312 | 4 | వాఖ్యాన | వ్యాఖ్యాన |
| 313 | 16 | అలి అడిగాడు | అని అడిగాడు |
| 340 | 13 | తరతరాలేవీ | తదితరాలేవీ |
| 341 | 8 | కథను సంకేతించే | కథను సంకేతించే |
| 345 | 2 | నీటిని | పీఠిని |
| 347 | 16 | మాత్రకమే | మాత్రమే |
| 349 | 17 | జీవనోపాధి | జీవనోదధి |
| 352 | 22 | ఆ ధర్మాత్మనికి | ఆ ధార్మికునికి |
| 364 | 20 | మూటపట్టుకొని | మూటగట్టుకొని |
| 416 | 4 | పచుత్తై పొరంగ | ఎచుత్తై పొరంగ |
| 417 | 11 | ఇవిచేసేప్పుడుతాడు | ఇవిచేసేప్పుడు అతడు |

| పంక్తి | పుట | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 434 | 15 | నిస్సృష్ణ | నిన్ను |
| 435 | 18 | ముంటను కొసుకొచ్చి | ముండను కొనుకొచ్చి |
| 436 | 23 | దిత్వారార | దిత్వకరార |
| 440 | 8 | ఇంద్రతనుజని | ఇంద్రతనూజుని |
| 451 | 18 | చేతలుండుసుగాని | చేలుండుగాని |
| 459 | 26 | నిలువకపోవచ్చు | నిలువకపోవచ్చు |
| 481 | 3 | పోటరులకు | మోటలకు |
| 481 | 14 | షేప్పి | హిప్పీ |
| 484 | 10 | పన్నం బెస్త | పన్నలరబెస్త |
| 489 | 3 | అవకాశముంటుంది | అపకాశముంటుంది |
| 506 | 8 | వైవిధ్యం తపు | వైవిధ్యం దప్ప |
| 507 | 14 | చమత్కారుతను | చమత్కార చారుతను |
| 511 | 17 | పర్యాయ నిమిత్తమే | పరిచయనిమిత్తమే |
| 528 | 13 | ప్రహేళికలనో | ప్రహేళికలను |
| 540 | 13 | దార్యయు ఖడ్గందు | భార్యయు ఖడ్గంబు |
| 551 | 8 | ద్వ్యక్షరి | ద్వ్యక్షరి |
| 552 | 2 | కొన్ని లణాలు | కొన్ని లక్షణాలు |
| 556 | 23 | కరాబ్జనయనాబ్జ | కరాబ్జజాబ్జనయనాబ్జ |
| 563 | 20 | ఆద్యంరాల | ఆద్యక్షరాల |
| 585 | 11 | సర్దారుండుట | సర్దారుండట |
| 587 | 2 | నజిడించే | నడిపించే |
| 620 | 22 | సబబైంగొదొకటి | సబబైందొకటి |
| 656 | 17 | అసుభవాలు | అసుభావాలు |
| 665 | 16 | అందులోని జీవాత్మ | అందులోజీవాత్మ |
| 682 | 11 | పంస్స్వభావం | పందస్స్వభావం |
| 689 | 8 | వ్యయం | పర్యాయం |
| 689 | 14 | ఫలముVII, | ఫలము VIII |

| పంక్తి | పుట | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 714 | 21 | (ఢ్ల-క్ష-ల), | (ంఢ్ల-ష్ట-ల), |
| 714 | 22 | డదలసు (త-వ), | డదలకు (డ-ప), |
| 719 | 19 | మిద్దెద్దు | మిద్దెకు |
| 716 | 12 | ఒ> గవాయి కొక్కులేసి | ఒ> గవాయి తొక్కువేసి |
| 726 | 14 | ఒ> పండపెట్టి | ఒ> గన్నె పండపెట్టి |
| 743 | 19 | కసిందాల | కసింబాల |
| 756 | 1 | అశ్వశాలచ | ఆశ్వశాలాచ |
| 756 | 6 | సంస్కృభాష | సంస్కృతభాష |

| పంక్తి | పుట | సవరణలు |
| --- | --- | --- |
| 99 | 9 | 'అపరిమిత' · పద్యం— ప్రహేళికలు II, అనుసంహిత IV |
| 283 | 16 | 'జనకుండెవ్వాడు' పద్యం శ్రీ మహాభాగవతము, VIII 475 |
| 706 | 12 | 'సల్లలితానురాగ' ... పద్యం- గుంటూరు-కాలేజి శతావధానము, పు: 3 |



*Printed at* "KARSHAK" Art Printers, Hyd.